# ఉద్దేశము

## మూడవ ముద్రణ

ఆదికావ్యము శ్రీమత్ రామాయణమున వాల్మీకి మహర్షి రాముని బహు నామముల కీర్తించెను. అందులో మొదటి నామము "రాముడు" (సుమారు2626 సార్లు). దానితరువాత ఎక్కువ వాడిన నామము " రాఘవ"(సుమారు1217 సార్లు). రామ నామము తారక మంత్రమయితే రాఘవ అనునది రాముని కులీనత-ఉత్తమకులమున పుట్టుట- సూచించును. రఘుసంబంధ నామము వాడుటలోనే ఆ రఘుకుల ప్రాశస్త్యము నిరూపితము. అందుచే కాబోలు మహాకవి కాళిదాసు రఘువంశమును తన ప్రథమ (ప్రముఖ) గ్రంథ అంశముగా ఎన్నుకొనెను. సంస్కృత అధ్యయమున పేరు పొందిన పంచకావ్యములలో "రఘువంశము" ఆది-మొదటి పాఠము.

మా తండ్రిగారు శ్రీ. ఆలమూరు వెంకటాచలము గారిచే 1981 లో తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆర్థికసహాయంతో, రెండు భాగములుగ, ప్రథమ ముద్రణ సంతరించుకున్నది. మా బాంధవులు శ్రీ. కాళూరి హనుమంతరావు గారు ఈ కావ్యాన్ని పునఃపరిష్కరించి, ప్రఖ్యాత మల్లినాథసూరి వ్యాఖ్య ననుసరించి లఘువ్యాఖ్యను రచించగా, ప్రముఖ చిత్రకారులు శ్రీ బాపు గారు ముఖచిత్రముతో మా అన్నగారు శ్రీ. ఆలమూరు వెంకట రమణమూర్తి 1993లో రెండవ ముద్రణను చేసిరి.

పాఠక గ్రహణశక్తి తక్కువగుచుండ, లఘువ్యాఖ్య ఉన్ననూ, ఈ గ్రంథమును చదివి అర్థముచేసికొని అస్వాదించగల వారు అరుదవుచుండుట గుఱించి మారెండవ అన్నగారు శ్రీ. ఆలమూరు సీతారామ మూర్తిగారు పలు సార్లు ప్రస్థావించి మనస్థాపము పొందుచుండిరి. వారి అనంతరమైనను, వారి అభిప్రాయము అధారముగా ఈ మూడవ ప్రతిని అర్థములతో ప్రచురించ సాహసించుచున్నాము. ఈ విషయము శ్రీ కాళూరి హనుమంతరావు గారితో ప్రస్తావించగా వారు ఆశీర్వదించి ప్రోత్సహించిరి.

10 వతరగతి చదువుచున్న/చదివిన విద్యార్థి/పాఠకుని అవగాహనకు అందుబాటులో ఉండి, వాని అందు ఆసక్తి కలిగించ ప్రయోజనముగా వెలువరించ ప్రయత్నము చేసితిమి.

అవసరము బట్టి పద్య అన్వయము ప్రకారము, పూర్తి సమాస విభజనతో అర్థములు వ్రాసితిమి. దాదాపు అన్నిపదాలను విభజించి అర్థములు వ్రాసి పాఠకులకు అ మెళుకువ అలవడ చేయ ప్రయత్నించితిమి. ఆఖరి సర్గలలోవారి అభ్యాసమునకై తావు యిచ్చి కొంత స్వయముగా అర్థముచేసికొనుటకు అన్వయించు కొనుటకు ప్రయత్నఅవకాశము ఇచ్చితిమి. పాఠకులకు గ్రంథ పఠనలోని రుచిని చూపించి, వారు ఇతర గ్రంథములకూడ చదివే ప్రయత్నించ ప్రోత్సహింప మా ప్రయత్నము.

వంశానుగుణముగా సాహిత్యములో అభిరుచి ఉన్ననూ, మేము పండితపుత్రులమని మాకుతెలుసు. మా తరమువారి అదృష్టముకొద్ది, సంస్కృతము -రఘువంశము అనగా గుర్తొచ్చేది, చెవిలో మ్రోగేవి ఆకాశవాణి సంస్కృత పాఠములు. వాక్ భూషణులు శ్రీ. కేశవపంతుల నరసింహశాస్త్రి(విద్వాన్, శిరోమణి, ఆకాశవాణి సంస్కృత పరిచయకార్యకర్త) గారు రచించిన గొప్ప పుస్తకము:"మహాకవి కాళిదాస కృత రఘువంశము-తెలుగు లఘువ్యాఖ్యా సహితము" మాకు ఏడుగడ. దానిని మాకు అవగత మైనంత వరకూ ఊతగా పెట్టుకొని మా తండ్రిగారి తెలుగుచేతకు అర్థములు వ్రాయ ప్రయత్నించితిమి. వారికి మేము సదా కృతజ్ఞులము

మా బాంధవులు, ప్రసిద్ధ వేంకటపార్వతీశకవులలోని శ్రీ. వోలేటి పార్వతీశము గారి మనవడు, తాతగారు ప్రారంభించగా తండ్రి పూర్తిచేసిన శ్రీమద్రామాయణమును పరిష్కరించి, ప్రకటించిన శ్రీ. వోలేటి పార్వతీశముగారి పరిష్కరణకు, సహాయ సహకారములకు, పరిచయ వాక్కులకు ధన్యులము. మా నాన్నగారి రచనా ప్రస్థానమున అతి దగ్గరగా ఉండిన మా మేనమామగారు శ్రీ. మండపాక జోగిరాజు గారు మమ్మల్ని ప్రోత్సహించి "ఆత్మీయతా వాక్కు" ప్రసాదించి ఆశీర్వదించిరి

అర్థములు వ్రాయుటకంటే క్లిష్టమైనది అనర్థములు లేకుండా చూచుట. పలుమారులు ప్రతులను దిద్ది సహకరించిన నాభార్య(మా వదిన) శ్రీమతి ఆలమూరు జానకికి ధన్యవాదములు.

మొదటిముద్రణకు ప్రోత్సహించిన తిరుమల తిరుపతి దేవస్థానము వారికి మరల మాతరపున ధన్యవాదములు. రెండవ ప్రతికి సుందర చిత్రమును అందించిన బాపు గారి మరొక్కసారి

ధన్యవాదములు చెపుతూ దానినే వారి ఆశీర్వచనముగా ముఖచిత్రమును చేసితిమి. మొదటి రెండు ప్రతుల అందున్న పరిచయ ప్రస్తావనలను, వారికి ధన్యవాదములు సమర్పిస్తూ వారి అశీర్వచనములుగా పునః ప్రచురుస్తున్నాము.

కాలాను గుణముగా e-book గా ప్రచురిస్తున్నాము. సహృదయ పాఠకులకు ఉచితముగా పేరు పేరు సంస్థల ద్వారా లభ్యము చేయుచున్నాము. సాహిత్య ప్రచారములో మంచి సేవ చేస్తున్న అటువంటి సంస్థల వారందరకు మా ధన్యవాదములు.

విధేయులు

గ్రంథకర్త మూడవ కుమారుడు: ఆలమూరు వీర రాజు,
(9666378002, veerarajua@gmail.com)
గ్రంథకర్త మూడవ కుమార్తె: ఆలమూరు ఉమాదేవి.
(9052898646, umalaxman@gmail.com)



గ్రంథకర్త మా తండ్రిగారు:        శ్రీ  ఆలమూరు వెంకటాచలము గారు(1907-1992),

మా  తల్లిగారు:        శ్రీమతి. జోగులమ్మ(1917-1982)

గ్రంథకర్త తండ్రి:        శ్రీ. ఆలమూరు వెంకట రమణ మూర్తి (1875 1969)

గ్రంథకర్త తల్లి‘:        శ్రీమతి.ఆలమూరు సీతా దేవి        (1885-1929)

**మనవి**

ఏడుకొండల  మీద ఏడేడు జగముల/తోడునీడై యున్న ఏడుగడకు,
కూటిపేదకె కాదు కోటీశ్వరునకైన/ఆరాధ్యుడైన సర్వాధికునకు,
పలుకుల కందక, పిలిచిన నోయని/పలుకు, నిర్భరదయావిలసితునకు,
ముడుపులతో నిత్యమును భక్తకోటిని/రావించుకొను మేటి దైవమునకు,
సృష్టిహేతువునకు, వీతహేతువునకు/నిశ్చయాతీతరీతికి, నిరవధిక మ
హా విభూతికి, తిరువేంకటాద్రిపతికి/అవితసంశ్రితతతికి సమర్పితముగ,

ఆంధ్రకవి బ్రహ్మ యైన తిక్కన భిక్ష/భారతామృతరసాస్వాదనంబు,
ప్రఖ్యాత కవిసార్వభౌముడు శ్రీ నాథు/ప్రౌఢకావ్యంబుల పరిచయంబు,
అలఘు కళాపూర్ణు డల సూరనార్యుని/భవ్య ప్రబంధప్రభావ గరిమ,
ఇతర పురాతనాద్యతన మహాకవి/కమనీయ రచనావగాహనంబు,
కారణములు, సముద్బోధకములు, గాగ/సంభవించిన, సాహితీశక్తికొలది,
అనువదించితి, నేర్చిన ట్లాంధ్రబాష/కాళిదాసుని, రఘువంశకావ్య మిట్లు

కాళిదాసీయమును అనువదించుటకు  అల్పజ్ఞుడనైన నా కధికారము చాలదు. అయిననూ, ఆ మహాకృతిమీది ఆదరభావము, నా అసమర్థతను పరిగణింపనీయలేదు. సహృదయులను నా సాహసమును క్షమింప వేడికొనుచున్నాను. ఇందు, నా భక్తియే ముఖ్యము. నాశక్తికాదు. నా రచనలో క్వాచిత్కముగ గోచరించు గుణములు కాళిదాసోపజ్ఞములనియు, బహుళముగా గనబడు లోపములకు హేతువు నాశక్తిలోపమనియు, నా యనువాదమును బట్టియే మూలకావ్యము యొక్క ప్రాశస్త్యమును అంచనా వేయరాదనియు, నా మనవి.

నాగ్రంథములో కొంతభాగమును సవిమర్శకముగా పరిశీలించిన రసజ్ఞులు విజయనగర మహారాజావారి వారి కళాశాలలో ఆంధ్రోపన్యాసకులు, శ్రీమాన్ వేంకటార్యుల వారికి, నేను కోరినదే తడవుగ, నా రచనను చదివి, తమ అభిప్రాయములను దయచేసిన(1) మద్గురుతుల్యులు మాన్యులు ఆచార్య గంటి జోగిసోమయాజులు గారికి,(2) నాసాహితీవ్యాసంగమునకు సమున్మేషకులు, సరసులు ఆచార్య కాకర్ల వేంకట రామ నరసింహముగారికి, (3)  లబ్ధప్రతిష్ఠులైన లబ్ధవర్ణులు, సౌజన్యమూర్తులు, ఆచార్య దివాకర్లవేంకటావధాను గారికిని నా కృతజ్ఞతాభివందనములు. నా గ్రంథముద్రణకు ఉదార ధనసహాయము చేసిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థాన నిర్వాహకులకు నా కృతజ్ఞతలు. పాఠకలోకము నాయీ ప్రయత్నమును ఆమోదించినచో నా పరిశ్రమ సఫలము కాగలదు.

అస్తు.

విజయవాడ

30-12-1981                    **ఆలమూరు వెంకటాచలము**

## తొలిపలుకు- ద్వితీయ ముద్రణము

మా తండ్రిగారు శ్రీ ఆలమూరు వెంకటాచలము గారు 1907 సంవత్సరంలో, ప్రస్తుత విశాఖపట్టణం జిల్లా, కోడూరు గ్రామంలో జన్మించారు. తండ్రి శ్రీ వెంకటరమణమూర్తి, తల్లి శ్రీమతి సీతమ్మ. చదివినది విజయనగరంలోని మహారాజా కళాశాలలో రసాయనిక శాస్త్రంలో గ్రాడ్యుయేట్ కోర్సు అయిననూ, చిన్నతనం నుంచీ సాహిత్యం పట్ల ఎక్కువైన మక్కువను ప్రదర్శించారు. స్కూలుఫీజు కట్టమని యిచ్చిన డబ్బుతో మనుచరిత్రము, వసుచరిత్రము అను గ్రంధాలను కొనుక్కొని పెద్దలను ఆశ్చర్యపఱచిన సాహిత్య ప్రియత్వము, వారి బాల్యమునకు సంబంధించిన ఒకానొక తీపిగుర్తు.

జీవన భృతికై ఆంధ్రాయూనివర్సిటీలో హాస్టలు మానేజరు పదవిని నిర్వహించిన మూడుపదుల కాలంలోనూ వారు తెలుగు శాఖలోని అధ్యాపకులతోనూ, గ్రంధాలయయం పాలకవర్గంతోనూ సన్నిహితమైన సంబంధాల నేర్పరచుకొని తమ సాహిత్యవ్యవసాయాన్ని నిర్వ్యహితంగా కొనసాగించుకున్నారు. అనంతరము "తెలుగు అకాడమి" అనే సంస్థలో అసిస్టెంటు కంపైలర్ గా పనిచేసి" విజ్ఞానసర్వస్వము" కొన్ని సంపుటములు వెలువరించడంలో కృషిచేసారు.

తనకు వచ్చిన కావ్యాలను నిరంతరంగా చదువుకోవడం, తమసొంత రచనను నిరాడంబరంగా కొనసాగించుకోవడం, అతిమితవచోనియతి, నాతిసాహిత్యేతరవిషయ ప్రసంగము ప్రధాన లక్షణము లుగా, సువిహిత సాహితీసంపన్నమయిన జీవితం గడపిన ధన్యులు. ఈ ఆంధ్రరఘువంశం రచన 1950 లలో ప్రారంభించబడి వుండునని మా అంచనా. 1981 లో తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆర్థికసహాయంతో, రెండు భాగములుగ, ప్రథమ ముద్రణమును సంతరించుకున్నది. 1992 లో సాహితీవిమర్శకులుగా సడిసన్న శ్రీ కాళూరి హనుమంతరావు గారు ఈ కావ్యాన్ని క్షుణ్ణంగా పరిశీలించి, గుణాభోగమునకు చొక్కియునూ, ఆర్జవసంపన్నమైన సాహితీప్రియత్వంతో క్వాచిత్కంగా దొర్లిన దోషాలను మా తండ్రిగారి దృష్టికి తెచ్చి, వానిని పరిహరించి కావ్యమును దోషజ్ఞ ప్రసన్నం చేయమని ప్రోత్సహించారు. ఆ పూనికలో ప్రథమ సర్గమును మాత్రము సంస్కరించి, మా తండ్రిగారు తే. 6-11-1992 ది న దివంగతులైనారు. అనంతరము శ్రీ హనుమంతరావుగారు మిగిలిన గ్రంథము

నంతటిని సంస్కరించి, వారి సాహిత్యప్రియత్వాన్ని వెలార్చి, మమ్ములను ద్వితీయ ముద్రణకు ప్రభోధించారు.

సముచితమైన వారి సంస్కరణములో, ఈక్రింది పద్యములు శ్రీ హనుమంతరావుగారి సొంత రచనలు 2వ సర్గలో పద్యములు:25,84; 3వ సర్గలో పద్యము:42; 5వ సర్గలో పద్యములు:1,33; 6వ సర్గలో పద్యము:46; 7వ సర్గలో పద్యము:43; 8 వ సర్గలో పద్యము: 21; 9 వ సర్గలోపద్యము:16; 10 వ సర్గలో పద్యము:29; 14వ సర్గలో పద్యము: 5, 59; 15వసర్గలో పద్యములు:41,46,71; 16వ సర్గలో 19,20,40,58; 19 వ సర్గలో పద్యము: 6 మొత్తము 20 పద్యములు. సాహితీప్రియుల ఉపయోగార్థము ప్రఖ్యాత మల్లినాథసూరి వ్యాఖ్య ననుసరించి లఘువ్యాఖ్యను కూడ వారు రచించినారు. వారికి మేము సర్వాత్మనాకృతజ్ఞులము. ప్రముఖ చిత్రకారులు శ్రీ బాపూ గారు మాఅభ్యర్థనను మన్నించి, ముఖచిత్ర ప్రదానం చేసి, తమ సహృదయతను ప్రదర్శించారు. వారికి మా నమోవాకములు. మాతండ్రిగారి సాహితీవ్యాసంగపూర్ణ జీవితమునకు పవిత్ర మధురస్మృతిగా, ఈ ద్వితీయ ముద్రణమును కల్పించి, ఒక కొంత పితృణ విముక్తి సాధించాలని మా ఆకాంక్ష. విజ్ఞులు ఈ కృతి ఆస్వాదింతురుగాక!. దైవమనుగ్రహించు గావుత.

గ్రంథకర్త జ్యేష్ఠపుత్రుడు

గ్రంథకర్త ప్రథమ వర్ధంతి — **ఆలమూరు వెంకట రమణమూర్తి**

శ్రీముఖ కార్తీకశుద్ధ ఏకాదశి — 20-20-50 అభిరామ్ నివాస్

24.11.1993 — విజయగరము. 531202

**K. HANUMANTHA RAO.** M.Pharm, Ph.D.
Retired Professor, College of Teechnology Osmainia University Hyderabad.

## హృదయసంవాదం

"ఆంధ్రభాషావిశేషంబున నశేషమనీషిహృదయంగమంబుగా, శబ్దం బనుసరించియు నభిప్రాయంబు గుఱించియు, భావం బుపలక్షించియు, రసంబు పోషించియు, నలంకారంబు భూషించియు, నౌచిత్యం బాదరించియు, ననౌచిత్యంబు పరిహరించియు మాతృకానుసారంబున జెప్పబడిన యీ భాషానైషధకావ్యంబు"

ఆంధ్ర నైషధకావ్యాంతంలో, శ్రీ నాథుడు తన అనువాదపద్ధతిని ఇట్లా, సూచించారు. శ్రీ ఆలమూరు వెంకటాచమం గారు, తమ ఆంధ్రరఘువంశానువాదాన్ని, పూర్తిగా ఈ పద్ధతిలో చేసారు. మూలంలోని ప్రతిశ్లోకభావాన్ని, సరిగ్గా పద్యంలోకి తెచ్చారు, కవి. కొన్నిచోట్ల కాళిదాసుని పదబంధాలు కూడా, గ్రహించారు. అంతమాత్రంచేత, ఇది మక్కికి మక్కిగా అనువాదం కాదు. మూలభావాన్ని మనసులో ఇంకించుకొని ఉత్తేజంపొంది, చేసినపునారచన, ఇది. అక్కడక్కడ కవి తన సొంతరచన కొంత చేర్చారు. కాళిదాసుని చిన్నిశ్లోకంలోని భావం తెలుగులో వృత్తంలోకి అనువదించినప్పుడు మూలకర్త భావాన్ని పొడిగించారు. అంటే, కాళిదాసుని లేఖినిలో, తన లేఖిని కలిపారన్నమాట, ఈ కవి. అక్కడక్కడ అనావశ్యకములని తాను తలంచిన శ్లోకాలు అనువదించక వదిలారు. కొన్నిచోట్ల పద్యాలక్రమం మార్చారు. రెండు, మూడు శ్లోకాల భావాలని కలిపి, ఒక సీసంలో కొన్నిచోట్ల రచించారు. వీటన్నిటి ఫలితంగా, ఈ అనువాదకావ్యానికి స్వతంత్రకావ్యగౌరవము కుదిరింది. పద్యకావ్యానువాదం అశక్యం అని కొందరి విమర్శకుల అభిప్రాయం. పద్యకావ్యం భావభాషారమణీయకసంయుక్తమై ఉంటుంది. ఆ సమ్మేళనం అనువాదంలోకి యథాతథంగా రాదు. కనుక అశక్యం అని, వీరి అభిప్రాయం. అంటే, కవిత్వం పొద్దున్నే గడ్డిపోచమీద తళతళ మెరసే నీటి బిందువు వంటి దనీ, ముట్టుకుంటే నశిస్తుందనీ వీరిఅభిప్రాయమన్నమాట. కవిత్వం మానవబుద్ధిగోచరమైనది. దానిని వ్యాఖ్యానించగలం. కనుక సమర్థుడైన అనువదిత అనువదించవచ్చును. ఆంధ్రరఘువంశకర్త, కాళిదాసుని భావాలని పొల్లుపోకుండా అనువదించారు . కాళిదాసుని భాష ఎనలేని రామణీయకం కలది. అనువాదకుడు మూలపదబంధాలని కొన్నిటిని గ్రహించడంవలనా, చక్కని సంస్కృతాంధ్రభాషాసమ్మేళనంవలనా,

లోకోక్తులు, తెలుగు పలుకుబళ్ళతో కూడిన సరసమైన తెలుగుభాషని ప్రయోగించడంవలనా, భాషారామణీయకాన్ని కూడా సంతరించారు. గ్రంథమంతటాకవికి తెలుగుభాషపై కలప్రీతి, ప్రభుత్వం వ్యక్తమవుతున్నాయి. ప్రస్తుతవ్యవహారంలో ఉన్నతెలుగుభాషని ప్రయోగిస్తూ రోజు, వారసుడు, బగ్గీ మొదలైన వైదేశికపదాలను కవి ఉపయోగించారు. ఇవి స్వీకరణీయములే. ఇవి వైదేశికములు కనుక ఇటువంటికావ్యంలో అస్వీకార్యములంటే, దిలీపరామాదులకు తెలుగుమాత్రం వచ్చునా, అసలు కావ్యసంస్కృతభాష వారికి వచ్చునా(వారి భాష వైదిక సంస్కృతం) అన్న, చిక్కు ప్రశ్న వస్తుంది.

జంబూకవధ ఘట్టం విడచిపెట్టి కవి అనౌచిత్యం పరిహరించారు. అజవిలాపంలో కొన్ని శ్లోకాలు వదిలి పెట్టి ఔచిత్యం పెంచారు. మూలంలో రఘు అతిథి సుదర్శనులకు బహుకన్యలతో వివాహం జరిగింది. ఈ ఆధునికాంధ్రకవికి, ఆ బహుభార్యాత్వం నచ్చలేదు. ఈయన వారికి ఒక్కొక్కకన్యతోనే వివాహం జరిపించారు. మూలంలో దిలీపునకు చాలామంది భార్యలున్నారు. ఈ ఆంధ్రరఘువంశంలో ఒక్కర్తే భార్య. శ్రీనాథుడు పేర్కొన్న ఉత్తమలక్షణాలన్నీ ఈ కావ్యంలో ఉన్నాయి. ఈ గ్రంథం ఉన్నదున్నట్లు ముందు చదవాలి. అది అర్థానువాదం. తరువాత మూలగ్రంథంతో బాటు చదవాలి. అప్పుడు మూలం లోని గాంభీర్యమాధుర్యాలని తెలుగులోకి తేవడానికి ఈయన పడ్డ శ్రమా, చూపిన నేర్పూ తెలుస్తాయి. పఠితలు రెండిట్టినీ కలిపి ఈ కావ్యం యొక్క పూర్ణానుభనం పొందాలి.

ఈ కావ్యరచనాపద్ధతికి రెండు ఉదాహరణలు చూద్దాం. పదిహేడవసర్గలో అతిథి వర్ణనలో కాళిదాసు ఇట్లా వర్ణించాడు.

" పంచమం లోకపాలానా ముచుః సాధర్మ్యయోగతః
భూతానాం మహతాం షష్ఠమష్టమం కులభూభృతామ్
దూరాపవర్జితచ్ఛత్రైస్తస్యాఙ్ఞాంశాసనార్పితమ్
దధుః శిరోభిర్భూపాలా దేవాః పౌరందరీ మివ, ( 78,79)

మల్లినాథుని వ్యాఖ్యనుబట్టి వీటి తాత్పర్యాలు ఇవి: లోకులు క్రమముగ లోకరక్షాపరోపకారపృధ్వీధారణ రూపసమాన ధర్మసంబంధములచే ఇంద్రాదులు(ఇంద్ర,యమ,వరుణ, కుబేరులు) నలుగురకు ఐదవ వానిగను, పంచభూతములకు ఆరవవానిగను, సప్తకుల పర్వతములకు ఎనిమిదవవానిగను అతిథిని

పేర్కొనిరి. ఇంద్రాజ్ఞను దేవులు తలదాల్చునట్లు అతని పత్రప్రేషితమైన ఆజ్ఞను రాజులు ఛత్రములు తొలగించిన శిరస్సులందు ధరించిరి.

ఈరెండిటిలో మొదట శ్లోకభావాని వెంకటాచలము గారు పెంచారు. రెండవదానిని యథాతథనుగా అనువదించారు

సీ. లోకరక్షణజనానీకప్రశాసన/పటుత పంచమలోకపాలు డనుచు,
ఉత్కృష్టనిత్యసర్వోపయోగక్రియా/పుణ్యశీలత షష్ఠభూత మనుచు,
సకలసామ్రాజ్యప్రజాసమారాధన/ప్రౌఢి సప్తమ చక్రవర్తి యనుచు,
సర్వాతిశయమహాసారశిఖోన్నతి/కలిమి అష్టమకులగ్రావ మనుచు,
భరణగుణమున నవమదిక్కరటి యనుచు/నిధులపాలిటి దశమశేవధియు, ననుచు,
జనపరంపర జయవెట్ట గనియె, వాసి/పేశలమహోర్వగుణరత్నరాశి, కౌశి. **63**
తే. శాసనసమర్పితంబైన, కౌశి ముదల/సరవి దూరాపవర్జితచ్ఛత్రులైన,
ధరణిపతులకు, శిరసుపూదండ యయ్యె/అమరవరులకు పౌరందరాజ్ఞ, వోలె. **64**

కవుల యశశ్శరీరానికి జరామరణాలు లేవన్నాడు భర్తృహరి. ఏతత్ కావ్యయశస్సు ద్వారా జరామరణాతీత శాశ్వతస్థితిని పొందిన కీ.శే. ఆలమూరు వెంకటాచలము గారిని ఆలస్యంగానైనా మనసారా అభినందిస్తున్నాను.

శ్రీముఖ శ్రీరామనవమి,
1-4-1993 **కాళూరి హనుమంతరావు**
సైనిక్ పురి సికింద్రాబాదు.

**Dr. DIVAKARLA VENKATAVADHANI**
Retd Professor Dept.of Telugu
Osmania University, Hyderabad.

పూజ్యులు శ్రీ ఆలమూరు వెంకటాచలముగారు రచించిన "ఆంధ్రరఘువంశము" నందందు పఠించి యానందించితిని. వారు రఘువంశము నందలి పందొమ్మిది సర్గములను పూర్తిగా ననువదించి యుండిరి. ఆంధ్రమునందలి అనువాద పద్ధతిని ముత్తెఱంగులుగా వింగడింపవచ్చును. 1) కథానువాదపద్ధతి, 2) భావానువాద పద్ధతి, 3) పదానువాదపద్ధతి.

ఆంధ్రమున కవిత్రయమువారిది కథానువాద పద్ధతి. శ్రీనాథునుది భావానువాద పద్ధతి. ఆధునికులలో పలువురిది పదానువాదపద్ధతి. ఈమూడు పద్ధతులలో మొదటిది అతిస్వతంత్రము, మూడవది అంత్యంత మూలవిధేయము; నడిమిది అంత స్వతంత్ర మును, అంత మూలవిధేయమును కాని మనోజ్ఞపద్ధతి. శ్రీ వెంకటాచలముగారు శ్రీనాథుని భావానువాద పద్ధతి నవలంభించి యీకావ్యమును ననువదించిరి.

వారు ఒక్కొక్క శ్లోకమున కొక్కక్క పద్యమును వ్రాయవలెనను నియమమును పెట్టుకొనలేదు. కొన్నిసీసపద్యములలో రెండుమూడు సంస్కృతశ్లోకముల అర్థమిమిడిపోవును. ఎక్కడనైన శ్లోకార్థము ముగిసిన పిమ్మట పద్యపాదములొండు రెండు మిగిలిపోవుట తటస్థించినచో వారి వానిని సొంత భావముతోను, ఉపమాద్యలంకారములతోను పూరించి యుండిరి, శ్రీనాథుడు కూడ నైషదాంధ్రీ కరణమున కొన్ని చోట్ల నిట్లే యొనరించి యుండెను.

కాళిదాసు కావ్యములలో రఘువంశము మొదటిదని చెప్పుదురు. సంస్కృతమును అధ్యయనము చేయువారు కూడ మొట్టమొదట నాకావ్యమునే ఆరంభింతురు. రఘువంశము ఆ మహాకవి రచనలో మొదటిదైననూ, చివరిదైననూ ప్రౌఢమై, సరళసుందరమై, రసవంతమై యొప్పారుచుండును. వైదర్భీశైలికది పరమోదాహరణము. అందులో వస్త్వైక్యము లేని మాట నిజమే. రఘువంశము నందలి పలువురు రాజుల చరిత్రమందు వర్ణింపబడుటచే అందాయైక్యముండుట కవకాశము లేదు. రఘువంశమను సూత్రమున అందుద్భవించిన మహారాజుల చరిత్రములను ముత్యములు

మనోహరముగ కూర్పబడినవి. ద్వితీయసర్గము నందలి వరప్రసాదమును, పంచమ సర్గము నందలి కౌత్సవరతంతుల వృత్తాంతము, ఇందుమతీ స్వయంవరరాజ విలాపములు, రామాయణ కథయును, అత్యంతమనోహరములుగా నుండును. ఇందు దృశ్యములను వర్ణించుటలో కాళిదాసు ప్రకటించిన కౌశలమప్రతిమానమైనది. ఇందుకు పదమూడవసర్గమునందలి సముద్రవర్ణనము తార్కారణము. ఈ మహాకావ్యమున సందర్భానుసారముగ పెక్కురసములు పోషింపబడినవి. పాత్రల శీలచిత్రణ మద్భుతము. "ఉపమా కాళిదాసస్య" అను నభియక్తోక్తి అతంత సత్యము.

కాళిదాసుని శ్లోకములను భాషాంతరీకరించుట కత్తిమీద సాముపంటిది. ఎంతనేర్పుతో ననువదించిననూ అనువాదమునందేదో కొఱత గోచరించుచునే యుండును. కాని శ్రీ వెంకటాచలము గారు కాళిదాసుని భావముల కెక్కడను భంగము రాకుండ, తెలుగునుడికారము, సౌందర్యము చెడకుండ, ధారాశుద్ధికి కొఱత వాటిల్లకుండ, ననువాదము నెంతో సరసముగను, సులభముగను, మూలానుసారిగను, మనోహరముగను సాగించిరి. వారి యనువాదము, అనువాదము వలెనుండదు. స్వతంత్రమువలనే నిరర్గళముగ సాగిపోవును. మూలమాద్యంత శ్లోకమయ మయ్యును, వారనువాదము చంపూపద్ధతి నవలంభించుట తెలుగుకవుల సంప్రదాయము ననుసరించి, సంస్కృతము తెలియనివారికి వారి యనువాదము కాళిదాసుని కవిత్వామృతమును చూఱలిచ్చును. వారు వృద్ధులు, అనుభవజ్ఞులు, చాల శ్రమపడి అనువాదమును సైతము స్వతంత్ర కావ్యమువలె సాగించినారు. వారికి నా వినయపూర్వక వందనములు.

హైదరాబాదు

19-12-1981 **దివాకర్ల వేంకటావధాని.**

**Dr. K.V.R. NARASIMHAM M.A. Ph.D.,**
Professor and head of the Dept. of Telugu (Retd)
Andhra University, WALTAIR

నా సాహితీమిత్రులు, శ్రీ ఆలమూరు వెంకటాచలముగారు ఆంధ్రీకరించిన రఘువంశ మహాకావ్యాన్ని ఆమూలాగ్రంగా చదివి ఆనందించేను. సంస్కృత మహాకవులలో కాళిదాసుకి గల స్థానాన్ని నేను వివరించవలసిన పనిలేదు. కవితాకళాప్రియులకందరికి, ఆ మహాకవి శిరోధార్యమే. కాళిదాసకృత కావ్యాల్లో రఘువంశం ఉత్తమోత్తమం అని పలువురు పండిత విమర్శకుల అభిప్రాయం. అటివంటి మహాకావ్యాన్ని గద్యపద్యాల్లోకి అనువదించి, సహృదయుల్ని మెప్పించడం సామాన్య విషయం కాదు. ఈ మహాకార్యాన్ని శ్రీ వెంకటాచలము గారు సర్వదా సాధించగలిగారని చెప్పటానికి నాకేటువంటి సందేహము లేదు. ఆధునిక కాలంలో ప్రతిభా వ్యుత్పత్తులు రెండూగల కవులు చాలా అరుదు. నిసర్గమైన ప్రతిభకు నిర్మలమైన వ్యుత్పత్తితోడుకాగా శ్రీ వెంకటాచలము గారి కవిత, అనువాదమైనప్పటికీ, స్వతంత్రకావ్యంలాగే, పఠనయోగ్యమై, సహృదయ పాఠక జనానికి తుష్టిని, పుష్టిని, చేకూరుస్తూ ఉన్నది. మూలభావనకు లోపం రానీయకుండా తెలుగు నుడికారానికి భంగం వాటిల్లకుండా ఈ మహాకావ్యాన్ని అందించిన శ్రీ వెంకటాచలము గారు నిజంగా ధన్యులు; సకల జనులకు అభినందనీయులు

5 వ లైను విద్యానగర్
విశాఖపట్నము- 530003 **కె.వి.ఆర్. నరసింహం**
31-11-1981

**Prof. G.J.Somayaji, Vidwan M.A. LT**

Professor and head of the Dept. of Telugu(retd)

Andhra University , Waltair,

పూర్వకవులందరిలో తనకీడువచ్చు కవిలేడన్న ప్రతిష్టతో, నేటికిని తనకి సముడైన మనీషి కనరాడను యశస్సుతో, స్తుతింపబడు మహాకవి కాళిదాసకృతకావ్యములలో, సువిశాలమయున రఘువంశ చరితమను పందొమ్మిది సర్గల మహాకావ్యమును వివిధచ్ఛందోబద్ధములయిన పద్యరత్నములతో ననువదించి, ఆంధ్రవాఙ్మయసీమంతిని యొక్క కంఠసీమను హారరూపమున నలంకరించిన శ్రీ ఆలమూరు వెంకటాచలముగారిని అభినందించుచున్నాను.

ఇందు మహాకవులైన తిక్కన, శ్రీనాథ, పోతరాజుల రచనా రీతులను ధ్వనింపజేయుచు మూలాతి క్రమణంబు లేకుండ కాళిదాసకృతకావ్యశోభ కిసుమంతయు వాసి తగ్గకుండునట్లు రచించుట మిక్కిలి ముదావహము.

నవ్యకావ్యకుసుమముల సువాసనల నేరోజున కారోజు అనుభవించుచున్న ప్రతిభావంతులైన కవులకు, పఠితలకు ప్రాచీన రత్నహారముల శోభను తిరిగి చూపింప సమర్ధుడగు వెంకటాచలంగారు, ధన్యులు.

ఇంత మహాగ్రంథమును వ్రాయుటవలన వారికిగల శ్రద్ధాభక్తులు, సామర్థ్యము స్పష్టమగుచున్నవి. సరసులు దీని పఠించి ఆదరించుట అవస్య కర్తవ్యము

16-2-8 ప్రభాతము

విశాఖపట్నము-530002 **విద్వాన్ సోమయాజి**

11-11-1981

**మండపాక జోగిరాజు**

1983 విశ్రాంత హెడ్ పోష్టు మాస్టరు

H B Colony LIC Quarters, Visakhapatnam

ఆత్మీయతా వాక్కు

భారతీయ వేద వాఙ్మయ సాహిత్య సంగీత సారస్వత బాషాసరస్వతికి మూలమైన గీర్వాణ భాషలో కాళిదాస మహాకవి సుప్రసిద్ధుడు. అతడు వ్రాసిన మొట్టమొదటి కావ్యము రఘువంశకావ్యము.

శ్రీ ఆలమూరు వెంకటాచలము,B.Sc., గారు మామేనత్తగారి తనయుడు, మాపెద్దక్క గారి భర్త. ఉద్యోగరీత్యా Andhra University లో పనిచేసిన వారు, సంస్కృతాంధ్రములలో బహు దిట్ట, కవి, పండితుడు. వీరికి కాళిదాసు కావ్యములన్న బహి ప్రీతి. కవితామాధుర్యమెరింగిన యింట జన్మించిన మహనీయుడు.

వీరు కాళిదాస విరచిత రఘువంశకావ్యమును, తనదైన కవితాశైలిలో " శ్రీ ఆంధ్ర రఘువంశము" అన్న పేరుతో రసవత్తర పద్యగ్రంథముగా మొదట రెండు సంపుటములుగా తరువాత ఒకే సంపుటముగా రచించినారు

కథాకధన రచనా విధివిధానముగ పరికించినచో ఆకాళిదాస మహాకవియే, మరల వీరి రూపమున అవతరించి, గ్రంథమును వ్రాసినాడు అనునట్లు చదువరులు పండితులును గ్రహించగలరు.

"కాళిదాసును దలపించు కావ్య పటిమ- అలరే నీ సేత యెంతేని ఆలమూరు" అనిపించుకున్న దిట్ట. వీరు భగవద్గీతను రసవత్తర పద్యములలో వ్రాసిరి. వీరి గ్రంధములు భగవదంకితములు.

వీరి మూడవ తనయుడు, మా మేమేనల్లుడు చి. ఆలమూరు వీర రాజు, మూడవ పుత్రిక, మా మేనకోడలు చి.సౌ.ఉమాదేవి, తమ తండ్రిగారు రచించిన రఘువంశ కావ్యములో ప్రతిపద్యమునకు అర్థభావముల వెలయించి, పితృణము కొంత తీర్చుకున్నారు

రఘువంశము, దాని కథావిధి విధానము, రచన యెంత ఉన్నతమో, యీ మా మేనల్లుడు, మేనకోడలు రఘువంశకావ్యమునకు వ్రాసిన అర్ధభావ రచనా విధానము, వారి వంశ సాహిత్యగరిమకు వన్నెతెచ్చియుండుట యెంతయి ఆనందదాయకమును, మహోన్నతమును చేకూర్చినవి. సంతోషించ దగు విషయము. వీనికిని వీరి కుటుంబములకును నా ఆశీస్సులు మరియు అభినందనములు.

అస్తు.

**మండపాక జోగిరాజు**

**వోలేటి పార్వతీశము**
Retd. Air Commodore, Indian Air Force,
50-51 శ్రీ సాయి బాబా ఆఫీసర్స్ కోలనీ
సైనిక్ పురి సికిందరాబాదు.

రఘువంశ మహాకావ్యము నాంధ్రీకరించుట యొక మాహాద్భుత సాహసమే. అట్టి మహోత్కృష్ట కార్యము నవలీలగ సాధించిన కీ.శే. ఆలమూరు వెంకటాచలము గారు సాహితీ ప్రియులకు చిరస్మరణీయులు.

అనువాదములు మూలగ్రంథ వస్త్వనుకరణములై, విశ్రుంఖల భావ ప్రకటనకు గాని, స్వకపోలకల్పనా వైచిత్రికి గాని యెడమీయవు. భాషపై ప్రభుత్వము, పదబంధ పరిపుష్టియు, స్వజాతీయమైన నుడికారము మాత్రము కవి ప్రదర్శింపఁజాలును. అది అటులుండ, భావబంధురమై, సరళసుందర వర్ణనాలంకృతమైన కాళిదాస కృత కావ్యమును యథాతథముగా తెనిగించిన చాలును; రసవత్తరమైన కావ్యమావిష్కరింపబడును.

సిద్ధహస్తులైన ఆలమూరివారి యాంధ్ర రఘువంశమిట్టిది. వారు పందొమ్మిదవ శతాబ్దపు కవుల కవిత్వ ప్రౌఢిమయు, యిరువదియవ శతాబ్దపు కవుల సరళ సుందర రచనా వైచిత్రియు మేళవించి, తెలుగు నుడికారముల సొబగుల నందందలంది, సురభిళ కవితా సుగంధ మీ గ్రంథమున గుబాళింపఁజేసిరి.

వర్తమానమందు కనుమరుగైన సుందర పదజాలము లిందందందు గనవచ్చును. తిక్కనాదుల చందో వైవిధ్యము, పోతరాజు గారి పదలాలిత్యము యీ గ్రంథమునందచ్చటచ్చట దర్శనీయములు

పూర్వకవుల కవితారీతుల నాలంబనము చేసికొని సాగిన యీ గ్రంథ రచన మొక్కింత కర్కశత్వమాపాదించుకొని నేటి పాఠకలోకమున కిసుమంత చీకాకొనరించుననుటలో సందేహము లేదు. తన్మూలమున, గ్రంథకర్త కుమారుడు చి. శ్రీ ఆలమూరు వీర రాజు, కుమార్తె. చి.సౌ. ఉమాదేవి, అవిరళ శ్రమకోర్చి ప్రతి పదార్థ సహితముగా నాంధ్ర రఘువంశ కావ్యము నుపయుక్తమొనరించి, పాఠకలోకమున కందించు ప్రయత్నమున కొడికట్టుట బహుదా హర్షనీయము

**వోలేటి పార్వతీశము**

శ్రీ ఆంధ్ర రఘువంశము (పూర్వ భాగము)

(కాళిదాస కృతికి భావానువాదము)

This book and second part are published with the Financial Assistance of Tirumala Tirupati Devastanams, under their Scheme Aid to Publish Religious Boks.

రచన, ప్రచురణ: ఆలమూరు వెంకటాచలము

తొలిముద్రణ : డిశంబరు 1981

............................................................................................................................

శ్రీ ఆంధ్ర రఘువంశము (ఉత్తర భాగము)

(కాళిదాస కృతికి భావానువాదము)

రచన, ప్రచురణ: ఆలమూరు వెంకటాచలము

తొలిముద్రణ : డిశంబరు 1981

............................................................................................................................

శ్రీ ఆంధ్ర రఘువంశము

(కాళిదాస కృతికి భావానువాదము)

రచన: ఆలమూరు వెంకటాచలము

మలి ముద్రణ: 1993

ముఖచిత్రాలంకరణ: శ్రీ బాపు

ప్రచురణ కర్తలు: ఆలమూరు వెంకట రమణమూర్తి

20-20-50 అభిరామ్ నివాస్, విజయనగరం. 531202

## విషయ సూచిక

# ఓం

## శ్రీ రామాయ నమః

# శ్రీ ఆంధ్ర రఘువంశము

## అవతారిక

ఉ. శ్రీరఘు వంశమందవతరించిన చిన్మయశాంతమూర్తి, భూ
భారము మాన్ప, వేలుపుల బాములు దీర్ప, అలీకమానుషా
కారము, రామనామమున, గైకొని సంశ్రితకల్మషార్ణవో
త్తారక మంత్రమైన, పరతత్త్వము గొల్తు నభీష్టసిద్ధికిన్. 1

శ్రీరఘు+వంశమందు+అవతరించిన=శ్రీ రఘుమహారాజు+కులమున+పుట్టినవాని, చిన్మయ+శాంత+మూర్తి= శుద్ధసత్త్వము+శమమును+ఆకారముకొన్నవాని, వేలుపుల+బాములు+తీర్ప=దేవతల+దుఃఖములు+ మాన్పుటకు, అలీక+మానుష+ఆకారము=లీలగా+మానవ+అవతారము, రామనామమునన్=రాముడను పేర, కైకొని=ధరించి, సంశ్రిత+కల్మష+అర్ణవ+ఉత్తారక+మంత్రమైన=ఆశ్రయించినవారి+పాపము లనెడు+ సముద్రము+దాటించు+రహస్యోపాయమైన, పరతత్త్వము=పరమాత్మస్వరూపుని, కొల్తును+అభీష్ట+సిద్ధికిన్= ఉపాసింతును+కోరినకోరికల+ప్రాప్తికి,

తే. ఎలమి, వాగర్థముల భంగి, నేకమైన/శాశ్వతులు, పార్వతీపరమేశ్వరులకు,
భువనపితలకు, గైమోడ్తు సవినయముగ/ భవ్య వాగర్థముల ప్రతిపత్తి కొఱకు. 2

ఎలమి=ప్రేమతో, వాక్+అర్థములభంగి=వాక్కుదానిఅర్థము ఎట్లుకలిసిఉండునో, ఏకమైన=ఒండొరుల ఎడబాయలేక ఉండెడు, శాశ్వతులు=నిత్యులైన, భువన+పితలకున్= జగత్తంతటికి+తల్లితండ్రులకు, కైమోడ్తు సవినయముగ=చేతులెత్తివినయముగానమస్కరింతును, భవ్య+వాక్అర్థముల=దివ్యమైన+ అర్థముల ధ్వనించెడివాక్కుల, ప్రతిపత్తి+కొఱకు=సమ్యక్ జ్ఞానము+కలుగుటకై,

క. ఎక్కడి సూర్యభవాన్వయ?/ మెక్కడ నా కొలది, ఎఱుక యించించుక, ఏ
నొక్క చిఱుతెప్ప ప్రాపున/అక్కట! దొరకొంటి, దుస్తరాంబుధి దాటన్. 3

ఎక్కడ+నా+కొలది+ఎఱుక=ఏపాటిది+నా+పరిమితిమైన+జ్ఞానము, ఇంచు+ఇంచుక=అతి స్వల్పము+ అణుమాత్రము, సూర్య+భవ+అన్వయము=సూర్యభగవానుని+నుండిపుట్టిన+వంశము, ఎక్కడి?=ఎంతో ప్రాచీనమైనది గొప్పది-కాన నేను సరిపడను, ఏను+ఒక్క=నేను+ఒకేఒక, చిఱు+తెప్ప=నా జ్ఞానమువలే చిన్న దైన+చుక్కానిలేనితెడ్డు, ప్రాపున=ఆశ్రయముతో, దుస్తర+అంబుధి+దాటన్=దాటలేని+సముద్రమును+ దాటగా, దొరకొంటి=యత్నించుచున్నాను, అక్కటా=విషయ విస్తరణ తెలియక దొరకొన్నాను-చిక్కుకొన్నాను,

క. జడుడ, సుకవి ప్రతీతికి/గడగితి, ఎగతాళిపాలు గా కెట్లుందున్?
పొడవరికె యందు ఫలముం/బడయగ, చేయెత్తి యెగురు మరుగుజ్జువలెన్. 4

జడుడ=మందుడను, సుకవి+ప్రతీతికి+కడగితి=మంచికవిఅనే+ప్రసిద్ధికి+ఒడిగట్టితిని, పొడవరికె=పొడవుగా ఉన్నవానికె, పడయగ=పొంద,

తే. కాని వాగ్రూపమున పూర్వకవులు మున్నె/పైచి రొక రాచబాట యా వంశమునకు;
పనివినుదు దాని వెంబడి, వజ్రవిద్ధ/రత్న రంధ్రమువెంట దారంబులీల. 5

వాక్+రూపమున=కావ్యముల+రూపమున, పూర్వకవులు+మున్నె=వాల్మీకి మొదలైనవారు+ఇంతకు ముందే, ఆ+వంశమునకు=వారి+చరిత్రకు, ఒక రాచబాట=ఒక రాజమార్గమురామాయణాదులద్వారా, పైచిరి= వేసిరి, దాని+వెంబడి=ఆ కావ్యముల+ఆధారముగా, పనివినుదు=వశవర్తియైఅరుగుదు, దాని+వెంబడి= ఆరీతిని+అనుగమించి, వజ్ర+విద్ధ+రత్న+రంధ్రమువెంట=వజ్రముచే+తొలువబడిన+రతనముల+కన్నముల గుండా, దారంబులీల=దారముసాగు సౌలభ్యముతో,

సారము:సూర్యవంశము రత్నము. వాల్మీకాదులు వజ్రసూచి వంటివారు.
రామాయణాది గ్రంధములు బెజ్జములువంటివి. కవి దారము వంటి వాడు-

తే. జగతి ఆగర్భ విభవు, లాజన్మశుద్ధు/లాఫలోదయశుభకర్ము, లాసముద్ర
వసుమతీ నాథు, లానాకవర్మ్తరథులు/రఘువు, లాచంద్ర తారక ప్రథిత యశులు. 6

ఆగర్భ+విభవులు=పుట్టుకతో+వైభవముకలవారు, ఆజన్మ+శుద్ధులు=పుట్టినప్పటినుండి+పవిత్రులు, ఆఫల ఉదయ+శుభకర్మ=ఫలము+లభించువఱకు+మంచి పనులనువీడనివారు, ఆనాక+వర్త్మ+రథులు=స్వర్గము వరకు+పోగల+రథముపైయుద్ధముచేయువారు(ఇంద్రుని ఆహ్వానముపై సహకరించుటకు స్వర్గము నకు పోయిన దిలీపుడు వంటి వారు), ఆచంద్రతారక+ప్రథిత+యశులు=చంద్రుడు నక్షత్రములు ఉన్నంత కాలము శాశ్వతముగానిలచు+ప్రసిద్ధిపొందిన+కీర్తి కలవారు,

సీ. ఆస్తిక్యమతి దేవయజనం బొనర్తురు/వీతిహోత్రుని యథావిధిగ పేల్చి,

గారవింతురు యథాకామ్యార్చనంబున/అభిలాష మెఱిగి అర్థార్థిజనుల,
అరసి దండింత్రు యథాపరాధంబుగా/విద్వేషరాగదవిష్ఠబుద్ధి,
నిర్వహింతురు యథానేహఃప్రబుద్ధులై/సాధిష్ఠముగ ప్రజారాధనంబు,
శైశవంబున విద్యలు సంగ్రహించి/యౌవనంబున గృహమేధులై మెలంగి,
వార్ధకంబున మునివృత్తి వనుల గడిపి/యోగవిధి నంతమున దేహ ముజ్జగింత్రు. 7

ఆస్తిక్య+మతి=దేవునిపై నమ్మకముగల+మనసుతో, దేవ+యజనంబు+ఒనర్తురు=దేవతగూర్చి+యజ్ఞము+ చేయుదురు, వీతిహోత్రుని=అగ్నిదేవునికి, యథావిధిగ+వేల్చి=పద్ధతిగా నేయి మొదలైన ద్రవ్యములువేసి+ హోమముచేసి, గారవింతురు=సంభావన చేతురు, యథా+కామ్య+అర్చనంబున=విధి+విధాన+పూజతో, అభిలాషము+ఎఱిగి=వారికోరిక+తెలుసుకొని, అర్థ+అర్థి+జనుల=ధనము+ఆచించు+ప్రజలను, అరసి= అన్వేషించి, యథాపరాధముగ=తప్పును అనుసరించి, విద్వేష+రాగత్+అవిష్ఠ+బుద్ధి= కోపము+అనురాగము లకు+దూరమైన+వివేకముతో, యథా+అనేహః+ప్రబుద్ధులై=సమయము+ప్రకారము+మేలుకొనువారై, సాధిష్ఠముగ=అధికారముతో, ప్రజ+ఆరాధనంబు=జనుల+సేవను, శైశవంబున=బాల్యము నందు, సంగ్రహించి= సంపాదించి, గృహమేధులై+మెలంగి=గృహస్థులై+వ్యవహరించి, వార్ధక్యమున=ముసలి తనమున, ముని+వృత్తి =ఋషులవంటి+నడవడితో, వనుల=అడవులలో, యోగవిధి=యోగాభ్యాస పాటవముచేత, ఉజ్జగింత్రు=విడుచుదురు,

ఉ. ఏనుగుపాడిగా వెలయు నీవికినై సమకూర్తు రర్థముల్
సూనృత రక్షకై మితవచో నియమంబు వహింత్రు, లోకస
మ్మానిత కీర్తికై రిపుసమాజ జిగీషకు నుత్సహింత్రు, సం
తానము గోరి చేయుదురు దారపరిగ్రహణంబు రాఘువుల్. 8

ఏనుగుపాడిగా+వెలయు=ఎక్కువగా+ప్రసిద్ధికెక్కు, ఈవికినై=దానముకొఱకే, సమకూర్తురు+అర్థముల్= సంపాదింతురు+ధనము, సూనృత+రక్షకై=సత్యదీక్ష+పాటించుటకై, మిత+వచో+నియమంబు+వహింత్రు= తక్కువ+మాట్లాడు+అలవాటు+చేసికొందురు, లోక+సమ్మానిత+కీర్తికై=జనముచే+గౌరవింపబడు+యశముకై, రిపు+సమాజ+జిగీషకును+ఉత్సహింత్రు=శత్రు+వర్గమును+జయించ+ప్రయత్నింతురు, దార+పరిగ్రహణంబు =భార్యను+ ప్రియముతోపుచ్చుకొందురు,

క. అని బుధుల వలన సారెకు/విని, పదబడి చపలబుద్ధి ప్రేరేపగ,నే
గొనియాడగ దొడగితి నిటు/తను వాగ్విభవుండనయ్యు దద్గుణగణమున్. 9

బుధుల వలన=విద్వాంసుల నుండి, సారెకు=మాటిమాటికి, పదబడి=మఱియు, చపలబుద్ధి+ప్రేరేపగ= లౌల్యము+ప్రోత్సహింప, తొడగితిని=ప్రారంభించితిని, ఇటు=ఈవిధముగా, తను+వాక్+విభవుండను+అయ్యు= అల్ప+కవిత్వ+సంపదకలవాడను+అయినను, తత్+గుణ+గణమున్=వారి+మంచిగుణముల+ఎంపిక చేయుటకు,

క. విన వేడెద సదసద్గుణ/వినిర్ణయవిదగ్ధులయిన విజ్ఞులు దీనిన్,
కననగు అనలముఖముననె/కనకపు సంశుద్ధియైన, కల్మషమయినన్. 10

సత్+అసత్+గుణ=మంచి+చెడు+గుణములను, వి+నిర్ణయ+విదగ్ధులయిన+విజ్ఞులు=బాగుగా+నిశ్చయము చేయ+నేర్పరులైన+పండితులను, దీనిన్=ఈ కావ్యమును, వినవేడెద=పరీక్షించ కోరెదను, అనల+ముఖమున =అగ్నియందు+వేయుటచేతనే, కనకపు=బంగారపు, సంశుద్ధియైన=స్వచ్ఛమైన మేలిమితనమైనను, కల్మషమయినన్=ముఱికితనమైనను, కననగు=తెలియగలము.

# ప్రథమ సర్గము - గురుదర్శనము

తే. నిగమ రాశికి ప్రణవము పగిది, రాచ/వంగడమునకు బీజమై, వన్నె కెక్కె,
సార్వకాలిక బుధ జన శ్లాఘనీయు/డలఘు తేజస్వి, వైవస్వతాఖ్య మనువు. 11

నిగమరాశికి=వేదసముదాయమునకు, ప్రణవము=ఓంకారము, పగిది=వలె, రాచ+వంగడమునకు= రాజ+వంశములకు, బీజమై+వన్నె+కెక్కె=మూలమై+ప్రసిద్ధి+చెందె, సార్వకాలిక=నిత్యము, బుధజన+శ్లాఘనీయుడు=పండితులచే+పొగడబడినవాడు, అలఘు+తేజస్వి=గొప్ప+ప్రకాశముకలవాడు, వైవస్వత+ఆఖ్య+మనువు=వైవస్వతుడనే+పేరుగల+మనువు( వివస్వుడు=సూర్యుడు, కుమారుడు వైవస్వతుడు),

మ. మనువంశమున నుద్భవించిరి జగన్మాకందచై త్రోదయుల్
వనధిద్వీపవిశాలవిశ్వవసుధావాల్లభ్యవాస్తోష్పతుల్
వినతక్షత్రకిరీటరత్నసుషమావిద్యోతితాంఘ్రిద్వయుల్
ఘను, లిక్ష్వాకుకకుత్ స్థముఖ్యులు,యశఃకన్యాప్రియంభావుకుల్ 12

ఉద్భవించిరి=పుట్టిరి, జగత్+మాకంద+చై త్ర+ఉదయుల్=జగత్తనెడు+మామిడిచెట్టుకు+వసంతఋతువును+కలిగించువారు, వనధి+ద్వీప+విశాల+విశ్వ+వసుధా+వాల్లభ్య+వాస్తోష్పతుల్=సముద్రము+ద్వీపములతో కలసిన +విశాలమైన+జగత్తులోనున్న+భూ+వల్లభులలో(రాజులలో)+ఇంద్రునివంటివారు, వినత+క్షత్ర+కిరీట+రత్న+సుషమా+విద్యోతిత+అంఘ్రి+ద్వయుల్=తలవంచిన+రాజుల+కిరీటపు+రతనముల+కాంతులచే+ప్రకాశించు+కాళ్ళ+జంట కలవారు, ఘనులు=గొప్పవారు, ఇక్ష్వాకు+కకుత్ స్థ+ముఖ్యులు=ఇక్ష్వాకుడు+కకుత్స్థుడు+ముఖ్యులుగా కలవారు, యశః+కన్యా+ప్రియం+భావుకుల్=కీర్తి+కాంతచే+ప్రియునిగా+భావింపబడినవారు,

క. ఆ విశ్రుతాన్వయాంబుధి/ ఆవిర్భవ మొందె లక్షణాన్వితుడు కళా
శేవధి, దిలీపుడను నొక/ జైవాతృకు, డవనికెల్ల చల్లని రాజై. 13

విశ్రుత+అన్వయ+అంబుధి=ప్రఖ్యాత+వంశ+సముద్రమున, ఆవిర్భవము ఒందె=పుట్టె, లక్షణ+అన్వితుడు=మంచిలక్షణములు+కూడుకొన్న వాడు, కళాశేవధి=చంద్రకళలకునిధి, జైవాత్రకుడు=చంద్రుడు,

సీ. ఆత్మ కర్మపటిష్ఠమగు దృఢాంగసమృద్ధి/తనువు దాల్చిన క్షాత్రధర్మమనగ,

ఆయతవ్యూఢ బాహావక్షమైబడ్డు/ పొడవున్నై తన మూర్తి మూరిబోవ,
ఆకారరేఖకు అనురూపమగు ప్రజ్ఞ/ప్రజ్ఞకు దగు శాస్త్ర పరిచయంబు,
ఘన శాస్త్ర పరిచితి కెనయైన ప్రారంభ/మారంభమునకు ఈడైన సిద్ధి,
కలిగి, ఆయున్నతికి నిర్వికారచరిత/వన్నె వెట్టుచు, ఆమనుప్రహత పదవి
వెంట నడపించె, నిజనేమివృత్తులయున/మానవుల, గాడితప్పనీ కా నియంత. 14

ఆత్మకర్మ+పటిష్టమగు+దృఢ+అంగ+సమృద్ధి=తనపనులునెరవేర్చ+సమర్ధమగు+బలమైన+అవయవముల+నిండుదనముతో, తనువు+తాల్చిన=రూపము+ధరించిన, క్షాత్ర+ధర్మము+అనగ=రాజ+లక్షణములు+అనునట్లుగా, ఆయత+వ్యూఢ+బాహా+వక్షమై=దీర్ఘమైన+చేతులు+విశాలమైన+ఉరము కలిగి, మూర్తి+మూరిబోవ=స్వరూపము+అతిశయించ, ఆకార+రేఖకు=రూపు+వైఖరికి, అనురూపమగు=తగినట్టి, ప్రజ్ఞ=బుద్ధి, శాస్త్ర+పరిచయంబు=శాస్త్రముల+అభ్యాసము, ఎనయైన=సమానమైన, ప్రారంభము=ప్రయత్నము, ఈడైన+సిద్ధి=సమానమైన+ప్రాప్తి, ఆయున్నతికి=ఆ ఉచ్ఛస్థితికి, నిర్వికార+చరిత=ఎట్టి వికారములేని+ నడవడి, వన్నెవెట్టుచు=మెఱుగుదిద్దుచు, ఆ+మను+ప్రహత+పదవి=వంశకర్తయైన+మనువు+వేసిన+ మార్గమున, నిజ+నేమి+వృత్తులయున=తమమనుమార్గ+పరిధిలోని+ప్రవర్తనకలవారైన, మానవుల=ప్రజల, గాడిన్+తప్పకనీక=త్రోవ+తప్పనీక, నియంత=ఆజ్ఞాపించురాజు,

శా. భూరిప్రాభవవిక్రమాదికగుణాభోగంబుచే భీతియున్,
కారుణ్యాది గుణావళిం జొరవయుం, గల్గించుచున్, చెంతకున్
పోరాకుండియు, ఎల్లవారి కభిగమ్యుండయ్యె, నాఱేడు, యా
దోరత్నంబుల భీమకాంతమగు పాథోరాశి సామ్యంబునన్ 15

భూరి+ప్రాభవ+విక్రమ+ఆదిక+గుణ+ఆభోగంబుచే+భీతియున్=అధిక+సామర్ధ్యము+పరాక్రమము+మొదలుగల+గుణముల+పరిపూర్ణతచే+భయమును, కారుణ్య+ఆది+గుణ+ఆవళిన్+చొరవయుం=దయ+మొదలైన+గుణముల+సమూహముచే+ప్రవేశసౌలభ్యము, అభిగమ్యుండయ్యె=సమీపింపదగ్గవాడయ్యె, యాదః+రత్నంబుల=జలజంతువుల చేతను+రత్నముల చేతను, భీమ+కాంతమగు+పాథోరాశి+సామ్యంబునన్=భయంకరము+మనోహరములగు+సముద్రమునకు+పోలికగా,

తే. జీవనపరిస్థితులు బాగు సేయుకొఱకె/భాగధేయము గ్రహియించు ప్రజలనుండి,
వేయిమడుగులు పదపడి విడుచుకొఱకె/ఇనుడు రసము గ్రహించు నట్లి నుడతండు 16

భాగధేయము=పన్ను (రసము ఆరు సంఖ్యకు సంకేతము.అందుచే పన్ను ఆరవ భాగమని), వేయిమడుగులు =ఎక్కువ అధికముగా, పదపడి=ఆతరువాత, ఇనుడు=సూర్యుడు, రసము+గ్రహించును=నీటిని+తీసికొనును, అట్లు+ఇనుడు+అతడు=ఆవిధముగ+సూర్యుడు+అతడు.

తే. వాని మంత్రము గాఢగుప్తముగ సాగు/బయలువడదు తదాకారభావవికృతి,
అంతిమ ఫలానుమేయము లా నృపాలు/సాధనలు, పూర్వజన్మ వాసనల భంగి. 17

మంత్రము+గాఢ+గుప్తముగ+సాగు=మంత్రాంగము+అధిక+రహస్యముగా+జరుగును, తత్+ఆకార+భావ+ వికృతి=వాని+ఆకారములోకాని+భావముయొక్కకాని+వికారతచే, అంతిమ+ఫల+అనుమేయము=ఆఖరి+ ఫలితమునుబట్టి+ఊహింపదగ్గవిగా, సాధనలు=ఉపాయములు, పూర్వ+జన్మ+వాసనల+భంగి=ముందు+ జన్మపు+కనబడని స్మృతిహేతువగు సంస్కారముల+వలెఉండును,

తే. స్థితి బ్రతిష్ఠింప దండనీతిని నయించె/పరిణయంబయ్యె సంతతి ప్రాప్తి గోరి
అమరు అంతః ప్రవాహిని యగుచు వాని/అర్థ కామ ప్రవృత్తి ధర్మానురక్తి. 18

స్థితి+బ్రతిష్ఠింప=సంక్షేమము+స్థాపించుటకు, నయించె=నడిపె, అమరు=ఒప్పు, ప్రవృత్తి+ధర్మ+అనురక్తి= నడత+ధర్మమునందు+ప్రీతికలదై.

సీ. సదమల జ్ఞానసంపద నిండుకుండయై/తొనకడు, మౌనముద్రను వరించు,
అతిలోకశక్తి మిన్నందిప్రతీకార/ వాంఛబోడు, తితిక్షవంక మ్రొగ్గు,
చేతికెముకలేని దాతయైవిఖ్యాతి/ వలవడు, తన యీవి వెలయనీడు,
ఉత్తమోత్తమ కర్మయోగియైఫలముల/పేక్షింప, డీశ్వరార్పితము చేయు,
పట్టినది యెల్ల పసిడిగా పెట్టిపుట్టి/డంబ మెఱుగడు, మను నిరాడంబరముగ,
పరగు నిటు తద్గుణములు తత్ప్రతిగుణముల/పొత్తున, సరాగమున తోడబుట్టు లట్లు. 19

సత్+అమల+జ్ఞాన+సంపద+నిండుకుండయై+తొనకడు=సత్యము+నిర్మలమైన+వేదశాస్త్ర జ్ఞాన+సమగ్రత+ పూర్తిగా ఉన్నవాడైనను+అతిశయించడు, వరించు=కోరుకొను, అతిలోక+శక్తి+మిన్నంది=లోకాతీత+శక్తి+ ఆకాశమంతహెచ్చైననూ, తితిక్షవంక+మ్రొగ్గు=వీలైనంతవఱకు క్షమించుటే+ఇష్టపడును, విఖ్యాతి+వలవడు= ప్రసిద్ధి+కోరడు, ఈవి+వెలయ+నీడు=చేసిన దానము+బయట+పడనీడు, ఉత్తమ+ఉత్తమ+కర్మయోగియై+ ఫలములు+అపేక్షింపడు=దానము యాగము వంటి+మంచి+పనులుచేసియును+ఫలితమును మాత్రము+ కోరడు, డంబము=గర్వము, మను=జీవించు, పరగు=ప్రవర్తిల్లు, తత్+గుణములు+తత్+ప్రతి+గుణముల+ పొత్తున+సరాగమున=వానిఅందు+గుణములు+వాటి+ప్రతి+గుణములు( జ్ఞాన-మౌనములు, శక్తి-క్షమ,

దానము-గోప్యము, కర్మము-ఫలవాంఛలేమి, భాగ్యము-నిరాడంబరత)+కలిసి+ఒద్దికగా, తోడన్+పుట్టులు+అట్లు=సహ+జన్మల +వలే

క. చతురంగబలము చిహ్నమె/అతనికి సమకూర్చు రెండె అఖిలార్థములున్,
శ్రుతిశాస్త్రపచేళిమమగు/మతియు, ధనుర్నిహితమైన మౌర్వీలతయున్. 20

చిహ్నమె=ఉపకరణమే(వాటికి అంతగా పనిలేదు), సమకూర్చు=కలిగించు, అఖిల+అర్థములు=అన్ని+ప్రయోజనములు, శ్రుతి+శాస్త్ర+పచేళిమమగు+మతియు=వేదము+రాజఅర్థనీతిశాస్త్రములందు+తనంతట తానేపక్వమైన+బుద్ధియు, ధనుర్+విహితమైన+మౌర్వి+లతయున్=ధనస్సునందు+సంధించిన+అల్లెతాడు+కొరడా త్రాడులును.

క. నిరపాయు డయ్యు దన్నే/మఱకుండు, అరుగ్ణుడయ్యు మసలడు ధర్మా
చరణమున, లోభతృష్ణా/విరహితమతి యయ్యు పడయు విత్తము సుఖమున్. 21

నిరపాయుడు=అపాయములేనివాడు, ఏమఱకుండు=పరాకుపడడు, అ రుగ్ణుడు+అయ్యు=విఘ్నములు కలగనివాడు+ఐననూ, మసలడు+ధర్మ+ఆచరణమున=వెనుదీయడు+ధర్మము+పాటించుటలో, లోభ+తృష్ణా+విరహిత+మతి+అయ్యు=దురాశ+కాంక్ష+లేని+బుద్ధి+కలవాడైననూ, పడయు=సంపాదించిపొందు,

క. పలుచదువుల గడముట్టుట/బలవద్విషయముల బారి బడకుండుట, ని
శ్చల ధర్మ నిరతుడగుటను/తలనెరయని ముదిమి వచ్చె ధరణీ పతికిన్. 22

కడముట్టుట=పారంగతుడై, బలవత్+విషయముల+బారిన్+పడకుండుట=దేహ+ఇంద్రియ+లౌల్యపు ఆపదల వైపుకు+పరుగెత్తక, నిశ్చల+ధర్మ+నిరతుడగుటను=స్థిరమైన+ధర్మమునందు+ఆసక్తికలవాడగుటచే, తల+నెరయని+ముదిమి=జుత్తు+పండని+ ముసలితనము-జ్ఞానవృద్ధుడు,

భావము: వృద్ధత్వము వైరాగ్యము విద్య జ్ఞానము వయసు లవల్ల కలుగును.
వయసు తప్ప మిగిలిన మూడు ఉండుటచే వృద్ధుడు.

క. పగతుడగు గాక శిష్టుని/తగ చేకొను, రోగి యౌషధమ్మును బోలెన్
దిగవిడిచి పుచ్చు దుష్టుని/తగడని హితునైన, సర్పదష్టాంగుళిగన్. 23

పగతుడు+అగున్+కాక=శత్రువు+అయిన+అప్పటికి, శిష్టుని=యోగ్యుని, తగ+చేకొను=తప్పనిసరిగా+గ్రహించును, దిగవిడిడుచి+పుచ్చు=(దృష్టితీసినట్లు)విడచి+పంపును, తగడని=సమర్థుడుకాడని, హితునైన=ప్రేమాస్పదుడైనను, సర్ప+దష్ట+అంగుళిగన్=సర్పముచేత+కఱవబడిన+వ్రేలునువిధముగా,

క. అనుదినము మనుచు, విద్యా/వినయములను గఱపు, బ్రతుకు వెరవులు చూపున్

కని విడుచుటె తలిదండ్రుల/పని, ప్రజలను సాకు టతని పని ఎల్లెడలన్. 24

అనుదినము=దినదినము, మనుచు=పోషించు, కఱపు=నేర్పు, బ్రతుకు+పెరవుల=జీవన+ఉపాయము, సాకు=కాపాడు,

ఆ. క్రతువు కొఱకు పుడమి బితికె దిలీపుడు/ పిదికె, చేలకొఱకు, చదలు వజ్రి.

ఇచ్చి పుచ్చుకొనుచు ఈరీతి మనిచిరి/నాక మొకడు, నడిమి లోక మొకడు 25

క్రతువు=యజ్ఞముకై, పుడమి+పితికె=భూప్రజలనుండి+పిండెను-పన్నులుతీసుకొనెను, పితికె=పిండెను-వర్షముకురిపించెను, చదలు=ఆకాశమును(మేఘముల), వజ్రి=ఇంద్రుడు, మనిచిరి=పోషించిరి, నాకము+ఒకడు=స్వర్గమును+యజ్ఞములుచేసి దిలీపుడు, నడిమిలోకము+ఒకడు=భూమిని+వర్షముల కురిపించి ఇంద్రుడు-

ఉ. పూతవినీతవర్తను, ప్రభూతబలున్, సహనాభిరాము, తే
జోఽతిశయున్, విశాలహృదయున్, మనుజోత్తము, నాతనిన్ మహా
భూతసమాధితోడ నలుమోములవేల్పు సృజింపబోలు! ఆ
హేతువునం, బరార్థఘటనైకఫలంబులు తద్గుణౌఘముల్. 26

పూత+వినీత+వర్తను=పరిశుద్ధమై+జితేద్రియుడై+ఉండువాని, ప్రభూత+బలున్=అధిక+బలము కలవాని, సహన+అభిరాము=ఓర్పుతో+ఒప్పిదమైనవాని, తేజః+అతిశయున్=పరాక్రమము+హెచ్చుగాకల వాని, విశాల హృదయున్=శ్రేష్ఠమైన మనస్సు కలవాని, +మహాభూత+సమాధితోడ=పృథ్వి నీరు అగ్ని వాయు ఆకాశములు అను పంచ మహాభూతము కలిపి+తనతపస్సు ప్రభావముతో, నలుమోములవేల్పు=బ్రహ్మ, సృజింపబోలు=పుట్టించిఉండవచ్చును, ఆ+హేతువునం=ఆ+కారణమున, పర+అర్థ+ఘటనైక+ఫలంబులు=పరులకు+ఉపకారము+చేయ+సమర్థమైనవి, తత్+గుణ+ఔఘము=వాని+సుగుణముల+పరంపర,

సీ. ఏడుదీవులు ఏడు వాడలై రమణింప/ కాననములు మహోద్యానములుగ,
చెలియలికట్ట వర్తులవప్రమై తోప/నీరు వామి అగడ్తతీరు జూప,
సముదగ్రవిశ్వరూపముగన్న సాకేత/పురము బోని విశాలధరణి నెల్ల,
తనయెల్లినీడకు గొని తెచ్చి నెలకొల్పె/భవ్య సంక్షేమ రాజ్యవ్యవస్థి,
నెట్టన పరస్వములనుండి పట్టితెచ్చి/చోరతను వాచికంబను కార నునిచె,
భూమిపతు లన్యులకు చందమామ ఘుటిక/ఆ రసాధీశు అద్భుతోదార కీర్తి. 27

ఏడు ద్వీపములు=జంబు ప్లాక్ష సాల్మాల్లి కుశ క్రౌంన్చ శాక పుష్కర దీవులు, ఏడు+వాడలై+రమణింప=ఏడు+వీధులై+ఒప్పగ, చెలియలి+కట్ట=సముద్రపు+ఒడ్డు, వర్తుల+వప్రమై+తోప=గుండ్రని+కోటగా+అనిపింప, నీరు+వామి=సముద్రనీటి+రాశి, అగడ్త+తీరున్+చూప=కందకము+విధముగా+కనబడ, సమ+ఉదగ్ర+విశ్వ+రూపమున్+కన్న=మంచి+రమణీయ+విశ్వ+రూపముగ+కనబడు, వోని=వోలిన, తన+ఎల్లి+నీడకు=తన+శ్వేతఛత్రము+క్రిందకు, కొనితెచ్చి=తీసుకొనివచ్చి, నెలకొల్పె=స్థాపించె, భవ్య+సంక్షేమ+రాజ్య+వ్యవస్థ=శుభమై+మంచిరక్షణకల+రాజ్యము+స్థిరముగా ఏర్పరపబడినది, నెట్టన+పరస్వముల+నుండి+పట్టితెచ్చి+చోరతను=కాకతప్పనిదై+ఇతరుల-వైరిరాజుల-సొమ్ము+నుండి+తీసుకొనివచ్చిన+సొమ్మును, వాచికంబను+కార+నునిచె=మాటమాత్రమైన+చెఱసాల+నిలుపె, భూమిపతులు+అన్యులకు=ఇతర+రాజులకు, చందమామ+ఘుటిక=చందమామ+గుళిక-అందలేనిది, ఆ+రస+అధీశు=ఆ+భూమిని+పాలించుసార్వభౌము, అద్భుత+ఉదార+కీర్తి= ఆశ్చర్యకరమైన+గొప్ప+యశస్సు,

క. దాక్షిణ్యగుణనిరూఢి సు/దక్షిణయను మగధ రాజతనయ యుదంచ
ల్లక్షణ, క్రతుదేవునకున్/దక్షిణవలె, పత్ని యయ్యె ధరణీశునకున్. 28

దాక్షిణ్య+గుణ+నిరూఢి=దయా+గుణముచే+ప్రసిద్ధి చెందినది, ఉదంచత్+లక్షణ=గౌరవింపదగ్గ+మంచి గుణములు కలది, క్రతుదేవునకున్+దక్షిణవలె=యజ్ఞపురుషునికి+దక్షిణవలె-(దక్షణలేక క్రతువులసంపూర్తి. యజ్ఞము గంధర్వుడని దక్షిణ అప్సరస అని శ్రుతి)

క. అనుగుణవతియైన తదం/గనయం దాత్మజుని బడయ గాఢోత్సుకుడై
తన కేనాటికి కడము/ట్టని కామనప్రేగునం గడపి కాలంబున్. 29

అను+గుణవతి=తనకుసదృశమైన+గుణములుకలది, ఆత్మజుని=కొడుకుని, పడయన్+గాఢ+ఉత్సుకుడై=పొంద+అధికమైన+కుతూహలము కలవాడై, కడముట్టని=సంపూర్ణమవని, కామనప్రేగునం+గడిపి+కాలంబున్=పుత్రునిపొంద కోరిక+తీవ్రతతో+గడిపెను+ఎంతోకాలము,

చ. తరణికులైకభూషణసుతప్రతిపాదకపావనవ్రతా
చరణమనీష, శిష్టబుధసమ్మతి, స్వీయభుజావతీర్ణభూ
భరము నమాత్యసత్తములపై నిడి, వేల్పుల గొల్చి, మానవే
శ్వరు డొకనాడు రేపకడ పాణిగృహీతియు దాను పైనమై. 30

తరణి+కుల+ఏక+భూషణ+సుత+ప్రతిపాదక+పావన+వ్రత+అచరణ+మనీష=సూర్య+కులమునకు+ఏకైక+అంలంకారమైన+కుమారుని+కలిగించు+మంగళ+వ్రతము+చేయ+బుద్ధితో, శిష్ట+బుధ+సమ్మతి=శిక్షితులైన

+విద్వాంసుల+అంగీకారముతో, స్వీయ+భుజ+అవతీర్ణ+భూ+భరమున్=తన+భుజములనుండి+దించిన+భూమి+భారమును, అమాత్య+సత్తములపైన్+ఇడి=మంత్రి+శ్రేష్ఠులపై+ఉంచి, వేల్పు+కొల్చి=బ్రహ్మదేవుని+పూజించి, రేపకడ=ప్రాతః కాలము, పాణిగృహీతి=భార్య

సీ. పసిడి మేడల నుండి పౌరాంగనాశ్రేణి/తళుకొత్తు సేసముత్యాలు కురియ,
ప్రాస్థానికస్వస్తివచనగర్భితమైన/శుభతూర్యనినదము నభము ముట్ట,
చిరతరప్రార్థనాసిద్ధి సూచకముగా/ అనుకూలగంధవాహంబు వొలయ,
నగరోపకంఠమునకు వచ్చి సామంత/ సచివ బాంధవకోటి సాగనంప,
ఎల్లవారికి వీడికో లిచ్చి యనిచి/అచట సరయూ స్రవంతిక నవతరించి,
పరమ సమ్మోదమున కులపతి వశిష్ఠు/నాశ్రమంబు నిజాభిగమ్యముగ వెడలె. 31

పసిడి=బంగారు, శ్రేణి=వరుస, తళుకొత్తు+సేసముత్యాలు+కురియ=పుష్పాంజలిగా మెఱుస్తున్న+ముత్యాలు+జల్లుచుండగా, ప్రాస్థానిక=ప్రయాణపు, స్వస్తివచనగర్భితమైన="శుభమస్తు" అనునట్లుగా, శుభ+తూర్య+నినదము+నభము+ముట్ట=మంగళ+వాద్యముల+ఘోష+ఆకాశము+అంట, చిరతర+ప్రార్థనా+సిద్ధి=చాలా కాలపు+కోరిక+పండుటకు, అనుకూల+గంధవాహంబు+వొలయ=ప్రయాణదిశగా+గాలి+వీవ, ఉపకంఠము=పొలిమేర, అనిచి=పంపించి, స్రవంతిక=నది, అవతరించి=దాటి, నిజ+అభిగమ్యముగ=తన+ గమ్యస్థానముగా,

తే. స్నిగ్ధగంభీరనిర్ఘోషముగ్ధమైన/అరద మెక్కి సతీపతు లరిగి రెలమి,
వానకారు మొయిల్ మీద స్వారి వెడలు/విద్యుదైరావతంబుల విధము తోప. 32

స్నిగ్ధ+గంభీర+నిర్ఘోష+ముగ్ధమైన=ఇంపై+మంద్రమైన+ధ్వనితో+చక్కనైన, అరదము=రథము, అరిగిరి+ఎలమి=వెళ్ళిరి+సంతోషముతో, వానకారు+మొయిల్+మీద=వర్షముపడుచుండిన+నల్లని మేఘములు+పైని, విద్యుత్+ఐరావతంబుల=మెఱపులు+ఐరావతముమనెడి ఇంద్రుని తెల్లఏనుగుల,

క. వలదా తపోవనమునకు/అలజడియని చనిరి కొలది యనుయాయులతో,
బలవదనుభావమే పలు/బలముల పెట్టగుచు, దమ్ము బలసి భజింపన్. 33

వలదు=వద్దు, అలజడి=హడావడి, అనుయాయులతో=వెంటవచ్చువారితో, బలవత్+అనుభావమే=అతిశయించిన+తేజస్సే, పలు+బలముల+పెట్టగుచు=పెక్కు+సైన్యముతో+సమానమై, బలసి=కూడి, భజింపన్=సేవింపగా.

చ. అరదము సాగిపోవు సమయంబున తారసపడ్డ తీవయో
వరులను జూపు, పుష్పతరువాటిక జూపును, శైలసాను కం

దరముల జూపు, శ్వాపదకదంబము జూపును, చూపి, యన్నిటిన్
పురిగొను కౌతుకంబున గనుంగొను కాంతకు, కాంతు డిట్లనున్ 34

అరదము=రథము, తారసపడ్డ=సమీపముననున్న, తీవయోవరులను=శ్రేష్ఠమైన తీగలను, పుష్ప+తరు+వాటిక=పుష్పించిన+చెట్ల+తోటల, శైల+సాను+కందరముల=కొండచరియలపైననూ+శిఖరము పైననూ+కమ్మమబ్బులను, శ్వాపద+కదంబము=పెద్దపులుల+గుంపును, పురిగొను+కౌతుకంబునన్+కనుంగొను=ఉత్సాహము+కుతూహలముతో+చూచుచున్న,

మ. "మధురాలాపనిసర్గపండితగరుత్మజ్జాలసంకీర్ణమున్,
పృథుశాఖోపరిశాఖికాచికురచుంబివ్యోమసాలౌఘమున్,
పథికోద్వేగకరప్రచండబహుసత్త్వవ్యాళభూయిష్ఠమున్,
విధుబింబానన! చారు భీషణము సంవీక్షింపు కాంతారమున్. 35

మధుర+ఆలాప+నిసర్గ+పండిత+గరుత్మత్+జాల+సంకీర్ణమున్=ఇంపైన+రాగము+ఆలాపమును+వెలువరించు+సామర్ధ్యముకల+పక్షుల+సమూహముతో+వ్యాపించినది, పృథు+శాఖ+ఉపరిశాఖికా+చికుర+చుంబివ్యోమ+సాల+ఓఘము=పెద్ద+కొమ్మలు+వాటి చిన్నకొమ్మలు+వాటిచిగురులు+ఆకాశముతాకునట్లుండు+సాలవృక్షముల+వరుసలు, పథిక+ఉద్వేగకర+ప్రచండ+బహు+సత్త్వ+వ్యాళ+భూయిష్ఠమున్=బాటసారులకు+భయము కలిగించు+భీషణమైన+వివిధ+జంతువులు+పాములు+మిక్కుటముగా కలది, విధుబింబ+ఆనన=చంద్ర+వదన, చారుభీషణము=ఒకేసారిసుందరము భయంకరము అయిన, సంవీక్షింపు=అన్నిదిశల వెదుకుచూ చూడుము, కాంతారమున్=మహారణ్యమును,

తే. చూడుము, సుగాత్రి! శుద్ధాంతసుందరులకు/అరుదుగా గాని దర్శింప దొరకబోని,
మానవస్పర్శచే మలీమసము గాని/అకృతకవనాంతరోజ్జ్వల ప్రకృతి శోభ. 36

సు+గాత్రి=సందరమైన+అవయవములుకలదాన, శుద్ధాంత=అంతఃపుర, అరుదుగా=అపురూపముగా, మానవ+స్పర్శచే+మలీమసము=జన+తాకిడిచే+మాయని, అకృతక=మనుష్యులచేత చేయబడినది కాక సహజమైన, వన+అంతర=అడవి+లోని, ఉజ్జ్వల+ప్రకృతి+శోభ=ప్రకాశించు+సహజ స్వరూప+సౌందర్యము,

సీ. సహజబంధురదరీకుహరసానువులతో/ధాతుచిత్రితము లుత్తాలగిరులు,
గగనము జుంబించి కాదంబినుల సమా/శ్లేషించు నభిరామశృంగపంక్తి,
మదవతీస్తనమధ్య మౌక్తికసరములై/జంట కొండల మధ్య సాగు ఝరులు,
నిడుపైన చరియల నడుమ ప్రశాంతగం/భీరములయి సొంపు మిగులు లోయ,

లివతళించెడు లోయల నిరులు కవియు/తరులతాశ్రేణితో గన్నుదనియజేయు

కోనలును నివ్వటించు, గన్గొనిన మాత్ర/ఐహికవిచారపరతకు ఆటవిడుపు. 37

సహజ+బంధుర+దరీ+కుహర+సానువులతో+ధాతు+చిత్రితములు+ఉత్తాల+గిరులు=ప్రకృతి సహజమై+ఎత్తుపల్లములున్న+మేరభూములు+గుహలు+కొండశిఖరములుకలిగి+ గైరికాదివర్ణములచే+చిత్రించబడినట్టి+ఎత్తైన+కొండలు, గగనమున్+చుంబించి+కాదంబినుల+సమాశ్లేషించు+అభిరామ+శృంగ+పంక్తి=ఆకాశము+అంటి+మేఘపంక్తిని+బాగుగాకౌగలించు+మనోహరమైన+పర్వతాగ్రముల+వరుస, మదవతీ స్తన+మధ్య+మౌక్తిక+సరములై+జంటకొండలమధ్య+సాగు+ఝరులు=స్త్రీ+కుచముల+మధ్య నుండు+ ముత్యపు+దండలు అట్లున్న+రెండుకొండలమధ్య+పారు+నదులు, నిడుపైన+చరియల+నడుమ+ప్రశాంత+గంభీరములయి+సొంపు+మిగులు+లోయలు= పొడుపై+చదునుప్రదేశముల+మధ్య+అలజడి లేకుండా+లోతై+అందము+అతిశయించు+కొండలోయలు, ఇవతళించెడు+లోయల+ఇరులు+కవియు+తరు+లతా+శ్రేణితో=చల్లగాఉండు+లోయలందు+చీకటి+వ్యాపింపజేయు+చెట్లు+లతల+వరుసలతో, కన్ను+తనియన్+చేయు+కోనలును+నివ్వటించు=కనుల+తృప్తి+పరచుచు+కొండల యందలి మఱుగుప్రదేశములు+ఒప్పుచున్నవి, కన్గొనిన+మాత్ర+ఐహిక+విచార+పరతకు+ఆటవిడుపు=చూచిన+క్షణముననే+ఈలౌకిక+ఆలోచనల+ఆసక్తికి+సెలవుచెప్పబడును,

తే. ఆకసపుటంచులం బలె నరయనగునె?/అడవుల నిసర్గశోభ, ఏణాయతాక్షి!

పోషితోద్యానములకన్న పొలుపు మిన్న/గజిబిజిగ నిట్లు పెరిగిన కానలందె. 38

ఏణాయతాక్షి=లేడికన్నులదానా, ఆకసపు+అంచులం+వలె=ఆకాశపు+చివరను+ఎట్లైతే చూడలేమో, అడవుల+నిసర్గ+శోభ=అడవియొక్క+ప్రాకృతిక+సౌందర్యము, అరయన్+అగునె=చూడ+తరమా, పోషిత =మనుషులచె పెంపబడిన, పొలుపు+మిన్న=అందము+ఎక్కువ, గజిబిజి=ఇష్టానుసారంగా,

సీ. పట్టరాని ప్రమోదపారవశ్యంబున/పులకించి మినమిన పురులు విప్పి

కలికి పింఛములతో, ధళుదళుక్కున నింగి/కన్నియమెఱపు తీగలు వెలార్చె,

సుస్వాగతము చెప్ప చొప్పున మ్రోసిన/కేకారవమున గిల్గింత పెట్టె,

సజలచక్షువులతో, చతురభంగిమలతో/కమనీయబృందలాస్యములు చేసె,

రసిత మను భ్రాంతి రథనేమిరవము వినిన/భరత జాతీయ పక్షులు బర్హిణములు,

కుసుమకోమలి! వింటె? యా కూజితంబు/షడ్జసంవాది, శ్రవణరసాయనంబు. 39

పట్టరాని+ప్రమోద+పారవశ్యంబున=ఇమడస్వాధీనముకాని+ఆనంద+పరవశత్వమున, పులకించి+ మినమిన +పురులు+విప్పె=పులకితయై+తళ తళ లాడు+రెక్కల్లు+విప్పెను, కలికి+పింఛములతో=మనోజ్ఞ మయిన+ నెమలి పురులతో, ధళుదళుక్కు=మెఱపు మెఱయు అనుకరణము, నింగి+కన్నియ=ఆకాశమనే +స్త్రీ, వెలార్చె =వెడలించె, చొప్పున=విధముగా, మ్రోసిన+కేకారవమున=మ్రోగిన+నెమలికూతతో, సజల+చక్షువులతో= తడసిన+కన్నులతో, చతుర+భంగిమలతో=నేర్పుకూడినవిశేష+విన్యాసములతో, కమనీయ+ బృంద+ లాస్యములు= చూడతగిన+సమూహముగాచేయు+నృత్యములు, రసితము+అను+భ్రాంతి+రథనేమి+ రవము+వినిన=మేఘగర్జన+అని+తలచుటచే+రథపుకమ్మి+శబ్దము+విన్న, భరత జాతీయ పక్షులు +బర్హిణములు=భారత జాతీయ పక్షులు అయిన+నెమళ్ళు, కూజితంబు=నెమళ్ళకూత, షడ్జమసంవాది= షడ్జస్వరముతో సరిపోలుచున్నవి( సప్త స్వరములలో మొదటిది(నాల్గవదిని కొందరు) నెమలి కేకను బోలి యుండును), శ్రవణ+రసాయనంబు=(షడ్జస్వరమువలే రెండు రెండు భాగములుగా విడివడి మనోహరమైనది )చెవులను+ఆనందపఱచునది,

చ. పరుగున డాయ వచ్చి ఎలప్రాయపుచక్కదనాల చుక్క ఆ
హరిణకుమారి, మోదమున అబ్రమునం జెవిదాకినట్టి క
న్నరదము మీద నెక్కొలిపె, అంగన! నీ నిడుగన్ను దోయి త
త్తరళవిలోచనంబులకు దగ్గరి చుట్టములేమొ! చూచితే. 40

డాయ=సమీపమునకు, ఎల+ప్రాయపు=చిన్న+వయస్సుకల, చక్కదనాలచుక్క=అందమైనఆకారము కలది, హరిణికుమారి=జింక పిల్ల, మోదమున=సంతోషముతో, అబ్రమునం=ఆశ్చర్యముతో, చెవిదాకినట్టి+కన్ను =కర్ణాంతమైన+కన్నును, అరదము=రథము, నెక్కొలిపె=పెట్టె, నిడు+కన్నుదోయి=పొడవైన+రెండు కండ్లు, తత్+తరళ+విలోచనంబులకు=వాని+ప్రకాశించు+చూపులకు,

తే. ఆకసంబున రెక్క లల్లార్చికొనుచు/మగువ! అస్తంభతోరణమాలలీల/
పఱచు బెగ్గురుపిట్టల బారు గంటె!/వదన మెత్తించు తత్కలస్వనమె నిన్ను. 41

అస్తంభ+తోరణ+మాల+లీల=అధారస్తంభములులేని+ప్రాకారద్వారములకుకట్టు+దండల+వలె, ఆకసంబున+ రెక్కలు+అల్లార్చి+కొనుచు=ఆకాశములో+తమరెక్కలు+ఊపు+కొనుచు, పఱచు+బెగ్గురు+ పిట్టల+బారు= ఎగురుచుపాటిపోవు+సారస+పిట్టల+వరుస, కంటె=చూచితివా, తత్+కల+స్వనమె=వాని+అవ్యక్తమధురపు+ స్వరము, వదనము+ఎత్తించు=ముఖమును+ఎత్తునట్లుగాచేయు,

మ. అనవద్యప్రభుభక్తిసంభరితులై, హైయంగవీనంబుపా

యనముందెచ్చిరి నీకు, వీరె, కనుమీ! ఆభీరవర్షీయులన్
వనవృక్షంబుల జూపి పేళ్ళడుగు, మా వ్యాజంబునం బల్కరిం
చిన,మిన్నుట్టుదు రీ యమాయకులు, రాజీవాక్షి! మోదంబునన్. 42

అనవద్య+ప్రభుభక్తి+సం+భరితులై=దోషములేని+రాజభక్తి+ఎక్కువగా+నిండినవారై, హైయంగవీనంబు= నిన్నటిఆవుపాలు పెరుగుచేసి చిలికగావచ్చినవెన్నతో నేడు కాచిననేయి, ఉపాయనముం=కానుకను, ఆభీర +వర్షీయులన్=గొల్లల+పెద్దలను, ఆ+వ్యాజమునం=ఆ+మిషతో, మిన్+ముట్టుదురు=సంతోషముతో ఉప్పొంగిపోదురు,(దిలీపుడు భార్యతో పేర్లు అడుగు, దానితో పరిచయము పెరిగి ఆటవికులు ఆనందముతో మిన్నంటుదురు అన్న మాటల ద్వారా దిలీపుని ప్రజా సంబంధసామరస్యత తెలుపును.)

మ. తొలి మాపెద్దలచే నొసంగబడి, ఎంతో ప్రోదియై పై రుప
చ్ఛలతో పక్వఫలద్రువాటికలతో సంపన్నమై, పాలగుం
జల గుర్తుల్ కల అగ్రహారములవే, చంద్రాస్య! తద్వాస్తుయ
జ్వల యాశీస్సులు పొంది, పోద మవి ఆపాదించు నాశ్వాస్యముల్" 43

ప్రోదియై=పోషింపబడి, పక్వ+ఫలద్రు+వాటికలతో+సంపన్నమై=పండిన+పండ్లనిచ్చుచెట్లుకల+ఉద్యానములతో +సమృద్ధియై, పాలగుంజే గుర్తుల్ =దానమిచ్చినరాజుచిహ్నములుకలిగిన హద్దురాటలు, అగ్రహారములు+ అవే=రాజుబ్రాహ్మణులకిచ్చుభూములుగృహాదులుకల పల్లెలు+అవిగో, తత్+వాస్తు+యజ్వల=అక్కడ+ నివసించి+యాగములు చేయుచుండు గృహస్థులయొక్క, ఆపాదించు=కలిగించును, ఆశ్వాస్యముల్= సాంత్వనము,

తే. ప్రకృతి సొగసుల కద్దము పట్టి చూపి/సరసముగ కాంతు డిటు సమీక్షణ మొనర్ప,
మధురతాదాత్మ్యమున జూచె మగధతనయ/తృషయు నలతయు విస్మృత విషయములుగ. 44

సమీక్షణము+ఒనర్ప=చక్కగావ్యాఖ్యానము+చేయుటచే, మధుర+తత్+ఆత్మ్యమున=ఇంపుగా+దానియందు +మనస్సులగ్నమవగా, తృష=దప్పి, అలత=శ్రమ, విస్మృత=మఱవబడిన,

సీ. పతయాళుశీకరాంభశ్శీకరార్ద్రమై/అంగసుఖస్పర్శ మలవరించు,
ఆధూతవిటపియై అల్లనల్లన వీచి/పయనపుటలత నపాకరించు,
అరదము పెంధూళి అలకవేష్టనముల/కంటని యానుకూల్యమును బొలయు,
కమలసరోహంస కలనినాదములను/వీనులు సోకగ విస్తరించు,
కుసుమ కింజల్కములు కొల్లగొట్టి తెచ్చి/చిలుపచిలుపని పుప్పొళ్ళు చిలుకరించు,

దారిపొడవున నిటు కొల్చె దంపతులను/మృదుమనోహరసురభిసమీరణంబు. 45

పతయాళు+శీకర+అంభస్+శీకర+ఆర్ద్రమై=పడుచున్న+తుంపరల+నీటి+బిందువులుచె+తడసినదై, అంగ+సుఖ+స్పర్శము+అలవరించు=శరీరమునకు+సౌఖ్యమును+కానుకగా+సిద్ధపఱచు, ఆధూత+విటపియై=(గాలిచే)కదులబడు+చెట్లుకలదై, అల్లనల్లన+వీచి=మెల్లమెల్లగా+విసిరి, పయనపు+అలతను+అపాకరించు=ప్రయాణపు+శ్రమను+తొలగించు, అరదము+పెను+ధూళి=రథముచేరేగు+ఎక్కువైన+దుమ్ము, అలక+వేష్టనములకు+అంటని=ముంగురులకు+తలపాగకు+ఆనక-అందుచే రేపని, ఆనుకూల్యమునున్+పొలయు=అనుకూలముగాగాలివీచిసౌలభ్యము+అందించు, కమల+సరో+హంస+కల+నినాదములను+వీనులు+సోకగ+విస్తరించు=కమలములుకల+సరస్సులందలి+హంసల+అవ్యక్త మధురధ్వని+శబ్దము+చెవుల+తాకునట్లుగా+వ్యాపించు, కుసుమ+కింజల్కములు+కొల్లగొట్టి+తెచ్చి+చిలుపచిలుపని+పుప్పొళ్ళు+చిలుకరించు=పూల+పరాగము+అపహరించి+తనతోతెచ్చి+కొంచము కొంచముగా+పుష్పములయందలి పరాగమును+జల్లు, మృదు+మనోహర+సురభి+సమీరణంబు=కోమలమై+పరిమళించు+వసంతఋతు+గాలి, కొల్చె=సేవించెను.

తే. ఒక యనిర్వాచ్యమగు శోభ యుట్టి పడియె/సమయ సముచిత విమలవేషముల తోడ

అరుగు నృపదంపతులకు, హిమాత్యయమున/కలసికొన్న చిత్రా సుధాంశులకు బోలె 46

అనిర్వాచ్యము=చెప్పలేని, శోభయు=కాంతికూడా, ఉట్టిపడె=ఉన్నట్టుండికలిగె, విమల=శుచియైన, హిమ+అత్యయమున=హేమంత ఋతువు+అంతమున కలిసిన, చిత్రా సుధాంశులకు=చిత్రానక్షత్ర చంద్రులకు వలె-(చిత్రానక్షత్ర చంద్రునకు దుఃఖ సమయమైన హేమంతము కడచి సంతోష కాలము ఆరంభమైనది. అటులనే రాజదంపతులకు కూడఅని సూచన.)

ఉ. వింతలు సూపుచుం బ్రియకు వేడుకగొల్పుచు చుట్టునుం ప్రభా
వంతము సేయుచుం దఱియ వచ్చిరి, శ్రాంతరథుల్ దిగంతవి
శ్రాంతరథుల్ సముల్లసితరాగమునన్ గురుదేవునాశ్రమో
పాంతము రాజమౌళియును, పశ్చిమ శైలతటంబు హేళియున్ 47

ప్రభావంతము=తేజోవంతము, దఱియ=దగ్గర, శ్రాంత+రథులు=అలసటపొందిన+అశ్వములుగలవాడు, దిగంత+విశ్రాంత+రథుల్=దిక్కులఅంతమువఱకు+వెళ్ళినిలవగల+రథముపైనుండియుద్ధముచేయకలవారు, సమ+ఉల్లసిత+రాగమునన్=బాగుగా+పుట్టిన+అనురాగముతో, ఉపాంతము=సమీపము, పశ్చిమ+శైల+తటము=పడమటి+పర్వత+ప్రదేశమునను, హేళియున్=సూర్యుడును,

వ. వచ్చి తపోవన ముఖద్వారము ముందర రథావతరణము సేసి, సుదూర ప్రయాణసంక్షోభ పరిశ్రాంతము లయిన రథ్యముల సేదదీర్ప సారథికి ముదలయిచ్చి, ప్రత్యంతర భృత్యవర్గము నచ్చటనె నిలువ నియమించి, మాగధియు, దానును మేని ధూళి గడిగికొని, ధౌత పరిధానములు ధరించి, పాదచారమున లోనికి ప్రవేశించి, స్వగురుభక్తిభావమయమై స్పందించు డెందముతోడ ఆశ్రమము గలయ జూచి, మానవశిరోమణి మానవతీ చూడామణితో నిట్లనియెను. 48

అవతరణముసేసి=దిగి, సంక్షోభ+పరిశ్రాంతములయిన+రథ్యముల=వ్యాకులతవలన+ఎక్కువగా అలసిన+ గుఱ్ఱముల, ముదల=ఆజ్ఞ, ప్రత్యంతర=దగ్గర ఉన్న, భృత్యవర్గము=బంట్లు, ధౌత+పరిధానములు= ఉతికిన+ బట్టలు, స్పందించు+డెందమున=మనోవ్యాపారముకల+హృదయముతో, కలయ జూచి= అంతటాచూచి, మాగధి=మగధాధీశుపుత్రి-సుదక్షిణ

సీ. "పరిణత సత్త్వసంపద కధిష్ఠానము/నిస్స్వార్థనిరతికి నిలువనీడ,
తారకబ్రహ్మవిద్యకు కేంద్రపరిషత్తు/స్వాధ్యాయమునకు నేకైక సంస్థ,
చిరభారతీయసంస్కృతికి ప్రతీకము/పావిత్ర్యమునకు సబ్రహ్మచారి,
జాతివైషమ్యబీజముల కూషరభూమి/కామవాసనలకు కాని వావి,
అంచితాస్తిక్యబుద్ధికి కంచుకోట/అలఘువిజ్ఞానయాత్రకు వెలుగు బాట,
దేవి! కనుగొమ్ము, సుకృతసంజీవనమ్ము/పావనమ్ము, మహర్షి తపోవనమ్ము. 49

(ఆర్షధర్మపు మూలవిలువల ఆశ్రయంగా, వాని ఆచరణ, శిక్షక, ప్రాచుర్య కేంద్రముగా ఆశ్రమ వర్ణన.) పరిణత+ సత్త్వ+సంపదకు+అధిష్ఠానము=పరిపాకమైన+సత్త్వగణ+సమృద్ధికి+అధికారపీఠము, నిస్స్వార్థ+నిరతికి+ నిలువనీడ=స్వార్థములేకుండుట అందు+మిక్కిలి ఆసక్తికి+ఆశ్రయము, తారక+బ్రహ్మ+ విద్యకు+కేంద్ర+ పరిషత్తు=ఉద్ధరించు+పరమాత్మను తెలుపు+జ్ఞానమునకు+మౌలిక+నిర్ణాయకసభ, స్వాధ్యాయము నకున్+ఏకైక+సంస్థ=సమగ్ర వేదాధ్యయనమునకు+ఒకేఒక+స్థానము, చిర+భారతీయ+ సంస్కృతికి+ ప్రతీకము=సనాతన+భారత+సంస్కారమునకు+ప్రతిబింబము, పావిత్ర్యమునకు+సబ్రహ్మచారి= పవిత్రతకు +సహవిద్యార్థి, జాతి+ వైషమ్య+బీజములకు+ఊషర భూమి=జాతుల+విడదీయు విషమ+విత్తనాలకు+ మొలకలెత్త లేని చవిటినేల, కామ+వాసనలకు+కాని+వావి=కామ+ప్రవృత్తికి+ప్రతికూల+స్థానము, అంచిత +ఆస్తిక్య+బుద్ధికి+కంచుకోట= పూజ్యమైన+భగవంతునిఅందు+నమ్మకమును+మిక్కిలి రక్షించుస్థానము, అలఘు+విజ్ఞాన+యాత్రకు+ వెలుగుబాట=దీర్ఘ+జ్ఞానసముపార్జన+ప్రస్థానమున+దారిచూపు దివిటీ, సుకృత+సంజీవనమ్ము= పుణ్యములకు+సహజీవనము,

ఉ. తామరపూవుచుట్టము మొదల్ మనవారికి మాన్యమూర్తి, ఉ
ద్దామపతివ్రతామకుటదామ మరుంధతి కింటి వేల్పు, ని
స్సీమతపోగరిష్ఠుని వసిష్ఠుని శ్రీ పదభద్ర చిహ్న ము
ద్రామయమైన యీ వనపదంబును గంటిమి, మంటి, ముగ్మలీ!. 50

తామరపూవు+చుట్టము+మొదల్=తామరపూవు+బంధువు-సూర్యుని+మొదలుకొని, మనవారికి=మన వంశము వారికందరికి, మాన్యమూర్తి=పూజ్యనీయుడు, ఉద్దామ+పతివ్రతా+మకుట+దామము=గొప్ప+ పతివ్రతలో+శ్రేష్ఠకిరీట+ధారిణి, అరుంధతికి+ఇంటివేల్పు=అరుంధతీదేవికి+భర్త, నిస్సీమ+తపో+గరిష్ఠుని =అంతులేని+తపస్సుచేయువారిలో+శ్రేష్ఠుడు, వశిష్ఠుని+శ్రీ+పద+భద్ర+చిహ్న ముద్రా+మయమైన=వసిష్టుని +శుభము+కలిగించు శ్రేష్టమైన+పాదముద్రలు+వ్యాపించిన, వనపదంబునున్+కంటిమి=వన్యాశ్రమమున+ చూచితిమి, మంటిమి+ఉగ్మలీ=జన్మధన్యమయినది+వనితా,

చ. అరణిసమిత్పవిత్రకుసుమాహరణంబు ముగించి, కాననాం
తరముల నుండి సాంధ్యవిధితత్పరతాత్వరమాణచిత్తులై
మరలిరి, చూచితే! భువనమాన్యులు, తాపసు లాహితాగ్ను, లి
త్తరి నెదురేగు వారికి, నితంబిని! అగ్నులదృశ్యరూపులై. 51

అరణి+సమిత్+పవిత్ర+కుసుమ+ఆహరణంబు+ముగించి=మథించిననిప్పుపుట్టించెడికొయ్యలు+సమిధలు+ దర్భలు+పువ్వులు+సంగ్రహణము+ముగించుకొని, కానన అంతరములనుండి=ఇతర అడవుల నుండి, సాంధ్యవిధి+తత్పరతా+త్వరమాణ+చిత్తులై+మరలిరి=సాయంకాల సంధ్యావందవాది క్రియలనుచేయు+ దీక్షచే+తొందరపడుచున్న+మనస్సుతో+వెనుదిరిగివచ్చు, భువన+మాన్యులు=జగమంతటికి+పూజ్యులు, ఆహితాగ్నులు=అగ్నికార్యము చేయవారు, నితంబిని!=వనితా! అగ్నుల+అదృశ్య+రూపులై=గార్హపత్య ఆహవ నీయ దక్షిణాగ్నులుకు+మనము కనలేకపోయిననూ+మూర్తిమంతులైనవారు,

క. బంతులు తీర్చెను నివ్వరి/వంతులకై పర్ణశాలవాకిలి కడ్డం
బింతింతలు, ముని పత్నుల/సంతానము బోని, హరిణశాబము లవిగో. 52

బంతులు+తీర్చెను=వరుసలు+కట్టినవి, నివ్వరి=తనంతట తానే పండెడి వరికి, వంతులకై=తమవంతుకై , ఇంత+ఇంతలు=చిన్న+చిన్నవి, సంతానమున్+పోని=బిడ్డడ్డల+పోలిన, హరిణ+శాబములు=జింక+కూనలు,

క. సలిలంబు పోసి, తోడనె/ఎలమ్రాకుల కెడగ చనిరి ఋషికన్యలు, పా
దులనీరు ద్రావ సెగబడు/పులుంగులకు నమ్మకమును పుట్టింప, జమీ!. 53

సలిలంబున్+పోసి=(చెట్లకు)నీరు+పోసి, తోడనె+ఎల+మ్రాకులకు+ఎడగ+చనిరి=వెంటనే+లేత+చేట్లవద్దకు+దూరముగా+వెళ్ళిరి, ఎగన్+పడు=పరుగెత్తి+వచ్చు, పులుంగులకు=పిట్టలకు,

ఆ. నెమరువేయుచుండె నిడుగన్నులరమోడ్చి/కలికి! చూడు, వెట్టకారు చనుట,
పూరిపంట కుప్పవోసిన ముంగిళ్ళ/కూరుచుండి, లేటికొదమచాలు. 54

నిడు+కన్నులు+అర+మోడ్చి=పొడపైన+కన్నులు+సగము+మూసి, వెట్టకారు+చనుట=వేసవి+సమాప్తమవగా, పూరి=గడ్డి, లేటి+కొదమ+చాలు=జింక+పిల్లల+సమూహము,

తే. హోమధూమము, లవిగొ! అభ్యుత్థితాగ్ని/సూచకములు, హవిర్గంధసురభిళములు,
గాలితో దేలివచ్చి, అంగములు సోకి/తెఱవ! అభ్యాగతుల పవిత్రీకరించు." 55

అభ్యుత్థిత అగ్నిసూచకములు=శుభమును తమమూడుకీలలచే సూచించుచు, హవిర్+గంధ+సురభిళములు=అగ్నిలోవేసిన పదార్థముల+వాసనలతొ+పరిమళించునవి, అభ్యాగతుల+పవిత్రీకరించు=వచ్చువారిని+పునీతులచేయును,

వ . అని తన వల్లభకు తదాశ్రమప్రశాంతవాతావరణ రామణీయకముగూర్చి యుపన్యసింపుచు, శిరఃకంపము సేయుచు, వచ్చుచుండ, అతనిరాక యెఱింగిన మైత్రావరుణిచే నియమితులయిన, సభ్యతపోధనులు, సంప్రదాయానుగుణ్యముగ రాజమిధునమునకు ప్రత్యుత్థానము సేసి, అర్ఘ్యపాద్యమధుపర్కాద్యుపచారము లాచరించి, తదభివాదములు స్వీకరించి, సబహుమానముగా వారిని కులపతి సకాసమునకు గొనివచ్చిరి. 56

వల్లభ=భార్య, రామణీయకము=మనోహరత, శిరఃకంపము+సేయుచు=సంతోష సూచకముగా+తల ఊపుచు, మైత్రావరణిచే=వసిష్ఠునిచే, సభ్యతపోధనులు=తపమేధనమనిభావించి ఆశ్రములోనివసించువారు, సంప్రదాయ+అనుగుణ్యముగా=పద్ధతి+ప్రకారము, ప్రత్యుత్థానము=పెద్దలువచ్చినప్పుడు లేచుట మొదలగు గౌరవ ప్రదర్శన, అర్ఘ్య+పాద్య+మధుపర్క+ఆది+ఉపచారములు+ఆచరించి=త్రాగుటకు+కాళ్ళుకడుగుటకు నీళ్ళిచ్చుట+పంచల చాపు సమర్పించుట+మొదలగు+రాజోపచారములు+చేసి, తత్+అభివాదము=వారి+ గోత్రనామములు చెప్పి పాదములు సోకి మ్రొక్కుటను, స బహుమానము=సగౌరవముగా, కులపతి+సకాసము=వశిష్ఠుని+సమక్షమునకు,

సీ. కాలోచితములైన కరణీయములు తీర్చి/అజినాసనంబున అత్తమిల్లి,
రమణీయసుచరితరాసి ఆరంజ్యోతి/పాదసంవాహనో పాస్తి సేయ,
అత్యంతసుప్రసన్నాత్ముడై విలసిల్లు/బ్రహ్మసంయమిగణప్రథము జూచి,

పరమవిశ్వాసతాత్పర్యనిర్భరభక్తి/వినయసంభ్రమములు పెనగొనంగ,
దరిసి, యా దివ్యవిజ్ఞానదంపతులకు/అర్థి సపరిగ్రహముగ సాష్టాంగ మెఱగి,
హస్తములు దోయిలించి, ప్రత్యవయవంబు/పులకపటలము ప్రోవుగా, నిలచి యుండ. 57

కాలోచితములైన=ఆ సాయంకాలమునకు సంబంధించిన, కరణీయములు+తీర్చి=సంజ జప హోమాదులు +అనుష్ఠించి, అజిన+ఆసనంబున+అత్తమిల్లి=జింకచర్మము+ కూర్చున్నకంబళిగా+ఉండి, రమణీయ+సుచరిత +రాసి+ఆరంజ్యోతి=ఒప్పైన+పతివ్రతాధర్మముల+ప్రోగైన+అరుంధతి దేవి, పాద+సంవాహన+ఉపాస్తి+ సేయ=పదములు+పట్టి+పూజ+చేయ, అత్యంత+ సుప్రసన్న +ఆత్ముడై+విలసిల్లు=అధిక+అనుగ్రహముకల+మనస్సు కలవాడై+ప్రకాశించు, బ్రహ్మసంయమి+గణ+ప్రథము= బ్రహ్మర్షుల+ కూటమిలో+మొట్టమొదటివాని, పరమ+ విశ్వాస+తాత్పర్య+నిర్భర+భక్తి=గాఢ+నమ్మకమైన+ఉద్దేశమున+ మిక్కిలి+భక్తితో, వినయ+సంభ్రమములు+ పెనగొనంగ=నమ్రత+ఉత్సాహము+ఆవరించ, దివ్యవిజ్ఞాన= బ్రహ్మజ్ఞానము తెలసినవారైన, అర్థి+సపరిగ్రహముగ సాష్టాంగము+ఎఱగి=భక్తితో+భార్యతోకూడి+అష్టాంగముగ+ నమస్కరించి, ప్రతి అవయవంబు+పులక+ పటలము+ప్రోవుగా=దేహమంతా+గగుర్పాట్ల+సమూహ+రాశియై,

వ. అరుంధతీ వసిష్ఠులు గాఢాదరమున సుదక్షిణాదిలీపుల నాశీర్వదించి, అభినందించిరి. పదంబడి, ఆతిథ్యక్రియాశాంతరథక్షోభపరిశ్రముడయిన, యా రాజ్యాశ్రమమునికుంజరుని, మునికుంజరుడు రాజ్యమునకు సంబంధించిన సార్వాత్రికకుశలంబును, ఆగమన కారణంబును అడిగిన, అధర్వవిశారదునకు అభిధాకుశలు, డర్థపతి కుట్మలితకరకమలుడై, సర్వమును కుశల సంపన్నమె యని విన్నవించి, యావిషయమును మరల నిట్లని విస్తరించెను. 58

అభినందించిరి=మెచ్చుకొనిరి, పదంబడి=మఱియు, ఆతిథ్య+క్రియ+ఆశాంత+రథ+క్షోభ+పరిశ్రముడు= అతిథి సత్కారము+చేయుటవలన+పూర్తిగాపోయిన+రథముయొక్క+చలనములచేత కలిగినట్టి+మిక్కిలి శ్రమకలవాడు, రాజ్య+ఆశ్రమ+ముని+కుంజరుడు=రాజ్యమనెడి+ఆశ్రమమందు+మననశీలుడైన+శ్రేష్ఠుని-దిలీపుని, ముని+కుంజరుడు=మననశీలులలో+శ్రేష్ఠుడైన వసిష్ఠుడు, సార్వత్రిక=ఎల్ల విషయములకు సంబంధించిన, అధర్వ+విశారదునకు=వేద+విద్వాంసునకు, అభిధా+కుశలుడు=చెప్పుటయందు+నేర్పరి, అర్థపతిః=ధనేశ్వరుడగు దిలీపుడు, కుట్మలిత=ముకుళిత, కర కమలుడై=కమలములవంటి చేతులు కలవాడై, సంపన్నమె=కూడినది,

తే. "సర్వతోభద్రములు తీగసాగు టరుదె/మాకు, సప్తాంగములకు, త్రిలోకమాన్య !
దైవమానుషజనితాపదలకు నెల్ల/అదనుతప్పక చక్ర మీ వడ్డుపేయ? 59

సర్వత్ర+భద్రము=అంతటా+శుభము, తీగసాగుట+అరుదె=వర్ధిల్లుట+ఆశ్చర్యమా, సప్త అంగములకు=ఏడంగములుగల రాజతంత్రములకు( స్వామి అమాత్యుడు సుహృత్తు కోశము రాష్ట్రము దుర్గము సైన్యము), త్రి+లోక+మాన్య=మూడు+లోకములందు+పూజ్యుడా, అదను+తప్పక=యుక్తసమయము+దాటక, దైవ+మానుష+జనిత+అపదలకు=దైవముచేత(అగ్ని వరదలు వ్యాధులు కఱవు జననష్టం)+మనుష్యులచేత (ఆయుక్తులు చోరులు శత్రురాజులు రాజవల్లభులు రాజుయొక్క లోభము)+కలుగు+ఆపదలకు, చక్రము+ఈవు+అడ్డువేయ=రక్షాచక్రము+మీరు+అడ్డువేయుచుండగా,

సీ. నిత్యము,గురుదేవ! నీ వుషర్బుధునందు/విధియుక్తి వేల్చు హవిష్యరాశి
వానలై నెల మూడు వర్షింప, పైరులు/మట్టినుండి పసిండి గుట్టలెత్తు;
మంత్రసిద్ధుడవు, నీ మంత్రము లవలీల/తెరమఱుంగుననె, మార్తుర నడంచి,
దృష్టలక్ష్యముల భేధించు, తప్పిన దప్పు/నని యెత్తి పొడుచు నాయంపగముల,
పరగు పురుషాయుషములు, నా ప్రజల కెల్ల/ఈతిభీతివ్యళీకరాహిత్యవృత్తి,
అంకితముకాదె! లోకకల్యాణమునకె/భవదజిహ్మ మహాబ్రహ్మ వర్చసంబు?. 60

నిత్యము=ప్రతిదినము, ఉషర్బుధునందు=అగ్నిలో, విధి+యుక్తి+వేల్చు+హవిష్య+రాశి=యథా+ప్రకారము+సమర్పించు+నేయిమొదలగుపదార్థముల+సముదాయము, పసిండి=బంగారమువంటి పంటలు, గుట్టలు+ఎత్తు=కొండలు+అవగ, మంత్ర+సిద్ధుడవు=మంత్ర+ప్రాప్తికలవాడవు, అవలీల+తెరమఱుంగు ననె=చులకనగా+వెనుకనుండి, మార్తురను+అడంచి=శత్రువుల+అణచి, దృష్ట+లక్ష్యముల+భేధించు=తన రాజ్యపుజనులనుండి కాని పరరాజ్యజనుల నుండి కాని కలుగు భయమును+గురిచూసి+ఛేదించును, తప్పినన్+తప్పున్+అని+యెత్తిపొడుచు+నా+అంపగముల=పొరపాటున+తప్పుచుండునని+అని(నీమంత్ర ములు)ఎగతాళి చేయుచుండును+నా+బాణములను, పరగు+పురుష+ఆయుషములు=పెంపొందు+పురుషు లయొక్క+ఆయువు, ఈతి+భీతి+వ్యళీక+రాహిత్య+వృత్తి=ఈతిబాధల+వెఱపు+అప్రియము+లేని+నడవడికతో, భవత్+అజిహ్మ+మహా+బ్రహ్మ+వర్చసంబు=మీ+తిన్నగాపోవు బాణపువంటి+గొప్ప+బ్రహ్మ+తేజమువలన,

క. గురుడవు, పరదైవంబువు/పరమర్షివి, పుత్రరూపపరమేష్ఠివి, నీ
వరసి యిటు ప్రోవ, మను, నా/సిరులకు ఎడతెగమి ఏల చేకుఱకుండున్? 61

పుత్ర+రూప+పరమేష్ఠివి=పుత్రుడి+రూపముధరించిన+పరబ్రహ్మవు, అరయు=తెలిసికొని, ఇటు+ప్రోవ =పైవిధముగా+పోషింప, మను+నా+సిరులకు=వృద్ధిపొందు+నా+సంపదకు, ఎడతెగమి+ఏల+చేకుఱక+ఉండున్ =విరామములేకుండుట+ఏవిధముగా+సిద్ధింపక+ఉండును,

క. కాని తదీయసుఖానూ/నానుభవంబునకు నోచనైతిని తండ్రీ!
యీ నీ కోడలి కడుపున/భానుకులాంకురము నొకని బడయగ లేమిన్.62

తదీయ+సుఖ+అనూన+అనుభవంబునకు=అటువంటిరాజ్య+సుఖము+వెలితిలేనిదిగా+అనుభవించుటకు, నోచనైతిని=నోచుకోనైతిని, భాను+కుల+అంకురము=సూర్య+వంశపు+మొలక-బిడ్డ, పడయగ=కలుగ

క. రతనము లనేక మీనియు/చతురుదధినవాంతరీపసమ్మితమయ్యున్
మతి కింపు గాదు వసుమతి/సుతవపురాశ్లేషసుకృతశూన్యుడ నాకున్. 63

ఈనియు=పుట్టించిననూ, చతుర్+ఉదధి+నవ+అంతరీప+సమ్మితము+అయ్యున్=నాలుగు+సముద్రములు+తొమ్మిది+ద్వీపములతో+కూడినది+అయిననూ, మతికి+ఇంపు+కాదు+వసుమతి=మనస్సుకు+ఇచ్చ+కుదరదు+ఈభూమిపై, సుత+వపుర్+ఆశ్లేష+సుకృత+శూన్యుడ=కొడుకుయొక్క+శరీర+ఆలింగన+పుణ్యము++లేనివాడైన,

సీ. చెవి మేలిమాట వేసిన అంతిపురిబోటి/కుడుగర చేమున్గ నొసగ నైతి,
పసుపాడి పొత్తిట బట్టి, ప్రేయసి పట్టి/జూపింప, గన్నార జూడ నైతి,
మాతృత్వమున నీదు మగువ జన్మ తరించె/నని దేవి నే గొనియాడ నైతి,
ఇగిరించె మా వంశవృక్ష, మైక్ష్వాకము/ప్రొడు వారదికంచు, మురియ నైతి,
పుత్రజాతుడ నను నిండు బొంద లేమి/వీతవిజయోదయం బైన నీతి నైతి,
జలధరావరణంబున చంద్రికావి/కాసమున దేల జాలని కలువ నైతి. 64

మేలిమాట=శుభవార్త, బోటి=చెలికత్తె, ఉడుగర=కానుకగ, చే+మున్గ=చేతి+నిండా, ఒసగను+ఐతి=బహుమానము ఇవ్వ+లేకపోతి, పసుపాడి=పసుపు రాసుకునిస్నానముచేసి, పొత్తిటన్=మెత్తని సన్నని పాత వస్త్రమున, పట్టి=కుమారునిపట్టుకొని, మగువజన్మ=స్త్రీత్వము, ఇగిరించు=చిగిరించె, ఐక్ష్వాకము+ప్రొడువారదు+ఇక+అంచు=ఇక్ష్వాకు వంశము+గొడ్డుపోదు+ఇంక+అనుకొనుచు, మురియనైతి=సంతోషించ లేకపోతిని, పుత్రజాతుడను+అను+నిండు+పొంద+లేమి=పుత్రులుకలవాడను+అను+పూర్ణత్వము+పొంద+లేనినేను, వీత విజయ ఉదయంబు ఐన+నీతిని+ఐతి=విజయము సాధింపలేని+రాజనీతిని అయితిని, జలధర+అవరణంబున+చంద్రికా+వికాసమునన్+తేలన్+చాలని+కలువను+ఐతి=మేఘము+కప్పుటచే+వెన్నెల+విరియ+సంతోషింప+లేని+కలువగా+ఐతిని,

సీ. నాయనంతరము పిండప్రదానము, నివా/పాంజలుల్ శూన్యము లగుట దలచి,
ముచ్చిరి మూన్నాళ్ళముచ్చట తమ యూర్ధ్వ/గతి యని కలగు మాపితృగణంబు,

శ్రాద్ధవేళల స్వధాసంగ్రహనిరతులై/తృప్తితీర భుజింప రేమొ? నేడు
వేడి నిట్టూర్పుల వెచ్చనైన మదర్పి/తోదకంబును త్రావుచున్న వారొ?
క్రతుముఖంబున, ఆత్మ వికాసమంది/పుత్రరాహిత్యమున, ముచ్చముడిగి యుంటి,
లోన దేదీప్య మానమై పైన నిరులు/కారుకొను చక్రవాళనగంబు, రీతి. 65

పిండ+ప్రదానము=పిండము+పెట్టుట, నివాప+అంజలుల్=పితృదేవతలకు విడుచు తిలోదకములు చేయు+దోసిళ్ళు, ముచ్చిరి=దుఃఖముపొందిరి, మూన్నాళ్ళముచ్చట=దిలీపుడు ఉన్నన్నాళ్ళు మాత్రమే, ఊర్ధ్వగతి=స్వర్గప్రాప్తి, కలగు=చింతించెడి, శ్రాద్ధ+వేళల=తద్దిన+సమయమున, స్వధా+సంగ్రహ+నిరతులై=శ్రాద్ధము+తీసుకొను+ఆసక్తికలవారలై, నేడు+వేడి+నిట్టూర్పుల+వెచ్చనైన=ఇప్పుడు+వారివేడి+నిట్టుర్పులశ్వాసవలన+వెచ్చగా మారిన, మత్+అర్పిత+ఉదకంబును=నాచే+అర్పించిన+నివాపజలమును, క్రతుముఖంబున=యజ్ఞములు చేసి, ఆత్మవికాశము+అంది=ఆత్మాజ్ఞానము+ఆర్జించి(దేవఋణముతీర్చు కొని), పుత్రరాహిత్యమున=పుత్రులు లేమిచే(పితృఋణము తీర్పలేనివాడనై), ముచ్చముడిగి+ ఉంటి=మిక్కిలి చేష్టలుడుగి+ఉన్నాను, లోన+దేదీప్య మానమై=కొండలోపల +మిక్కిలిప్రకాశవంతమై, పైనన్+ఇరులు+కారుకొను=ఉపరిభాగమున+అంధకారము+క్రమ్ముకొను, చక్రవాళము=లోకాలోకమను పర్వతము(ఈ పర్వతము సర్వవిశ్వమును చుట్టియుండి లోపలసూర్యతేజముతో వెలుగుతూ వెలుపలిభాగమంత అంధకారముకలదని పురాణము),

క. దారుణ దురంతపీడా/కారకమై యేచు, దేవ! కడయప్పు, ననున్,
నీరాడని కరిణీవిభు/గారియ పాల్సేయు, కట్టుకంబము, కరణిన్. 66

దురంత+పీడ+కారకమై+ఏచు=అంతులేని+బాధ+కారణమై+వేధించు, కడ+అప్పు=మనిషికున్న మూడు (దేవ,ఋషి,పితృ)ఋణములలోఆఖరిదైన+పితృఋణము, నీరాడని+కరిణీవిభు=వ్రణబాధచే స్నానములేక కట్టబడిన+ఏనుగు(ఏనుగుకు స్నానము ముఖ్యము), కారియ పాలు+సేయు=యాతనపాటు+కలిగించు, కట్టుకంబము=పుండును రాపిడి చేయునట్టి ఏనుగులకట్టు రాట,

తే. కడుపు పండిన యిల్లాండ్ర గలిమి లేమి/దలచి, తనలోన, దా, గుమారిలును గాని,
చూడరానీదు, నన్ను, మీ స్నుష, యొకింత/అణువణువునందు రగులుచున్నట్టి వంత.67

కలిమి+లేమి=భాగ్యము+లేకపోవుట, తాన్+కుమారిలు=తను+కుములు, చూడరా నీదు=బయటపడనీదు, స్నుష=కోడలు, అణుఅణువునందు=దేహమంతా, రగులు=మండు, వంత=బాధ,

క, పరలోక సుఖమె యలవడు/పరమతపోదానపుణ్యపరిపాకమునన్!

పరిశుద్ధ సంతతియె, ఇహ/పరములు రెండింట, పొందు పరచు సుఖంబున్. 68

పరమ+తపో+దాన+పుణ్య+పరిపాకమునన్=గొప్ప+తపస్సు+దానములచే+ఆర్జించినపుణ్యము యొక్క+పరిణామముగా, పరిశుద్ధ=మిక్కిలియోగ్యులైన, ఇహ+పరములు=ఈలోకము+పైలోకములు,

చ. తళతళ లాడు లేమొలక దంతములన్ వెలిబెట్టి నవ్వుచున్,
జిలిబిలి కమ్మతేనియలు చిప్పిల వచ్చియురాని క్రొన్నుడుల్,
పలుకుచు, డాసి, మీది, కెగబ్రాకిన, బిడ్డల మేనిధూళిచే,
మలినితదేహులైన యల మానవు లెయ్యవినోచిరో కదా!. 69

తళతళ=మిఱుమిట్లు గొలుపు, లే+మొలక+దంతములన్=క్రొత్తగా+మొలచినచిన్న+పండ్లను, వెలిబెట్టి=పైకిచూపి, జిలిబిలి=మనోహర, కమ్మ=మధుర, చిప్పిల=కాఱునట్లు, క్రొన్నుడుల్=క్రొత్త+నుడుల్=క్రొత్త+మాటలు, డాసి=దగ్గరకువచ్చి, మలినిత=ముఱికిచేయబడ్డ, నోచిరొ=ఏవ్రతము చేసిరో,

మ. నను, తద్భాగ్యవిహీను, దుర్భరవిషణ్ణస్వాంతు నీ శిష్యునిన్
కని, నీ వుమ్మలికంబు నొందవె? ప్రతీకారంబు జింతింపవే?
అనురక్తిన్ స్వయ మీవు తోయములు పోయం బ్రోదియై గొడ్డువో
యిన నీ యాశ్రమవృక్షకంబు గని, తండ్రీ! యిట్లు పేక్షింతువే?. 70

తత్+భాగ్య+విహీనుని=పుత్రుల+భాగ్యము+లేనివాడిని, దుర్భర+విషణ్ణ+స్వాంతు=భరింపలేని+విషాదము పొందిన+మనస్సుకలవాడిని, ఉమ్మలికము=దుఃఖము, ప్రతీకారము=ప్రతిక్రియ, తోయములు=నీరు, ప్రోదియై =పెంపబడినదై, గొడ్డు=మోడైన, వృక్షకంబు=చిన్నమొక్కను, ఉపేక్షింతువే=ఉదాసీనత చూపిస్తావా,

శా. అక్షంతవ్యమె అస్మదీయమగు పూర్వాగంబు? పూర్వర్ణని
ర్మోక్షోపాయము జూపి నన్ను చరితార్థుం జేయవే, దేవ! నీ
శిక్షారక్షణశక్తి మే మెఱుగమే? సిద్ధింపవే మున్ను నీ
దక్షత్వంబున మాకులీనులకు వైధాత్రేయ! దుర్లభ్యముల్". 71

అక్షంతవ్యమె+అస్మదీయమగు+పూర్వ+ఆగంబు=అంతక్షమించరానిదా+నాదైన+వెనుకటి+పాపము, పూర్వ+ఋణ+నిర్మోక్ష+ఉపాయము=పూర్వ+పాపమునుండి+నిశ్శేషవిముక్తి+సాధనము, శిక్షా+రక్షణ+శక్తి=బోధించుట అందు+మంత్రశక్తిచేరక్షించుటఅందు+కలసామర్థ్యము, సిద్ధింపవే=కలుగునట్లుచేసితివికదా, దక్షత్వంబున=సామర్థ్యముతో, మాకులీనులకు=మాఉత్తమవంశమందుపుట్టినవారికి, వైధాత్రేయ= బ్రహ్మపుత్రుడు-వశిష్ఠుడు, దుర్లభ్యముల్= దొరకసాధ్యముకానివి.

తే. అనుచు దిగ్గన లేచి యా మునివతంసు/చరణ పీఠము కడ చక్క జాగి మ్రొక్కి
అడుగుదామరదోయి చే నంటియున్న/ఆనృపుని లేవనెత్తి ఆసీను జేసి. 72

ముని+వతంసు=మునులలో+భూషణని, చక్కన్+చాగి+మ్రొక్కి=బాగా+నేలకువ్రాలిసాష్టాంగముగా +నమస్కరించి, అడుగు+తామర+దోయి=పాద+పద్మములు+రెంటిని, చే+అంటి+ఉన్న=చేతులతో+పట్టుకొని+ ఉండగా, ఆసీను=కూర్చుండ,

తే. వత్సలత్వము పల్లవింపగ దిలీప/సంతతిస్తంభహేతుజిజ్ఞాసు వయిన
తద్గురుడు సుప్తమీనప్రాదంబు భంగి/నిశ్చలధ్యానముకుళితనేత్రుడయ్యె. 73

వత్సలత్వము+పల్లవింప=బిడ్డపైవంటిప్రేమ+చిగురించ, సంతతి+స్తంభ+హేతు+జిజ్ఞాసువు=సంతతిని+ ఆపు+కారణము+విచారణచేయువాడై, సుప్త+మీనః+ప్రాదంబు+భంగి=నిద్రించుచున్న+చేపలుకల+మడుగు+ వలె, నిశ్చల+ధ్యాన+ముకుళిత+నేత్రుడయ్యె=స్థిరమైన+ధ్యానములో+మూసిన+కండ్లుకలవాడై,

వ. క్షణమాత్ర ప్రణిధానమున దత్కారణము తేటపడ తపోధనాగ్రణి,రాజాగ్రణితో " నీయపుత్రకతకు నిమిత్తము `కలదు, వినుము" 74

ప్రణిధానమున=చిత్తైకాగ్రతచే, తేటపడ=విశదమవ/తెలియ, నిమిత్తము=కారణము,

సీ. దేవేంద్రు దర్శించి నీవు మున్నొకనాడు/ధరకు గ్రమ్మఱుచుండ దారిలోన
మందాకినీతీర మందారముల నీడ/విశ్రాంతి గొనుచుండె వేల్పుగిడ్డి,
దేవి, ఋతుస్నాత, భావించుచును పర/ధ్యానమునంబడి యరుగు నీవు,
తనకు, ప్రదక్షిణ మొనరింప మఱచిన/కనలి నిన్ను శపించె కామదుహము,
అపుడు నదిలోన గీపెట్టు అభ్రదంతి/నిడుదరొదలోన లీనమై నీకు గాని,
సారథికి గాని, చెవిసోక జాలదయ్యె/చలిపిడుగువంటి శృంగిణి శాపవాక్కు. 75

క్రమ్మఱు=మరిలివచ్చు, మందాకిని=ఆకాశగంగ, మందారము=ఒక కల్పవృక్షము, వేల్పు+గిడ్డి=దేవతల+ ఆవు-కామధేనువు, దేవి=రాణి-సుదక్షిణాదేవి, ఋతుస్నాత=రజస్వలానంతరస్నానయైనది, మఱచిన= విడచిన, కనలి=కోపపడి, కామ+దుహము=ఇష్టార్థములను+పిండునది-కామధేనువు, గీపెట్టు= ఘీంకరించు, అభ్ర+దంతి=ఆకాశమునందుండు ఏనుగు-దిగ్గజము, నిడుద+రొదలోన+లీనమై=ధీర్ఘమైన+శబ్దములో+కలిసి పోయి, చెవిసోకన్+చాలదయ్యె=వినబడుటకు+అశక్తమైనది, చేలిపిడుగు=మంచు పిడుగు (ఆకాశమునుండి పడెడు మంచుగడ్డ), శృంగిణి+శాప+వాక్కు=ఆవు+శాపపు+మాట,

ఉ. ఔరసకాంక్ష ఎంత వరమైన, మహీశ! అనన్య దృష్టి పై,

చేరువ నున్న నన్ను నొక చీరికి గైకొన వైతి, గాన నా
కూరిమి బిడ్డ నా బదులు కొల్చి వినిష్కృతి సేయునంతకున్,
కోరిక, నీకు పండదని గోవు నినున్ శపియించె భూవరా. 76

ఔరస+కాంక్ష=కొడుకుమీద+కోరిక, వరమైన=శ్రేష్ఠమైనను, అనన్య+దృష్టిపై=వేరొకదానిపై+చూపుకలవా డవై, చీరికన్+కైకొనవైతి=లక్ష్య+పెట్టవైతివి, వినిష్కృతి=ప్రాయశ్చిత్తము, పండదని=లభింపదని,

తే. అట్లు, ములు దీయ బోయి కొఱ్ఱడచుకొన్న/పగిది, నీ వొక ధర్మలోపమును దలగి,
తగులుకొంటి, వసైచ్ఛికంబుగ మఱొక్క/తీవ్రతరమైన, ధర్మ వ్యతిక్రమమున. 77

కొఱ్ఱు+అడచుకొన్న+పగిది=మేకు+దింపుకున్న+విధముగా, తలగి=తొలగించుకొని, అసైచ్ఛికంబుంగ= అవాంఛితముగ, తీవ్రతరమైన=ముందుదానికంటెఅధిక మైన, వ్యతిక్రమమున=మీఱుట అందు,

తే. ఈ నిగర్హణవలన నీ కింతవరకు/భవ్యసంతానయోగము పట్టలేదు,
తెలియవే! పూజ్యపూజావ్యతిక్రమంబు/శుభసమాసాదనమునకు చుక్కవాలు. 78

నిగర్హణము=అధిక నింద, పూజ్య+పూజా+వ్యతిక్రమంబు=పూజార్హులయినవారి+పూజ+ఆచరింపక పోవుట, శుభ+సమాసాదనమునకు=శుభముల+సిద్ధింపచేయుటకు, చుక్కవాలు=ఎదురు చుక్క

వ. నియతి వశమున జరిగిన గతమును ద్రవ్వికొని విచారింపక, ప్రకృత మనుసరింపుము.
అపరాధము సైపుమని, పోయి, సప్రణామముగ, వేడికొందువన్నను,
నే డమరధేనువు చేరుగడకాదు, ఏలన, 79

నియతి=భాగ్యము(పూర్వజన్మార్జితమైన సుకృత దుష్కృత రూప కర్మము), ప్రకృతము=ఇప్పుడుచక్కగా చేయవలసిది, స ప్రణామముగ=నమస్కారముతో, చేరుగడ+కాదు=సమీపింప+లేవు,

తే. దీర్ఘసత్రము దలపెట్టి దివిజవరుని/సమ్మతిల జేసి తమ హవిస్సాధనముగ,
దాని గొనిపోయె, వరుణు, డనూనభుజగ/జాలదౌవారికంబు, పాతాళమునకు. 80

దీర్ఘ+సత్రము=చాలకాలముసాగు+యజ్ఞము, తలపెట్టి=సంకల్పించి, దివిజవరుని=ఇంద్రుని, హవిస్సాధనముగ=ఆజ్యాది హవిస్సుకు కావలిసినపాలకొఱకై, నూనము+భుజగ+జాల+దౌవారికంబు= పూర్తిగా+ పాములే+ఇనుప తీగలవలే అల్లు కొనిన+ద్వారములుకల,

వ. కావున దానికి ప్రత్యామ్నాయముగ, తదీయ ప్రసూతియు, మదీయ హోమగవియు నగు నందినియను

దానిని సపత్నీకముగ, నుపాసింపుము. ఇది సురభి వచనమున కనుగుణమయిన పద్ధతి. మనోవాక్క్రియా ప్రకారము లేకరూపమైన యారాధనమున, దాని చిత్తము బట్టితిపేని నీమనోరథ కల్పవల్లిక కుసుమించి ఫలించును" అని మైత్రావరుణి వక్కణించు చుండ 81

ప్రత్యామ్నాయము=బదులు, తదీయ+ప్రసూతి=కామధేనువు+బిడ్డ-నందిని, గవి=ఆవు, సపత్నీకముగ=భార్యతోకలిసి, ఉపాసింపుము=సేవింపుము, సురభి=కామధేనువు, మనో+వాక్+క్రియా+ప్రకారములు+ఏక రూపమైన=మనస్సు+వాక్కు+క్రియల+విధములు+ఒక్కటైనట్లు, మనోరథ+కల్ప+వల్లిక=కోరికలను+సంకల్పపు+తీగ, వక్కణించు=నొక్కి చెప్పు,

సీ. అమృతకుంభముబోని యాపీన భరమున/గమన వేగమున మాంద్యము జనింప,
మేని నిద్దపుగెంపు మెట్టిన సేలకు/కుంకుమాలేపము కొమరు గూర్ప,
ఎడదవ్వులనె చూచి ఎదురేగి మునికన్య/లూడిగ మొనరించి తోడి తేర,
క్రేపు గన్గొని పొంగి, చేపిన చిఱుచెచ్చ/పాలోడికలుకట్టి పరిమళింప,
పరిసరవనాంతరము నుండి మరలి వచ్చె/సంయమీంద్రుని యాహుతిసాధనంబు,
నందినీ నామ సైచికి, నరవరేణ్య/భాగ్యమయదేవతకు అనుప్రాస మనగ. 82

అమృత+కుంభముబోని=అమృతపు+కుండవంటి, ఆపీన=పొదుగు, మాంద్యము=మెల్లదనము, మేని+నిద్దపు+కెంపు=ఒంటి+దట్టమైన+ఎఱ్ఱదనము, మెట్టిన+సేలకు+కుంకుమ+ఆలేపము+కొమరున్+కూర్ప=అడుగు పెట్టిన+చోటుకు+కుంకుమ+అలికినట్లు+ మనోజ్ఞత+చేకూర్చగా, ఎడదవ్వు=కొంచముదూరము, ఊడిగము=పరిచర్య, తోడితేర=వెంటతీసుకొనిరాగ, క్రేపు=దూడ, పాలు+ఒడికలు+కట్టి=పాలు+తమంతటతామే +పారి, పరిమళింప=పాల వాసన వెదజల్ల, పరిసర=దగ్గఱఉన్న, అహుతి+సాధనంబు=అగ్నిపేలార్చునేయివంటి పదార్థములకు+సహాయపడునది, సైచికి=చక్కని రూపమునుమంచి ప్రాయమును కలిగి సమృద్ధిగా పాలిచ్చెడి ఆవు, అనుప్రాసము=పోలినది

తే. చిగురు వన్నియ మెయితోడ మొగము మీది/అచ్చతెలిపెండ్రుకల వంకమచ్చతోడ,
చూడముచ్చట గొలిపి యాపాడి మొదవు/లేతనెలతోడి మలుసంజరీతి మెఱసె. 83

చిగురు+వన్నియ+మెయితోడ=చిగురుటాకు మేలిబంగారము+వర్ణపు+ఎఱ్ఱనిదేహముతో, అచ్చ+తెలి+వెండ్రుకల+వంక+మచ్చతోడ=స్వచ్ఛమైన+తెల్లని+వెంట్రుకలు+చంద్రవంక వంటి+మచ్చగాఉండగా, మొదవు=ఆవు, లేత+నెల+తోడి=చిన్న+చంద్రరేఖ+కలిగిన, మలు+సంజ+రీతి+మెఱసె=సాయం+సంధ్యాకాల+అరుణిమ వలె+వెలిగె,

తరువోజ: తన ఖురోద్గతమగు త్రసరేణు పటలివాయువులో దేలివచ్చి మేనంటి,
సావిత్రునకు తీర్థసలిలాభిషవణ పావిత్ర్యగరిమ నాపాదించుచుండ,
పఱతెంచుచున్న యా బహుపుణ్యమూర్తి/సౌరభేయిని, జూపి, శకునసంవేది,
సంయమి, నుడివె, ఆశంసితావంధ్య/సంప్రార్థనునకు, కోసలమహీనునకు. 84

ఖురు+ఉద్గతమగు+త్రసరేణు+పటలి=డెక్కలచేత+రేగిన+గడ్డిధూళిరేణు+సమూహము, మేనంటి=శరీరముపై పడి, సావిత్రునకు+తీర్థ+సలిల+అభిషవణ=సూర్యునిపైకి ధూళి ఎగిరి+పుణ్యతీర్థముల+జల+స్నానపు, పావిత్ర్య+గరిమ+స+ఆపాదించుచుండ=పవిత్రత+గొప్పదనము+బాగా+కలిగించుచుండ, పఱతెంచు =పరుగునవచ్చు, సౌరభేయి=ఆవు, శకున+సంవేది=శకునశాస్త్రము+బాగుగాతెలిసినవాడు, ఆశంసిత+ అవంధ్య+సంప్రార్థనునకు=ఇష్టమైనకోరిక+గొడ్డువోకసఫలమౌనట్లు+బాగావేడుకొను, నుడివె=చెప్పెను,

తే. "చేరువయ్యె ఆపేక్షితసిద్ధి నీకు/పురుషకారమె తడవుగ, పురుష తిలక!
తన ప్రసంగము పుట్టినంతటనె వచ్చె/పరమ కల్యాణి చూడు మీ సురభిరాణి. 85

చేరువయ్యె+ఆపేక్షిత+సిద్ధి=దగ్గరైనది+కోరుకున్నవాంచిత+ప్రాప్తి, పురుషకారమె+తడవుగ=పురుష ప్రయత్నమే+ఆలస్యముగ, ప్రసంగము=మాట

క. ఫలమూలము లశనంబుగ/మెలకువతో పగలు వెంట మెలగుచు నెమ్మిన్,
బలుసాధనమున విద్యను/బలె, దీని బ్రసన్న జేసి, పడయుము సిద్ధిన్. 86

ఫల+మూలములు+అశనంబుగ=పండ్లు+కందమూలములు+ఆహారముగ ఉండి, మెలకువతో=జాగ్రత్తగా, మెలుగుచు+నెమ్మిన్=సంచరించుచు+ప్రేమతో, పలు+సాధనమున+విద్యను+బలె=అనేక+ఉపకరణముల (విధ్యను అభ్యాసించువిద్యార్థివలె బ్రహ్మచర్యము, కందమూలఆహారము, గురుసేవ, తపస్సు, మొదలైన నియమములతో), ప్రసన్నన్+చేసి=సంతుష్టి+చేసి, పడయుము+సిద్ధిన్=పొందుము+ఇష్టప్రాప్తి,

చ. పలపలవేగ రేపకడ భక్తిమయప్రయతాంతరంగయై,
మలయజకుంకుమప్రసవమాలికలం గయిసేసి మ్రొక్కి నీ
కులసతి, యాతపోవనము గోవుబడిం జని, సాగనంపి రా
వలయు, దినాంతమం దచట వార్చి యెదుర్కొని తోడి తేవలెన్. 87

పలపల+వేగ=తెల్లవాఱుటఅందనుకరణము+త్వరగ, రేపకడ=ప్రాతఃకాలము, భక్తి+మయ+ప్రయత+అంతరంగయై=భక్తి+నిండిన+పరిశుద్ధ+మనస్సుకలదై, మలయజ+కుంకుమ+ప్రసవ+మాలికలం+కయిసేసి+మ్రొక్కి= చందనము+కుంకుమ+పూల+దండలతో+అలంకరించి+ప్రార్థించి, నీకులసతి=నీభార్య, గోవుబడిం=ఆవువెంట,

సాగన్+అంపి=నదివరకుపోయి+పంపి, అచట+వార్చి=అక్కడే+ప్రతీక్షించి, ఎదుర్కొని=ఎదురుగా వెళ్ళి, తోడి+తేవలెన్=తనతో+తీసుకొనిరావలెను

క. అనుదినము నీవు, పదబడి/అనుయాయుల గ్రమ్మఱించి అడవికి జని యం
దనువర్తనమున ధేనువు/అనువున సేవింప వలయు అవధానమునన్ 88

అనుదినము=ప్రతిరోజు, పదబడి=అత్యంతము, అనుయాయుల+క్రమ్మఱించి=తోడవచ్చు వారల+వెనుకకు పంపి, అనువర్తనమున=అనుసరించి, అనుపున=కావలిగఆవుతోపాటువెళ్ళుచూ, అవధానమునన్=హెచ్చరికతో,

శా. ఏ యే వేళల నెయ్యెడం దిరుగు, నే యే చోటులన్ నిల్చు గో
వా యావేళల నయ్యెడం దిరిగి, ఆ యా చోటులన్ నిల్చుచున్,
తోయం బానిన దోయ మాని, పుడమిం గూర్చున్న గూర్చుండి, త
చ్ఛాయాపైఖరి వెంటనంటి చనుమీ! శ్రద్ధాగరిష్ఠుండపై 89

తోయంబు+ఆనిన=నీరు+త్రాగిన, పుడమిం=భూమిపై, తత్+ఛాయ+పైఖరి=తన+నీడ+వలె, శ్రద్ధా+గరిష్ఠుండపై =భక్తివిస్వాసములందు+మిక్కిలి గొప్పవాడిపై,

మ. అమృతప్రస్రవణీమతల్లి నిటు లన్వాసింపుమీ! దీని, డెం
దమునన్ మెచ్చి వరం బొసంగు వరకున్, దైవంబు తోడై, ప్రశ
స్తము నీ పూన్కి జయప్రదంబయి, అవశ్యం బీవు మీ తండ్రి చం
దమునం బుత్రవదగ్రగామి వగుమీ! ధన్యత్వముంబొందుమీ! 90

అమృత+ప్రస్రవణీమ+తల్లిని=పాలు+బాగుగాచేపు+గోమాతను, అన్వాసింపుమీ=సేవింపుమీ, ప్రశస్తము+నీ+పూన్కి=శ్రేష్టమైన+నీ+ప్రయత్నము, అవశ్యంబు=తప్పక, ఈవు=నీవు, పుత్రవద్+అగ్రగామివి+అగుమీ=పుత్రులున్నవారిలో+శ్రేష్ఠుడవు+అగుమీ,

వ. అని యానతిచ్చిన గురుబ్రహ్మ యాదేశంబును దేశకాలజ్ఞుడు, తదంతేవాసి విశ్వాసతాత్పర్యవినయ పూర్వకముగ, సకళత్రముగ, శిరసావహించె. మరునాడు వ్రతప్రారంభమునకు యోగ్యదినముగా నిరూపించి, వైధాత్రేయు డా దోషజ్ఞుని ప్రదోషకాలకరణీయములు నిర్వర్తింప బనిచె. పనిచి, నిజతపః ప్రభావంబున సకల రాజోపచారవస్తుసృజనమునకు సమర్థుడయినను మహర్షి యా రాజదంపతులకు వారనుష్ఠింపబోవు వ్రతచర్య కనుగుణముగ ఫలమూలభోజనమును, కుశశయనాద్యుపచార సామగ్రిని సమకూర్చెను.
91

ఆనతి=ఆజ్ఞ, ఆదేశంబును=ఉపదేశమును, దేశకాలజ్ఞుడు=ఏ ప్రదేశమున ఏ సమయమున ఏ పనులు నిర్వర్తించాలోతెలిసినవాడు, అంతేవాసి=శిష్యుడు-దిలీపుడు, విశ్వాస+తాత్పర్య+వినయ+పూర్వ కముగ= నమ్మకమైన+అభిప్రాయము+వినయము+మొట్టమొదటిదై, సకళత్రముగ=భార్యతోకలిసి, వైధా త్రేయుడు= వశిష్ఠుడు, ఆ+దోషజ్ఞుని=ఆ+చేయకూడని తప్పులను ఎఱిగినవానిని, ప్రదోషకాల+కరణీయములు+ నిర్వర్తింపన్+పనిచె=సంజకాల+అనుష్ఠానముల+చేయ+పంపెను. సృజనమునకు=పుట్టించుటకు, అనుష్ఠింప=ఆచరింప, కుశశయన+ఆది+ఉపచార=గడ్డిపఱకలపడక+మొదలగు+మర్యాద,

కవిరాజ విరాజితము. ప్రయతపరిగ్రహసంయుతుడై గురుపాదుడు చూపిన పర్ణకుటిన్
ప్రియమున జొచ్చి దినాంతవిధుల్ నెఱపేచ్చి, సమంచితకౌశబృసీ
శయనమునం గనుదోయి మొగిడ్చి విశాంపతి లేచె, వటుప్రవరా
ధ్యయనకలస్వరగాననివేదిత యామవతీ పరిణామమునన్. 92

ప్రయత=పట్టుదలవాడై, పరిగ్రహ+సంయుతుడై=భార్యతో+కలిసినవాడై, గురుపాదుడు=పూజ్యుడైన గురువు, సమంచిత+కౌశ+బృసీ+శయనము=ఒప్పైన+దర్భల+ఋషిఆసనపు+పక్కపై, విశాంపతి=దిలీప మహారాజు, వటు+ప్రవర+అధ్యయన+కల+స్వర+గాన+నివేదిత= బ్రహ్మచారులు+వేదప్రవర+ వల్లించు+అవ్యక్తమధుర +కంఠ+స్వరముచే+ఎఱిగింపబడిన, యామవతీ+పరిణామమునన్=రాత్రి+రూపుమారుట-తెల్లవారుటను.

# ద్వితీయ సర్గము వరప్రదానము

తే. వ్రతసముద్యుక్తు నిజకులోద్వహు దిలీపు/మెచ్చి ఆశీర్వదింపగ వచ్చె ననగ
ప్రాగ్దిశాపుణ్యవతినోము పసిడిపంట/అరుణుడుదయించె నుదయధరాగ్రసీమ. 1

వ్రత+సమ+ఉద్యుక్తు=వ్రతమునకు+సమస్తము+సిద్ధమైన, నిజ+కుల+ఉద్వహు=తన+కులమున+జనించిన, ప్రాక్+దిశా+పుణ్యవతి+నోము=తూర్పు+దిక్కుయనెడు+పుణ్య స్త్రీయొక్క+వ్రతపు, పసిడి=బంగారు, అరుణుడు =సూర్యుడు, ఉదయ+ధర+అగ్రసీమ=తూరుపు+కొండ+పైప్రాంతమున,

సీ. ప్రయతయై కోసలప్రభు జాయ రేపాడి/దూడకు జన్నిచ్చి తుష్టి గన్న
సౌరభేయికి గాళ్ళ బారాణి పట్టించి/తనువున మంచిగంధము నలంది,
పొట్టికొమ్ముల గమ్మపూవుటెత్తులు చుట్టి/మొగమున గుంకుమబొట్టు దిద్ది,
వలచుట్టి చేమోడ్చ, వడి దిలీపుడు దాని/మిహికాద్రివని బోకు మేయ విడిచె,
అదియు మసలక చనుచుండ ననుగమించె/ఆ సుదక్షిణ, గోఖురన్యాసపూత
పాంసు పథము, పతివ్రతాప్రథమగణ్య/శ్రుతిమహార్థము వెన్నంటు స్మృతి విధమున. 2

ప్రయతయై=పరిశుద్ధయై, కోసల+ప్రభు+జాయ=కోసల+ రాజు+భార్య-సుదక్షిణాదేవి, రేపాడి=ప్రాతః కాలము, చన్నిచ్చి=పాలుత్రాగనిచ్చి, తుష్టిన్+కన్న=తృప్తి+పొందిన, సౌరభేయి=ఆవు, కమ్మ=సువాసనగల, పూవు+ఎత్తులు=పుష్ప+సరములు, వలచుట్టి=ప్రదక్షిణించి, వడి=వేగముగా, మిహిక+అద్రి=మంచు+పర్వతము, పోకు=మంచుకవిసినగడ్డి, మసలక=జాగు చేయక, అనుగమించె=వెంబడించెను, గో+ఖుర+న్యాస=ఆవు+గిట్టలచే+విడువబడిన, పూత+పాంసు+పథము=పవిత్ర+ధూళి+మార్గమున, శ్రుతి+మహ+అర్థము+వెన్నంటు +స్మృతి= వేదముల+గొప్ప+అర్థము+వెంటఉండు+మన్వాది స్మృతులు,

ఉ. ఏలిక ఆశ్రమంబు తుదికేగి అటం దము సాగనంపు ఇ
ల్లాలిని గ్రమ్మఱించి, జలరాశులు నాల్గు శిరాలరూపమై
వ్రేలగ ధేనుభూమిక ధరించిన, పంటవలంతి బోని ఆ
వేలుపుగిడ్డిబిడ్డ వెనువెంట జనెన్, విపినాంతభూమికిన్. 3

ఏలిక=రాజు, క్రమ్మఱించి=వెనుకకుపంపి, జలరాశులు=సముద్రములు, శిరాలరూపమై+ప్రేలగ=పాలపొదుగు అందలి నాలుగు శిరల రూపు దాల్చి+ప్రేలాడ, ధేనుభూమిక=ఆవుఆకారమునఉన్న, పంటవలంతి=భూమి, వేలుపు+గిడ్డి+బిడ్డ=దేవతా+ధేనువు+బిడ్డ-నందిని, విపిన+అంత+భూమికిన్=అడవి+లోపలి+ప్రదేశమునకు,

క. చనుచు మరలించె మిగిలిన/అనుయాయులగూడ, వేడరన్యుల మఱువున్,
మనుకులమురాచకొడుకులు/పెనుకవచము తమకు స్వభుజవీర్యమె కానన్ 4

అనుయాయుల=వెంటవచ్చుపరివారము, వేడరు=కోరరు, అన్యుల=ఇతరుల, మఱువున్=రక్షణ, మను+కులము+రాచ+కొడుకులు=మను+సంతతి+రాజ+కుమారులు, పెను=గొప్ప, స్వ+భుజ+వీర్యమె+కానన్=తమ+భుజముల+ప్రతాపమే+అగుటచేత,

ఉ. ఆవును గాయుచుం దిరిగె నా దొర కారడవిన్ వ్రతార్థియై
తీవలతోడ బెన్నెఱులు తీరుగ బై కెగగట్టి భీషణా
శీవిషతుల్యమైన తన చేవిలు సజ్యము చేసి, ధేనుర
క్షావిధి సాకునన్ సెమకి కానిమెకంబుల జెండవచ్చె నాన్. 5

పెన్నెఱులు=వత్తైన జుత్తు, భీషణ+ఆశీ+విష+తుల్యమైన=భయంకరమైన+పాము+విషముతో+సమానమైన, సజ్యము+చేసి=ఎక్కు+పెట్టి, కాని+మెకంబు=క్రూర+జంతువు, చెండ+వచ్చె+నాన్=చంప+వచ్చెనో+అనగా,

సీ. మేలేర్చి కమ్మని మిసిమిపచ్చిక దెచ్చు/అందించు మూతి కాప్యాయనముగ,
వాలాగ్రమున మూగు వనదంశముల జోపు/కండూయనము సేయు గంగడోలు,
ఇచ్ఛానుగుణముగ సెందేని జననిచ్చు/మిసిమింతుడును గాక మెలగు బొదివి,
అలసి నిల్చున్న దీయని నీరు ద్రావించు/పదముల పీకువో పట్టి పిసుకు,
వాలుమెకముల పైగాలివలన నైన/అదిరిపడనీక అరయు నోరంతప్రొద్దు
సతతగోసమారాధనసక్తబుద్ధి/సతతగోసమారాధనసక్త బుద్ధి. 6

మేలు+ఏర్చి=మంచివి+ఏరి, మిసిమి+పచ్చిక=మెత్తని+గడ్డి, అప్యాయనముగ=తనివితీర, వాల+అగ్రమున=తోక+చివర, వనత్+అంశములన్+చోపు=అడవి+ఈగల+తరుము, కండూయనము=తీటపోవుటకు గోకుట, మిసిమింతుడు=అలసినవాడు, మెలగున్=ప్రవర్తించును, పొదవి=ఒప్పి, వాలు+మెకముల=క్రూర+జంతువుల, అరయును+ఒరంతప్రొద్దు=కాచును+దినమంతయు, సతత+గో+సమారాధన+సక్త+బుద్ధి=ఎడతెగని+ఆవు+పూజయందు+లగ్నమైన+ఆలోచనతో, సతత+గో+సమారాధన+సక్త+బుద్ధి=ఎల్లప్పుడు+భూమిని-ప్రజల+సంతోషపెట్టుట అందు+మునిగిన+అలోచనలుకలిగినవాడు,

శా. ఏ యే వేళల నెయ్యెడన్ మసలు, నే యే చోటులన్ నిల్చు గో
వా, యావేళల నయ్యెడన్ మసలి, ఆ యా చోటులన్ నిల్చుచున్
తోయం బానిన దోయ మాని, పుడమిం గూర్చున్న గూర్చుండి, త
చ్ఛాయావైఖరి వెంటనంటి కొలుచున్, సమ్రాట్టు శ్రద్ధాళు వై. 7

మసలున్=విహరించును, తోయంబు+ఆనిన=నీరు+త్రాగిన, పుడమిం=భూమిపై, ఛాయా+వైఖరి=నీడ+వలె, శ్రద్ధాళువై=శ్రద్ధగలవాడై,

(వసిష్ఠుడు ముందు సర్గ 89 పద్యంలో అనిన మాటలను తుచ తప్పకుండా దిలీపుడు ఆచరించాడు)

సీ. ప్రభులాంఛనములెల్ల పరిహరించిన నేమి/ఉరుతేజముననె రాసిరి వెలార్చి,
మదరేఖ వెలువరింపని యాముటేనుంగు/దొరయు నా అతిలోకపరివృఢునకు,
జయవెట్టె విహగనిస్వనదంభమున పార్శ్వ/తరుల మొత్తము, పార్శ్వచరుల లీల,
స్థానీయకన్య లాచారలాజలు వోలె/పిల్లతీవలు పూలజల్లు కురిసె,
ద్రుమము లెడనెడ చిగురుజొంపముల తోడ/జివ్వుమని మీదవంగి భజింప దొడగె
కుతకుత నదృశ్య విపినదేవతలు పట్టు/పట్టుకుచ్చుల ముక్తాతపత్రములుగ 8

ప్రభు+లాంఛనము=రాజ+చిహ్నములు-ఛ్చత్రచామరములు, పరిహరించిన=విడచిన, ఉరు+తేజముననె+రాసిరి+వెలార్చి=అధిక+మేనికాంతిచేతనే+రాజశోభ+ప్రకటించి, మద+రేఖ+వెలువరింపని+ఆముటేనుంగున్+తొరయున్=మదపు+రీతిని+పైకి చూపెట్టని+మదించినఏనుగు+మాదిరిగా, అతిలోక+పరివృఢునకు=లోకాతీత+ప్రభువుకు, విహగ+నిశ్వన+స్వన+దంభమున=పక్షుల+అరావ+ధ్వని+మిషచే, పార్శ్వ+తరుల+మొత్తము=ప్రక్కనున్న+చెట్ల+సమూహము, పార్శ్వచరుల+లీల=సేవకుల+ విధముగా, స్థానీయ+కన్యలు+అచార+లాజలు =పట్టణపు+కన్యలు+సాంప్రదాయపు+పేలాలు, పిల్ల+తీవలు+పూలజల్లు+కురిసె=లేత+తీగలు+పూలవాన+కురిపించె, ద్రుమములు+ఎడనెడ+చిగురు+జొంపముల=చెట్ల+అక్కడక్కడ+చిగురుల+గుంపుల, జివ్వు=ఆకుల కదలికధ్వనిఅనుకరణ, భజింప+తొడగె=సేవింప+ప్రారంభించె, కుతకుతన్=కుతూహలముతో, విపిన+దేవతలు+పట్టు=వన+దేవతలు+పట్టిన, ముక్త+ఆతపత్రములుగ=ముత్యాల+గొడుగులు అయినట్టు,

ఉ. దారుణభాస్కరాతపవితాడితగాత్రు, నిరాతపత్రు, నా
చారపవిత్రు, నప్పరమసాధుచరిత్రు భజించె ధీరసం
చారములై ఉపాంతగిరిశైవలినీలులదూర్మి శీకరా

సారములై చలత్కుసుమసౌరభచోరములై సమీరముల్. 9

దారుణ+భాస్కర+ఆతప+వితాడిత+గాత్రు=తీక్ష్ణమైన+సూర్యని+వేడి+దెబ్బకొట్టబడిన+శరీరము కలవాడు, నిర్ ఆతపత్రున్=గొడుగు (ఛత్రము) లేనివాని, ఆచార పవిత్రు=పవిత్రమైన ఆచారముకలవాని, భజించె =సేవించినవి, ధీర+సంచారములై=మెల్లగా+వీచినవై, ఉపాంత+గిరి+శైవలినీ+లుఠద+ఊర్మి+శీకర+ఆసారములై =సమీపపు+కొండక్రింది+ఏరులందు+పొర్లిన+ప్రవాహపు+తుంపర+జడివానై, చలత్+కుసుమ+సౌరభ+ చోరములైన+సమీరముల్=కదులుతున్న+పుష్పములయొక్క+వాసన+సంగ్రహించిన+వాయువులు,

తే. అనిలపూరిత రంధ్రములగుచు మ్రోసి/బొంగువెదురులు ముఖవాద్యములుగ నమర

తారగతి, తద్యశోఽంకగీతములు పాడి/అలరజేసిరి వనదేవతలు దిలీపు. 10

అనిల+పూరిత+రంధ్రములగుచు+మ్రోసి+బొంగువెదురులు=గాలి+నిండి+బెజ్జములుద్వారా+మ్రోగిన+వెదురు బొంగులు, ముఖ+వాద్యములుగన్+అమర=నోటితో+వాయించు పిల్లనగ్రోవి వంటి వాద్యములుగా+ఉండగా, తారగతి=బిగ్గరగా, తత్+యశః+అంక+గీతములు=దిలీపుని+కీర్తిని+గుఱుతుతెచ్చు+పాటలు, అలర= సంతోషింప

ఉ. వాలును విల్లు బట్టినను, వాని యెడన్ మదిలో నశంకయున్,

మాలిమియున్ జనింప, గరుణామృదుమానసు డన్ననమ్మికన్

మ్రోలకు వచ్చి, తద్రుచిరమూర్తి గనుంగొను లేటితండముల్,

వాలికనోగకన్గవల భాగ్యము బారము ముట్టజేయుచున్. 11

వాలు=కత్తి, అశంక=సందేహములేమి, మాలిమి=మచ్చిక, మ్రోల=సమీపము, తత్+రుచిర+మూర్తి=ఆతని+ అందమైన+రూపము, లేటి+తండములు=జింకల+గుంపు, వాలిక+నోగ+కన్గవ+భాగ్యము+పారము+ముట్ట చేయుచున్=మనోజ్ఞమైన+దీర్ఘమైన+రెండు కండ్లుగల+ఫలపు+మేర+అనుభవించుచు,

సీ. ఎరగలిచిచ్చు చెచ్చర ఆరిపోయెను/వినువీధి నొక చిన్కు చినుకకున్న,

తనుపేది ఆకురాల్చిన తోపు లవి యెల్ల/పొందుగా చిగురించి అందగించె,

కొమ్మకొమ్మకు జెట్ల ముమ్మరంబుగ బుట్టె/పువుగుత్తులును శలాటువులు బండ్లు,

మసకమ్రుచ్చులు పాఱుటసురులు బడుగుల/బట్టి కారించుట కట్టువడియె,

నోరుమాలిన మెతక జంతువుల మ్రింగ/నోరు తెఱవవు నాలిజంతువులు రేగి,

పాడి దప్పని గొప్ప కాపరి, అతండు/కాలు మోపిన మాత్రాన, గానలోన. 12

ఎరగలి+చిచ్చు=దావాగ్ని+మంటలు, చెచ్చర=శ్రీఘ్రముగా, విను+వీధిన్=ఆకాశమున, ఒకచిన్కు+చినుకకున్న =ఒకచినుకు+రాలక పోయినా, తనుపు+ఏది=తడి+నశించి, తోపులు=చెట్ల సముదాయము, పొందుగా= పొంకముగా, ముమ్మరంబుగ=అధికముగ, శలాటువులున్+పండ్లు=పచ్చికాయలును+పళ్ళను, మసక+ మ్రుచ్చులు=రాత్రి+దొంగలు, పాఱుటసురులు=బ్రహ్మ రాక్షసులు, బడుగులన్=బలహీనుల, కారించుట= బాధించుట, నోరుమాలిన=నోరులేని, మెతక=సాధు, ఆలి+జంతువులు+రేగి=క్రూర+జంతువులు+చెలరేగి, పాడి+తప్పని=ధర్మము+తప్పని, కాపరి=రక్షించువాడు, కాన=అడవి.

తే. పాదసంచారమున దిశల్ పావనంబు/చేసి మునిమాపు మగిడి నివాసమునకు
అరుగసాగె, ప్రవాళరాగాభిరామ/జరఠభానుచ్ఛవియు, మునివరుని గవియు. 13

దిశల్+పావనంబు+చేసి=దిక్కులు+పవిత్రమైనవిగా+చేసి, మునిమాపు= ప్రదోషకాలమున, మగిడి=తిరిగి, ప్రవాళ+రాగ+అభిరామ+జరఠ+భాను+చ్ఛవి=చిగురుటాకులవలె+ఎఱ్ఱనై+సుందరమై+పండిన+సూర్యుని+ కాంతి, గవియు=ఎఱ్ఱనైనఅవు,

శా. ఆ దైనందినదేవపిత్రతిథి మర్యాదాక్రియాసాధనన్,
మోదాయత్తమతిన్ భజింపుచు దిలీపుం డేగె నన్వక్షుడై,
ఆ దోషజ్ఞసమేతయై, అదియు, భవ్యాచారసంయుక్తసా
క్షాదాస్తిక్యమహామనీషకరణిం గన్పట్టి యొప్పెం, గడున్. 14

దైనందిన=ప్రతి రోజు జరుపు, దేవ+పిత్రు+అతిధి+మర్యాదా+క్రియా+సాధనన్=దేవతల+పిత్రు దేవతల+ అతిథుల+గౌరవముగాజరుపు+యాగ శ్రాద్ధా దానములకు+సాధనమైనపాలను ఇచ్చుఆవును, మోద+ అయత్త+మతిన్+భజింపుచు=సంతోషము+నిండిన+బుద్ధితో+సేవించుచు, ఏగె అన్వక్షుడై=వెంబడించువాడై వెళ్ళెను, ఆ+దోషజ్ఞ+సమేతయై+అదియు=అట్టి+విద్వాంసుడైన దిలీపుని+కలిసి+ఆ నందిని, భవ్య+ఆచార+ సంయుక్త+సాక్షాత్+ఆస్తిక్య+మహా+మనీష+కరణిం+కన్పట్టి+ఒప్పెన్+కడున్=దివ్య+సదాచారముతో+కూడి+ ప్రత్యక్షముగానుండు+శ్రద్ధకల+గొప్ప+బుద్ధి+వలె+కనబడి+ప్రకాశించెను+ఎక్కువగా,

సీ. పడియలు వెలువడి బుడుతయేన్గుల రీతి/మూకలై పర్వెత్తు నేకలములు,
ఒడళులు జాడించి, ఉనికి మ్రాకులపైకి/నెగయంగ నుంకించు నెమలిపిండు,
అలవోక అలతిపిట్టల బట్టి పేటాడ/వెలికి వచ్చిన గూబపులుగుపొజు,
పచ్చికబయళుల బవడించి బడలిక/లెడలించుకొను కట్టి యిట్టికదుపు,
వాలి రానున్న ఇర్ల పెన్వేలమునకు/అగ్రగామిదళంబుల యనువుజూప

సరవి గప్పారు గాననాంతరము గడచి/వచ్చె నృపతి తపోవనోంపాంతమునకు. 15

పడియలు=నీళ్ళు నిలచిన చిన్న పల్లపుప్రదేశముల నుండి, వెలువడి=బయటపడి, బుడుత=చిన్న, మూకలై= గుంపుగా, ఏకలములు=అడవి పందులు, ఉనికి+మ్రాకులపైకి=నివసించు+చెట్లపైకి, ఎగయంగన్+ఉంకించు= ఎగర+యత్నించు, పిండు=సమూహము, అలవోక=లీలగా, అలతి=చిన్న, గూబ+పులుగు+పౌజు=గుడ్లగూబ+ పిట్టల+బారు, పవడించి=పడుకొని, ఎడలించుకొను=తొలగించుకొను, కట్టి+ఇట్టి+కదుపు=నల్లని+జింక+ సమూహము, వాలి+రానున్న=ప్రవాహముగా+రాబోవు, ఇర్ల+పెను+వేలమునకు=జింకల+పెద్ద+గుంపుకు, అగ్రగామిదళంబులు=ముందునడచుదండు, అనువుజూప=అనుకూలమైన ప్రదేశము చూపుతుండగా, సరవిన్ +కప్పారు=క్రమముగా+చీకటిపడు, తపోవన+ఉపాంతము=ఆశ్రమ+సమీపమునకు

క. బలుపొదుగు మోతతో వపు/రలఘుత్వమువలన డస్సి, అంచితగతులన్

తొలియీత మొదవు, ఱేడును/అలంకరించిరి తపోవనాగతపథమున్ 16

బలు+పొదుగు+మోతతో=పెద్ద+బరువైన+పాల పొదుగు+భారముతో(ఆవు), వపుర్+అలఘుత్వము వలన =శరీరపు+ఎక్కువైన బరువు+చే(దిలీపుడు), డస్సి=అలసి, అంచిత+గతులన్=మెల్లమెల్లని+అడుగుల, తొలియీత+మొదవు=మొదటి కాన్పు+పాడిఆవు, ఱేడు=రాజు, అలంకరించిరి=హుందాతనము తెచ్చిరి, ఆగత+పథమున్=వచ్చు+మార్గమునకు,

క. మునిధేనువునున్ వెనుకొని/వనవాటికనుండి తిరిగివచ్చు నిజేశున్

కనియె గనుఱెప్ప వేయక/తనువెల్లను గన్నులుగ, సుదక్షిణ నెమ్మిన్ 17

వెనుకొని=వెంబడించి, నెమ్మిన్=సంతోషముతొ, తనువెల్లను+కన్నులుగ=ఆర్థతతో ఎదురుచూపు (ఉపవాసము చేయువారు దప్పికచే మిక్కుటముగా నీళ్ళు త్రాగునట్లు, దిలీపుని ఆవుని కని వానిని త్రావునా అన్నట్లు ఱెప్ప వాల్చక తమితో చూచినది)

క. వెనుదగిలి వచ్చుఱేనికి/తనకెదురుగ నడచు మగధతనయకు, మధ్యన్

మునివరుని హోమధేనువు/దినరాత్రుల నడిమి సంజ తెఱగున మెఱసెన్. 18

వెనుదగిలి=ఆవునువెంబడించి, సంజ+తెఱగున+మెఱసెన్=సాయంకాలము+విధముగా+ప్రకాశించెను, సూచన: సుదక్షిణ(తెలుపు-దివము)(ముందు), ఆవు(ఎఱుపు-సంధ్య)(మధ్య), దిలీపుడు(నలుపు-రాత్రి) (చివర),

ఉ. ఆ రమణీయపుణ్యవతి అక్షతపాత్రము కేలబట్టి, బృం

దారకధేనుసూతికి ప్రదక్షిణముం బొనరించి, మ్రొక్కి సిం

దూరసుగంధమాల్యములతో గయిసేసె, నిజార్థసిద్ధికిన్
ద్వారమువంటి దైన తదుదగ్రవిశంకట శృంగమధ్యమున్. 19

బృందారక+ధేను+సూతికి=దేవతల+ఆవుయొక్క+బిడ్డకు, మాల్యములతో=మాలలతో, కయిసేసి=అలంకరించి, నిజ+అర్థ+సిద్ధి+ద్వారము=తమ+కోరిక+నెఱవేరుటకు+ఉపాయము, తత్+ఉదగ్ర+విశంకట+శృంగ+మధ్యమున్ =దాని+పొడగైన+విశాలమైన+కొమ్ముల+మధ్యప్రదేశమున,

ఉ. క్రేపును జూడ బోవ దమకించియు, జాప్యమొకింత సైచి, గో
వోపికపట్టి చేకొనియె, నూడిగముం దమచేత నంచు, జా
యాపతు లుల్లసిల్లిరి, నిజాశ్రితసంతతి కిట్లు సాధువుల్
చూపు ప్రసాద చిహ్నములె సూచనసేయు పురఃఫలంబులన్. 20

క్రేపును=దూడను, తమకించియు=త్వరపడియు, జాప్యము+ఒకింత+సైచి=ఆలస్యము+కొంత+సహించి, చేకొనియెన్+ఊడిగము=స్వీకరించెను+సేవ, జాయా పతులు=భార్యాభర్తలు, ఉల్లసిల్లిరి=సంతోషించిరి, నిజ+అశ్రిత+సంతతికి=తాము+కోరిన+సంతానమునకు, సాధువులు=సుజనులు, ప్రసాద+చిహ్నములె=అనుగ్రహ +సంకేతములే, పురః+ఫలంబులన్=పురోగతమైన+ఫలసిద్ధికి

క. సురభిసమారాధన మిటు/కొఱవడక యొనర్చి వచ్చి గురుదేవు పదాం
బురుహముల కెఱగి, నృపశే/ఖరు డవసితసకలసాంధ్యకరణీయుడునై. 21

సురభి+సమారాధనము=ఆవు+పూజ, కొఱవడక=తక్కువ కాకుండా, పద+అంబురుహములకు+ఎఱగి= పాద+పద్మములకు+నమస్కరించి, అవసిత+సకల+సాంధ్య+కరణీయుడు=ముగిసిన+అన్ని+సంధ్యాకాల అనుష్ఠానములు+చేసినవాడై,

వ. దోహావసానమున శుచిప్రదేశమున విశ్రమించి, సామినిమీలితనయనయై నెమరువేసికొనుచున్నదోగ్ధ్రికి
నేదిష్ఠమున బలిప్రదీపము లునిచి, పౌనఃపున్యముగ మేను నిమురుచు నారాధించి, నిదురపుచ్చి,
తానును నిద్రించె; ప్రభాతమున నా సుప్తోత్థితతో పాటు తానును లేచె. 22

దోహ+అవసానము=పాలుపితుకుట+ముగిసిన, సామి+నిమీలిత+నయనయై=సగము+మూయబడిన +నేత్రములుకలదై, దోగ్ధ్రికి=పాడిఆవుకు, నేదిష్ఠమున=మిక్కిలి సమీపమున, బలి+ప్రదీపములు+ఉనిచి= పూజార్హమైన+దీపములుకానుకగ+ఉంచి, పౌనఃపున్యము=మరలమరల, ఆ+సుప్తోత్థితతో+పాటు=ఆ+నిద్ర లేచినదానితో+పాటు,

క. పరమసహిష్ణుడు కోసల/నరపతి సకళత్రముగ అనారతదీనో

ద్ధరణ వ్రతుండు వ్రత మటు/జరిపెను ముయ్యేడునాళ్ళచంచల దీక్షన్. 23

పరమ+సహిష్ణుడు=గొప్ప+ఓర్పుగలవాడు, సకళత్రముగ=భార్యతోపాటు, అనారత+దీన+ఉద్ధారణ+వ్రతుడు=ఎల్లప్పుడు+దీనుల+ఉద్ధరించు+వ్రతముకలవాడు, ముయ్యేడు+నాళ్ళు=మూడుxఏడు(21)+రోజులు, అచంచల+దీక్షన్=స్థిరమైన+పట్టదలతో,

క. మరునాడు యథావిధి ఆ/మరుదర్జునిసుత పిఱుంద, మనుజేశ్వరు, డే

మఱుపాటెఱుగక వని గ్రు/మ్మరుచుండగ దినకరాస్తమయసమయమునన్. 24

మరుత్+అర్జుని+సుత=దేవత+ఆవు(కామధేనువు)+కూతురు-నందిని, పిఱుంద=వెనుక, క్రుమ్మరు=తిరుగు, దినకర=సూర్యుడు,

క. మునివరుని హోమధేనువు/తన అనుచరు భక్తి నెఱుగ దలచి, ప్రవేశిం

చెను గంగాపూరాంతిక/మనోజ్ఞసంరూఢతృణము, మంచుమల గుహన్ 25

హోమ+ధేనువు=హోమసామాగ్రిఇచ్చు+ఆవు, గంగా+పూర+అంతిక=గంగానదీ+నీటి+సమీపమున, మనోజ్ఞ+సంరూఢ+తృణము=అందముగా+పెరిగెన+గడ్డికలదైన, మంచుమల=మంచుకొండ,

ఉ. నాలిమెకంబు లేవియు మనంబున సైతము దానిపై దెగం

జాలవటన్న నమ్మిక, నిసర్గమనోహరశైలకందరా

లోలుపచక్షువైన, దరలుప్తమహోద్యము కన్నుగప్పి, పై

వ్రాలి, మృగేంద్రు డొక్కడు చివాలున నందిని బట్టె, బట్టినన్. 26

నాలి+మెకంబులు=క్రూర+మృగములు, మనంబున+సైతము=మనసులో+కూడ, దానిపై+తెగన్+చాలవు+అన్న+నమ్మిక=ఆవుపై+సాహసింప+లేవు+అను+ధైర్యముతో, నిసర్గ=సహజ, శైల+కందర=కొండ+గుహలను, ఆలోల+ఉప+చక్షువు+ఐన=చూడగా+(వాటి)దగ్గఱైన+చూపులు+కలవాడు+అయి, దర+లుప్త+మహోద్యము=అల్పముగా+లోపించిన+గొప్ప ప్రయత్నము కలవాని, మృగేంద్రుడు=సింహము,

మ. అరచెన్ ప్రాణభయాతిరేకమున, అంభా యంచు, మాహేయి గ

హ్వరబద్ధప్రతిశబ్దదీర్ఘము తదార్తారావ మా యార్తకా

తరసంరక్షకు వెన్నుదట్టి గిరిసక్తంబైన తద్ దృష్టి, స

త్వర, మా దిక్కుకు లాగె, పగ్గములచేతన్ లాగు చందంబునన్. 27

భయ+అతిరేకమున=భయ+తీవ్రతచే, మాహేయి=ఆవు, గహ్వర+బద్ధ+ప్రతిశబ్ద+దీర్ఘము=గుహలో+నిండిన+మాఱుమ్రోగిన ఆర్తరావపు+హెచ్చుదల, తత్+ఆర్తారావము=దాని+ఆక్రందన, ఆ+ఆర్త+కాతర+సంరక్షకు=

ఆ(దిలీపుడు)+ఆర్తుల+భయము+తీర్చువాని, వెన్నుదట్టి=మేలుకొలిపి, గిరి+సక్తంబైన+తద్+దృష్టి+సత్వరము=కొండను+అంటియున్న+ఆతని+చూపును+వేగముతో, పగ్గములచేతన్+లాగు+చందంబునన్=గుఱ్ఱపుపగ్గపుత్రాడుచే+లాగిన+విధముగా,

తే. చూపు మరలించి, ఎదుట నా చాపధారి/అరుణధేనువు మీది కేసరిని, గనియె,
ధాతుమయమైన కొండ పైతటము మీది/విరియబూచిన లొద్దుగతరువు బోలె 28

చాపధారి=విల్లమ్ములు ధరించిన దిలీపుడు, అరుణధేనువు=రక్తవర్ణమైన ఆవు, కేసరి=సింహము, ధాతుమయనైన= గైరికాది ధాతువులు ఎఱుపుదనము నిండిన, పైతటము=మీదిచెఱియ, విరియబూచిన+లొద్దుగ+తరువున్+పోలె=ఎక్కువగా తెల్లపూలుపుష్పించిన+లొద్దుగ+చెట్టువలె,(ఆవు,గిరి అరుణిమలు, సింహము, పూలు తెలుపువి)

మ. కని,ఆకస్మికదండతాడితమహాకాకోదరప్రాయుడై,
ఘనకోపంబు పరాభవంబును మదిం గాఱింప, నా సింహాసం
హనునుం డుక్కున నొక్కయేటుననె సింహంబుం దెగంజూడ నొ
య్యన తూణీరమునుండి తూపు బెఱుకన్ యత్నింప, జోద్యంబుగన్. 29

దండ+తాడిత+మహా+కాకోదరము+ప్రాయుడై=కర్రతో+కొట్టబడిన+గొప్ప+పాము+వంటివాడై, కాఱింప=బాధింప, సింహాసంహనుడు=సర్వాంగసుందరుడు, ఉక్కున=ఔద్ధత్యమున, ఒక్క+ఏటుననె+సింహంబున్+తెగం+చూడ =ఒక్క+బాణముచేతనే+సింహమును+చంపు+వాడై ,ఒయ్యన=తిన్నగా, తూణీరము=అమ్ములపొదినుండి, తూపున్+పెఱుకన్=బాణము+తీయ, చోద్యంబుగన్=ఆశ్చర్యముగా,

తే. ధవళనఖదీప్తి కంకపత్రముల నలమ/అంపగపుపింజలకు వ్రేళు లతికికొనియె,
కొయ్యబారి కదల్పరా దయ్యె జెయ్యి/బొమ్మగా గీయబడిన యత్నమ్ము వోలె. 30

ధవళ+నఖ+దీప్తి=తెల్లని+గోళ్ళ+ప్రకాశము, కంకపత్రములను=(నల్లని)రాపులుగురెక్కలుకట్టిన బాణములకు, అలమ=వ్యాపింప, అంపగపు+పింజలకు=బాణపు+పిడిమూలములకు, కొయ్యబారి=స్పందనలేక, బొమ్మగా గీయబడిన యత్నమ్ము వోలె=తీయప్రయత్నిస్తున్నట్లున్నవ్రాసిన చిత్రము వలె,

సీ. సద్యోభుజప్రతిష్టంభసంభవమున/మన్యువేగంబు ముమ్మరము గాగ,
చెంగటి యపరాధి జెనకంగ జాలని/తనదు తేజమె లోన దన్ను గాల్ప,
ఇన్నాళ్ళు కంట వత్తిడుకొన్న క్లేశము/విఫలమై చెడుటకు వీపు విఱుగ,
తను జూచి బావురు మనిన ధేనువుకూయి/దారుణంబై నిల్వనీఱు సేయ.

చేయునది లేక, ముగ్ధుని చాయ, నిలిచె/ఉష్ణమును, దీర్ఘతరము నై యూర్పు నిగుడ,

ప్రభలమంత్రౌషధముల వీర్యంబు గోలు/పడి ఒడుపు దప్పి రోజు పెన్పాము పగిది. 31

సద్యో+భుజ+ప్రతిష్టంభ+సంభవమున=అంత వేగముగా అప్పుడు+చేతులు+మ్రానుపడిపోవుట+కారణమున, మన్యు+వేగంబు+ముమ్మరము+కాగ=కోప+తీవ్రత+అధికము+అవగ, చెంగటి=సమీపపు, చెనకంగ+చాలని =ఎదిరించ +లేని, తనదు+తేజమె=తనదైన+తేజస్సెఅగ్నియై, కంటవత్తిడుకొన్న+క్లేశము=అతిజాగ్రత్తగాచేసిన+ప్రయత్నము, వీపు విఱుగ=వెన్ను విఱుగ, ధేనువు+కూయి=ఆవు+ఆక్రందన, నిలువ+నీఱు+చేయ=బ్రతుకు+భస్మము+చేయగా, ముగ్ధుని+చాయ=సొమ్మసిల్లినవాని+వలె, ఉష్ణమును+దీర్ఘతరమునై+ఊర్పు+నిగుడ= వేడైన+బాగాపెద్ద+నిట్టూర్పులు+వెడల, ప్రభల+మంత్ర+ఔషధముల=మిక్కిలిబలముకల+మంత్రము చేతను +మూలికల చేతను, వీర్యంబున్+కోలుపడి=బలము+పోగొట్టుకొని, ఒడుపున్+తప్పి=ఉపాయము+లేక, రోజు+పెను+పాము+పగిది=రొప్పు+పెద్ద+పాము+విధముగా

క. బెడిదముగ పిడుగుకైదువు/నడరింపగ చేయినెత్తి అతికోపమునన్

మృడవీక్షణమాత్రంబున/జడీకృతుండైన వజ్రి సామ్యము, తోపన్. 32

బెడిదముగ+పిడుగుకైదువున్+అడరింపగ=భయంకర+వజ్రాయుధము+వేయగా, మృడ+వీక్షణ+మాత్రంబున+జడీకృతుండైన+వజ్రి+సామ్యము+తోపన్=శివుని+చూపుతో+క్షణమున+జడుడైన+ఇంద్రుని+పోలికగా+అనిపించెను(పూర్వము ఇంద్రుడు శివునిపై వజ్రాయుధము వేయబోగా శివుని వీక్షణ మాత్రమున ఇంద్రుని బాహువు స్థంభించెను)

ఉ. ఎన్నడు చేయి చేసికొని ఇట్లుడివోని స్వశక్తిసెల్ల లో

గొన్న విచిత్రసంఘటనకున్ గడు విస్మితచిత్తుడైన, యా

మన్నియ కాత్మ విస్మయము, మాటకు మాటకు విస్తరింపగా,

అన్నిగృహీతధేనుడు, మృగాధిపు డిట్లనియెన్, నరోక్తులన్. 33

చేయిచేసికొని=పట్టుపట్టి, ఇట్లు+ఉడివోని=ఈవిధంగా+వ్యర్థమగు, మన్నియకు+అత్మ+విస్మయము=ప్రభువుకు +తన+ఆశ్చర్యము, మాటకు మాటకు+విస్తరింపగా=క్షణక్షణము+ఎక్కువ అవగా, ఆ+నిగృహీత+ధేనుడు+మృగాధిపు=ఆ+లోబరచుకోబడిన+ఆవుకలవాడగు+సింహము, నర+ఉక్తులన్=మనుష్యుని+మాటలలో,

ఉ. "చాలు శ్రమంబు నీకు, నృపసత్తమ! నీ వరిబోసి యేయగా

జాలిన నేమి? నీ భయదశస్త్రము గవ్వకు గాదు నాయెడన్

సాలములన్ సమూలముగ చండరయంబున గూలద్రోయగా

జాలు ప్రభంజనోద్ధతికి, శైలము సన్నిధి నాటకట్టదే? 34

అరిబోసి+ఏయగా+జాలినన్+ఏమి=బాణముఎక్కుపెట్టి+వేయ్యగలిగినను+ఏమిలాభము, భయద+అస్త్రము=భయంకరమైన+బాణము, సాలములన్+సమూలముగ+చండరయంబునన్+కూలన్+త్రోయగా+చాలు ప్రభంజన+ఉద్ధతికి=మద్దిచెట్టు+మూలముతొసహా+తీవ్రవేగమున+కూలగా+జేయు+పెనుగాలి+పెద్దదెబ్బకు, శైలము+సన్నిధిన్+ఆటకట్టదే=పర్వతము+ముందట+సమర్థముకాదుకదా,

మ. నను నీ వెవ్వనిగా దలంచితివొ? పుణ్యశ్లోకు డార్యాకళ

త్రుని ఆజ్ఞానుచరుండ, శ్వేతవృష మారోహించుచో వీపుపై

తన శ్రీపాదము మోపి దేవర ననున్ ధన్యాత్ముగావించు ను

క్కున, దేజంబున, నే, నికుంభనిభుడన్, కుంభోదరాభిఖ్యుడన్. 35

పుణ్యశ్లోకుడు+ఆర్యా+కళత్రుడు=పుణ్యము కలిగించు కీర్తికల+పార్వతీదేవి+భర్త అయిన శివుడు, ఆజ్ఞ+అనుచరుండ=ఉత్తరువు+పాటించువాడను, శ్వేత+వృషము+ఆరోహించుచో=తెల్లని+నందిని+ఎక్కునప్పుడు, ఉక్కునన్+తేజంబున+నే+నికుంభ+నిభుడన్=దృఢత్వమున+పరాక్రమమున+నేను+నికుంభునితో(శివానుచరుడు-కుమారస్వామి భటుడు)+సమానుడను, కుంభోదర+అభిఖ్యుడన్=కుంభోదరుడను+పేరుకలవాడను,

సీ. ఎదుట గన్పడు, జూడు !మిగురు జొంపములతో/దఱుచైన అల దేవదారు విటపి,

పుత్రీకృతం బయ్యె పూర్ణేందుమౌళికి/సుద్ది కందదు, దాని సుకృతగరిమ

కనకకుంభస్తనగళితపయోధార/మనుచు బూని కుమారజనని దాని,

చెక్కుల తీటవో చెక్కులూడగ రాచె/ఒక వనేభము దాని నొక్కనాడు,

అపుడు ప్రూని గనుంగొని, అంగలార్చి/అసురనిశితాస్త్రముల దేహ మవిసియున్న

కొమరుసామిని గన్న చందమున రాల్చె/పేడికన్నీరు, వలిమల యాడుబిడ్డ 36

ఇగురు+జొంపములతోన్+తఱుచైన=చిగురు+గుబురులతో+ఆధికమైన, విటపి=చెట్టు, పుత్రీ కృతంబయ్యె పూర్ణేందుమౌళికి=శివునిచే కుమారభావముచే స్వీకరించబడెను, సుద్దికి+అందదు+దాని+సుకృత+గరిమ = మాటలకు+అందదు+దాని+పుణ్యపు+గొప్పదనము, కనక+కుంభ+స్తన+గళిత+పయః+ధార+మనుచు = బంగారు+కుండలనుండి+తన పాలవలె+జారిన+నీటి+ధారతో+పోషించు, కుమారజనని =పార్వతీదేవి, చెక్కుల+తీటవో+చెక్కులు+ఊడగ+రాచె+ఒక+వనేభము=గండస్థల+దురదపోవుటకు+చెట్టుపట్టలు+ఊడునట్లు +గీకెను+ఒక అడవి ఏనుగు, ప్రూని=చెట్టును, అంగలార్చి=దుఃఖించి, అసుర+నిశిత+అస్త్రముల+దేహము+

అవిసియున్న=రాక్షసుల+వాడియైన+ఆయుధములచే+శరీరము+అలసి ఉన్న ,కొమరుసామి=కుమారస్వామి, వలిమల+ఆడుబిడ్డ=మంచుకొండ+కూతురు-పార్వతి,

ఉ. దండిత దంతిదానవుడు, త్ర్యంబకు, డప్పటినుండి వన్యపే
దండనిపీడ మాన్పి సురదారువు గావగ నానతిచ్చి ఈ,
చండమృగేంద్రరూపమున సన్నిధికిన్ జనుదెంచు జంతువుల్
తిండిగ నన్నిటన్ నిలిపి, దేవికి నిల్పె మనః ప్రమోదమున్ 37

దండిత దంతిదానవుడు=దంతాసురుని చంపిన, త్ర్యంబకుడు=శివుడు, వన్య+పేదండ+నిపీడ+మాన్పి=అడవి+ఏనుగు చేసిన+మిక్కిలి బాధ+బాపి, సుర+దారువు=దేవతా+వృక్షమును, చండ+మృగేంద్ర=భయంకరమైన+సింహపు, సన్నిధికిన్=దగ్గరకు, నన్ను+ఇటన్+నిలిపి=నన్ను+ఇక్కడ+కాపలాదారునిగా ఉంచి, దేవికి+నిల్పె =పార్వతికి+స్థిరపరచె, ప్రమోదము=సంతోషము,

సీ. ముక్కంటిదేవర ముదలమేరకు నాకు/ఒడగూడె నిది నేటి ఓగిరముగ,
ఆకొన్న నా ప్రేవు లఱచుచున్నవి దీని/నంజు డేకటవాయ నమలవలయు
దీని కాయవుమూడె గాన నా సరసకు/మృత్యువు తలపట్టి ఈడ్చి తెచ్చె,
పాడియావుల కేమి బ్రాతి, నీ కీ యొక్క/గోవుతగ్గిన అది కొఱత గాదు,
అలికనయనుని ఆదేశబలము కలిమి/బల్లిదుల బల్లిదుడను, నా బారి బడిన
జంతువుల పట్ల కొఱగాని పంతమూని/ఎవరు విడిపింప శక్తు లీ ఎల్ల వసుధ? 38

ముక్కంటి దేవర+ముదల+మేరకు=శివుని+ఆజ్ఞ+అనుసరించి, ఒడగూడె=సిద్ధించె, ఓగిరము=అన్నము, ఆకొన్న=ఆకలిగాఉన్న, నంజుడు+ఏకట+వాయ+నమలవలయు=మాంసము+అపేక్షతో+నోట+నమలాలి, దీనికి+ఆయవు+మూడె=ఈఆవుకు+ఆయువు+తీరినది, నా సరసకు=నా+వద్దకు, బ్రాతి=కొఱత, అలికనయనుని=శివుని, బల్లిదుల=మిక్కిలి బలము కల వారిలో, బల్లిదుడను=అధిక బలము కలవాడను , కొఱగాని=ప్రయోజనములేని, ఊని=పెట్టుకొని,

ఉ. కావున చిన్నబుచ్చుకొన కారణ మేమియు లేదు నీకు, నీ
భావవిశుద్ధి నీదు గురుభక్తియు వెల్లడియయ్యె పొమ్మికన్,
భూవర !రక్ష్యరక్షణకు బొత్తిగ శస్త్రము వ్యర్థమైనచో
కేవలశస్త్రసాధనుల కీర్తికి రాదు కళంక మేమియున్" 39

భావవిశుద్ధి=మనస్సునిర్మలత్వము,వెల్లడి+అయ్యె=ప్రచురము/ప్రకటితము+అయునది, రక్ష్యరక్షణకు =రక్షించదగ్గ వారిరక్షణకు, బొత్తిగ+శస్త్రము+వ్యర్థమైనచో=పూర్తిగా+ఆయుధము+ప్రయోజనకారికాకపోయిన, కేవల శస్త్రసాధనుల=ఒక్కఆయుధములే సాధనముగా కలవారికి, కళంకము=మచ్చ

మ. అని స్పష్టంబుగ సప్రగల్భముగ హర్యక్షంబు వాక్రుచ్చినన్,
విని ఆశ్చర్యమునుండి తేఱుకొని యా వీరుండు భూతేశు భూ
ర్యనుభావంబున వొల్లువోయె దన వీర్యంబంచు గుర్తించి, నె
మ్మనమునన్ వేచు నవజ్ఞ మట్టుపరచెన్, మార్వల్కె ప్రత్యర్థికిన్. 40

స ప్రగల్భముగ=గర్వముతో, హర్యక్షము=సింహము, వాక్రుచ్చినన్=చెప్పిన, భూతేశు=శివుని, భూరి+ అనుభావంబున=మిక్కిలి+ప్రభావమున, వొల్లువోయె=వ్యర్థమైనది, వేచున్+అవజ్ఞ+మట్టుపరచెన్=మండించు+ అవమానము+తగ్గగా,

వ. "మృగేంద్ర !అవధరింపుము .సంరుద్ధచేష్టుడనైన యేను చెప్పబోవునది అశక్తసౌజన్యమున మాటవరస
కనవలసి యంటి నని అన్యులపహసింపవచ్చునుగాని, పరమశివుని ప్రసాదమున
సకలభూతాంతర్గతభావముల కల నిజము నీకు తెలివిపడియుండు, గావున నీ వట్లధిక్షేపింపవను
ప్రత్యయమున వెఱువక, నీకు నివేదించుచుంటిని 41

అవధరింపుము=వినుము, సంరుద్ధ+చేష్టుడనైన+ఏను=బాగుగాఅడ్డగింపబడిన+అవయవముల కదలిక కల +నేను, అశక్త+సౌజన్యమున=శక్తిలేనివాని+మంచితనమున, మాటవరస=వంతుకు మాటగా, అపహసింప =పరిహసించు, ప్రసాదమున=అనుగ్రహమున, సకల+భూత+అంతర్+గత+భావముల+కల+నిజము=అన్ని +భూతముల+అందలి+ఉన్న +బావముల+కల్ల+నిజములను, తెలివి పడియుండు=ప్రసన్న మగును, అధిక్షేపింపవు+అను=అక్షేపించవు+అను, ప్రత్యయమున=విశ్వాసముతో, వెఱువక=భయపడక,

తరువోజ. పూజనీయుడు నాకు భూమ్యాదిసకల/జగదుద్భవస్థానసంహారకారి,
అవిలంఘ్యశాసను డా మహేశునకు/చేమోడ్చి ఒకమాట చెప్పెద వినుము,
ఆహితాగ్నివరేణ్యుడైన మా గురుని/ప్రాణధనం బిది, పరమకల్యాణి,
రూపురూపున నిట్లు రూపఱ జూచి/చెడుగాకయని, ఉపేక్షింప నా కగునె? 42

భూమి+ఆది+సకల+జగత్+ఉద్భవ+స్థాన+సంహార+కారి=భూమి+మొదలుకొని+సమస్త+సృష్టిని+ పుట్టించుట+నిలుపుట+నాశము+చేయువాడగు శివుడు, పూజనీయుడు=పూజింపదగ్గవాడు, అవిలంఘ్య=

దాటలేని, ఆహితాగ్ని+వరేణ్యుడైన=నిత్యాగ్నిహోత్రులలో+అధికగొప్పవాడు, ప్రాణధనంబు+ఇది=ప్రాణముతో సమాన విలువకలది+నందిని, రూపురూపున=సమ్ముఖమున, రూపఱ=నశించుట, ఉపేక్షింప=విడిచిపుచ్చ,

ఉ. నీకు మహేశ్వరుండు కరుణించిన నిగ్రహవృత్తికిన్, బ్రపు
ణ్యాకర !నా శరీరము సమర్పణ సేయుదు స్వీకరించి నీ
ఆకలి దీర్చుకొమ్ము, ముని యావును వీడుము, లేగదూడ అ
య్యో !కనుచూపుమేర గను చుండదె, ఇంతకు తల్లి రాకకై. 43

నిగ్రహ+వృత్తికిన్=చంపు+జీవనోపాయము-తిండి, ఇంతకు=ఇంతవరకు,

తే. పొదుగు విడువని బిడ్డపై బుద్ధి పాఱి/అడలు నీ తల్లి మొదవు నీవారగించి
తృప్తి పడుదువె? ఇత్తు నిర్వికృతి నీకు/నా శరీరము దినుము సంతర్పణముగ 44

పొదుగు విడువని=పాలుత్రాగు, బుద్ధి+పాఱి=మనసు+వెళ్ళి, అడలు=దుఃఖించు, మొదవు=పాడి ఆవు, నిర్వికృతి =మనోవికారములేక, సంతర్పణముగ=తృప్తిగ,

ఆ. ఉభయతారకముగ నూరీకరింపు నా/ప్రార్థనమును, శశిధరానుయాయి!
ఎసగు నిట్లు విహితకృత్యాచరణ నీకు/గురుధనమును గాచికొనుట, నాకు" 45

ఉభయతారకముగను=ఇద్దరికిఅనుకూలంగా, ఊరీకరింపు=అంగీకరింపు, శశిధర +అనుయాయి=శివ+ సేవకుడ, ఎసగును+ఇట్లు+విహిత+కృత్య+ఆచరణ=కలుగు+ఈవిధముగా+విధించిన+పని+ చేయుట, కాచికొనుట=ఆవు రక్షించుట,

క. అనిన విని తళు తళుక్కను/తన కోఱలు గహ్వారాంధతమసమును తునా
తునకలు సేయగ, సింహం/బనియెన్ వెడనవ్వు నవ్వి అజ్జనపతితో 46

తళుతళుక్కు=మెఱయుట అందనుకరణము, గహ్వర+అంధ+తమసమును=గుహయందలి+ అంధకారమైన+చీకటిని, తునాతునకలు=ఖండములు ,వెడ+నవ్వు=వికృతపు+నవ్వు ,అజ్జనపతి=ఆ రాజు,

మ. "సిరిసాంగత్యము గాలదన్ని సుఖమున్ చేసేత బోనాడి బం
ధురసామ్రాజ్యసుధామయూఖముఖికిన్ మోమున్ నిగూహించి ఏ
పరమార్థంబని, నిండు ప్రాణము తృణప్రాయంబు గావింతు, వీ
వరరే !ఏమని దూఱగా వలయు నీ ఆత్మాహుతి వ్యగ్రతన్ . 47

సిరి సాంగత్యము=సంపద చేరిక ,పోనాడి=పోగొట్టుకొని, బంధుర+సామ్రాజ్య+సుధా+మయూఖ+ముఖికిన్+ మున్+నిగూహించి=ఒప్పైన+రాజ్యమనెడు+చంద్ర+కాంతికి+ఆధారమైనదానికి+మోము+మఱుగుపఱచి,

తృణప్రాయంబు+కావింతువు+ఈవు+అరరే =అల్పగడ్డితోసమానము+చేతువా+నీవు+అయ్యో, దూఱు = నిందించు, వ్యగ్రతన్=వేగిరపాటుతనమును,

సీ. ఏకాతపత్రభూలోకాధిపత్యంబు/నిరపేక్షితమె? నీకు నరవరేణ్య!
వందారుమండలేశ్వరుల సేవాంజలుల్/విసుగెత్తెనే? నీకు వీరవర్య!
ఓజోయుతంబగు నొసపరిదేహంబు/వెగటయ్యెనే, నీకు సుగుణసాంద్ర!
బహుభోగముల పంట బంగారుప్రాయము/రహినింపదే, నీకు రసికరాజ!
అల్పసిద్ధికి తగునె? ఆత్మార్పణంబు/నీకు పెడతల బట్టెనో కాక బుద్ధి,
వినుము, నీవిప్డు దొరకొన్న పెడగుచేత/బొగ్గుకై కల్పతరువున కగ్గి వేత. 48

ఏకాతపత్ర=ఏకఛత్రముక్రింది, నిరపేక్షమె=ఆసక్తి లేనిదే, వందారు+మండల+ఈశ్వరుల+సేవ+అంజలుల్= గౌరవముగా స్తోత్రించు+భూ+పతులు+భక్తితో చేయు+నమస్కారములు, ఓజో+యుతంబగున్+ఒసపరి+ దేహంబు=తేజము+కలిగిన+విలాసవంతమగు+శరీరము, సుగుణసాంద్ర =మంచి గుణములకురాశివంటివాడా, బంగారు+ప్రాయము+రహినింపదే=మిసిమి+యవ్వనముపై+ఆసక్తి లేదా, అల్ప+సిద్ధికి=ఆవుప్రాణమువంటి చిన్నవిషయము+పొందుటకు, పెడతల బట్టెనో+కాక+బుద్ధి =చెడుబుద్ధి పుట్టెనో+కాని+మనసులో, పెడగు = అవివేకము, బొగ్గుకై+కల్పతరువునకు+అగ్గివేత =సామాన్యబొగ్గుకోసము+విశిష్టమైనకల్పతరువుకు+ నిప్పంటించుట ,

చ. గురుడు మహోగ్రమూర్తి భృశకోపను డాతని ఒంటియావు గో
ల్పఱచితినేని మండిపడువాడని మేను చెమర్చనీకుమీ,
ధరణితలేంద్ర !దీని తలదన్ను ఘటోధ్నులు వేనవేలు నీ
వఱగొఱలేక నష్టపరిహార మొసంగిన శాంతుడై చనున్. 49

భృశ+కోపనుడు=అధిక+కోప స్వభావము కలవాడు, మేను+చెమర్చనీకుమీ=వంటి మీద+చెమటలు పట్టనీకుమా, ఘట+ఊధ్నులు=కుండవంటి+పాలపొదుగులుకలఆవులు, అఱగొఱ=తక్కువ, శాంతుడైచనున్ =శాంతించినవాడైపోవును,

తే. మృత్యుదేవతకోఱల నిఱుకుకున్న/గోవు గనినంత, గరుణార్ద్రభావ !నీకు
జాగరిత మయ్యె గాబోలు? జాలిగుండె/తలపవయితివి తమకాన, తలల విలువ. 50

కరుణ+ఆర్ద్ర+భావ=జాలిచే+మెత్తబడిన+బుద్ధికలవాడా, జాగరితము=మేలుకొనినది, తమకాన=మోహముతో, తలల+విలువ=జీవితపు+ప్రాముఖ్యత,

శా. ఈ యవ్యాజకఠోరభూతదయ యే ధ్యేయంబుగా నీవు నీ
ఆయుర్ధాయము గోసికొన్న, మను నీ అధ్వాన్నపుంగోడ్డు, సం
శ్రేయోరాజ్యసుఖానుభూతి చిరమై జీవింపరె, నీవు దీ
ర్ఘాయుష్మంతుడ వైన, నీ ప్రజలు తా మాబాలగోపాలమున్. 51

అవ్యాజ+కఠోర+భూత దయయే+ధ్యేయంబుగా=కపటము లేని+క్లిష్టమైన+భూత దయను+లక్ష్యముగా, అధ్వాన్నపుం+గోడ్డు=పాడు+ఆవు, దీర్ఘ+ఆయుష్మంతుడవైన=నీవుపూర్తి+ఆయువుకలవాడవైన, నీ ప్రజలు +తాము+ఆబాలగోపాలమున్=నీప్రజలు+తాము+పిల్లాపాపలతో, సం+శ్రేయ+రాజ్య+సుఖ+అనుభూతి +చిరమై+జీవింపరె =చక్కని+ప్రియమైన+నీపరిపాలనలో+సుఖములు+అనుభవించుట+స్థిరమై+ జీవింతురుకదా,

చ. సురభి నుపేక్షచేసి మనజూచిన దప్పుదు స్వర్గహాని యన్,
మెరమెర నీమదిన్ వలదు, మేదిని నంటుట యన్న చిన్న అం
తరమున కేమి? వాసవపదం బని యాడరె? నిష్ప్రతీపని
ర్భరచతురంతభూవలయరాజ్యవిభూతి, అభిజ్ఞశేఖరా! 52

సురభిని=ఆవుని, ఉపేక్ష=నిర్లక్ష్యము, మనన్+చూచిన=జీవించ+తలచు కున్న, అన్+మెరమెర=అను+ సంశయము, మేదినిని+అంటుట+అన్న+చిన్న+అంతరము=భూమిపై+కాలూనుట+అన్న+చిన్న+భేదము (దేవతలు భూమిని అంటరు), వాసవ+పదంబు+అని+ఆడరె= ఇంద్ర+పదవి+వంటిదని+కొనియాడరా, నిష్ప్రతీప+నిర్భర+చతుర్+అంత+భూ+వలయ+రాజ్య+వి+భూతి=అడ్డులేక+సంపూర్ణముగా+నాలుగు సముద్రముల+మధ్యనున్న+భూ+చక్రపు+రాజ్యపు+విశిష్ట+ఐశ్వర్యము, అభిజ్ఞ+శేఖరా =తెలివికలవారిలో+ గొప్పవాడా,

ఉ. చావదు సమ్మతించి కడజాతికి చెందిన జీవి సైతమున్
జీవిత మెంతగా చితికి సిగ్గటిసన్ మనజూచు, నిత్యల
క్ష్మీవిభవాభిరామమగు జీవన మంతయు నీ మొగమ్ముగా
దేవసముండ, నీ విటులు తెచ్చికొనం దగునా? వినష్టికిన్ 53

సమ్మతించి=ఇష్టపూర్వకముగా, కడజాతి=అల్పజాతి, చితికి+సిగ్గటిసన్+మన+చూచు=ఆశలేకున్ననూ+ సిగ్గుపాలైననూ+బ్రతక+దారిపెదుకు, నిత్య+లక్ష్మీ+విభవ+అభిరామమగు+జీవన+మంతయు=స్థిరమైన+

లక్ష్మియొక్క+వైభవముతో+ఒప్పిన+జీవిత+పర్యంతము, నీ+మొగమ్ముగా=నీ+ఎదురుగా, దేవ+సముండ= దేవతలతో+సమానవిభవము కలవాడా, వినష్టికిన్=పూర్తినాశమునకు,

తే. కనుక కాపాడుకొనుము మంగళపరంప/రానుభూతికి అతిముఖ్యమైన మేను,
ఒడలు తెలియని సివ మెందుకోయి? మొదలు/చెడిన వ్యాపారమెవరు హర్షింతురోయి?" 54

మంగళ+పరంపర+అనుభూతికి=శుభములను+వరసగా+అనుభవించుటకు, సివము+ఎందుకోయి=ఆవేశము +ఎందుకు, మొదలు+చెడిన+వ్యాపారము=మూలధనము+పోయిన+బేరము, హర్షింతురోయి= సంతోషించెదరు

క. అని యుడిగిన నమ్మాటలు/తన గుహలో మారుమ్రోగ ధరణీపతికిన్
పునరుచ్చైఃశ్రుతి హిమగిరి/యును నా అర్థమ్మ పలుకు నోజస్ఫురించెన్. 55

ఉడిగిన=చాలించిన, పునర్+ఉచ్చైః+శ్రుతి=ప్రతి+ధ్వనించిన+పెద్దధ్వని, హిమ+గిరి=మంచు+పర్వతము, ఆ+ అర్థమ్మ=ఆ+న్యాయమే, ఓజ+ స్ఫురించెన్=విధముగా+అనిపించెను,

క. దేవానుచరున కన్నర/దేవాగ్రణి బదులు పలికె, దీనాననయై
గోవు తను జూడ, అనుకం/పావేగ విఘూర్ణమానమానసు డగుచున్. 56

దేవానుచరునకు=శివానుచరుడైన సింహమునకు, అ+నరదేవ+అగ్రణి=ఆ+రాజ+శ్రేష్ఠుడు, దీన+అననయై = జాలిగొలుపు+ముఖముతో, అనుకంప+ఆవేగ+విఘూర్ణమాన+మానసుడు=దయా+చింతినతో+గిరగిరతిరుగు +మనస్సుకలవాడై,

మ. "పరిరక్షించుక్షతంబునుండి అను వ్యుత్పత్త్యర్థబూయిష్ఠమై
పరమోదగ్రము, క్షత్రశబ్దము జగత్ప్రఖ్యాతి కెక్కెంగదా!
అరయం దద్విపరీతవృత్తి కొక రాజ్యం బేటికిన్, గాల్పనే?
పరివాదాతిమలీమసంబు లగు తత్ప్రాణంబులున్, వ్యర్థముల్ 57

పరిరక్షించు+క్షతంబు+నుండి=చక్కగా రక్షించు+నాశము+నుండి, ఉత్పత్తి+అర్థబూయిష్ఠమై=శబ్దసంభవ +అర్థము కలదై, పరమ+ఉదగ్రము=బహు+బలమైనది, అరయం+తత్+విపరీత+వృత్తికి+ఒక+రాజ్యంబు +ఏటికిన్=చూడగా+దాని+విరుద్ధంగా+వర్తిల్లువానికి+ఒక+రాజ్యము+ఏల, పరివాద+అతి+మలీమసంబు+ తత్+ప్రాణంబులున్+వ్యర్థముల్=నిందచే+అధికంగా+మలినమైన+అతని+జన్మకూడా+ప్రయోజనములేనిది.

వ. కావున నోయి, భూతేశ్వరపార్శ్వవర్తి !నీమాట కడ్డమాడిన నా సాహసమును మన్నింపుము .దీని గోలుపోవ నొడంబడి నీచెప్పిన యుపాయమున ప్రతిగ్రహనిరపేక్షియైన దేశికోత్తము ననునయింపజూచుట మహాపచారము మరియు ద్వితీయాపరాధమును. 58

భూతేశ్వర+పార్శ్వవర్తి =మహాశివుని+ప్రక్కనుండు వాడా, నీచెప్పిన+ఉపాయమున=నీవు చెప్పినట్లు+వేలగోవులనిచ్చుట అనునది, ప్రతిగ్రహ+నిరపేక్షియైన+దేశిక+ఉత్తము=బదులుగాపుచ్చు కొనుటయందు+కోరికలేని+గురు+శ్రేష్ఠుని, అనునయింపన్+చూచుట=ఊఱటకలిగించు+ప్రయత్నము,

సీ. ఇతరపయస్వినీవితరణంబున నాకు/అలవియే? ఇది లేని వెలితిదీర్ప
కామధేనువు బిడ్డగాని లోకము లోని/పాడియావని గణింపకుము దీని,
గణనీయమగు దివ్యమణియెడ, తచ్ఛాయ/వీసంబు కల గాజు పూస లేడ?
త్రైలోక్యగురు మహాత్మతకు లోబడి నీకు/చేజిక్కినంతనె చెడునె పెంపు?
కావున స్వదేహదాననిష్క్రయ మొసంగి/దీని విడిపించుటయ పాడి తెరవు నాకు,
దాన మీ పారణకు విఘాతంబు రాదు/తపసి హోమాదికము విలుప్తంబు కాదు 59

పయస్వినీ=పాడిఆవుల, వితరణంబున=దానమున, అలవియే=శక్యమా, గణనీయమగు=ఎంచదగిన, తత్+ఛాయ+వీసంబు=దాని+పోలికలో+అతితక్కువ, త్రైలోక్యగురు+మహాత్మతకు=శివుని+మహత్యముచే, చెడునె +పెంపు=తగ్గునా+దీనిగొప్పదనము, స్వదేహ+దాన+నిష్క్రయము+ఒసంగి=నా+దేహము+ఆవుకు బదులుగా+ఇచ్చి, పాడి+తెరవు=ధర్మ+మార్గము, పారణకు=భోజనముకు, విఘాతము=అడ్డంకి, విలుప్తంబు=లోపము,

క. పరవంతుండవు నీ విది/ఎఱుగవె, భరపడవె ఇమ్మహీజము గావన్
తరమే? స్వయ మక్షతునకు/పరిరక్ష్యము గోలుపుచ్చి ప్రభు నెదుటబడన్. 60

పరవంతుండవు=శివునికి ఆధీనుడు, నీవు+ఇది ఎఱుగవె=నీకుసేవకధర్మము+తెలుసును కదా, భరపడవె+ఈ+మహీజము+కావన్=పూనుకొనవా+ఈచెట్టును+రక్షించుటకు, స్వయము+అక్షతుడు =తనకు+రక్షణక్రమంలో దెబ్బలు తగలనివాడు ,పరిరక్ష్యము=బాగుగా రక్షింపదగినది, కోలుపుచ్చు=పోగొట్టుకొని, ప్రభు+ఎదుటబడన్=ప్రభువు+ఎదుట నిలబడుటకు, తరమే=శక్యమా

ఉ. ఈహితసిద్ధి గోరి భజియింపగ నిచ్చె నొసంగరాని ఈ
రోహిణి నాకు మద్గురువరుండు మదిన్ నను నమ్మి, దీని న
వ్యాహతదేహగా ప్రతిసమర్పణ సేయక తక్కినన్ గురు
ద్రోహము, సేయనే? అధమదుర్గతికిం జననే, శివానుగా. 61

ఈహిత+సిద్ధి+గోరి+భజియింపగన్+ఇచ్చె=కోరదగిన+ప్రాప్తి+కోరి+సేవింపగా+ఇచ్చెను, ఒసంగరాని+ఈరోహిణి=అప్పగించ రాని+ఈనందినిని, అవ్యాహత+దేహగా=కలత నొందని+శరీరముతో, ప్రతి సమర్పణ+సేయక+తక్కినన్=తిరిగిఇవ్వ+లేక+పోయినచో, అధమ+దుర్గతికిం+చననే=నీచమైన+అధోగతికి+పోనా,

ఉ. హింసకు నన్ను నర్హునిగ నెంచిన నీకు కృతజ్ఞుడన్ మదా
శంసితమైన శాశ్వతయశస్తనువుం గరుణింపు మో మృగో
త్తంసమ! చాలు నా కదియ, తత్పరులెన్నడు గారు సుమ్ము! వి
ధ్వంస మవశ్యమై కడచు భౌతికకాయములందు మా దృశుల్. 62

హింసకు+నన్ను+అనర్హునిగన్+ఎంచిన=చంపుటకు+నన్ను+తగనివానిగా+తలచిన, మత్+ఆశంసితమైన+శాశ్వత+యశస్+తనువుం=నాచే+కోరబడిన+నిత్య+కీర్తి+దేహము, మృగ+ఉత్తంసమ=మృగ+శ్రేష్ఠ, తత్పరులు+ఎన్నడున్+కారు+సుమ్ము=ఆశకలవారు+ఎప్పుటికీ+కారు+సుమా, విధ్వంసము+అవశ్యమై+కడచు+భౌతిక+కాయములు+అందు+మా+దృశుల్=నాశము+తప్పనిదై+కాలముపుచ్చు+భూతాత్మకమైన+శరీరములు+అందు+మా+వంటివారు,

తే. పుడమి సంబంధ మాలాపపూర్వ మండ్రు/శర్వ కింకర! విపినాంతసంగతులకు,
మనకిది ఘటిల్లె, గాన సంబంధినైన/నాదు ప్రణయము ద్రోయగా రాదు నీకు." 63

పుడమి+సంబంధములు=భూమిలో+స్నేహములు, అలాప+పూర్వము+అండ్రు=నిండుమాటల+కారణమయినది+అందురు, శర్వ+కింకర=శివ+సేవకుడా, విపిన+అంత+సంగతులకు+మనకు+ఇది+ఘటిల్లె=అడవి+మధ్యన+కలసిన+మనకు+ఈ విధముగాస్నేహము+కలిగినది, నాదు+ప్రణయము+త్రోయగా+రాదు=నా+యాచనను+తీసివేయ+కూడదు,

వ. అని స్వగురుధేనువిమోచనార్థ మాత్మబలిదానమునకు సిద్ధపడిన దిలీపుని దృఢమనోనిశ్చయమును,
నిమ్నాభిముఖనీరముంబలె, నివర్తింపరామి గుర్తించి, ప్రత్యామ్నాయపారణకు 64

స్వ+గురు+ధేను+విమోచన+అర్థము=తన+గురువుగారి+ఆవును+విడిపించు+కొఱకు, నిమ్న+అభిముఖ+నీరము+వలె+నివర్తింప+రాని=పల్లమునకు+సాగు+నీటి+వలె+ఆప+లేని, ప్రత్యామ్నాయ+పారణ=బదులైన+ఆహారమునకు,

ఉ. ఆ హరి సమ్మతించి, ముని ఆవును వీడిన ఆక్షణంబునన్
బాహునిరోధముక్తుడయి, పట్టిన కైదువు బాఱవైచి, అ
వ్యాహతసత్యసంధుడు, నృపాలుడు కేసరి కప్పగించె సం
దేహ మొకింత లేక, తన దేహము నామిషపిండమున్ బలెన్. 65

హరి+సమ్మతించి=సింహము+అంగీకరించి, బాహు+నిరోధ+ముక్తుడయి=చేతుల+స్థంభన+విడబడిన వాడై, కైదువు=ఆయుధము, అవ్యాహత+సత్యసంధుడు=సత్యమైన+ఆడితప్పనివాడు, సందేహము+ఒకింత+లేక=సంశయము+ఒక్కపిసరు+లేకుండా, ఆమిష+పిండమున్+వలెన్=మాంసపు+ముద్ద+వలె

క. శిర సించుక వంచి భయం/కర సింహనిపాతమునకు గాచికొనిన ఆ
పురుషాగ్రణిపై అంబర/చరముక్తము విరులవాన జలజల కురిసెన్. 66

ఇంచుక వంచి=కొంచము దించి, నిపాతము=(సింహము)పైపడుటకు, అంబర+చర+ముక్తము=ఆకాశములో+చరించుదేవతలు+రాల్చిన, విరులవాన+జలజల+కురిసెన్=పూలవాన+రాలుచు (ధ్వన్యనుకరణ)+వర్షించెను.

ఉ. "లెమ్ము, కుమార లెమ్మ" నిన లిప్తపటీరరసాభమై సుధా
సమ్మితమైన మాట విని, సంభ్రమ మొప్పగ లేచినన్ బ్రమో
దమ్మున, మాతృదేవత విధమ్మున, సన్నిధిచేసె ఙేనికిన్
గుమ్మున బాలు చేపు మునిగోవు, కనంబడదయ్యె సింగమున్. 67

లిప్త+పటీర+రస+ఆభమై=పూయబడిన+చందన+రసానికి+సమానమైన చల్లనిదై, సుధా+సమ్మితమైన=అమృత+సమానమైన, సంభ్రమము=వేగిరపాటు, ప్రమోదమ్మున=సంతోషముతొ, సన్నిధిచేసె=చేరువవచ్చె, గుమ్మున+పాలు+ చేపు+ముని+గోవు=పరిమళమైన+పాలు+స్రవించు+ముని+ఆవు,

ఉ. కన్నుల నమ్మలేక తటకాపడు వానికి, ధేనువిట్లనెన్
"నిన్ను బరీక్షసేయుటకు సే నిటు పన్నితి, మాయ, గాని, ఓ
యన్న, ఋషిప్రభావమున నంతకుడైనను నన్ను ముట్టలే
డన్న, వలంతులే? వనమృగాదులు నాకొక కీడు సేయగన్. 68

తటకాపడు=ఆశ్చర్యపడు, అంతకుడైనను=యముడైననూ, వలంతులే=శక్యులే, కీడు=హాని,

మ. గురు పట్లన్ గురుభక్తి, నా యెడ ననుక్రోశంబు గన్పర్చి తో
నరనాథోత్తమ! నీ ప్రపత్తికి ననూనప్రీతి మిన్నంటితిన్
వరమిత్తుం, దగ నేమికావలయునో వాక్రువ్వు సామ్రాజ్యవి
స్తరణంబో అతిపాకశాసనచిరైశ్వర్యంబొ ఇంకేదియో. 69

అనుక్రోశంబున్+కన్పర్చితి=దయ+చూపించితివి, ప్రపత్తికి=భక్తికి, అనూన+ప్రీతి+మిన్నంటితిన్=పెలితిలేని+సంతోషముతో+ఉప్పొంగితిని, వాక్రువ్వు=చెప్పు, అతి+పాకశాసన+చిర+ఐశ్వర్యంబొ=అధికమైన+ఇంద్రునివంటి+శాశ్వత+వైభవమో

క. ఈ పాడిమొదవు వర మీ/నోపునె నాకనుచు శంక నుడుగుము విను, న
న్నాపోవ గొలుచువారికి/చేపుదు గామ్యామృతమును సిద్ధం" బనియెన్ 70

వరము+ఈ+ఓపునె=వరము+ఇయ్య+చాలునా, ఉడుగుము=మానుము, నన్ను+అపోవన్+కొలుచు=నన్ను+తృప్తి పరచగల+సేవచేయు, చేపుదున్+కామ్య+అమృతమును= పాలవలె స్రవింప చేయుదును+కోరికలుఅను+అమృతమును, సిద్ధంబు=నిశ్చయము

చ. ప్రమదతరంగితాత్ముడు నృపాలుడు తా జగదేకవీరశ
బ్దమును గడింప నర్థిజనతర్పణసేయగ తోడుపడ్డహ
స్తములు మొగిడ్చి" అమ్మరో! సుదక్షిణయందు ననుగ్రహింపు వం
శము వెలయింప జాలిన కుమారుని నాక"ని వేడె, వేడినన్. 71

ప్రమద+తరంగిత+ఆత్ముడు=సంతోషపు+అలలతో+కూడినమనస్సుకలవాడు, తా+జగత్+ఏకవీర+శబ్దమును+గడింప=తాను+లోకములో+ఏకై కవీరుడను+కీర్తి+తెచ్చినట్టిది, అర్థి+జన+తర్పణ+సేయగ+తోడుపడ్డ=యాచక+జనుల+తృప్తి+చేయ+తోడుపడినట్టి, మొగిడ్చి=జోడించి, అనుగ్రహింపు=దయ చూపుము, వెలయింప+చాలిన=ప్రకాశింప+సమర్థమగు

శా. వాత్సల్యంబున "నేవమస్తు"నుచు మున్ వ్రాక్రుచ్చి యాసువ్రతున్
ముత్సంపన్న మనస్కు జేసి మరియున్ గో "వస్మదూధస్యమున్,
వత్సా! పత్రపుటంబునం గొని సమాస్వాదింపు మద్దాన నీ
ఉత్సాహంబు ఫలించు బొందుదువు పుత్రోత్పత్తి మాంగల్యమున్". 72

వాత్సల్యము=పుత్రుని యందలి వంటి ప్రేమ, ఏవమ్+అస్తు=అటులే+జరుగు గాక, ఆ+సు+వ్రతున్=అ+మంచి+వ్రతమాచరించినవానిని, ముత్+సంపన్న+మనస్కున్+చేసి=సంతోషపు+భాగ్యము నిండిన+మనస్సుకలవానిగా+చేసి, అస్మత్+ఊధస్యమున్=నా+పాలను, పత్ర+పుటంబు=ఆకు+దొన్నెల, సమ+ఆస్వాదింపుము=బాగుగా+త్రాగుము, అద్దాన+నీ+ఉత్సాహంబు+ఫలించు=దానిచే+నీ+ప్రయత్నము+ఫలించును, పుత్రోత్పత్తి+మాంగల్యమున్=కొడుకుపుట్టు+శుభము,

తే. అనిన బులకలు మై జాదుకొనగ బొంగి/పత్ని పసుపాడి పొత్తిటబట్టి నెత్రు
కందు గాన్పింప గన్నార గనిన యట్లె/అతితరానందతాదాత్మ్యమనుభవించి 73

మై+జాదుకొనగ=శరీరమున+దట్టముగాకలుగగా, పొంగి=సంతోషించి, పసుపాడి+పొత్తిటన్+పట్టి+నెత్రుకందు+కాన్పింపన్=పసుపుపూసిన+బట్టలో+పట్టుకొనబడిన+పసిబిడ్డ+కనిపించగా, కన్ను+ఆరన్+కనిన+అట్లె=

కన్నుల+నిండుగా+చూచిన+అట్టులే, అతి+తర+ఆనంద+తాదాత్మ్యము+అనుభవించి=బాగా+ఎక్కువైన+సంతోషమే+తను అయినట్టు+భావనపొంది,

మ. మనుజేంద్రుండు మహాప్రసాద మనుచున్ మాహేయికిన్ మ్రొక్కి "నీ
అనురాగంబు వరప్రదానమధురోదంతంబు విన్పించి సం
జనితానందుని జేసి మద్గురు ననుజ్ఞాముద్ర జేపట్టి, ఓ
జననీ! వత్సహుతావశిష్టమగు నీ స్తన్యంబు సేవించెదన్" 74

మాహేయి=ఆవు, వర+ప్రదాన+మధుర+ఉదంతంబు=వరము+ఇచ్చిన+ఇంపైన+సంగతి, సంజనిత ఆనందునిన్+చేసి=సంతోషముపుట్టినవానిగా+చేసి, మత్+గురు+అనుజ్ఞా+ముద్రన్+చేపట్టి=మా+గురువు+అనుమతి+సంజ్ఞ+పొంది, వత్స+హుత+అవశిష్టమగు+నీ+స్తన్యంబు+సేవించెదన్=దూడతాగగా+యజ్ఞపు అవసరములు తీరగా+మిగిలిన+నీ+పాలు+పుచ్చుకొనెదను.

క. అని విన్నవింప నందిని/మనమున బ్రియమంది మంచుమలకందువ వీ
డ్కొని యేగుదెంచె నశ్రమ/మున నాశ్రమమునకు, రాజముఖ్యుడు దానున్. 75

విన్నవింప=మనవిచేయ, మంచుమల+కందువ=హిమాలయ+ప్రదేశము, అశ్రమమున=శ్రమలేక,

తే. హర్షవికసితమైన తదాననంబె/చాటుచుండెను సురభి ప్రసాదలబ్ధి,
అయిన తననోట వినిచె ఱేడా సువార్త/గురువునకు బ్రేయసికి బునశ్చరణ చేసి. 76

హర్ష+వికసితము+ఐన+తత్+ఆననంబె=సంతోషముతో+వికసించిన+తన+ముఖమే, సురభి+ప్రసాద+లబ్ధి=నందిని+అనుగ్రము+పొందుట, వినిచె=వినిపించెను, సువార్త=శుభసమాచారము, పునశ్చరణచేసి=మళ్ళీమళ్ళీచెప్పి-ముందు గురువుకు తరువాత భార్యకు చెప్పి.

తే. వినిచి పరితృప్తుడై ఒజ్జ యనుమతింప/ఆస్వదించె దిలీపు డత్యంతతృష్ణ
లేగ కడుపార ద్రాగి పేలిమియుసాగి/తనకు మిగిలిన యట్టి నందిని పయస్సు. 77

వినిచి=వినిపించి, పరి=మిక్కిలి, ఒజ్జ=గురువు, ఆస్వదించె=త్రాగె, అతి+అంత+తృష్ణ=బాగా+ఎక్కువైన+ఇచ్ఛతో, లేగ+కడుపారన్+త్రాగి=దూడ+కడుపునిండా+తాగగా, పేలిమియు+సాగి=హోమకార్యవినియోగము+కొనసాగినతరువాత, పయస్సు=పాలు,

క. తరువాత మఱుదినంబున, వఱువాత యధోచితముగ వ్రతపారణమున్
జరిపి, వసిష్ఠుని యనుమతి, పరమామోదమున దిరుగుపయనంబునకున్ 78

వఱువాత=ప్రాతఃకాలమున, యధా+ఉచితముగ+వ్రత+పారణమున్+జరిపి=శాస్త్ర+యుక్తముగ+గోసేవావ్రత సమాప్తి అందు చేయవలసిన+భోజనము+చేసి, పరమ+ఆమోదమున=అధిక సంతోషముతో, పయనము =ప్రయాణము,

వ. సమకట్టి, హవిస్స్వీకరణంబున ప్రజ్వలించు హోమవైశ్వానరునకు, దూడయఱ్ఱు నాకుచు సుప్రసాద సుముఖియైన సురభిసూతికి, యానసమయసముచిత మంగళమంత్రముఖరులయిన గురుదేవ దంపతులకు, సధర్మిణీసార్థముగ ప్రదక్షిణప్రణామములు నిర్వర్తించి, సన్మంగళోదగ్రతరప్రభావుడై, కాకుత్స్థుడు, సపరివారముగ, గదలి 79

సమకట్టి=సిద్ధపఱచి, హవిస్సు+స్వీకరణంబున+ప్రజ్వలించు+హోమ+వైశ్వానరునకు=పూజా ద్రవ్యములు+ నేతితో తీసుకొనుటచే+బాగుగా జ్వలించు+హోమ+అగ్నికి, దూడ+అఱ్ఱు=దూడ+మెడవంపు, సుప్రసాద+ సుముఖి=మంచిఅనుగ్రహముతో+ప్రసన్నవదనముకల, యాన+సమయ+సముచిత=ప్రయాణ+కాలములో+ చేయ వలసిన, మంగళ+మంత్ర+ముఖరులయిన=తనశుభము+ఆలోచించువారిలో+ముఖ్యులైన, స ధర్మిణీ+ స అర్థకముగ=భార్యతోకలసి+విధి ప్రకారము, సత్+మంగళ+ఉదగ్ర తర+ప్రభావుడై=మంచి+శుభమువలన+ అధికముగాపెరిగిన+తేజస్సు కలవాడై,

తే. రాజధానికి వచ్చె, వార్వములు ద్విగుణ/రయము మెఱయగ గొనితేర శ్రవణసుభగ
రావమై పూర్ణనిజమనోరథము బోని/రథముమీద ననుద్ఘాతరమ్యసరణి. 80

వార్వములు=గుఱ్ఱములు, మెఱయగ=ఒప్పగ, కొనితేర=తీసుకురా, శ్రవణ+సుభగ+రావమై=చెవులకు+ ఇంపైన+ధ్వనితో, పూర్ణ+నిజ+మనోరథము=పూర్తైన+తన+కోరిక, అనుద్ఘాత+రమ్య+సరణి=కుదుపులులేని +మనోహరమైన+మార్గమున,

తే. తడవు కనరామి వేడుక కడలుకొనగ/కొదలు తీఱని చూపుల గువలయేశు
గనిరి ప్రజలు ప్రజావ్రతకర్శితాంగు/అభినవోదయు నోషధీవిభుని బోలె. 81

తడవు+కనరామి=కొంతకాలముగా+కనబడకపోవుటచే, కడలుకొనగ=ఉప్పొంగ, కొదలు=కొఱత, కువలయేశు =రాజు, ప్రజా+వ్రత+కర్శిత+అంగు=పుత్రునికొఱకు+వ్రతముచేయుటచే+కృశించిన+శరీరముకలవాని, అభినవ +ఉదయున్=అప్పుడే+ఉదయించిన, ఓషధీ+విభుని=ఔషధ లతలయొక్క+ప్రభువుని- చంద్రుని

చ. తళతళలాడు మంగళపతాకలతో మణితోరణాలతో
జలజల నక్షత్రప్రసవజాలము జల్లెడు యౌవతంబుతో
కొలకొలమంచు గుంపులుగ గూళ్ళకు జేరు పులుంగు పౌజుతో

కలకలలాడుచున్న కటకంబును జొచ్చె నృపుండు వేడ్కతో. 82

పతాక=జెండ, జలజలన్=జల్లుట అందు అనుకరణ, అక్షత+ప్రసవ+జాలము=అక్షింతలు+పువ్వుల+ సమూహము, యౌవతంబు=యువతీసమూహము, పులుంగు+పౌజు=పిట్టల+బారు, కటకము=రాజధాని

క. ప్రజనితకౌతూహలులై/ప్రజలెల్లరు జయము పాడ గ్రమ్మఱ దాల్చెన్
భుజగేంద్రసార దక్షణ/భుజపీఠముమీద రాజ్యభూమిభరంబున్. 83

ప్ర+జనిత=దట్టముగా+పుట్టిన, కౌతూహలులై=తహతహ కలవారై, భుజగేంద్ర+సార+దక్షణ+భుజ+పీఠము మీద=భూమినిమోయుఆదిశేషువు+అంతశక్తికల+తనకుడి+భుజము+మూపుపై,

తే. అంత గగనము తాల్చునట్లమృత కరుని, ఈశతేజము గంగ ధరించు నట్లు,
లోకపాలప్రభావంబు లేకమైన, ప్రేకటి వహించె కులము వర్ధిల్ల రాణి. 84

గగనము+తాల్చునట్లు+అమృతకరుని=ఆకాశము+ధరించునటుల+చంద్రుని, ఈశ+తేజము=ఈశ్వరుని+ శుల్కము, గంగ+ధరించినట్లు=కుమారస్వామి జననమున శివతేజమును గంగ ధరించినట్లు, లోకపాల+ప్రభావంబులు+ఏకమైన=దిక్పాలకులయొక్క+తేజస్సులు+ఒక్కటై(ప్రవేశించిన), ప్రేకటి+వహించె=గర్భము+ధరించెను,( ఇచ్చట లోకపాలకుడు అన్నది దిలీపునకు పర్యాయపదము. అష్టానాంలోకపాలానాం వపుర్ధారయతే నృప-ఎనిమిది మంది లోకపాపకుల శరీరము ధరించిన రాజు. నావిష్ణుపృధివీపతి వంటిది).

# తృతీయ సర్గము-కుమార సంభవము

మ. పతివాంఛాఫలరూపమై, నిజచిరస్వప్నోదయారంభమై,
కుతకవ్యగ్ర సఖీజనంబునకు చక్షుః కౌముదీ పర్వమై,
క్షితి నిక్ష్వాకుల వంగడంబు గొనసాగింపన్ నిదానంబునై,
అతులోదాత్తము నిల్చె, దౌహృదము గోత్రాధీశు నర్థాంగికిన్. 1

పతి+వాంఛా+ఫల+రూపమై=భర్త+కోరిన+సంతానమునకు+సాకారమై, నిజ+చిర+స్వప్న+ఉదయ+ఆరంభము =తన+చిరకాల+కలల+ఫలసిద్ధికి+మొదలై, కుతక+వ్యగ్ర=తహతహతో+వేగిరపాటుతో, చక్షుః+కౌముదీ+పర్వమై =కన్నుల+వెన్నెల+పండుగై, క్షితిన్=భూమిపై, వంగడము=వంశము, నిదానంబునై=మూలకారణమై, అతుల +ఉదాత్తము=సాటిలేని+ప్రియము కలిగించునది, నిల్చె=కలిగె, దౌహృదము=గర్భము, గోత్ర+అధీశు=నేల+ ప్రభువు-రాజు,

సీ. నీరసించిన మేన నెలకొన్న తెలినిగ్గు/ఛాయవెన్నెల చెన్ను సంతరింప
కొలదిగా దొడిగిన అలతి మై తొడవులు/విరళతారకముల విధము జూప,
వెడవాడి ఎంతేని వెలుకబారిన మోము/మాగుపాటిన చందమామ దొరయ,
బడలిక బహుళమై పొడమిన నిట్టూర్పు/కమ్మతెమ్మెరల చందమ్ము నొంద,
చిక్కి నవసియు, నొక వింత చెలువు మెఱయ/కనుపడియె నాడు ప్రత్యుషఃకల్పమైన
రజని పొలుపున, గోసలరాజగృహిణి/ప్రచురతేజోమయాత్ము, గర్భమున దాల్చి. 2

నెలకొన్న+తెలి+నిగ్గు=కలిగిన+వెలవెలబాఱు+కాంతి, ఛాయ+వెన్నెల+చెన్ను+సంతరింప=కొంచపు+వెన్నెల+ అందము+సంగ్రహింప, అలతి+మై+తొడవులు=తేలికైన+వంటిమీది+భూషణములు, విరళ+తారకముల+ విధము+చూప=దూరదూరముగాఉన్న+నక్షత్రముల+వలే+కనబడ, వెడ+వాడి=ఇంచుకగా+అలసి, ఎంతేని +వెలుకబారు=ఎక్కువగా+తెల్ల పోయిన, మాగుపాటిన=మలినమైన, దొరయ=పోల, బడలిక+బహుళమై+ పొడమిన=అలసట+ఎక్కువవగ+పుట్టిన, కమ్మ+తెమ్మెరల+చందమ్మున్+ఒంద=వాసనగల+చల్లగాలి+ విధముగా+అవగా, అవసియు=అలసియు, చెలువు+మెఱయ=అందము+ప్రకాశింప, కను+పడియె=కంట+

పడె, ప్రత్యుష+కల్పమైన+రజని+పొలుపున=సూర్యోదయము+తోపించుచున్న+రాత్రి+వలెసంతోషజనకముగ, ప్రచుర=మిక్కిలి, తేజోమయాత్ము= ప్రకాశమైనవాని,

చ. "వలవని లజ్జ వచ్చిపడి, వాంఛితమున్ లలితాంగి మాకడన్
తెలుపదు, నాల్క కుంటి వెనుదీయును, మీ చెలి కేమివస్తువుల్
వలయు నయంబుతో నెఱిగి వచ్చి రయంబున జెప్పు" డంచు దా
పలుమరు గ్రుచ్చి గ్రుచ్చి, జనపాలుడు వేడు ప్రియా వయస్యలన్. 3

వలవని=కొఱమాలిన, నాల్క+కుంటి=నాలుక+వెనుకతగ్గి, నయంబుతో+ఎఱిగి=మెల్లగా+తెలిసికొని, వయస్యలన్ =చెలికత్తెలను,

ఉ. దోహదదుఃఖశీలత వధూటి యదర్థము వేడు సద్యమే
ఆహృతమై తదర్థము తదంఘ్రియుగంబున వ్రాలు నత్తరిన్,
సాహస విక్రమాస్పదుడు సజ్యశరాసనుడై నృపుండు స
న్నాహము చేసినం, ద్రిభువనంబున నెందును లే వలభ్యముల్. 4

దోహద+దుఃఖ+శీలత=పేవిళ్ళు+బాధ+స్వభావమున, వధూటి=సుదక్షిణ, యది+అర్థము+వేడు=ఏ+కోరిక+కోరు, సద్యమే+ఆహృతమై=అప్పుడే+తీసుకొని రాబడినదై, తత్+అర్థము=ఆ+కోఱబడినది, తత్+అంఘ్రి+యుగంబున+వ్రాలును+అత్తరిన్=ఆమె+పాదముల వద్ద+జేరును+ఆవెంటనే, సాహస+విక్రమ+ఆస్పదుడు=సాహసము+వీరత్వములకు+స్థానమైన వాడు, సజ్య+శర+ఆసనుడై=సంధించిన+బాణము+అమ్ములు కలవాడై, సన్నాహము=ప్రయత్నము, అలభ్యముల్=దొరకనివి,

క. పేవిళ్ళు కడచి క్రమముగ/దేవి నిజాంగములు పుష్టి దేరగ దోచెన్
ప్రాబడిన యాకు రాలిచి/లావణ్యపు మొగ్గ దొడుగు లతిక యనంగన్. 5

పుష్టి+తేరగన్=సమృద్ధి+కలుగగ, తోచెన్=అనిపించెను, ప్రాబడిన=పాతబడిన, ఆకు+రాలిచి=ఆకులు+రాలిన తరువాత, లావణ్యపు=చక్కదనపు, మొగ్గ+తొడగు=మొగ్గలు+చిగురించు, లతిక=తీగ

తే. నిధులు గర్భమునం గల పృథివి బోలె/జ్వలనమును లోన డాచిన శమిని బోలె,
సలిలములు లోన గల సరస్వతిని బోలె/అరయు నిల్లాలి నిండుచూలాలి నృపతి. 6

నిధులు=సంపదలు, పృథివి=భూమి, డాచిన=దాచిన, శమిని=(లోపల అగ్ని ఉండు)శమీవృక్షము, సరస్వతి=అంతర్వాహినియగు సరస్వతీనది, అరయు=చూచు,

భావము: శిశువు సార్వభౌమత్వము (పృధ్వి), తేజస్సు(అగ్ని), పరమ పవిత్రత(నీరు) అను గుణములు కలవాడు

మ. అనుగుంబ్రేయసి మీది మక్కువకు చిత్తౌన్నత్య సంపూర్తికిన్,
తన దుర్వార భుజాబలార్జిత దిగంతశ్రీకి బెన్నుద్దిగా
ఒనరించెన్ మనువంశమండనుడు గృహ్యోక్త ప్రకారంబు శో
భనముల్ పుంసవనాదికంబులు సముత్పన్న ప్రమోదంబునన్. 7

అనుగుం=ఆప్తమైన, మక్కువకు=కూరిమికి, చిత్త+ఔన్నత్యము=తనమనస్సుయొక్క+గొప్పదనపు, సంపూర్తి కిన్=సంసిద్ధికి, దుర్వార+భుజ+బల+ఆర్జిత=అడ్డులేని+బాహు బలముతొ+సాధించిన, దిగంతశ్రీకి=అన్నిదిక్కుల నుండిసంపాదించినసంపదకు, పెన్నుద్దిగా=సమానముగా, మండనుడు=భూషణుడు, గృహ+ఉక్త=ఇంటి+ఆచార, శోభనములు=శుభకర్మలు, పుంసవన+ఆదికంబులు=పుంసంవనము, అనవలోభన, సీమంతోన్నయనము+ మొదలగువాటిని, సముత్పన్న+ప్రమోదంబునన్=బాగుగాకలిగిన+సంతోషముతో,

సీ. పరిచారికావలంబమున బానుపునుండి/అలసత నిట్టూర్పు లడర లేచు,
అఖిలసేవలకు ప్రత్యామ్నాయముగ గేలు/దలిరు చలింప నంజలి ఘటించు,
స్విన్నాననంబుపై జిఱునవ్వు తులకింప/ప్రణయభాషణసుధారసము నొసగు,
వ్రీడాపరిప్లవవీక్షణమాలికా/విలసనంబుల పేడ్క వెల్లిగొలుపు,
కుశల మారయు వేడుక కొనలుసాగ/అంతిపురికి నిజేశ్వరు డరుగుదేర,
అమరపత్యంశభూయిష్ఠమైన చూలు/మోచికొని డస్సియున్న యా ముద్దరాలు. 8

అవలంబనమున=ఊతతో, అడర=వృద్ధిపొంద, ప్రత్యామ్నాయముగ=బదులుగ, కేలు+తలిరు+చలింప=కర+ పల్లవము+వణక, స్విన్న+ఆననంబుపై=చెమటతోకూడిన+ముఖముపై, తులకింప=ప్రకాశింప, ప్రణయ+భాషణ +సుధా+రసము+ఒసగు=ప్రేమపు+మాటల+తీపి+తనము+బహుమాన మిచ్చు, వ్రీడాపరి+ప్లవ+వీక్షణ+ మాలికా+విలసనంబుల=అధికసిగ్గుతో+తేలు+చూపుల+వరుసల+ప్రకాశమున, పేడ్క+వెల్లిగొలుపు= వినోదము+పరంపరగాపెడలించును, కుశలము+ఆరయు=క్షేమము+విచారించు, కొనలుసాగ=కొనసాగ, అమరపతి+అంశ+భూయిష్ఠము=ఇంద్రుని+అంశచే+సంపన్నమైన( ఇచ్చట ఇంద్రుడు అన్నది దిలీపునకు పర్యాయపదము. అష్టానాంలోకపాలానాం వపుర్ధారయతే నృప- ఎనిమిది మంది లోకపాపకుల శరీరము ధరించిన రాజు. నావిష్ణుపృధివీపతి వంటిది),

క. పొలుపుగ ప్రసవోన్ముఖి యా/పొలతుక బొడగాంచి పతి ప్రమోదము నొందున్,

తొలుకారు కారుమబ్బులు/కలిగిన ఆకాశలక్ష్మి గాంచిన యట్టుల్. 9

పొలుపుగ=ఒప్పుగ, ప్రసవ+ఉన్ముఖి=ప్రసవమునకు+సిద్ధమైన, పొలతుక=స్త్రీ, పొడగాంచి=చూచి, తొలుకారు +కారు+మబ్బులు=వానాకాలపుమొట్టమొదటి+నల్ల+మబ్బులు,

ఉ. భానుని జేరబోక, గ్రహపంచక మయ్యెడ ఉన్నతోన్నత
స్థానగతంబులై శిశువు జాతకవైభవ ముగ్గడింపగా,
మానవరాట్ కుటుంబిని కుమారుని గాంచె, త్రిసాధనాయుతం
బైన అమోఘశక్తి మహితాక్షయసంపద నీను కైవడిన్. 10

భానుని+చేరబోక=సూర్యగ్రహముతోకలవక, గ్రహ పంచకము=ఐదు గ్రహములు, ఉన్నతోన్నత స్థానగతంబులై =తమతమఉచ్ఛలలోఉండి, ఉగ్గడింపగా=ప్రకటించగా, మానవరాట్+కుటుంబిని=రాజు+భార్య, కాంచె=కనెను, త్రిసాధనా+యుతంబైన=రాజునకుండవలసిన ప్రభావ, మంత్ర, ఉత్సాహ, సాధనములు+కలిగిన, అమోఘ+శక్తి= సఫలమైన+సామర్థ్యము, మహిత+అక్షయ+సంపద=గొప్పదై+ఎప్పుడూతగ్గని+శ్రీ, ఈను+కైవడిన్=కలిగించును +అనునట్లుగా,

కవిరాజవిరాజితము. పవనము హాయిగ వీచె, ప్రసన్నవి/భాపరిదీప్తము లయ్యె దిశల్,
హవి ననలుండు ప్రదక్షిణకీలల/నందుకొనెన్ సుభగజ్వలుడై,
సువిహితవైఖరి నప్పుడు మంగళ/సూచకమయ్యె సమస్త మిటుల్,
భువన మహాభ్యుదయంబు నిమిత్తమై/పుట్టుదురిట్టి మహాపురుషుల్. 11

పవనము=గాలి, ప్రసన్న+విభా+పరిదీప్త ములయ్యె+దిశల్=సుముఖముగా+ప్రకాశముతో బాగుగావెలిగినవి+ నలు దిక్కులు, హవిన్+అనలుండు=యజ్ఞ కుండ మందలి+అగ్ని, ప్రదక్షిణ కీలలన్+అందుకొనెన్=శుభ సూచకముగా సవ్యముగా తిరుగుజ్వాలల+చేకొనె, సుభగ+జ్వలుడై=మంగళకరమైన+కీలలుకలవాడై, సువిహిత +వైఖరిని=బాగావిధింపబడిన+విధమున, భువన+మహాభ్యుదయంబు+నిమిత్తమై=లోకమునకు+ గొప్పశ్రేయస్సు+కోసమై,

క. కలయ బురిటింటి పానుపు/నలమిన రా చూలి నైజమగు తేజముచే,
నడిరే దివియలు సహసా/గళితాభములయ్యె చిత్రగతముల కరణిన్. 12

కలయ=అంతటను, అలమిన=వ్యాపించిన, రాచూలి+నైజమగు+తేజముచే=రాచబిడ్డ+స్వాభావిక+తేజస్సుచే, నడిరే+దివియలు=అర్ధరాత్రి+దీపములు, సహసా+గళిత+ఆభములు+అయ్యె=హటాత్తుగా+తఱిగిన+ దీప్తికలిగినవి+అయినవి, చిత్రగతముల+కరణి=చిత్రములలోనుండు దీపముల+విధముగ,

ఉ. విచ్చిన మోముతో ఎడద వెల్లువకట్టిన సంబరంబుతో
వచ్చి, కుమారజన్మశుభవార్త సుధామిళితాక్షరంబు వా
క్రుచ్చిన దేవి చేటికలకుం దన సొమ్ముల నెల్ల నిల్వుదో
పిచ్చె దిలీపు, డొక్క వెలియెల్లియు, సీవిరిదోయియున్ వినా. 13

ఎడద=గుండె, వెల్లువకట్టిన=ధారారూపకముగా స్రవించిన, సుధా+సమ్మిళిత+అక్షరంబు=అమృతముతో+ నిండిన+మాటలు, వాక్రుచ్చిన=చెప్పిన, చేటికలకుం=చెలికత్తెలకు, వెలి+ఎల్లి=తెల్ల+గొడుగు-శ్వేతఛత్రము, సీవిరిదోయి=రెండు చామరములు(ఛత్ర చామరములు శ్వేతఛత్రము రాజచిహ్నాములు ), వినా=మినహాయించి,

ఉ. అందము చింద నందనుని ఆననశోభ నివాతపద్మని
ష్పందము లైన ఉల్లసితచక్షుల నానుసెడన్, ప్రహర్షని
ష్యందము డెందమం దిముడజాలక పైపయి బొంగె తండ్రికిన్
చెందొవవిందు గన్గొనిన సింధుజలౌఘము చందమందుచున్. 14

ఆనన+శోభ్=ముఖ+కాంతి, నివాత+పద్మ+నిష్పందము=గాలిలేని ప్రదేశమునందలి+కమలముల వలె+ చలనము లేక, ఉల్లసిత=గర్వపు, చక్షుల+ఆను+ఎడన్=కన్నుల+చూచు+అప్పుడు, ప్రహర్ష+నిష్యందము= అధిక సంతోషపు+ప్రవాహము, డెందమందు+ఇముడజాలక=హృదయములో+పట్టలేక, చెందొవ+విందు=ఎఱ్ఱ కలువకు+విందుకలిగించు-చంద్రుని, సింధు+జల+ఔఘము+చందము+అందుచున్=సముద్ర+నీటి+వరద+ విధము+పొందుచు,

వ. అంత సాకేతపతి పంపిన వేగరుల వలన గుమారసంభవము నాలించి తపోవనమునుండి విజయంచేసి మనుకుల పురోధ, మైత్రావరుణి మాగధేయునకు, విహితప్రకారమున జాతకర్మాదికములునిర్వర్తించె. 15

వేగరి=సమాచారముత్వరగాచేరజేయువాడు, సంభవము=కలుగుట, మనుకుల+పురోధ=మనుమహారాజ కులమునకు+పురోహితుడు, మైత్రావరుణి=వశిష్ఠుడు, విజయంచేసి=వచ్చి, మాగధేయునకు=మగధదేశ కుమార్తె అయిన సుధేష్ణ కుమారునకు, విహిత=విధింపబడిన, జాతకర్మ=పుట్టిన శిశువుకు బొడ్డుకోయక ముందుచేయు వేదోక్త సంస్కారము, నిర్వర్తించె=జరిపెను,

క. జనపతికుమారు డినకుల/జననమున ఋషిప్రయుక్తసంస్కారమునన్
గని బుట్టి సానబుట్టిన/అనర్ఘమణి కరణి మెఱసె నద్భుతకాంతిన్ 16

ఇనకుల+జననమున=పవిత్రమైన సూర్యుని వంశములో+పుట్టుటచే కలుగు సంస్కారము చేతను, ఋషి+ప్రయుక్త+సంస్కారము=వశిష్ఠమునిచే+పరంపరగా చేయవలసిన+వేదోక్త కర్మలు ఫలితముగను, సానబెట్టిన=మెఱుగు పెట్టిన, అనర్ఘ=వెలలేని, కరణి=వలె, మెఱసెన్=ప్రకాశించెను,

క. మొరసె శుభతూర్యనినదము/నిరవధిగణికాప్రమోదనృత్తాన్వితమై

నరపతి వీటనె, కా, దల/సురవర్త్మమునందు గూడ, శ్రుతిపేశలమై. 17

మొరసె=మ్రోగె, శుభ+తూర్య+నినదము=మంగళ+వాద్య+ధ్వనులు, నిర్ అవధిక+గణికా+ప్రమోద+నృత్త+అన్వితమై=ఎడతెగని+ఆటకత్తెల+ఆనంద+నాట్యముతో+కూడినదై, నరపతి+వీటనె+కాదు=రాజు+పట్టణముననే+కాకుండా, అల+సురవర్త్మము=ఆక్కడ+దేవతలమార్గము-ఆకాశమున, శ్రుతి+పేశలమై=చెవులకు+ఇంపై,

తే. బద్ధుడనువాడు లేడు, తత్పాలనమున/ఎవని విడుదలచేయు, నరేంద్రు డపుడు?

తనయుజననోత్సవంబున దనకు దానె/పితృణమను పెద్దచెఱ విడిపించుకొనియె. 18

బద్ధుడు=నేరముచేసినబంధి, తనయు+జనన+ఉత్సవంబున=కొడుకు+పుట్టిన+సంబరమున, పితృణము=పితృదేవతలఋణము, చెఱ=నిర్బంధము,

తే. అరుగజాలును వీడు శ్రుతాంతమునకు/అటులె విమతాంతమున కాజియందు నంచు,

ధాతుగమనార్థ మరసి అర్థవిదు డగుట/బిడ్డనికి ఱేడు రఘువని పేరు పెట్టె. 19

శ్రుత+అంతము=శాస్త్రముయొక్క+పారము(అవతలి తీరము), విమత+అంతమునకు=శత్రువుల+తుదవరకు, ఆజి=యుద్ధము, ధాతుగమనార్థము+అరసి=లఘి ధాతువుయొక్కగమనరూపార్థమును+చూసి, అర్థవిదుడు=శబ్దార్థజ్ఞుడు-"లఘి" ధాతువునకు గమనము అని అర్థము. దానికి ఉణాది సూత్రము చేత ఉత్వము(లఘు) రేఫము వచ్చుటచేత "రఘుః" అను శబ్దము సిద్ధించును,

శా. ఆరూఢస్థిరభాగ్యశాలి జనకుండత్యర్థయత్నంబుతో

గారాబంబుగ దన్ను బెంప, బెరిగెన్ దద్బాల రాజన్వహ

స్ఫారీభూత మనోజ్ఞ విగ్రహమునన్ సంప్రేక్షణీయాకృతిన్,

సారజ్యోతిరనుప్రవేశమున లేజాబిల్లి ఎట్లవ్విధిన్. 20

ఆరూఢ+స్థిర+భాగ్యశాలి=ప్రసిద్ధమైన+నిలకడైన+సంపదలు కలవానిని(నిలకడైన సంపదలు కలవానిగా ప్రసిద్ధి చెందిన), అత్యర్థ+యత్నంబుతో=మిక్కిలి+పట్టుదలతో, తత్+బాలరాజు=ఆ+రఘువు, అన్వహ+స్ఫారీభూత+మనోజ్ఞ+విగ్రహమునన్+సంప్రేక్షణీయ+అకృతిన్=వంశము+వృద్ధికలిగించు+మనోహర+దేహముతో+చూడదగ్గ+

ఆకారుని, సార+జ్యోతి+అనుప్రవేశము=ఆయువుపట్టయిన+సూర్యుడు+అనుసరించి ప్రవేశించుటచే, లేజాబిల్లి =శుక్లపక్షచంద్రుడు(శుక్లపక్షమందు చంద్రుడు సూర్యకిరణములచేత దినదిన ప్రవర్ధమానమయ్యెడు రీతి రఘువు వృద్ధిపొందెను),

ఉ. స్కందకుమారుగన్న గిరిజావృషభాంకుల భంగి మైహొయల్
చిందు జయంతు గాంచిన శచీశతమన్యుల లీల దత్సమున్
నందను జూచి డెందమున నందము జెందిరి సాంద్రకౌతుకం
బందిరి తద్ ద్వయీసదృశులైన సుదక్షిణయున్ దిలీపుడున్. 21

స్కందకుమారుని=కుమారస్వామిని, గిరిజా+వృషభాంకుల=పార్వతీ+(వృషభ+అంకిత=నందిచే+కటిప్రదేశమున తాల్చబడిన)పరమేశ్వరుల, మై+హోయలు=తను+విలాసము, చిందు=వ్యాపించు, శచీ+శతమన్యుల=శచీదేవి +ఇంద్రుల, తత్+సమున్=కుమారస్వామితో, జయంతునితో+సమానుని, డెందమునన్=హృదయములో, నందము=ఆనందము, సాంద్రకౌతుకంబు+అందిరి=గాఢ+సంతోషము+చెందిరి, తద్+ద్వయీ+సదృశులు= ఆ+పార్వతీపరమేశ్వరుల ఇంద్రశచీదేవుల జంటలతో+సమానులైన,

తే. ఎలమి జక్కవకవయందు బలె బరస్ప/రాశ్రయము, భావబంధము నైన వారి
ప్రణయము, తదేకసుతుడు దా బంచికొన్న/తఱుగక ప్రవృద్ధమయ్యె నొండొరులపట్ల. 22

ఎలమి=ప్రేమ, జక్కవ+కవ=చక్రవాకపక్షి+జంట, పరస్పర+ఆశ్రయము=ఒండొరుల+ప్రాపు, భావ+బంధము= అభిప్రాయాల+ఒడంబడిక, ప్రవృద్ధము=బాగుగాపెరిగినది,

సీ. "తాత, అత్త" అటంచు దాది పల్కించిన/తొలితొలి పలుకులు పలుకునపుడు,
చిన్నారి పెదవుల జిఱునవ్వు తులకింప/పలుమొగ్గచాలు కన్పఱచునపుడు,
జోతపెట్టు మటంచు చూపి చేయించిన/ చిఱుగేలు చిఱుగేలు చేర్చునపుడు,
పడుచు లేచుచు, లేత యడుగులు కసుగంద/పెడ దప్పటడుగులు వేయునపుడు,
పరిజనము చంకనుండి తన్నరసి యురికి/ఎత్తుకొనుమంచు జేతు లందించు నపుడు,
కొడుకు గుఱ్ఱని ముద్దుపోకడలు చూచి/తండ్రి కుత్తుకబంటి మోదమున దేలు. 23

దాది=తల్లి, తులకింప=ప్రకాశింప, పలుమొగ్గ+చాలు=చిన్నిపండ్ల+వరుస, కసుగంద=మిక్కిలిబాధపడ, పెడ= అల్ప, అరసి=చూచి, కుఱ్ఱని=చిన్నవాని, కుత్తుకబంటి=కంఠము వరకు, మోదమున+తేలు=సంతోషమున+ మునుగు,

లయవిభాతి కొలువువిడి వచ్చునెడ కిలకిలని నవ్వలరు/అలరు మొగమొప్ప దన కెలని కరుదేరన్,

లలిత సుకుమారు సుతు గులకరు గుతూహలము/నెలకొన నిజాంకమున నిలిపికొని తత్కో
మల తనువు నోకి మన మలరగ సుధారసము/చిలికిన సుఖాతిశయ మలవడగ గన్నుం
గొలుకు లరమోడ్చి నృపతిలకుడు కుమారతను/మిళన రసతన్మయత బులకలు వహించున్. 24

కొలువువిడి=రాజసభ విడచి, నవ్వు+అలరు+అలరు+మొగము+ఒప్ప=నవ్వుతో+ఒప్పు+సంతోషపు+ముఖముతో+కూడి, కెలనికి=సమీపమునకు, కులకరు=వంశమునిలుపు కుమారుడు, నెలకొన=కలుగగా, నిజ+అంకమున=తన+తొడపై, మనము+అలరగ=మనస్సు+సంతోషింప, సుధారసము+చిలికిన=అమృతము +చిలకరించుకున్న, అలవడ=సిద్ధింప, కన్నుం+కొలుకులు=కంటి+రెప్పలు, అరమోడ్చి=పరవశమున సగమువాల్చి, తిలకుడు=శ్రేష్ఠుడు, మిళన+రస+తన్మయత=కలయు+సంతోష+పరవశమున, పులకలు=రోమాంచము,

ఉ. అందపు బిల్లజుట్లు వదనాంచలసీమ నటించి నొంపు నిం
పం దన యీడుజోడగు నమాత్య తనూజుల తోడ గూడి తా
నందఱ మేటియై, లిపిసమభ్యసనంబున జొచ్చె వాఙ్మయం
బందు, నదీముఖంబున మాహాబ్ధిబలెన్, రఘు డశ్రమంబునన్. 25

వదన+అంచల+సీమ+నటించి+నొంపు+ఇంపార=ముఖ+ప్రక్క+భాగమున+తోచిన+అందము+ఆనందము కలిగించ, అమాత్య=మంత్రి, లిపి+సమ+అభ్యసనంబున=అక్షర వర్ణముల+సమగ్రముగా+అభ్యాసముచేసి, చొచ్చె+వాఙ్మయంబందు=మొదలుపెట్టె+రాజోచితవిద్యలయందు, నదీ+ముఖంబున+మాహా+అబ్ధి+బలెన్+చొచ్చెన్=నది+ద్వారా+గొప్ప+సముద్రమునందు+వలె+ప్రవేశించెను, అశ్రమంబునన్=తేలికగా,

తే. నృపతి సుతుని సకాలోపనీతు జేసి/చదువు లాచార్యసన్నిధి జదువబెట్టె,
వానియెడ గురుయత్న మవంధ్య మయ్యె/ పరమవస్తూపహితశిక్ష పండు టరుదె, 26

సకాల+ఉపనీతున్+చేసి=తగినవయసులో+ఉపనయము చేయబడ్డవాడుగా+చేసి, సన్నిధి=వద్ద, గురు+యత్నము=గురువుగారి+ప్రయత్నము, అవంధ్యమయ్యె=సఫలమయినది, పరమ+వస్తు+ఉపహిత+శిక్ష=శ్రేష్ఠమైన+తత్వమున+ఉంచబడిన-విద్యార్థికినేర్పిన+శిక్షణ, పండుట+అరుదె=ఫలించుట+ఆశ్చర్యమా,

తే. కృత్స్న బుద్ధిగుణముల నుత్కృష్టుడతడు/క్రమముగ దరించె జతురర్ణవములవంటి,
అలచతుర్విద్యలను, సమీరాతిపాతి/దృఢహరుల కల్మి రవి, చతుర్దిశల బోలె 27

కృత్స్న =సమగ్ర, బుద్ధిగుణముల=శుశ్రూష, శ్రవణం, గ్రహణం, ఊహాపోహలు(యుక్తాయుక్త విమర్శ), అర్థవిజ్ఞానము( పదార్థపరిజ్ఞానము), తత్వజ్ఞానము-అందు, ఉత్కృష్టుడు=శ్రేష్ఠుడు, తరించె=దాటె(నేర్చెను),

చతుర్+అర్ణవములు=నాలుగు+సముద్రములతొ సమాన మగు, అల+చతుర్విద్యలు=నిర్దేశించిన+అన్వీక్షకీ త్రయీ, వార్తా, దండనీతి-అను రాజోచితవిద్యలు, సమీర+అతిపాతి+దృఢ+హరుల+కల్మి+రవి=వాయువేగమును +అతిక్రమించు+బలసిన+గుఱ్ఱములు+కలుగుటచే+సూర్యుడు, చతుర్+దిశల=నాలుగు+దిక్కుల,

తే. అభ్యసించె యథావిధి అస్త్రవిద్య/తండ్రి శిక్షింప, మంత్రవంతముగ రఘువు,
జగతి నేకైకపార్థివుడగుటె కాదు/తథ్య మేకైక ధన్వియు దద్గురుండు. 28

అభ్యసించె=నేర్చుకొనెను, అస్త్ర=మంత్రసహితశస్త్రము, శిక్షింప=బోధించ, పార్థివుడు=రాజు, ఏకైక+పార్థివుడు= సాటిలేని+భూపతి, తథ్యము=సత్యము, ధన్వి=ధనస్సుధరించినవాడు, తత్+గురుండు=అతని+తండ్రి-దిలీపుడు,

చ. క్రమముగ శైశవం బెడలి ప్రాయము పైకొనినన్ మహోక్షభా
వమునకు ఉన్ముఖం బయిన వత్సతరంబు వలెన్, గజేశ్వర
త్వమునకు నఱ్ఱుసాచు కలభంబు విధంబున దోచె లోచనీ
యముగ సుదక్షిణాసుతు డుదారగభీరమనోహరాకృతిన్ 29

శైశవంబు=బాల్యము, ఎడలి=దాటి, ప్రాయము+పై కొనినన్=పడుచు తనము+కలుగు చుండిన, మహా+ ఊక్ష భావము=మహా+వృషభత్వము, ఉన్ముఖంబు=సిద్ధము, వత్సతరంబు వలెన్=కోడెదూడ వలె, గజేశ్వరత్వము=మహాగజము అనిపించుకొనుటకు, అఱ్ఱుసాచు=ఎదురు చూచు, కలభము=ఏనుగుపిల్ల, లోచనీయముగ=చూడదగినవానిగ, ఉదార+గభీర+మనోహర+ఆకృతిన్=గొప్ప+గాంభీర్యహృదయము+ అందమైన+రూపముతో,

తే. పుత్రకున కంత గోదానపూర్వకముగ /జనకు డనురూపవతి నిచ్చి జరిపె పెండ్లి
ప్రణయ పదమయ్యె రఘున కా రాజపుత్రి/అమృతకరునకు రోహిణీరమణి కరణి 30

గోదానపూర్వకముగ=వివాహమునకుముందుజరిపు ఒకానొక కేశ సంస్కారక్రియ, (బ్రాహ్మణునకు 16 క్షత్రియునకు 22 వయస్సున), అమృతకరుడు=చంద్రుడు,

మానిని. ప్రాయపు ముమ్మరముం, బరిణద్ధకవాట సువక్షము, పీనయుగ
వ్యాయతబాహులు, కంబుగళంబు, ఉదాత్తమనోహరరేఖయునై
కాయము మేటి పసం, పితృపాదుని గాదనియున్, రఘు వప్డు సదా
పాయని నమ్రత నొంపున, దా గనుపట్టె గడుం బసిబిడ్డ వలెన్. 31

ప్రాయము=వయస్సు, ముమ్మరము=అతిశయము, పరిణద్ధ+కవాట+సు+వక్షము=విశాలమైన+తలుపుల వంటి+మంచి+వక్షస్థలము, పీన+యుగ+వ్యాయత+బాహులు=బలసినకాడిమాను+జంటవంటి+సుదీర్ఘములైన

+భుజములు, కంబు+గళము=శంఖమువంటి+కంఠము, ఉదాత్త+మనోహర+రేఖ=ప్రియమైన+సౌందర్యవంతమైన+శరీరసౌష్ఠవము, కాయము+మేటి+పసం=శరీరపు+అధిక+నిగ్గుతో, పితృపాదుని+కాదని=తండ్రిగారిని+మీరి-మెచ్చక, సదా+పాయని=ఎప్పుడు+విడవని, నమ్రత+సొంపున=వినయపు+ప్రసన్నత,

తే. నిజనిసర్గ సంస్కారవినీతు నతని/తద్గురుడు యౌవరాజ్యపదస్థు జేసి
ఎండ్లతరబడి తాను వహించుచున్న/ప్రజల భారము తేలిక పఱచుకొనియె 32

నిజ+నిసర్గ=తన+స్వభావముచేత, సంస్కార+వినీతుడు=శాస్త్రాభ్యాసమువలనకలిగిన+వినమ్రుడు,

తే. ఆ మహారాజమూలాశ్రయమును విడిచి/అవలి యువరాజ నామ నవాస్పదమును,
అంశమును బొందె సిరి, సుగుణాభిలాష/దమ్మి నెడలి నవోదితోత్పలము బోలె 33

మహారాజ+మూలాశ్రయమును+విడిచి+అవలి=దిలీపుడను+ప్రధానస్థానమును+వదలిన+పిమ్మట, అవలి=తరువాతి, యువరాజనామ+నవ+ఆస్పదమునకు=యువరాజను పేరుకల రఘువనెడు+క్రొత్త+స్థానపు, అంశమును+పొందె=విషయము+కలగె, సిరిసుగుణాభిలాషి=వినాయాదిగుణములు కోరు రాజ్యలక్ష్మీ, తమ్మిన్+ఎడలి=పద్మమును+విడచి, నవ+ఉదిత+ఉత్పలము+బోలె=కొత్తగా+పుట్టిన+కలువను+వలె, భావము=దిలీపుడు-సూర్యుడు-వృద్ధుడు; రఘువు-చంద్రుడు-యువకుడు.ముకుళించు కమలము నుండి వికసించు కలువను రాజ్యలక్ష్మి చేరెను.

ఉ. వారిధరవ్యపాయుడు విభావసు కైవడి విస్ఫురన్మదో
ద్గారి కపోలభిత్తి వనదంతి విధంబున, వేగవన్మరు
త్సారధికంబు దావశిఖి చాడ్పున దుస్సహుడయ్యె నెంతయున్
శూరవతంసమైన తన సూనుని తోడి దిలీపుడయ్యెడన్. 34

వారిధర+వ్యపాయుడు+విభావసు+కైవడి=మేఘముల+సమాప్తిచెందించు+సూర్యుని+వలె, విస్ఫురన్+మద+ఉద్గారి=విస్తారముగా+మదము+స్రవించు, కపోల+భిత్తి=గండస్థలము+పగిలిన, వనదంతి=అడవి ఏనుగు, వేగవన+మరుత్+సారధికంబు=వేగమైన+వాయువు+సహాయకుడుగానున్న, దావశిఖి+చాడ్పున=దావాగ్ని+వలె, దుస్సహుడయ్యె=సహింపలేనివాడయ్యెను, శూరవతంసము=శూరులలో శిరోభూషణుడు,

మ. చతురంగధ్వజినీసమేతముగ పశ్చాద్గామియై సర్వదా
ధృత సజ్జీకృత ధన్వుడై కొడుకు సత్రీయాశ్వముం గావగా,
కృతసంకల్పుడు చేసె కోసల విభుం డేకావశిష్టంబుగా
క్రతువుల్ నూఱు, శతక్రతూపముడు దీక్షానిర్వికల్పంబుగన్ 35

చతురంగ=రథ గజ తురగ పాద సేనలు, ధ్వజిని=జెండా, పశ్చాత్+గామియై=వెనుక నడచువారై, సర్వదా+ధృత=ఎల్లప్పుడు+పట్టుకొనిన, సజ్జీకృత+ధన్వుడై=ఎక్కుపెట్టిన+విల్లుకలవాడై, సత్రీయ+అశ్వముం+కావగా = అశ్వమేధపు+గుఱ్ఱము+కాచుచుండగా, కృతసంకల్పుడు=నిశ్చయించినవాడై, ఏక+అవశిష్టంబుగా=ఒక్కటి+తక్కువుగా, శతక్రతు+ఉపముడు=ఇంద్రునితో+పోల్చదగ్గవాడు, దీక్షా+నిర్ వికల్పంబుగన్= పట్టుదలతో+అవిఘ్నముగా,

ఉ. ఆయన, పిమ్మటన్ శతతమాధ్వరకార్య ముపక్రమించి మే
దీయహయంబు బోవిడువ ద్రిమ్మరిత్రిమ్మరి వచ్చి కావలిం
గాయుచు నున్న పెక్కు విలుకాండ్రుర కన్నులముందు మాయమై
పోయె మహేంద్రజాలమున బోలె, దురంగమ మున్నపాటునన్. 36

ఆయన=దిలీపుడు, శతతమ+అధ్వర+కార్యము+ఉపక్రమించి=నూఱవ+యాగ+కార్యము+ప్రారంభించి, మేదీయ+హయంబు=యాగ+అశ్వము, త్రిమ్మరిత్రిమ్మరి=తిఱిగితిఱిగి, తురంగమము+ఉన్నపాటునన్= గుఱ్ఱము+అకస్మాత్తుగా,

క. క్రతుహయముకొఱకు అటు నిటు/వెతకి వెతకి, కానలేక వెలవెల నగుచున్
వితతవిషాదవిలుప్త/ప్రతిపత్తివిముగ్ధమయ్యె బలమెల్ల వెఱన్. 37

క్రతు+హయము=యజ్ఞపు+గుఱ్ఱము, వెలవెలన్+అగుచున్=తెల్ల+పోయి, వితత+విషాద+విలుప్త+ ప్రతిపత్తి+విముగ్ధము=ఎక్కువైన+దిగులుచేత+కోలుపోయిన+కర్తవ్యముతో+తెలివిలేనివారై, బలము+ఎల్ల=సైన్యము+అంత, వెఱన్=భయముతో,

క. తటపట మిదియే మొకొ యని/తటకాపడి తలచుచుండ దైవికముగ బై
తటమున జనియెడి నందిని/తటుకున డిగి నిలచె రాజతనయుని ఎదుటన్ 38

తటపటము=మోసము, తటకాపడి=చేష్టలుడిగి, పైతటమున=ఆకాశమున, తటుకున=(గుండెఅదురుట యందనుకరణము)హటాత్తుగ, డిగి=దిగి,

వ. ఇట్లు సన్నిధి చెసిన శ్రుతప్రభావ యగు వసిష్ఠ హవిర్గవికి ప్రదక్షిణించి అక్కుమారుడు తదంగనిష్యందజలమును గన్నుల కద్దుకొనుటయును, తదారాధన విశేషమున నుపలబ్ధమైన అతీంద్రియవస్తు సందర్శన సామర్థ్యమున తన కట్టెదుట ననతి దూరమున ముహుర్ముహుస్సూతనిషిద్ధచాపలమైన యా మావును. 39

సన్నిది చేసిన=ప్రత్యక్షమైన, శ్రుత+ప్రభావ=కొనియాడబడిన+మహత్యముకల, హావిర్గవికి=యాగపు ఆవుకు-నందినిని, తత్+అంగ+నిష్యంద+జలము=దాని అంగమునుండి+జారిన+నీరు(మూత్రము), తత్+ ఆరాధన+విశేషమున=దానిని+పూజించిన+ఫలితముగా, ఉపలబ్ధ=కలిగిన, అతీంద్రియవస్తు+సందర్శన+సామర్థ్యమున=ఇంద్రియములకు కనబడని+వస్తువుల చూచు+సమర్థతచే, కట్టెదుట=ఎదురుగా, న+అతి+దూరమున=దగ్గరగా, ముహుర్ముహు=మాటిమాటికి, సూత+నిషిద్ధ+చాపలమైన=సారధిచే+నివారింపబడిన+తప్పించుకొను ప్రయత్నపు ఉద్ధతికల, మావును=గుఱ్ఱమును

క.　పగ్గముల తోడ దనదగు/బగ్గీ కొకపైపు గట్టి పరుగున జను ప్రాగ్
　దిగ్గామి దివ్యపురుషుడు/దృగ్గోచరుడయ్యె నొకడు, నృపసూనునకున్　　40

బగ్గీ=రథము, ప్రాగ్+దిక్+గామి=తూర్పు+దిక్కుకు+వెళ్ళు, దివ్యపురుషుడు=ఇంద్రుడు. దృగ్గోచరుడయ్యె =కనబడెను,

క.　నిర్ణయము చేసెనాతని/నిర్నిమిషములైన పేయినేత్రములు, హరి
　ద్వర్ణహయంబులు గనుగొని/స్వర్నాయకుడని, దిలీపసంభవు డతనిన్.　　41

నిర్ణయముచేసె=నిశ్చయించె, నిర్నిమేషములైన=రెప్పలువ్రాల్చకుండు, హరిత్+వర్ణ+హయంబులు=ఆకుపచ్చ+రంగుగల+గుఱ్ఱములు, స్వర్+నాయకుడని=స్వర్గాధిపతిఇంద్రుడని

క.　శతమన్యు నతని బొడగని, ద్యుతలంబున మారు మ్రోగు నుచ్చైఃశ్రుతితో
　క్షితినాథసుతుడు పలికెను ధృతిమద్వాక్కులనె వాని ద్రిప్పెడు భాతిన్　　42

శతమన్యుడు=నూరుయాగములు చేసినఇంద్రుడు, పొడగొని=చూచి, ద్యుతలంబున=ఆకాశమున, ఉచ్చైఃశ్రుతితో =హెచ్చైన గొంతుతో, ధృతిమత్+వాక్కులనె=ధైర్యపు+మాటలతోడనె, త్రిప్పెడు+భాతిన్=గుఱ్ఱము వెనుకకు తిరిగఇచ్చువాని+విధంగా.

తే.　"క్రతుహవిర్భోక్తలందు ఓంప్రథము డెవ్వ/డనిన నిను జెప్పుదురు విజ్ఞు, లనిమిషేంద్ర!
　సతతదీక్షాపవిత్రు డస్మజ్జనకుని/క్రియకు నీవు విపక్షీకరింతు వేల?　　43

క్రతు+హవిర్+భోక్తలందు=యాగపు+హవిస్సు+భుజించువారలలో, ఓంప్రథముడవు=మొట్టమొదటివాడవు, విజ్ఞులు =తెలిసినవారు, అనిమిషేంద్ర=రెప్పపాటులేనిదేవతలరాజ, సతత+దీక్షా+పవిత్రుడు+అస్మత్+జనకుని+క్రియకు=నిరంతరము+నియమముతో+శుద్ధుడైన+మా+తండ్రిగారి+యాగకార్యమునకు, విపక్షీకరింతువు=ప్రతికూలించెదవు,

చ.　తలప ద్రిలోకనాథుడ వుదాత్తచరిత్రుడ వీవు పేయుగ

న్నుల నవరోధకారుల గనుంగొని, శాస్తియొనర్చి జన్నముల్
నిలుపుట పాడి గాని, మఱి, నీవె విఘాతము తెచ్చి పెట్టినన్
పొలియదె, కర్మకాండ? గతి పుట్టునె, కంచియె చేను మేసినన్ 44

పేయుగన్నులన్=అప్రమత్తతో, అవరోధకారుల=యాగములను అడ్డగించువారల, శాస్తి=శిక్ష, జన్నములు=యాగములు, నిలుపుట+పాడి=నిలపెట్టుట+న్యాయము, మఱి=అట్లుకాక, విఘాతము=విఘ్నము, పొలియదె=చెడదా, కర్మకాండ=యాగనిర్వహణ, గతి+పుట్టునె=దిక్కు+కలుగునే,

తే. కాన మా కప్పగింపుము గౌరవముగ/అధ్వరాశ్వోరసంబు, నాకాధినాథ!
అలఘుశుచి మార్గ దర్శకులైన ఘనులు, మఱచియును ద్రొక్కుదురె మలీమసపథంబు?" 45

అధ్వర+అశ్వోరసము=యాగపు+మేటిగుఱ్ఱము, నాక+అధినాథ=స్వర్గపు+రాజ-ఇంద్ర, అలఘు+శుచి+మార్గ +దర్శకులైన+ఘనులు=గొప్ప+వేద+మార్గము+చూపువారైన+గొప్పవారు, మఱచియును=పొఱపడిఅయినా, , త్రొక్కుదురే+మలీమస+పథంబు=నడచుదురే+పాపపు+మార్గమున,

ఆ. ఆ ప్రగల్భవచన మాలించిసరగున/తేరు, రఘుని దెసకు ద్రిప్పి చూచి,
కూతఘనము పిట్టకొంచము నని చోద్య/పడి బలప్రభేది బదులు పలికె. 46

ప్రగల్భ=ప్రౌఢ, సరగున=వేగముగ, చోద్యపడి=ఆశ్చర్యపడి, బలప్రభేది=ఇంద్రుడు.

సీ. "నీ ధర్మపన్నాలు నిజమె కాని, కుమార!/ఎఱుగ వింతకు లోక వృత్త మీవు,
పటుయశోధనుల కొప్పరికింప వచ్చునె?/తమకీర్తి పరులకు దక్కుచుండ,
చిరకాల మనుభవించిన యాధిపత్యము/చేయి జాఱుటకన్న సేగి కలదె?
శాశ్వతీభూతము శతమఖత్వము నాకె/ పురుషోత్తమాఖ్య శ్రీహరికి బోలె,
అట్టి భువనానుమోదిత మైన నాదు/యశ మశేషము నీ గురు డాచికొనగ,
శతతమేష్టికి దొరకొన్న, ప్రతివిధాన/ముడిగి ఎటులుందు? నెటు చేయిముడుచుకుందు. 47

పన్నాలు=ఎత్తుగడలు, ఇంతకు=ఈమాత్రము, లోకవృత్తము=లోకపురీతి, పటు+యశోధనులకు=అధికమైన+కీర్తియేధనముగాకలవారికి, ఒప్పరికింప+వచ్చునే=ఉపేక్షింప+న్యాయమా, సేగి=కీడు, శాశ్వతీభూతము=స్థిరమైనది, శతమఖత్వము=నూరుయజ్ఞములు పూర్తిచేసినవాడనెడు, ఆఖ్య=కీర్తి, భువన+అనుమోదితము +ఐన=జగమంతా+సమ్మతించినది+అయినట్టి, యశము+అశేషము=కీర్తి+పూర్తిగా, గురుడు=తండ్రి, ఆచికొనగ =లాగుకొనగ, శతతమ+ఇష్టి=నూరవ+యాగము, దొరకొన్న=లభింప యత్నించ, ప్రతి+విధానము+ఉడిగి=నివారణ+ఉపాయము+మాని,

క. కావున కపిలానుకృతిని/ఈ వార్వము నపహరించి, తింకిట దీనిన్
పో విడుచుట కల్ల, సుమీ!/ ప్రైవడుటకు నోర్తు, నోర్వ పదవీచ్యుతికిన్ 48

కపిలానుకృతిని=సగరుని కుమారులు గుఱ్ఱము కొరకై కపిలునిచే నాశముపొందినట్లు, వార్వము=గుఱ్ఱము, ప్రై+వడుటకు+ఓర్తు=నింద+మోచుట+సహింతును, పదవీ+చ్యుతికున్=ఉన్నతస్థితినుండి+జాఱుటకు,

చ. పొడువ దలంచినన్ సగరపుత్రుల జాడను పోదు వంతియే,
పడయవు కత్తలాని, ఎలప్రాయపు సెట్టికసీలవౌట నీ
చెడుటకు నోర్వ కీ హితము జెప్పితి, రాచరికంపు బొంకమున్
పడుచుదనంపు బింకమును పాయగబెట్టి, తొలంగి పొ మ్మికన్ 49

పొడువన్=పోట్లాడగ, సగరపుత్రుల+జాడను+పోదువు=సగరపుత్రుల+మార్గమున+నాశముచెందెదవు, పడయవు=పొందవు, కత్తలాని=అశ్వము, సెట్టికసీల=జయించు స్వభావము కలవాడగుట, హితము= మేలుమాట, పొంకము=ఉద్ధతి, బింకము=గర్వము, పాయగన్+పెట్టి=విడిచి+పెట్టి,

ఆ. గ్రుడ్డు వచ్చి నోటి క్రొవ్వున బిల్లను/పెక్కిరించునట్టి విధము గాను,
చాలు చాలు మాకు , చక్కట్లు దిద్దంగ/రాకు హద్దుమీరి, రాకుమార." 50

చక్కట్లుదిద్దంగ=సవరించగా,

ఉ. నావిని జంకులేని పెనునవ్వున మో మొక పొల్పుదాల్ప "మే
లీ పెడమాట లేటికి? సురేశ్వర! చేకొనవయ్య కైదువున్,
మావును బట్టికొన్న అభిమానము గాచికొనంగ సెంచినన్,
కావు సుమీ! కృతార్థుడవు కయ్యమునన్ రఘుగెల్వకుండినన్." 51

నావిని=అలాఅనగావిని, పెను+నవ్వున=పెద్దగా+నవ్వుతూ, మోము+ఒక+పొల్పు+తాల్ప=ముఖమున+ ఒకానొక+స్థైర్యము+ధరించి, పెడ+మాటలు+ఏటికి=వ్యర్థపు+పలుకులు+ఎందులకు, కైదువు=ఆయుధము, మావును=అశ్వమును, అభిమానము=ఆత్మ గౌరవము, కాచికొనంగ=కాచుకొన, ఎంచినన్=తలచితిపేని, కృతార్థుడవు=కార్యము సాధించిన వాడవు, కయ్యమున=యుద్ధమున,

మ. అని ఆఖండలుతోడ రాయుటకు దా నాయత్తుడై కార్ముకం
బున నుత్తేజితకాండముం దొడగి ఆస్ఫోటించి రాజన్యనం
దను డాలీఢపదస్థుడై నిలిచె దుర్ధర్ష ప్రతాపోన్నమ
త్కనదాభీలవపుః ప్రకర్షమున ముక్కంటిన్ విడంబించుచున్ 52

ఆఖండులుడు=ఇంద్రుడు, రాయుటకు=ఎదురించుటకు, ఆయత్తుడై=సిద్ధుడై, కార్ముకంబున=వింటిలో, ఉత్తేజిత+కాండము+తొడగి=ప్రేరేపించిన+బాణము+సంధించి, ఆస్ఫోటించి=సన్నద్ధుడై, ఆలీఢపదస్థుడై= కుడికాలుముందుచాచినిలుచు యుద్ధ భంగిమ, దుర్ధర్ష+ప్రతాప+ఉన్నమత్+కనత్+ఆభీల+వపుః+ప్రకర్షమున =తిరస్కరింప తగని+తేజముతొ+పైకెత్తబడిన+ప్రకాశమానమై+భయంకరమైన+శరీరపు+ఔన్నత్యముతోడ, ముక్కంటి=శివుని, విడంబించున్=పోలుచు

మ. రఘునిర్ముక్త సుదీర్ఘబాణ మురమున్ వ్రయ్యంగ గాఢంబుగన్
మఘవంతుండు ప్రచండరోషరభసోన్మాదంబునన్ లేచి న
వ్యఘనానీకముహూర్తలాంఛితనిజేష్వాసంబునన్ నిష్ఠురా
లఘుబాణం బరివోసి దాయ యురమున్ లక్ష్యంబు గావించినన్. 53

నిర్ముక్త=విడచిన, సుదీర్ఘ=బాగాపొడవైన, ఉరమున్+వ్రయ్యంగ+గాఢంబుగన్=గుండెను+చీల్చ+గట్టిగా, మఘవంతుండు=ఇంద్రుడు, ప్రచండ+రోష+రభస+ఉన్మాదంబునన్=సహింపరాని+కోప+వేగమువలన+ మత్తుడై, నవ్య+ఘన+అనీక=కొత్త+మబ్బుల+సమూహమునకు, ముహూర్త=క్షణకాలము, లాంఛిత= చిహ్నభూతమైన, నిజ+ఇష్వాసంబునన్=తన+విల్లుతో-ఇంద్రధనుస్సుతో, నిష్ఠుర+అలఘు+బాణంబు +అరివోసి=కఠినమైన+గొప్ప+బాణము+సంధించి, దాయ=శత్రువు-రఘువు, లక్ష్యంబు=గురి,

తే. ఆశుగతి జొచ్చె రఘుని దోరంతరంబు/అసురరుధిరోచితంబు తదాశుగంబు,
మునుపు చవి చూచి ఎఱుగని మనుజరక్త/పానకేళికి ఉబలాటపడియె ననగ. 54

ఆశుగతి+చొచ్చె=బాణవేగమున+దూరినది, దోర్+అంతరంబు=భుజముల మధ్యప్రదేశము-వక్షస్థలము, అసుర+రుధిర+ఉచితంబు=రాక్షసుల+రక్తమునకు+పరిచయమైన, తత్+ఆశుగము=ఇంద్రుని+బాణము, పాన+కేళికి=త్రాగు+ఆటకు, ఉబలాట=మిక్కిలి అభిలాష,

సీ. వేగంటి బెడిదంపు ప్రేటున నొచ్చియు/బరవసం బెడలక, బిరుసు చెడక
పెనుగోల నడచిన బెబ్బులి యటు లేచి/కాలద్రొక్కిన త్రాచు కరిణి లేచి,
దాయపై గిలించె దడయక రాచూలి/తన పేరు చెక్కిన తళుకుటమ్ము
చౌదంతి వీపుపై చఱిపి యెంతయు గాయ/కాచిన యా చేయి గండివడగ,
దాన రెచ్చిపోయి, తనమీద మలగొంగ/ఈరసంబు మదిని ఎసకమెసగ,
కఱకుటంపగములు పఱపిన, నతడును/నిమిసమందెవాని దుమురు సేసి 55

వేగంటి = (వే+కన్ను )ఇంద్రుని, బెడిదంపు+ప్రేటున = కఠినపు+దెబ్బకు, పరవసంబు+ఎడలక = ఆవేశము+ తొలగక, బిరుసు+చెడక = పౌరుషము+తగ్గక, పెను+కోలన్+అడచిన = పెద్ద+బాణము+దిగబడచేసిన, దాయపైన్ +కీలించె = శత్రువుపై+తగిలించె, తడయక = ఆలస్యముచేయక, రాచూలి = రాచబిడ్డ, తళుకు+అమ్ము = మెఱుస్తున్న +బాణము, చౌదంతి = ఐరావతము, చఱపి = కొట్టి, యెంతయు = ఎక్కువుగా, గండి+వడగ = రంధ్రము+పడగ, మలగొంగ = ఇంద్రుడు, ఈరసంబు+మదిని+ఎసకమెసగ = ద్వేషము+మనసులో+అతిశయించ, కరకు+ అంపగములు+పఱపిన = పదునైన+బాణములు+పంపిన, తుమురున్+చేచి = తునియలు/ముక్కలు+చేసి,

క. చలపట్టి నెమలి ఎఱకల/అలుగున నల పిడుగుటెక్కియము బడపైచెన్
బలిమి, బలభేది ఎదుటనె/తల దఱగిన యట్లుగాగ దైవత రమకున్ 56

చలపట్టి = పట్టుదలతో, నెమలి+ఎఱుకల+అలుగునన్ = నెమలి+ఈకలుకల+బాణమున, అల+పిడుగు+ టెక్కియమున్ = అలవోకగా+వజ్రాయుధరూపముగల+జెండాను, బలిమి = బలముతో, బలభేది = ఇంద్రుని, తఱగిన = తీసిన, దైవత+రమకున్ = దేవతల+రాజ్యలక్ష్మికి,

క. మన్యు విజృంభితులై, శత/మన్యుండును, రఘువు విక్రమస్థైర్య మసా
మాన్యముగ జేసి రాహవ/మన్యోన్యజయప్రయోజనావేశితులై 57

మన్యు = క్రోధముచే, శతమన్యుడు = నూరు యాగములుచేసిన ఇంద్రుడు, విక్రమ+స్థైర్యము+అసామాన్యముగ+ చేసిరి+ఆహవము = పౌరుషముతో+నిలకడతో+సాటిలేనివిధముగా+చేసిరి+యుద్ధము, అన్యోన్య+జయ+ ప్రయోజన+ఆవేశితులై = ఒకరినొకరు+జయించు+కార్యములో+ఒళ్ళుతెలియని వారై,

క. హరి, రఘు, ముక్తశరములు/గరుత్మదాశీవిషప్రకారాతి భయం
కరము, లధ ఊర్ధ్వముఖములు/సురమనుజ ప్రేక్షకులకు జోద్యము గొలిపెన్ 58

హరి = ఇంద్రునిచే, ముక్తశరములు = విడువబడిన బాణములు, గరుత్మత్+ఆశీవిష+ప్రకార+అతి+భయంకరములు = ఱెక్కలుకల+సర్పము+పోలికగా+ఎక్కువగా+భయముకొలుపునవి, అధ+ఊర్ధ్వ+ముఖములు = (ఇంద్రుడు వేసినవి)కిందకు+(రఘువువేసినవి)మీదకు+వెళ్ళునవి, సుర+మనుజ+ప్రేక్షకులకున్ = క్రిందకుచూడు సురులకు+మీదకు చూడు మనుజులకు, చోద్యము = ఆశ్చర్యము,

చ. తెఱపి యొకింత లేని గతి దీవ్రశిలీముఖ కుంభవర్షమున్
కురిసి, నిజాంశసంభవు నకుంఠితవిక్రము నక్కుమారకున్
తెరలుపజాలడయ్యెనదితిప్రభవుం డిది, వింతయే? పయో
ధరమున కార్పవచ్చునె? స్వతశ్చ్యుతవహ్ని నిజాంబు ధారలన్. 59

తెఱపి=అవకాశము, తీవ్ర+శిలీముఖ=వాడి+బాణముల, నిజాంశ+సంభవుడు=ఇంద్రాంశ+సంభవుడుడు (లోకపాలకాంశతోపుట్టిన రఘువు), అకుంఠిత+విక్రము=మొక్కవోని+శౌర్యుని, అ+కుమారకున్=ఆ+రఘువుని, తెరలుప+చాలడు+అయ్యె=తొలగచేయ+సాధ్యముకాని+వాడయ్యె, అదితి+ప్రభవుండు=అదితి+కుమారుడు-ఇంద్రుడు, పయోధరమునకు=మేఘమునకు, స్వత+చ్యుత+వహ్ని=తమనుండే+పుట్టిజాఱిన+విద్యుద్రూపమైన పిడుగును, నిజ+అంబు+ధారలన్=తన+నీటి+ధారచే,

క. హోరాహోరి విశృంఖల/పౌరుషమొడలెత్తినట్లు భయదాకృతియై
పోరాడు చక్కుమారమ/హారథు డనియంత్రితాద్భుతాటోపమునన్. 60

హోరాహోరి=అవిరామముగా, విశృంఖల=అడ్డులేనివిధంగా, పౌరుషము+ఒడలెత్తు=పురుషభావము+మూర్తీభవించినట్లు, భయద+ఆకృతియై=భయము+రూపుకట్టినట్లు, అనియంత్రిత+అద్భుత+ఆటోపమునన్ =అడ్డగింపలేని+ఆశ్చర్యకరమైన+అతిశయమున,

క. హరిచందన చర్చితమగు/హరిహయు ముంగేల ప్రమథితార్ణవనినద
స్ఫురణమున మొరయు శింజిని/నరనెల నునుగోల దునిమె నతిదృఢముష్టిన్. 61

హరిచందన+చర్చితమగు=శ్రీ గంధము+పూయబడిన, హరిహయు=ఇంద్రుని, ముంగేల=చేతిమణి బంధమును, ప్రమథిత+అర్ణవ+నినద+స్ఫురణమున+మొరయు+శింజిని=బాగామధింపబడుచున్న+సముద్రపు+ఘోష+గుర్తు చేయుచూ+మ్రోగు+వింటి నారిని, అర+నెల+నును+గోల+తునిమెన్+అతి+దృఢ+ముష్టిన్=అర్ధ+చంద్రఆకారపు+సానబట్టిన+బాణముతో+ముక్కలుచేసె+అధిక+బల+సమృద్ధితో,

చ. బలరిపు డా శరాసనము బాఱగవైచి వివృద్ధమత్సరో
జ్జ్వలితశరీరుడై ప్రబల శత్రువు నుగ్గుగ జేయు పూనికన్,
కులవసుధాధరంబులకు గుంటితనం బొదవించె, నెద్ది, ఆ
అలఘుతరాయుధంబు రభసాతి తరంబుగ దీసి, వైచినన్. 62

బలరిపుడు=ఇంద్రుడు, శరాసనము=విల్లు, వివృద్ధ+మత్సర+ఉజ్జ్వలిత+శరీరుడై=బాగా వృద్ధిపొందిన+కోపముతో+బాగారగిలిన+మూర్తియై, ఉగ్గుగ=పొడిగ, పూనికన్=పట్టుదలతో, కుల+వసుధాధరంబులకు=కుల+పర్వతములకు, కుంటితనంబు+ఒదవించెను+ఎద్ది=రెక్కలునఱకుటచే చలనములేక పోవునట్లు+ఏదిచేసెనో+అట్టి, ఆ+అలఘుతర=అటువంటి గొప్పవానిలోగొప్పదైన- వజ్రాయుధమును, రభస+అతి తరంబుగ=తీవ్రత+ఎక్కువైనప్రమాణమున,

మహాస్రగ్ధర. స్ఫురు వుద్దామాగ్నికీలాపటలజటిలమై వచ్చి పేరక్కు గాడన్,

భరమై రాచూలి నేలం బడియె, స్వజనబాష్పప్రపాతంబు తోడన్
తిరుగన్, దన్మాత్రలోనం దెలిసి, అరిపయిన్ దృష్టి దీండ్రించి, రోదో
భరితద్రాఘిష్ఠసేనాప్రమదరవముతో బాటు పే లేచి నిల్చెన్. 63

స్వరువు+ఉద్దామ+అగ్ని+కీలా+పటల+జటిలమై=వజ్రాయుధపు+భయంకరమైన+అగ్ని+మంటల+సమూహముచే+దట్టమై, పేరు+అక్కు+గాడన్=పెద్ద+ఱొమ్మున+నాటగా, భరమై=సహించలేనిదై, రాచూలి=రఘువు, స్వ+జన+బాష్ప+ప్రపాతంబు+తోడన్=తన+సేనల+అశ్రువులు+క్రిందపడుటతో+కలిసి, తిరుగన్=మరల, తన్+మాత్రలోన=ఆ+క్షణములోనే, తెలిసి=తెలివితెచ్చుకొని, తీండ్రించి=కేంద్రీకరించి, రోదో+భరిత+ద్రాఘిష్ఠ+సేనా+ప్రమద+రవముతో+పాటు=ఆకాశము+నిండిన+మిక్కిలిదీర్ఘమైన+సేనయొక్క+సంతోషపు+కంఠధ్వనితో+పాటు, పే+నిల్చెన్=వెంటనే+నిలబడె,

వసంతతిలకం. దంభోళి ఘోరతరధారకు మొక్కవోని/శుంభద్బలద్రఢిమశోభితు నక్కుమారు
జంభారి మెచ్చి, యనె, సారగుణోత్తరుండు/సంభావనీయు డగు శాత్రవుడైన గానీ 64

శ్లో:62. దంభోళి=వజ్రాయుధపు, ఘోరతర+ధారకు=మిక్కిలిభయంకరమైన+పదునుకు, మొక్కవోని=భంగపడని, శుంభత్+బల+ద్రఢిమ+శోభితు=ప్రకాశించెడు+బలపు+దిట్టతనముచే+రాజిల్లు, జంభారి=ఇంద్రుడు, సారగుణ+ఉత్తరుండు= బలగుణముకలిగినవారిలో+ఉత్తముడు, సంభావనీయుడు= సన్మానముచేయదగ్గవాడు, శాత్రవుడైనన్+కానీ=శత్రువులయిన+కానిమ్ము,

క. " ఔరా! శబాసు, మామక/భూరిపవిక్షతికి రేకమోవని శ్లాఘ్య
స్ఫారాలౌకికదోర్బల/ధౌరేయుని, గంటి నిన్ను, దార్క్ష్యుని పిదపన్. 65

మామక+భూరి+పవి+క్షతికి+రేకమోవని=నా+ఆధిక్యమైన+వజ్రాయుధపు+దెబ్బకు+గాటుకూడా పడని, శ్లాఘ్య+స్ఫార+అలౌకిక+దోర్బల+ధౌరేయుని=పొగడదగిన+అధిక+అతిలోకమైన+భుజబలముతో+కార్యము సాధించగలవాని, తార్క్ష్యుని+పిదపన్=గరుత్మంతుని+తరువాత,

చ. దివుజుల మైన మాకు భవదీయ నిరర్గళ ధైర్యసార ము
త్సవమొనరించె, గామిత మొసంగకపోవు టసాంప్రతంబు, మీ
సవనహయంబు నే విడువజాలని చిక్కు మదిన్ గణించి, అ
న్యవరము వేడు మిచ్చెద, ననన్యదురాపధనుష్కళానిధీ!" 66

భవదీయ=నీ, నిరర్గళ+ధైర్యసారము=అడ్డులేని+ధైర్యపుశ్రేష్ఠత, ఉత్సవము=ఆనందము, కామితము=కోరిక, అసాంప్రతంబు=యుక్తముకాదు, సవన+హయంబు=యాగ+అశ్వము, చిక్కు=సంకటము, అనన్య+దురాప+ధనుః+కళా+నిధీ=ఇతరులెవరు+పొందలేని+విలువిద్య+నేర్పులో+నిధివంటివాడా,

తే. అనుటయు గుమారకుడు స్వహస్తాంగుళులకు/పసిడిపింజ మెఱుంగులు మిసిమిపెట్ట

బత్తళికనుండి ఎత్తియునెత్తకున్న/అలుగు లోనికి జొనిపి, దుశ్చ్యవను జూచి, 67

స్వ+హస్త+అంగుళులకు=తన+చేతి+వ్రేళ్ళకు, పసిడి+పింజ=బంగారపు+పిడి, మిసిమి+పెట్ట=మెఱుపు+చేకూర్చ, బత్తళిక=అమ్ములపొది, ఎత్తియు+ఎత్తకున్న+అలుగు=యత్నించియు+పట్టుకొనని+బాణమును, దుశ్చ్యవను=ఇంద్రుని,

మ. "క్రతుగంధర్వము నీ కమోచ్యమయినం గానిమ్ము, లోకేశ! సం

తతదీక్షాప్రయతుండు మా గురునకున్ సంప్రీతి నిండార, ని

ష్ప్రతిరోధంబుగ నేటి జన్నము సమాప్తం బైనచో గల్గు శా

శ్వతమై ఎట్టి ఫలంబు, తత్ఫల మశేషంబుం ప్రసాదింపవే! 68

క్రతు+గంధర్వము=యాగ+అశ్వము, అమోత్యము=విడుచుటకువీలులేనిది, సంతత+దీక్షా+ప్రయతుండు=ఎల్లప్పుడు+క్రతునిష్ఠయందు+ప్రయత్నుడు, నిష్ ప్రతిరోధంబుగ=ప్రతిబంధకము లేకుండ, తత్+ఫలము+అశేషంబు+ప్రసాదింపవే=సంపూర్ణమైనయాగ+ఫలితము+కొదవలేకుండా+కరుణించుము,

క. పురదమనై కాంశంబున/దురాసదుండయిన నిజసదోగతునకు మ

ద్గురునకు నీ వొక వార్తా/హరుచే వినిపింపు మీ యుదంతము నెల్లన్. 69

పురదమన+ఏకాంశంబున=శివుని+ఒక(యజ్వ)మూర్తివాడగుటచేత, (పంచభూతములు, సూర్యుడు, చంద్రుడు, యజ్వా- శివుని అష్టమూర్తులు. అందుచే సూర్యవంశి యజ్విదిలీపుడు శివాంశుడు.), దురాసదుడు =ఎదురింపరానివాడు, నిజ+సదోగతునకు=తన+యాగసభయందుండువాడు, ఉదంతమును+ఎల్లను=వృత్తాంతమును+అంతయు,

వ. మహేంద్రపదవి యన్న మజ్జనకునకు మనసులేదు. దాన నిర్విశంకుడవు కమ్ము". అని దేవతావిరోధవిముఖమనస్కుడును శమప్రధానుడునై అభ్యర్థించిన నత్యంతసంతోష భరితాంతః కరణుడై అట్ల చేయువాడ నని ఒడంబడి అఖండస్నేహంబు నెఱపి, ఆఖండలు డంతర్ధానము చేసె. క్రతుఫలమును దక్కించుకొని నాతి ప్రమోదమానమానసుడై సౌదక్షిణేయుడు సాకేతమునకు దిరిగివచ్చె. అంతకు మున్ను 70

మత్+జనకునకు=మా+తండ్రికి, నిర్విశంకుడవు=సందేహము లేని వాడవు, దేవతా+విరోధ+విముఖ+మనస్కుడు=దేవతలపై+శత్రుత్వము+లేని+బుద్ధికలవాడు, శమ+ప్రధానుడునై=అంతరేంద్రియనిగ్రహ+బుద్ధికలవాడై, అత్యంత+సంతోష+భరిత+అంతః కరణుడై=మిక్కిలి+సంతోషముతో+నిండిన+మనస్సు కలవాడై, అఖండ=పూర్ణ, నెఱపి=చేసి, ఆఖండలుడు=ఇంద్రుడు, న అతి+ప్రమోద+మానమానసుడై=(గుఱ్ఱముపోవుటచే) ఎక్కువ కాని+సంతోషపు+మనస్సున, సౌదక్షిణేయుడు=సుదక్షిణాదేవికొడుకు-రఘువు,

తరళం. దివిజరాజనియుక్తు చేత దదీయవార్త యెఱింగి యా
కువలయేశుడు కూర్మినందను గ్రుచ్చి చేర్చి కవుంగిటన్
నివిరె ఋజ్జువ మారగా నశనివ్రణాంకిత మైన మే
నవయవంబుల నంటి యంటి ప్రహర్షశీతల పాణిచేన్ 71

శ్లో:68. దివిజరాజ+నియుక్తు=ఇంద్రునిచే+పంపబడినవాని, కువల+ఈశుడు=భూ+పతి-దిలీపుడు, కూర్మి=వాత్సల్యముతో, గ్రుచ్చి=బిగియపట్టుకుని, ఋజ్జవమారగా=ఉపలాలించి, అశని+వ్రణ+అంకితమైన+మేను+అవయవంబులన్+అంటి అంటి=వ్రజ్రాయుధపు+గాయపు+గుర్తులుకల+శరీరముపై+పరామర్శగా+మరల మరలతాకి, నివిరె=దువ్వె, ప్రహర్ష+శీతల+పాణిచేన్=సంతోషాతిశముచే+చల్లబడిన+చేతితో,

క. నవతిమహాయజ్ఞంబులు, నవాధికముగాగ, నిట్లొనర్చెను, జగతీ
ధవు, డాయుఃక్షయమున దా/దివ మధిరోహింప మెట్లుదీర్చెనొ, యనగన్. 72

నవతి=తొంబైకి, నవాధికము=తొమ్మిదిఎక్కువ, ఆయుఃక్షయమున=మరణాంతమున, తాన్+దివము+అధిరోహింప=తాను+స్వర్గము+ఎక్కుటకు, మెట్లు+తీర్చెనొ+అనగన్=స్వర్గమునకుమెట్లు+ఏర్పరచుకొనెనో+అన్నట్లు

క. భూవరు డంతట, విషయ/వ్యావృత్తమనస్కుడై ప్రియంబున నిచ్చెన్
యౌవనుడగు సూనునకు య/థావిధి నృపకకుదమగు సితచ్ఛత్రంబున్. 73

విషయ+వ్యావృత్త+మనస్కుడై=భోగములనుండి+మరలిన+మనస్సుతో, నృపక+కుదమగు=రాజ+చిహ్నమైన, సిత+చ్ఛత్రంబున్=శ్వేత+చ్ఛత్రమును-రాజ్యమును,

తే. ఇచ్చి, సపరిగ్రహంబుగ నేగి, తాప/సాశ్రమవనస్పతిచ్ఛాయ లాశ్రయించె,
బ్రదుకు మలుసంజవేళ ఇక్ష్వాకు పుణ్య/వంశజుల కెల్ల నిది కులవ్రతము గాదె 74

స+పరిగ్రహంబుగ=భార్యతొ+కూడి, వనస్పతి+చ్ఛాయలు+ఆశ్రయించె=చెట్టు+నీడల+అండగొనె, మలుసంజ+వేళ=ఆఖరి+రోజులలో,

# చతుర్థసర్గము- దిగ్విజయము

క. జనకుం డిచ్చిన రాజ్యము/గొని, నిరఘుడు వెలిగె రఘు డకుంఠితదీప్తిన్
మునిమాపు సవిత తనయం/దునిచిన తేజమున వెలుగు హుతవహు పగిదిన్. 1

నిర్+అఘుడు=పాపములు లేనివాడు, అకుంఠిత+దీప్తిన్=చుఱుకుతనముకల+ప్రకాశముతో, ముని మాపు=సాయంకాలమున, సవిత=సూర్యుడు, ఉనిచిన=తన అందు ఉంచిన, హుతవహు+పగిదిన్=అగ్నిహోత్రుని++వలె(సూర్యతేజస్సు రాత్రివేళ అగ్నిని ప్రవేశించుననిశ్రుతి),

క. అతడు దిలీపుని పిమ్మట/ప్రతిష్టితుం డయ్యె రాజ్యపదవి నటన్నన్,
క్రితము పొగ రాజుచుండిన/ప్రతిరాజుల హృదయవహ్ని భగ్గని రగిలెన్. 2

ప్రతిష్టితుడు=అభిషేకించబడినవాడు, అటు+అన్నన్=అట్లు+అనగావిని, పొగరాజుచుండిన=నివురు కప్పిన నిప్పుగా ఉన్న, హృదయ+వహ్ని=గుండెలలోని+సంతాపాగ్ని, భగ్గని+రగిలెన్=మంటతో+రేగెను,

క. అమరేంద్రధ్వజముంబలె/అమితశుభప్రదము రఘు నవాభ్యుత్థాన
క్రమము గని పరిణమింతురు/సమున్నయన పంక్తులగుచు సప్రజలు ప్రజల్. 3

అమరేంద్ర+ధ్వజముం+బలె=ఇంద్రుని+జెండ+వలె, అమిత=ఎక్కువైన, నవ+అభ్యుత్థాన+క్రమమున్+కని=నూతన+అభ్యుదయ+విధానము+చూచి, పరిణమింతురు=సంతోషింతురు, సమున్+నయన=ఎత్తిన+చూపులతో, పంక్తులు+అగుచు=వరుసలు+కట్టి, స ప్రజలు+ప్రజల్=పిల్లలతో+ప్రజలందరు,

క. సమగతి సమాక్రమించెను/సమదద్విపగామి రెంటి, సమ్రాట్ పితృతః
సమవాప్తసింహపీఠము/సమస్తరిపుమండలమును సమధికశక్తిన్. 4

సమగతి=ఏకకాలమందు, సమ+అక్రమించెను=ఒప్పుగా+అధిష్ఠించెను, సమద+ద్విప+గామి=మదించిన+ఏనుగువంటి+నడకకలవాడు, సమ్రాట్+పితృత+సమవాప్త+సింహపీఠము=సామ్రాట్టయిన+తండ్రి నుండి+విధిగా పొందిన+సింహాసనము, సమస్త+రిపు+మండలమును=సమస్త+శత్రువుల+రాజ్యములను (శత్రురాజులు వశులైరి), సమ+అధిక+శక్తిన్=అతి+అధికమైన+సామర్థ్యముతో,

క. ఛాయామండలలక్ష్య/ప్రాయము, పెలిదమ్మిగొడుగు బట్టి భజించెన్
శ్రీ, యొరుల కగోచరయై/ధీయుతు సామ్రాజ్యకర్మదీక్షితు నతనిన్. 5

ఛాయా+మండల+లక్ష్య+ప్రాయము=కాంతి+మండలముచేత+ఊహింప+దగినదైనది, వెలి+తమ్మి+గొడుగు =తెల్ల+పద్మమువంటి+గొడుగు, భజించెన్+శ్రీ=రాజ్యలక్ష్మి సేవించెను, ఒరులకు+అగోచరయై=ఇతరులకు+ కనబడక, ధీయుతు=ప్రశస్త బుద్ధికలవాని, సామ్రాజ్య+కర్మ+దీక్షితు=రాచ+కార్యములందు+శ్రద్ధవహించు వాని, భావము:సింహాసనమెక్కగనే ముఖమునకు ఒక గొప్ప కాంతి కలిగెను. అది మండలా కారముగా గోచరించుట చేత రాజ్యలక్ష్మి తాను కనపడకపోయినప్పటికి కమలములు అను ఆతపత్రముచేత అతనిని సేవించునట్లుగా ఉండెను. సింహాసనమెక్కగానే రాజ్యలక్ష్మి అతనికి కలిగినది.

క. తరిపేచి పొగడు నాతని/వరగుణములు చదువులమ్మ, వందిజనాంతః
పరికల్పితసన్నిధియై/పరిపరి విధముల మహార్థపదగుంభనలన్. 6

తరువు+ఏచి=తరుణము+చూచుకొని చెలరేగి, పొగడు=స్తుతించు, వరగుణములు=గొప్ప గుణములు, చదువులమ్మ=సరస్వతి, వందిజనాంతః=వందిపాడు వారి అందు, పరికల్పిత+సన్నిధియై=ఆవిధముగా కల్పించుకున్న+సాక్షాత్కారయై, మహా+అర్థ+పద+గుంభనలన్=గొప్ప+అర్థవంతమైన+మాటల+కూర్పుతో, (సరస్వతి స్తుతిపాఠకులలో ప్రవేశించి పూజించెను. రఘువును దేవతాబుద్ధిచేతను, విష్ణు భావముచేతను స్తుతించెగాన దోషములేదు.)

ఆ. మనువు మొదలు మేటి మన్నీల మాన్యుల/ముద్దుముచ్చటలకు మురిసియున్న
క్రొత్త కాపురంబు కులుకున కొమరందె/వాని వలచి, వసుమతీనవోఢ. 7

మనువు=మనుమహారాజు, మేటి+మన్నీల+మాన్యుల=గొప్ప+ప్రభువులు+పూజ్యులుఅయిన, కులుకున+ కొమరు+ఒందె=విలాసముతో+మనోజ్ఞత+పొందె, నవోఢ=నూత్నవధువు(రాజ్యలక్ష్మి),

ఆ. దండనమున హెచ్చుతగ్గులు చూపక/అఖిలజనుల మనసు లాచికొనియె,
నాతిశీతలముగ, నాత్యుష్ణముగ వీచు/దక్షిణానిలము విధమున రఘువు. 8

ఆచికొనియె=ఆకర్షించుకొనెను, న అతి శీతలముగ+న అతి ఉష్ణముగ+వీచు+దక్షిణ+అనిలము=ఎక్కువ చల్లగా కాక+ఎక్కువ వేడిగా కాక+వీచునట్టి+దక్షిణదిక్కునుండివచ్చు+మలయమారుతము,

ఆ. మందగింపజేసె మక్కువ తండ్రిపై/నిజగుణాతిశయత ప్రజలకెల్ల,
ఫలచయంబువలన తొలిపూతపై ప్రీతి/మఱవజేయు తీయమావి మాద్రి 9

మందగింప=సన్నగిల్ల, మక్కువ=కూరిమి, నిజ+గుణ+అతిశయత=తన+గుణముల+ఆధిక్యతచే, ఫల+ చయము=ఫల+సమూహము, మాద్రి=విధముగా,

ఆ. విదితపఱచి రపుడు సదసత్ప్రకారముల్/నూతనేశ్వరునకు నీతివిదులు,

పూర్వపక్షమునకె మొగ్గె రా, జుత్తర/పక్షమిట్లు పూర్వపక్షమయ్యె. 10

విదిత+పఱచిరి=తెలియ+చేసిరి, నీతివిదులు=నీతిశాస్త్రముతెలిసినవారు, సత్+అసత్+ప్రకారములు=ధర్మ+అధర్మ+(యుద్ధ)విధములు, పూర్వపక్షము=ధర్మవిధము, మొగ్గె=సమ్మతించు, ఉత్తర పక్షము+ఇట్లు+పూర్వ పక్షము+అయ్యె=అధర్మమార్గము+ఈవిధంగా+వాదనకోసము మాత్రమే ఉపయోగపడు అంశము+అయ్యెను,

క. భూతము లిరుమూడిటికి గు/ణాతిశయం బెసకమెసగె అద్భుతముగ ఆ

నూతనవిభు నేల్బడిలో/నూతనమై సర్వమును మనోహరమయ్యెన్. 11

భూతములు+ఇరు+మూడు=పంచ భూతములు, గుణ+అతిశయంబు+ఎసకమెసగె=వాటివాటి గుణములు +హెచ్చె+ఒప్పె, ఏల్బడి=పాలన, సర్వమును=సృష్టిలోనివస్తుసంపద అంతయు,

క. ఎంతేని నిడుద లాక/ర్ణాంతంబులు తనదు కన్నులైనను, రఘు పే

కాంతము, శాస్త్రముననె దృ/గ్వంతుండై యరయు సూక్ష్మకార్యార్థములన్. 12

ఎంతేని+నిడుదలు=మిక్కిలి+దీర్ఘమైనవి, ఆకర్ణ+అంతములు=చెవులవరకు+సాగు, ఏకాంతము=అవశ్యము, శాస్త్రముననె+దృగ్వంతుడు+అయి+అరయు=శాస్త్రమునందే+దృష్టియుంచినవాడు+అయి+విచారించు, సూక్ష్మ+కార్య+అర్థములన్=ఊహకందని+పనుల+ప్రయోజనములందు,

తే. సమధికాహ్లాదనంబున చంద్రుడెట్లొ/తాపసంజననంబున తపను డెట్లొ,

ప్రకృతిజనరంజనమున నారాజు, నట్లె/అంచితోదాత్తలీల నన్వర్థుడయ్యె 13

సమధిక+ఆహ్లాదనంబున=అతి అధికముగా+సంతోషపరచుటలో, తాప+సం+జననంబున=వేడిమి+ఎక్కువగా +పుట్టించుట అందు, తపనుడు=సూర్యుడు, ప్రకృతి+జన=పౌర+వర్గము, రంజనమున=సంతోషపెట్టుటలో, అంచిత+ఉదాత్త+లీల=ఒప్పైన+గౌరవప్రదమైన+విధముగా, అన్వర్థుడు=పొసగిన నామధేయుడు ("రంజఇతిఇతిరాజా"-ప్రజలను రంజింపచేయువాడు రాజు)

ఆ. విక్రమానురాగవినియంత్రితారియై/కుదుటపడిన రఘుని గొలువవచ్చె,

లలితపుండరీకలక్షణయై శర/ల్లక్ష్మి, అపరరాజ్యలక్ష్మి లీల 14

విక్రమ=పౌరుషమువలన, అనురాగ=స్నేహమువలన, వి+నియంత్రిత+అరియై=బాగా+నివారింప బడిన +శత్రువులు కలవాడై, కుదుటపడిన=స్థిరపడిన, లలిత+పుండరీక+లక్షణయై=మనోజ్ఞమైన+కమలములు+ చిహ్నములుగా కల, శరత్+లక్ష్మి=శరదృతువను+లక్ష్మి, అపర+రాజ్యలక్ష్మి+లీల=రెండవ+రాజ్యలక్ష్మి+వలే

ఆ. నీరదములు నింగి నిర్వృష్టలఘువులై/దూదిపింజలగుచు దొలగి చనుట

ఇనుమడించె రఘుని, ఇనుని ప్రతాపము/యౌగపద్యముగ సమస్త దిశల 15

యోగపద్యముగ=ఒకకాలమందే,
సూర్యుని పరమున:నీరదములు+నిర్ వృష్ట+లఘువులై=మేఘములు+
నిశ్శేషముగాకురుయుటచేత+తేలికైఎండను ఆపలేనివై, దూదిపింజలగుచు+తొలగి+చనుట=దూదిపింజలవలె + అడ్డుతొలగి+వెళ్ళగా, సమస్త+దిశల=అన్ని+వైపులా, ఇనుమడించె+ఇనుని+ప్రతాపము=రెట్టింపైనది+ సూర్యుని+వేడిమి,
రఘుపరమున: సమస్త దిశల=అన్ని+వైపులా, దూదిపింజలగుచు=శరత్కాలము యుద్ధమునకు అనువు కనుకయుద్ధమున శత్రువులు తేలికగా దూదిపింజలవలె, తొలగి+చనుట=ఒదిగి+ వెనుతిరగగా, ఇనుమడించె+రఘుని+ప్రతాపము=రెట్టింపైనది+రఘువు+పరాక్రమ ఉత్సాహము,

క. సురరాజు డించె వార్షిక/శరాసనము, రఘువు జైత్రచాపము నెత్తెన్
ఇరువురు ప్రజార్థఘటనా/పరతగదా! విల్లు గొండ్రు పర్యాయముగన్. 16

సురరాజు+డించె=ఇంద్రుడు+త్యజించె, వార్షిక+శరాసనము=వర్షహేతువైన+ఇంద్ర ధనుస్సును, జైత్ర+ చాపమును+ఎత్తెన్=జయశీలమున+విల్లు+చేపట్టె, ప్రజ+అర్థ+ఘటనా+పరత+కదా=జనుల+కోరికల+ సాధనయందు+ఆసక్తిచే+కదా, విల్లు గొండ్రు=ధనస్సు చేపట్టెదరు(ఇంద్రుడు వర్షము కురిపించుటకు, రఘువు యుద్ధమునకు వెళ్లి ధనసంపాదనకు), పర్యాయముగన్=ఒకరితరువాత ఒకరు వరుస అనుసరించి,

క. అరవిందము వెలిగొడుగుగ/విరసిన కనుపపులచాలు వీచోపులుగా,
నరదేవు ననుకరించియు/శరదుదయము వాని శోభ జాలదు పడయన్. 17

అరవిందము=శ్వేతపద్మము, వెలి+గొడుగుగ=శ్వేత+ఛత్రముగా, విరసిన+కనుపపుల+చాలు=విరగబూసిన+ తెల్లుగడ్డిపూల+కదలిక, వీచు+ఓపులుగ=వింజామరలుగ, నరదేవు=రాజు, శరత్+ఉదయము=శరద్రుతువు +రాక, వాని+శోభ=రాజుయొక్క+శోభస్కరము, చాలదు పడయన్=పొంద లేకపోయెను,( శరదృతువు రాజుకు పోలిన చ్ఛత్ర చామరములు కలిగియు సాటికాదు)

క. ఆ రాజు యశోవిభవము/హారాళము పొలపమందె నేమొ తలంపన్
తారలలోన కుముద్వ/న్నీరంబుల లోన హంసనిచయము లోనన్. 18

తారలలోన=నక్షత్రములందు, కుముద్వత్+నీరంబుల=తెల్లకలువలుకల+జలములో, హంస+నిచయము +లోలన్=హంసల+గుంపు+అందు, యశో+విభవము=తెల్లనైనకీర్తి+సంపద, హారాళము+పొలపమందె+ఏమో+ తలంపన్=అధికముగా+వ్యాపించెనా+ఏమో+అనునట్లునవి,

క. అగణిత తేజోనిధియగు/నగస్త్యునుదయమున దేటె నంభశ్చయముల్

దిగులొంది రఘూదయమున/పగతుర డెందములు కలగె పరిభవశంకన్. 19

అగణిత+తేజో+నిధి=లెక్కలేనంత+తేజస్సుకు+నిక్షేపముఅయిన, అగస్త్యుని+ఉదయమున=అగస్త్యనక్షత్రము +ఉదయించుటచే, తేఱె=నిర్మలమైనవి, అంభః+చయములు=నీటి+రాశులు, దిగులొంది=(యుద్ధకాలము అమగుటచే) భయపడి, రఘు+ఉదయమున=రఘువు+వచ్చునేమోఅని, కలగు=కలతనొందె, పరిభవ+ శంకన్=అవమానపు+భయమున,

క. మదకటువులైన సప్త/చ్ఛదకుసుమచయంబుచేత సంప్రహృతములై,

ఒదవిన యీసున బలె త/న్మదావళము లాము నేడు తావుల నోడ్చెన్. 20

మద+కటువులైన=మదమువంటి+సువాసనకల, సప్త+చ్ఛద+కుసుమ+చయంబు=ఏడు+ఆకుల అరటి+ పువ్వుల+గుంపు, సంప్రహృతములై=బాగాసంతోషము పొంది, ఒదవిన+ఈసున=పెంపొందిన+పంతముతో, తత్+మదా+ఆవళము=వాని+మదముయొక్క+పరంపరలను, ఆములు=ఏనుగులు, ఏడుతావుల=ఏడు (తొండమున2 కనులు2 గండము2 పురుషాంగము1) ప్రదేశములనుండి, ఓడ్చెన్=కార్చెను,

తే. అప్పుడు విలోభనీయము లయ్యె, రెండె/ప్రేక్షకులకెల్ల సమరసప్రీతి గొలిపి,

ప్రణయనిష్యంది మన రఘువదనసీమ/చంద్రికాగుచ్ఛములు కాయు చందమామ. 21

వి+లోభనీయము=బాగా+ఆకర్షణీయము, సమరస+ప్రీతి+కొలిపి=సమాన అనురాగ ఆస్వాదనముచే+ప్రీతి+ కలిగించు, ప్రణయ+నిష్యంది=ప్రేమ+ఒలకించు, చంద్రికా+గుచ్ఛము+కాయు=వెన్నెల+గుత్తుల+ప్రసరించు,( చల్లగాపాలించు రాజు, చల్లనివెన్నెల కాయు చంద్రుడు),

తే. చెఱకునీడల గూర్చుండి, చేల, కాపు/పడుచు లెలుగెత్తి కమ్మగ పాడుకొనిరి

భిదురపాతంబునకు చెక్కుచెదరకుండు/టాదిగా, తమ ఱేని గుణోదయంబు. 22

చెఱకు+నీడల=చెఱకుతోట+నీడల, చేల=పొలములో, ఎలుగెత్తి=కంఠమెత్తి, భిదుర+పాతంబునకు= వజ్రాయుధపు+దెబ్బకు, ఱేని+గుణోదయంబు=రాజుయొక్క+గుణముల ఆధిక్యత,

తే. ఏచి ఱంకెలు వేయుచు, నేటి యొడ్ల/నురల ద్రోయుచు, పెద్ద మూపురము లొప్ప

ఆముకొనినట్టి ఆబోతు లనుకరించె/రఘుని లీలాభిరామవిక్రాంతి పెంపు 23

ఏచి=విజృంభించి, ఏటి+ఒడ్లను+ఒరల+త్రోయుచు=నదుల+ఒడ్డులు+పగుల+పైచుచు, ఆముకొనినట్టి =పైబడునట్టి, లీల+అభిరామ+విక్రాంతి+పెంపు=క్రీడామాత్రమైన+సుందరమైన+విక్రమపు+ఆధిక్యత,

క. తెరువుల బంకము లిగిరిచి/తరణోచితములుగ జేసి, తటినుల నెల్లన్,

శరదృతువె దిగ్విజీషకు/పురికొల్పెను శక్తికంటె మునుపు నరేంద్రున్ 24

తెరవుల=మార్గముల, పంకములు+ఇగిరించి=బురదల+ఎండచేసి, తరణ+ఉచితములుగ=దాటుటకు+వీలుగా, తటినులు=నదులు, దిక్+జిగీషకు=దిక్కులను+గెలువ, పురికొల్పెను=ప్రేరేపించెను, శక్తి=రఘువుయుద్ధ ఉత్సాహము, మునుపు=మునుముందుగా,

క. వాజిద్విపరాజికి నీ/రాజనవిధి సెఱపు వేళ రాజేంద్రునకున్
 రాజత్ప్రదక్షిణార్చి/ర్వ్యాజకరంబున హుతాగ్ని అరిజయ మొసగెన్. 25

వాజి+ద్విప+రాజి=గుఱ్ఱముల+ఏనుగుల+సమూహమునకు, నీరాజన+విధి=మంగళ హారతి ఇచ్చు+శాంతి కర్మ, సెఱపు=చేయు, రాజత్+ప్రదక్షిణ+ఆర్చిర్+వ్యాజకరంబున+హుతాగ్ని=ప్రకాశించు+ప్రదక్షణగా తిరుగు +మంటల+మిషచే+హోమములోని అగ్ని, అరి+జయము+ఒసగెన్=శత్రువులపై+ జయము(సూచన)+ కలిగించెను,

క. నగరికి గడిదుర్గములకు/తగు రక్ష ఘటించి, పార్ష్ణితలము విశుద్ధం
 బుగ జేసి, రఘువు షడ్విధ/మగు రాణువతోడ జైత్రయాత్రకు వెడలెన్ 26

గడి+దుర్గములకు=నగర సమీపపు+కోటలకు, రక్ష+ఘటించి=రక్షణ+ఏర్పరచి, పార్ష్ణి+తలము=సైన్యపు వెనుక+ భాగము, విశుద్ధంబుగజేసి=(శత్రుభయ)దోషములేనట్లుచేసి, షడ్విధ=మూల, సుహృత్, భృత్య, శ్రేణీ, ద్విషత్, ఆటవిక(బలములు), రాణువ=సేన, జైత్రయాత్రకు=యుద్ధమునకు,

క. కురిసిరి మంగళలాజలు/నరవరుపై నగరువృద్ధనారీజనముల్,
 తరిగొండ సెగయు తుంపురు/గరుడధ్వజుమీద పాలకరడుల కరణిన్. 27

లాజలు=వరిపేలాలు, తరిగొండ=క్షీరసాగరనథన సమయమున మందరపర్వత భ్రమణముచే, ఎగయు+ తుంపురు=ఎగురునట్టి+పాలబొట్లు, గరుడధ్వజుడు=విష్ణువు, పాల+కరడుల+కరణిన్= పాలసముద్రపు+ అలల+విధముగా,

క. ప్రాచీనబర్హిరుపముడు/ప్రాచీదిశ పట్టి తొలుత బయనించె మరు
 ద్వీచిసముద్ధూతపతా/కాచయమె విపక్షకోటి గడు గద్దింపన్. 28

ప్రాచీనబర్హి+ఉపముడు=ఇంద్రునితో+సమానుడు, ప్రాచీదిశ+పట్టి=తూర్పువైపు+మొదలెట్టి, మరుత్+వీచి+ సము+ఉద్ధూత+పతాకా+చయమె=అనుకూలవాయువులు+వీచుటచే+బాగుగా+కదలింపబడిముందుకు నిగుడు+జెండా+సమూహమే, విపక్షకోటి=శత్రులందరిని, కడు+గద్దింపన్=బాగా+బెదరింప చేయగా,

క. దివి భువి యయ్యె జమూరథ/జవనహయోద్ధూతరేణు సంఛాదితయై,
 భువియు దివి యయ్యె నయ్యెడ/నవవార్షికజలదసదృశనాగాన్వితయై, 29

చమూ=సైన్యము యొక్క, రథ+జవన+హయ+ఉద్ధూత=రథములచే+వడిగల+అశ్వములచే, ఎగురగొట్టబడిన, రేణు+సంఛాదితయై=ధూళిచే+అలుము కొన్నదై, దివి+భువి+అయ్యె=ఆకాశము+ధూళి కప్పి భూమి+అన్నట్లుండెను, నవ+వార్షిక+జలద+సదృశ+నాగ+ఆన్వితయై=క్రొత్తగా+వర్షముకురియు+మేఘములు+అన్నట్లుగా+ఏనుగులతో+కూడినదై, భువియు+దివి+అయ్యె=భూమి+మేఘములు కప్పిన ఆకాశము+అట్లుండెను,

క. తొలుత మగంటిమి, పదపడి/ఎలగో, లటమీద, దుమ్ము, ఇన్నిటి వెనుకన్.
బలువిడి రథాదికమునై/నలుమొగ్గరములుగ నిట్లు నడచెను బలముల్ 30

తొలుత=ముందుది-ముఖ్యమైనది, మగంటిమి=పౌరుషప్రఖ్యాతి, పదపడి=ఆవెనుక, ఎలగోలు=ముందునడచు సేన కలకలము, అటమీద=ఆపై, బలువిడి=పరాక్రమము ఉద్రేకము వేగము సరైన పద్ధతి కల, రథ+ఆదికము=రథ గజ తురగపదాతి సేన, నలు+మొగ్గరములు=నాలుగు+వ్యూహములుగా, నడచెను=వెడలెను,

క. మరుభూముల జలవసతులు/అరణ్యమధ్యంబులందు నధ్వములు సరి
త్తరణమునకు దృఢనౌకా/పరికరములు నలవరించి ప్రావీణ్యమునన్ 31

మరుభూముల=ఎడారులందు, అధ్యములు=త్రోవలు, సరిత్+తరణమునకు=నదులు దాటుటకు, అలవరించి=సిద్ధపరచి, ప్రావీణ్యమునన్=నేర్పుతో,

తే. కడు రయంబున బూర్వాబ్ధిగామిని యగు/నామహాసేన నడపించె నవధనేత,
హరజటాజూటవిభ్రష్టమైన నిర్జ/రధుని నడపిన, అల భగీరథుని, భంగి. 32

రయమున=వేగమున, పూర్వ+అబ్ధి+గామి=తూర్పు+సముద్రమువైపు+వెళ్ళు, అవధనేత=అయోధ్యరాజు, హర+జటాజూట+విభ్రష్టము+ఐన+నిర్జర+ధుని=శివుని+జటాజూటమునుండి+జారినది+అయిన+దేవ+నది, అల=ప్రసిద్ధిచెందిన,

ఆ. ఫలము లపహరించి పాతులు కదలించి/పలువిధముల భగ్నపరచె, రఘువు
దారిపొడవు శత్రుధాత్రీకళత్రుల/వనగజంబు వృక్షవాటి బోలె 33

ఫలములు=పండ్లు(కప్పములు), పాతులు కదలించి=మొదళ్ళు+పెళ్ళగించివిరచి(అధికారము నుండి+తొలగించి), భగ్నపరచె=చిన్నాభిన్నముచేసె(భంగపరచె), శత్రు+ధాత్రీ+కళత్రుల=శత్రు+భూ+భర్తల-రాజుల, వనగజంబు+వృక్షవాటి బోలె=ఏనుగులు+చెట్లను నాశముచేసినట్లు (రఘువు శత్రురాజుల కప్పముల తీసుకొని, అధికారము తొలగించి భంగపెట్టి కళవళపెట్టెను.)

క. పౌరస్త్యజనపదంబుల/వీరవిహారము ముగించి విజిగీషుండై

చేరె, మహీపతి పారా/వారము కూలంబు దాళవననీలంబున్. 34

పౌరస్త్య=తూర్పున ఉన్న, జనపదముల=దేశముల, విజిగీషుండై=మిక్కిలి జయింప ఇచ్ఛగలవాడై, పారావారము=సముద్రము, కూలము=తీరము, తాళ+వన+నీలంబు=తాటి+చెట్లచే+నీలమైనది,

క. తలయొగ్గ కెదిరి నిలిచిన/నిలువున బెకలింప జాలు నృపుధాటికి, ప్ర

బ్బలిమొక్క లేటివడికిన్/బలె, నడగిమడంగి, నాడు బ్రతికిరి సుహ్మల్. 35

తల+ఒగ్గక+ఎదిరి+నిలచిన=తల+స్వాధీనపరచక-లొంగక+ఎదిరించి+నిలచిన, నిలువున=ఆశాంతము, పెకలింపజాలు=పెల్లగిల్లజేయగల, ప్రబ్బలిమొక్క=గడ్డివంటి మొక్క విశేషములు, ఏటి+వడికిన్+వలె=నది+ప్రవాహవేగమునకు+వలె, అడగిమడంగి=లొంగిపోయి, సుహ్మలు=సుహ్మదేశపురాజులు.

క. వంగనరేంద్రుల నౌకా/సంగరమునభంగపుచ్చి, సమ్రాట్టు సము

త్తుంగజయస్తంభంబులు/గంగానది పాయలందు గడు నెత్తించెన్. 36

సంగరము=యుద్ధము, భంగపుచ్చి=అవమానచఱచి, సమ+ఉత్తుంగ+జయ+స్తంభంబులు=బాగా+ఎత్తైన+జయమును చాటించు+రాటలు, కడు=ఎక్కువగా, ఎత్తించెన్=స్థాపించెను.

క. ధృతిచెడి ఆపాదంబుగ/నతులై, భజియించి, రఘువునకు ఫలచయమున్

వితరించిరి, ఉత్ఖాత/ప్రతిరోపితవంగనృపులు, వరిచేల వలెన్. 37

ధృతి=ధైర్యము, ఆపాదంబుగ+నతులై=పాదములకు+నమస్కరించిన వారై, భజియించి=సేవించి, ఫల+చయము=బహుమానపు-కప్పపు+రాశి, వితరించిరి=సమర్పించిరి, ఉత్ఖాత=(రాజ్యమునుండి) పెల్లగింప బడి-, ప్రతిరోపిత=మరల ప్రతిష్టింపబడిన, వరిచేల వలెన్=వరినాట్లుమొలచినపిదప పీకబడి మరలవరిమడిలొ నాటు నట్లు,(ముందు చెప్పిన ప్రబ్బలి మొక్కలు సైనికప్రవాహమునకు తలబంచి తరువాత లెచి నట్లు)

తే. ఏనికలపిండు వంతెనగా నొనర్చి/వాహినులు దాను కపిశాస్రవంతి దాటి,

కదలె, కాకుత్ స్థు డభికళింగముగ, నంత/ఉత్కళులు త్రోవసూపుచు ఉపచరింప. 38

ఏనికల+పిండు=ఏనుగుల+సమూహము, వాహినులు+తాను=సేన+రఘువు, కపిశా+స్రవంతి=కపిశ+నది, అభికళింగముగ=కళింగదేశ అభిముఖుడై, ఉపచరింప= బోధింప

క. పరుషముగ నాటె నట జని/నరపతి గంభీరవేది నాగేంద్రముపై

బరిగోల నాటు మావటి/కరణి, మహేంద్రాద్రి మీద ఘనదోశ్శక్తిన్. 39

గంభీరవేది+నాగేంద్రము=గంభీరవేదిఅను+జాతిఏనుగు(చర్మము చీలినను రక్తము కాఱినను మాంసము ఊడిపడినను మదాతిరేకముచే తెలియని ఏనుగు విశేషము), పరి+కోల+నాటు+కరణి=పదునుకల+

అంకుశము+గుచ్చుట+వలె, మహేంద్రాద్రి=సప్తకులపర్వతములకు రాజైన మహేంద్ర పర్వతము, ఘన+దోశ్శక్తిన్=గొప్ప+భుజబలముచే,

క. శరవృష్టిని ముంచె రఘున్/గరిసాధనదుర్జయుండు కాళింగు డటన్,
గఱులు నరుకంగ బూనిన/హరిహయుపై, రాలు గురియు నచలము భంగిన్. 40

శర+వృష్టిని=బాణముల+వర్షముచే, కరి+సాధన+దుర్జయుండు=ఏనుగుల+బలముండుటచే+గెలవలేనివాడు, గఱులు+నరుకంగ=రెక్కలు+త్రుంచ, హరిహయుపై=ఇంద్రునిపై, రాలు+కురియు+అచలము+భంగిన్= రాళ్ళు+విసురు+కొండ+వలె(ఇంద్రుడు కొండ రెక్కలు త్రుంచును.రాబోవు ఓటమి సూచన)

క. పైకొన్న విశిఖధారా/సేకము సన్మంగళాభిషేకము గాగన్,
కాకుత్స్థుడు విజయరమా/స్వీకృతిగావించె బాహుసిరి యుంకువగన్. 41

పైకొన్న=మీదపడిన, విశిఖ+ధార+ఆసేకము=బాణముల+ధారలు+చిమ్ముట, సన్+మంగళ+అభిషేకము+కాగన్=మంచి+మంగళకరమైన+స్నానము+ఐనట్లు, విజయ+రమా=విజయ+లక్ష్మి, ఉంకువగన్=శుల్కముగా,

ఆ. అన్నగమున విరచితాపానభూముల/ఆరగ్రోలి రరుల యశము బోలె,
నారికేళమధువు నాగవల్లీపత్ర/పుటములందు బట్టి పోటుబంట్లు. 42

ఆ+నగమున=ఆ+కొండపైన, వి+రచిత+అపాన+భూముల=బాగా+సిద్ధముచేసికోబడిన+మధ్యపాన+ప్రదేశముల, ఆరన్+క్రోలిరి=పూర్తిగా+త్రావిరి, అరుల+యశమున్+పోలె=శత్రువుల+కీర్తిని+వలె, నారికేళ+మధువు=కొబ్బరి+కల్లు, నాగవల్లీ+పత్ర+పుటములు+అందు=తమలపాకు+ఆకుల+దొప్పల+అందు, పోటు+బంట్లు=యుద్ధ+భటులు,

ఆ. పట్టువడిన పగతు బలదర్పములు మెచ్చి/విడిచిపుచ్చె, ధర్మవిజయి, రఘువు,
ఆ మహేంద్రవిభుని యైశ్వర్య మంతయు/పుచ్చికొనియె, రాజ్యమిచ్చెనియె. 43

విడిపిపుచ్చె=విడచి వదిలెను, ధర్మవిజయి=ధర్మముగా జయించిన,

మ.ద్వి. పదబడి, వరుణసంభవువాసదిశకు/మదురబండిన పోకమ్రాకుల తోడి
వారాశివేల వెంబడి, ప్రయాణించె/వీరు డయత్నాజి విజయుడు రఘువు. 44

పదబడి=మఱియు, వరుణసంభవు+వాస+దిశ=అగస్తుడు+నివశించు+దిక్కు-దక్షిణము, మదురన్+పండిన=మిగుల+పండిన, పోకమ్రాకుల+తోడి=పోకచెట్ల+వెంట, వారాశి+వేల=సముద్రపు+ఒడ్డు, అయత్న+ఆజి+విజయుడు=శ్రమలేకుండా+యుద్ధములో+గెలుచువాడు,

మ.ద్వి. ఏనుగు లోడ్చిన దానపూరమున/సైనికపరిభోగసంయుతం బగుచు,
కావేరి తోయము గమగమ వలచె/శైవలినీభర్తృశంకనీయముగ 45

ఓడ్చిన=కార్చిన, దాన+ఘూరమున=మదమును+కడిగిననీటిచే, సైనిక+పరిభోగ=సైనికులు+వాడినభోగ వస్తువుల చేతను, సంయుతము=మిక్కిలి కూడినదై, కావేరి తోయము= కావేరీ నది నీళ్ళు, గమగమ= పరిమళించుటందు అనుకరణము, వలచె=వాసన చిమ్మ, శైవలినీ+భర్తృ=నదుల+భర్త-సముద్రముచే, శంకనీయముగ=(వాసనల వల్ల పరపురుషసంయోగమా అని కావేరీనదిని) శంకించదగ్గదైనది..

మ.ద్వి. అచ్చట సాగి, ఱే డవల దవ్వరిగి/పచ్చపిట్టల యాటపాటల కలిమి
పొలుపారు మిరియపు బొదలు క్రిక్కిఱియు/మలయనగోపత్యకలు చేరి, విడిసె. 46

అవల+దవ్వు+అరిగి=అవతలి+తీరము+వెళ్ళి, కలిమి=సంపదచే, పొలుపారు=ఒప్పారు, మలయ+నగ+ ఉపత్యకలు=మలయ+పర్వతములను+ఆనిన క్రిందిభాగములు,

మ.ద్వి. హరిఖురక్షుణ్ణములై పుటం బెగసి/పరువపు టేలకిపండ్ల రేణువులు,
గంధసాదృశ్యము కల మదోన్మత్త/సింధురంబుల గండసీమల నంటె. 47

హరి+ఖుర+క్షుణ్ణములై=గుఱ్ఱముల+డెక్కలచే+త్రొక్కబడి, పుటంబు+ఎగసి=డొప్పలు+ఎగిరి, పరువపు+ఏలకి +పండ్ల+రేణువులు=లేత+ఏలకుల+పండ్ల+రజము, గంధ+సాదృశ్యము=వాసన+పోలికకల, మద+ఉన్మత్త+ సింధురముల=మదముచే+మత్తెక్కిన+ఏనుగుల, గండసీమల+అంటె=కటకమున+తగులుకొనెను,

మ.ద్వి. నాగవేష్టిత చందనాగనిమ్న ముల/బాగుగాబంధింపబడిన ఏనుగులు,
కాలిసంకెలల తున్కలుసేయజాలు/చాలవు మెడకట్లు, సడలింప నచట. 48

నాగ+వేష్టిత+చందన+అగ+నిమ్న ముల=పాములచే+చుట్టుకొనబడిన+చందనపు చెట్లుగల+కొండ+చరియల, తున్కలు+చేయజాలు=ముక్కలు+చేయ గల సామర్ధ్యము కలవైననూ, చాలవు+మెడ కట్లు+సడలింప =అసమర్ధులు+మెడకట్లు+వదులుచేయ, (పాముల కాళ్ళతో చంపగలవు కాని పారిపోలేవు)

క. ప్రక్షీణమగు నహర్పతికైన గాక/దక్షిణదిశయందు, దప్పనిసరిగ,
ఐనను దత్రత్యు లైన పాండ్యులకు/ఆనాటి రఘుతేజ, మవిషహ్యా మయ్యె. 49

ప్రక్షీణమగున్+అహర్పతికైనన్+కాక=మిక్కిలి తక్కువ అయిన+సూర్యుని+వేడిమి(దక్షిణదేశమున ఎండతీవ్రత తక్కువగాఉండును), తప్పని సరిగ=తప్పకుండా, ఐనను=అయినప్పటికి, తత్రత్యు లైన=అక్కడ ఉన్నవారైన, అవిషహ్యాము+అయ్యె=సహింపలేనిది+అయినది,

మ.ద్వి. దైలీపి యడుగుల దడయ కద్దొరలు/వ్రాలిరి, సంచితస్వయశంబు బోని,

తామ్రపర్ణీమహోదధిసంగజమును/కమ్రముక్తాశ్రేణి కప్ప మర్పించి. 50

దైలీపి+అడుగుల+తడయక=దిలీపునికుమారుని+పాదముల+ఆలస్యము చేయక, సంచిత+స్వ+యశంబు+బోని =ఆర్జించిన+తమ+కీర్తిని+పోలిన, తామ్రపర్ణీ+మహోదధి+సంగజము= తామ్రపర్ణీ+సముద్ర+సంగమ ప్రదేశము లోపుట్టిన, కమ్ర+ముక్తా+శ్రేణి+కప్పము+అర్పించి=ఇంపైన+ముత్యముల+వరుసలు+కప్పముగా + ఇచ్చి,

క. చని కేళి సలిపె నంతన్/జనవరు, డాలీఢచందనములై, తటముల్

తనియింప, దక్షిణాశా/స్తనయుగముబోని, మలయదర్దురగిరులన్. 51

ఆలీఢ+చందనములై=వ్యాపించిన చందన వృక్షములు కలదై, తటములు=నది ఒడ్డులు, తనియింప=తృప్తి పరచ, దక్షిణ+ఆశా=దక్షిణ దిక్కుయొక్క, స్తనయుగము+బోని= రెండుకుచముల+పోలిన, మలయదుర్దుర+గిరులన్=మలయము దుర్దరము అను +పర్వతములందు,

క. హేలగ దాటె పదంబడి/దైలీపి, సముద్రమునకు దవ్వయి, విగళ

చ్చేలమగు భూనితంబము/బోలిన సహ్యము, నసహ్యభుజవిక్రముడై. 52

హేలగ=క్రీడగ, పదంబడి=వెంటనే, దవ్వయి=దగ్గరైన, విగళచ్చేలమగు=జారిన చీరయైన, భూ+నితంబము=భూదేవి+పిఱుదుల, సహ్యము=సహ్యపర్వతము, అ సహ్య+భుజ+విక్రముడై=సహించుట సాధ్యముకాని+భుజముల+పరాక్రమముతో,

తే. అవల అపరాంతవిషయజయాభిలాష/కదలి చను తద్వరూధిని కానిపించె,

పరశురామాస్త్రమున వేరుపడియు, తిరిగి/సహ్యగిరి నానుకొనియెనో సంద్రమనగ. 53

అవల=పిమ్మట, పరశురామాస్త్రమున వేరుపడియు=సముద్రమును అంటివున్న సహ్యాద్రి పర్వతమును పరశురాముడు తన అస్త్రములతో దూరముగా నెట్టిననూ, అపరాంత+విషయ=పడమర+దేశ, విషయ జయాభిలాష+కదలిచను=జయముకోరి+ముందుకుసాగు, తత్+వరూధిని=రఘువు సేన సముద్రమువలే అధికమై ఆకొండప్రదేశమును విస్తరింప, తిరిగి=మరల, సహ్యగిరిని+ఆనుకొనియెనో సంద్రమనగ=సహ్యగిరిని+సముద్రము దాపునఉన్నట్లు, కానిపించె=కనబడ్డది.

తే. భయపరిత్యక్తమంగళాభరణలైన/తరుణకేరళాంగనల ముంగురుల వ్రాలి,

తద్బలము ధూళి, ప్రాతినిధ్యము వహించె/లలితకాశ్మీరభవసమాలంభమునకు. 54

భయ+పరిత్యక్త+మంగళ+ఆభరణ+లైన+తరుణ+కేరళ+అంగనల=భయముచే+విడిచిన+మంగళకరమైన+ఆభరణము+కల+యుక్త+కేరళ+స్త్రీలకు, తత్+బలము+ధూళి=ఆ+సేనరేపిన+ధూళి, ప్రాతినిధ్యమువహించె=

ప్రాముఖ్యత+సాధించెను, లలిత+కాశ్మీరభవ=సుందరమై+కాశ్మీరములోపుట్టిన-కుంకుమపువ్వుతో, సమాలంభమునకు=శరీరము పూసుకొనుటకు,

క. మురళామరుదానీతము/పరువపు గేదగి రజంబు పచరించె, నరే
శ్వరభటుల కంచుకములకు/పరమప్రియముగ అయత్నపటవాసకమై. 55

మురళా+మరుత్+అనీతము=మురళానది+గాలిచే+తేబడిన, పరువపు+గేదగి+రజంబు+పచరించె=లేత+మొగలిపూల+పుప్పొడి+ఆవరించె, కంచుకము=కవచము, అయత్న=ప్రయత్నించకుండా లభించిన, పటవాసకమై=బుక్కాయై(వస్త్రములకు వాసనకట్టేడు గంధపుపొడి),

క. పరుగిడు హయముల మేనుల/స్వరయుతముగ నుద్భవించు వర్మధ్వనులన్
పరిభూతము లయ్యె మరు/త్పరికంపిత రాజతాళవనమర్మరముల్. 56

హయముల=గుఱ్ఱముల, మేనుల=శరీరమునుండి, స్వర+యుతముగ+ఉద్భవించు=లయతో+కలిసి+పుట్టు, వర్మ+ధ్వనులన్=జీనుల+చప్పుళ్ళచేత, పరిభూతము=మరుగుపడినవి, మరుత్+పరికంపిత+రాజ తాళ+వన+మర్మరముల్=గాలిచే+బాగుగాకదలింపబడిన+శ్రీతాటివృక్షముల+అడవిఅందలి+ఆకుల+ధ్వని,

క. బంధురముగ ఖర్జూరీ/స్కంధములకు గట్టబడిన గజముల మదవ
ద్గంధిలకటములపై పు/ష్పంధయములు వ్రాలె, ముక్తబహువల్లరులై. 57

బంధురముగ=వంగిన, ఖర్జూరీ+స్కంధములకు=చిట్టిఈతచెట్టు+బోదెలకు, గజముల+మదవత్+గంధిల+కటములపై=ఏనుగుల+మదముకారుటచేమంచివాసనగల+గండస్థలముపై, పుష్పంధయములు+వ్రాలె=తుమ్మెదలు+వాలినవి, ముక్త+బహు+వల్లరులై=విడవ బడిన+పెక్కు+పూగుత్తితీవలై (పూలతీగల విడచి ఏనుగులపై తుమ్మెదలు వాలినవి)

క. కృపణత నడిగిన రాముని/కపు డించుక ఎడ మొసంగె నంట సముద్రుం
డపరాంతవిభుల నెపమున/నిపుడు రఘుని కిచ్చె గప్ప మెన లేని మణుల్. 58

కృపణత=లోభియై, రామునకు=పరశురామునకు, ఇంచుక+ఎడము=స్వల్పమైన+చోటు, అపర+అంత+విభులు+నెపమున=పడమటివైపున్న+తనద్వీపములలోనున్న+రాజుల+మిషతో, కప్పము+ఎనలేని+మణుల్=కప్పముగా+సాటిలేని+మణులు(ద్వీపరాజులు కప్పము చెల్లించిరి),

క. సమదద్విపరదనక్షతసమవాయవ్యక్తగాఢశౌర్యాంటకమై,
సమకూడె త్రికూటమె, యట /సమరజయస్తంభ మగుచు సావిత్రునకున్. 59

సమద+ద్విప+రదన+క్షత+సమవాయ+వ్యక్త+గాఢ+శౌర్య+అంబకమై=మదముగల+ఏనుగుల+దంతములచే +దట్టముగా గీరిన గీరలతోకూడిన+సంబంభము+స్పష్టముగాకనబడుట+వానిహెచ్చైన+విక్రమమును తెలుపు +చిహ్నమై, సమకూడె=సిద్ధించెను, త్రికూటమె=చరియలపైచిత్రించబడిన త్రికూట పర్వతమే, అట=అక్కడ, సమర+జయ+స్తంభము+అగుచు=దిగ్విజయమునువెల్లడించు+జయ+స్థంభము+అన్నట్టుగా ఉండెను, సావిత్రునకున్=సూర్యవంశజుడైన రఘువుకు

క. భానునిభు డంత వెడలెను/సేనాసహితముగ పారశీకుల గెలువన్,
లోని విపక్షుల తత్వ/జ్ఞానంబున వీగజేయు సంయమి, పగిదిన్. 60

భానునిభుడు=సూర్యునితోసమానుడు, లోని విపక్షుల=అంతశ్శత్రువుల, వీగన్+చేయు=తొలగ+చేయు, సంయమి+పగిదిన్=ముని+వలే,

ఆ. యవన యౌవతముల ఆననమధుమద/మనుమతింప డయ్యె, అవధనేత,
పద్మవనము మీది బాలాతపవ్యాప్తి/నసమయాంబుదోదయంబు కరణి. 61

యవన+యౌవతముల=యవనజాతి+యువతీసమూహముల, ఆనన+మధు+మదము+అనుమతింపడయ్యె =నోటికి+మధువువలనకలుగు+మత్తుకు+సమ్మతింపడు(తమభర్తలు రఘువుతో యుద్ధముచేసి ఓడిపోవు చుండగావారికి మధుపానము లేదు), అవధనేత=అయోధ్యరాజు, బాల+ఆతప+వ్యాప్తి=లేత+ఎండ+ ప్రసరణకు, అసమయ+అంబుద+ఉదయంబు+కరణి=అకాల+మేఘములు+పుట్టుటచే+(ఎండతగలని తామరపూవుల) వలె,

క. తలపొగరున పాశ్చాత్యులు/తలపడి రా జెట్టి తోడ తరతరమ ధరా
తల మద్రువగ, బలు గుట్టపు/దళములతో, నెత్తివచ్చి, దారుణ భంగిన్. 62

పాశ్చాత్యులు+తలపడి+రా=పడమటి రాజులు+ఎదిరించి+రాగా, జెట్టి=శూరుడు-రఘువు, తరతరమ= క్రమ క్రమంగా, ధరాతలము+అద్రువగ=భూమి+కంపింప, దళము=దండు, దారుణభంగిన్=భయానకముగ,

తే. కడిమి నిరువాగు నొండొరు గవిసి పెనగ/అక్కజంబుగ గ్రందుకయ్యంబు సాగె
శార్ఙ్గకూజిత విజ్ఞేయశత్రుపక్ష/యోధమై, కుంభినీరేణు వుప్పతిల్లె 63

కడిమి=పట్టుదలతో, ఇరువాగు=రెండు వర్గములు, ఒండొరు+కవిసి+పెనగ=ఒకరినొకరు+ఎదుర్కొని+యుద్ధము చేయ, అక్కజముగ=ఆశ్చర్యముగ, క్రందుకయ్యంబు+సాగె=దొమ్మియుద్ధము+జరిగెను, శార్ఙ్గకూజిత=ధనుష్టం కారములు ఊదబడుచున్నకొమ్ములధ్వనితోడనే, విజ్ఞేయ=తెలిసికోబడు, శత్రుపక్షయోధమై= శత్రువర్గముకలదై, కుంభినీరేణువు=నేల ధూళి, ఉప్పతిల్లె=నిండెను,

క. అపుడు నృపు డురవడించిన/అపహృతవిక్రాంతు, లపగతాటోపులునై,
అపనీత ధనుర్బాణులు/అపాకృతప్రాణు లైరి యవనవజీరుల్ 64

ఉరవడించిన=పరాక్రమించిన, అపహృత+విక్రాంతు=అపహరింపబడిన+శౌర్యము కలవారు, అపగత+ఆటోపులు = పోయిన+గర్వముకలవారు, అపనీత=దూరముగా విసిరివేయబడిన, అపాకృత=తొలగింపబడిన, వజీరులు=శూరులు,

క. దళమున నెదిగిన గడ్డం/బుల మీసలతోడి తురకమొనగాండ్ర తలల్
పొలికలన డొల్లె, పెరయీ/గలు పొదవిన తేనెపట్ల కైవడి బెక్కుల్. 65

దళమున=దట్టముగా, పొలికలన=యుద్ధభూమిలో, డొల్లె=పొర్లిపడె, పెర+ఈగలు=ఒక రకపుతేనెటీగలు, పొదవిన=పెట్టిన, కైవడి=వలె, పెక్కుల్=చాలమంది.

క. హతశేషు లెల్ల దర్ప/చ్యుతులై, తమ తలల పాగ లూడిచి శరణా
గతులైరి, ఘనుల కినుకకు/ప్రతికారము లేదు, కాళ్ళబడు టొకటి వినా! 66

హత+శేషులు=చావగా+మిగిలినవారు, దర్ప+చ్యుతులై=గర్వము+వదిలినవారై, ఊడిచి=తీసివైచి, ఘనుల+కినుకకు=గొప్పవారి+కోపమునకు, ప్రతికారము=పరిహారము, వినా=మినహాయించి,

ఆ. అపనయించికొనిరి రిపుజయక్లేశము/పోటుబంటు లెల్ల నాటిరేయి,
అజినచయము పఱచి నట్టి ద్రాక్షాకుంజ/సీమలందు మధునిషేవణమున. 67

అపనయించికొనిరి=పోగొట్టుకొనిరి, రిపు+జయ+క్లేశము=శత్రువుల+జయించుట అందలి+శ్రమ, అజిన+చయము+పఱచి=జంతుచర్మముల+సమూహము+పఱచుకొని, ద్రాక్షాకుంజ+సీమలు+అందు=ద్రాక్షతోటల+ప్రదేశములు+అందు, మధు+నిషేవణమున=మద్యము+అనుభవించుటచే,

ముత్యాలసరము: బయలుదేఱె గుబేరదిశకు నృపాలు డంత విభావసుని వలె
నిశిత శరకరముల నుదీచ్యుల, నీటిబలె నిగిరింపన్. 68

కుబేరదిశ=ఉత్తరదిక్కు, విభావసుని=సూర్యుని, నిశిత=వాడియైన, శర=బాణములను కరముల=కిరణముల, ఉదీచ్యుల=ఉత్తరదేశపురాజులను, ఇగిరింపన్=ఇంకజేయ,

ముత్యాలసరము: సేదదేఱె దదీయ హయములు సింధుతీర వివేష్టనంబుల,
సక్తకుంకుమకేసరములగు స్కంధములు జాడించుచున్. 69

హయములు=గుఱ్ఱములు, సింధు+తీర+విపేష్టనంబుల=సింధునది+ఒడ్డుల+పొరలుటచే, సక్త+కుంకుమ+కేసరములు+అగు+స్కంధము+జాడించుచున్=అంటుకొనిన+కుంకుమపువ్వు+కింజల్కములు+కల+జూలుతో నున్న మూపులు+దులుపుకొనుచు,

ముత్యాలసరము: వ్యక్తమయ్యెను రఘుని విక్రమ మచటి హూణుల తోడి దురమున,
తదవరోధకపోలమండలతామ్రరేఖాదేశియై. 70

వ్యక్తమయ్యెను=తెలిసెను, తురమున=యుద్ధమున, తత్+అవరోధ+కపోల+మండల+తామ్ర+రేఖ+ఆదేశియై=హూణదేశరాజుల+అంతఃపురస్త్రీల+చెక్కిళ్ళ+ప్రదేశమునందు+రఘు పరాక్రమముచే కలిగిన ఆక్రందనవలన పుట్టు ఎఱ్ఱదనపు+ఛాయను+తెప్పించునదై,

ముత్యాలసరము: లొంగిపోయిరి ప్రధనజయధృతిలోపమున, గాంభోజులతనికి,
సామజాలానక్షతద్రుమసార్ధముగ, నానమ్రులై 71

ప్రధన+జయ+దృతి+లోపమున=యుద్ధమునందు+జయించు+పట్టుదల+లేకపోవుటచే, సామజాలన+క్షత+ద్రుమ+సార్ధముగను=ఏనుగుకాలికట్లఛేత+బాగాదెబ్బతినిన+చెట్ల+వలె, ఆనమ్రులై=బాగావంగినవారై,

ముత్యాలసరము: అశ్వభూయిష్ఠములు తుంగమహార్ధరాశులు వారి కాన్కలు,
గర్వహేతువులయ్యు, నుండెను నిర్వికృతి, నత డెంతయున్. 72

అశ్వ+భూయిష్ఠములు=గుఱ్ఱములు+అధికముగా, తుంగ+మహా+అర్ధ+రాశులు=ఎత్తైన+గొప్ప+ధన+రాశుల కొండలు, గర్వహేతువులయ్యు=గర్వకారణములయ్యు, నిర్వికృతి=మోహపడక, ఎంతయున్=ఏమాత్రముకూడా,

ముత్యాలసరము: సప్తిసాధకుడై ఉమాగురు శైల మెక్కె నరేంద్రు డట జని
ఎగుయు గైరికధూళి శిఖరము లెదుగుచున్నటు లగపడన్. 73

సప్తి+సాధకుడై=(కాంభోజరాజు సమర్పించిన)గుఱ్ఱముల+ఉపయోగించువాడై, అట+జని=అక్కడకు+వెళ్ళి ఉమా+గురు+శైలము=పార్వతి దేవి+తండ్రి హిమాలయ+పర్వతముపై, ఎగుయు=గిట్టలచేఎగిరిన, గైరిక+ధూళి =గైరికాదిధాతువుల +దుమ్ము, శిఖరములు+ఎదుగుచున్నటులు=శిఖరముపై+దుమ్ము చేరి దాని ఎత్తు పెరుగుచున్నట్లు, అగపడన్=అనిపించగా,

ముత్యాలసరము: సింగములు గుహలందె గ్రీవాభంగదృష్టుల నుండె గదలక,
సైనికుల అలజడికి జడియని సదృశసత్త్వము జాటుచున్ 74

గ్రీవ+అభంగ+దృష్టులను+ఉండెన్+కదలక=మెడనుకూడా+తిప్పని+చూపులతో+ఉండెను-ఏమాత్రముకదలక, జడియని=భయపడని, సదృశ+సత్త్వమున్+చాటుచున్=సైనికులవంటి+బలధైర్యము+ప్రదర్శించుచు,

ముత్యాలసరము: భూర్జతరువుల మర్మరములకు బొంగువెదురు రొదకు గతమై
గంధమారుత మెలసె బథమున గాంగశీకరశీతమై. 75

భూర్జతరువుల=భూజపత్రవృక్షముల, మర్మరములకు=ఎండుటాకులచప్పుడుకు, బొంగువెదురు+రొదకు+గతమై=లావుగా బోలగా ఉన్నవెదురు రంధ్రములనుండి గాలి వీచిన వచ్చు+ధ్వని+కూడినదై, గంధ+మారుతము=సువాసనకల+గాలి, పథమున=మార్గమున, గాంగ+శీకర+శీతమై=గంగానది+తుంపరలచే+చల్లనైనదై, ఎలసె=ఒప్పె,

ముత్యాలసరము: మేను లలరగ విశ్రమించిరి సైనికులు సురపొన్న నీడల,
సముపవిష్టకురంగనాభికషాయగంధిలశిలలపై 76

అలరగ=సంతోషింప, సమ+ఉపవిష్ట=(అంతకు ముందు)చాలా సమయముకూర్చునిలేచిన, కురంగ+నాభి+కషాయ+గంధిల+శిలలపై=కస్తూరీమృగము+రంధ్రములనుండి స్రవించిన+కస్తూరి+వాసనలు+కొంచముగా వెదజల్లు+రాళ్ళపై ( కురంగము చాలాసేపు రాళ్ళపై కూర్చుండి తన శరీరము నుండి విడుచునది కస్తూరి అగును.),

ముత్యాలసరము: భద్రగజముల కంఠభూషల ప్రతిఫలించిన ఓషధీద్యుతు
లవనిపతి కస్నేహదీపిక లయ్యె మాపటి పొద్దులన్ 77

కంఠభూషల=మెడ గొలుసుల, ఓషధీద్యుతులు=వెలుతురువిరజిమ్ముఔషదమొక్కల కాంతులు, అ స్నేహ+దీపికలు+అయ్యె=నూనె లేని+దీపములు+అయినవి, మాపటి ప్రొద్దులన్=రాత్రివేళలందు,

ముత్యాలసరము: రఘు విసృష్టనివాసముల గళరజ్జువిక్షతవల్కలములై
సరళ తరువులె చెప్పు చెప్పక సామజముల ప్రమాణముల్. 78

విసృష్ట+వివాసముల=విడిచిన+మజిలీల, గళ+రజ్జు+విక్షత=కంఠమందలి+గొలుసుతాళ్ళచే+గీయబడిన, వల్కలములై=చెట్టుపట్టలుకలవై, సరళ+తరువులె=దేవదారు+చెట్లే, సామజముల+ప్రమాణములన్=వానిఏనుగుల+ఎత్తు కొలతలను,

క. పోరయ్యె నచట నచలా/కారులతో, పర్వతీయగణవీరులతో,
నారాచముద్గరోపల/దారుణనిష్పేషజనితదహనోగ్రంబై 79

పోరు+అయ్యె+అచట=యుద్ధము+అయినది+అక్కడ, అచల+ఆకారులతో=కొండవంటి+శరీరముకలవారితో, పర్వతీయగణవీరులతో=పర్వతముపైఉండు ఉత్సవ సంకేత వీరులతో, నారాచము+ ఉద్గర+ఉపల=ఇనుప

బాణములు+సమ్మెటగదలు+కల్వపుగుండ్లు, దారుణ+నిష్పేష+జనిత+దహన+ఉగ్రంబై=తీక్ష్ణ+రాపిడిచే+పుట్టిన+మంటలు+భయంకరమై,

క. అలుగుల నుత్సవసంకే/తుల విరతోత్సవుల జేసి, దుర్జయభుజు డా
బలియుడు పాడించెను, తన/గెలుపుటుదాహరణ మచటి కింపురుషులచే. 80

అలుగుల=బాధచే, ఉత్సవసంకేతుల+విరత+ఉత్సవులన్+చేసి= ఉత్సవసంకేతులను+పోయిన+ఉత్సాహము కలవారిగా+చేయగా, దుర్జయ+భుజుడు=జయింపరాని+భుజబలముకలవాడు, బలియుడు= దేహబలము కలవాడు, గెలుపు+ఉదాహరణము=విజయము వర్ణించు+ఉదాహరణ కావ్యము,

క. అమితోపాయనముల, హ/స్తములం గొనితెచ్చి గణవితానము లొసగన్,
హిమనగము రఘునిచేవయు/హిమవంతము చేవ, రఘువు, నెఱిగిరి వరుసన్. 81

అమిత+ఉపాయనముల=ఎక్కువైన+కానుకలు, గణ+వితానములు=ఉత్సవ సంకేతగణ+సమూహము, ఒసగన్=ఇవ్వగా, చేవ=బలము, ఎరిగిరి=తెలిసిరి, (హిమవంతుని బలము రఘువుకు, రఘువు బలము హిమవంతునికి తెలిసెను.)

తే. ఎదురులేని యశోరాశి నిట్టు లచట/నెలకొలిపి డిగ్గి చనియెను బలియు డతడు,
తొలుత పౌలస్త్యతులనము వలని చిన్న/చూపునన్ బలె, అటుతొంగి చూడ డతడు. 82

నెలకొలిపి=ఉంచి, పౌలస్య+తులనము+వలని=రావణునిచే+ఎత్తబడుటఅనే+కారణముచే, అటు=హిమ వంతము వైపు(రావణునుచే ఎత్తబడుటచే హిమాలయమును చిన్నచూపుతో చూసెను. అంతే కాదు తన తెల్లనైన కీర్తిని హిమాలయముపై విడచి, హిమాలయములవైపుచూడక మరుతిరిగెను.
ముందు 73 వ పద్యములో తన గుఱ్ఱపు గెట్టల ధూళితో హిమాలయపు ఎత్తుపెంచెను. ఇప్పుడు తన కీర్తిరాశి నెలకొలిపెను. అనగా హిమాలయముకన్న రఘువు ఉన్నతుడు)

తే. అవల నటసాగి రుద్ధార్కమై అవృష్టి/దుర్దినీభూతమై, రథోద్ధూతధూళి,
పగఱ నెల్ల దలంకింప బ్రహ్మపుత్ర/దాటి, ప్రాగ్జ్యోతిషమునకు దారితీయ. 83

అవల=పిమ్మట, రుద్ధ+అర్కమై=అడ్డగింపబడిన+సూర్య కిరణములు కలదై, అవృష్టి=వర్షము లేక, దుర్దినీభూతమై=(సూర్యుడు కనపడనిదినము దుర్దినము)దుర్దినములు కలదై, రథ+ఉద్ధూత+ధూళి= రథముచే+ఎగురకొట్టబడిన+దుమ్ముచే, తలంకింప=చలింపజేయ,

క, ఆలోనవ్విధమంతయు/నాలించినకామరూపు డదసీయగజేం
ద్రాలానత్వము నందిన/కాలాగురుతరుల గలసి గడగడ వడకెన్. 84

అ లోన=అంతలో, ఆలించిన=రఘుప్రతాపము విన్న, అదసీయ+గజేంద్ర+ఆలానత్వమును+అందిన+కాలాగురు+తరుల=అదిరిన+ఏనుగుల+కట్టికట్టుకంబము+పొందిన+నల్లఅగురు+చెట్లతో,

క. దండిపగఱ మున్నితరుల/దండింపగ దోడుపడిన దానస్రుతిపే
దండముల రఘున కత్యా/ఖండల విక్రమున కొసగి, ఘటితాంజలియై, 85

దండిపగఱ=బలమైన శత్రువుల, దానస్రుతి+పేదండముల=మదముకారు+ఏనుగుల, అతి+ఆఖండల+విక్రమున+కొసగి+ఘటిత+అంజలియై=గొప్ప+ఇంద్రునివంటి+పరాక్రమముకలరఘునకు+ఇచ్చి+చేతులు మోడ్చి,

తే. అర్చెన యొనర్చె కామరూపాధినేత/హైమపీఠాధిదేవతయైన రఘుని,
అడుగుదమ్ముల కాంతి కత్యాదరమున/రత్నపుష్పోపహార విశ్రాణనమున. 86

అర్చెన+ఒనరించె=పూజ+చేసె, హైమ+పీఠ+అధిదేవత=బంగారు+సింహాసనమున+అధిష్ఠాన దేవతగా ఉన్న (కూర్చోపెట్టి), అడుగు+తమ్ముల+కాంతికి+అతి+ఆదరమున=పాద+పద్మముల+ప్రకాశమునకు+ అపార+మన్ననతో, రత్న +పుష్ప+ఉపహార+విశ్రాణనమున=రత్నాలు+పువ్వులు+సమర్పించి+కప్పముగా,

శా. కేళీవిక్రమశాలి, ఇట్లఖిలదిగ్దేశంబులన్ గెల్చి, ని
ర్వేలస్నిగ్ధయశంబు నించి, రఘుధాత్రీజాని శశ్వజ్జయ
శ్రీ లుబ్ధంబు రథోత్తమంబు మరలించెన్, చత్రశూన్యద్విష
న్మౌళిస్థానములం దుదుత్థితరజోమాలిన్యమున్ నిల్పుచున్ 87

కేళీవిక్రమశాలి=పరాక్రమప్రదర్శన ఆటమాత్రముఅయినవాడు, అఖిల+దిక్+దేశముల=అన్ని+దిక్కులందలి+రాజ్యములను, నిర్వేల+స్నిగ్ధ+యశంబు+నించి=తనహద్దులేని+స్వచ్ఛమైన+కీర్తి+నిండించి, రఘు+ధాత్రీ+జాని=రఘు+భూమి+ఈశుడు-రఘుమహారాజు, శశ్వత్+జయ+శ్రీ+లుబ్ధంబు=శాశ్వతమైన+జయ+లక్ష్మియందు+ఆసక్తి కలదైన, రథ+ఉత్తమంబు=ఉత్తమైన+తేరును, మరలించెన్=వెనుకకుత్రిప్పెను, చత్ర+శూన్య+ద్విషన్+మౌళి స్థానములందు=ఓడిపోవుటచే శ్వేతచ్ఛత్రములు+లేని+శత్రువుల+ముడిచిన సిగలందు, ఉద్+ఉత్థిత+రజో=తనరథముచేపైకి+ఎగరగొట్టబడిన+దుమ్ముచే, మాలిన్యమున్+నిల్పుచున్=మాపుదల+నిలుచుచుండగా,

ఉ. దానకలాపనిత్యపరతంత్రమనస్కుడు, చేసె, అమ్మహో
ర్వీనుడు విశ్వజిత్తనగ విశ్రుతమౌ సకలస్వదక్షిణం
బైన మహాధ్వరంబు, అనయంబు ప్రదానఫలంబుగాదె! ఆ

దానము, ప్రావృషేణ్యజలదంబులకున్ బలె దొడ్డవారికిన్. 88

దాన+కలాప+నిత్య+పరతంత్ర+మనస్కుడు=దాన+నైపుణ్యమున+ఎల్లప్పుడు+పరవశమవు+బుద్ధి కలవాడు, అ+మహా+ఉర్వి+ఇనుడు=ఆ+గొప్ప+భూమికి+పతి, విశ్వజిత్తు+అనగ+విశ్రుతమౌ=(విశ్వమును జయించిన వాడు)విశ్వజిత్తు+అని+ప్రసిద్ధిచెందిన, సకల+స్వ+దక్షిణంబైన+మహా+అధ్వరంబు=సర్వశ్వము+తాను+దానమీయవలసిన+గొప్ప+యాగము, అనయంబు+ప్రదానఫలంబుగాదె=ఎల్లప్పుడు+ముఖ్య ప్రయోజనము కదా!, ప్రావృషేణ్య+జలదంబులకున్ బలె=వర్షాకాలపు+మేఘములకువలె,

చ. అలఘుపురస్క్రియాప్రశమితాహవరంగపరాజయవ్యళీ
కులకు, నశేషభూపతులకున్, చిరకాలవియోగవేదనా
కులిత నిజావరోధులకు, కోసలభర్త అనుజ్ఞ యిచ్చి వీ
డ్కొలిపె తదీయ రాష్ట్రములకుం గ్రతుపూర్తి అనంతరంబునన్ 89

అలఘు+పురస్క్రియా+ప్రశమిత=ఎక్కువ+బహుమానములచే+శాంతించిన, ఆహవ+రంగ+పరాజయ + వ్యళీకులకు=యుద్ధ+రంగమందు+ఓటమిచే+బాధపడు, అశేష+భూపతులకు=అందరు+రాజులకు, కులిత =దుఃఖించు, నిజ+అవరోధులకు=తమతమ+బార్యలు కలవారికి,

చ. కులిశచ్ఛత్రహలధ్వజాది శుభరేఖోద్భాషితంబైన ఆ
బలభిత్తుల్యు ప్రసాదలబ్యచరణద్వంద్వంబు నాపీడని
ర్గళితామందమరందరేణుపటలీగౌరంబు గావించి, రం
జలి పూర్వంబుగ మండలేశ్వరులు, ప్రస్థానప్రణామంబులన్. 90

కులిశ+చ్ఛత్ర+హల+ధ్వజ+ఆది+శుభ+రేఖ+ఉద్భాషితంబైన=వజ్రాయుధము+గొడుగు+నాగలి+జండా+మొదలగు+మంగళకరమైన+హస్తరేఖలతో+పుట్టిన, బలభిత్తుల్యు=ఇంద్రునితోసమానుని, ప్రసాద+లభ్య+చరణద్వంద్వంబును=అనుగ్రముచే+లభించిన+రెండు పాదములను, ఆపీడ+నిర్గళిత+అమంద+మరంద+రేణు+పటలీ+గౌరంబున్+కావించిరి= సిగజుట్టినపూలదండలనుండి+వెలికిజారిన+శ్రేష్ట+మధుకరపు+పుప్పొడి+దుమ్ము+సముదాయపు+ఎఱుపు/పసుపు దనము+కలదానిగాచేసిరి, ప్రస్థాన+ప్రణామంబులన్=సెలవు తీసుకొని వెళ్ళునప్పటి+నమస్కారములతో,

# పంచమ సర్గము   కనక వర్షము

తే. విశ్వజిద్యాగమున పృథివీవిభుండు, సర్వకోశము నర్థిసాత్ సల్పి నంత,
చేరె కౌత్సుడు, వరతంతుశిష్యవరుడు, ప్రాప్తవిద్యుడు, గురుదక్షిణార్థి యగుచు. 1

విశ్వజిత్+యాగమున=విశ్వజిత్తు అను పేరుగల+యజ్ఞమున, సర్వకోశము=ధనాగారము అంతయు, అర్థిసాత్+సల్పినంత=యాచకులకు దానము+చేయగా, వరతంతు+శిష్య+వరుడు=వరవంతు డను గురువు నకు+శిష్యులలో+శ్రేష్ఠుడు, ప్రాప్త విద్యుడు=విద్య నేర్పబడిన వాడు, గురు+దక్షిణ+అర్థి=గురువుకు+ ఇవ్వదలచిన దక్షిణను+కోరువాడై,

ఆ. కనకమయము నిండుకొనుట మృణ్మయమైన/పాత్ర నర్ఘ్యమునిచి, పార్థివేంద్రు
డెదురువోయి అతిథి కెఱగి, తోడ్కొని వచ్చె/శ్రుతవిభాసి నురుయశోవిభాసి. 2

కనకమయము+నిండుకొనుట=బంగారుపాత్రలు అన్ని+అయిపోగా, మృణ్మయము=మట్టితోచేసిన, అర్ఘ్యము +ఉనిచి=పూజాద్రవ్యములను+ఉంచుకొని, ఎఱగి=నమస్కరించి, శ్రుత+విభాసి=శాస్త్రజ్ఞానముచే+ప్రాకాశించు వాని, ఉరు+యశో+విభాసి=ఎక్కువైన+కీర్తితో+ప్రకాశించు- రఘువు

క. యమి శిష్యవటువు నుచిత/క్రమమున బూజించి, రఘువు రచితాంజలియై,
సుముఖోల్లాసంబున, ద/త్సముఖంబున నుండి, అడిగె, సవినయ ఫణితిన్. 3

యమి+శిష్య+వటువును=ముని+శిష్యుడైన+బ్రహ్మచారిని, ఉచిత క్రమమున=యథా విధిగా, రచిత అంజలియై =చేతులు జోడించి, సు+ముఖ+ఉల్లాసంబున=ప్రసన్న+వదనపు+వికాశమున, తత్+ సముఖంబున=వాని +ఎదురుగా, ఫణితి=విధముగా,

శా. "ప్రాతస్సంస్మరణీయు డైన ఘనమంత్రద్రష్ట, నానాగమా
ధ్యేతృశ్లాఘ్యకుశాగ్రబుద్ధి, కుశలంబే? మీగురుబ్రహ్మకున్
జ్ఞాతవ్యంబగు విద్య మీ కత డశేషంబున్ ప్రసాదించెనే
చైతన్యంబు సమస్త జీవులకు నుష్ణజ్యోతి చందంబునన్. 4

ప్రాతస్+సంస్మరణీయుడు=దినమున ముందుగా+ధ్యానింప తగ్గవాడు, ఘన+మంత్ర+ద్రష్ట=విశిష్టమైన +మంత్రములను+మనసుననేదర్శించగలవాడు, నానా+ఆగమ+అధ్యేతృ+శ్లాఘ్య+కుశాగ్ర+బుద్ధి=సమస్త+

వేదశాస్త్ర+పఠనముచే+కీర్తింపదగ్గ+సూక్ష్మ+బుద్ధికలవాడు, జ్ఞాతవ్యంబు+అగు=తెలుసుకో+దగ్గ, అశేషంబున్ +ప్రసాదించెనే=వెలితిలేకుండా+అనుగ్రహించెనే, చైతన్యము=ప్రాణము, ఉష్ణజ్యోతి+చందంబునన్=సూర్యుని+ వలె,

సీ. వికసించునే చిత్తవిక్షేపపశ్యతో/హరములు మీ తాపసాశ్రమములు?
కొనలుసాగునె సదా కులిశాయుధుని మనో/ధృతికి వీడ్కోలు మీ త్రివిధ తపము?
చేపట్టునే ప్రదక్షిణసమ్యగర్చియై/మీ హవీరాశి శామిత్రవహ్ని?
పాఱునే స్నానతర్పణయోగ్యజలములై/ఝురు లుంఛషష్ఠాంకసైకతములు?
గాలికిని, ఎరగలికిని, కాక మిగిలి/దొరకునే ఎల్లప్రొద్దు ప్రొద్దెఱిగి వచ్చు
అతిథులను దన్ప, మీ దేహయాత్ర సాగ/పూరిపంటలు మీకు అవ్వారి గాగ? 5

వికసించునే=విరియునే, చిత్త+విక్షేప+పశ్యతోహరములు=మనసును+కదలించి+దోచుకొను, కొనలుసాగునె =వర్ధిల్లుకదా, సదా=ఎల్లప్పుడు, కులిశాయుధుని=ఇంద్రుని, మనో+ధృతికి+వీడ్కోలు=మనస్సు+స్థైర్యము నకు+పోయిరమ్మనిసెలవుచెప్పు, త్రివిధ తపము=మనసా వాచా కర్మణా చేయుతపస్సు విశేషములు, మీ+ హవీ+రాశి=మీరు సమర్పించిన+హవిస్సు+మొత్తమును, ప్రదక్షిణ+సమ్యక్+అర్చియై=చక్కగాదక్షిణ పుర్వకముగా+తిరుగు జ్వాలలతో+వెలుగువాడై, శామిత్ర+వహ్ని=యజ్ఞపు+హోమము, చేపట్టునే=గ్రహించు నే, తర్పణ+యోగ్య=ప్రార్ధనతోనీరువదులుటకు+తగిన, ఝురులు=నదులు, ఉంఛ=పొలములందురాలిపడగా ఏఱుకొనితెచ్చిన ధాన్యముయొక్క, షష్ఠ+అంక+సైకతములు=రాజుకు చెల్లించవలసిన ఆఱవభాగము+పంపు నట్టిబండ్లగుర్తులు కల +ఇసుకదిబ్బలుకలిగి, ఎరగలి=కార్చిచ్చు, కాక=పోవగా, ఎల్లప్రొద్దు=ఎల్లప్పుడు, ప్రొద్దు+ఎఱిగి=సుర్యుడు+దిగుతుండగా-సమయముమించి, తన్ప=తృప్తిచేయ, పూరిపంటలు=గడ్డి ధాన్యము (వరి మొదలగునవి), అవ్వారి=బహుళము,

మ. మునిపుత్రీసుతనిర్విశేషములు తన్ముగ్ధస్వహస్తంబుసే
చన శశ్వత్పరివర్ధితంబులు పటుచ్ఛాయా ప్రపాభూతముల్,
అనవద్యంబగు ఆర్షసంస్కృతికి నిత్యద్వారముల్ మీ తపో
వనవృక్షంబుల కావటిల్లవు కదా, వాతాదివిక్షోభముల్. 6

ముని+పుత్రీసుత+నిర్విశేషములు=మునుల+పిల్లలతో+బేధములేనివి, తన్+ముగ్ధ+స్వ+హస్తంబు+సేచన =వారి+తరుణమైన+స్వంత+చేతులతో+తడుపుటచే, శశ్వత్+పరి+వర్ధితంబులు=ఎల్లప్పుడు+బాగుగా+ పెంచబడు, పటు+చ్ఛాయా+ప్రపా+భూతముల్=దట్టమైన+నీడ+చలిపందిరి+వంటిదికలిగి, అనవద్యము=

దోషములేని, ఆర్ష+సంస్కృతికి=ఋషి+సాంప్రదాయమునకు, నిత్య+ద్వారముల్=ఎల్లప్పుడు+ప్రవేశములు, ఆవటిల్లవు=కలుగవు, వాత+ఆది=సుడిగాలి+దావాగ్ని మొదలైన, విక్షోభముల్=బాధలు,

చ. వెఱవక వచ్చి మేయు దొరబిడ్డల కైవడి, కర్మకాండకున్
కొఱయగు దర్భలున్, మునులు కూరిమితో తరితీపు సేయుటన్,
తరళవిలోచనద్యుతివితాననముల్, సుఖమున్న వొక్కొ? మీ
హరిణకిశోరముల్, మునిజనాంకపరిచ్యుతనాభినాళముల్. 7

వెఱవక=భయములేక, కైవడి=వలె, కొఱయగు=ఉపయోగపడు, తరి+తీపు+సేయుటన్=అధిక+ప్రీతి+చేయగా, తరళ+విలోచన+ద్యుతి+వితాననముల్=చలించు+చూపుల+కాంతి+సమూహములుకల, ముని జన+అంక=ప్రసవమైన తరువాత లేడిపిల్లలని కౄరమృగభయమువలన మునులు తమ+ఒడియందే ఉంచుకొనగా, పరిచ్యుత+నాభినాళము=వారిఒడిఅందేఊడిపడిన+పురిటిబొడ్డుకల, హరిణ+కిశోరముల్=లేడి+పిల్లలు,

చ. అనఘుడు సుప్రసన్నమతి ఆత్మవికాసముతోడి విద్య రా
జొనిపి, అధీతివిస్తరవిశోభితు, మిమ్మొక, ఇంటివాని గ
మ్మనియెనె? అమ్మహర్షి, తఱి అయ్యె గదా సకలోపకారసా
ధనము బరిగ్రహింప గృహిధర్మము దేవరకున్, తపోధనా! 8

అనఘుడు=న+అఘుడు=దోషరహితుడు, సు+ప్రసన్న+మతి=మంచి+దయా+చిత్తుడు, ఆత్మ+వికాసము తోడి=వ్యక్తిత్వ+వికసనముతోపాటుగా, విద్య+రాజొనిపి=విద్య+వచ్చునట్లునేర్పి, అధీతి+విస్తర+విశోభితు=అధ్యయనము+సమగ్రముగా చేసి+విశిష్టఅలంకృతులైన, తఱి=తరుణము, సకల+ఉపచార+సాధనము =అన్ని+ ఆశ్రయములవారికిఉపకారము+చేయవీలగు, గృహి+ధర్మము=గృహస్థుని+విధులు, దేవరకు=తమకు,

మ. తనివింబొందదు తావకాగమనమాత్రన్ నామనం, బిప్డు మీ
వినియోగం బొనరింప గల్గుటకు ఉవ్విళ్ళూరు నెంతేనియున్,
ఘను, డధ్యాపకు డంపవచ్చితిరొ, తత్కార్యార్థులై, కాక మీ
పనివెంటం బఱతెంచినారొ? నను సంభావింప మౌంజీధరా!" 9

తనివి = తృప్తి. తావక + ఆగమనమాత్రన్ = మీ + వచ్చుట + మాత్రముచే, వినియోగంబు = ఉపయోగము, అంప = పంపగా, తత్ + కార్యార్థులై = గురువుగారి + పనిపై, మీ + పనివెంట = మీ + పనికోసమై, పఱతెంచినారొ = వచ్చినారో, సంభావింప = గౌరవింప, మౌంజీ + వరా = మౌంజినిధరించినముని + శ్రేష్టా!

క. ఆరాజు వినయగరిమకు/గారవమున కెలమి బొందె కౌత్సుండు; మదిన్

నైరాశ్య మొందె, మొదటనె/ఆరాధనపాత్ర జూచి, అభిమతసిద్ధిన్. 10

గరిమ = గొప్పదనము, ఎలమి = సంతోషము, నైరాశ్యము + ఒందె = నిరాశ + పొందె, అభిమత + సిద్ధిన్ = కోరిక + నెఱవేరుటయందు,

వ. అయ్యపేక్షితప్రయోజనానుకూల్య వైకల్యమునకు నిజాంతర్గతమున పొడమిన విషాదచ్ఛాయ వదనగోచరము గానీక అడచి, పురస్క్రియావికసితవదనోల్లాసియై, వైఖానసాంతేవాసి, వైవస్వతాన్వయవిభాసి, నుపలక్షించి. 11

ఆ + అపేక్షిత + ప్రయోజన + అనుకూల్య + వైకల్యమునకు = అటువంటి + కోరిక + లభించు + అవకాశము + లేకపోవుటకు, నిజ + అంతర్గతమున = తన + మనసులో, పొడమిన = పుట్టిన, విషాద + చ్ఛాయ = విచారపు + లక్షణములు, గోచరము కానీక = కనబడనీకుండా, అడచి = కప్పిపెట్టి, పురస్క్రియా + వికసిత + వదన + ఉల్లాసియై = సన్మానము చేత + ప్రకాశించు + మొహమున + సంతోషముతో, వైఖానస + అంతేవాసి = వైష్ణవార్చన చేయుగురువుయొక్క + శిష్యుడు. వైవస్వత + అన్వయ + విభాసి = సూర్య + వంశములో + ప్రకాశించు-రఘువు, ఉపలక్షించి = చూచి,

శా. "క్ష్మానాథోత్తమ! మాకు భద్ర మమరున్ సర్వత్ర సాకల్యమై,

ఏనాడేన్ వినియుంటిమే ఎవరికే ఇక్కట్టు నీ ఏల్బడిన్?

భానుం డుజ్జ్వలుడై వెలుంగ, పొడసూపం జాలునే చీకటుల్?

నా నోటన్ పలికించి, ఇట్లు వినుపేడ్కన్ వేసితీ ప్రశ్నమున్. 12

భద్రము + అమరున్ = క్షేమము + కుదురును, సర్వత్ర + సాకల్యమై = అంతట + సంపూర్ణమై, ఇక్కట్లు = బాధలు, ఏల్బడిన్ = పాలనలో, భానుండు + ఉజ్జ్వలుడై = సూర్యుడు + ప్రకాశమానుడై, పొడచూపన్ + చాలునే = కనబడ + కలవా,

శా. వీరాగ్రేసరు లంబురాశిరశనావిశ్వక్షమామండలీ

ధౌరంధర్యకళాప్రపూర్ణులు త్రయీధర్మావనైకాశయుల్,

పారంపర్యవదాన్యతారసికు లైక్ష్వాకుల్, మహాభాగ! త

చ్చారిత్రంబును దిద్దితీర్చినవి నీ శౌర్యప్రభావోన్నతుల్. 13

అంబురాశి+రశనా+విశ్వ+క్షమా+మండలీ=సముద్రము+ఒడ్డాణముగా కల+విశ్వమందలి+భూసమదాయముయొక్క, ధౌరంధర్య+కళా+ప్రపూర్ణులు=భారమువహించు+అంశమున+పరిపూర్ణులు, త్రయీధర్మా+అవనైక+ఆశయుల్=మూడు వేదములువిధించిన ధర్మము+కాపాడే+ఆశయముకలవారు, పారంపర్య+వదాన్యతా+రసికుల్=వంశానుగతముగా+దానముచేయు+కోరికకలవారు, మహాభాగ!=నిర్మల మనస్కుడా!, తత్+చారిత్రంబులు+తీర్చి+దిద్దినవి=వారి+నడతలు+ఒప్పుగా+నిన్నుచక్కపఱచితీర్చినవి, శౌర్య+ప్రభావ+ఉన్నతుల్=విక్రమము+సామర్ధ్యముల+ఉచ్ఛస్థితిని,

శా. సజ్యస్ఫారధనుస్సహాయత ధరాచక్రంబు నిర్జించి సా
మ్రాజ్యవ్యాయతితో అకుప్యవసుసంభారంబు నార్జించి సం
పూజ్యం బైన సుతీర్థదానకలనాభోగంబుతో విశ్వజి
ద్యాజ్యం డైతివి, రాజశేఖరమణీ! అర్కాన్వయగ్రామణీ! 14

సజ్య+స్ఫార+ధనుస్+సహాయత=ఎక్కుపెట్టిన+నారిటంకారముగల+విల్లు+తోడుగా, ధరా+చక్రంబు+నిర్జించి=భూ+వలయము+జయించి, సామ్రాజ్య+వ్యాయతితో=రాజ్యపు+పనితో, అకుప్య+వసు+సంభారంబును+ఆర్జించి=బంగారము వెండి+భూమి+సమృద్ధిగా+సంపాదించి, సు+తీర్థ=మంచి+పాత్రతకల వారికిచ్చు, దాన+కలనా+భోగంబుతో=దానముచేయు+జ్ఞాన+అనుభవముతో, విశ్వజిత్+యాజ్యుండు=విశ్వజిత్+యాగము చేసినవాడు, అర్క+అన్వయ+గ్రామణీ!=సూర్య+వంశ+ముఖ్యుడా!

ఉ. శీలము, సాధుపండితనిషేవణమున్, కులవిద్య మీకు త
త్పాలనమందు వాసి కనుపట్టెను పూర్వులకంటె నీ యెడన్,
పేళ అతిక్రమించి బహువిశ్రుతదానకళాధురీణ! నీ
పాలికి అర్థిభావమున వచ్చితి నంచు విచారమయ్యెడిన్ 15

నిషేవణము=చక్కగా సేవించుట, తత్+పాలనమందు=వాటిని+పాటించుటలో, వాసి=ఆధిక్యము, ఎడన్=వద్ద, అతిక్రమించి=దాటి, బహు+విశ్రుత+దానకళా+ధురీణ=బాగా+ప్రసిద్ధిచెందునట్లు+దానమిచ్చుటలో+నేర్పరివి, పాలికి=సన్నిధికి, అర్థి+భావమున=కోరు+మనసుతో,

సీ. ఎల్లసొమ్ములు చేతి కెముకలేనటు లిచ్చి/మిగిలియుంటి విపుడు మేనితోడ,
ఫలరాశి నారణ్యకుల పరం బొనరించి/నిలువున మ్రోడైన నివరి మాడ్కి,
వన్నె దెచ్చెను నీకు వసుధైకసేతకు/పేరీగి ఫలమైన పేదటికము,
దివిజకోటి బుభుక్ష దీర్చు జాబిల్లికి/క్షయమె లెస్స, కళోపచయముకంటె,

కాన గురుదక్షిణార్థము కానబోదు/అన్యుని, అనన్యకార్యుడ నైన ఏను,

గళితజలగర్భుడగు శరద్ఘనుని జూచి/చాతకము సైత మడుగదు, జనవరేణ్య! 16

మేను=శరీరము, ఆరణ్యకులు=అరణ్యములోనుండుమునులుమున్నగువారు, నివరి+మాడ్కి=తనంతనే పండెడి వరిమొక్క+వలె, వన్నె+తెచ్చెను=ప్రఖ్యాతి+కలిగించెను, పేరు+ఈగి=పెద్ద+దానము, దివిజ+కోటి=దేవతలు+అందరికి, బుభుక్ష=ఆకలి, క్షయమె+లెస్స=అమృతమయుడైన చంద్రుని కళలను దేవతలు పానముచేయుదురుఅందుచేతగ్గుట+మంచిదే, కళ+ఉపచయము+కంటె=వెన్నెల+వృద్ధి+కన్న (చంద్రుని క్షయము వృద్ధికంటె మేలు), న+అన్య+కార్యుడ=మఱియొకపనిలేనివాడనైన, గళిత+జల+గర్భుడగు=తరిగిన+నీరు+కలవాడైన, శరద్ఘనుని=శరత్కాల మేఘమును,

చ. అనుపుము పోయివత్తు భువనైకధురంధర! భద్రమస్తు, నీ"

కనుడు దిలీపసూతి "విబుధాగ్రణి! అర్థులు రిక్తహస్తు లై

చను టొకనాడు లేదు మనుసంతతిదీర్ఘచరిత్రలోన ఏ

అనువున నైన తావకమనోఽభిమతంబొడగూర్చి పంపుదున్ 17

అనుపుము=సెలవివ్వు, భువన+ఏక+ధురంధర=భూమినంతయు+ఒక్కడవే+భరించగల వాడా, భద్రము+అస్తు=శుభము+కలుగుగాక, విబుద+అగ్రణి=పండిత+శ్రేష్ఠ, రిక్తహస్తులు=కాళీచేతులతో, అనువున=ఉపాయమునైన, తావక+మనః+అభిమతంబు+ఒడగూర్చి=మీ+మనస్సులోని+కోర్కి+తీర్చి,

తే. కావున గురుప్రదేయ రిక్థంబు మేర/ఆనతిం" డన్న, సకల ప్రజానియంత,

అతని మాటకు దా నడ్డమాడ వెఱచి/తనయుదంతము నిటు లెత్తికొనియె వర్ణి. 18

ప్రదేయ+రిక్థంబు+మేర=గురుదక్షిణకానుక+ధనపు+పరిమితి, ఆనతిండు+అన్న=వినిపించుడు+అనగా, తాన్+అడ్డము+ఆడ+వెఱచి=తను+అడ్డు+చెప్ప+భయపడి, ఉదంతము=వృత్తాంతము, ఎత్తికొనియె=ఆరంభించె, వర్ణి=బ్రహ్మచారి,

శా. "చేపట్టెన్ నను శిష్యుగా కులపతిశ్రేష్ఠుండు, నా చేయు లే

శోపాస్తిన్ గడు బెద్దగా దలచె, అత్యుత్సాహియై నాకు సాం

గోపాంగంబుగ విద్యలన్ గఱపె, రమ్యోదాత్తమై మాదు శై

ష్యోపాధ్యాయిక మార్గదర్శకమునై యొప్పారె, రాజోత్తమా! 19

చేపట్టెన్=అనుగ్రహించెను, లేశ+ఉపాస్తి=కొంచపు+సేవ, కడున్+పెద్దగా+తలచె=ఎక్కువ+పెద్దదిగా+అనుకొని స్వీకరించి, సాంగ+ఉపాంగంబుగ=అంగములు ఉపాంగముల తోడకూడిన, విద్యలు=చతుర్దశ విద్యలు, కరపె

=బోధించె, రమ్య+ఉదాత్తమై=ఒప్పిదముగా+ప్రియమైనదై, మాదు+శైష్య+ఉపాధ్యాయిక=మా+శిష్య+ గురువుల విధము, మార్గ+దర్శకమునై=మంచివిధానమును+చూపించునదై, ఒప్పారె= యుక్తమయె,

చ. చదువు ముగించి ఏను మునిసత్తము దీవన పొంది నెమ్మి ద
త్పదముల నంటి దేవ! గురుదక్షిణ పేర్కొను డన్న వత్స! నీ
చెదరని భక్తితోడి చిరసేవకు మించిన కట్నమున్న దే?
అదె, పదివేలు మా కనుచు అగ్గురుపాదుల నుగ్రహించినన్ 20

నెమ్మిన్=గౌరవముతో, పేర్కొనుడు=చెప్పుడు, చెదరని=పట్టువిడని, చిర+సేవ=బహుకాలపు+సేవ, అనుగ్రహించినన్= కనికరించిన,

సీ. వినక వేళాగుణంబున నేమొ ఆచార్య/లపు డెన్ని చెప్పిన నన్ని చెప్పి,
తలతిక్కయెత్తి నే బలవంతపెట్టిన/కలుషించి కులపతి కటము లదర,
నన్ను చేబోడిగా నెన్నియు చూతము/గాక! నీదు ప్రయోజకత్వమేమొ,
ఈరేడు కోట్లు దీనారటంకములు తె/మ్మనియె విద్యాసంఖ్య కనుగలముగ,
గోచికట్టున కెట్లబ్బు కోట్లుకోట్లు?/కుడిచి కూర్చుండి కొనితెచ్చుకొంటి బెడద,
పుట్టకుండునె బెడదలు బుద్ధిజాడ్య/సంచితోన్మాదవశులైన ఛాందసులకు. 21

వేళాగుణమున=చెడుకాలమహిమచే, ఎన్ని+చెప్పిన=ఎన్నివిధాలుగా+బోధపరచిన, అన్ని+చెప్పి=అన్ని విధాలుగా+అడ్డుమాటలుచెప్పి, కలుషించి=కోపించి, కులపతి=పదివేల శిష్యులకుఅన్నదానాదుల పోషించి అధ్యయనము చేయించు బ్రహ్మర్షి, కటములు+అదర=కణతలు+ఎగుర, చేబోడిగా+ఎన్నియు=నిర్ధనునిగా+ లెక్కపెట్టియు, ఈరేడు=ఈరుxఏడు=పదునాలుగు, విద్యాసంఖ్య=చతుర్దశవిద్యలలెక్కకు(ఋక్, యజుర్ సామ అధర్వణ అను 4 వేదములు, శిక్షా వ్యాకరణము చందస్సు నిరుక్తము జ్యోతిషము కల్పము అను 6 వేదాంగములు, మీమాంస, న్యాయము, పురాణము, ధర్మశాస్త్రము), అనుగలముగ=సమానముగ, కుడిచి =తిని, బెడద=ఆపద, బుద్ధి+జాడ్య+సంచిత+ఉన్మాద+వశులైన=వివేకము+మందగించగా+కలుగు+వెఱ్ఱికి+ లోబడిన, ఛాందసులకు=చదువుకున్నమూర్ఖులకు,

వ. అదృశ్యసాదృశ్య మైన నీ వదాన్యమును పురస్కరించుకొని నీ సకాశమునకు వచ్చితి. వచ్చి
సపర్యావిధిభాజనము గని నీవిపుడు ప్రభుశబ్దశేషుడ వగుట ఎఱిగితి. ఎఱిగి శ్రుతనిష్క్రయము
నిన్నడగ నాకు నోరాడదు. ఏలన 22

అదృశ్య+సాదృశ్యము+ఐన=చూడకపోయినా+వినగాతెలిసినది+ఐన, వదాన్యము=దాతృత్వము, పురస్క

రించుకొని=ప్రాముఖ్యతనిచ్చి, సకాసము=ఎదుటకు, సపర్యా+విధి+భాజనము=పూజా+కర్మపు+పాత్రను, ప్రభుశబ్దశేషుడు=ఐశ్వర్యములేని నామమాత్రపురాజు, శ్రుత+నిష్క్రయము=విద్యా+మూల్యము,

మ. అరవాయించుక లేక నిన్నడుగగా, ఆవిత్త మింతింతయే,
విరసత్వంబున వేడి, నిన్నిఱుకునం బెట్టంగ నా కర్హమే?
అరయన్ రెండవ తప్పుగాదె యది? కార్యావాప్తి అట్లుండనీ,
పరమోదారుని గంటి నిన్నదియె సాఫల్యంబు నా రాకకున్." 23

అరవాయి+ఇంచుక=సంకోచము+కొంచముకూడ, ఇంత+ఇంతయే=తక్కువదా, విరసత్వంబు=తొందరపాటు, ఇఱుకున=సంకట, అరయన్=విచారించగా, కార్య+అ వాప్తి=పని+పొందకపోవుట,

క. అని తనకథ వినిపించిన/విని, ద్విజునకు ద్విజపరివృఢవిశదద్యుతి ఆ
పనిత ప్రభావు డేనో/వినివృత్తనిజేంద్రియుండు వెండియు బలికెన్. 24

ద్విజునకు=బ్రాహ్మణునకు, ద్విజ+పరివృఢ=ద్విజులకు+రాజు-చంద్రుని(చంద్రుడుద్విజులకురాజై నట్లు శ్రుతి వాక్యము), విశదద్యుతి=తెల్లని కాంతి, ఆ+పనిత=మిక్కిలి+పొగడదగ్గ, ప్రభావుడు=తేజస్సుకలవాడు, ఏనః+వినివృత్త+నిజ+ఇంద్రియుండు=పాపము నుండి+నిగ్రహించిన+తన+ఇంద్రియములు కలవాడు, వెండియు=మరల

ఉ. "ఎక్కడలేరు? విశ్రుతమహీతలనేతలు, భూసురేంద్ర మీ
అక్కఱ దీర్పజాలిన సమంచితదాతలు మీరునన్నె ఈ
రొక్కము వేడవచ్చుట, నిరూఢకృపన్ నను సాటివారిలో
ఎక్కువవాని జేయ మది సెంచియ కావలయున్, నిజంబుగన్. 25

విశ్రుత+మహీతలనేతలు=ప్రసిద్ధిచెందిన+రాజులు, అక్కఱ=అవసరము, సమ+అంచిత=బాగుగా+పూజించ దగ్గ, రొక్కము=ధనము, నిరూఢ=మిక్కిలినిశ్చయపు, ఎంచియ=ఎంచియే=తలంచియే,

సీ. గుర్వర్థ మర్థియై సర్వవిద్యాపార/దర్శి యొక్కండు సద్బ్రహ్మచారి
రఘుని సన్నిధి కేగి అఘటితకాముడై/దాత్రంతరమునకు తరలె ననుచు
అపవాదు జగతి నా కనుభవింపగరాదు/ప్రైవడ్డ బ్రతుకున పసిమి లేదు,
మడుగుబుట్టమువంటి మనుకులీనుల కోవ/కిట్టి మాయనిమచ్చ ఎట్టు కూర్తు?
కాన, వేడెద, నిర్విశంకముగ నాదు/వహ్నిగృహమున నాలవ వహ్ని వోలె
వేచియుండుడు, నేడెల్లి విభుధవర్య!/ఒడమి సమకూర్చి ఇత్తు, మీ అడుగులాన." 26

గుర్వర్థము=గురువుకొఅకై, సర్వ+విద్య+ఆపార+దర్శి=సమస్త+విద్యలు+అంతమువరకు+నేర్చినవాడు, సన్నిధికి+ఏగి=వద్దకు+వెళ్ళి, అఘటిత+కాముడై=తీర్పబడని+కోరికకలవాడై , దాతృ అంతరమునకు= వేరొక దాతవద్దకు, తరలెను=వెళ్ళెను, ప్రై+పడ్డ=నింద+పడిన, పసిమి=సారము, మడుగు+పుట్టము= పరిశుద్ధ+వస్త్రము, మను+కులీనుల+కోవకు=మనువువంటి+కులమున పుట్టిన+వంశ క్రమమునకు, నిర్విశంకముగ=సందేహములేక, నాలవ వహ్ని వోలె=నా ఆహవనీ దాక్షిణ గార్హపత్య అనుమూడుఅగ్నులతో సమానముగా నాల్గవ అగ్నివంటివాడవై, నేడు+ఎల్లి=నేడు+రేపు-బహుకొద్దిదినములు, ఒడమి=ధనము,

మ. అని బద్ధాంజలియై తదర్థఘటనావ్యగ్రాత్ముడై ఱేడు పే
డిన, విప్రుం డురరీకరించి అట నుండెన్ నిండు మోదంబుతో,
ఘను లైక్ష్వాకు లలౌకికోదయు, లలంకర్మీణు, లత్యర్థసా
ధనసంపన్నులు, తత్ప్రతిశ్రుతికి వైతథ్యంబు లేదన్ మతిన్. 27

తత్+అర్థ+ఘటనా+వ్యగ్ర+అత్ముడై=ఆ+ధనము+సంపాదించుటలో+మునిగిన+బుద్ధితో, ఉరరీకరించి= అంగీకరించి, అలౌకిక+ఉదయులు=కారణ+జన్ములు, అలంకర్మీణులు=పనియందు నేర్పరులు, అతి+అర్థ+ సాధన+సంపన్నులు=ఎక్కువ+సంపద+సాధించు విధములు+కలిగినవారు, తత్+ప్రతిశ్రుతికి=ఆ+ప్రతిజ్ఞకు, వైతథ్యము+లేదు+అన్+మతిన్=అసత్యము+కాదు+అను+బుద్ధితో,

ఉ. "పేలవమయ్యెటో! చెఱకుపిప్పివలెన్, వినిపీతసారమై
నేల, ధనార్థ మందు జననేల, కుబేరుని మందిరంబునన్
మూలుగుచున్న పెన్నిధులనుండి గ్రహించెద" నంచు నెంచె దో
శ్శాలిత జూపి ఱేడు వటుసంయమిదేయము స్వాపతేయమున్ 28

పేలవము+అయ్యె+టో=వెలితికలది+అయినది+కదా, వినిపీత+సారమై+నేల=బాగుగాతీయబడిన+జీవము కల+భూమి, పెను+నిధుల=పెద్ద(9 నిధులు ఉండు)+కోశాగారము, దోశ్శాలిత+చూపి=ప్రశస్తబాహువుల సమర్థత+ప్రదర్శించి, వటు+సంయమి+దేయము=బ్రహ్మచారి+మునికి+ఈయదగిన, స్వాపతేయము= ధనము,

తే. హేల నసివాఱుగా దన కేగ దగిన/పెను బయలుగా గణించె గౌబేరసీమ,
ఖరనిజాసికి అరిగాపుగా దలంచె/రాజరాజును సైత మా రాజరాజు 29

హేల=కేళిగా, అసివాఱుగా=విహారముగా, పెను+బయలుగా=పెద్ద+బహిఃప్రదేశముగా, గణించె+కౌబేర+సీమ=లెక్కచేసెను+కుబేరుని+రాజ్యము-కైలాసము, ఖర+నిజ+అసికి=వాడియైన+తన+కత్తికి, అరిగాపుగా=కప్పము చెల్లించు సామంతరాజుగా, రాజ రాజును+ సైతము=కుబేరుని+కూడా, ఆ+రాజరాజు=ఆ+చక్రవర్తి,

వ. ఇటుల, కృతనిశ్చయుడై క్రియాక్షిప్రుడై యాజగజెట్టి వశిష్ఠమంత్రోక్షణజప్రభావమున సాగరములనక, శైలములనక, చదలనక, సర్వత్ర సమాన సత్వరస్వైర సంచారసామర్థ్యమున సడిసన్న తన యుత్తమస్యందనమును కట్టాయితము కావించుకొని, నాటి రేయి శుచియై శయనించి, మరునాడుషస్సమయమున యోధవీరోచిత ప్రకారమున సింగారము సత్వరముగ చేసికొని, 30

కృత నిశ్చయుడై=నిశ్చయము చేసినవాడై, క్రియా+క్షిప్రుడై=కార్యమందు+శీఘ్రత కలవాడై, జగ+జెట్టి=జగములో+శ్రేష్ఠుడు, మంత్రోక్షణ+జ+ప్రభావమున=మంత్రోచ్చారణచే+కలిగిన+మహత్యమున, సాగరములు=సముద్రములు, శైలములు=కొండలు, చదలు=ఆకాశము, సర్వత్ర+సమాన+సత్వర+స్వైర+సంచార+సామర్థ్యమున=అన్ని ప్రదేశములందు+సమాన+వేగముతో+ఇచ్చాను సారముగా+వెళ్ళగల+సమర్థత కలుగుటచే, సడిసన్న=కీర్తికెక్కిన, స్యందనము=రథము, కట్టాయితము=సిద్ధము, ఉషస్సమయమున=తెల్లవారుతుండగా, యోధ=యుద్ధ,

తే. విక్రమమె ముంగలిగ దాడి పెడలుచుండ/విగ్రహస్వీకృతత్వరావిస్మయముల
గతి హుటాహుటి నొండొరు గడచి వచ్చి/హస్తములు మోడ్చి కోశగృహాధికృతులు. 31

ముంగలిగ=ముందునడచునదిగా, దాడి=యుద్ధముట్టడికి, విగ్రహ+స్వీకృత+త్వరా+విస్మయముల+గతి=రూపు+కట్టిన+తొందరపాటు+అద్భుతముల+వలె, హుటాహుటి=వేగముగ, ఒండొరు=ఒకరినొకరు, కడచి=మర్యాదనతిక్రమించి దాటి, కోశ+గృహ+అధికృతులు=ధన+ఆగారపు+అధికారులు,

తే. స్వప్నమో? మాయయో? మతిభ్రమమొ? సామి!/కుండపోతగ నడిరేయి కురిసె, తప్త
కాంచనపు జడివాన బొక్కసములోన/కంట జూచియు నమ్మలేకుంటి" మనుచు. 32

తప్త+కాంచనపు+జడి+వాన=ప్రకాశించు+బంగారముకుటియు+దట్టమైన+వాన,

తే. పలికినం, జని మెయి గరుపాఱ జూచి/శ్వోఽభియాస్యమానుండగు శర్వసఖుడు
గుమ్మరించిన ధనరాశి, కులిశభిన్న/మేరుశిఖరికూటము వలె మెఱయు దాని 33

మెయి+గరుపాఱ=ఒళ్ళు+గగుర్పాటుచెంద, శ్వోభియాస్యమానుండగ=మరునాడు తానుదండెత్తిపో దలచిన, శర్వసఖుడు=శివుని మిత్రుడు-కుబేరుడు, కులిశ+భిన్న=వజ్రాయుధముచే+పగులగొట్టబడిన, మేరు+శిఖరి+కూటము=మేరుపర్వత+శిఖరముయొక్క+తునకలసమూహము,

వ. సకలమ్ముమను, రఘువు కౌత్సున కొసంగ బల్క నప్పట్టున. 34

సకలమ్ముమను=కురిసిన ధనమంతా, ఒసంగ=ఇవ్వమని, అప్పట్టున=అక్కడ,

తే. అర్థికామాధిక ప్రదానాభిరతుని/నిజగురుప్రదేయాధిక నిరభిలాషు,
ప్రస్తుతించిరి, ముగ్ధులై పౌరు లెల్ల/దాతను పరీగ్రహీత, నిద్దఱ సమముగ. 35

అర్థి+కామ+అధిక+ప్రదాన+అభిరతుని=యాచకుని+కోరిక+మించి+ఇచ్చుటఅందు+ఆసక్తుని, నిజ+గురు+ప్రదేయ+అధిక+నిర్+అభిలాషు=తన+గురువుకు+ఇయ్యవలసినకానుకకంటే+అధిక+కోరికలేనివాని,

వ. పదంబడి పార్థివేంద్రుని అలౌకికాద్భుత వితీర్ణికి తన అపరిగ్రహతకు, నిర్బాధకముగ ఆ విత్తము మొత్తము గురుచరణులకే సమర్పించువాడై స్వీకరించి, శతోష్ట్రవామీవాహితచామీకరరాశితో పయనమై, తన్నా మంత్రణము సేసిన, యా ఆనతపూర్వకాయుని ఆముష్యాయణుని, కరమున సంస్పృశించి, మహర్షి, హర్షోత్కర్షంబున 36

పదంబడి=వెంటనే, వితీర్ణికి=వితరణముచేసినవానికి, అపరిగ్రహత=అధికముగాతీసుకొననిశిష్యునికి, నిర్బాధకముగ=అపాయములేకుండ, శత+ఉష్ట్ర+వామీ+వాహిత+చామీకర+రాశితో=నూర్లకొలది+ఒంటెలు+ఆడుగుఱ్ఱములచే+మోయింపబడిన+బంగారపు+సముదాయముతో, ఆమంత్రణము=సాగనంపు, ఆనత పూర్వకాయుని=వంగిపాదముకు నమస్కరించు, ఆముష్యాయణుని=ప్రసిద్ధవంశముగల తండ్రి కలవానిని, సంస్పృశించి=విధిగాతాకి, హర్ష+ఉత్కర్షంబున=సంతోష+అతిశయమున,

సీ. "మనువంశమకుటమండన! మండలేశ్వర/మకుటమణిప్రభామండితాంఘ్రి!
అక్షీణపుణ్యసుదక్షిణాసుప్రజా!/శ్రీ దిలీపసుధాబ్ధిసితమరీచి!
అతిలోక విశ్వజిత్క్రతుసంప్రవర్తక!/బహుళతీర్థప్రతిపాదితర్థి
వితరణ నిశ్శేషకృత మహాప్రాభవా!/రమ్యకీర్తి విశాల! రఘునృపాల!
రాచనడవడి తప్పని ప్రభువరునకు/నేల కామనలెల్ల పండించు టరుదె!
చదలు తదభీప్సితార్థము పిదుకు టనిన/కనివినము, నేటిదాక జగత్త్రయమున. 37

మకుట+మండన=కిరీటమునకు+భూషణమయినట్టివాడా, మండలేశ్వర+మకుట+మణి+ప్రభా+మండిత+అంఘ్రి=రాజుల+కిరీటపు+మణుల+కాంతితో+వెలుగుచున్న+కాలివేళ్ళు కలవాడా, అక్షీణ+పుణ్య+సుదక్షిణా+సుప్రజా=అధిక+పుణ్యవంతురాలైన+సుదక్షిణాదేవి+మంచికుమారుడా, దిలీప+సుధ+అబ్ధి=దిలీపుడనే+పాల+సముద్రమునకు, సిత+మరీచి=తెల్లని+కిరణమా-చంద్రుడా, అతిలోక+విశ్వజిత్+క్రతు+సంప్రవర్తక=మానవాతీతమైన+విశ్వజిత్అను+యజ్ఞమును+బాగుగానడిపించిన వాడా, బహుళ+తీర్థ+ప్రతిపాదిత+అర్థి+

వితరణ+నిశ్శేష+కృత+మహా+ప్రాభవా! =చాలా+యజ్ఞములలో+వివరించ బడినట్లు+యాచకులకు+దానము+తనకుమిగలకుండా+చేసిన+గొప్ప+ప్రభువా, రమ్య+కీర్తి+విశాల=ఒప్పిదమైన+కీర్తి+విరివిగా కలవాడా, రాచ+నడవడి=న్యాయమార్గమున ధనము ఆర్జించుట వృద్ధిపరచుట రక్షించుట పాత్రదానము చేయుట అను రాజుల+ప్రవర్తనను, నేల=భూమి, కామన లెల్ల=కోరినవెల్ల, పండించుట=సమకూర్చుట, చదలు=ఆకాశము, తత్+ఈభీప్సిత+అర్థము+పిదుకుట=నీ+కోరిన+ధనము+వర్షించుట, జగత్+త్రయమున=మూడులోకాకలో

క. గగనంబు చిల్లువడి ఇటు/నిగనిగని కడాని దొరలెనే? ఏ దొరకున్

గగనపు బను లొదవించుట/జగతిన్ నీ తలనె పుట్టె, జగదేకపతీ! 38

కడాని=మేలిమిబంగారము, దొరలెనే=పడెనే, గగనపు+పనులు=దుర్లభమైన+పనులు, ఒదవించుట=చేయుట, తలనె=ఎడనె, పుట్టె=సంభవించినది,

క. వెల యీ బెనంగె, ఈ వెం/గలి విద్యల కనుచు నను దెగడనీ జగముల్,

వెలలేని, నీ మహాత్మత/వెలయించితి, సుకృతు నైతి, విమలవిచారా. 39

వెల+ఈన్+పెనంగె=గురుదక్షిణగా మూల్యము+ఇవ్వగా+పెంకితనముచేసె, విద్యలకు=విద్యాభ్యాసమునకు, వెంగలి=వెర్రివాడు, తెగడనీ=పరిహసించనీ, వెలలేని=కొనలేని, మహాత్మత=ఘనత, వెలయించితి=ప్రసిద్ధి కెక్కునట్లుచేసితిని, సుకృతును+ఐతి=మంచిపనిచేసినవాడ+అయితిని,

చ. దినమణివంశదీప! పెఱదీవన పాడిన ఫాటగాదె? నీ

కనితరసాధ్యశోభనము లన్నియు నీ అరచేతిలోనివే,

తనయుని బొందు మింక. కులధామవిధాయకు నిన్ను గన్న మీ

జనయిత వోలె, నీవును, నిజప్రతిరూపమహాగుణోదయున్." 40

దినమణి+వంశ+దీప=సూర్య+వంశము+ప్రాకాశింపచేయువాడా, పెఱ+దీవన=అన్య+ఆశీర్వాదములు , నీకు+అనితర+సాధ్య+శోభనము=నీకు+ఇతరులు+సాధింపలేని+శుభములు, కుల+ధామ+విధాయకు=వంశ+ప్రభావము+ఒప్పించువాడు, జనయిత=తండ్రి, నిజ+ప్రతిరూప+మహా+గుణ+ఉదయున్=నీ+మారురూపముకొన్నట్లు+గొప్ప+సద్గుణములతో+పుట్టువాడిని,

తే. అని నరేంద్రుని దీవించి యరిగె వర్ణి/ఏడుగాలము తిరిగిరా ఇనకులేంద్రు

రాణి ఒడి నిండె రఘుమనోరథము పండె/అంతిపురమున పసిడి ఉయ్యాల ఊగె. 41

వర్ణి=బ్రహ్మచారి, ఏడు+కాలము=సంవత్సరము, మనోరథము=మనసులోనికోరిక,

తే. కనియె నంట కుమారకల్పుని గుమారు/రాజపత్ని బ్రాహ్మీముహూర్తంబునందు,
అందుకని బ్రహ్మనామధేయముగ తండ్రి/ఔరసునకు అజుండని పేరు పెట్టె. 42

కనియెను=ప్రసవించినది. కుమార+కల్పుని=కుమారస్వామితో+సమానుని, బ్రాహ్మీముహూర్తంబునందు=తెల్లవారుఝామున, ఔరసునకు=పుత్రునకు,

క. రూపదియె వీర్యమదియే/ఏపునదే, ఇట్లు, ప్రభవహేతువుతో నా
పాప డభిన్నత జూపె ప్ర/దీపంబున బుట్టి వెలుగు దీపిక భాతిన్. 43

ఏపు=ఔద్ధత్యము, ప్రభవ+హేతువు=ఆవంశమునపుట్టిన+కారణంగా, ప్రదీపము=పెద్ద దీపము, దీపిక=చిన్నదీపము, భాతిన్=వలె,

సీ. గురుకులంబున కేగి కొట్టినపిండిగా/సకల విద్యా పరిశ్రమము చేసి,
ఆజానజంబైన తేజోవిశేషంబు/వినయప్రకర్షచే విస్తరించి,
జనలోకహృదయ రంజకమై గుబాళించు/వితతచాతురి కల్మి వీనుమిగిలి,
కమనీయమగు సోయగమునకు నవయౌవ/నోద్భేదమున వింత ఒఱపు సెఱపి,
లలిత శోభాకలాపకల్యాణరేఖ, మెఱయు నా రాచకొమరుపై మేలుపడియు,
రఘుని అనుమతి నర్థించె రాజ్యలక్ష్మి, కన్నవారి సమ్మతి ధీరకన్య, వోలె. 44

కొట్టినపిండిగా=బాగుగాతెలిసినదిగా, ఆజానజంబైన=సహజమైన, తేజో+విశేషంబు=పరాక్రమ+అతిశయము, వినయ+ప్రకర్ష=మంచినడవడియొక్క+అతిశయము, విస్తరించి=విరివియై, గుబాళించు=పరిమళించు, వితత+చాతురి+కల్మి=ఎక్కువఅయిన+నేర్పు+సంపదచే, వీనుమిగిలి=ప్రసిద్ధికెక్కి, నవ+యౌవన+ఉద్భేదమున=నూతనగా+యౌవనము+వచ్చుటవలన, ఒఱపు=సౌందర్యము, సెఱపి=చేసి, లలిత+శోభ+కలాప+కల్యాణ+రేఖ=మనోహరమైన+కాంతి+సమూహపు+శుభ+సౌష్ఠవము, మెఱయు=శోభిల్లు, మేలుపడుయు=మోహమందియు,

మ.ద్విపద. ఆలోన క్రథకైశికాధీశుడైన/భోజభూపతి తన‘ ముద్దుచెల్లెలికి
అతులితోజ్జ్వలచారుమతి కిందుమతికి/నరలోకమున స్వయంవరము చాటించి.45

ఆలోన=అంతలో, క్రథకైశిక+ఆధీశుడైన=విధర్భదేశమునకు+రాజైన, అతులిత+ఉజ్జ్వల+చారుమతి=సాటిలేని+ప్రకాశముగల+విలాసవతి,

మ.ద్విపద. అజకుమారానయనాయతాకాంక్ష/సముచితరీతి దజ్జనకుని కడకు
సందేశహరు బంపె, జంగమాహ్వాన/పత్రికా ప్రాయుని పరమాప్తు నొకని. 46

అజకుమార+ఆనయన+ఆయత+ఆకాంక్ష=అజుని+రప్పించు+ప్రయత్నము+కోరి, జంగమ=నడచుచున్న, ఆహ్వాన+పత్రికా+ప్రాయుని=ఆహ్వాన+పత్రిక+వంటివానిని,

వ. విధర్భరాజవంశముతోడి వీయ మీప్సనీయమగుటయు, విద్యావయస్సంపన్నుడై తన యౌరసుడు సత్వరదారక్రియాయోగ్యుడగుటయు, వరుని సుగుణమణిగణమునకు తద్వధూలలామగుణము లంతర్ఘటనాగుణములుకావచ్చుటయు, విచారించి, రఘుమహీపతి, శిష్టపురోహితామాత్య బంధు జనుల అనుమతమున, తన్నునుప, రాఘువుడు, సముచితానల్ప చతురంగ ధ్వజినీసమేతము గను, వలయు ఆంతరంగికపరివారముతోడను, పితృపాదుల శుభాకాంక్షలతోడను, కల్యాణోచిత సన్నాహియై బయలుదేరి. 47

వీయము+ఈప్స+నీయము=సంబంధము+కోర+దగినది, ఔరసుడు=కుమారుడు, సత్వర+దార క్రియా+యోగ్యుడు=వెంటనే+వివాహమునకు+తగినవాడు, సు+గుణ+మణి+గణమునకు=మంచి+గుణములనే +రత్న +రాశికి, తత్+వధూ+లలామ+గుణములు=ఆ+పెండ్లికూతురు+శ్రేష్ఠ+గుణములు, అంతర్+ఘటనా+గుణములు+కావచ్చుటయు=సర్వము+సంబంధము కలుపదగిన+గుణములు+అవుటయు, శిష్టుడు=సదాచార సంపన్నుడు, తన్ను+అనుప=అజుని+పంప, సముచిత=సమయాను కూలమైన, అనల్ప=తక్కువ కాని-ఎక్కువ, చతురంగ=రథములు గుఱ్ఱములు ఏనుగులు పాదచారులు కల, ధ్వజినీ=సేన, కల్యాణ+ఉచిత+సన్నాహియై=పెండ్లికి+ఉచితమైన+ప్రయత్నముతో

సీ. సముచితాయత సమస్థల నిర్మితోదగ్ర/రమణీయ పటకుటీరముల వలన,
అభ్యంతరాకల్పితాసనశయనాది/మహితోపచార సామగ్రి వలన,
సందర్శనాయాతజానపదానీత/శాకగవ్యపదార్థచయము వలన,
అనుగామి చతురగాయకవిధూషకమంజు/గానగోష్ఠిప్రసంగముల వలన,
త్రోవలో దాను విడిసిన ప్రొద్దు లెల్ల/స్వనగరోపవనాంతభోజనవిహార
కల్పములు గాగ, చని, ఘుస్రకతిపయమున/కవల, నొకనాడు మిట్టమధ్యాహ్నవేళ. 48

సముచిత+అయత=ఉచిత+ప్రయత్నముతో, సమస్థల+నిర్మిత+ఉదగ్ర+రమణీయ=చదునైన చోట+నిర్మించిన+పెద్దదై+అందమైన, పట+కుటీరముల=శిబిరపుడేరా+ఇండ్ల, అభ్యంతర+ఆకల్పిత+ఆసన+శయన +ఆది=లోపల+కూర్పబడిన+కూర్చొను+పడుకొనుటకు+మొదలగు, మహిత+ఉపచార+సామగ్రి=గొప్ప+సేవా+సంభారము, సందర్శన+ఆయాత+జానపద+ఆనీత+శాక+గవ్య+పదార్థ+చయము=దర్శనమునకు+వచ్చిన+వనవాసులచే+తేబడిన+కూరలు+ఆవుపాలు+దినుసుల+రాశి, అనుగామి=తోడవచ్చుచున్న,

చతుర+గాయక+విధూషక+మంజుల+గాన+గోష్ఠీ+ప్రసంగము=నేర్పుకల+పాటగాండ్ర+హాస్యగాండ్ర+మనోహరమైన+పాటల+సభా+సంభాషణలు, విడిసిన=బసచేసిన, స్వ+నగర+ఉపవన+అంత+భోజన+విహార+కల్పములు=స్వంత+ఊరి+ఉద్యానవనము+నందు+భోజనపు+విహారపు+విధము, ఘస్ర+కతిపయమునకు+అవల=దినములు+కొన్నిటి+తరువాత,

చ. తరగల నీటి తుంపరుల తాకున మందమృదుప్రచారమై
కరువలి వీచినం గదలు కానుగుమ్రాకులతోడి నర్మదా
సరిదభిరామ తీరమున జాతపథివ్యసనాతిరేకమున్,
ధరణిరజఃపిశంగితపతాకము నిల్పె, నజుం డనీకమున్. 49

తరగల=అలల, తాకున=తగులుటచేచల్లబడిబరువెక్కి, మంద+మృదు+ప్రచారయై+కరువలి+వీచినం=మెల్లగా+సౌమ్యముగా+సాగు+గాలి+వీయగా, కదలు+కానుగు+మ్రాకుల+తోడి=చలింపుచున్న+కానుగ+చెట్ల+తోఉన్న, నర్మదా+సరిత్+అభిరామ+తీరమున=నర్మదా+నది+అందమైన+ఒడ్డున, ధరణి+రజః+పిశంగిత+పతాకము=భూ+ధూళిచే+కపిలవర్ణగామారిన+జెండాను, జాత+పథి+వ్యసన+అతిరేకమున్=కలిగిన+మార్గమువలని+కష్టపు+హెచ్చుదల, అనీకము=సేనను, నిల్పె=(విశ్రమించ)ఆపెను,

క. నిలిపి,జలవిహగపటుమద/కలనిస్వనభరితగాఢకౌతూహలియై,
సలిలావగాహకేళీ/హాళహాళికము, చెంగలింప, నటు వోవు తఱిన్. 50

జల+విహగ=నీటిలో+విహరించుచున్న, పటు+మదకల+నిస్వన+భరిత=ఎక్కువ+మదపుటేనుగు+ఘీంకారములచే+నిండగా, గాఢ+కౌతూహలియై=ఎక్కువ+కుతూహలముకలవాడై, సలిల+ఆవగాహ+కేళీ=నీట+మునుగు+క్రీడలందు, హాళహాళికము=త్వరత, చెంగలింపన్=అతిశయింపగా, తఱిన్=సమయమున,

తే. అంబువుల మీది సుడియు రోలంబపంక్తి/నీట దా మున్ను మునుగుట దేటపఱుప,
క్షాళితమదచ్ఛటామలగండభిత్తి/ఒక వనేభము నదములోనుండి లేచి . 51

క్షాళిత+మద+చ్ఛట+అమల=కడిగిన+మదపు+కాంతితో+నిర్మలమైన, గండభిత్తి=ప్రశస్తమైన గండస్థలము కల, వన+ఇభము=అడవి+ఏనుగు, అంబువుల+మీది+సుడియు=నీటి+మీద+సుడి గుండముగా ఏర్పడుట, రోలంబ+పంక్తి=చెదిరినతుమ్మెదల+గుంపు, నీటన్+తా+మున్ను+మునుగుటన్+తేటపఱుప = నీటిలో+అది+ముందుగా+మునిగిఉండుట+వెల్లడిచేయగా, నదములోనుండి+లేచి=నదినుంచి+లేచి, (ఏనుగు నీటిలో నుండి పూర్తిగా లేవకుండానే నీటి అలలు పుట్టినవి. లోపలి తామరతూడులు పువ్వులు కదలగా తుమ్మెదలెగిరినవి. ఏనుగు కనబడకముందే కదిలిన అలలు, చెదరిన తుమ్మెదలు సూచెనచేసెను)

సీ. నీట నానుట జేసి నెరయ జేగుఱుమన్ను/తడిసి యువ్వెత్తుగా కడుగబడియు,
రాల రాపిడికి మొఱటపడ్డ కొమ్ముల/పెలియని నల్లని నిలువు చాఱ
లటమున్ను దా గుఱంగటి కొండచరియల/గోరాడి వచ్చిన తీరు జూప,
ముడువంగ నిగిడింప నొడువు గల్గిన దొడ్డ/వలుదతొండమున బేరలలచాలు
విఱుగసేయుచు, నాచుదీవియలగుంపు/బోరతో నీడ్చికొని, ఒడ్డు చేరవచ్చె,
గుట్ట కెనవచ్చు తన మేన నెట్టబడిన/ఏటి వెల్లువ మున్నె గట్టెగసి పొరల. 52

నెరయ=వ్యాపించిన, ఉవ్వెత్తుగా=నిశ్శేషముగా, రాల+రాపిడికి+మొఱట+పడ్డ=రాళ్ళను+రుద్దుటచే+కఱకు+పడిన, కొమ్ముల+పెలియని+నల్లని+నిలువు+చాఱలు=దంతములపైని+తఱిగిమాసి పోని+నల్లని+గీఱురేఖలు, అట+మున్ను+తాన్+కుఱంగటి+కొండచరియల+కోరాడి+వచ్చిన+తీరు+తెలుప=అంతకు+ముందు+తను+సమీప+కొండరాళ్ళను+దంతములతో క్రుమ్మి+వచ్చిన+విధము+చూప, ముడువంగ+నిగిడింపన్+ఒడువు+కల్గిన+దొడ్డ+వలుద+తొండమున=ముడుచుటకు+చాపుటకు+వీలైన+పెద్ద+స్థూలమైన+తొండముతో, పేరు+అలల+చాలు+విఱుగన్+ఏయుచు=పెద్ద+అలల+కదలిక+పడ+చేయుచు, నాచు+ తీవియల+గుంపు=నీటిపైనున్న నాచు+మొక్కల+గుంపు, బోరతోన్+ఈడ్చికొని=రొమ్ముతో+ఈడ్చుకొని, గుట్టకు+ఎనవచ్చు+తన+మేన+నెట్టబడిన+ఏటి+వెల్లువ+మున్నె+గట్టు+ఎగసి+పొరల=కొండకు+సాటియగు+తన+శరీరముతో+తోయబడిన+నదినీరు+పొంగి+ముందుగనే+గట్టు+ దాటుకుని+పొంగగా, ఒడ్డు చేరవచ్చె=ఒడ్డుకు+చేరసాగెను.

వ. వచ్చి, తన కపోలకుడ్యమున జలావగాహనహేతువున దాత్కాలికముగ నుపశమించిన మదదుర్దినశ్రీవన్యేతరానేకపదర్శనమున పునరుద్దీపించి సప్తచ్ఛదక్షీరకటుప్రవాహానుకారియై జాలువాఱుటయు. 53

కపోలకుడ్యమున=గోడ వంటిచెక్కిలిమీద, జల+అవగాహన+హేతువున=నీటిలో+మునుగుట+చేత, తాత్కాలికముగను+ఉపశమించిన+మదదుర్దినశ్రీ=కొద్దికాలము+తగ్గిన+ఎడతెగక స్రవించు మదసంపద, వన్య ఇతర+అనేకప+దర్శనమున=అడవియందలివి కాని (సైన్యములోని)+ఏనుగులను+చూచి, పునర్+ఉద్దీపించి=మరల+విజృంభించికారగా, సప్తచ్ఛద+క్షీర+కటు+ప్రవాహ+అనుకారియై+జాలువాఱుటయు=ఏడాకులఅరటియొక్క+పాలవంటి ద్రవము+పరిమళవంతమై+ధార+వలె+కారగా,

సీ. గంధేభరూపమై కార్కొన్న సంవర్త/మేఘమాలిక బోని మేను పొంగ,
చిందాడు మృత్యువుచెయ్యి తోబుట్టుపై/గండుమీరిన వల్దతొండ మడర,

కినుకమై నిగిడిన కనుదోయి మెఱగుల/నిప్పురవ్వల వాన యుప్పతిలగ,

కర్ణపుటక్షోభకరమైన ద్రాఘిష్ఠ/బృంహితధ్వని దిశల్ పిక్కటిలగ,

ప్రళయకాలుని మూర్త్యంతరంబు నాగ/రౌద్రరసరేఖ కభిధాంతరంబు నాగ,

చిందరేగిన యా యేన్గుజెట్టి జూచి/కాందిశీకులై రెల్లరు కరము భీతి 54

గందేభరూపమై+కార్కొన్న+సంవర్త+మేఘమాలిక=ఏనుగురూపుకొని+క్రమ్ము+ప్రళయ కాల+మేఘ+సమూహము, చిందాడు+మృత్యువు+చెయ్యి+తోబుట్టుపై=చిందులు త్రొక్కు+మృత్యుదేవతయొక్క+చేతికి+సమానమై, గండు+మీరిన+వల్ద+తొండము+అడర=బలముతో+హద్దుదాటు+స్థూలమైన+తొండము+ఒప్ప, కినుకమై+నిగిడిన+కను దోయి+మెఱగుల+నిప్పు రవ్వల వాన+ఉప్పతిలగ=కోపముతొ+విప్పారిన+రెండుకండ్ల+తళుకులనుండి+నిప్పుకణముల+వానకురిసినట్లు+అతిశయింపగా, కర్ణ+పుట+క్షోభకరమైన+ద్రాఘిష్ఠ+బృంహిత+ధ్వని+దిశల్+పిక్కటిలగ=చెవి+రంధ్రములకు+కలతపొందించు+మిక్కిలిదీర్ఘమైన+ఘీంకారపు+మోత+దిక్కులందు+నిండగా, ప్రళయ+కాలుని+మూర్తి+అంతరంబు+నాగ=ప్రళయకాల+యముని+ఉగ్రమూర్తి+రెండవరూపము+అనునట్లు, రౌద్రరస+రేఖకు+అభిధాంతరంబు+నాగ=కోపరస+రీతికి+మారుపేరు+వలె, చిందరేగిన=అవేశమెత్తు, జెట్టి=శ్రేష్ఠ, కాందిశీకులు+ఐరి+ఎల్లరు+కరము+భీతి=పరుగెత్తువారు+అయిరి+అందరు+ఎక్కువ+భయముతొ,

మ. అపు డాధోరణ తీవ్రయత్న విముఖ వ్యాకీర్ణ పేదండమై,

సపదిచ్ఛిన్న ఖలీనకద్రుతతరాశ్వ వ్యస్తశాతాంగమై,

సపరిత్రాస వధూజనావనవిహస్తవ్యగ్రధానుష్కమై,

నృపసేనా శిబిరంబు పెందుముల మయ్యెన్ ద న్మూహూర్తంబునన్. 55

ఆధోరణ+తీవ్రయత్న+విముఖ+వ్యాకీర్ణ+పేదండమై=మావటివాని+కడుప్రయత్నమునకు+లొంగక+చెదిరిన+ఏనుగులగుంపై, సపది+చ్ఛిన్న+ఖలీనక+ద్రుతతర+అశ్వ+వ్యస్త+శాతాంగమై=శ్రీఘ్రముగా+తెంచుకున్న+కళ్ళెములతో+ఎక్కువవేగముతోపారు+గుఱ్ఱములు+విఱుగబడిన+రథములై, సపరిత్రాస+వధూజన+అవన+విహస్త+వ్యగ్ర+ధానుష్కమై=బాగుగాభయపెట్టబడిన+స్త్రీలను+కాపాడుటయందు+వ్యాకులమై+తొట్రుపాటుపడు+విలుకాళ్ళై, పెను+తుములయ్యెన్=బాగా+చెల్లాచెదరైనది, తన్+మూహూర్తంబునన్=ఆ+సమయమున,

వ. ఆలోన నా గంధసింధురము శరవేగమున. 56

గంధ సింధురము=ఒకజాతిఏనుగు, శర=బాణము,

మ. తనమీదం గవియంగ రా గని, అహంతవ్యంబు రాచూలికిన్
వననాగంబని, విన్నవాడగుట, తన్మత్తేభవిక్రీడితం
బు నియంత్రింప దలంచి, నాటె విశిఖంబున్ నాతితీవ్రంబుగా
గొనయంబున్ పెడనిండుగా దిగిచి కాకుత్ స్థుండు కుంభస్థలిన్. 57

కవియంగ=పైబడ, న+హంతవ్యంబు=చంపకూడనిది, రాచూలికిన్=రాకుమారునికి, వన+నాగంబు=అడవి+ఏనుగు, తత్+మత్తేభ+విక్రీడితంబు=ఆ+ఏనుగు+విశృంఖల విహారము, నియంత్రింప=వారింప, విశిఖంబున్ =బాణమును, న అతి తీవ్రంబుగా=ఎక్కువ వాడిగా కాక, కొన అంబున్=బాణపుకొనతో, పెడనిండుగ= అల్పముగాలాగి, దిగిచి=గ్రుచ్చి,

లయగ్రాహి. నారసము ప్రేటుపడి కారణజనుస్తనువికారము దొఱంగి వనవారణము తోడ్తో
ఘోరభయసంభ్రమవిదూరితులు, విస్మయవిపూరితులు, రాజభటువారములు చూడన్
శారదవిధుస్ఫుటితకైరవవిభాసమభిహార వలయాంతరిత భూరిరమణీయా
కారత వియచ్చరకిశోరత భజించి, సముదారగతి రాఘవుని చేరువకు వచ్చెన్. 58

నారసము=బాణము, ప్రేటు=దెబ్బ, కారణ+జనుస్+తను+వికారము=శాపమువల్ల+కలిగిన+శరీర+వికారము, తొఱంగి=విడివడి-తొలగి, తోడ్తో=వెంటనే, ఘోర+భయ+సంభ్రమ+విదూరితులు=అధిక+భయము +తత్తరపాటుతో+దూరమైనవారు, విస్మయ+విపూరితులు=ఆశ్చర్యము+నిండినవారు, వారములు= సమూహము, శారద+విధు+స్ఫుటిత+కైరవ+విభాస+అభిహార=శరత్కాల+చంద్రునివల్ల+వికసించిన+ తెల్లకలువల+బహుప్రకాశమును+దొంగలించు, వలయ+అంతరిత+భూరి+రమణీయ+ఆకారత=కాంతి మండలము+నడుమనున్న+అధిక+అందమైన+ఆకారముతో, వియచ్చర+కిశోరత+భజించి=దేవ+ కుమారుని రూపము+ధరించి, సమ ఉదారగతి=తనగొప్పతనమునకుతగినవిధముగా,

శా. చేరన్ వచ్చి యువాభ్రచారి మునుమున్ స్వీయప్రభావాత్త మం
దారోత్ఫుల్ల సుమప్రకాండ మజు మీదంజల్లి, మైత్రీవచ
స్స్వారస్యంబు రహింప బల్కె, ధవళ ద్విజప్రభాబృంహిత
స్ఫారోరఃస్థల తారహార తరళశ్శైత్యోపసంశోభియై. 59

యువ+అభ్ర+చారి=యువకుడైన+ఆకాశ+సంచారి, మునుమున్=ముందుగా, స్వీయ+ప్రభావ+ఆత్త=తన +మహత్యముచే+పొందబడిన, మందార+ఉత్ఫుల్ల+సుమప్రకాండము=కల్పవృక్షపు+వికసించిన+శ్రేష్ఠమైన పూలు, మైత్రీ+వచస్+స్వారస్యంబు+రహింప=స్నేహపు+మాటలందు+లాలిత్యము+ఒప్పగా, ధవళ+ద్విజ

+ప్రభా+బృంహిత=తెల్లని+దేవ+కాంతిచేత+పెంచబడిన, స్ఫార+ఉరః+స్థల+తారహార+తరళ+శ్వైత్య+ఉప సంశోభియై=చలించుచున్న+ఉరము+పైనున్న+ముత్యములదండ+మధ్యరత్నపు+తెల్లదనము+ అధకముగా ప్రాకాశించువాడై,

సీ. "అన్న! ఎవ్వరివాడ, వజకుమారుడ, వొక్కొ?/శ్రీరఘుక్షితిజాని కౌరసుడవె?
వీనులవిందుగా విందుగా, మీ కీర్తి/గంధర్వగాయనగానములను,
ప్రియదర్శనుండను పెంపొందు గంధర్వ/వరుని పుత్రుడ, ప్రియంవదుడు పేరు,
అవలేపమూలమైనట్టి మతంగ శా/పమున మతంగజత్వమును గంటి,
శాపమిచ్చి పదంబడి చరణపతితు/నన్ను లోగొని తపసి ప్రసన్నుడయ్యె,
ఆతపాగ్నులచే గ్రాగు నంతె, కాని/జలమునకు చల్లదనమె నైసర్గికంబు! 60

క్షితి+జాని=భూ+పతి-రాజు, ఔరసుడవె=కొడుకువా, వీనులవిందుగా=చెవులపండుగగ, గంధర్వ+గాయన +గానములను=గంధర్వులు+పాడు+పాటలందు, అవలేప+మూలమైనట్టి=గర్వము+మూలకారణమైనట్టి, మతంగ=మతంగ ముని, మతంగజత్వము=ఏనుగు రూపు, కంటి=పొందితిని, పదంబడి=వెంటనె, చరణ పతితు=పాదములపైపడ్డ, లోగొని=క్షమించి, ప్రసన్నుడయ్యె=దయకలవాడయ్యె, ఆతప+అగ్నులచే+క్రాగు= ఎండ+నిప్పులచే+వేడెక్కును, నైసర్గికము=స్వభావము.

మ. ఘను డిక్ష్వాకుకుల ప్రసూతుడు రఘుక్ష్మాపాలసూనుం డజుం
డనతిక్రూర శరంబు చే నెపుడు వ్రయ్యంజేయు నీ కుంభ మా
క్షణమే క్రమ్మఱ కల్గు నీకు స్వవపుఃసంప్రాప్తిమాహాత్మ్య మం
చని శాపావధి యానతిచ్చె, జటిలుం డార్ద్రీకృతస్వాంతుడై. 61

ప్రసూతుడు=కొడుకు, న అతి క్రూర+శరంబు=తీక్ష్ణముకాని+బాణము, వ్రయ్యంజేయు=భేధించు, కుంభము =కుంభస్థలము, స్వ+వపుః+సంప్రాప్తి+మాహాత్మ్యము=నీ+అసలుశరీరము+పొందు+ఘనత, అంచు+అని +శాప+అవధి+ఆనతి+ఇచ్చె=అలా+అని+శాప+గడువు+సెలవు+చేసె, జటిలుండు+ఆర్ద్రీకృత+స్వాంతుడై= ముని+మెత్తబడిన+మనస్సు కలవాడై,

సీ. శాపంబు సాంద్రావలేపంబు నీచేత/గడతేఱె కసటు వో గంటి నేడు,
కనుగొంటి నిటు పెద్దకాలంబునకు నిన్ను/మనుప వచ్చితి వదేపనిగ నన్ను,
ప్రీతి, నీకొక ప్రతిప్రియము సేయనినాడు/స్వపదోపలబ్ధి నిష్ఫలము నాకు,
అర్పింతు సంమోహనాఖ్యంబు గంధర్వ/దైవత్య మొక మహాస్త్రంబు నీకు,

పిండితార్థము విను, మేల పెక్కుమాట/లనుగుమిత్రమ! ఆ జృంభకాస్త్రవేది
కవిరతము స్వప్నవార్త శాత్రవభయంబు/అంకనిహితార్థపేటి ఆహవజయంబు. 62

సాంద్ర+అవలేపము=దట్టమైన+గర్వము, కడతేఱె=సమాప్తమైనది, కసటు+పోగంటి=పాపము+పోగొట్టు కుంటిని, మనుప=రక్షింప, ప్రీతి=సంతోషముగా, ప్రతి+ప్రియము=ప్రతి+ఉపకారము, స్వపద+ఉపలబ్ధి =స్వస్థాన+ప్రాప్తి, సంమోహన+ఆఖ్యంబు=సంమోహనము+అనిపేరుకల, గంధర్వ+దైవత్యము=గంధర్వ+ దేవతలనిమిత్తము ఉద్దేశింపబడినది, పిండితార్థము=ఎన్నదగినది, జృంభక+అస్త్ర+వేదికి=విజృంభించు+ ఈఅస్త్రము+తెలిసినవానికి, అవిరతము=ఎల్లప్పుడు, స్వప్న+వార్త=కలలో+విషయము, శాత్రవ=శత్రుల, అంక+నిహిత+అర్థ+పేటి=ఒడిలో+ఉన్న+కోరికలనిచ్చు+పెట్టి, ఆహవ+జయము=యుద్ధములో+గెలుపు,

వ. శరప్రహారమున నొప్పించిన నేనీ మేలెట్లు వీనినుండి చేకొందునని సంకోచింపకుము. కళామాత్ర పీడా కరమైననేమి? దుర్జనన విసర్జనహేతువుగ పర్యవసించిన నీ ప్రహారము నాకు మహితోపకారక మగుట నీవ చూచితివి. కావున కృతజ్ఞతాగుణోత్కర్షమున వేడికొను చెలికానికి నిరాకరణ పారుష్యమును ప్రసాదింపకుము." అనిన ధన్యవాద పూర్వకముగ వల్లె యని, పవిత్రరేవాతోయమున కృతస్నానుడై యాచమించి, ఉత్తరాభిముఖముగ నిలచి రఘుప్రవీరుడు వియచ్చరకుమారునివలన ప్రయోగ సంహార విభక్త మంత్రపూర్వకముగ మోహనాస్త్రమును పరిగ్రహించెను. 63

కళామాత్రా+పీడ=మూర్ఛిల్లచేయునంతటిచిన్న+బాధ, దుర్+జనన=చెడు+పుట్టుక, విసర్జన+హేతువుగ =విడిచి పుచ్చు+కారణముగ, పర్యవసించిన=ముగిసిన, ప్రహారము=దెబ్బ, ఉత్కర్షమున=అతిశయమున, పారుష్యము=కఠినత్వము, వల్లె=సరే, ప్రయోగ+సంహార+విభక్త+మంత్రపూర్వకముగ=ప్రయోగము+ ఉపసంహములకు+వేర్వేరు+మంత్రములతో, పరిగ్రహించెను=స్వీకరించెను,

తే. తలవని తలంపుగా, నిట్లు దైవికముగ/తెరువుబడి మిత్రులైన వారిరువురందు
చనియె, చైత్రరథప్రదేశమున కొకడు/రమ్యసౌరాజ్య మగు విధర్భకు నొకండు. 64

తెరువువబడి=మార్గమును బట్టి, చైత్రరథ ప్రదేశము=కుబేరోద్యాన ప్రదేశము, రమ్య సౌరాజ్యమగు=మంచి రాజుండురమ్యమైన,

చ. చని నగరోపకంఠసువిశాలవనాంతరసీమ నుండ ఒ
య్యన క్రథకైశికేంద్రుడు తదాగమరూఢగురుప్రహర్షు డా
తనికి అమాత్యబంధుజనతాసహితం బెదు రేగుదెంచె, చం
ద్రునకు వివృద్ధవీచికలతో నెదురేగు, పయోధిపోల్పునన్. 65

ఉపకంఠము=పొలిమేర, ఒయ్యన=ఒప్పిదముగా, తత్+ఆగమ+రూఢ+గురు+ప్రహర్షుడు=వాని+వచ్చుటచే+మొలకెత్తిన+బహు+సంతోషముకలవాడై, వివృద్ధ+వీచికలతో=బాగుగాపెరిగిన+అలలతో, పయోధి=సముద్రము, పొల్పునన్=అతిశయముగా,

వ. ఎదుర్కొని, సముచితప్రకారమున స్వాగతపరిరంభణ ప్రముఖసంభావనములు నడిపి, అక్కుమారుని
పురప్రవేశము చేయించి, అర్ఘ్యపాద్యమధుపర్కాద్యుపచారములు నిర్వర్తించి, ఒక
ప్రత్యగ్రరాజభవనమునువిడిదిగా జూపిన, వైధర్భుని సస్నేహముగ వీడుకొని 66

పరిరంభణ+ప్రముఖ+సంభావనములు=ఆలింగనము+మొదలైన+సన్మానములు, నడిపి=జరిపించి, ప్రత్యగ్ర=నూతన,

తే. అచట ప్రాగ్ద్వారవేదివిన్యస్తపూర్ణ/కలశమగు ఆ నవీనోపకార్య నజుడు
అధివసించెను, కొమరుప్రాయమున కవలి/దశ ననంగుడు వోలె ఉదాత్తలీల 67

ప్రాక్+ద్వార+వేది+విన్యస్త=తూర్పు+వాకిలి+అరుగుమీద+ఉంచబడిన, పూర్ణ+కలశమగు=నిండు+మంగళ కలశముకలదైన, నవీన+ఉపకార్యన్+అజుడు+అధివసించెను=క్రొత్తగా+వేయబడిన డేరాలో+అజుడు+నివసించెను, కొమరుప్రాయపుకు+అవలి+దశ=పడచుతనపు/మనోజ్ఞమైన వయసు+తరువాతి+యౌవన దశనున్న, అనంగుడు+వోలె=మన్మధుని+వలె

ఉ. అయ్యెడ నాటి రేయి వరణార్థసమాహ్వతరాజలోకమం
ద య్యెలనాగయందు, హృది హత్తి తదేక విలిప్స నుండుటన్,
సెయ్యని భావముం దెలియనేరని ముగ్ధవధూటి వోలె రా
దయ్యె, రఘుప్రవీరు నయనాభిముఖంబుగ నిద్ర, ఎంతకున్ 68

వరణ+అర్థ+సమాహ్వత+రాజలోకమందు=వరింపబడుటఅను+కోరికచే+సమావేశమైన+రాజకుమారులందు, అ+ఎలనాగ+అందు=ఆ+యౌవనవతి ఇందుమతి+పై, హృది+హత్తి=మనస్సు+లగ్నమై, తత్+ఏక+విలిప్స+ఉండుటన్=ఆమె+యందే+ఎక్కువైనపొందుఇచ్ఛ+కలిగి ఉండుటచే, రఘుప్రవీరు+నయన+అభిముఖంబు గ=అజుని+కనుల+ఎదుటకు, సెయ్యని+భావముం+తెలియ+నేరని+ముగ్ధ+వధూటి+వోలె=ప్రేమపు+రీతి+ తెలియ+జాలక+ఉదయించుచున్నయౌవనముకల+కన్యఅందువలె+వలె, నిద్ర=నిద్రాదేవి, రాదయ్యె= రాలేదు, ఎంతకున్=ఎంతసేపటికి,

సీ. మకరకుండలవజ్రమాణిక్యపీడిత/పీవరాంసు సుధీవరావతంసు,
మృదులశయ్యోత్తరచ్ఛదవిమర్దకృశాంగ/గంధసారు నితాంతకార్యశూరు,

ఉభయపార్శ్వవివర్తనోరస్థ్సలవ్యస్త/తారహారు నుదారతరవిహారు,
చరమయామస్వప్నసందర్శితాంగనా/రూపలోలు శుభాంగరుగ్విశాలు,
అజకుమారు, అనిమిషాచలగంభీరు/సూతసుతులు చతురసూక్తిరతులు,
బోధ పుష్కలుని ప్రబోధించి, రిట్లని/ఉదయశీలుప్రత్యుషోదయమున. 69

పీడిత=ఒరయబడిన, పీవర+అంసు=బలసిన+మూపు కలవాడు, సుధీవర+అవతంసు=గొప్ప విద్యాంసులలో+శిరోభూషణమువంటివాడు, మృదుల+శయ్య+ఉత్తర+చ్ఛద+విమర్ధ+కృశ+అంగ+గంధసారు=మెత్తని+పఱుపు+పై+కప్పినవస్త్రపు+రాపిడివల్ల+నలుపబడిన+అంగములనుండు+చందనపూత కలవాడు, నితాంత+కార్య+శూరుడు=ఎడతెగని+విధాయక కృత్యములందు+వీరుడు, ఉభయ+పార్శ్వ+వివర్తన+ఉరస్థ్సల+వ్యస్త+తారహారు=రెండు+ప్రక్కల+ఇటుఅటుదొర్లగ+రొమ్ముపై+వ్యాపించిన+ముత్యాలహారములు కలవాడు, ఉదార+తర+విహారు=మంచి+క్రమపద్ధతిలో+స్వేచ్ఛగా సంచరించువాడు, చరమ+యామ+స్వప్న+సందర్శిత+అంగనా+రూప+లోలు=తెల్లవారు+ఝాము+కలలో+చూచిన ఇందుమతి+రూపమునందు+ఆసక్తికలవాడు, శుభ+అంగ+రుక్+విశాలు=మంగళకరమైన+అవయవముల+కాంతి+విరివిగాఉన్నవాడు, అనిమిష+అచల+గంభీరు=రెప్పపాటులేని దేవతలవలె+చలింపని+గాంభీర్యము కలవాడు, సూత+సుతులు=మేలుకొలుపుపాడువందుల+పుత్రులు, చతుర+సూక్తి+రతులు=నేర్పుగల+మాటలందు+తత్పరత కలవారు, బోధ=వైతాళికులు, పుష్కలుని=రాజుని, ఉదయ+శీలు=ఉదయమేలేచు స్వభావముచే లేచుటకు+సిద్ధమైనవాని, ప్రత్యుష+ఉదయమున=ప్రాతఃకాలము+అవగానె, ప్రబోధించిరి=బాగుగా మేల్కొలిపిరి.

ఉ. "రేయి గతించె లేవెలుగురేకలు తూర్పున తొంగి చూచె వి
చ్చేయుము పాన్పువీడి, యువశేఖర! విశ్వజగద్భరంబులో
మోయుచునున్నవాడు సగమున్ భవదీయగురుం డనిద్రుడై
సాయముసేతువీ వపరసామిధురీణపదావలంబివై. 70

లే=లేత, విశ్వ+జగత్+భరంబులో=సర్వ+భూ+భారములో, సగము=తనపాలైనఅర్ధభాగము -రాత్రిపూట, భవదీయ+గురుండు=నీ+తండ్రి, అనిద్రుడై=నిద్రలేకజాగరూకుడై, ఈ+అపర+సామి=ఇప్పుడు పగలైనందున+రెండవ+సగము, ధురీణ+పద+అవలంభివై=సమర్ధతతో+(ఆ)స్థానపుబరువు+ఎత్తుకొన వలసినవాడివై, సాయము+చేతువు=తండ్రికిసహాయము+చేయుదువుగాక,

ఉ. అక్కట నిద్రకున్ వశుడవై తన నెయ్యము తియ్య మెల్ల నీ
వక్కఱసేయకున్న, నిశియంతయు ఖండితనాయికాకృతిన్

స్రుక్కిన లచ్చికిన్ వెడవినోద మెవండు ఘటించె, ఇప్పు డా
చుక్కలఱేడు, నీ వదనశోభకు బాసె దిగంతలంబియై. 71

అక్కట=అయ్యో!, నిద్రకున్+వశుడవై+తన+నెయ్యము+తియ్యము+ఎల్ల+నీవు+అక్కఱ+సేయకున్న= నిద్రాదేవతకు+వశమై+తన+మంచి+చెడు+అంత+నీవు+శ్రద్ధ+చేయకుండుటచే, నిశ+అంతయు=రాత్రి+ అంతా, ఖండితనాయికాకృతిన్=భర్త వేరొకతెతోఉన్నట్లు శంకించిన నాయికవలె, స్రుక్కిన+లక్ష్మి=దుఃఖించు +(రాజ్య) లక్ష్మికి, వెడ+వినోదము+ఎవండు+ఘటించె=అల్పముగానైనా+సోదరునిగా దుఖఃనివారణ+ ఎవడైతే+చేసెనో, ఇప్పుడు+ఆ+చుక్కలఱేడు=తెల్లవారుటచే+ఆ+చంద్రుడు, నీ+వదన+శోభకు=నీ+ముఖ+ కాంతినిచూచి, బాసె=వెళ్ళి, దిక్+అంత+లంబియై=పడమటి దిక్కు+చివర(కొండపై)+వ్రేలాడినాడు, (సారము: లక్ష్మికి"చంద్ర, అరవింద,రాజవదనములు" స్థానములు.నీవు నిద్రాదేవతతో ఉండుటచే లక్ష్మి ఖండిత నాయికయై దుఃఖించి, తన సోదరుడు చంద్రుని వద్దకు ఊరట కోసమై చేరను. కాని ఆచంద్రుడు ఇప్పుడు నీ ముఖ సౌందర్యమును చూచి పడమటి కొండలచేరెను. కావున లేచి నీ వదనములోలక్ష్మికి స్థానము ఇవ్వవలసి ఉన్నది.)

మ. నిరవద్యద్యుతియోగపద్యముగ ఉన్మేషించి సద్యః పర
స్పరసాదృశ్యము, నొందుగాక ఇక, తత్పద్మాప్రతిస్వీకృతిన్,
తరళస్నిగ్ధకనీనికాచలదుపాంతంబైన నీ నేత్రమున్
చరదభ్యంతరచంచరీకము సరోజంబున్, సరోజేక్షణా! 72

సరోజేక్షణా!=పద్మములవంటి కండ్లు కలవాడా, తరళ+స్నిగ్ధ+కనీనిక+ఆచలత్+ఉపాంతంబైన+నీ+నేత్రమున్ =ప్రకాశించు+చిక్కని+కంటి నల్లగ్రుడ్లు+బాగాకదులు+స్వభావముకల+నీ+కండ్లు, చరత్+అభ్యంతర+చంచరీ కము+సరోజంబున్=లోపల+కదలు+నల్లనితుమ్మెదలుగల+పద్మమును, సద్యః+పరస్పర+సాదృశ్యమును +ఒందున్+కాక+ఇక=వెంటనే+ఒండొరుల+పోలికను+పొందిరి+కాని+ఇటుపైన, తత్+పద్మా+ప్రతి+ స్వీకృతిన్=ఆ+కనులు తెరచి వికసించిన ఆ+పద్మముతో+సమానత+చేసికొని, నిరవద్య+ద్యుతి+యోగ+ పద్యముగ+ఉన్మేషించి=ఎడతెగని+కాంతి+ప్రాప్తిచే+పట్టుదలతో+వికసించవలెను, భావము: కదలుచున్న నల్లగ్రుడ్లు గల నేత్రములు, చలించుచున్న తుమ్మెదలు కల పద్మములు ఇప్పటికే సామ్యమైనవి. తెల్లవారుటచే కమలములు వికసించుచున్నవి. పద్మముల వలే నీవుమేలుకొనుము.

చ. తొడిమలనుండి జార్చి ఎలదోటల పువ్వులు మ్రుచ్చులించు మే
ల్పడి అరుణాంశుభిన్ననవపద్మవనంబుల పొత్తుసేయు తా

పడయ దలంచెనో? ఉదయవాయువు నీ ముఖమారుతంబునం
దడరు నిసర్గసౌరభము నన్యగుణంబుల మేళనంబునన్. 73

ఉదయ+వాయువు=ప్రాతఃకాలపు గాలి, నీ+ముఖ+మారుతంబునందు+అడరు+నిసర్గ+సౌరభమును= నీ+ముఖ+నిశ్వాస+వాయువు అందు+వ్యాపించు+స్వాభావిక+పరిమళము, తా+పడయ+తలంచెనో= తనవద్ద లేక తానే స్వయముగా+పొంద+తలచినదోఅనునట్లు, తొడిమలనుండి+జార్చి+ఎల+తోటల+ పువ్వులు+మ్రుచ్చలించు=బాగా వికసించుటచే వాటి కాండము నుండి+సడలిన+లేత+తోటలోని చెట్ల+ పువ్వులసౌరభము+దొంగిలించును, మేల్పడి+అరుణ+అంశు+భిన్న+నవ+పద్మ+వనంబుల+పొత్తుసేయు =మోహపడి+సూర్య+కిరణములచే+వికసించిన+క్రొత్త+తామరల+గుంపుతో+సంబంధము చేయుచున్నది, అన్య+గుణంబుల+మేళనంబునన్=(పై) ఇతర+గుణములతో+జతపఱచుచూ, భావము:ప్రాతఃకాల వాయువు నీనిశ్వాసవాయువు సౌరభము లేకపోవుటచే, దాని సమానత పొందవలెనను కాంక్షచే, పూవులనుండి దొంగలించి కమలముల పొత్తుచేసి పోలికకు ప్రయత్నము చేయుచున్నది. పూలురాలుచున్నవి. తామరల వలెనిద్ర మేలుకొనుము.

తే. పాటలోదరతరుపల్లవముల బడిన/హారగుళికావిశుద్ధనీహారవారి
చాల తులకించె, నీరదచ్ఛదముమీది/దశనరుచితోడి లీలాస్మితంబు, లీల. 74

పాటల+ఉదర+తరు+పల్లవములన్+పడిన=ఎఱ్ఱటి+లోపలిభాగముకల+చెట్ల+చిగుళ్ళమీద+పడిన, హార+ గుళికా+విశుద్ధ+నీహార+వారి=దండలోని+ముత్యాలవలె+నిర్మలమైన+మంచు+నీటిబొట్లు, నీ+ రదచ్ఛదము+మీది+దశన+రుచి+తోడి+లీలాస్మితంబు+లీల=నీ+పెదవి+మీది+పళ్ళ+కాంతి+తోడి+ చిరునవ్వు+వలె,(ఎఱ్ఱటి చిగురాకురంగు నీపెదవులట్లు, స్వచ్ఛమైనబొట్లు నీపండ్లు చిరునవ్వువలే ఉండెను), చాల+తులకించె=బాగా+ప్రాకాసించెను,

శా. ఎందాకన్ పొడసూపకుండె రవి భూయిష్ఠప్రతాపాఢ్యుడై,
అందాకన్, గెడపెం దమంబు నరుణం, డా మీద శాంతించె దాన్,
ముందంజై బవరాన నీవు పటుదోర్భూతిన్ ప్రదర్శింపగా
మ్రందింపం బనియే? స్వయంబుగ రిపువ్రాతంబు మీ అయ్యకున్. 75

ఎందాకన్+పొడసూపక+ఉండె+రవి+భూయిష్ఠ+ప్రతాప+ఆఢ్యుడై=ఎంతవరకు+కనబడుక+ఉన్నాడో+ సూర్యుడు+మిక్కుటమైన+కాంతి+సంపన్నుడై, అందాకన్+కెడపెంన్+తమంబున్+అరుణుండు+ముందంజై =అంతవరకు+పోగొట్టె+చీకటిని+అరుణుడు(సూర్యుని తొలిఎఱ్ఱని కాంతి)+ముందడుగువేసి, బవరాన=

యుద్ధమున, పటు+దోర్+భూతిన్+ప్రదర్శింపగా=అధిక+భుజ+శక్తి+చూపించవలసి ఉండగా, మ్రందింపన్+పనియే=చొరవలేకుండుట+ప్రయోజనమా?
(సూర్యుడు రాకముందె అరుణుడు చీకట్లు తొలగించును. నీవు నీతండ్రికి శ్రమపెట్టక శత్రువుల పరిమార్చ వలసి ఉండగా నిద్ర ఏల?)

మ. ఇరుపక్షంబుల నిద్ర దీర్చికొని గండేందేందిరశ్రేణి తో
మొరయున్ సంకెల లీడ్చుకొంచు శయనంబుల్ వీడె, నీ ఏనుగుల్,
తరుణాదిత్యనవాంశురంజితములై తళ్కొత్తె కందర్పసుం
దర! కేళీదళితాద్రిధాతుతటముల్ నా చూడు, తద్దంతముల్. 76

కందర్పసుందర!=మన్మధునివలె అందగాడా!, ఇరు+పక్షంబుల=రెండు+ప్రక్కలదొర్లి, గండ+ఇందేందిర+శ్రేణితో=మదముకోసముహ్రాలిన గండు+తుమ్మెదల+వరుసతో, మొరయున్+సంకెలలు ఈడ్చుకొనుచు =మ్రోగుచున్న+కట్టుగొలుసులు+లాగుకుంటూ, శయనంబుల్+వీడె=వాటివాటి పడకలను+విడచినవి, తరుణ+ఆదిత్య+నవ+అంశు+రంజితములై+తళ్కొత్తె=బాల+సూర్యుని+తొలి+కిరణములచే+రంగులు వేయబడినట్లు+మెరసెను, కేళీ+దళిత+అద్రి+ధాతు+తటముల్+నా+చూడు=క్రీడాగా+భేదింపబడిన+కొండయొక్క+గైరికాది ధాతువులుకల+ప్రదేశములా+అనునట్లుగాఉన్నవి+చూడుము, తత్+దంతముల్= ఆఏనుగుల+దంతములు,

తే. నిడుదడేరాలలోన బంధితము లైన/నీ వనాయుజహయములు నిదుర లేచి,
పలపలని నోటి యావిరి మలినపఱచె/కట్టెదుటి సైంధవోపలఖండములను. 77

నిడుద=పెడల్పాటి, బంధితములైన=కట్టబడిన, వనాయుజ+హయములు=పారశిక+గుఱ్ఱములు, పలపలని =తెల్లవారుటకుఅనుకరణ, సైంధవ+ఉపల+ఖండములను=సైధవ+(ఉప్పు)ఱాల+ముక్కలను, నోటి+ఆవిరి =నోటి+వేడిమిచే, మలిన పఱచె=నల్లబడజేసెను,
(ఉదయపు దాణాలోని తెల్లటి ఉప్పు నోటి ఉష్ణముచే నల్లబడినది)

క. వసివాళ్ళువాడి పూజా/ప్రసూనదామములు విరళరచనములయ్యెన్,
పసచెడె వెలవెల నగుచున్/ప్రాసితార్చిర్మండలమ్ము లగు దీపంబుల్. 78

వసివాళ్ళువాడి=మిక్కిలివాడి, ప్రసూన+దామములు=పూల+దండలు, విరళ+రచనలయ్యెన్=వదులైన+నిర్మాణముకలపైనవిఅయినవి(మాలలు విడినవి), పసచెడె+వెలవెల=రూపుమాసి+వివర్ణమై, ప్రాసిత+అర్చి+మండలమ్ములగు+దీపంబుల్=తగ్గిన+కాంతి+ వలయముకలపైనవి+దీపములు,

క. మేల్కొలుపు పాడు మా యీ/పల్కులు విని, వింటె! కనకపంజరమున రా
చిల్క రఘువీర! ముద్దులు/కుల్కుచు మార్వల్కి, మేలుకొలిపెడు నిన్నున్." 79

మారు+వల్కి=పైతాళికుల మాటలుఅనుకరించిపలికి, వింటే=వినుచున్నావా!

మ. అని పైతాళికు లింపుగా చతురవాక్యప్రౌఢి మెల్కొల్ప అ
ల్లన సుప్తోత్థితుడై రఘూద్వహుడు తల్పంబున్ విసర్జించె మో
హనశైలిన్, మదనిర్భరధ్వనుల, రాయంచల్ ప్రబోధింప మే
ల్కని దిఙ్నాగము, సుప్రతీక, మల గంగాసైకతంబుం బలెన్. 80

చతుర+వాక్య+ప్రౌఢి=నేర్పైన+పాటల+సమర్థతతో, అల్లన+సుప్త+ఉత్థితుడై=మెల్లగా+నిద్రనుండి+లేచిన వాడై, మోహనశైలిన్=మనోహరముగా, మద+నిర్భర+ధ్వనుల=అమితసంతోషము+నిండిన+అరపులతో, రాయంచల్+ప్రబోధింప+మేల్కని=రాజహంసలు+లేపిన+లేచిన, దిఙ్నాగముసుప్రతీకము=సుప్రతీకము అను ఈశాన్యదిగ్గజము-కైలాస వాసము కల ఏనుగు, అల+గంగా+సైకతంబుం+వలెన్=ఆ+గంగానది+ ఇసుక దిబ్బలపైనుండిలేచు+నట్లుగా

తరళం.దినముఖోచితకృత్యముల్ తగదీర్చి ఆదిమరాఘువుం
డనితర ప్రతిపన్నవిభ్రము, డత్యపూర్వవిలాసినీ
మనసిజాతు, డభిజ్ఞయోజితమంజుమంగళవేషుడై
చనె, స్వయంవరణోచితప్రవిశాలమంటపసీమకున్. 81

తగన్+తీర్చి=యుక్తముగా+నెరవేర్చి, ఆదిమ+రాఘువుండు=రఘువు కొడుకుగా రఘువంశపు రాజులలో మొదటివాడైన అజుడు, అనితర+ప్రతిపన్న+విభ్రముడు=ఇతరులకులభ్యముకానట్లు+పొందిన+విలాసము కలవాడు, అతి+అపూర్వ+విలాసినీ+మనసిజాతుడు=ఎక్కువ+అపురూపమైన+స్త్రీలకు+మన్మధునివంటి వాడు, అభిజ్ఞ+ఓజిత+మంజు+మంగళ+వేషుడై=గుర్తించుకోదగ్గట్టుగా+సమకూర్చబడిన+మనోజ్ఞమైన +శుభ+వస్త్రభూషణఅలంకారుడై,

# షష్ఠ సర్గము - స్వయంవరము

మ. కనియెన్ కోసలరాజసూను డచటన్ కాలోచితా క్లప్తశో
భనసేపథ్యవిరాజమానుల, మహాభద్రాసనాసీనులన్,
వనజాప్తద్విజరాట్కులీనుల, మరుద్వైమానికప్రఖ్య మో
హనసౌభాగ్యనిధానులన్, సకలదేశాయాతధాత్రీనులన్. 1

కాల+ఉచిత+క్లప్త=స్వయంవరసమయమునకు+తగునట్లుగా+చక్కగాతయారైన, శోభన+నేపథ్య+విరాజమానుల=అందమైన+వస్త్రాద్యలంకారములుతో+ప్రాకాశించు వారిని, మహా+భద్ర+ఆసన+ఆసీనులన్=గొప్ప+రాజోచితమైన+పీఠములపై+కూర్చున్న వారిని, వనజాప్త+ద్విజరాట్+కులీనుల=సూర్య+చంద్ర+కుల శ్రేష్ఠుల, మరుత్+వైమానిక+ప్రఖ్య+మోహన+సౌభాగ్య+నిధానులన్=విమానములపైసంచరించు+దేవతలతో+పోలిన+ మనోహరమైన+వైభవము+కలిగినవారిని, సకల+దేశ+ఆయాత+ధాత్రీనులన్=అన్ని+దేశముల నుండి+వచ్చిన+రాజలను,

తే. కాంచి, మణిపట్టభంగమార్గమున నెక్కె/రాజపురుషప్రదిష్ట పర్యంకతలము,
గండుమిగిలి, శిలావిభంగముల వెంట/కొండ కొన కెక్కు సింగపు గొదమ, వోలె 2

మణిపట్టభంగ+మార్గము=మణులచేసూచింపబడిన+దారి, ప్రదిష్టము=ప్రత్యేకముగా ఉద్దేశించబడ్డ, పర్యంక+తలము=మంచెలుంచిన+ప్రదేశము, గండుమిగిలి=విజృంభించి, శిలా+విభంగముల=రాతి+మెట్ల, సింగపు+కొదమ=సింహపు+పిల్ల,

క. సురుచిరవరేణ్య వర్ణా/స్తరణాన్విత రత్నపీఠసంస్థితుడై, తా
సరితూగె రాఘువుం డల/శరజునితో బర్హిపృష్ఠసంశ్రయు, తోడన్. 3

సురుచిర+వరేణ్య=రమణీయమై+ప్రశస్తమైన, వర్ణ+ఆస్తరణ+అన్విత=రంగుల+చిత్రకంబళితో+కూడిన, రత్న+పీఠ+సంస్థితుడై=రత్నములుపొదగిన+ఆసనముపై+కూచున్న వాడై, బర్హి+పృష్ఠ+సంశ్రయు=రంగురంగుల ఈకలుకలనెమలి+వీపుమీద+ఉండు, శరజ=కుమారస్వామి, సరితూగె=సమానుడై,

ఉ. వందురి పేడికొన్న రతిపై కరుణించిన పార్వతీశుచే
ముందటి రూపమున్ తిరిగి పొందిన మన్మథు బోని వాని యా
అందముచందమున్ కనిన యంతనె, ఇందుమతీ వధూటిపై,
అందని మ్రాని పండని, నిరాశలు చెందిరి, రాజు లందఱున్. 4

వందురి=దుఃఖపడి, వధూటి=కన్య-ఇందుమతి,

మ. ప్రముఖోదాత్తపరిష్క్రియాసుభగులై, భద్రాసనాసీనులై
కమనీయస్థితినున్న యా దొరలలో కాకుత్ స్థు డొక్కండె నై
జమహస్సంపద దారకాగణములో జాబిల్లిలీలన్ నిలిం
పమహీజాంతరపారిజాతమువలెన్, భాసిల్లె, నెంతేనియున్. 5

ప్రముఖ+ఉదాత్త+పరిష్క్రియా+సుభగులై=మాన్యులై+ఉజ్జ్వల+అలంకారములతో+అందగించినవారై, భద్రాసనము=రాజులు కూర్చుండు పీఠము, కమనీయ+స్థితినున్న=మనోహరముగా+కూర్చున్న, నైజ+మహస్+సంపద=తన స్వభావ+తేజ+సమృద్ధిచే, తారకా గణములో=నక్షత్రములలో, నిలింప+మహీజ+అంతర+పారిజాతము+వలెన్=దేవతా+వృక్షముల+నడుమ+పారిజాతము+వలె, భాసిల్లె-ప్రకాశించెను, ఎంతేనియున్=మిక్కిలిగా,

ఉ. మక్కువ పెక్కువన్, రఘుకుమారుని మీదనె వ్రాలెనయ్యెడన్,
తక్కిన రాజులన్ దెగడి, తత్పురవాసుల చూపులెల్ల, పూ
మొక్కలనుండి పైదొలగి, మొత్తముగా చని తేటిపిండు మ
త్తెక్కి మెలంగు వన్యకలభేంద్రముపై నెగబడ్డ తీరునన్ 6

మక్కువ+పెక్కువన్=కూరిమి+అధికమవగా, తెగడి=ఉపేక్షించి, తేటి+పిండు=తుమ్మెద+సమూహము, పై+తొలగి=విడచిపెట్టి, వన్య+కలభ+ఇంద్రము=అడవి+ఏనుగు+శ్రేష్ఠము, మెలంగు=సంచరించు, ఎగబడ్డ=ఎగపడు, (తుమ్మెదలు పూలను విడచి ఏనుగు మదమునకై మూగును)

సీ. వైజయంతము లంటి వలచె చామరవాత/ధూతమై అధివాసధూపవితతి,
మృదువుగా వీచి, తెమ్మరలు గండూషించె/రాడంగరాగసౌరభ్యగరిమ,
మనుజేంద్రమకుటాగ్ర మణిరశ్మిరింఛోళి/శబలితం బయ్యెప్రాసాదతలము,
నగరోపవనకేకినటనాసమున్మేష/జనకమై తూర్యనిస్వనము మ్రోసె,
పుష్పవద్వంశ్యులైన, భూభుజుల బొగడు/వందిజనచాటువులు చెలువంది మొరయ,

సదనమెల్ల విధూదయసమయ ఘూర్ణి/తోదరాశికి దగ బౌనరుక్త మయ్యె 7

వైజయంతములు+అంటి=జెండాలు+తాకి(అంత ఎత్తువరకు), వలచె=వాసన కొట్టె, చామర+వాత+ధూతమై =వింజామరల+గాలిచేత+ఎగరగొట్టబడినవై, అధివాస+ధూప+వితతి=గృహములందలి+ధూపముల+వ్యాప్తి, తెమ్మెర=చల్లగాలి, గండూషించె=పుక్కిలించె-వెదజల్లె, రాట్+అంగరాగ=రాజులుపూసు కొనిన+గంధాదుల యొక్క, సౌరభ్య+గరిమ=వాసనల+శ్రేష్ఠత, మనుజ ఇంద్ర+మకుట+అగ్ర=గొప్పరాజుల+కిరీట+పైభాగపు, మణి+రశ్మి+రింఛోళి+శబళితం బయ్యె=మణుల+కాంతుల+సమూహముచే+చిత్ర వర్ణములు కలదైనది, ప్రాసాద+తలము=కూర్చుండుటకై ఏర్పఱచిన ఉన్నత రంగ+ప్రదేశము, నగర+ఉపవన=పట్టణపు+ఉద్యాన ముల, కేకి+నటనా=నెమలి+నాట్యమును, సమ+ఉన్మేష+జనకము=బాగా+మేలు కొలుపు+కలిగించునదై, తూర్య+నిస్వనము+మోసె=వాద్యముల+స్వరము+మ్రోగె, పుష్పవత్+వంశ్యులైన+భూభుజుల=సూర్యచంద్ర +వంశములవారైన+రాజుల, వందిజన=స్తోత్రపాఠము వల్లించు, చాటువులు=రాజులకు ప్రియమైనమాటలు, చెలువంది+మొరయ=అందముగా+చాటింప, విధు+ఉదయ+సమయ=చంద్రుడు+ఉదయించు+సమయ మున, ఘూర్ణిత+ఉదరాశికిన్+తగన్=తిరుగుడుపడు-ఎగిరిపడు+సముద్రమునకు+ వలె, పౌనరుక్తము= మరల మరలచెప్పదగ్గది.

మ. పరివారం బిరువంకలన్ బలసి కొల్వం, జేటికానీతయై,
నరవాహ్యంబగు నిద్దపుం బసిడి మేనా మీద విచ్చేసి భా
స్వర మంచాంతర రాజమార్గమున నాస్థానంబు జొచ్చెం, బతిం
వర, వైదర్భి, మధూకమాలిక కరాబ్జాతంబు భూషింపగన్. 8

బలసి=పరివేష్టించి, కొల్వం=సేవింప, చేటిక+ఆనీతయై=చెలులచే+తీసుకొనిరాబడినదై, నరవాహ్యంబగు= మనుషులు మోసిన, నిద్దంపు=ప్రకాశము కల, మేనా=పల్లకి, భాస్వర=ప్రకాశవంతమైన, మంచ+అంతర= మంచెల+మధ్యనున్న, ఆస్థానంబు=రాజ్యసభను, పతింవర=పతినికోరినదైన, మధూక+మాలిక=ఇప్పపూల +దండ, కర+అబ్జాతంబు=కర+కమలముల, భూషింపగన్=అలంకరించి ఉండగా,

సీ. ధగధగాయిత తటిద్దామవేష్టితయైన/రమణీయ పర్జన్యరమయనంగ,
నిర్భరస్నిగ్ధ చాంద్రీవికాసితయైన/సరసశారద విభావరియనంగ,
ప్రత్యగ్రపల్లవప్రచయపేశలయైన/తరుణరసాలవల్లరి యనంగ,
లలితబాలాతపాప్లవనరంజితయైన/కనదౌషసికసరోజిని యనంగ,
అలఘు కల్యాణ నేపథ్య విలసనమున/మూర్తి యుజ్జ్వలతాస్ఫూర్తి మూరిబోవ,

పడతి, యడుగిడ, వింజమాకిడిన పగిది/సద్దుమడగె, స్వయంవరాస్థాన సీమ. 9

తటిత్+దామ+వేష్టితయైన=మెఱపు+కాంతి+చుట్టుకొనిన, పర్జన్య+రమ=మెఱపు+లక్ష్మి, నిర్భర+స్నిగ్ధ+చాంద్రీ+వికాసితయైన+సరస+శారద+విభావరి=అతిశయించు+చిక్కని+వెన్నెలచే+ప్రకాశించు+మనోహరమైన+శరత్కాల+రాత్రి, ప్రత్యగ్ర+పల్లవ+ప్రచయ+పేశలయైన+తరుణ+రసాల+వల్లరి=నూతన+చిగురుల+వృద్ధిచే+మృదువైన+క్రొత్త+ద్రాక్ష+తీగ, లలిత+బాల+ఆతప+ఆప్లవన+రంజితయైన+కనత్+ఔషసిక+సరోజిని=మనోహరమైన+లేత+యెండలో+మునుగుటచే+సంతోషించి+ప్రకాశమానమైన+ప్రాతః కాలపు+తామర, అలఘు+కల్యాణ+నేపథ్య+విలసనమున=గొప్ప+వివాహసంధర్భ+అలంకార+ప్రకాశమున, మూర్తి+ఉజ్జ్వలతా+స్ఫూర్తి+మూరిబోవ=రూపము+వెలుగుల+తళకు+అతిశయింప, వింజమ+ఆకు ఇడిన+పగిది=విశ్మయము+అంకురించిన+అట్లు, సద్దుమడగె=నిశ్చబ్దమైనది,

శా. ఆ నిధ్యానశతైకలక్ష్యను, సుకన్యారూపమాధుర్య లీ
లానందామృతశేవధిం, గనకగర్భానూననిర్మాణ వి
ద్యానైపుణ్యరహస్యభూమి, వికచాబ్జాక్షిన్, వినిష్కంపశం
పానైగన్నిగగాత్రవల్లి, గని, విభ్రాంతాత్ములై, రందఱున్. 10

నిధ్యాన శతైక+లక్ష్యను=వందలకొద్ది చూపుల+లక్ష్యమైన, సు+కన్యా+రూప=మంచి+కన్య+రూపములోనున్న, మాధుర్య+లీల+ఆనంద+అమృత+శేవధిం=ఆకర్షణ+విలాసము+సంతోషము+అనెడు రసములకు+నిధిని, కనకగర్భ+అనూన+నిర్మాణ+విద్యా+నైపుణ్య+రహస్య+భూమి=బ్రహ్మయొక్క+పూర్ణ+సృష్టి+చాతుర్యము+దాచ(ఉంచ)బడిన+స్థానమును, వికచ+అబ్జ+అక్షిన్=వికసించిన+పద్మముల వంటి+కన్నులు కలదానిని. వినిష్కంప+శంపా+నైగన్నిగ+గాత్ర+వల్లి=అలతిగాకదలు+మెఱపువలె+నిగనిగలాడు+తనువను+తీగని,

తే. వధువు మహనీయలావణ్యమధువు నృపులు/కొసరి కుత్తుకబంటిగా క్రోలుచుండ
వ్రాలె, నంతఃకరణములు బాలమీద/దేహములు మాత్రముండె, గద్దియలనంటి. 11

మహనీయ+లావణ్య+మధువు=గొప్ప+సౌందర్యమనెడు+తేనెను, కొసరి+కుత్తుకబంటి= కోరికతో+గొంతు వరకు, అంతఃకరణములు=మనస్సులు,

తే. లేమపట్ల అభివ్యక్తకాములైన/దొరల కెల్ల తత్ప్రణయాగ్రదూతికలుగ,
రకరకంబుల శృంగార వికృతు లొదవె/మ్రాకులకు, లేజివుళ్ళ చెల్వములు వోలె. 12

లేమ=స్త్రీ, అభివ్యక్త+కాములు=ప్రకటితమైన+వాంఛకలవారు, తత్+ప్రణయ+అగ్ర+దూతికలుగ=వారి+ప్రణయవాంఛతెలుపు+ప్రధమ+దూతిక(ఆడుదూత)వలె, వికృతులు=(శృంగార)చేష్టలు, ఒదవె=పుట్టె, మ్రాకు=చెట్టు, లే+చివుళ్ళ=లేత+చిగురుల, చెల్వములు+వోలె=సొగసులు+అన్నట్లు,

తే. బాలవీక్షింప,నాళము గేల బట్టి/కదలు రేకులు నోకి, తుమ్మెదలు చెదర,

తళుకు బుప్పొళ్ళు లోన మండలము గట్ట/త్రిప్పె, విరిదమ్మి ఒప్పులకుప్పయొకడు 13

వీక్షింప=తన్ను చూడ, నాళమున్=పుష్పపు కాడను, కేలన్+పట్టి=చేతితో+పట్టికొని, కదలు+రేకులు+నోకి=చలించున్న+రెమ్మల+తాకగా, తుమ్మెదలు+చెదర=దానిలోనితుమ్మదలు+ఎగురు చుండగా, మండలమున్+కట్ట+త్రిప్పె=వలయాకారముగా+తీర్చి+తిప్పుచుండెను, విరి+తమ్మి=విరసిన+తామరను, ఒప్పులకుప్ప=అందగాడు,

సూచన:12పద్యములో శృంగార వికృతులు పుట్టాయని చెప్పి, వాటిని చెప్పుబూనె. సాధారణముగా స్త్రీలకు వాడు పదాలు(నింద్యార్థములో) ఏడు రాజులకు వాడుట: "ఒప్పులకుప్ప" "సొబగుడు" "విలాసి""ఒయారి""యౌవనవిలాసి" "వన్నెకాడు" "సరసుడు" ఎగతాళి ధ్వనించును. వారిని సహేతుకంగా ఇందుమతి "త్రోసిరాజు" అనుట 18 వ వచనము.

తే. మూపునను జాటి తన బాహుపురికి చివర/అత్తుకొనియున్న, కండువా నెత్తి మగుడ

ఉనిచె దాని యథాస్థానమున, లతాంగి/జుచి, సాచీకృతాస్యుడై, సొబగు, డొకడు. 14

మూపునను=భుజముపైనుండి, బాహుపురి=భుజకీర్తి, అత్తుకొనియున్న=అంటుకొనిఉన్న, మగుడ=మరల, ఉనిచె=ఉంచె, సాచీకృత+ఆస్యుడై=అడ్డముగాత్రిప్పుచుండిన+ముఖముకలవాడై, సొబగుడు=అందగాడు,

సీ. అపరంజి పీటపై ఆకుంచితంబైన/కాలిబొట్టనవ్రేలితో లిఖించె,

ఈషదావర్జితదృక్కాంతియై నఖ/ద్యుతు లడ్డముగ బర్వ, ఒక విలాసి,

డాచేయి కనకపీఠము సగంబున మోపి/ఆరీతి అధికోన్నతాంసు డగుచు,

సకునితో మాటాడసాగె వివర్తిత/త్రికభిన్నహారుడై, ఒక యొయారి,

తలిరుటోడులు చెవుల కమ్మలుగ వాడు/తెలిమొగలిరేకు గొని చీల్చె, వలపులాడి,

బొంకపు బిఋందుపై నెలవంక లొత్తు/వాడికొనగోళ్ళ, నొకడు, యౌవనవిలాసి. 15

అపరంజి=బంగారపు, ఆకుంచితంబైన=వంచబడిన, లిఖించె=పీటపై వ్రాసె, ఈషత్+ఆవర్జిత+దృక్+కాంతియై=కొంచము+వంచబడిన+కన్నుల+సోయగముతో, నఖ+ద్యుతి=గోళ్ళ+కాంతి, అడ్డముగ+పర్వ=మధ్య+

విస్తరింప, డాచేయి=ఏడమచేయి, ఆరీతి+అధిక+ఉన్నత+అంసుడు+అగుచు=ఆవిధంగా+మిక్కిలి+ఎత్తైన+ భుజము శిరస్సు+కలవాడై, సకునితో=సచివునితో,
వివర్తిత+త్రిక+భిన్న+హారుడై=మెలికలుతిరిగి+మూడుగా +పేఋపడిన+హారముకలవాడై, తలిరు బోడులు=మనోహరమైన స్త్రీలు, తెలి=తెల్లని, ఓొంకపు+పిఋందపై= ఓొందికైన+కటిపై, నెలవంకలు+ఒత్తు=చంద్రవంక గుర్తులు+పెట్టు,

క. అరవిందాతామ్రము నిజ/కరతలమున బట్టి వన్నెకాడొకడు, విని
ర్భరలీల పైచె రవయుం/గరముల జిగి నెనయు పాచికలు, పలక పయిన్. 16

అరవింద+ఆతామ్రము=తామరవలె+అంతటాఎఱ్ఱగానున్న, వినిర్భర+లీల=అధికభారము కలదాని+ విధముగా, రవ=వజ్రపు, జిగిన్+ఎనయు=కాంతికి+సరిపోలు, పలక=జూదమాడుబల్ల,

తే. ఓొందుగ స్వసన్నివేశమునందె యున్న/స్థానమున నుండి సడలిన దాని బోలె,
రత్నరుచిపూరితాంగుళిరంధ్రమైన/కరమున గిరీటమును దిద్దె సరసు డొకడు 17

ఓొందుగ+స్వ+సన్నివేశము+నందె+ఉన్న=ఓొందికగా+తన+యథాస్థానము+లోనే+ఉన్న, రత్న+రుచి+ పూరిత+అంగుళి+రంధ్రమైన=రత్నముల+కాంతిచే+నిండిన+వ్రేళ్ళ+సందులుగల, కిరీటమును+దిద్దె =కిరీటమును+సద్దుకొనెను,

వ. ఇటుల, నిజభావవ్యక్తీకరణమునకు, దుర్విలాసములు కావించిన, ఆ యా రాజన్యులలో క్రమంబున, కరస్థలీలారవిందమువలె నీవు నన్ను ద్రిప్పుకొన వచ్చునని నిజాభిప్రాయమును సూచించినవానిని, హస్తఘూర్ణకుడు, కావున అవలక్షణుడు ఓొమ్మనియు; ఉత్తరీయమును వలె, నిన్ను మద్భుజాంతరమున హత్తుకొన వలతు ననిన వానిని, గోపనీయమైన యేదో ఒక అంగకమును మఋగుపరుచుటకె వాడట్లు కప్పు కొనియుండవచ్చు ననియును; పాదాంగుళముల ఆకుంచన వ్యాజమున దనసరసకువిచ్చేయవేడినవానిని, భూవిలేఖుడు కావున, లక్ష్మీవినాశ కారకు డనియును; నా వామాంకము నధివసించిన నీతోడ నిట్లు మధుర సల్లాపరసము జూఋగొననిమ్మని అర్థించినవానిని, పరుని గని పరాఙ్ముఖుడును సంభాషణా ప్రియుడును గావున, కార్యకర్త కానేరడని యును; నీ నితంబతలముననిట్లు నఖక్షతములు నిక్షేపింప నువ్విళూరుచుంటినని సూచించిన వానిని, పత్రపాటకుడు గావున తృణచ్ఛేదకునివలె దుర్లక్షణుడనియును; నీతోడ నెత్తమాడ సుమాళమున నున్నవాడ ననినవానిని, కితవవ్యవసాయుడు కావున కాపురుషు డనియును; మకుటము మాడ్కి మస్తకము

నధిష్ఠించినను మాకు నీవు భారమవు కావనిన వానిని, నెత్తిన చేతులు పెట్టుకొన్న వాడు గావున, నిర్భాగ్యుడనియును, ఇందుమతి ఏవగించుకొనియె. 18

నిజ+భావ+వ్యక్తీకరణకు=తమతమ+భావములు+తెలుపుటకు, దుర్+విలాసములు=వికృత+చేష్టలు, క్రమంబున=వరుసగా, కరస్థ+లీల+అరవిందము+వలె=చేతిలోఉన్న+విలాసపు+ఎఱ్ఱ కలువను+వలె, హస్త+ఘూర్ణకుడు=చేతులను+ఊరకే త్రిప్పువాడు, అవ+లక్షణుడు=చెడు+అలవాటు కలవాడు, మత్+భుజ+అంతరమున=నా+భుజముల+మధ్య, వలతి=కాంక్షింతును, గోపనీయమైన=మరుగుపఱచదగ్గ, అంగకము=అవయవము, ఆకుంచన+వ్యాజమున=వంచు+మిషతో, సరసకు=వద్దకు, విచ్చేయ+వేడిన వానిని=రమ్మని+కొరినవానిని, భూ+విలేఖుడు=నేలను+గీఱువాడు, వామ+అంకమున+అధివసించిన=ఎడమ+తోడపై+ఎక్కికూర్చున్న, చూఱగొను=కొల్లగొట్ట, పరుని గని=ఇతరులను చూసి, పరాఙ్ముఖుడు=ముఖం తిప్పుకొనేవాడని, కార్యకర్త=పని సాధించువాడు, నితంబ+తలము=పిఱుదు+ప్రదేశమున, నఖ+క్షతములు+నిక్షేపింప+ఉవ్విళ్ళూరు=గోటి+గాయముల+పాత-పెట్ట+తహతహపడు, పత్ర+పాటకుడు=పత్రములను+చీల్చువాడు, తృణ+చ్ఛేదకుడు=గడ్డి+చీల్చువాడు, నెత్తమాడ=జూదమాడ, సుమాళమున=సంతోషముతోకలుగు అత్యుత్సాహముతో, కితవ+వ్యవసాయుడు=మోసపు+ప్రయత్నుడు, కాపురుషుడు=కుత్సితుడు, మస్తకము=తల, అధిష్టించి=ఎక్కికూర్చున్న,

తే. చాన నటు చూచి, మరి చూడబోని వాడు/మేను పులకల బలుప్రోవు కాని వాడు,
వెడవిలుతు చేతి విరియేటు వడని వాడు/పందెమున కైన గానరా డందొకండు. 19

చాన=ఇంతి, మరి=మళ్ళీ, బలు+ప్రోవు=అనేక+గుంపులు, వెడవిలుతు=మన్మధుని, విరి+ఏటు+పడని=పూల+బాణము+పడని, ఒకండు=ఒకడైనా,

వ. పదంబడి స్వయంవరసమాగతులైన కువలయేశ్వరుల కులశీలవృత్తముల పరిజ్ఞానమున మిన్నయు, ఇంగితాకారచేష్టావివేకవిశారదయు, నర్మోక్తినిపుణయు, పుంవత్ప్రగల్భయు, శుద్ధాంతప్రతిహారిణియు, అగు సునందయను ననబోడి, అవ్వరారోహ నొక విశాంపతి సన్నికర్షమునకు గొనివచ్చి చూపి, వాని నిట్లు మధురాక్షరవిన్యాసమున ప్రశంసించెను. 20

పదంబడి=తరువాత, సమాగతులైన=దగ్గరకువచ్చిన, కువలయేశ్వరుల=రాజుల, వృత్తము=విషయము, పరిజ్ఞానమున=పూర్తిగాతెలియుటలో, మిన్న=శ్రేష్ట , ఇంగిత+ఆకార+చేష్టా+వివేక+విశారద=కదలికలు+రూపము+నడవడి+విధానముల గుణముల నిర్ధారించుకౌశలములో+మిన్న, నర్మ+ఉక్తి+నిపుణ=మేలపు+మాటల+నేర్పరి, పుంవత్+ప్రగల్భ=పురుషునివలేదిట్టయైన+వాగ్మి(మాటలు నేర్చినది), శుద్ధాంత+

ప్రతిహారిణి=అంతఃపుర+ద్వారపాలిక, ననబోడి=పూవువలె మనోహరమైన స్త్రీ, వరారోహ=గొప్ప పిఱుదులుగల స్త్రీ, విశాంపతి=రాజు, సన్నికర్షము=సమీపము, మధుర+అక్షర+విన్యాసమున=తీయని+మాటల+కూర్పుతో,
సూచన: ఇందుమతి పల్లకిపై కూర్చుండగా పల్లకి ఒకరాజు వద్ద ఆగిన సునంద ప్రక్కన నిలబడి రాజులగూర్చి చెప్పును. తరువాత సాగి తరువాతి రాజు వద్ద ఆగును.

ఉ. "కుంజరరాజయాన! కనుగొంటివె! తన్ను పరిగ్రహింప ప్రే
మాంజలి పట్టియున్న మగధాధిపు వీని, సమగ్రపార్థివ
వ్యంజనమంజులాంగు, శరణార్థిశరణ్యు, అనారతప్రజా
రంజనలబ్ధవర్ణుని, పరంతపనాము, యధార్థనామునిన్. 21

కుంజర+రాజ+యాన=మదించినఏనుగుల+రాజువంటి+నడకకలదాన, పరిగ్రహింప+ప్రేమ+అంజలి=స్వీకరింప+ప్రేమతో+దోసిలి, సమగ్ర+పార్థివ+వ్యంజన+మంజుల+అంగు=సంపూర్ణ+రాజసము+సూచించు+మనోహరమైన+అవయవములుకలవాడు, శరణార్థి+శరణ్యు=శరణుకోరువారిని+కాపాడువాడు, అనారత+ప్రజా+రంజన=ఎల్లప్పుడు+ప్రజల+సంతోషపెట్టుటచే, లబ్ధ+వర్ణుడు=పొందిన+యశశ్వి, పరం+తప=శత్రువుల +బాధకలించువాడు, యధార్థ+నాముడు=సార్ధకమైన+పేరుకలవాడు,

శా. రాజన్యుల్ మరి లేరె? భూరియశులై రాజిల్లరే? నిక్క మీ
రాజేందుండె వలంతి పంటవలతిన్ రాజన్వతింజేయగా,
రాజన్మూర్తులు లేరె మింట గ్రహతారానైక నక్షత్రముల్
రాజొక్కండె వెలుంగజేయు రజనిన్, రాజీవరమ్యేక్షణా! 22

రాజన్యుల్=రాజపుత్రులు, భూరి+యశులై+రాజిల్లరే=ఎక్కువ+కీర్తితో+ప్రకాశించరే, రాజ+ఇందుండు=రాజులలో+చంద్రుడు, వలంతి=నేర్పరై, పంటవలతిన్=భూమిని, రాజన్వతి=మంచి రాజుచే పరిపాలింప బడునది, రాజన్+మూర్తులు=ప్రకాశించు+స్వరూపులు, మింట=ఆకాశములో, గ్రహ+తార+అనైక+నక్షత్రముల్=గ్రహములని+నక్షత్రములని+బహు+చుక్కలు, రాజు+ఒక్కండె=చంద్రుడు+ఒక్కడే, వెలుంగన్+చేయు=ప్రకాశింప+చేయును, రజనిన్=రాత్రిని,
రాజీవ+రమ్య+ఈక్షణా=తామరలవలె+అందమైన+కన్నులున్నదానా,

సీ. ముడువంగ నొల్లదు నిడుదపెన్నెఱులపై/పారిజాతలతాంతకోరకములు,
అడుగుపెట్టగ నోప దనుగు నెచ్చెలులతో/నందనోద్యానమందారవాటి,

ఓలలాడ దలంప దుబుసుపోకకు నైన/విమలమందాకినీవీచిపంక్తి,
ఇచ్చగింప దొకప్పు డెడదకు ప్రేగౌట/అప్సరోమధురతౌర్యత్రికంబు,
నిర్విరామాధ్వరక్రియానిరతి యైన/వీని క్రతుశాలలో తిష్ఠవేసి, రాని
వరునిదుస్సహదీర్ఘప్రవాసవేళ/వేల్పుదొర రాణివాసము, విద్రుమోష్ఠి. 23

ముడువంగ+ఒల్లదు=పెట్టుకొన+ఇచ్ఛగింపదు, నిడుద+పెను+నెఱులపై=విస్తరించిన+గొప్ప+కేశముల కొప్పు పై, లత+అంత+కోరకములు=లతల+చివరి+మొగ్గలు, ఓపదు=చాలదు, అనుగు=ప్రియ, నందన+ఉద్యాన+ మందార+వాటి=నందనమను+విహారార్థమైన+మందారచెట్ల+తోటలో, ఓలలాడ=జలక్రీడఆడ, విమల+ మందాకినీ+వీచి+పంక్తి=స్వచ్ఛమైన+ఆకాశ గంగ+అలల+సమూహమున, ఎడదకు+ప్రేగౌట=మనస్సుకు+ దుస్సహముఅగుటచే, తౌర్యత్రికంబు=నృత్త గీత వాద్యములు, నిర్ విరామ+అధ్వర+క్రియా+నిరతి=ఎడతెగని +యాగములు+చేయు+ఆసక్తిచే, తిష్ఠవేసి=స్థిరముగాఅందుండి, రాని=స్వర్గమునకు వెళ్ళని, వరుని+
దుస్సహ+దీర్ఘ+ప్రవాస+వేళ=ఇంద్రుని+సహింపశక్యముకాని+బహుకాలపు+పరదేశవాస+సమయమున, వేల్పుదొర+రాణివాసము=ఇంద్రుని+భార్య-శచీదేవి, (యజ్ఞము సాగునపుడు ఇంద్రుడు యాగవాటికలో ఉండును. ఎడతెగక యాగములు సాగుటచే ఇంద్రుడు తిష్ఠవేయుట శచీదేవి విరహము), విద్రుమ+ఓష్ఠి= పగడమువంటి+పెదవికలదాన,

తే. వీని గేల్వట్టి నగర ప్రవేశవేళ/సంతరింపుము వీక్షణక్షణసమృద్ధి,
మందిరగవాక్షసీమల క్రందుకొనెడు/రాజగృహరాజముఖులకు, రాజభగిని!" 24

కేల్వట్టి=చేపట్టి, సంతరింపుము=కలిగించుము, వీక్షణ=చూపులకు, క్షణ+సమృద్ధి=ఉత్సవపు+మిక్కుటము, గవాక్ష+సీమల=కిటికీ+వద్ద, క్రందుకొనెడు=ప్రకటితమగు, రాజముఖులు=చంద్రవదనలు-స్త్రీలకు, రాజ+ భగిని=మారాజునకు+తోబుట్టువా.

వ. అనిన విని వైదర్భి అమ్మగధప్రతిష్ఠు నుపలక్షించి కించి ద్విస్రంసిదూర్వాంక మధూకమాలికయై ఏమియు ననక, ఋజుప్రణామకరణముననె వాని గీటునబుచ్చెను. వేత్రగ్రహణనియుక్త ఇందుమతీ మనోవిరాగము నెఱిగి, ఆక్షణమ సమీరణోత్పన్నతరంగరేఖమానసరాజహంసిని రాజీవాంతరమునకు బలె, రాజయవీయసిని రాజాంతరమునకు, దోడితెచ్చి, ఇట్లనియెను. 25

మగధ+ప్రతిష్ఠుడు=మగధదేశపు+రాజు, ఉపలక్షించి=బాగుగాచూచి, కించిత్+విస్రంసి=కొంచముగా+జారు చున్న, దూర్వక+అంక+మధూక+మాలికయై=గఱికపరకలు+చిహ్నములుకల(పూలదండ గఱికపరకలచే

కుట్టబడినది)+ఇప్పపూల+దండకలద్రై, ఋజు=తిన్నగా(వక్రత, భావ, భాషణ శూన్యత), ప్రణామకరణము=నమస్కారము చేయుచు, గీటునన్+పుచ్చెను=అనాదరమున+విడచెను, వేత్ర+గ్రహణ+నియుక్త=బెత్తము+పట్టుకొన+నియోగింపబడిన-సునంద, మనో+విరాగము=మనస్సులోని+ అఇష్ఠత, సమీరణ+ఉత్పన్న+తరంగరేఖ=గాలిచే+లేచిన+రేఖారూపమైనతరంగములగుంపు, మానస+రాజహంసిని=మానస సరోవరము నందలి+రాజహంసనుత్రోసిముందుకు జరిపి, రాజీవ+అంతరమునకు=మరొకపద్మమునకు, రాజ+యవీయసిని=రాజుగారి+చెల్లెలిని, రాజ అంతరమునకు=వేరొక రాజువద్దకు, తోడితెచ్చి=తీసుకొని వచ్చి,

ఉ. "పోలిక లేని ఏలిక, ప్రబుద్ధుడు, రాజితడంగసీమకున్
పేలుపులేమపిండుకనుపేదుఋ చెందిన రూపయౌవన
శ్రీలసితుండు, సూత్రకరశిక్షిత సింధురయూధు, డింద్రనీ
లాలక! వీడు, భూమిగతుడైనమహేంద్రుడు, వేయునేటికిన్ 26

ప్రబుద్ధుడు=పండితుడు, రాజు+ఇతడు+అంగ+సీమకున్=ఇతడుఅంగదేశపురాజు, వేలుపు+లేమ+పిండు=దేవతా+స్త్రీ+సమూహమునకు, కను+పేదుఋ+చెందిన=చూచినంతనే+వెఱ్ఱివలపు+కలిగించు, రూప + యౌవన+శ్రీ+లసితుండు=రూపము+వయసు+కలుగుభాగ్యమునకు+రూపముదాల్చినవాడు, సూత్రకర+శిక్షిత=గజశాస్త్రకారులచే+నేర్పింపబడిన, సింధుర+యూధుడు=ఏనుగుల+సైన్యము కలవాడు, ఇంద్ర+నీల+అలక=ఇంద్ర+నీలమువలెనల్లని+కేశములుకలదానా, భూమి+గతుడు=నేలపై+దిగిన, మహేంద్రుడు=ఇంద్రుడు, వేయిను+ఏటికి=ఇంకఏమీచెప్పక్కరలేదు,

తే. శత్రులీలావతులకు తత్ స్తనతటముల/రాలు కన్నీటి యాణిముత్యాల తోడ
ప్రతిసమర్పించు నితడు దారములు లేని/హారములు, తత్పతుల నను లందు దునిమి 27

లీలావతులకు=స్త్రీలకు, తటముల=ప్రదేశముల, కన్నీటి+ఆణి+ముత్యాల+తోడ=కార్చుకన్నీటి+గుండ్రపు+ముత్యాలవంటిబొట్ల+తోడ, ప్రతిసమర్పించు=మంగళ సూత్రము బదులు కూర్చు, తత్+పతులను+అనుల+అందు+తునిమి=వారి+భర్తల+యుద్ధముల+అందు+చంపి,

ఉ. శ్రీయును, వాణియుం బురుషసింహుడు, వీనికి దక్కి ఒక్కెడన్
పాయకయుందు రాత్మసహవాసవిరోధము స్వప్నవార్తగా,
సోయగమందు సూనృతవచోనియమంబున యోగ్య వౌట, తా
ర్తీయవు, నీవ సుమ్ము, సుదతీ మణి! వారి కసంశయంబుగన్. 28

శ్రీ=లక్ష్మి, వాణి=సరస్వతి, ఒక్క+ఎడన్=ఒకే+చోట, పాయక=విడువక, ఆత్మ+సహవాస+విరోధము+స్వప్న వార్తగా=వారు+కలిసిఉండుటఅందలి+ఆటంకము+కలలోని+వృత్తాంతముగా, నోయగము=అందము, సూనృత+వచో+నియమంబునము=సత్యమే+పలుకుటఅను+నియమముచే, యోగ్యవు+ఔట=తగినదానివి +అగుటచే, తార్తీయవు=లక్ష్మి సరస్వతులతో కలిపి మూడవభార్యవు, నీవ=నీవే, అ సంశయంబుగన్ =సందేహములేక నిశ్చయముగా,

క. సరళతకు, సహృదయతకును/సిరులకు, ఆర్షేయపౌరుషేయములకు, పె
న్నిరవయిన, వీని ఆహో/పురుషికపై, పొగడు గనుము, భోజతనూజా!" 29

సరళత=త్రికరణశుద్ధి, సహృదయము=రసజ్ఞతకు, సిరి=సంపద, ఆర్షేయ=ఋషులు చెప్పిననడవడిక, పౌరుషేయము=మనుష్య ప్రయత్నము, పెను+ఇరవు=గొప్ప+స్థానము, ఆహోపురిషికపై=గర్వముచే తన్ను తాను గొప్పగా సంభావించుకొనుచు, పొగడున్+కనుము=కీర్తి+పొందుము.

తే. అనిన విని వానినుండి చూపును మరల్చి/చనుమని కుమారి జన్యకు సన్న చేసె
కాడత డకామ్యు, డనభిజ్ఞ కాదు వర్య/ఐన, తలకొక అభిరుచి మానవులకు. 30

కుమారి జన్య=పెండ్లికుమార్తె దాసి, అకామ్యుడు=కోరతగనివాడు, అనభిజ్ఞ=తెలివిలేనిది, వర్య=వరించు ఇందుమతి,

ఉ. అచ్చటు వాసి, పేటొకని, అందము చందము మిన్నుముట్టి, క
న్నిచ్చకు వచ్చు వాని, ఉదయించిన పున్నమ చందమామయై
ముచ్చట గొల్పువాని, నునుముత్యము బోలిన వాని, కన్నులన్
లచ్చి కలట్టివాని దొరలందొర, జూపి, సునంద, ఇట్లనెన్ 31

అచ్చటు+వాసి=ఆచోటు+దాటి, మిన్నుముట్టి=అతిశయించి, కన్ను+ఇచ్చకు+వచ్చు=కంటికి+ఇంపుగా+ ఉండు, నును=ఆణి=గుండ్రని, లచ్చి=లక్ష్మి(కళ),

ఉ. "కూరిమిదేవిపై, మెలపుకొందువు, తన్నని వచ్చె చూడు, మీ
వీరు, విశాలవక్షు, తనువృత్తవలగ్ను అవంతికా విభున్,
వారిజనేత్ర! మున్ను, సురవర్ధికి, గుండ్రని సానబట్టినన్
తేరిన ఉష్ణదీధితి గతిన్ వెలుగొందు నుదగ్రమూర్తియై. 32

కూరిమి=తీవ్రఅనురాగపు, మెలపుకొందువు=ప్రవర్తించుదువు, తన్ను+అని=తనని+అని, తను+వృత్త+వలగ్ను=సన్నని+గుండ్రని+నడుమున్నవాడు, సుర+వర్ధకి=దేవతల+ఆజ్ఞచే(విశ్వకర్మ), తేరిన=నగిషీపెట్టబడిన, ఉష్ణ+దీధితి=వేడి+కాంతికలవాడు-సూర్యుడు, గతిన్=వలే, ఉదగ్ర+మూర్తి=ఉన్నత+ఆకారుడు,

తే. శక్తిసంపూర్ణు, డితని ప్రస్థానవేళ/నగ్రతోగామి, జవనసైంధవఖురోత్థ

సాంద్రతరరేణువే, వినష్టం బొనర్చు/నహితశేఖర రత్నత్విషాంకురములు. 33

శక్తిసంపూర్ణు=రాజు కుండవలసిన ప్రభుశక్త మంత్రశక్తి ఉత్సాహశక్తి కలిగివాడు, ప్రస్తాన=జైత్రయాత్ర, అగ్రతోగామి=ముందుగానడచువాడు, జవన+సైంధవ=వడిగల+గుఱ్ఱముల, ఖుర+ఉత్థ=గిట్టలచె+రేపబడిన, సాంద్రతర+రేణువే=బాగాదట్టమైన+దుమారమే, వినష్టంబు=మిక్కిలినాశము, అహిత+శేఖర+రత్న+త్విష+అంకురములు=శత్రురాజ+కిరీట+రత్నముల+వెలుగు+మొలకలను,

క. యువతిలకు, డితని వెంబడి/యువతిరో! వ్యాహ్యాళి వెడలు టొప్పదె? శిప్రా

పవనాకంపిత నగరో/పవన పరంపరల పరమ పర్యుత్సుకతన్. 34

తిలకుడు=శ్రేష్టుడు, వ్యాహ్యాళి=విహరించుటకు, ఒప్పదే=ఒప్పునుకదా, శిప్రా+పవన+అకంపిత=శిప్రానది+గాలులచే+కదల్చబడిన, నగర+ఉపవన+పరంపరల=నగర+ఉద్యానవన+వరసల, పరమ+పరి+ఉత్సుకతన్=మిక్కిలి+గొప్ప+తమకముతో,

శా. ప్రాలేయద్యుతిమౌళి వీని నగరీపర్యంతసీమన్ మహా

కాళక్షేత్రనివాసి యౌట, మలుపక్షంబైన గానిమ్ము లి

ప్సాలజ్జావతి! మందిరోపవన శశ్వత్కేళి యోగ్యంబులై

రే లొప్పారు సమున్మిషత్ప్రచుర చాంద్రీ లోభనీయంబులై." 35

ప్రాలేయద్యుతిమౌళి=చంద్రమౌళి-శివుడు, పర్యంత+సీమన్=సమీప+ప్రదేశమున, మహాకాళ+క్షేత్ర+నివాసి+ ఔట=మహాకాళనాథుని+ఉజ్జయిలో(అవంతి రాజధాని)+ఉండువాడు+అవుటచే, మలు+పక్షంబైనన్+ కానిమ్ము=కృష్ణ+పక్షమైన+అప్పటికీ, లిప్సాలజ్జావతి!=కలిగిన కోరికవలన సిగ్గు పడుచుండు దానా!,

మందిర+ఉప+వన+శశ్వత్+కేళి+యోగ్యంబులై=భవన+ఉద్యాన+వనములు+ఎల్లప్పుడు+క్రీడలకు+తగినవై, రేలు+ఒప్పారు=రాత్రులు+అందగించు, సమ+ఉన్మిషత్+ప్రచుర+చాంద్రీ+లోభనీయంబులై=బాగా+వికాశమైన+అధికమైన+వెన్నెలచే+ఆకాంక్షపుట్టించునదై,

తే. అనిన విని, అయ్యభిద్యోతితాత్మబంధు/పద్మని, ప్రతాపశోషితప్రతినృపాల

కర్దముని జూచి, సుకుమారి, కలువచెలువ/ఆంశుమంతుని బలె, మెచ్చకవల జనియె. 36

అభిద్యోతిత=వికసింపచేయబడిన, ఆత్మబంధు+పద్మిని=స్వంతబాంధవులుగా+కమలములు కలవాని- సూర్యుని, ప్రతాప+శోషిత=తేజస్సు చేత+ఎండింపబడిన,
ప్రతి+నృపాల+కర్దముని=శత్రు+రాజులనెడు+బురద కలిగినవాని,
కలువ+చెలువ=చంద్రునిమెచ్చుకలువలనే+స్త్రీ, అంశుమంతునిబలె=సూర్యుని యందువలె,

క. అంతట, సునంద తామర/సాంతరదంతురితకాంతి కలిపేణుల మే
ల్బంతికి, అనూపవసుధా/కాంతుని, జూపించి, పలికె, గౌతుకమెసగన్. 37

తామరస+అంతర+దంతురిత+కాంతికి=తామరపువ్వు+లోని+రోమాంచపు పుప్పొడుల+(బంగారపు) కాంతి కలది, అలిపేణుల+మేలుబంతి=తుమ్మెదలవంటి కురులుగలవారిలో+శ్రేష్ఠురాలు,
అనూప+వసుధా+కాంతుని =(జలసమృద్ధికలదేశము)అనూప+రాజ్యపు+రాజుని,
కౌతుకము+ఎసగన్=ఉత్సాహము+అతిశయించగా,

తే. "పగఱ దశదోశ్శతంబున బారి సమరె/దీవు లన్నింట యూపప్రతిష్ఠ చేసె,
వినమె అనితరసామాన్య విభుత గన్న/యోగివర్యుని, కార్తవీర్యుని లతాంగి! 38

పగఱ్=శత్రువుల, దశదోశ్శతంబు=పద్దెనిమిది, బారి=నిర్బంధించి/పారత్రోలి, సమరె=చంపె,
యూప+ప్రతిష్ఠ+చేసె= దిగ్విజయము చాటుస్థంభముల+నిల+పెట్టి, విభుత=శ్రేష్ఠత,

తే. సత మకార్యచింతాసమ సమయ మందె/చాప మెక్కిడి తా బొడసూపు నెదుట,
అంతరంగము లందైన అవినయమును/చేరనీయక ప్రజల శాసించె నతడు. 39

సతము=ఎల్లప్పుడు, అకార్య+చింతా+సమ+సమయము అందె=చెడ్డపని+చేయతలంపు+కలిగిన+సమయ మునసే, చాపము+ఎక్కిడి+తాన్+పొడసూపును=విల్లు+చాచి+తను+ప్రత్యక్ష్యమై కనబడుతూ,
అంతరంగములు అందైన+అవినయము=మనసులలో+కూడా+అవిధేయత, చేరన్ ఈయక=దగ్గరకు రానీక,
శాసించె=దండించె,

మ. శతమన్యున్ గతమన్యు జేసిన మహాసత్త్వాఢ్యు లంకేశ్వరున్
వితథస్థైర్యుని జేసి, పట్టికొని, మౌర్వీబంధనిష్పందవిం
శతిబాహుం, దతనిశ్వసద్వదను, లజ్జానమ్రు, వానిం, దదు
ద్ధతి వాయన్, చెఱ మ్రగ్గబెట్టి, విడిచెన్ దాక్షిణ్యభావోన్నతిన్. 40

శతమన్యున్=ఇంద్రుని, గతమన్యున్=గౌరవముపోయినాట్టివానిగా,
మహా+సత్వ+ఆఢ్యుడు=గొప్ప+బలముచే +శ్రేష్ఠుడు, లంకేశ్వరున్=రావణుని,
వితథ+స్థైర్యునిన్=వ్యర్థమైన+మనోనిశ్చయము కలవానిగా, మౌర్వీ+
బంధ+నిష్పంద=వింటినారిచే+బంధింపబడి+కదలజాలని, వింశతి+బాహుండు=ఇరవై+చేతుల రావణుని,
తత+నిశ్వసత్+వదను=విరివిగా+నిట్టూర్పుచున్న+ముఖములు(దశ)కలవాడు, లజ్జానమ్రు=సిగ్గుచే
అడకువతోనున్నవానిగా, తత్+ఉద్ధతి+వాయన్=వాని+గర్వము+పోవునట్టగా, మ్రగ్గ+పెట్టి=విహ్వలమగు
నట్లు+చేసి, దాక్షిణ్య+భావ+ఉన్నతిన్=దయా+భావ+వృద్ధిచె,

క. వినుము, తదీయాన్వయమున/జనించిన, ప్రతీపుడితడు సంశ్రయదోషం
బుననె, చలచిత్తయగు సిరి/యనుచు, నిరూపించె, దన మహార్జవగరిమన్ 41

సంశ్రయము+దోషముననే+చల+చిత్త=ఆశ్రయము+చెడుటచేతనే+పోవ+ఇచ్ఛగించును, నిరూపించె=సిరి
ఎప్పుడూకలిగి చూపించెను, మహా+ఆర్జవ+గరిమన్=గొప్ప+ఋజుమార్గపు+మేరచే(తన మంచినడతచే
నిరంతరము సిరిసాంగత్యము కల వాడయ్యెను)

తే. అగ్ని ఆయోధనమ్ముల నండ నిలువ/క్షత్రియకులంబునకు కాళరాత్రి యైన,
భార్గవుని గండ్రగొడ్డలి పదను, వీడు/కలువరేకుల చేవగా చులక సేయు 42

అగ్ని=అగ్నిదేవుడు(అగ్నిహోత్రుడు నీశత్రువుల కాల్చెదనని ప్రతీపరాజుకు వరమిచ్చెను), ఆయోధనమ్ముల
=యుద్ధమునందు, అండ+నిలువ=తోడుగా+ఉండగా, భార్గవుని=పరశురాముని, పదును=వాడి,
చేవ=సమర్థత,

చ. వెడదయురంబుతోడ కనువిందగు వీనికి అంకలక్ష్మిపై
పడతి! విలాసమందిరగవాక్షనివిష్టవిలోకనంబులన్
పొడగని యుల్లసిల్లదగు ముచ్చటతీర, మహిష్మతీపురిన్
పడమటి వేణియై పరచు నర్మద వప్రనితంబమేఖలన్." 43

వెడద+ఉరంబు=విశాలమైన+వక్షస్థలము, అంక+లక్ష్మిపై=ఒడిలోకూర్చున్న+గృహలక్ష్మిపై, వప్ర+నితంబ
+మేఖలన్=కోట ప్రాకారమనెడు+పిఱుదులకు+మొలనూలుగాఉండు, పడమటి+వేణియై పరచు+నర్మద
=పడమరవేపు+పాయగా+పారు+నర్మదానదిని, విలాస+మందిర+గవాక్ష+నివిష్ట+విలోక నంబులన్=క్రీడా
+మందిర+కిటికీలోనుండి+ఏకాగ్రమైన+చూపులతో, పొడగని=చూచి,
ఉల్లసిల్ల+తగు=సంతోషింప+తగుదువు,

చ. లలితవిలాసరూపకళలన్ ప్రియదర్శనుడైననేమి? ఆ
మెలత అలీన భావమున మెచ్చదు, నచ్చ, దనూపవల్లభున్,
జలదనిరోధముందొఱగి శారదవేళ కళాప్రపూర్ణుడై
వెలుగు సుధామరీచి, నరవిందము గీటునబుచ్చు కైవడిన్. 44

లలిత+విలాస+రూప+కళలన్=మనోహర+విలాస+రూపు+రేఖలచేత, ప్రియదర్శనుడు+ఐనన్+ఏమి=చూడ దగ్గవాడు+అయినప్పటికీ, మెలత=ఇందుమతి, అలీన భావమున=ఐక్యభావముచెందక, జలద+నిరోధముం+ తొఱగి=మేఘపు+అడ్డు+తొలగి, శారదవేళ+కళా ప్రపూర్ణుడై=శరత్కాలమున+పూర్తికళలతో, సుధా+మరీచి= అమృత+కిరణమును, అరవిందము=పద్మము, గీటునన్ పుచ్చు+కైవడిన్=తృణీకరించు+పోలిక,

వ. పతింవర, ఇట్లు, నిజప్రతిరూపుడు కాడని, ప్రతీపుని ప్రతిషేధించి, పక్ష్మాంచలములువాల్చిన, ముహూర్తమాత్రప్రతీక్షణమున, ఆప్రతీపభావమును గనుగొని, అవరోధ ప్రతీహారిణి స్థానాంతరవర్తియగు,
శూరసేనవిషయప్రతిష్ఠుని, సుషేణుడను వేఱొక ప్రతీతుని జూపి, ఇట్లనియె. 45

పతింవర=పతినివరింపకోరునది, నిజ+ప్రతిరూపుడు+కాడని=తనకు+తగినవాడు+కాడని, ప్రతిషేధించి= నిరాకరించి, పక్ష్మ+అంచలము=కనురెప్ప+చివరలు, ముహూర్త+మాత్ర+ప్రతీక్షణమున=క్షణ+మాత్రము+ ప్రత్యాశతోఎదురు చూచి, ప్రతీప=ప్రతికూల, అవరోధ+ప్రతీహారిణి=అంతఃపుర+ద్వారపాలిక, శూరసేన+విషయ +ప్రతిష్ఠుని=శూరసేన+రాజ్యమునకు+అభిషిక్తుడు, ప్రతీతుని=ప్రసిద్ధుని,

క. "నీపాన్వయతిలకుని ఈ/భూపుని స్వర్గీతకీర్తి, బొడగంటివె? మా
తాపిత్రుభయకులంబులు/దీపించెను వీని శుద్ధదివ్యచరిత్రన్. 46

నీప+అన్వయ+తిలకుని=నీప+వంశ+శ్రేష్ఠుని, స్వర్గీత+కీర్తి=స్వర్గమువరకు ప్రాకిన+కీర్తికలవాని, పొడగంటివె =చూచితివా, దీపించెను=ప్రజ్వలింపచేసెను, శుద్ధ+దివ్య+చరిత్రన్=పవిత్ర+భవ్య+సదాచారముచే,

ఉ. ప్రశ్రయభూషణుం డితడు ప్రగ్రహనిగ్రహశక్తిశాలి భ
వ్యశ్రుతపారదృశ్వుడు, లతాంగి! గుణంబులు, వీని సాధు లో
కాశ్రయు, నాశ్రయించి, దిగనాడె, నిసర్గజ మయ్యు శాంతసి
ద్ధాశ్రమవాసిసత్త్వచయమట్లు, పరస్పరవైరబంధమున్. 47

ప్రశ్రయ+భూషణుండు=వినయము+అలంకారముగాకలవాడు, ప్రగ్రహ+నిగ్రహ+శక్తి+శాలి=దయఅందు+దండన యందు+సామర్థ్యము+కలవాడు,
భవ్య+శ్రుత+పారదృశ్వుడు=శుభకరమైన+శాస్త్రములందు+పారంగతుడు,
వీని+సాధులోక+ఆశ్రయు+ఆశ్రయించి=ఇతని+సాధువుల+ఆశ్రయమిచ్చు గుణముల+చేరి, శాంత+సిద్ధ+ఆశ్రమ+వాసి=ప్రశాంతమైన+మునుల+ఆశ్రమములో+నివశించు, సత్వ+చయమట్లు=జంతు+జాలమట్లు, గుణంబులు=వానిజ్ఞాన మౌన క్రోధ దయ మొదలగువిరుద్ధ గుణములు, నిసర్గ+జ+దిగనాడె=తమ స్వాభావికముగా+పుట్టిన+పరస్పర వైరాన్ని విడిచినవి

మ. అతిమాత్రోత్సవహేతువై వెలుగు చంద్రాలోక సారూప్యమై
సితపద్మేక్షణ! వీని మేని సుషమా శ్రీ ఆత్మగేహంబులన్
సతతోత్సాహుడు, వీని తేజము పతత్సౌధాగ్రసంరూఢ న
వ్యతృణాంకూరవిపక్షమందిరములన్ వ్యాపించు దుస్స్పృహ్యమై . 48

అతిమాత్ర+ఉత్సవ+హేతువై=కొలదికిమించిన+వేడుకకు+కారణమై, చంద్ర+అలోక=చంద్రుని+కాంతి-వెన్నెల, సారూప్యమై=విధముగా, సిత+పద్మ+ఈక్షణ=విరిసిన+పద్మములవంటి+కన్నులుకలదాన, సుషమ+శ్రీ= మనోహరమైన+రాజ్యలక్ష్మి, ఆత్మ+గేహంబు=తన+యింటఉండుటచే,
సతత+ఉత్సాహుడు=ఎల్లప్పుడు+ రాజుకుకావలసిన ఉత్సాహశక్తికలవాడు, దుస్స్పృహ్యమై=భరింపరానిదై,
వీని+తేజము+పతత్+సౌధ+అగ్ర+
సంరూఢ+నవ్య+తృణ+అంకూర=వీని+ప్రతాపము+పడగా+మేడ+పైభాగమున+పెరిగిన+క్రొత్త+గడ్డి+మొలకలుకలుగ, విపక్షమందిరములన్+వ్యాపించు=శత్రువుల+మేడలపై+విస్తరిల్లు ( వైరులు పారిపోవుటచే వారి ఇండ్లపైగడ్డి మొలచినది),

తే. నెలత!జలకేళి వేళ, వీని అవరోధ/గాత్రచందనరసపరిక్షాళనమున
కరము శోభిల్లు, మధురోపకంఠ మందె/జమున, గంగోర్మిసంసక్తసలిలభంగి 49

అవరోధ=అంతఃపుర కాంతల, గాత్ర+చందనరస+పరిక్షాళనమున=వంటి+గంధపురసము+కడుగుటవలన, మధుర+ఉపకంఠమందె+జమున=మధురానగరమునకు+సమీపనఉన్న+నల్లటి యమున, గంగ+ఓర్మి+సంసక్త+సలిల+భంగి=గంగానది+తరంగములతో+కలిసికొని+రంగుమారిన+జలముల+వలె, కరము+శొభిల్లు=మిక్కిలి+ప్రకాశించు,

(ప్రయాగలో నల్లని యమున గంగలో చేరి రంగుమారును. కాని గంగా సంగమము ముందే మధురలో గంధాదుల వలన నలుపువిరిగి యమున రంగు మారెను.)

చ. గరుడుని బారికిన్ బెగడి, కాళియు డా యమునా హ్రదంబులో
ఇరువు నొసంగ వేడి తమ కెయ్యది సూడిద యిచ్చె మున్ను, పే
రురమున, ఆ యనర్ఘమణి, యుజ్జ్వలమై రమణింప దోచునీ
తరుణుడు, చూడు! కౌస్తుభము దాల్చెడి వెన్నుని గ్రేణిసేయుచున్. 50

బారికిన్=హింసకు, బెగడి=భయపడి, హ్రదము=మడుగు, ఇరువున్+ఒసంగ=స్థానము+ఇవ్వగా, సూడిద=కానుక, పేరు+ఉరమున=విశాలమైన+గుండెపై, అనర్ఘ=వెలలేని, రమణింప+తోచు=అందముగా+కనబడు, తరుణుడు=యౌవ్వనుడు, కౌస్తుభము=విష్ణుని ఉరమున ఉండు మణి,
వెన్నుని+గ్రేణి+సేయుచున్=విష్ణుని+ అలక్ష్యము+చేయుచు,

సీ. నందనాతిగమైన బృందావనంబున/అబ్జపూర్ణజలాశయాంచలములు,
కిసలయోత్తరమృదుప్రసవశయ్యలతోడి/తద్వనీకేళీలతాగృహములు,
మత్తబర్హివిలాసనృత్తరంగము లైన/కమ్రగోవర్ధనకందరములు,
ఆలోలకల్లోలడోలాయితములైన/ఉల్లాసకరయామునోదకములు,
ప్రథితమధురాపురాయతోపవనకృతక/గిరితట విహార దీర్ఘికాపరిసరములు,
విహరణస్థానములు గాగ, వీని గూడి/అనుభవింపుము, నిండు జవ్వనము కలిమి 51

నందన+అతిగమైన=నందనోద్యానవనమును+అతిక్రమించిన, బృందావనంబున=మధురలో బృందా వనము అను ఉద్యానవనములోని, అబ్జ+పూర్ణ+జలాశయ+అంచలములు=పద్మములతో +నిండిన +సరస్సుల+గట్టులు, కిసలయ+ఉత్తర+మృదు+ప్రసవ+శయ్యల=చిగురాకుల+పై వేసిన+కోమల మైన+పూల+పాన్పుల, తత్+వనీ+కేళీ+లతా+గృహములు=ఆ+ఉద్యానమున+క్రీడార్థమైన+లతల +కుటీరములు,
మత్తబర్హి+విలాస+ నృత్త+రంగములు+ఐన=మదించిన నెమళ్ళు+విలాసముగా+ నాట్యము చేయు+స్థలము+ఐన, కమ్ర+గోవర్ధన+కందరములు=అందమైన+గోవర్ధన పర్వతపు+ గుహలు,
ఆలోల+కల్లోల+డోలాయితములైన= మిక్కిలిచలించిగా+పెద్ద అలలచే+ఊగునట్టి,
ఉల్లాసకర+యామున+ఉదకములు=ఆహ్లాదకరమైన+యమునా నది+జలము, ప్రథిత+మధురాపుర+ఆయత+ఉపవన=ప్రసిద్ధి చెందిన+మధురానగరిలోని+ఆకర్షనీయమైన +ఉద్యానవనము లలో, కృతక+గిరి+తట+విహార+దీర్ఘికా+పరిసరములు=మనుషులచే కట్టించిన+

కొండల+చరియల+స్వేచ్ఛగా సంచరింపదగ్గ+జలాశయ+సమీపములు, విహరణ+స్థానములు= వినోదసంచారము చేయు+స్థలములు, కలిమి=సంపద, (బృందావనము గోవర్ధన పర్వతములు అప్పటి నుండి మథురలో ఉన్నాయి)

క. బృందావన మెందుకు?మరి/ఎందుకు యమునా స్రవంతి? హేలావతి! ఈ
సౌందర్యపిపాసికి, తన/ముందట నీవున్న జాలు ముద్దుల గనిపై". 52

స్రవంతి=నది, హేలావతి=విలాసముకలదానా, పిపాసి=దప్పిగొన్నవాడు,

తే. ఆనరేంద్రుని గడచని యరిగె నొరుని/వధువు కానున్న ఆ మహావర్తనాభి
మార్గవశమున దగిలిన క్ష్మాధరమును/వనధిగామిని యైన వాహిని విధమున. 53

కడచని=దాటి, అరుగె=వెళ్ళె, ఒరుని=ఇంకొకరికి, మహా+వర్త+నాభి=గొప్ప+సుడివంటి+బొడ్డుకలది, క్ష్మాధరమును=కొండను, వనధి+గామిని=సముద్రముగూర్చి+పోవు, వాహిని=నది.

తే. అరుగుటయు చిన్నవోయిన అతని పట్టు/వాపి రాజభుజిష్య, అ వామముఖికి,
అంగదాశ్లిష్టభుజుని, హేమాంగదాఖ్య/నృపుని ఉబలాటమును చూపి, ఇట్టు లనియె 54

పట్టు+వాపి=స్థానము+మళ్ళించి, భుజిష్య=సేవకురాలు, వామ+ముఖి=సుందర+వదన, అంగద+అశ్లిష్ట+ భుజుని=భజకీర్తులతో+కూడిన+భుజములు కల, ఉబలాటము=మిక్కిలిఅభిలాష,

తే. " ఇతడు కాళింగు, డబల! మహేంద్రభోగి/అధిపతి, మహేంద్రమునకు, మహాంబుధికిని,
కరిఘటల సాకున, మహేంద్రగిరియె ముందు/నడచు నని తోచు, వీడెత్తి వెడలు నపుడు. 55

మహేంద్ర+భోగి=ఇంద్రునితోసమానముగా+సుఖములనుభవించువాడు, కరిఘటల+సాకున=సైన్యము నందలి గజముల+మిషచే. వీడు+ఎత్తి=వీడు+దండయాత్రకు,

ఉ. వారము వారమున్ సుజనవత్సలు నీతని వేగుబోకలన్
కూరుకునుండి మేల్కొలుపు, కోటకు సుష్ఠుసదేశవర్తియై
నోరణగండ్ల మార్గమున జూడగనైన సమున్నతోర్మియై
వారిధి, మంద్రఘోషపరివర్జితలాంచనయామతూర్యుడై. 56

వారమువారమున్=ప్రతిదినము, సుజన+వత్సలు=మంచివారల+ప్రేమించువాడు, వేగుబోకలన్=తెలవారు ఝామున, కూరుకు=నిద్ర, సుష్ఠు+సదేశ+వర్తియై=చక్కగా+తనఇంట+ఉండి, నోరణగండ్ల+మార్గమున= కిటికి+ద్వారా, చూడగనైన=కనబడు, సమున్నత+ఊర్మియై+వారధి=ఎత్తైన+తరంగములు కలదైన+ సముద్రము, మంద్ర+ఘోష+పరివర్జిత+లాంచన+యామ+తూర్యుడై=గంభీర+ధ్వనిచే+మాన్పబడిన

(అవసరములేమిచే)+నామమాత్రమైన+తెల్లవారవాయించు+మేలుకొలుపు భేరి వాద్యములు కలద్రై,
భావము: తనతరంగముల ద్వనిచే యామతూర్య కార్యక్రమమును నిర్వహించుచూ సముద్రుడే యితనిని సేవించుచుండును.

మ. తులనాతీత ధనుర్ధరుండు సమరోద్యోగానురక్తిన్ నిర
ర్గళుడీ ఈని భుజాద్వయంబున ధనుర్జ్యావల్లికాఘాత రే
ఖలు రెండున్నవి, చూడు! సంయతరిపుక్ష్మాపాలకశ్రీసక
జ్జలబాష్పోదకసిక్తపద్ధతుల, యోజన్, రాజ బింబాననా!. 57

తులనాతీత=సాటిలేని, ధనుర్+ధరుండు=విల్లు+ధరించినవాడు, సమర+ఉద్యోగ+అనురక్తిన్=యుద్ధ+ప్రయత్న మందు+ప్రీతితో, నిరర్గళుడు=అడ్డులేనివాడు, భుజా+ద్వయంబున=భుజముల+రెండింటి అందు(సవ్యసాచి అని భావన), ధనుర్+జ్యావల్లిక+ఆఘాత+రేఖలు=వింటి+అల్లిత్రాడు+దెబ్బలుకొట్టగా వచ్చిన+ గీతలుమచ్చలు, సంయత+రిపు+క్ష్మాపాలక+శ్రీ+సకజ్జల+బాష్పోదక+సిక్త+పద్ధతుల+ఓజన్=బంధింపబడిన+శత్రు+రాజ+లక్ష్మి+కాటుకకంటి+నీరు+చిమ్మిన+విధమున, రాజ+బింబ+ఆననా=చంద్ర+బింబ+ముఖీ,

మ. జలముక్కైశిక! వీని గూడి మలుసంజన్ నిర్భరప్రీతి సం
ధిల గేళీరతి దేలియాడ దగదే? ద్వీపాంతరానీత క
మ్రలవంగప్రసవంబు మారుతము, మార్గగ్లాని మాయింపగా
పులిన ప్రాంశువితర్దికావిలసితాంభోరాశితీరంబునన్." 58

జలముక్కు+కైశిక=మబ్బులవలెనల్లని+కొప్పుకలదానా, మలుసంజ=సాయంత్రము, నిర్భర+ప్రీతి+సంధిల=తీవ్రమైన+ప్రేమ+కలుగగా, తేలి ఆడ+తగదే=క్రీడించ+తగునుకదా, ద్వీప ఆంతర+ఆనీత+కమ్ర+లవంగ+ప్రసవంబు+మారుతము=అన్యదేశములనుండి+తెచ్చిన+ఇంపైన+లవంగ+మొగ్గలపై నుండివచ్చు+గాలి, మార్గ+గ్లాని+మాయింపగా=ప్రయాణ+బడలిక+తొలగింపగా, పులిన+ప్రాంశు+వితర్దికా+విలసిత+అంభోరాశి + తీరంబునన్= ఇసుకతిన్నెలు+నిడుపైన+వేదికగా+ప్రకాశించు+సముద్రపు+ఒడ్డున,

క. చొరదయ్యె భోజరాజా/వరజాతకు, తదుపదేశవచనంబు, మతిన్
తరణి, కనరాక ముడిగిన/అరవిందమునందు హిమకరాంశువు వోలెన్. 59

చొరదయ్యె=ప్రవేశింపదయ్యె, భోజరాజ+అవరజాతకు=భోజరాజు+చెల్లెలికి, మతిన్=మనస్సులో, తరణి=సూర్యుడు, ముడిగిన=ముకుళించిన, అరవిందము=పద్మము, హిమకర+అంశువు=చంద్రుని+కిరణము.

క. దౌవారికి, రాకొమరికి/ఆవల ఉరగాఖ్యపట్టణాధీశ్వరునిన్
దేవసము, జూపి" కనుగొను/మీ వంక శుభాంగి!" యనుచు నిట్లని చెప్పెన్. 60

దౌవారికి=ద్వారపాలకి-నందకి, ఆవల=అటుపై, దేవసము=దేవతతో+సమానుడు,

చ. "దళితకుశేశయాక్షి! ధృతిధాముడు, వీ డల పాండ్యనేత, మూ
పుల బడి ప్రేలు బన్నసరముల్, సెలయేళ్ళుగ, రక్తచందనం
బలదిన మేను కోమలనవాతపరంజిత సానుసీమగా,
కులగిరిబోని, వీని వలకూరిమి దెప్పలదేల్ప జూడవే! 61

దళిత+కుశేశ+అక్షి!=వికసించిన+పద్మమువంటి+నేత్రములుకలదానా! ధ్రుతి+ధాముడు=ధైర్యమునకు+స్థానము, మూపుల+పడి=భుజముల+నుండి, ప్రేలు+పన్న+సరముల్=ప్రేలాడు+పొడుగైన+హారములు, సెలయేళ్ళుగ=ఊరుచున్న చిన్న ఏరులుగా, రక్త+చందనంబు+అలదిన+మేను=ఎఱ్ఱ+గంధము+రాసుకొన్న+శరీరము, కోమల+నవ+అతప+రంజిత+సాను+సీమగా=లేతగా+అప్పుడే ఉదయించిన సూర్యుని ఎండచే రంగుతేలిన+కొండ+చఱియగా, కులగిరి బోని=కులపర్వతము పోలికకల (పైనుండి క్రిందకు ప్రవహించు సెలయేళ్ళు, చరియలుకల కొండవలె), వీని+వల+కూరిమి=ఈతని+వలపు+స్నేహము అను, తెప్పలదేల్ప+చూడవే=ఓలలాడించ+పరిశీలించుము,

సీ. క్రక్కించె నెవడు బింకము వింధ్యశిఖరిచే/ మొగులు ముట్టిన బింకముల నడంచి,
ఆపోశనించిన అంభోధిసలిలంబు/క్రమ్మరించెనెవండు కడుపు నుండి,
తోటకూరయు బోలె దుడుసురక్కసు మ్రింగి/త్రేన్చి ఎవ్వాడు జీర్ణించుకొనియె,
తొలితొలిరూపురేఖలు దిద్దె నెవ్వాడు/ద్రవిడవాఙ్మయసంప్రదాయమునకు,
ఘనతపస్సిద్ధుడైన యా కలశసూతి/ప్రీతివశమున దనకు సాస్నాతికుడుగ,
అశ్వమేధావభృథసిక్తుడైన సుగతి/పరమధర్మోల్లసత్కృతి, పాండ్యనృపతి.
62

క్రక్కించె=వెడలించె, బింకము=గర్వము, మొగులు+ముట్టిన=మేఘముల+చేరిన, బింకములన్+అడంచి=పెరుగుదల+ఆపి, ఆపోశనించిన=భోజన కాలమున పుడిసిలితో త్రాగిన, అంభోధి+సలిలంబు=సముద్రపు+నీరు, క్రమ్మరించె=వెనుదిప్పె-ఉమ్మె, దుడుసు=దుష్ట, తొలితొలి=మొట్టమొదటి, రూపు+రేఖలు=ఆకారము+ రీతులు, ద్రావిడ+వాఙ్మయ+సంప్రదాయము=తమిళ+సాహిత్యపు+ఆచారము, ఘన+తప+స్సిద్ధుడైన= గొప్ప+తపస్సు+సాధించినవాడైన, కలశసూతి=అగస్త్యుడు,

ప్రీతివశమున=ప్రేమచేత, సౌస్నాతికుడుగ= సుఖముగా స్నానమైనదా అని అడుగు చనువున్నవాడుగా, అశ్వమేధ+అవభృథ+సిక్తుడైన+సుగతి= అశ్వమేధ+యాగాంతర స్నానముచే+తడిసి+ఉత్తమలోకములు పొందిన ధన్యుడు, పరమ+ధర్మ+ఉల్లసత్+ కృతి=ఉత్కృష్ట+ధర్మమున+ఒప్పు+ ధన్యుడు,

మం.ద్విపద. జగమున నెవ్వరు సరిలేరు తనకు/అని విఱ్ఱవీగియు, అహ ముజ్జగించి,
స్వజనావసథజనస్థానవిమర్ద/శంకియై, రాక్షసేశ్వరుడు, రావణుడు. 63

విఱ్ఱవీగి=మిక్కిలినిక్కి, అహము+ఉజ్జగించి=గర్వము+విడచి,
స్వ+జనా+వసథ+జనస్థాన+విమర్ధ+శంకియై= తన+వారు+నిలచు+మూల స్థలమునకు+దేవతలవలన ఉపద్రవము+ఊహించినవాడై,

మం.ద్విపద. హరునినుండి దురాపమైన అస్త్రమును/బడసిన ఈ మహాబాహునితోడ
కోరి సంధి కుదిర్చికొని కాదె! పెడలె/అనిమిషలోకజయార్థియై, మున్ను. 64

హరుని=శివుని, దురాపమైన+అస్త్రమును=ఇతరులు పొందలేనిదైన బ్రహ్మశిరమనెడి+అస్త్రము, పడసిన= పొందిన, అనిమిష+లోకము=దేవ+లోకము, అర్థియై=కోరిక కలవాడై

క. విశదయశు, వీని నేలుము/విశుద్ధముక్తానువిద్ధవిపులోదన్వ
ద్రశనయగు, దక్షిణాశకు/భృశముగ, సవతాలి, వగుము, బిబ్బోకవతీ! 65

విశద+యశు=తెల్లని+కీర్తిగలవాడు,
విశుద్ధ+ముక్త+అనువిద్ధ+విపుల+ఉదన్వత్+రశన+అగు=నిర్మలమైన+ ముత్యములతో+కూడిన+విస్తారమైన+సముద్రము+మొలనూలుగా+కల, దక్షిణాశకు=దక్షిణ దిక్కుఉన్న, భృశము=ఒడ్డుమీఱిన-సముద్రమునకు, సవతాలి=సవతి, బిబ్బోకవతీ=విలాసవతీ,

చ. నలువుగ పోకమ్రాకుల బెనంగిన తమ్ములపాకు తీవియల్,
చలిమిరి చందనాగముల సందిట గుల్కిన ఏలకీలతల్,
కలయ తమాలపర్ణముల కంబళులన్ తులకించు నెందు, ఆ
మలయనగంబు నెత్తముల మక్కువమీర రమింపు డిర్వురున్. 66

నలువుగ=నేర్పుతో, పోకమ్రాకుల=పోకచెట్లను, పెనంగిన=చుట్టుకొనిన, తీవియల్=తీగలు, చలిమిరి+ చందనాగముల=చలువ+చందనపుచెట్ల, సందిట=నడుమ, కుల్కిన=శృంగారముగాకదలు, ఏలకీ=ఏలకుల, కలయ=బాగుగా, తమాల+పర్ణముల=మకరికా+పత్రముల, తులకించున్=ప్రకాశించును, ఎందు=ఎక్కడో,

మలయ+నగంబు+నెత్తముల=మలయ+పర్వతము+కొండమీది చదును ప్రదేశమున, మక్కువ+మీర=వేడుక+అతిశయింప,

చ. నిలువున నల్లకల్వవలె నిద్దపు చామనచాయ వీనికిన్,
పలుచని గోఅజంబు వలె, పచ్చని దానవు నీవు కావునన్,
పొలతుక! మాకు నీ వితని పొత్తున, నింపుదుగాక ముచ్చటల్;
తొలకరి మబ్బుపై ధళధళుక్కను కన్నెమెఱుంగు దీవవై". 67

నిలువున=శరీరమున, నిద్దపు=దట్టపు, చామనచాయ=నలుపురంగు, పలుచని+గోఅజంబు=సన్నని+గోరోజనము, పొలతుక=ఇంతి, పొత్తున=కూడిన, నింపుదు=సిద్ధింపచేయుదువు, తొలకరి=వర్షాకాలపు మొదటి, కన్నె+మెఱుంగున్+తీవయై=చిన్న+మెఱుపు+లతపై,

వ. అని ప్రలోభింపబడియు, ఆకృతివిలోభనీయకావున, వైదర్భి పాండ్యుని మానసింపక, పురుషకార బలమున సుదూరానీతయైన లక్ష్మి, దైవప్రాతికూల్యమున వెనుదిరుగువిధమున, నటనుండి కదలి, చనియె. 68

ప్రలోభింపబడియు=మిక్కిలిఆసక్తి కలిగింపబడియు, ఆకృతి+విలోభనీయ+కావున=రూపము+ఆశచూపి ఆకర్షంచును+కనుక, మానసింపక=ఇష్టపడక, పురుషకారబలమున=పురుష ప్రయత్నమున, సు+దూర +ఆనీతయైన=చాలా+దూరమునుండి+తేబడిన, ప్రాతికూల్యమున=అనుకూలముకాక,

ఉ. ధారుణినాథు నొక్కొకని దాటి పతింవర, ఆమె, ధీరసం
చారనిశీథదీపశిఖ చాడ్పున, ముందుకు సాగిపోవగా,
పౌరపథంబునన్ వెనుకబడ్డ గృహోపరిసీమలన్ బలెన్,
కారుకొనెం దదీయవదనంబుల నొక్కట చిమ్మచీకటుల్. 69

<u>**"దీపశిఖా కాళిదాసు" అని ప్రసిద్ధి చెందిన శ్లోకానువాదము.**</u>

పతింవర+ఆమె=భర్తను వరింపనున్న +ఇందుమతి, ధీర+సంచార+నిశీథ+దీప+శిఖ+చాడ్పున=మెల్లగా +నడచుచున్న+రాత్రివేళ+దీపజ్వాల+వలె, ధారుణినాథున్+ఒక్కొకని+దాటి=రాజుల+ఒక్కొరిగా+దాటి, పౌర+పథంబునన్=రాజ+మార్గమున, ముందుకు +సాగిపోవగా=ముందుకు+వెళ్ళిపోతుండగా, వెనుకబడ్డ =దీపమునకువెనుకగామిగిలిన, గృహ+ఉపరి+ సీమలన్+వలె=మేడల+వెలుపలి+భాగములుపై+వలే, తదీయ+వదనంబులను+ఒక్కట+చిమ్మచీకటుల్= రాజుల+మొఖములపై+ఒక్కసారిగా+గాఢాంధకారము, కారుకొనెం=క్రమ్మెను,

తే. బాల దరిజేర, ఆకులపాటు పడియె/తన అదృష్టము దర్కించుకొనుచు అజుడు,
అంతలో బాహుపురి పట్టునందు నదరి/ఎడపె సందియ మతనికి, కుడిభుజంబు. 70

ఆకులపాటు=వ్యాకులత, తర్కించు=ఊహించు, బాహుపురి=కేయూరము, పట్టునందు+అదిరి=కట్టుకొను ప్రదేశము-భుజము+అదురుపాటుపొంది, ఎడపె+సందియము=తొలగించె+సందేహము, కుడిభుజంబు=కుడి భుజము అదురుట శుభ సూచన,

తే. వాని, సర్వావయవనిరవద్యు, జుచి/అన్యనృపతుల త్రోసిరాజనియె, లేమ;
విరయబూచిన సహకారవిటపి డాసి/అభిలషించునె, తేటి, వృక్షాంతరంబు. 71

సర్వ+అవయవ+నిరవద్యు=అన్ని+అవయములేకాక సాధనములందు+దోషరహితుడు, అన్య+నృపతుల+ త్రోసిరాజు అనియె+లేమ=ముందుఉండి తను చూడనిఇతర+రాజుల+తొలగింపదగినవారు+అనుకొనె+ ఇందుమతి, విరయ+బూచిన+సహకార+విటపి+డాసి=సమృద్ధిగా+పూచిన+తీయమామిడిచెట్ల+వనము+ సమీపించి, అభిలషించునె=కోరునే, తేటి=తుమ్మెద, వృక్షాంతరంబు=వేరొకచెట్టును,

వ. ఇందుమతి ఇట్లు, రఘునందను నందు సమావేశితమై తన డెంద మానందమున గందళింప, తదీయ కూలాచారశూరతావివేకవైభవాభివర్ణన మాకర్ణింప గోరియు, మందాక్షవశంవదయై, అడుగనేరకున్న, దదింగిత మెఱిగిన శుద్ధాంతపాలిక, మధురాక్షరవిన్యాసమున, నిట్లనియె. 72

సమావేశితమై=చేర్చబడినదైన, డెందము=హృదయము, కందళింప=పులకింప, తదీయ+కుల+అచార+ శూరతా+వివేక+వైభవ+అభివర్ణనము+అకర్ణింప+కోరియు=వాని+కులము+నడత+పౌరుషము+తెలివి+ ఐశ్వర్యము+బాగావర్ణించగా+విన+కోరియు, మందాక్ష+వశంవదయై=సిగ్గుకు+లోబడినదై, అడుగ+నేరక+ ఉన్న=అడగ+లేక+ఉండగా, తత్+ఇంగితము=ఆమె+అభిప్రాయము, మధుర+అక్షర+విన్యాసమున= తీయని+వాక్యముల+కూర్పుతో,

సీ "కల డశేషనృపాలకులశిరోఽభ్యర్చిత/శాసనుం, డపరాద్రిశాసనుండు,
చతురుదన్వత్కాంచిసర్వసర్వంసహా/నాయకుండు, నవామ్రసాయకుండు,
శత్రునిగ్రహదీనజనదయాద్యుత్తమ/సాధనుం, డతుల యశోధనుండు,
రాజరాజమహార్హరారాజదకలంక/లక్షణుండు, ప్రసన్నవీక్షణుండు,
క్షీరవారాశి కరణి లక్ష్మీప్రసూతి/ఉష్ణదీధితి మాడ్కి నిత్యోదయుండు,
రసికులకుపట్టుగొమ్మ, సాహసికమౌళి/గుణములకు పుట్టినిల్లు, కాకుత్ స్థనృపతి. 73

అశేష+నృపాలకుల+శిరో+అభ్యర్చిత+శాసనుండు=అందరు+రాజులు+శిరసువంచి+పూజించిన+ఏలిక, అపర +అద్రిశాసనుడు=రెండవ+ఇంద్రుడు-సమానుడు, చతుర్+ఉదన్వత్+కాంచి+సర్వ+సర్వంసహా+నాయకుడు =నాలుగు+సముద్రములు+మొలనూలుగాఉన్న+సమస్త+భూమికి+అధిపతి, నవ+అమ్ర+సాయకుండు= లేత+మామిడి చిగురు+బాణముగాకలమన్మథుడు-సమానుడు, శత్రు+నిగ్రహ+దీనజన+దయ+అది+ ఉత్తమ+సాధనుండు=శత్రువుల+అడచుట+దీనులందు+దయ+మొదలగు+శ్రేష్ట గుణములు+సాధించిన వాడు, అతుల+యశో+ధనుండు=సాటిలేని+కీర్తి+సంపదకలవాడు, రాజరాజ+మహా+అర్హ+రారాజత్+ అకలంక+లక్షణుండు=చంద్రుని (దేవతలకురాజనిశ్రుతి) వలే+గొప్ప+యోగ్యతకల+చక్రవర్తి+కానికళంకము లేని+స్వభావము కలవాడు, ప్రసన్న+వీక్షణుండు=అనుగ్రహముకల+చూపులుకలవాడు,
క్షీర+వారాశి+కరణి +లక్ష్మీ+ప్రసూతి=పాల+సముద్రము+వలే+లక్ష్మిని+పుట్టించు వాడు,
ఉష్ణదీధితి+మాడ్కి+నిత్య+ ఉదయుండు=సూర్యుని+వలే+నిత్యము+వర్ధిల్లువాడు,
రసికులకు+పట్టు+కొమ్ము=సరసులు+ఆశ్రయించు +కోటకొమ్మ(నిధానము),
సాహసిక+మౌళి+గుణములకు+పుట్టినిల్లు=సాహసుల+శ్రేష్ఠ+గుణములకు+ జన్మస్థానము,

సీ. బాసటయ్యె నధీరబర్హిర్ముఖులకెల్ల/యాతుధానులతోడి యాహవమున,
అధివసించె, విడంబితాహార్యధన్వుడై/స్వీకృతవృషరూపు, నాకనాథు,
చెఱిపిపైచె నితాంతశితశిలీముఖధార/రాత్రించరీగండపత్రరచన,
మరుదప్సరః సేవ్యమానుడై క్రైసేసె/దివిజేంద్రుడున్న గద్దియ సగంబు,
నరవరుల కెల్ల కకుదుడై, హరి మహోక్ష/కకుదమెక్కి, కకుత్ స్థవిఖ్యాతుడైన
వానిపేర జగంబున వాసి కెక్కె/కోసల జనేశ్వరులకు కాకుత్ స్థసంజ్ఞ 74

బాసటయ్యెన్+అధీర+బర్హిర్ముఖులకు+ఎల్ల+యాతుధానులతోడి+ఆహవమున=అండ అయ్యెను+ధైర్యము కోలుపోయిన+దేవతలు+అందరికి+రాక్షసులతో+యుద్ధమున, అధివసించె=ఎక్కెను, విడంబిత+ఆహార్య +ధన్వుడై=విడిచిపెట్టబడిన+భూషణములు+ధనస్సులతో, స్వీకృతవృషరూపు=వృషభ రూపము ధరించిన, నాకనాథు=ఇంద్రుని, చెఱిపిపైచె=లేనట్లు చేసె, నితాంత+శిత+శిలీముఖ+ధార=ఎడతెగని+వాడియైన+బాణ +పరంపరచే, రాత్రించరీ=రాక్షసస్త్రీల, గండపత్రరచన=చెక్కిలిపై మకరికాదిపత్ర రేఖలు(వారి భర్తల చంపుటచే), మరుత్+అప్సరః+సేవ్యమానుడై+క్రైసేసె+దివిజేంద్రుడున్న+గద్దియ సగంబు=దేవతలు+అప్సరసలు+ సేవించగా+అలంకరించె+ఇంద్రుడుకూర్చున్న+అర్థ సింహాసనము, నరవరుల కెల్ల+కకుదుడై=గొప్పమనుష

లలో+శ్రేష్ఠుడై, హరి+మహోక్ష+కకుదము+ఎక్కి+కకుత్ స్థ+విఖ్యాతుడైన=ఇంద్రుడు+శ్రేష్ఠమైనఆంబోతుకాగా +ఎక్కి (శివుడు నంది నెక్కునట్లు)+కకుత్ స్థుడని+పేరుమోసిన, వాని+పేర=పురంజయుడని తనపేరున్నను+కకుత్ స్థుడు అనిపేరుతో, వాసికెక్కె=ప్రసిద్ధిచెందె, సంజ్ఞ=పేరు,

ఉ. వాని కులంబునం బొడమి, వర్ణనకెక్కె కులప్రదీపకుం
డైన దిలీపభూపతి, మహామహు డాయన చాలు నెంతకున్,
కాని, త్రివిష్టపేశ్వరుని కన్నెఱయుం గడుపుబ్బు మాన్ప ఏ
కోనశతక్రతుత్వమున నూఱటజెందె, శమప్రధానుడై. 75

పొడమి=పుట్టి, వర్ణన+కేక్కె=ప్రసిద్ధి+చెందె, కుల+ప్రదీపకుండైన=వంశమునకు+వన్నెతెచ్చువాడైన, చాలు= సమర్థుడు, త్రివిష్టపేశ్వరుని=ఇంద్రుని, కన్నెఱయుం=కోపమును, కడుపుబ్బు=అసూయ, ఏకోనశత+ క్రతుత్వమున=ఒకటితక్కువనూరు+యాగములుచేసి, ఊఱటజెందె=నిలిపివేసెను, శమ+ప్రధానుడై= శాంతి+స్వభావుడై

తే. నెలత! అతని ఏల్బడి వాణినీజనంబు/ఆటనడిత్రోవ గనుమోడ్చి ఆదమఱువ,
వలువలు తెమల్ప, గాలియు దలకు నన్న/మొనసి ఎవ్వడు? చేసాచు, మ్రుచ్చిలింప.76

నెలత=స్త్రీ, ఏల్బడి=పాలనలో, వాణినీజనంబు=ఆటకత్తెలు, ఆట+నడిత్రోవ=ఆట+మధ్యలో, కనుమోడ్చి+ ఆదమఱవ=నిద్రించ+హాయిగా, వలువలు=బట్టలు, తెమల్ప=సడలించ, తలకును=వెనుదీయు, మొనసి= పూని, చేసాచు=చేయి+చాచు, మ్రుచ్చిలింప=దొంగలింప,

శా. ఆ రాజన్యమహేంద్రునౌరసుడు, రాజై విశ్వవిశ్వంభరా
ధౌరంధర్యము బూను నేడు, సుగుణోదారుండు దుర్ధర్షదో
స్సారుం, డూర్జితధర్మవీరు, డమలాచారుండు, శశ్వజ్జయ
శ్రీరమ్యుండు, ప్రజాభిగమ్యుడు జగజ్జేగీయమానోన్నతిన్. 77

రాజన్య+మహేంద్రుని=రాజులలో+ఇంద్రుని, ఔరసుడు=కుమారుడు, విశ్వ+విశ్వంభరా+ధౌరంధర్యము= సమస్త+భూమండలపు+భారమువహింప, పూనున్=ప్రారంభించె, సుగుణ+ఉదారుండు=మంచిగుణములు కలవారిలో+గొప్పవాడు, దుర్ధర్ష+దో+స్సారుండు=పొందశక్యముకాని+భుజ+బలము కలవాడు, ఊర్జిత+ ధర్మ+వీరుడు=ధృఢమైన+ధర్మపాలనయందు+శూరుడు, అమల+ఆచారుండు=నిర్మల+ప్రవర్తన కలవాడు, శశ్వత్+జయ+శ్రీ+రమ్యుండు=శాశ్వత+జయ+లక్ష్మితో+ఒప్పువాడు, జగత్+జేగీయమాన+ఉన్నతిన్= లోకముచే+కొనియాడబడు+ఔన్నత్యముతో, ప్రజ+అభిగమ్యుడు=జనులకు+సులభుడు,

సీ. కామధేనువు బిడ్డ కారుణ్యవరమున/జనతపఃపాకమై సంభవించె,
కొమరు ప్రాయము నాడె కులిశాయుధపు దెబ్బ/సరకుసేయని చేవసిరి వెలార్చె,
మనువంశమహనీయమహిమ పొంపిరివోవ/సర్వదిగ్విజయము నిర్వహించె,
క్రతువేళ కలిమిని కడముంత కడమగా/తీర్థార్థిబృందసాత్కృతము సేసె,
అసమయార్థియై వచ్చిన ఆప్లుతునకు/ఆకసము బిండి, శ్రుతనిష్క్రయము ఘటించె,
అసదృశయశుండు లోకత్రయంబునందు/కేవలనరుండె! శ్రీ రఘూక్ష్మావరుండు. 78

కామధేనువుబిడ్డ=నందిని, కారుణ్య=దయ, జన+తపఃపాకమై=తల్లిదండ్రుల+పూజా ఫలమై, సంభవించె= పుట్టెను, కొమరుప్రాయము=లేతవయస్సు, కులిశ+ఆయుధపు=ఇంద్రునివజ్ర+ఆయుధపు, సరకు+సేయని =లెక్క+పెట్టని, చేవ+సిరి+వెలార్చె=బల+సంపద+వ్యక్తపరచె, మను+వంశ+మహనీయ+మహిమ+పొంపిరి వోవ=మనువు+కులపు+ఘనమైన+గొప్పదనము+వర్ధిల్ల, సర్వ+దిగ్విజయము+నిర్వహించె=అన్ని + దిక్కుల అందరి రాజులను జయించుట+పూర్తిచేసె, క్రతు+వేళ+కలిమిని=యాగ+సమయమున+సంపద నంతా, కడముంత=చిన్న మట్టిపాత్ర, కడమగా=మిగులునట్లుగా, తీర్థ+అర్థి+బృంద+సాత్కృతము+సేసె= యాగమండలిఅర్చక+యాచక+సమూహమునకు+అధీనముచేసెను, అసమయ+అర్థియై=సమయమును ఉల్లంఘించివచ్చిన+యాచకుడై, ఆప్లుతునకు=స్నాతకునకు, ఆకసమున్+పిండి=ఆకాశమును+ఆవుపాల కువలేపితికి, శ్రుత+నిష్క్రయము+ఘటించె=వేదపాఠమునకు+మూల్యము+కలిగించె, అసదృశ+యశుండు= సాటిలేని+కీర్తికలవాడు, లోకత్రయంబునందు=ముల్లోకములందు, కేవలనరుండె=మానవమాత్రుడా!

తే. కులనగము లెక్కి, సాగరంబులను దాటి/భుజగజగమున దూరి పై భువనములకు,
నెగసి, అనుబంధియై యొప్పు మగువ, ఎట్టి/మానమున, గొల్వరానిదై, వాని కీర్తి.79

కులనగములు=కుల పర్వతములు, సాగరంబులను=సముద్రములను, భుజగ+జగమున=పాముల+ లోకము-పాతాళము, పై భువనములకున్=స్వర్గమునకు, అనుబంధియైయి=భూత భవిష్యత్ వర్తమాన వ్యాప్తమై, ఎట్టి+మానమున+కొల్వ+రానిదై=ఏ+కొలబద్దచేత+కొలువ+లేనిదైనది.

ఉ. ఏకజనేశ్వరుండు జగదేకధనుర్ధరు డమ్మహాత్ము నే
కైకసుతుండు వీ డజసమాఖ్యుడు, వంశకరుండు దమ్యుడై
కాకలుదేఱి తండ్రి చిరకాలమునుండి వహించుచున్న అ
స్తోకజగద్భరం బతనితోడ సమంబుగ మోయు దక్షతన్. 80

ఏక=ఏకైక, జన+ఈశ్వరుండు=ప్రజలను+కాపాడురాజు, జగత్+ఏక+ధనుర్ధరుడు=లోకములో+అసమాన+ విల్లుపట్టినవాడు, ఏకైక+సుతుండు=ఒక్కగానొక్క+కుమారుడు, సమాఖ్యుడు=పేరుకలవాడు, వంశకరుడు =కులము ఉద్ధరించువాడు, దమ్యుడై=సుశిక్షితుడై, కాకలుదేఱి=ఆరితేఱి, అస్తోక=అనల్ప-గొప్ప, జగత్+ భరంబు=లోక+భారము, దక్షతన్=సమర్థతతో,

మ. పనితోదాత్తకులంబునన్, నవవయఃపాకంబునన్, రూపునన్,
వినయాలంకృతసద్గుణోచ్చయమునన్, వేయేల అన్నింట, నీ
కనుగుణ్యుండు, వరేణ్యు, డీతనికి, కేలందింపు జాగేల? కాం
చన సంపర్కము, పద్మరాగమునకున్, సంధిల్లుగా కంగనా! 81

పనిత=పొగడబడిన, ఉదాత్త=గౌరవింపదగ్గ, పాకంబునన్=పరిపక్వతను, వినయ+అలంకృత+సత్+గుణ+ ఉచ్చయమునన్=వినయముతో+కూడిన+మంచి+గుణముల+పెంపుననూ, వేయి+ఏల=పెక్కు మాటలు+ ఎందుకు, నీకు+అను గుణ్యుండు=నీకు+తగిన గుణములు కలవాడు, వరేణ్యుడు=కోరదగ్గవాడు, కేలు+ అందించు=చేయి+చేర్చుము, కాంచన=బంగారపు, సంపర్కము=కలయిక, పద్మరాగమునకున్=మణికి, సంధిల్లుగాక=కూడునుగాక,

మంగళమహాశ్రీ. శ్రీరఘు సుపుత్రు, సరసీజదళనేత్రు, ప్రభు/చిహ్న రమణీయశుభగాత్రున్,
పౌరుషవిశాలు, నిరవద్యగుణశీలు, మృదు/భావకరుణారసవిలోలున్,
వారిజహితాన్వయు, నివారిత దరస్మయు, అ/వారితభుజాబలవిహారున్,
మారసుకుమారుని, కుమారనిభు, బొంది కను/మా, రమణి! మంగళమహాశ్రీ." 82

సరసీజ+దళ+నేత్రు=పద్మ+పత్రములవంటి+కన్నులుకలవాడు, ప్రభు+చిహ్న+రమణీయ+శుభ+గాత్రున్ =రాజ+లాంఛనమున్న+కమనీయ+మంగళ+స్వరూపుడు, పౌరుషవిశాలు=మగటిమికి ప్రసిద్ధుడు, నిరవద్య =దోషములేని, మృదు+భావ+కరుణా+రస+విలోలు=సౌమ్యమైన+స్వభావము+దయా+రసములు చిందించు+చూపులుకలవాడు, వారిజహిత+అన్వయు=సూర్య+వంశస్థుని, నివారిత+దర+స్మయు=పెద్ద నవ్వును దాచి పెట్టి+చిన్న+నవ్వు కలవాడు, అవారిత=అడ్డగింపలేని, మార=మన్మదునివలె, కుమార+ నిభు=కుమారస్వామితో+సమాను, మంగళ+శ్రీ+మహత్=శుభ+సంపదల+ఔన్నత్యము,

ఉ. ఆ మధురప్రశంస హృదయంగమమై తొలిచూపు ప్రేమకున్
స్థేమము గూర్చి, ప్రోద్బలము సేయగ, లజ్జనతిక్రమించి, ఉ
ద్దామమనఃప్రసాదవిశదం బగు చూపున స్వీకరించె, నె

త్తామరకంటి, సంవరణదామముచే బలె, అక్కుమారకున్. 83

మధుర+ప్రశంస=ఇంపైన+పొగడ్త, హృదయంగమమై=సమ్మతమై,
స్థేమము+కూర్చి=స్థిరత్వము+కలిగింపగా, ప్రోద్బలము=పురికొలుప, లజ్జ+అతిక్రమించి=సిగ్గును+మీటి,
ఉద్దామ+మనః+ప్రసాద+విశదంబగు=అధిక మైన+మనస్సునందలి+ప్రసన్నత+స్పష్టముగా కనబడు,
నెఱ+తామర+కంటి=విరసిన+తామరలవంటి+ కండ్లుకలది,
సంవరణ+దామముచే+బలె=రహస్యమైన+సంధానము+వలే(ఏదో తెలియరాని+బంధము/
స్నేహముచే+వలె),అక్కుమారకున్=ఆ కుమారునితో, స్వీకరించె=అంగీకరించె,

తే. అలవిగాకుండె, బాల కా చెలువుమీది/తగులము వచింప, శాలీనతాభరమున,

అది గగుర్పాటు నెపమున అణువలగ్న/ఒడలు భేదించుకొని బయల్పడియె, గాని 84

చెలువు+మీది=అందము+మీది, తగులము=ఆసక్తి, శాలీనతా+భరమున=సిగ్గుయొక్క+అతిశయమున,
వచింప=చెప్పగా, అలవిగాకుండె=శక్యము కాకపోయెను, అది=ఆ ఆసక్తి, ఒడలు+భేదించుకొని=దేహము+
నుండిపైకి, అణువు+అ లగ్న=కొంచముగా+విడబడి, గుర్పాటు+నెపమున=పులకల+మిషతో,
బయల్పడియె+కాని=బయిట పడెను+అంతే,

ఉ. బాలిక చందమున్, ప్రణయబంధము, గాంచియు,"పోద మర్ధచం
ద్రాలిక! వేఱుచోటికి రయంబున రమ్మని" మేలమాడు ద్వాః
పాలికవంక జూచె, సితపంకజలోచన యౌట పోయి, యా
వాలికకంటి, తా నరుణవారిజలోచనయై, చిరాకుతోన్. 85

చందము=విధము, అర్ధచంద్ర+అలిక!=అర్ధచంద్రునివంటి+నొసలు కలదానా!, రయంబున=వేగముగా,
మేలమాడు=పరిహసించు, సిత+పంకజ+లోచన+యౌట+పోయి=తెల్ల+తామరలవంటి+చూపుకలది+
అయిననూ+అదివిడచి, వాలిక+కంటి=వాడి+కళ్ళుగల, అరుణ+వారిజ+లోచనయై=ఎఱ్ఱ+తామరలవంటి
+చూపుకలదై, చిరాకుతోన్=చిరాకుగా, ద్వాఃపాలిక+వంక+చూచె=ద్వారపాలిక+వైపు+చూచెను,

తే. దాది కందించి వేయించె దానిచేత/కంబుకంధర, రఘుసూను కంధరమున,

బొమ్మకట్టిన హృదయరాగమ్ము బోని/చూర్ణగౌరమధూకప్రసూనమాల.

86

దాది=పరిచారిక-సునంద, కంబు+కంధర=శంఖమువంటి+కంఠముకలదైన ఇందుమతి, కంధరమున= మెడలో, బొమ్మకట్టిన=మూర్తీభవించిన, హృదయ+రాగమ్ము+బోని=మనస్సులోని+అనురాగము+పోలిన, చూర్ణగౌర+మధూక+ప్రసూనమాల=కుంకుమపొడిచే ఎఱ్ఱనైన+ఇప్ప+పూలమాల,

తే. పెడదయగు పేరెడందపై ప్రేలియాడు/ఇప్పపూదండ జూచి, రహించె, నజుడు,
మృదువులగు బాహులతికలుమెడకు జుట్టి/వక్షమున అత్తమిల్లిన వధువెయనుచు. 87

పెడదయగు+పేరు+ఎడందపై=విశాలమైన+పెద్ద+వక్షస్థలమమున, రహించె=శోభిల్లె, మృదువులగు+బాహు +లతికలు=కోమలమైన+చేతులనే+తీగలతో, మెడకు+చుట్టి=మెడను+చుట్టుకొని, అత్తమిల్లిన=ఒఱిగిన,

సీ. పఱిమొయిల్ విడివడ్డ పంటకార్జాబిల్లి/గలసిన చాయవెన్నెల విధమున,
రత్నాకరేంద్రుని రంగత్తరంగహ/స్తమును బట్టిన జహ్నుతనయ కరణి,
ఎలమావి మోకతో చెలువుగా పెనగొన్న/తెలిజాజిమల్లె లేదీవ పగిది,
అనురూపహృద్యపద్యములోన ఇమిడిన/వరసుకుమారభావమ్ము లీల,
కొమ్మ, అజునకు, దన్నిచ్చుకొనుట, జూచి/సదృశగుణయోగసంతుష్టహృదయులైన
నగరసంవాసు లైక్యకంఠమున బొగడు/పలుకులు నృపుల చెవులకు ములుకు లయ్యె. 88

పఱ+మొయిల్+విడివడ్డ=గుంపులుగాఉన్న+మేఘములు+తొలగి, పంటకారు+జాబిల్లిన్+కలసిన = శరదృతువు+చంద్రుని+కలిసిన, చాయ+పెన్నెల=కాంతివంతమైన+పెన్నెల, రత్నాకరేంద్రుని+రంగత్+తరంగ +హస్తమును+పట్టిన+జహ్నుతనయ+కరణి=సముద్రుని+నాట్యమాడు+అలలను+చేతులను+చేపట్టిన+ గంగానది+విధమున, ఎల+మావి+మోకతో+చెలువుగా+పెనగొన్న=తియ్యని+మామిడి+మొక్కను+ ఇష్టముగా+చుట్టుకొనిన, తెలి+జాజిమల్లె+లేదీవ+పగిది=తెల్లని+జాజిమల్లి+లేతతీవ+విధమున, అనురూప +హృద్య+పద్యములోన+ఇమిడిన+వర+సుకుమార+భావమ్ము+లీల=అనుగుణమై+మనసుకుఇంపైన+ పద్యములోన+అంతర్భూతమగు+ఉత్తమమైన+మృదు+ఆలోచన+విధముగా, కొమ్మ+అజునకు+తన్ను+ ఇచ్చుకొనుట+జూచి=ఇందుమతి+అజునకు+తనను+సమర్పించుకొనుట+చూచిన, సదృశ+గుణ+యోగ+ సంతుష్ట+ హృదయులైన+నగర+వాసులు=సమాన+గుణముల+కూడికచే+సంతోషించిన+మనస్సుగల వారైన+పట్టణ+ప్రజలు, ఐక్య+కంఠమునన్+పొగడు+పలుకులు=ఏక+గ్రీవంగా+పొగడుచున్న+మాటలు, నృపుల+చెవులకు+ములుకులు+అయ్యె=నిరాకరింపబడినరాజుల+చెవులలో+ముల్లులు+ఐనవి

చ. ప్రముదితచిత్తులై వరుని పక్షమువా రొకచో హసింపగా,

విమతులు, ఖిన్నులై ముడిగి, వేఱొక చోటవసింపగా, సదం
బమరె, విభాతవేళ దళితాంబుజషండము సంప్రబుద్ధమై,
కుముదము లన్నియున్ నిదురగూరిన ఆటకొలంకు తీరునన్. 89

విభాతవేళ=ప్రభాతవేళ, దళిత+అంబుజ+షండము+సంప్రబుద్ధమై=వికసించిన+కమలముల+గుంపు+బాగుగా మేలుకొనినపై, కుముదములు+అన్నియున్=కలువలు+అన్నీ, నిదురన్+కూరిన=ముడుచుకొనిన, ఆట+కొలంకు+తీరుగన్=క్రీడా+సరస్సులందు+విధముగా,
ప్రముదిత+చిత్తులై=హర్షమునిండిన+మనస్సులై, హసింపగా=ఆనందించగా, విమతులు=శత్రురాజులు, ఖిన్నులై=దుఃఖపడువారై, ముడిగి=ముడుచుకొని, సదంబు+అమరె=రాజభవనము+ఒప్పెను,

# సప్తమ సర్గము-ప్రత్యర్థిపరాజయము

క. నిరతిశయరూపసద్గుణ/పరమావధియున్, సదృక్షపతియోగమునన్
శరజన్మసహితసాక్షా/త్సురసేనకు సాటియైన సోదరి సెలమిన్. 1

నిర్ అతిశయ+రూప+సద్గుణ=అధిగమించలేని+రూపసౌందర్య+సుగుణములకు, పరమ+అవధి=గొప్ప+హద్దు-మేర, సదృక్ష+పతి+యోగమునన్=సమాన ప్రకాశముకల+పతితో+కూడి, శరజన్మ+సహిత= కుమార స్వామి+తో, సాక్షాత్+సురసేనకు=సాకారమైన+దేవసేనకు, ఎలమిన్=ప్రేమతో,

వ. అభినందించి, ప్రమోదసంపత్ప్రఫుల్లమానసుడైన క్రథకైశికాధిపతి, వధూవరుల బురమేగించి, పదంపడి తదీయ పాణిగ్రహణమహోత్సవమును నిర్వర్తించు క్రియాకలాపమున నిమగ్ను డయ్యెను. ఇందుమతీనిరాకృతులైన రాజన్యులలో గృతబుద్ధులు కొందఱు తమతమ భాగధేయములను నిందించుకొని నిట్టూర్చి, వైదర్భుని సభాజనము వడసి, నిజరాష్ట్రములకు పయోధిపాథస్తరంగముల వలె మగిడిరి. రూపాభిమానులు, దుర్విదగ్ధులు, బలగర్వితులు కావున, తదితరుల కా యవజ్ఞ బహిరంగశిరశ్ఛేదకల్ప మయ్యెను. కాకుత్ స్థుని అదృష్టపరిపాకమును, మహోచ్ఛతయునువారి హృదయములను భగభగమనిపించెను.
2

అభినందించి=సంతోషించి, ప్ర+మోద+సంపత్+ప్రఫుల్ల+మానసుడైన=అధిక+హర్షము+నిండి+బాగాఉల్లసిల్లు +హృదయము కలవాడైన, కలాపము=సమూహము, పురము+ఏగించి=నగరమునకు+పంపించి, పదంపడి =మఱియు, తదీయ=వారి, నిర్వర్తించు=చేయు, క్రియా+కలాపమున=పనుల+సమూహమున, నిమగ్ను డయ్యె=మునిగిన వాడడయ్యె, నిరాకృతులైన=తిరస్కరింపబడ్డ, కృతబుద్ధులు=మంచి తెలివి కలవారు, భాగధేయము=అదృష్టము, సభాజనము+పడసి=గౌరవము+పొంది, పయోధి+పాథస్+తరంగములవలె+మగిడిరి=సముద్రపు+నీటి+కెరటముల వలే+వెనుకకు మరలిరి, రూప+అభిమానులు=రూపమందు+

గర్వము కలవారు, దుర్విదగ్ధులు=విఱ్ఱవీగువారు, ఆ+అవజ్ఞ=ఆ+తిరస్కారము, బహిరంగ+శిర శ్ఛేద+ కల్పము=అందరిముందు+తలకొట్టిన+అట్లు, పరిపాకము=పరిమాణము, మహా+ఉచ్చత=ప్రభావపుఆధిక్యత

శా. ప్రత్యూషగ్రహమందభాసులు దివాస్వప్నాశులై సుందరీ
ప్రత్యాఖ్యానము ద్రిప్పికొట్టదమకింపం జూచియున్ రాఘవ
ప్రత్యర్థుల్, సభలోన గొల్వబడు నింద్రాణిన్ విలోకించి, ఏ
ప్రత్యూహంబు దదుత్సవంబున కొనర్పం గొంకి ఉద్విగ్నులై 3

ప్రత్యూష+గ్రహ=ప్రభాతమున+చంద్రాది గ్రహములవలె, మంద+భాసులు=సన్నగిల్లిన+ప్రాకాశము కలవారు, దివా+స్వప్న+ఆశులై=పగటి+కలలైన+ఆశలుకలవారై, ప్రత్యాఖ్యానము=నిరాకరణ, త్రిప్పికొట్టన్+తమకింపం =ప్రతీకారమునకు+త్వరపడ, ఇంద్రాణిన్+విలోకించి=శచీదేవి(స్వయంవర విఘ్నముల నశింప చేయునని ఆగమము) అక్కడుండుట+చూచి, తత్+ఉత్సవంబునకు=ఆ+వేడుకకు, ఏ+ప్రత్యూహంబు=ఎటువంటి+ విఘ్నము, ఒనర్పం=చేయుటకు, కొంకి+ఉద్విగ్నులై=జంకి+మనస్సుకుదురులేనివారై,

క. ఆపాదమస్తకంబును/వ్యాపాదము నిండి తొలక నరిగిరి బసకున్,
రూపంబుల వేషంబుల/చూపోపమి దెలియనీక క్షుభితాత్మకులై. 4

ఆపాదమస్తకంబును=పాదమునుండితలవరకు-శరీరమంతయు, వ్యాపాదము+నిండి+తొలకన్=ద్రోహపు తలపు+నిండి+పైకుబుకుచుండగా, బసకున్=విడిదికి, అరిగిరి=వెళ్ళిరి, చూపోపమి=ఓర్వలేనితనము, క్షుభిత+అత్మకులై= వ్యాకులత+చెందినవారై,

ఉ. తేకువమాలి తొల్లి రఘు దిగ్విజయంబున తాము కన్న అ
స్తోకపరాభవంబునకు దోడు, తదాత్మజు నంగనామణి
స్వీకృతి దమ్ము క్రిందుపడజేయుట ప్రేకపు గోరుచుట్టుపై
రోకటిపోటు కైవడి అరుంతుదమై ఎరియింప జొచ్చినన్. 5

తేకువ+మాలి=ధైర్యము+చెడి, కన్న=ఎదుర్కొనిన, అస్తోక=అధిక, తత్+అత్మజు=ఆరఘుని+కొడుకు-అజుని, అంగనామణి+స్వీకృతి=ఇందుమతి+వరించుట, ప్రేకపు=దుర్భర, అరుంతుదమై=నొప్పించునదై, ఎరియింపన్ +చొచ్చినన్=కాల్చు+చుండగా,

వ. అక్కసులై యందఱు నొక్కుమ్మడిగ నజు నుక్కుమడప గత్తికట్టి ప్రతీకారమునకు పదకము

రూపొందించుకొని, కార్యవాదులై, తమదురుద్యమము, పరభావనిరూప్యము గాకుండ జాగ్రత్తపడి,
తేనెపూసినకత్తులై యుండిరి. ఈలోన, నక్కడ మంగళతూర్యములు, మాగధగానములు,
మహీసురాశీర్వాదములు సెలంగ, భోజపురస్సరముగ గదిలి. 6

అక్కసులై=ఆగ్రహించినవారై, ఒక్కుమ్మడిగ=ఒక్కసారిగకలసి, ఉక్కు+మడప=శక్తి+అడచ, కత్తికట్టి= కలహమునకు సిద్ధపడి, పదకము=ప్రణాళిక, కార్యవాదులై=కర్తవ్యమునిర్ణయించినవారై, దుర్+ఉద్యమము= చెడ్డ+ప్రయత్నము, పర+భావము+నిరూప్యము=చెడు+బుద్ధి+నిరూపణ, మాగధ+గానములు=(రెండు) వంశ కీర్తనలుచేయు మాగధుల+స్తుతులు, మహీసుర=బ్రాహ్మణ, సెలంగ=మాఱుమ్రోగగా, భోజ+పురస్సర ముగన్+కదలి=భోజుడు+ముందునడచుచుండగా+సాగి,

ఉ. శ్రీయుతమూర్తియై, సహపరిగ్రహుఁడై పురమేగె హర్షసం
ధాయకుఁడై అజుండు పరితఃపరికీర్ణసుమోపచార, మిం
ద్రాయుధకల్పతోరణగణాంకము, వాయుసమీరితధ్వజ
చ్ఛాయనివారితోష్ణము విశంకట రాజపథంబు వెంబడిన్. 7

శ్రీ+యుత+మూర్తియై=శోభ+నిండిన+ఆకారుడై, సహ పరిగ్రహుడై=భార్యతోకూడి, హర్ష+సంధాయకుడై= సంతోషము+కలిగించువాడై, పరితః+పరికీర్ణ+సుమ+ఉపచారము=పూర్తిగా+అంతటా చల్లబడిన+పూలచే +సన్మానముచేయుచు, ఇంద్ర+ఆయుధ+కల్ప=ఇంద్రుని+విల్లు-ఇంద్రధనస్సు+వలె, తోరణ+గణ+అంకము =తోరణాల+గుంపులు కల+చోటుల, వాయు+సమీరిత+ధ్వజ+ఛ్ఛాయ+నివారిత+ఉష్ణము=గాలిచే+రేప బడిన+జెండాల+నీడలచే+అడ్డగింపబడిన+వేడిమికల, విశంకట+రాజ+పథంబు=విశాల+రాజ+మార్గము, వెంబడిన్=వెంట,

తే. తదవలోకననిరతలై, త్యాజితాన్య/కార్యలై, అప్పుడొండొరు గడచి వచ్చి,
శ్రేణి గట్టిరి, కుండిన స్త్రీలు దర్శ/నానుకూలములగు చోటు లాక్రమించి. 8

తత్+అవలోకన+నిరతలై=వారిని+చూడ+ఆసక్తికలవారై, త్యాజిత+అన్య+కార్యలై=విడచిన+ఇతర+పనులు కలవారై, ఒండొరు=ఒక్కొక్కరు, కడచి=మర్యాదనతిక్రమించిదాటి, శ్రేణి=వరుస, దర్శన+అనుకూలములగు= చూచుటకు+వీలగు,

చ. పొడగను చోటి కేగుచు, సముత్సుకతాత్వరమాణ చిత్తయై,

నడకల హంస యౌ టుడుగినన్, నడిత్రోవనె వాంతమాల్యమై,

విడివడు కేశపాశమును వే తన చేతికి దార్చె, గాని తా

ముడువ దలంప దయ్యె, ఒక ముద్దులగుమ్మ అనన్యదృష్టియై 9

పొడగను+చోటికి+ఏగుచు=చూచుటకు+వీలైనప్రదేశమునకు-కిటికి+వెళ్ళుచు, సమ+ఉత్సుకతా+త్వరమాణ +చిత్తయై=గొప్ప+తహతహతో+తొందరపడు+బుద్ధితో, నడకలహంసయౌట+ఉడుగినన్=హంసల వంటినడక +వేగమువలన విరమించ వలసివచ్చిననూ, వాంత+మాల్యమై=జాఱిన+పూదండకలదై, వే=త్వరగా, తార్చె =చేర్చె, ముడువ=సరిగాదిద్ద,

న అన్య+దృష్టియై=మరేదానిపై+ధ్యానముఉంచలేక,

క. అడుగులబూసిన వర్ణము/తడియాఱదు నాక వచ్చి, తత్తఱ మెసగన్

పడతుక ఒకర్తు మార్గము/పొడవున లాక్షారసమున ముద్రలు వేసెన్ 10

తడి+ఆఱదు+నాక=తడి+ఆఱలేదు+అనక, తత్తఱము+ఎసగన్=తొందరపాటు+అతిశయింప, లాక్షారసమున +ముద్రలు+వేసెను=కాలికివేసుకొన్న పారాణిరంగు మార్గమంతా కారగా+గుర్తులు+ఏర్పరచెను,

ఉ. కాంచనగంధి యోర్తు కుడికంటికి కాటుక రేఖ దిద్ది త

ద్వంచితవామనేత్రయయు వచ్చె, అముక్తశలాకయై గవా

క్షాంచలసీమకున్, పరవశాత్మక యయ్యె కుమారు జూచి, రో

మాంచమునం గరాంగుళుల కంజనతూలిక అంటియుండగన్ 11

కాంచన+గంధి=సంపెగవంటి+శరీర సువాసనకల స్త్రీ, ఓర్తు=ఒకతె, తత్+వంచిత+వామ+నేత్రయయు =కాటుక+లేని+ఎడమ+కన్ను+కలదై, అముక్త+శలాక=విడవని+కాటుకకుంచెతో, గవాక్ష+అంచల+సీమకున్ =కిటికీ+సమీప+ప్రదేశమునకు, పరవశ+ఆత్మక=పరవశమైన+మనస్సుకలదై, రోమాంచమునం= గగుర్పాటుతో, కర+అంగుళుల=చేతి+వ్రేళ్ళలో, అంజన+తూలిక=కాటుక+కుంచె,

తే. జాలకాంతరలగ్నలోచన ఒకామె/గతివశత వోకముడి జాఱ, గట్ట మఱచె

నాభినిర్విష్టకంకణశోభతోడి/హస్తమునబట్టి యుంచె, నా అంశుకమును 12

జాలక+అంతర+లగ్న+లోచన=కిటికీ+సందు అందు+ఆసక్తికల+చూపుకలదై, గతి+వశత+వోక+ముడి+ జాఱ=తననడక వేగము+వలన+చీర+ముడి+వీడగ, నాభి+నిర్విష్ట+కంకణ+శోభ+తోడి=బొడ్డున+ఉంచిన+

చేతితోరణ+కాంతి+తోడ, హస్తమున+పట్టి+ఉంచె=చేతితో+పట్టుకొని+అట్లేఉంచెను, అంశుకమును= వస్త్రమును,

ఆ. సగము గ్రుచ్చి ఒకతె సంభ్రమమున లేచి/అడుగడుగున మణులు పుడమి రాల,
అజుని జూడ నరిగె, నంగుష్టమూలవి/న్యస్తసూత్రశేష యయ్యె రశన. 13

గ్రుచ్చి=మణులమాలకూర్చి, అంగుష్ట+మూల+విన్యస్త=చేతిబొటనవ్రేలి+మొదలున+ఉండిన, సూత్రశేష+ అయ్యెరశన=మిగిలిన దారమే+మొలత్రాడైనది(రతనములు జారినవి),

క. నిరవధిక నిబిడకౌతుక/పరవశ వనితావిపుల్లవదనవ్యాప్తాం
తరముల్, సహస్రపత్రా/భరణము లటు, మెఱసె భవనవాతాయనముల్. 14

నిరవధిక+నిబిడ+కౌతుక=మేరలేని+దట్టమైన+కుతూహలముచే,
పరవశ+వనితా=మైమరిచిన+స్త్రీల, విపుల్ల+వదన+వ్యాప్త+అంతరముల్=బాగాప్రకాశించు+ ముఖములచే+వ్యాపించిన+లోపలి భాగములతో, భవన+వాతాయనముల్= భవనముల+ కిటికీలు, సహస్రపత్ర+అభరణము+మెఱసె=తామరలతో+అలంకృత మైనట్లు+మెరిసినవి,
(కిటికీలన్ని తామరలవంటి కండ్లతో నిండి మెఱసెను)

తే. కొసరి రాఘవు గన్నుల గ్రోలికొనిరి/రమణు లందఱు విషయాంతరములు మఱచి,
ఎడపక తదన్యకరణప్రవృత్తి గూడ/అక్షియుగములె గుత్తగొన్నట్లు తోప. 15

విషయాంతరములు+మఱచి=మిగిలినఅన్ని విషయములు+మఱచిపోయి, రమణులు+అందఱు=స్త్రీలు+ అంతమంది, ఎడపక కొసరి+రాఘవు+కన్నుల+క్రోలికొనిరి=అవిచ్ఛన్నముగా+కొసరికొసరి+అజుని+కన్నుల తో+జుఱ్ఱుకొనిరి. తత్+అన్య+కరణప్రవృత్తి=కన్నులుకాక+మిగిలిన+శ్రోత్రాదులయిన ఇతర ఇంద్రియముల వ్యాపారములు, అక్షియుగములె+గుత్త+కొన్నట్లు+తోప=రెండుకనులే+గుత్త+తీసికొనట్టు+అనిపించగా(వారి కన్నులుతప్ప ఇతర ఇంద్రియజ్ఞానములు పనిచేయలేదు)

శా. ఓజస్వంతుని, ఉజ్జ్వలాంగుని, అనూనోర్జస్వలున్, భావభూ
రాజల్లక్షణవీక్షణీయు, రమణీరాగాబ్ధిరాకావిధున్,
సౌజన్యాకరు, నక్కుమారుని గని సంశ్లాఘించి రక్కామినుల్,
భోజక్ష్మాపయవీయసీకృతపురాపుణ్యోదయాభోగమున్ 16

ఓజస్+వంతువి=తేజస్సు+కలవాని, ఉజ్జ్వల అంగుని=సింగారుని, అనూన+ఊర్జస్+వలున్=వెలితిలేని+ఉత్సాహము+కలవాని, భావ+భూరాత్+లక్షణ+వీక్షణీయు=స్వాభావిక+రాజ+గుణములతో+చూడదగ్గ వాడు, రమణీ+రాగ+అబ్ధి+రాకావిధున్=స్త్రీ+అనురాగమనే+సముద్రమునకు+చంద్రుడు, సౌజన్య+ఆకరు=మంచితనానికి+స్థానమైనవాడు, సం+శ్లాఘించిరి+అక్కామినుల్=బాగుగా+ప్రశంసించిరి+అస్త్రీలు, భోజక్ష్మాప+యవీయసీ+కృత+పురా+పుణ్య+ఉదయ+ఆభోగమున్=భోజరాజు+చెల్లెలు+చేసిన+పూర్వ+పుణ్య+ఫల+సిద్ధి+పరిపూర్ణతను,

సీ. "లోభనీయసమగ్రశోభమానుల వీరి/నిరువుర విధి కూర్చు టెంత లెస్స!
కూర్పకుండిన, నయో! కొఱమాల కెట్లుండు/అతని రూపవిధానయత్నగరిమ!
రసికరాజులు, మహారాజులు శంభళీ/ముఖమున దన కెంత మోజుపడిన,
అనుమతించక మంచిపని చేసె వైదర్భి/ఈ స్వయంవరమున కిచ్చగించి!
అన్యథా, పొందియుండునే? ఆత్మతుల్యు/విశ్వమోహనవిగ్రహు వీని నీమె?
కనులు చల్లగ గంటిమి, గాదె! వీరి/నిండుచందురు, పండువెన్నెలను బోలె. 17

లోభనీయ+సమగ్ర+శోభమానుల=ఆకర్షణీయమై+సంపూర్ణ+చక్కదనముకలవారైన, విధి=బ్రహ్మ, లెస్స=మేలు, కొఱమాలక=పనికిమాలక, అతని+రూప+విధాన+యత్న+గరిమ=బ్రహ్మయొక్క+సౌందర్య+నిర్మాణ+ప్రయత్నపు+శ్రేష్ఠత, శంభళీ+ముఖమున=దూతిక+ద్వారా, ఇచ్చగించి=ఒప్పుకొని, అన్యథా=కాకుండిన, ఆత్మ+తుల్యు=తనతో+అన్నివిధాలసాటివాని, విశ్వ+మోహన+విగ్రహు=అందరిని+వలపించు+మూర్తికల వాడు

మ. రతియుం, బంచశరుండు ధాత్రి నవతారం బెత్తి రీజంటగా,
చతురంతక్షితిలోని పార్థివసహస్రంబందు వీనిన్ నిజ
ప్రతిరూపుండని బాల చేకొనియె, పూర్వస్నేహబంధస్మృతిన్,
గతజన్మాంతరసంగతిజ్ఞమని వక్కాణింపరే చిత్తమున్" 18

పంచ+శరుండు=మన్మధుడు, చతురంత+క్షితి=నాలుగు సముద్రములమధ్య+భూమి, పార్థివ+సహస్రంబు+అందు=రాజకుమారులు+వేలమంది+లో, నిజ+ప్రతిరూపుండు+అని=తనగుణములకు+ప్రతిబింబము వంటివాడు+అని, బాల=ఇందుమతి, చేకొనియె=గ్రహించె, పూర్వ+స్నేహ+బంధ+స్మృతిన్=గతజన్మ+ప్రేమ+

బంధము+గుర్తున్నట్లుగా, గత+జన్మ+అంతర+సంగతి+జ్ఞము+అని=పూర్వ+జన్మ+లోని+సంగతులు+తెలిసుకొనునది+అని, వక్కాణింపరే=నొక్కిపలకరే, చిత్తమున్=మనస్సును,

సీ. నగరవాసినులు కర్ణరసాయనంబుగా/అటులాడు సల్లాప మాలకించి,
అతివేలముగ పౌరు లాబాలవృద్ధులు/చెప్పు జేజేలకు చేయి మోడ్చి,
రత్నప్రదీప తోరణ మాలికలతోడ/రమణించు రాజమార్గంబు గడచి,
మంగళరచనాసమగ్రశోభితమైన/శ్వశురుని రాజవేశ్మంబు జేరి,
అచట గరి డిగి అజుడు, వత్సాధినేత/అర్థి గై దండ నిడగ, కన్యాప్రదాత
త్రోవ చూపింప చని, చొచ్చె, తీవబోండ్ల/మనసులం బలె, కల్యాణమంటపమును. 19

వాసినులు=నివసించుస్త్రీలు, కర్ణ+రసాయనంబుగా=వీవులకు+విందుగా, సల్లాపము+ఆలకించి=పరస్పర సంభాషణ+విని, అతివేలముగ=మేరమీఱి, ఆబాలవృద్ధులు=పిల్లలనుండి ముసలివారివరకు, జేజేలకు+చేయిమోడ్చి=జయధ్వనికి+నమస్కరించి, రత్న+ప్రదీప=రత్నములకాంతిచే+వెలుగొందిన, రమణించు+రాజ మార్గంబు+కడచి=అందగించు+రాజ మార్గ ము+దాటి, మంగళ+రచనా+సమగ్ర+శోభితమైన=మంగళ కరవస్తువులు+సమకూర్చబడి+సంపూర్ణముగా+ప్రకాశిత మైన, శ్వశురుని+రాజ+వేశ్మంబున్=భార్య తోబుట్టువు -బావ+రాజ+మందిరము. కరి+డిగి=ఏనుగు+దిగి, వత్సాధినేత=కౌసంబీపురము రాజధానిగా గలరాజ్యపురాజు, అర్థిన్+కైదండన్+ఇడగ=ప్రేమతో+చేయూత+ఇయ్యగా, చొచ్చె=ప్రవేశించెను, తీవ+పోండ్ల+మనసులం+వలె=(తనగుణసౌందర్యవిశేషముచే) తీగవలె మనోహరమైన శరీరముకల స్త్రీల+మనసులలో+ప్రవేశించుసౌలభ్యముతో,

చ. అమల హిరణ్మయాసనమునం దుపవిష్టుని జేసి భోజ భూ
రమణుడు చేతికీయగ సరత్నముగా మధుపర్కమిశ్రితా
ర్ఘ్యమును, దుకూలయుగ్మమును గైకొనియెన్, రఘుసూను డంత, వి
భ్రమయువతీజనంబుల అపాంగపు జూపులతో సమంబుగన్. 20

అమల+హిరణ్మయ+ఆసనమునందు=నిర్మల+బంగారు+పీఠమునందు, ఉపవిష్టుని=కూర్చుండ, సరత్నముగా=రత్నములతోకూడి, మధుపర్క+మిశ్రిత+అర్ఘ్యము=పెరుగుతేనె కలిపిన+తీర్థము, దుకూల+

యుగ్మము=వస్త్రముల+జంట, విభ్రమ+యువతీ జనంబుల+అపాంగపు+జూపులతో+సమంబుగన్=చంచల మైన+యువతుల+కడకంటి+చూపులతో+కలిపి, కైకొనియెన్=గ్రహించెను,

చ. తళుకు దుకూల యుగ్మమును దాల్చిన యాతని, రాణివాసపుం
బొలతుకపిండు వచ్చి కొనిపోయిరి, పెండ్లికుమార్తె చెంతకున్,
కలువలఱేని నూత్నకరకాండము, నుర్వులుగ్రక్కు సంద్రమున్,
చెలియలికట్టకుం గరము చేరువగా, గొనిపోవు తీరునన్. 21

తళుకు+దుకూల+యుగ్మము=తెల్లగామెఱయు+వస్త్రముల+జంట, పొలతుక+పిండు=స్త్రీల+సమూహము, కలువలఱేని=చంద్రుని, నూత్న+కర+కాండమున్=క్రొత్త+కిరణముల+గుంపును, ఉర్వులున్+క్రక్కు= నురగలతో+ఎగబడు, సంద్రమున్=సముద్రమును, చెలియలికట్టకుం=ఒడ్డుపైకి, కరము+చేరువగా=బాగా +దగ్గరగా,

తే. అచట భోజపురోధ ఆజ్యాదికముల/నగ్నితుల్యు డగ్నిని పేల్చి, అతడె పెండ్లి
సాక్షిగా, బంధుమిత్రసమక్షమందు/సంఘటించె, వధూవరసంగమంబు. 22

అగ్నితుల్యుడు=అగ్నివలే పవిత్రుడు, భోజ+పురోధ=భోజుని+పురోహితుడు, అజ్య+ఆదికముల=నెయ్యి+ మొదలైన హవిస్సు సామగ్రితో, అగ్నిని+పేల్చి=హోమఅగ్ని+రగిలించి, అతడె=ఆ అగ్నియే, సంఘటించె =కూర్చెను, సంగమంబు=కలయిక,

తే. కేల, పెండ్లికుమార్తె కెంగేలు పట్టి/రమ్యదర్శనుడయ్యె, నారాజసూతి,
చెంగటి అశోకలతిక లేజివురు మీద/చివురు సాచిన ఎలమావి చెలువ మొలక. 23

కేల=చేతితో, కెం(పు)+కేలు=చిగురుటాకులవలెఎఱ్ఱనైన+చేయి, రమ్యదర్శనుడు=చూచుటకు మనోజ్ఞమైన వాడు, రాజ+సూతి=రాకుమారుడు-అజుడు, చెంగటి=సమీపపు, అశోక+లతిక+లేజివురు=అశోక+లత యొక్క(ఎఱ్ఱగా పొడపైన)+లేతచిగురు, చివురుసాచిన+ఎలమావి+చెలువము+ఒలక=(ఎఱ్ఱగాపొడుగుగా) చిగిరించిన+మామిడిచూత+అందము+చింద,

ఆ. గగురుపొడిచె నపుడు కాంతుని ముంజేయి/చిగురుబోడి వ్రేళ్ళు చెమట పట్టె,
చేయి చేయి కలుప చెఱిసగమయ్యెనో?/మదనవికృతి, ఆలుమగల కనగ. 24

గగురు+పొడిచె=పులకలు+ఎత్తె, కాంతుని=భర్త-అజుని, చిగురు+పోడి=చిగురువలె

సుకుమార+శరీరముకల-

ఇందుమతి, మదనవికృతి=మన్మధసాత్వికోదయరూపమైన కరస్పర్శవలన పులకలు స్వేదము కలుగును(ఆ రెండూచెటిసగమై వారికి కలిగినవి).

చ. లలి తళుకొత్త, కంటికొనలం బడి యల్లన సాగు నోరలై,
కలిసి అటుండగా దిటవు గల్గక, వెన్కకు వచ్చు గ్రక్కునన్,
మొలచిన కూర్మి నొండొరుల మోము గనుంగొన గోరు వారి చూ
డ్కులు, నునుసిగ్గుదొంతరల కొంకు నెదుర్కొన నోహటింపుచున్. 25

లలి+తళుకొత్త=సొగసు+శోభిల్ల, అల్లన+సాగున్+ఓరలై=మెల్లగా+బయలుదేఱు+ఓరచూపులు, కలిసి+అటుండగా+దిటవున్+కల్గక=కలిసెకాని+కలిసిఅటులేఉండుటకు+ధైర్యము+చేయలేక, వెన్కకు+వచ్చున్+క్రక్కునన్=వెనుకకు+తిరుగు+వెంటనే, మొలచిన+కూర్మి=పుట్టిన+వలపుచే, చూడ్కులు=చూపులు, నును+సిగ్గు+దొంతరల+కొంకున్=క్రొత్త+సిగ్గు+పరంపరల+సంకోచముచే, ఎదుర్కొన=ఎదురు ఎదురు అగుటకు, ఓహటింపుచున్=వెనుదీయుచు,

తే. సంతరించి రుదర్చి కుషర్బుధునకు/భక్తితోడి ప్రదక్షిణ ప్రక్రమణము,
జోడువీడక మేరువు జుట్టివచ్చు/మాపుటేపును, బలె ఇందుమతియు, బతియు 26

సంతరించిరి=చేసిరి, ఉదర్చికి+ఉషర్బుధునకు=ఎగురుతున్నజ్వాలలుకల+అగ్నిహోత్రునకు, ప్ర+క్రమణము=విధిగా+అడుగులతో ప్రదక్షణ, మాపు+టేపును=రాత్రి+దినము(అహోరాత్రులజంట బంగారమయమై అగ్నితుల్యమైనమేరువు చుట్టు ప్రదక్షించును)

క. కరతలమున గొని పేల్చెను/దరహాసము ఱెప్పలందు దాచుచు, లజ్జా
తరళేక్షణయై, లాజలు/గురు పంపున నా నితంబగుర్వి హుతాగ్నిన్. 27

పేల్చెను=హవిస్సును అగ్నియందువేసెను, దరహాసము=కళ్ళలోనిచిరునవ్వు, లజ్జా+తరళ+ఈక్షణయై=సిగ్గుచే+చలించు+కన్నులుకదై, లాజలు=వరిపేలాలు, గురు+పంపునన్=పురోహితుని+ఆజ్ఞప్రకారము, నితంబగుర్వి=పెద్దపిఱుదులుకలది, హుత=హోమ,

తే. బంధుర హవిశ్శమీలాజగంధిలంబు/పుణ్యధూమము, వధువు కపోల యుగళి,
ఉపరిసీమకు జని, లాజహోమవేళ/క్షణిక కర్ణోత్పలత్వము, సంఘటించె. 28

బంధుర+హవిశ్+శమీ+లాజ+గంధిలంబు=దట్టమైన+నెయ్యి మొదలనవస్తువుల+జమ్మిఆకుల+పేలాల+ పరిమళము కలిగిన, పుణ్య+ధూమము=పవిత్ర+పొగ, లాజ+హోమ+వేళ=పేలాలు+హోమములో వేయు+ అప్పుడు, కపోలయుగళి+ఉపరి+సీమకు+చని=రెండుచక్కిళ్ళ+పై+భాగముపైకు+సాగి, క్షణిక+కర్ణ+ ఉత్పలత్వము+సంఘటించె=క్షణకాలము+చెవులలో+పెట్టుకున్న కలువలవలె+సమకూడే,

తే. కాటుక కరంగి, నీరుబ్బె గన్ను దోయి/శ్రవణపూరపు బీజాంకురములు వాడె,
చక్కని కపోలపాళిపై, సంజ వొడమె/మెలత కాచారధూమము మీద బొలసి. 29

కాటుక+కరంగి=వేడిచేకంటికాటుక+కరిగి, నీరుబ్బె=కంటనీరుచేరె, శ్రవణ+పూరపు+బీజాంకురములు+వాడె =చెవుల వరకు+ప్రేలాడు+పూల దండ+వాడెను, కపోల+పాళిపై=చక్కిళ్ళ+అంచుల, సంజ+వొడమె= సంధ్యాకాలమయినట్లు ఎఱుపుదనము+కమ్మె, మెలతకు=స్త్రీ-ఇందుమతికి, ఆచార+ ధూమము=హోమ కార్యపు+పొగ, మీద+పొలసి=ఆమెపై+వ్యాపించి.

ఉ. వైదిక లౌకికంబులు వివాహవిధుల్ నెఱపేర్చి కౌతుకో
త్పాదకమైన అక్కవకు, భవ్యమహాశిషపూర్వకంబుగా
ఔదలలందు చల్లిరి, ప్రియంబున, ఆర్ద్రశుభాక్షతల్, మహా
మోదమునన్ పురోహితులు, పుణ్యసతుల్, బహుబంధుమిత్రులున్. 30

వైదిక=వేదముచెప్పినట్లు, లౌకికంబు=గృహ ఆచారము ప్రకారము, వివాహ+విధుల్+నెఱపేర్చి=వివాహ+ పద్ధతులు+చేసి, కౌతుక+ఉత్పాదకమైన=కుతూహలము+పుట్టించు, అక్కవకు=ఆజంటకు, భవ్య+మహా+ ఆశిష+పూర్వకంబుగా=దివ్యమైన+గొప్ప+అశీస్సులు+ముందుగాచేసి, ఔదలలు+అందు=తలల+పై, ఆర్ద్ర+ శుభ+అక్షతల్=పసుపుతోతడసిన+మంగళ+అక్షింతలు, మహా+మోదమునన్=గొప్ప+ఆనందముతో,

తే. ఎలమి దోబుట్టు పెండిలి యివ్విధమున/జేసి, ఉత్సవచయసముల్లాసి, అంత,
భోజుడు, స్వయంవరాగతభూమిపతుల/సాగనంపెను, వేర్వేఱ సత్కరించి, 31

ఎలమి=ప్రేమతో, తో+పుట్టు=చెల్లెలి, ఉత్సవ+చయ+సముల్లాసి=శుభకార్యముల+అన్నిటిచే+సంతోషించిన, ఆగత=వచ్చిన, సాగనంపె=వీడుకొల్పె,

చ. ప్రమదవికాసచిహ్నముల భావవికారము డాచి, స్వచ్ఛతో
యములు, నిగూఢనక్రములు నైన మడుంగుల కన్నదమ్ములై,
విమనులు మంచిగా నతని వీడ్కొని యేగిరి, నిర్భరోపహ

రముల నెపంబునం దమ పురస్కృతికిన్ బదులిచ్చి యద్దొరల్. 32

ప్రమద+వికాస+చిహ్నముల=ఎక్కువ+వికసించినట్లున్న+మోముపై గుర్తులవెనుక, భావవికారము+డాచి=చెడు భావము+దాచిపెట్టి, స్వచ్ఛ+తోయములు+నిగూఢ+నక్రములు+నైన+మడుంగులకు+అన్నదమ్ములై =పైన నిర్మలమైన+నీరు+లోపలబాగాదాచబడిన+మొసళ్ళు+కల+చెరువులకు+సోదరులై, విమనులు=చెడు బుద్ధికవారు-అవకాశము నిరీక్షించురాజులు, నిర్భర+ఉపహారముల+నెపంబునం=అధిక+కానుకల+మిషతో, తమ+పురస్కృతికిన్+బదులిచ్చి=తమకుఇచ్చిన+బహుమతులకు+తిరిగిఇచ్చి,

తే. ఏగి, రఘువీరు రాకకు నెదురుచూచి/రవల మును కూడబలికికొన్నట్టి చోట,
అజుని గడతేర్చి, తత్ప్రమదామిషమును/ఎత్తికొనిపోవు దుర్వృత్తి కెత్తికొనుచు . 33

అవల=పేఋచోట, కడతేర్చి=చంపి, తత్+ప్రమద+అమిషమును=వాని+స్త్రీఅను+భోగ్యవస్తువును, దుర్వృత్తికి+ఎత్తికొనుచు=చెడుపనికి+పాటుపడుచు,

వ. మహాలాభముపట్టున ఈర్ష్యారోషములెట్టివారికింబుట్టును. ఘోరమును, సాహసమును, మదమును, అవివేకమును నైజగుణములైనవారికి, అనాదికాలప్రవృత్తములైన, రాగద్వేషములను భేదింప శక్యమగునే? అంత నక్కడ 34

నైజగుణములు=పుట్టుకతోవచ్చినలక్షణములు, అనాది+కాల+ప్రవృత్తములైన=మొదలేలేని+కాలమునుండి+ఇంద్రియములు స్వవిషయములందు సంచరించునట్టి, శక్యము=సాధ్యము,

సీ. కుండినపతి భోజకులవిభూతికరంబు/పరిణయోత్సవకలాపము ముగించి,
అభినవరత్నాంశుకాలంక్రియాజాత/మవరజాతకు ఉపాయనములొసగి,
ఆత్మసత్త్వసదృక్షహరణీకృతశ్రీ స/మృద్ధియై మన్నన లెల్ల నడపి,
పత్నీసమేతుని ప్రస్థాపితుని జేసి/అనుగుబావమఱంది ననుగమించి,
అతనితో గూడ మార్గమునందు మూడు/నిశలు వసియించి, యా సమున్నిద్రతేజు
నవల వీడ్కొని యేగె, దర్శాత్యయమున/పేవెలుగు బాసి తొలగు, రేవెలుగు రీతి. 35

భోజకుల+విభూతికరంబు=తనకులఅభ్యుదయ+కారకమైన, కలాపము=సముదాయము, అభినవ+రత్న+అంశుక+అలంక్రియా+జాతము=క్రొత్త+రత్నములు+వస్త్రములు+అలంకణ+సామగ్రి, అవరజాతకు+ఉపాయనములు+ఒసగి=చెల్లెలికి+కానుకలుగా+ఇచ్చి, ఆత్మ+సత్త్వ+సదృక్ష+హరణీకృత+శ్రీ+సమృద్ధియై=

తన+ఐశ్వర్యమునకు+తగిన+అరణముగా యీయబడిన+సంపదచే+నింపి, మన్ననలు+ఎల్ల+నడపి= సన్మానములు+అన్ని+జరిపి, ప్రస్థాపితుని=ప్రయాణమునకు బయలుదేరువానిగా, అనుగమించి=వెంట వెళ్ళి, సమ+ఉన్నిద్ర+తేజు=సవ్యముగా+హెచ్చరికైన+తేజస్సుకలవాని, దర్శాత్యయమున= దర్శఅనే పర్వము దాటిన తరువాత-(దర్శ:సూర్యచంద్రులిద్దరు కలిసినసమయపు పండగ-అనగా అమావాస్య. తరువాత సూర్యచంద్రులు తమతమ గతిపట్టిపోదురు), వే+వెలుగు+బాసి+తొలగు=వెయ్యి+వెలుగు కిరణములుకల సూర్యుని+విడచి+వెళ్ళు, రే+వెలుగు=రాత్రి+వెలుగు-చంద్రుడు,

వ. రఘుప్రవీరుడును రేవాతరంగిణి నుత్తరించి, ఉత్తరాభిముఖుడై మానిసి మిట్టాడని సాంద్రారణ్య ప్రదేశమున జమూసహితముగ దఱిమిపోవు సమయమున, వానికై అచ్చట బొంచియున్న, తత్ప్రత్యర్థు లకాండప్రళయమువలె అదాటుగ వచ్చి, ఒక ఇఱుకటమున నాతని జుట్టుముట్టిరి. 36

తరంగిణి+ఉత్తరించి=నదిని+దాటించి, మానిసి+మిట్టాడని=మనుషులు+సంచరించని, సాంద్ర+అరణ్య= దట్టమైన+అడవి, చమూసహితము=సేనతో, తఱిమి+పోవు=వేగిరపడి+పోవు, బొంచి+ఉన్న=దాగివేచి+ ఉన్న, తత్+ప్రత్యర్థులు=వాని+శత్రువులు, అ కాండ+ప్రళయమువలె=అసమయ+కల్పాంతముగా, అదాటుగ=ఒక్కసారిగా, ఇఱుకటమున=ఇఱుకు ప్రదేశమున,

తే. తనువరించిన ముద్దియ గొనుచు నేగు/నతని, దృప్తారిగణ మిట్టు లడ్డగించె
మించి, బలిదత్తపద మాక్రమించు వేళ/హరిహయారాతి, త్రైవిక్రమాంఘ్రి బోలె 37

ముద్దియ=స్త్రీ, దృప్త+అరి+గణము=గర్వించిన+వైరి+సమూహము, ఇట్టు+అడ్డగించె+మించి=ఈవిధముగా+ అడ్డుతగిలిరి+అతిక్రమించి, బలిదత్తపదము=బలిఈయబడిన ప్రదేశము, హరిహయు+ఆరాతి=ఇంద్రుని+ శత్రువు-ప్రహ్లాదుడు (వామముడు స్వర్గమును ఆక్రమించినపుడు, ప్రహ్లాదుడు ఇంద్రుని శత్రువైనను సహింపక విరోధించి అడ్డుకొనెను- బ్రహ్మాండపురాణ వృత్తాంతము.),

శా. ఆకల్లోలము చూచి తత్ క్షణమ పైత్రామాత్యునాత్మీయు బల్
కాకల్ దేఱిన బంట్లతో నిలిపి రక్షన్ సల్పగా జాయ, వే
దూకెన్ బోయి విపక్షవాహినిపయున్, దోర్విక్రమోల్లాసియై
కాకుత్ స్థుం డమరాపగా నిపతితోత్కల్లోలశోషణంబటుల్. 38

కల్లోలము=పెద్దఅలలవంటి శత్రువుల, తత్+క్షణము=ఆక్షణమె, పైత్ర+ఆమాత్యున్+ఆత్మీయు=తండ్రికాలము నుండి వచ్చుచున్న+మంత్రి+నమ్మకస్తుని, కాకల్ దేఱిన=ఆరితేరిన, వే=వేగముగా, వాహిని=సైన్యము, దోర్+విక్రమ+ఉల్లాసియై=బాహువుల+అధికబలపు+ప్రారంభముకలవాడై, అమర+ఆపగా+నిపతిత+ఉత్+కల్లోల+శోషణంబు+అటుల్=దేవ+నదిలో-గంగానదిలో+పడుటచే+ఎగిరిన+పెద్ద అలలు కలిగిన+శోణనది+వలె(శోణ నదము పెద్దపెద్ద అలలతో భాగీరథిని ముంచును)

మ. ఇరుసేనాంగములందు కాలరులతో నీసెత్తి కాల్బంటులున్,
తురగారూఢులతోడ రౌతులు, రథస్థుల్ స్యందనారోహులన్
కరియోధావళితో గజస్థులు, మహోగ్రస్ఫూర్తిమై, తాకినన్,
దురమత్యుద్ధతి సాగె దుర్విషహమై, తుల్యప్రతిద్వంద్వియై. 39

కాలరులు=కాల్బంటులు=నేలపై ఉండి యుద్ధము చేయువారు, తురగ+ఆరూఢలు=రౌతులు=గుఱ్ఱముపై నుండి యుద్ధముచేయువారు, స్యందనారోహులు=రథస్తులు=రథముపైనుండి యుద్ధము చేయువారు, కరియోధావళి=గజస్థులు=ఏనుగుపైనుండి యుద్ధము చేయువారు, మహ్+ఉగ్ర+స్ఫూర్తిమై+తాకినన్=గొప్ప +భయము+ కలిగించుచూ+ఎదుర్కొనిన, తురము+అతి+ఉద్ధతి+సాగె=యుద్ధము+ఎక్కువ+ అతిశయమై +జరిగెను, దుర్+విషహమై=అసాధ్యమై. తుల్య+ప్రతిద్వంద్వియై=సమానశక్తికల+శత్రువులు కలదై,

తే. చిందముల,తూర్యముల మ్రోతలం దడంగి/మాట వినరామి, వంశనామములు నోట
అనరు, బాణాక్షరములచేతనె వచింతు/రొండొరుల కూర్జితములు, విల్కాండ్రు, పేర్లు. 40

చిందముల=శంఖముల, తూర్యముల=వాద్యముల, మ్రోతలందు+అడంగి=ఘోషలో మఱుగుపడి, వంశ నామములు=వారివారి కులములపేర్లు, బాణ+అక్షరముల+చేతనె+వచింతురు=బాణముపై+చెక్కిన పేర్ల+చే+తెలియజేయుదురు, ఒండొరులకు+ఊర్జతములు=పరస్పరము ప్రఖ్యాతమైనపేరులు,

ఉ. ఆ రణభూమినుండి జవనాశ్వఖురంబుల రేగి, రేగి వి
స్ఫారశతాంగచక్రముల పాంసువుచే బలుపొంది, పొంది స్తం
బేరమకర్ణతాళముల మిక్కిలి విస్తృతి గాంచి, కాంచి క
ప్పారుచు గప్పె రేణువు, ఘనాంశుక పద్ధతి నర్కబింబమున్. 41

జవన+అశ్వ+ఖురంబుల+రేగి=వేగముగాపరుగెట్టు+గుఱ్ఱముల+గిట్టలనుండి+ఎగరి, రేగి+విస్ఫార+శతాంగ+చక్రముల+పాంసువుచే+బలుపు+ఒంది=విజృంభించి+కంపించు+రథముల+చక్రములు+వెదజల్లు+ధూళిచే

+వృద్ధి+కలిగి, పొంది+ స్తంబేరమ+కర్ణ+తాళముల+విస్తృతిన్+కాంచి=ఏకమై+ఏనుగుల+చెవుల+చటుపుల చే+వ్యాప్తి+పొంది, కాంచి+కప్పు+ఆరుచు=చూపుకు+చీకటి+నిండుచు, కప్పె+రేణువు+ఘన+అంశుక పద్ధతిన్+అర్క+బింబమున్=మూసె+ధూళికణములు+దట్టమైన+వస్త్రము+వలే+సూర్య+బింబమును,

తే. అనిలవశత వికీర్ణము లైన నోళ్ళ/సైన్యరేణువు నాను మత్స్యధ్వజములు
తివుట బర్యావిలంబగు నవజలంబు/నాను పరమార్థమత్స్యము లనగ దోచె. 42

అనిల+వశత=గాలికి+లోబడి, వికీర్ణములైన+నోళ్ళ=చిరిగిన+కొనలతో, సైన్య+రేణువును+ఆను=సేనచే ఎగరగొట్టబడిన+ధూళి+అంటిన, మత్స్య+ధ్వజములు=చేప ఆకారముగల+ జండాగుడ్డలు, తివుట= కోరికతో, పర్యావిలంబగు+నవ+జలంబును+ఆను=అంతటాకలుషితమైన+క్రొత్త+నీటిని+త్రాగు, పరమార్థ +మత్స్యములు+అనగన్+తోచె=నిజమైన+చేపలు+అనునట్లు+కనబడెను,

తే. తెలిసె చక్రఘోషమ్ముౕన తేరు లచట/ఘంటికాక్వణితమ్ముౕల కరుల తెలిసె,
ప్రభువుపేరుచ్చరించుటవలన దెలిసె/స్వపరభేద మాచీకటి, సైనికులకు. 43

చక్ర+ఘోషమ్ముౕన+తేరులు=రథచక్రముల+ధ్వనిచే+రథములు, ఘంటికా+క్వణితమ్ముౕల+కరుల=గంటల+ ధ్వనిచే+ఏనుగులు, ఉచ్చరించుట=పలుకుట, స్వ+పర+భేదము+ఆచీకటి=తమవారు+పరవారనుఅను +భేధము+ఆచీకటిలో,

క. అతితరమై యా జన్య/క్షితి గవియు రజస్తమోవిజృంభణమునకున్,
క్షతసింధురాశ్వసుభట/చ్యుతశోణితలహరి, దినకరోదయ మయ్యెన్. 44

అతితరమై=మిక్కిలిఎక్కువైన, ఆ+జన్య+క్షితిన్+కవియు=ఆ+యుద్ధ+భూమిని+వ్యాపించిన, రజస్+తమో +విజృంభణము నకున్=ధూళిచేనైన+చీకటి+వ్యాపనముచే, క్షత+సింధుర+అశ్వ+సుభట+చ్యుత=గాయ పడిన+గుఱ్ఱముల+ఏనుగుల+భటులనుండి+కారిన, శోణిత+లహరి=ఎఱ్ఱనిరక్త+ప్రవాహము, దినకర+ ఉదయము+అయ్యెన్=బాలభానుని+ఎఱ్ఱని+ఉదయముఅనునట్లుగా+అయినది,

క. క్షతజపూరముచే నణగారి భువిని/గాలిలో, దేలియాడు నా ధూళి తోచె,
బొగ్గుగా నింత మిగిలిన అగ్గిమీద/పూర్వమెగసిన దట్టపు బొగ విధమున. 45

క్షతజ+పూరముచేన్+అణగారి+భువిని=గాయపడిన+జంతుసైన్యరక్తధారలచే+అణిగిన+భూమిపై, తేలి యాడున్+అ+ధూళి=తేలిపైకెగిరిన+ఆ+ధూళి, తోచె=అనిపించెను, బొగ్గుగాన్+ఇంత=బొగ్గవగా+కొంచము, పూర్వము+ఎగసిన=ముందుగా+ ఎగిరిన,

ఉ. భూరిశరప్రహారమున మూర్చితుడై పడి లేచి సారథిన్
తేరు మరల్చినందులకు తిట్టి, సరాసరి పోయి దర్పదు
ర్వారు డొకండు, టెక్కియముబట్టి ప్రహర్తను గుర్తుపట్టి పే,
ఈరసమెత్తి వాని నొక యేటున పీచమడంచె, నుబ్బునన్. 46

భూరి+శర+ప్రహారమున=ఎక్కువ+బాణముల+దెబ్బలచే, సరాసరి=తిన్నగా, దర్ప+దుర్వారుడు=గర్వముచే +నివారింపలేని వాడు, టెక్కియముబట్టి+ప్రహర్తను=(దట్టమయిన దూళినలన ప్రత్యర్థి కనబడక పోయినా, ఎత్తుగా ఉన్న )జెండాచే గుర్తుపట్టి+కొట్టినవానిని, పే+ఈరసము+ఎత్తి=పెక్కు+ద్వేషము+వహించి, ఒక+ ఏటున=ఒకే దెబ్బతో, పీచము+అడంచె=ఉక్కు+అడచె-చంపె, ఉబ్బునన్=విజృంభణతో

మ. విమతాస్త్రంబులు మధ్యమార్గముననే పేవచ్చి ఖండింపనీ,
తుమురైపోవవు, తప్పిపోవు కృతహస్తుల్, నాటి విల్కాండ్ర కాం
డము, లయ్యద్భుత మే మనన్! మొనలతోడన్, వాని పూర్వార్ధఖం
డము, లాత్మీయజవానుయుక్తి గవియన్ నాటున్, శరవ్యంబులన్. 47

విమత+అస్త్రంబులు=శత్రువు+బాణములు, మధ్యమార్గముననే=మార్గపుమధ్యలో, పేవచ్చి+ఖండింపనీ= పేగముగా+ఛేదించిననూ, తుమురై+పోవవు=తునకలై+పోవు, కృతహస్తుల్=విలువిద్యయందు నేర్పరులు, నాటి+విల్కాండ్ర+కాండములు=అనాటి+విల్లుతో పోరాడువారి+బాణములు, అ అద్భుతము+ఏమి+అనన్= వాటి+ఆశ్చర్యముకలిగించు నది +ఎటువంటిది+అనగా, మొనల+తోడన్=సూదైన ఇనుపమొనల+తోడ, వాని+పూర్వ+అర్ధ+ఖండములు=బాణముల+మెదటి+సగ+భాగములు, అత్మీయ+జవ+అనుయుక్తిన్+ కవియన్+నాటున్+శరవ్యంబులన్=తమ+పేగము+అనుసరించిపోయి+పైబడి+తాకును+చేరవలచిన లక్ష్యమును,

తే. ఏనుగుల కయ్యమున, బెద్ద యీటెపోట్ల/దెగిన మావంతుల తలలు గగనవీధి
శ్వేననఖరాగ్రకోటుల జిక్కుకొన్న/పెండ్రుకలతోడ గడు ప్రేలి ప్రేలి పడియె. 48

మావంతుల=మావటీల, గగనవీధి+శ్యేన+నఖర+అగ్రకోటులన్+చిక్కుకొన్న+వెండ్రుకలతోడ= ఆకాశములో(క్రిందకు పడకముందే)+డేగలుఎత్తి కొనిపోవుటవే+వాటిగోళ్ళ+కొనలందు+తగులుకున్న+ వెంట్రుకలతోడ, కడు+ప్రేలిప్రేలి+పడియె=ఎక్కువగా+ప్రేలాడిప్రేలాడి(డేగతోపాటుఎగిరి)+(అది వదలగా) పడుచుండెను,

తే. మారుదెబ్బతీయ నేరక మావుపై/కడిది రిమ్మవట్టి పడిన పగతు,

మనగ విడిచె, గాని మలుదెబ్బ వేయడు/తొలిప్రహర్త ఒకడు, తురగసాది. 49

మారు+దెబ్బతీయ+నేరక=తిరిగి+వేటు+వేయబోక, కడిది+రిమ్మవట్టి+పడిన=అధికముగా+దిమ్మెక్కి+ పడిపోయిన, మావుపై=రౌతుపై, తొలి+ప్రహర్త+ఒకడు=ముందుగా+కొట్టిన+వాడు, పగతు+మనగ+విడిచె= శత్రువును+జీవితునిగ+వెడచిపెట్టెను, కాని+మలుదెబ్బ+వేయడు=అంతేకాని+మరోదెబ్బ+కొట్టడు, తురగ+ సాది=గుఱ్ఱమెక్కు+రౌతు,

తే. ప్రాణములకు తెగించిన భటుల ఖడ్గ/ధారలకు గుఱియైన దంతములనుండి,

ఎగయు మంటలు చల్లార్చు, వెగడు వడియు/వారణములు, శుండాదండవమధు వోడ్చి.50

ఖడ్గ+ధారలకు=ఇనుపకత్తి+అంచులకు, వెగడు వడియు=తడబాటు+పడియున్ననూ(ఇనుము దంతముల తగుల పుట్టు నిప్పుకు), వారణములు=ఏనుగులు, శుండా+దండవ+మధు+వోడ్చి=తొండమునుండి+ స్రవించు+మదజల కణములు+కాఱచేసి,

తే. బాణహతి డొల్లు శిరములు ఫలచయముగ/జాఱిపడు తలమఱువులు చషకములుగ,

రక్తపూరము మదిరగా రణధరిత్రి/మృత్యుదేవత పానభూమి యనదోచె 51

బాణ+హతి=బాణములచే+కొట్టబడి, డొల్లు=దొర్లు, ఫల+చయముగ=పండ్ల+గుంపులుగ, తలమఱువులు= శిరస్త్రాణములు-లోహపుటోపీలు, చషకములుగ=పానపాత్రలుగ, రక్తపూరము=రక్త ప్రవాహము, మదిరగా= మద్యముగా, రణధరిత్రి=యుద్ధరంగము, పాన+భూమి+అనన్+తోచె=పాన+శాల+అనునట్లు+కనబడెను,

చ. అరికరవాలకృత్తశిరుడైన వజీ రొక డాక్షణంబె వి

స్ఫురితవిమానశేఖరవిభుత్వము నొంది మరుద్విలాసినీ

పరిమిళితాంకుడై, గగనభాగమునం జనుచుండి, భూమిపై

దురమున నాడుచున్న తన తొల్లిటిమొండెము జూచె, నవ్వుచున్. 52

అరి+కరవాల+కృత్త+శిరుడు=శత్రువు+కత్తిచే+నరకబడిన+తలకలవాడు, వజీరు+ఒకడు=యుద్ధ సేనాని+ఒకడు, ఆక్షణంబె=వెంటనే, విస్ఫురిత+విమానశేఖర+విభుత్వమున్+ఒంది=ప్రకాశించు+శ్రేష్ఠమైనదేవ విమాన+స్థానఅవకాశము+పొంది, మరుత్+విలాసినీ+పరిమిళిత+అంకుడై=దేవాతా+స్త్రీ+కూడిన+ఒడికలవాడై, గగన+భాగమునం+చనుచుండి=ఆకాశ+స్థలమున+పోతూ, తురమున=యుద్ధభూమిపై, ఆడుచున్న=ఇంకనూ కొట్టుకొనుచున్న, తన+తొల్లిటి+మొండెమున్=తన+ముందటి+శరీరమును,

సీ. దారుణాస్త్రముల పెద్దపెనంగి రభియాతి/రథికద్వయములు విక్రమనిరూఢి,
తడయ కన్యోన్యచోదకనిబర్హణమున/సూతకృత్యము కూడ చేతబట్టి,
దాయ యే పడచి, రథ్యము లీల్గ, పటుగదా/కలితులై లఘుచిత్రగతుల బోరి,
గదలును నుగ్గైన, గట్టుపకాసులై/బాహుయుద్ధమున కుపక్రమించి,
పిక్కుసూపక పోట్లాడి రుక్కుమెఱయ/తనువు సర్వాంగకములు రక్తమున దడసి,
చిగురు తఱుచున కెంజాయ చెలువు మిగులు/కమ్మ క్రొమ్మావి కవ కన్నదమ్ము లగుచు 53

దారుణ+అస్త్రముల=భయంకమైన+అస్త్రముల, పెనంగిరి=ఎదురాడిరి, అభియాతి=శత్రువులైన, రథిక+ద్వయులు=రథముపై నుండియుద్దముచేయు+ఇద్దరు, విక్రమ+నిరూఢి=సాహసికులుగా+ప్రసిద్ధి చెందిన వారు, తడయక=ఆలస్యముచేయక, అన్యోన్యచోదక+నిబర్హణమున=ఒకరిసారధినొకరు+చంపుట వలన, సూత+కృత్యముకూడ చేతబట్టి=సూతుని+పనినివారే+చేసికొనుచు, దాయ+ఏపు+అడచి+రథ్యములు+ఈల్గ=శతువు+ఉత్సాహముతో+గుఱ్ఱముల+చంప, పటు+గదా+కలితులై=గొప్ప+గదలు+తీసుకొన్నవారై, లఘు+చిత్ర+గతులన్+పోరి=శీఘ్రముగా+ఆశ్చర్య+విధముగా+కలహించి, గదలును+నుగ్గు+ఐన=గదలు కూడా+పిండి+అవగా, కట్టుపకాసులై=ధీరులై, ఉపక్రమించి=ప్రారంభించి, పిక్కుసూపక=వెన్నుచూపక, ఉక్కు+మెఱయ=ధృఢత్వము+ప్రకటితమవగా, తనువు+సర్వ+అంగకముల=శరీరపు+అన్ని+అంగములు, చిగురు+తఱచున+కెంజాయ+చెలువు+మిగులు+కమ్మ+క్రొమ్మావి+కవకు=చిగురులందు+దట్టమైన+ఎఱ్ఱటి+అందము+అతిశయించు+సొగసైన+కొత్తమావి+జంటకు, అన్నదమ్ములు+అగుచు=సోదరులు+అయినట్లు,

మ. అమితాటోపమునం బెనంగి తుది నన్యోన్యప్రహారంబులన్
సమవేళన్, సెఱజోదు లిర్వు రనిలోనన్ నిర్గత ప్రాణులై,
అమరావాసముజేరియున్, శమములే కచ్చోట నేకాప్సరః

కమనత్వంబు వహించి, కయ్యమునకుం గాల్ ద్రవ్వి రుద్విగ్నులై 54

అమిత+అటోపమునం+పెనంగి=ఎక్కువ+హడావిడిగా+యుద్ధముచేసి, అన్యోన్య+ప్రహా రంబులన్=పరస్పర +దెబ్బలచే, సమవేళన్=ఒకేసారి, సెఱ+జోదులు=సమర్థులైన+యుద్ధయోధులు, అని+లోనన్+నిర్గత+ ప్రాణులై=యుద్ధము+లో+కోల్పోయిన+ప్రాణములుకలవారై, అమరావాసము=స్వర్గము, శమములేక= శాంతిలేక, అచ్చోట=స్వర్గములో, ఏక+అప్సరః+కమనత్వంబు+వహించి=ఒకే+అప్సర అందు+ఇచ్ఛ+ తెచ్చుకుని, ఉద్విగ్నులై=కుదురులేనిమనస్సుకలవారై,

తే. ఓటమియు, గెల్పుగనియె, నొండురులవలన/ఆమహావ్యూహములు రెండు, అనియతముగ,

వెనుకముందటి గాడ్పుల వనధిలోన/క్రమమున వివృద్ధమగు తరంగముల రీతి. 55

ఆ+మహా+వ్యూహములు=ఆ+గొప్ప+సైన్యనిర్మాణములు, అనియతముగ=నిశ్చయములేనిదై, వనధి= సముద్రము, క్రమమున+వివృద్ధమగు=వరుసగా+అధికమగు, తరంగముల+రీతి=ముందుకు వెనుకకు సాగుకెరటముల+వలె

తే. తన మొనలు దాయ కోహటించినను, చనియె/పరబలముమీదకే, జెట్టిబిరు, దజుండు,

గాలివాటు నివారించు గాక పొగను/ఎచట గసవుండు, నచటనె యేర్చు చిచ్చు. 56

మొనలు=సైన్యము, దాయకు+ఓహటించినను=శత్రువుకు+వెనుదీసినను, జెట్టి+బిరుదు+అజుండు= శూరుడని+ ప్రశస్తుడయిన+అజుడు, కసవు=గడ్డి, ఏర్చు+చిచ్చు=మండించు+అగ్ని,

శా. చిత్తస్థైర్యము, మేటిబంటుతనమున్ చేదోడుగా, సంభ్రమా

యత్తుండై, పెస నిల్వరించె, నిజబాహాశక్తియన్ కట్టచే,

ఉత్తాలప్రతిపక్షవాహిని నతం డొక్కండె కల్పక్షయో

ద్వృత్తార్ణోధిమహాంభ మాగిన పురాఘృష్టిన్ విడంబించుచున్. 57

చిత్త+స్థైర్యము=మనసున+నిశ్చయము, మేటి+బంటుతనమున్=గొప్ప+పరాక్రమము, చేదోడుగా=కార్య సహాయకులుగా, సంభ్రమ+ఆయత్తుండై=వేగిరపాటు+కలిగినవాడై, పెసన్+నిల్వరించె=శీఘ్రముగ+నిరోధించె, నిజ+బాహా+శక్తియన్+కట్టచే=తన+బాహువుల+శక్తి అను+ఆనకట్టచే, ఉత్తాల+ప్రతిపక్ష+వాహినిన్= బలమైన+శత్రు+సేనను, కల్పక్షయ+ఉద్వృత్త=కల్పాంతమునచెలియలికట్టుదాటి+ఎగసి పడుచున్న, అర్ణోధి +మహా+అంభము+ఆగిన=సముద్రపు+గొప్ప+నీటిని+ఆపిన, పురా+ఘృష్టిన్+విడంబించు చున్=పూర్వపు

+పంది-వరాహావతారము+అనుకరించుచు, (విష్ణువు వరాహావతారమున కల్పాంతమున చెలియలికట్ట దాటిన సముద్రమును వెనుకకుపంపెను)

తే. దక్షిణకరంబు గలన నందముగ నతడు/తూణముఖమున ద్రిప్పుచు దోచుచుండె,
ఈనె నన సకృదాకర్ణకృష్టమైన/ఆ రథికు మౌర్వియే రిపుఘ్నా శుగముల. 58

దక్షిణ+కరంబున్=కుడి+చేతితో, కలనన్=యుద్ధములో, అందముగ+అతడు+తూణ+ముఖమునన్+ త్రిప్పుచు=విలాసముగా+అజడు+అమ్ములపొద+కొనలో+(చేతిని బాణము తీయుటకు) తిప్పుట, తోచుచుండె=విలాసముగా+కనబడెను( కదలు చున్నట్టు కనబడెనే కాని తీయుట వేయుట కనబడలేదు.), ఈనెన్+అన=పుట్టుకొచ్చునవి+అన్నట్లు, సకృత్=ఒకమాఱు, ఆకర్ణ+కృష్టమైన=చెవివరకు+లాగబడినదైన, మౌర్వియే+రిపుఘ్న +ఆశుగముల=అల్లెత్రాడే+శత్రులనుచంపునట్టి+బాణములై, (తోచుచుండె=కనబడు చున్నది అల్లెత్రాడే బాణములు పంపునట్లయ్యెను).

మ. బొమలల్కన్ ముడిపెట్టి మూపు లెదుగన్ భూయిష్ఠదష్టాధరో
ష్ఠమునన్, రోషభరంబు వెల్లివిరియం, జండోరగప్రాయ భ
ల్లములన్, మామిడిపూత రాలుగతి రాలంజేసి, ప్రత్యర్థి శీ
ర్షములన్, బీనుగుపెంటజేసి విడిచెన్ సంగ్రామభూరంగమున్. 59

బొమలు+అల్కన్+ముడిపెట్టి=కనుబొమలు+కోపముతో+ముడిపేసి, మూపులు+ఎదుగన్=భుజములు+ పైకెగయ, భూయిష్ఠ+దష్ట+అధరోష్ఠమునన్=అత్యధికముగా+కొఱకబడిన+పెదవులపై, రోష+భరంబు+ వెల్లివిరియం=కోప+అతిశయము+ప్రకటిత మవ, చండ+ఉరగ+ప్రాయ+భల్లములన్=కోపముతోనున్న+ పాముల+వంటి+బాణముల, ప్రత్యర్థి+శీర్షములన్=శత్రువుల+తలలను,

సీ. మారులేకిటు కోలుమసగు నాతని బట్టి/ఉవ్వెత్తు గొని కాని యుడుగమనుచు,
ఆనగైకొని సర్వసేనాంగములతోడ/సర్వాయుధములతో సరభసముగ,
మగపంతమున నెల్లపగరాజులును పిట్ట/పిడుగున మూక ఉమ్మడిగ దాకి,
పెరయీగలట్టు, లుప్పెన యెట్లు, పైబడ్డ/వివిధాస్త్రముల నొంచి వెగడువఱుప
అవిరళశరౌఘుసంఛన్నమై ధ్వజాగ్ర/మాత్రమున గోచరించె, గుమారు తేరు,
గ్రుడ్డి యీరెండలోపల గోచరించు/మూడమంచున మునిగిన ప్రొద్దువోలె. 60

మారులేక+ఇటు+కోలుమసగు=తిరుగులేక+ఈవిధంగా+మిక్కిలివిజృంభించు, ఉవ్వెత్తుకొని=నశింపచేసి, ఉడుగము=మానమని, ఆనన్+కైకొని=ఒట్టు+పెట్టుకొని, సర్వ సేన అంగములతోడ=రథ తురగ ఏనుగు పదాతి దళములుకలిగినసేనతో, స+రభసముగ=వేగముగా+కూడి, మగపంతమున=పౌరుషమున, పిట్టపిడుగున(=పిడుగు+పిడుగు)=పెద్దపిడుగువలె, మూక+ఉమ్మడిగ+తాకి=అందరూ+ఒక్కసారిగా+ ఎదుర్కొని, పెర+ఈగలు+అట్టు=తేనె+ఈగల+వలె, ఉప్పెన+ఎట్లు=సముద్రపు పొంగు+ఏప్రకారమో, పైబడ్డ= మీదపడి, వివిధ+అస్త్రముల+నొంచి+వెగడు+పఱుప=వేరువేరు+అస్త్రముల+నొప్పించి+తడబాటు+చేయ, అవిరళ+శర+ఔఘు=ఎడతెగని+బాణపు+ప్రవాహముచే, సంఛన్నమై+ధ్వజాగ్ర+మాత్రమున+గోచరించె= బాగాకప్పబడి+రథపైభాగము+మాత్రమే+కనబడె, కుమారు+తేరు=అజుని+రథము, గ్రుడ్డి+యీరెండలోపల +గోచరించు=కాంతిహీనమైన+నీరెండలో+కనబడు, మూడ+మంచున=దట్టమైన+మంచున, ప్రొద్దువోలె= తొలిపొద్దువలె,

తే. ప్రాణసంశయకరమైన అదియె తగిన/సమయమంచు ప్రయోగించె, సత్వరముగ,
పగఱమీద ప్రియంవదోపాత్తమైన/స్వాపజనకము, మోహనాస్త్రము, నజుండు. 61

ప్రాణ+సంశయ+కరము=ప్రాణ+అపాయము+తెచ్చునది, సత్వరముగ=వెంటనే, పగఱ=శత్రువు, ప్రియంవద +ఉపాత్తమైన=మునుపుప్రియంవదుడను గంధర్వునుండి+పొందబడిన, స్వాప+జనకము=నిద్రను+ పుట్టించు

సీ. తత్ప్రభావమున గాత్రములు సోలగ, ఆయు/ధములు చేతులపట్లు తప్పి జాఱ,
అలసత్వమును బొంది ఆవులించుచు మెడ/లొరుగంగ, ఱెప్పలు బరువులెత్త,
శకటంబులకు, ధ్వజస్తంభంబులకు, చేర/బడియు, బోరగిలంగ బడియురిపులు,
గురకపెట్టుచు, నిద్రగూరి రందఱు నొల్ల/బోయి, నిద్రకు వాచి పోయినట్లు,
దాని గని యూదె శంఖము దడయకజుడు/ప్రియతమోపాత్తరసమైన పెదవి నునిచి
అపుడు సాకారమగు స్వహస్తార్జితమును/యశము దగదీర గ్రోలుచున్నట్లు తోచి. 62

తత్+ప్రభావమున=మోహనాస్త్రపు+శక్తిచే, గాత్రములు=శరీరములు, సోలగ=వివసత పొందగా, అలసత్వము =మందత, శకటంబులకు=రథములకు, ధ్వజస్తంభంబులకు=జెండాకఱ్ఱలకు, ఒల్లబోయి=మూర్ఛిల్లి, తడయక=ఆలస్యముచేయక, ప్రియతమ+ఉపాత్త+రసమైన+పెదవిని+ఉనిచి=ప్రియురాలైన ఇందుమతిచే+

అస్వాదింపబడిన+మాధుర్యముకల+పెదవుల+ఉంచి, సాకారమగు=మూర్తివంతమైన, హస్త+ఆర్జితమును+ యశమున్=తనచేతులతో+సంపాదించిన+కీర్తిని, తగ+తేర=దప్పి+తీరగా, క్రోలుచున్నట్లు+తోచి=తాగు తున్నట్లు+కనబడి.

ఉ. ప్రాణము లేవనెత్తిన తదారవమున్ విని, తద్భటుల్ వికు
ర్వాణమనస్కులై మడిగిరా, ప్రియదర్శనుడయ్యె గాఢని
ద్రాణవిరోధియైన, తమరాజవరుండు నిమీలితాంబుజ
శ్రేణికి మధ్య నుల్లసిలు శీతకర ప్రతిబింబముంబలెన్. 63

లేవనెత్తిన=నిలపిన, తత్+అరవమున్+విని=ఆ+పరిచయమైనశంఖధ్వని+విని, వికుర్వాణ+మనస్కులై+ మడిగిరా=సంతోషించిన+మనస్సుకలవారై+తిరిగిరాగ, నిమీలిత+అంబుజ+శ్రేణికి=ముకుళించిన+ కమలముల(వైరుల)+వరసకు, ఉల్లసిలు+శీతకర+ప్రతిబింబముంబలెన్=సంతోషించు+చంద్రుని+మారు రూపు వలె, గాఢనిద్రాణ+విరోధియైన=మూర్ఛితులైన+శత్రువులుకల, తమ+రాజ+వరుండు=వారి+రాజ+ శ్రేష్ఠుడు, ప్రియదర్శనుడయ్యె=చూపుకింపైనవాడయ్యె,

చ. సమధికశీలశాలి రఘుసంభవు డంతట "మీ విజేత మీ
అమలయశంబె చూఱగొని, అమ్మక చిక్కిన మేకలయ్యు క్రౌ
ర్యంబునకు బోడు, ప్రాణముల కల్గ" డటంచు లిఖింపజేసె ర
క్తమున మెఱుంగు తూపుమొన గంటముతోడ రిపుధ్వజంబులన్. 64

సమ+అధిక+శీలశాలి=మంచి+ఎక్కువ+సద్గుణము లున్న, అమల+యశము=స్వచ్ఛమైన+ కీర్తిని , చూఱగొని=అపహరించి, అమ్మక+చిక్కిన=చంపి తినుటకు +దొరికిన, క్రౌర్యంబు= కౄరత్వము, వోడు=కడగడు, తూపుమొన=బాణపుకొస, రిపు+ధ్వజంబులన్= శత్రువుల+ జెండాలపై,

సీ. వ్రాయించి, వనవృక్షవాటిక విఱచిన/గంభీరవేది ప్రక్రమముతోడ,
జలరాశి నీది అవ్వలియొడ్డు జేరిన/గజయాతగాని ఉగ్గడువుతోడ,
సంగ్రామవిగమసూచకముగ మూపుపై/మోపిన విజ్యకార్ముకముతోడ,
తల కత్తళంబును దొలగింప విడివడ్డ/ప్రస్విన్నకచకలాపంబుతోడ,

అలికతలమున చితచితలాడుచున్న/అవిరళశ్రమవారి లవాళితోడ,

ప్రత్యయితులైన, మెఱికల వంటి భటుల/కాపుదల నున్న ప్రేయసి కడకు వచ్చి, 65

వాటిక=ఉద్యానవనము, గంభీరవేది=బాగామదించిన ఏనుగు, ప్రక్రమము=విధము, ఉగ్గడువు=త్వరత, విగమ=సమాప్తి, విజ్య+కార్ముకము=జయముకలిగించిన+విల్లు, తలకు+అత్తళంబునున్+తొలగింప= తలనుంచి+కిరీటమును+తీయగా, ప్రస్విన్న+కచ+కలాపంబు=బాగా చమటతో కూడిన+వెంట్రుకుల+ సమూహము, అలిక+తలమున=లలాట+ప్రదేశమున, చితచితలాడుచున్న=చిరాకుకలిగిస్తున్న, అవిరళ+ శ్రమవారి+లవ+ఆళి+తోడ=దట్టముగా స్రవించు+చెమట+తునకల+సమూహము+తో, ప్రత్యయితులైన = నమ్మకస్తులైన, మెఱికల=ఆరితేరిన,

సీ. పెనుదాయ సుడిగుండమున బడ్డ మగనికై/తల్లడిల్లి, మనంబు తహతహింప,

ధూర్తప్రతిద్వంద్విదుష్టచేష్టితమును/చింతించి పసిగుండె చెదరిపోవ,

పతిలావు నచ్చి ఆపద దట్టుకొనగల్గు/నిబ్బరం బొకమూల నివ్వటిల్ల,

అహితసైన్యముల సంఖ్యాధిక్య మూహించి/ధృతిపల్లటిలి వెండి దిగులు బలియ,

అశ్రుపూరము గంటియం దదిమి పట్టి/బిక్కమొగమున దనరాక వేచి యున్న,

చకితహరిణేక్షణకు, నిజేశ్వరికి దనదు/విజయ మెఱిగించి మానసోద్వేగముడిపి. 66

పెనుదాయ=పెద్దశత్రువులనెడి, తల్లడిల్లి=కలతచెంది, తహతహింప=వ్యాకులింప, ధూర్త+ప్రతిద్వంద్వి+దుష్ట +చేష్టితమును=వంచనచేయు+శత్రువు+చెడు+చేతలకు, పతి+లావు+నచ్చి=భర్త+శక్తిపై+నమ్మకముకలిగి, నిబ్బరంబు=ధైర్యము, నివ్వటిల్ల=అధికమవగ, అహిత+సైన్యముల=శత్రు+సేన, ధృతి+పల్లటిలి=స్థిరత్వము+ చెడి, వెండి+దిగులు+బలియ=మరల+భయము+ఎక్కువవగా, చకిత+హరిణ+ఈక్షణకు=భయపడిన+ లేడివంటి+కండ్లుకల, మానసు+ఉద్వేగము+ఉడిపి=మనస్సులోని+భయము+పోగొట్టి,

శా. "చింతావేశము వాసెనే, భుజబలోత్సేకంబు నీ కెక్కెనే?

అంతర్ధానము నొందెనే దిగులు? మోహాక్రాంతులం గంటె, ఆ

పొంతన్ డింభకహార్యశస్త్రుల ద్విషద్భూపాలురన్, వీరు, నా

చెంతంజేరిన, నిన్ స్పృహించి, రిటు లీ చేష్టన్ రణాగ్రంబునన్" 67

వాసెనే=తగ్గినదా, ఉత్సేకంబు=అతిశయము, నీకు+ఎక్కెనే=నీకు+తెలిసెనా, మోహ+ఆక్రాంతులం+కంటె= మోహము+ఆక్రమించినవారిని+చూచితివా, ఆపొంతన్=అక్కడ, డింభక+హార్య+శస్త్రుల=పసివారుకూడ+ ఎత్తుకుపోగల+శస్త్రములు కలవారు, ద్విషత్+భూపాలురన్=వైరి+రాజుల, చెంతం+చేరిన=నావద్ద+చేరిన- నన్నువరించిన, నిన్+స్పృహించిరి=నిన్ను+కోరిరి, ఇటులు+ఈ+చేష్టన్=ఈవిధముగా+ఈ+పనిచే,

చ. అని మది కుందు మాన్పుటయు, అచ్చెరువున్, భయముం బ్రియంబునున్
పెనగొనుచుండ ముక్కుపయి ప్రేలిడి, భోజతనూజ మార్తురన్
పెనిమిటి దండనుండి కని, భీపరివర్జిత చిత్తయయ్యె, నొ
య్యన మెఱసెం బ్రహర్షకళ లామె ముఖాబ్జము నందు దొంతరల్. 68

మది+కుందు+మాన్పుటయు=మనసులో+దీనత+మాన్పినంత, పెనగొను=అల్లుకొను, మార్తురన్=శత్రువు లను, దండనుండి=సమీపమునుండి, భీ+పరివర్జిత+చిత్తఅయ్యె=భయము+విడచిన+మనస్సుకలదైనది, ప్ర+హర్ష+కళలు=మిక్కిలి+సంతోషపు+వెలుగులు, దొంతరల్=వరుసలు,

తే. వైరిజనితవిషాదమువలన నట్లు/ముక్తమై, యుల్లసిల్లెను ముగుదమోము,
వీతనిశ్వాసబాష్పమై, వెండి తేట/దనము బొందిన, తళుకుటద్దంబు లీల. 69

వైరి+జనిత+విషాదము=శత్రువుల వలన+కలిగిన+దుఖఃము, ముక్తయై=విడవబడినదై, ఉల్లసిల్లెను= సంతోషించె, ముగుద+మోము=స్త్రీ+ముఖము, వీతనిశ్వాసబాష్పమై=అద్దముముందుండి ఊపిరివిడచిన కలుగు తేమ ఆరిపోవగా, వెండి=మరల, తేటదనము=స్వచ్ఛత,

చ. చిలుకలకొల్కి ఇట్లు విలసిల్లియు, చెంపలు జాజువాఱుటన్,
పలుకులు రాక, సెచ్చెలుల పల్కులచే బొగడెన్ మనోహరున్,
తొలకరి వానజల్లులకు దోగిన నేల, మయూరకూజిత
చ్ఛలమున మేఘమాలికను శ్లాఘయొనర్చు బెడంగు, తోపగన్. 70

చిలుకలకొల్కి=చిలుకవలెపలుకు స్త్రీ, విలసిల్లి=ప్రకాశించి, జాజువాఱుటన్=ఎఱ్ఱబడగా, సెచ్చెలుల+పల్కులచే +బొగడెన్=చెలికత్తెల+పలుకులుగా+పొగడెను=(ఆమె మాటలుచెలికత్తెలుచెప్పిరి), దోగిన=తడసిన, మయూర+కూజిత్+ఛలమున=నెమళ్ళ+కేకల+మిషచే, శ్లాఘయొనర్చు+బెడంగు+తోపగన్=పొగడు+ ఔద్ధత్యము+అనిపించగా,

ఆరీతిం దన వామపాదమును ధూర్తారాతిమస్తంబులన్

సారోదగ్రభుజుండు, మోపి అజు, డశ్వస్యందనో ద్ధూత ధూ

ళీరూక్షాలకయైన ప్రేయసి సమిల్లీలాజయ శ్రీ వధూ

సారూప్యంబు భజింపగా, జనియె నిచ్చన్ పేడ్క లుప్పొంగగన్. 71

వామ=ఎడమ, ధూర్త+అరాతి+మస్తంబులన్=మోసగాళ్ళైన+శత్రువుల+తలలపై, సార+ఉదగ్ర+భుజుండు= చేవకల+పొడవైన+భుజములు కలవాడు, అశ్వ+స్యందన+ఉద్ధూత+ధూళీ=గుఱ్ఱములు+రథములచే+ ఎగురబడిన+దుమ్ముచే, రూక్షాలకయైన=కఱుకైన, సమిత్+లీలా=యుద్ధమున+క్రీడగా, జయ+శ్రీ+వధూ+ సారూప్యంబు=విజయ+లక్ష్మిఅను+పెండ్లి కూతురు-ఇందుమతి+రూపము పొందినట్లు (ప్రయాణములో దూళి సోకిన ఇందుమతి, యుద్ధములో రేగిన ధూళి సోకిన విజయలక్ష్మివలె ఉండెను), భజింపగా= సేవింపగా

# అష్టమ సర్గము - ప్రియావియోగము

తే. పెండ్లి కరకంకణము నైన విప్పుకొనని/కొడుకు నభిషేకపుం బెండ్లికొడుకు జేసి,
నృపతి అపరేందుమతి యన నింపు నింపు/వసుమతిని గూడ చిటికెన పట్ట బనిచె. 1

అపర=రెండవ, ఇంపు+నింపు=ఇచ్ఛ+కలిగించు, వసుమతిని=భూలక్ష్మిని, చిటికెన+పట్టన్+పనిచె=పెండ్లిలో వధువు చిటికెనవేలు తనచిటికెనవేలుతో పట్టుకొనునట్లు+పట్టుకొనమని+నియోగించెను-రాజ్యము ఇచ్చెను

చ. తులువతనంబుతో దొడరి దుర్ణయులైన రుధిరార్ద్రహస్తులై,
బలిమి దురాక్రమింతురు నృపాలసుతుల్ సడికోర్చి దేని, నా
చెలువపు రాచగద్దె, ఇటు చేపడినం బితృదేవుగా దనం
దలకియె కాని, రాఘవుడు, దాని వరింపడు భోగతృష్ణచే. 2

తులువతనము=కుత్సితము, తొడరి=ప్రారంభించి, దుర్ణయులు=చెడునీతి కలవారు, రుధిర+ఆర్ద్ర+హస్తులై= రక్తముతో+తడసిన+చేతులుకలవారై-రక్తపాతముచేసి, బలిమి=బలముతో, దురాక్రమింతురు=అధర్మముగా వశపఱచుకొందురు, సడికి+ఓర్చి=అపకీర్తికి+సిద్ధపడి, చెలువపు+రాచగద్దె=ఒప్పైన+రాజ్యసింహాసనము, కాదనం+తలకియె=కాదనలేక+సంకోచపడే, భోగ+తృష్ణచే=భోగములందలి+పేరాసచే,

తే. మేదిని వసిష్ఠకరసంభృతోదకమున/అజునితో, దాను, అభిషేక మనుభవించి,
తనిసి, విశదసముచ్ఛ్వసితంబు విడిచె/తన కృతార్థత, వెల్లడించెనొ యనంగ. 3

మేదిని=భూమి, వసిష్ఠ+కర+సంభృత+ఉదకమున=వసిష్ఠుని+హస్తములచే+చిమ్మపడిన+చతుస్సముద్రము లనీటితో, తనిసి=తృప్తిపొంది, విశద+సముచ్ఛ్వసితంబు+విడిచె=స్పష్టమైన+గాఢనిట్టుర్పు+విడచెను, కృతార్థత=ధన్యత( భూమి తొలకరికురిసిన తృప్తిగావేడిగాలివిడుచునట్లు)

ఉ. ఆయతపుణ్యశీలుడు, మహాత్ము డధర్వవిదుండు భవ్య నా
దేయపయస్సులన్, స్వగురుదేవుడు తన్నభిషిక్తు జేయ భ
ద్రాయితమూర్తియై, పరదురాసదుడయ్యె నజుండు, బ్రహ్మమున్
స్వీయశరప్రభావమును, జేరి, సదా తన కంగరక్షగా. 4

ఆయత+పుణ్య+శీలుడు=ఎక్కువ+ధర్మ+స్వభావము కలవాడు, అథర్వ+విదుండు=వేదములు+తెలిసిన పండితుడు, భవ్యన్+అనాదేయ+పయస్సులన్=శుభముగా+గ్రహించిన+అభిషేకజలముతో, స్వ+గురుదేవుడు = తమ+గురువు వసిష్ఠుడు, భద్ర+ఆయిత+మూర్తియై=హెచ్చరికతో+సిద్ధమైన+స్వరూపముకలవాడై, పర+దురాసదుడయ్యె=శత్రువులకు+ఎదిరింప వీలులేని వాడయ్యెను, బ్రహ్మమున్=బ్రహ్మతేజస్సు-వసిష్ఠుని మంత్ర ప్రభావమును, స్వీయ+శర+ప్రభావమును=తన+అస్త్ర+నైపుణ్యమును, చేరి=కూడి, సదా=ఎల్లప్పుడు,

తే. రఘువె, మరల మవ్వంపు లేబ్రాయ మంది/వచ్చె నని ఎంచె లోకము వాని జూచి,
అరయగ నతండు తన తండ్రి సిరికె కాదు/వారసుండయ్యె, సుగుణసంపదకు గూడ. 5

మవ్వంపు+లేబ్రాయము+అంది=కోమలమైన+తొలివయసు+పొంది, అరయగ=చూడగా,

క. పరమంబుగ శోభించెను/పరంపరాయాతమైన పాలకపద, మా
పరివృఢుని వలన, నాతని/పరువంబు, నితాంత వినయ పరిణతి వలనన్. 6

పరంపర+అయాతమైన+పాలకపదము=వంశానుగతముగా+వచ్చిన+రాజరికము, ఆ+పరివృఢుని+వలన= ఆ+ప్రభువు+చేత, ఆతని+పరువము=ఆయన+ప్రాయము, నితాంత+వినయ+పరిణతి+వలనన్=అంతులేని+వినయ+పరిపాకము+వలన, పరమంబుగ శోభించెను=(రెండు:రాజ్యము,వయసు), అత్యంతము+ప్రకాశించెను,

తే. మేలుపడజేసి, నెనరున, నేలికొనియె/దొరతనము జూపి, కళవళ పఱచబోక,
రసికు, డచిరోపగతయైన, వసుధ, నజుడు/నూత్నపరిణీత, దన కులపత్ని, బోలె. 7

మేలు+పడన్+చేసి=వలపు+కొనునట్లు+చేసి, నెనరున=స్నేహముతో, ఏలికొనియె=పాలించె, కళవళ+పఱచ బోక=తొట్రుపాటు+పడనీక, అచిర+ఉపగత+ఐన+వసుధ=క్రొత్తగా+తననుచేరినది+అయిన+రాజ్యలక్ష్మిని, నూత్నపరిణీత+తన+కులపత్ని+బోలె=క్రొత్తగాపెండ్లయిన+తన+భార్య ఇందుమతిని+వలే,

ఉ. తా నొకరుండె సమ్మతుడు ధారుణినాథుని కంచు నెంచు నె
వ్వానికివాడు, తత్ప్రకృతివర్గములోన నసంశయాత్ముడై,
మానిసి ఏని యందును, విమానన చూప డతం డుదారుడై,
ఏ నది పట్ల నైన, వెగటించుక లేని పయోధి కైవడిన్. 8

సమ్మతుడు=ఇష్టుడు, ఎవ్వారికితాను=ఎవరికివాడే, తత్+ప్రకృతి+వర్గములోన=వాని+మంత్రుల+సమూహములో, అసంశయాత్ముడై=సందేహములేనివాడై, మానిసి+ఏని+అందును=మనుషులలో+ఏఒక్కరి+అందు కూడ, వి+మానన=అ+గౌరవము, ఉదారుడై=సరళుడై, వెగటు+ఇంచుక+లేని=అయిష్టత+కొంచముకూడా+లేని, పయోధి=సముద్రము, కైవడి=పోలిక,

తే. అతికఠోరుడు కాడు, కా డతి మృదువును/అతడు మధ్యమపరిపాటి, ననుసరించు,
పవనము, మహీజలముల బలె, పగఱ బట్టి/చెడబెకల్పడు, నమ్రుల జేసి, విడుచు. 9

పరిపాటి=పద్ధతి, పవనము+మహీజలముల+బలె=గాలి+చెట్లను+వలె, పగఱ+పట్టి=శత్రువుల+పట్టుకొని, చెడన్+పెకల్పడు=చేడునట్లు+పెల్లగించడు, నమ్రుల=లొంగినవారిగా,

క. తమ తమ వ్యక్తిత్వవికా/సము నేమఱకుండ, సంఘుసంక్షేమమె, ధ్యే
యముగాగ, నడచికొందురు/క్రమశిక్షణ కలిగి, వాని ప్రజ లేప్రొద్దున్. 10

వ్యక్తిత్వ+వికాసము=ప్రత్యేకత అందు+అభివృద్ధి, ఏమఱకుండ=తప్పకుండ, సంఘు+సంక్షేమమె+ధ్యేయము గాగ=అందరికి+మంచిరక్షణే+ఉద్దేశముగా, ఏ+ప్రొద్దున్=అన్ని+రోజులు,

వ. ఇట్లచిరకాలముననే తన యాత్మజు డాత్మవత్తచే సకలప్రకృతులందు సుప్రతిష్ఠు డగుట జూచి, అత్యంతసంతుష్టుడైరఘుమహీపతి త్రిదివస్థము లయినను తమ వినాశధర్మమునువిడువని విషయములవలన విముఖుడై, పరిణామమున గుణవత్సుతరోపితరాజ్యలక్ష్మీకులగు ఇక్ష్వాకుల ఆనువాయి ననుసరించి, తరువల్కలధారణముతోడి తాపసవ్రతసమాశ్రయమునకు దలకొనియెను. కాని, 11

ఆత్మజుడు=కొడుకు, ఆత్మవత్తచే=వశ్యచిత్తుడు-జితేంద్రియుడు-అగుటచే, సకల+ప్రకృతులందు=అందరు+మంత్రుల మనస్సులందు, సుప్రతిష్ఠుడు=ధృఢస్థానము సంపాదించినవాడు, అత్యంత=ఎక్కువ, త్రిదివ+స్థములుకు+అయిననూ=స్వర్గమున+ఉండెడివారు(దేవతలు)+అయిననూ, తమ+వినాశ+ధర్మమును+విడువని+విషయముల+వలన+విముఖుడై=సహజముగా+నశింపచేయు+స్వభావమును+వదలని+ఇంద్రియ సుఖములందలి ఆసక్తి+అందు+వాంఛవిడచినవాడై, పరిణామమున=ఫలితముగా, గుణవత్+సుత+అరోపిత+రాజ్యలక్ష్మీకులగు+ఇక్ష్వాకుల=గుణవంతులైన+కుమారులందు+ఉంచబడిన+రాజ్యలక్ష్మీకల+ఇక్ష్వాకువంశస్తుల, ఆనువాయిని=అలవాటు ఆశ్రయయించువాడై, తరు+వల్కల+ధారణము+తోడి=చెట్టుపట్టలు+వస్త్రము లుగా+కట్టుట+తో, సమాశ్రయమునకున్+తలకొనియెను=ఆశ్రయించ+పూనెను,

క. విపిననివాసోత్సుకు డగు/స్వపితృపదాంభోజములకు ప్రణమిల్లి, అజుం,
డపరస్పరాశ్రుముఖుడై/అపరిత్యాగంబు దనకు నభ్యర్థించెన్. 12

విపిన+నివాస+ఉత్సుకుడు=అడవియందు+నివసింప+కుతూహలపడు, అపరస్పర+అశ్రు+ముఖుడై=ఎడతెగని+కన్నీళ్ళునిండిన+ముఖముతో, అపరిత్యాగంబు=విడువకుండుటను, అభ్యర్థించెన్=వేడుకొనెను,

క. తనయస్నిగ్ధుడు, తనయుని/మనవిని మన్నించె రఘువు, మాఱాడక, వీ

డిన రాచసిరిని మాత్రము/కొనడయ్యెను తిరిగి, పాము కుబుసము బోలెన్ 13

తనయ+స్నిగ్ధుడు=కొడుకునందు+స్నేహముకలవాడు, మాఱు+ఆడక=ప్రతికూలముగా+మాట్లాడలేక, రాచ+సిరి=రాజ్య+లక్ష్మి, కొనడు=తీసికొనడు, పాముకుబుసమున్+పోలెన్=పాముఒకసారికుబుసము విడచిన తిరిగి+తీసికోలేనట్లు.

క. చరమాశ్రమంబు గయికొని/పురిపెలుపల నుండ, బుత్రభోగ్యయయిన రా

సిరి చని, కోడలి విధమున/ఇరవొంద భజించె, నవికృతేంద్రియు నతనిన్. 14

చరమాశ్రమంబున్+కయి+కొని=సన్యాసాశ్రమము+చే+కొని, పురి=నగరము, పుత్ర+భోగ్యయయిన=కుమారుని చే+అనుభవింపదగు, రాసిరి+చని+కోడలి+విధమున+ఇరవొంద+భజించె=రాజ్యలక్ష్మి+వెళ్ళి+కోడలి+వలె+ఒప్పార+సేవించెను, అ వికృత+ఇంద్రియుని=వికారములేని+ఇంద్రియవ్యాపారముకలజితేంద్రుని,

తే. ప్రశమదశనున్న పూర్వసమ్రాట్టు వలన/ప్రగతిపథగామి యగు నవప్రభుని కతన,

క్రుంకు చంద్రుడు, పొడము సూర్యుండు, నైన/ఔషసికశోభ, కెనవచ్చె నక్కులంబు. 15

ప్రశమ+దశను+ఉన్న+పూర్వ+సమ్రాట్టు=విషయములనుండిమరలినవృత్తి+స్థితిలో+ఉన్న+పూర్వపు+రాజు, ప్రగతి+పథ+గామి+అగు=అభ్యుదయ+మార్గమున+నడచు+వాడైన, నవ+ప్రభుని+కతన=క్రొత్త+రాజు+వలన, క్రుంకు=అస్తమించు, పొడము=ఉదయించు, ఔషసిక+శోభకు+ఎనవచ్చెను+అక్కులంబు=ప్రాతఃకాలపు+కాంతికి+పోలెను+ఆవంశము,

తే. యతి నృపతి లింగ ధారుల, నభినుతించె/తులనరహితుల, రఘు రాఘువుల, జగంబు,

ఇలపయి, నిజాంశములతోడ, వెలసి యున్న/మహితమోక్షోదయార్థధర్మద్వయముగ. 16.

యతి=సన్యాసియొక్క, నృపతి=రాజుయొక్క, లింగ+ధారుల=వేషములు+ధరించిన, రఘు+రాఘువుల=రఘువు+అజులను, అభినుతించె=ఎక్కువగాపొగడిరి, తులన+రహితుల=సాటి+లేనివారలను, ఇలపయి+నిజ+అంశముల+తోడ+వెలసి+ఉన్న=భూమిపై+తమతమ+విషయముల+తో+ప్రకాశించు+చున్న, మహిత+మోక్ష+ఉదయ=గొప్ప+నివృత్తి+మరియు అభ్యుదయము+కలిగించు, అర్థ+ధర్మ+ద్వయముగ=అర్థము(అజుడు)+ధర్మము(రఘువు)+రెంటినీ సిద్ధించుజంటగా(ఇద్దరు ధర్మార్థముల అవతారమని సూచన),

ఉ. ఎట్టి కొఱంత లేని జగదేకవిభుత్వము నిర్వహింప స

మ్రాట్టు నయప్రగల్భులగు మంత్రివరేణ్యుల సంప్రతింపగా,

పుట్టువు జావు లేని పదముం గన జేయు వెలుంగు గోరి ప్ర

వ్రాట్టు భజించు బోధనిరవద్యుల యోగసమాహితాత్ములన్. 17

జగత్+ఏక+విభుత్వము=ప్రపంచములో+ఏకైక+ప్రభుత్వము, నిర్వహింప=కొనసాగింప, సమ్రాట్టు=అజుడు, నయ+ప్రగల్భులగు=రాజనీతిఅందు+ప్రతిభకలవారగు, సంప్రతింపగా=సలహా అడుగగా, ప్రవ్రాట్టు=ముసలి రాజు-రఘువు, చావు+లేని+పదముం+కనన్+చేయు+వెలుంగు+కోరి=చావుపుట్టుకలు+లేని+స్థానము+ చూడ+సాధ్యపడు+జ్ఞాన ప్రకాశము+కోరి, బోధ+నిరవద్యుల=జ్ఞానముకల+దోషములేనివారైన, యోగ+ సమాహిత+ఆత్ముల౯=యోగసమాధిని+చక్కగాఉండిన+మనస్సుకలవారిని, భజించు=సేవించు

తే. అధివసించును ప్రకృతికార్యంబు లరయ/అనుదినము పిన్నరాజు ధర్మాసనమును,
ప్రవయుడు వసించు ధారణాభ్యాసనమునకు/విజనతలమున కుశపూతవిష్టరమున. 18

అధివసించును=కూర్చుండు, ప్రకృతి+కార్యంబులు+అరయ=ప్రజల+పనులు+చూడ, ధర్మాసనమును= సింహాసనమును, ప్రవయుడు=వృద్ధుడు, వసించు=ఉండు, ధారణ+అభ్యాసనమునకు=మనస్సు ఏకాగ్రత+ కూర్చుకొనుటకు, వి జన+తలమున=జనులులేని+ప్రదేశమున, కుశ+పూత+విష్టరమున=దర్భలచే+ పవిత్రమైన+ఆసనమున,

సీ. కడలేని ప్రభుశక్తి గడిదేశనృపతుల/అణగార జేసె జనాధినేత,
ప్రణిధానగరిమ లోబడజేసె నవధూత/స్వతనుగోచరమగుత్పంచకమును,
జాగుసేయక భస్మసాత్కరించెను విద్వి/షారంభఫలముల నచిరనృపతి,
దహియించె నాత్మతత్త్వజ్ఞానమనువహ్ని/సర్వకర్మలను రాజర్షివరుడు,
సామయకముగ జేపట్టె షడ్గుణములు/సిద్ధినిష్పత్తి దగ సమీక్షించి కొడుకు,
కసటు వాసిన సమలోష్టకాంచనుండు/తండ్రి, ప్రకృతిస్థముగ గుణత్రయము గెలిచి. 19

కడలేని=మితిలేని, ప్రభుశక్తి=సంపద కోశము దండము అనుశక్తిత్రయముచే, గడిదేశ+నృపతుల=ఎల్లలం దున్న+రాజుల, జనాధినేత=జననాయకుడు-అజుడు, ప్రణిధాన+గరిమ=సమాధి అభ్యాసపు+మేరచే, లోబడన్ +చేసె=స్వాధీన+పఱచుకొనె, స్వ+తను+గోచరమగుత్+పంచకమును=తన+దేహమును+ఆశ్రయించిన+ప్రాణ అపాన వ్యాన ఉదాన సమాన వాయువులను, అవధూత=సన్యాసి-రఘువు, జాగు+సేయక=ఆలస్యము+ చేయక, భస్మ+సాత్కరించెను=బూడిదకు+అధీనపరచెను, వి+ద్విష+ఆరంభ+ఫలముల=గొప్ప+శత్రు+ ప్రయత్నపు+ఫలముల, అచిర+నృపతి=క్రొత్త+రాజు-అజుడు, దహియించెను=భస్మీకరించెను, ఆత్మ+ తత్త్వజ్ఞానమను+వహ్ని=తన+జ్ఞానయోగమను+అగ్నిలో, సర్వ+కర్మలను=సంసారపు+విధులను, రాజర్షి+ వరుడు=ఋషిఅయినరాజులలో+శ్రేష్ఠుడు-రఘువు, సామయకముగన్+చేపట్టె=సమయోచితముగ+ఉపయో గించె, షడ్గుణములు=సంధి విగ్రహము యానము ఆసనము ద్వైధీభావము సమాశ్రయము అను ఆరు

రాచగుణములు, సిద్ధి+నిష్పత్తిన్+తగ+సమీక్షించి=ఫలితపు+పరిసమాప్తికి+తగినట్లుగా+చూచి, కసటు+వాసిన =రుచింపని+తారతమ్యములుగా, సమ+లోష్ట+కాంచనుండు=సమముగాభావించు+మట్టిగడ్డ+బంగారము అయినవాడు, ప్రకృతిస్థముగ+గుణత్రయము+గెలిచి=వికారశూన్యముగ+సత్వరజోతమముల+జయించి,

క. విరమింపడు పట్టినపని/తరుణుం డది సత్ఫలప్రదం బగు దనుకన్,
పరమాత్మను దర్శింపక/విరమించడు వృద్ధు యోగవిధిసాధనమున్. 20

తరుణుండు=యువకుడు-అజుడు, సత్+ఫల+ప్రదంబు+అగున్+తనుకన్=మంచి+ఫలితము+ఇచ్చు+వరకు, వృద్ధు=వృద్ధుడు, యోగవిధి+సాధనమున్=ఐక్యానుసంధానకమైన+నిష్టను,

తే, ఈ కరిణి నుభయులు జాగురూకు లగుచు/నరుల, నింద్రియముల నియంత్రణ మొనర్చి,
ప్రసితులై ఉదయాపవర్గముల రెంట/నుభయసిద్ధుల బడసిరి, యువ జరఠులు. 21

ఈ కరిణి=పైవిధములుగా, జాగురూకులు=జాగ్రత్త కలవారై, నరుల=ప్రజలు మరియు వైరుల, ఇంద్రియముల= త్వక్కు చక్షువు శ్రోత్రము జిహ్వా ఘ్రాణము(జ్ఞాన) వాక్కు పాణి పాదము పాయువు ఉపస్థ (కర్మ) మనస్సు అని 11 ఇంద్రియముల, నియంత్రణము+ఒనర్చి=నియమములో+ఉంచి, ప్రసితులై=ఆశక్తికలవారై, ఉదయ+ అపవర్గముల=అభ్యుదయము+మోక్షములందు, ఉభయ+సిద్ధులన్+పడసిరి=రెండువాంఛితముల+ప్రాప్తి+ పొందిరి, యువ+జరఠులు=యువకుడైన-అజుడు+ముసలివాడైన-రఘువు,

సీ. తనయుని యనురోధమున నిట్లు దైలీపి/సమదర్శనుడు కొన్ని సమలు కడపి,
మహనీయ యోగసమాధిలో నొక్క నా/డవ్యయపురుషునం దైక్య మయ్యె.
తనువు చాలించిన తన పితృబ్రహ్మకు/వివశత గన్నీరు విడచి విడచి,
ఆచరించె నజుండు యతిసమేతంబుగ/అనలేతరం బైన అంత్యకర్మ,
యోగమార్గమును బట్టి మేనుడుగు ధన్యు/లౌరసుల పిండదానము లాసపడమి
ఎఱిగియును, చేసె నౌర్ధ్వదైహికము గూడ/ఆపుకోనలేని పితృభక్తి చాపలమున. 22

అనురోధమున=ప్రతిబంధకము, దైలీపి=రఘుమహారాజు, సమదర్శనుడు=సర్వభూతముల సమభావము కలవాడు, సమలు=సంవత్సరములు. మహనీయ=గొప్ప, యోగసమాధిలో=జీవాత్మపరమాత్మల అనుసంధాన మున, అవ్యయ+పురుషునందు+ఐక్యము+అయ్యె=నిత్యమైన+పరమాత్మయందు+లీనము+అయ్యెను, వివశత=ఒడలెఱుగక, యతి+సమేతంబుగ=సన్యాసులకు+అంగీకరించబడిన, అనల+ఇతరంబు+ఐన+అంత్య +కర్మ=అగ్నిసంస్కారము+కానిది+అయిన-పాతిపెట్టు+అంతిమ+క్రియ, మేను+ఉడుగు=తనువు+చాలించు, ఔరసుల=పుత్రుల, ఔర్ధ్వదైహికము=తిలోదక పిండదానములు, చాపలమున=లౌల్యమున,

ఉ. చేసి సదర్థవేదులగు శిష్టజనంబులు వచ్చి కర్మ స
న్యాసమునన్ బరార్థ్యగతి నందిన తండ్రి అశోచ్యుడంచు నా
శ్వాసితు జేయ నుమ్మలిక వాసి రఘూద్వహు డన్వహప్రజో
పాసన బాధ్యతావహనబంధురుడయ్యె యథావిధంబుగన్. 23

సత్ అర్థ+వేదులగు=పరమార్థము+తెలిసినపండితులగు, శిష్ట=సదాచార సంపత్తికల, కర్మ+సన్యాసమునన్=కర్మమును+పూర్తిగాత్యజించి, పరార్థ్య+గతి=ప్రశస్తమైన+గతి-మోక్షము, అశోచ్యుడు+అంచు=దుఃఖింపదగ్గ వాడుకాదు+అని, ఆశ్వాసితు=ఓదార్పబడినవానిగా, ఉమ్మలిక+వాసి=దుఃఖము+పోగొట్టుకొని, అన్వహ+ప్రజ+ఉపాసన=ప్రతిదినము+ప్రజలను+సేవించు, బాధ్యత+ఆవహన+బంధురుడయ్యె=బాధ్యలను+కలిగించుకొని+మునిగెను,

క. వసుమతియు, నిందుమతియును/రసికాగ్రణి దేల్చి రతని రాగాంబునిధిన్,
వెస నొకతె రత్నసంతతి/ప్రసవించె, నొకర్తు పుత్రరత్నము, గనియెన్. 24

వసుమతి=భూమి, తేల్చిరి+అతని+రాగ+అంబునిధిన్=సంతుష్టి చేసిరి+అజుని+అనురాగ+సముద్రమున, వెసన్+ఒకతె+రత్నసంతతి+ప్రసవించె=శీఘ్రముగా+భూమి+రత్నసమూహము+పుట్టించెను,

క. దశరశ్మిశతసమద్యుతి/దశహరిదాపూర్ణకనదుదాత్తయశస్విన్,
దశరథసమాఖ్యు జేసిరి/దశవదనవిరోధిగురుని దత్సుతు దజ్ఞుల్. 25

దశ+రశ్మి+శత+సమద్యుతి=పది+కిరణ+శతకములుకల(సహస్ర కిరణుడు)సూర్యునితో+సమానకాంతి కల, దశ+హరిత+ఆపూర్ణ+కనత్+ఉదాత్త+యశస్విన్=పది+దిక్కుల+నిండినట్లు+వ్యక్తమగు+గొప్ప+కీర్తి కలవాడు, సమాఖ్యన్+చేసిరి=పేరు+పెట్టిరి, దశవదన+విరోధి+గురుని=రావణునికి+విరోధియైన-రాముని+తండ్రిని, తజ్ఞుల్=ఆవిషయము తెలిసిన వసిష్ఠుని వంటివారు,

క.. శ్రుత యాగ ప్రసవంబుల/అత డిటు ఋషి దేవ పితృగణాన్నృణ్యము సం
గతమగుట వెలిగె, పరిధి/స్థితివిడివడినట్టి, ఉష్ణదీధితి భాతిన్ 26

శ్రుత=ముందువేదశాస్త్రాధ్యయనముచేత ఋషుల, యాగ=యజ్ఞములుచేత దేవతల, ప్రసవంబుల=సంతాన ముచేత పితృదేవతల, అఋణ్యము=ఋణమును, సం+గతము=పూర్తిగా+తీరుటచే, పరిధి+స్థితి=వలయాకార ముగా పరివేషమును కంచెలోనున్న+స్థితినుండి, విడివడి=ముక్తుడై, ఉష్ణదీధితి=సూర్యుడు, భాతిన్=వలె,

ఉ. చేతుల చేవ సత్ఫలము చెందె విపన్నుల గోడు మాన్పి, వి
ద్యాతిశయంబు మేలుతరమయ్యె మనీషుల సత్కరించి, ని

ర్హేతుకవృత్తి, దద్వసుసమృద్ధియె, కాదు పరప్రయోజనో
ద్ద్యోతితమై పొగడ్తవడె, నుత్తమ తద్గుణవత్తయుం గడున్. 27

తత్+వసు+సమృద్ధియె+కాదు=వాని బంగారపు+నిల్వ+ఒక్కటేకాదు, చేతుల+చేవ=భుజ+బలము, విపన్నుల+గోడు+మాన్పి=ఆర్తుల+బాధ+తీర్చి, సత్ఫలము+చెందె=సఫలము+అయినది, విద్య+అతిశయంబు=విద్యఅందలి+ఆధిక్యత, మనీషుల=పండితుల, సత్కరించి=సన్మానించి, మేలుతరమయ్యె=అధికశ్రేష్ఠ మయునది, నిర్హేతుకవృత్తి=అకారణముగనే, తత్+గుణవత్తయుం=వాని+సుగుణములు కూడా, కడున్=ఎక్కువగా, పర+ప్రయోజన+ఉద్ద్యోతితమై=పరుల+ఉపయోగమునకు+ప్రకాశితమై, పొగడ్తవడె=అభినందింపబడె,

శా. ఆ లోకప్రియ పౌరలోచనచకోరాహ్లాది, ఆపార్థివ
ప్రాలేయద్యుతి భూలతాంగి పులకింపన్, ప్రాజ్యసామ్రాజ్యమున్
పాలించున్, ప్రియపత్నిగూడి ప్రణయస్వారాజ్యమేలున్, రస
వ్యాలోలుండయి, రెండిటన్ నడపు, కాలౌచిత్యసంవేదియై. 28

పౌర+లోచన+చకోర+ఆహ్లాది=జనుల+కండ్లుఅను+చకోరములకు+ఆనందము కలిగించువాడు, పార్థివ+ప్రాలేయ+ద్యుతి=రాజఅను+చంద్రుని+వెన్నెల, భూ+లతాంగి=రాజ్య+లక్ష్మి, ప్రాజ్య+సామ్రాజ్యమున్=ప్రచుర+రాజ్యమును, స్వారాజ్యము=సామ్రాజ్యము, రస+వ్యాలోలుండయి=అనురాగమునకు+చలించువాడై, కాల+ఔచిత్య+సంవేదియై=కాలముయొక్క+ఉచితత్వము+బాగాతెలిసిన వాడై,

శా. ఆలాపంబుల, చేతలన్, మనసులం దైక్యంబు పెంపొందగా,
కేళీసౌధములందు, పుష్పలతికాక్రీడానికుంజంబులన్,
లోలత్వం బొడలెత్తినట్లు ప్రియురాలుం, దాను సౌఖ్యాబ్ధిలో
నోలాడున్ మనుజేంద్రు డన్వహనవీనోచ్చావచక్రీడలన్. 29

ఆలాపంబుల=మాటల, ఐక్యము=ఏకత్వము, కేళీసౌధము=ఆటగృహము, పుష్ప+లతికా+క్రీడా+నికుంజంబులన్=పూల+తీగలుగలతో+విహరించదగ్గ+పొదరిళ్ళ, లోలత్వంబు+ఒడలెత్తినట్లు=ఇచ్ఛ+రూపుకొన్నట్లు, సౌఖ్య+అబ్ధిలోన్+ఓలాడున్=సుఖ+సముద్రములో+తేలెను, అన్వహ+నవీన+ఉచ్చావచ+క్రీడలన్=ఎడతెగని+క్రొత్త+నానావిధములైన+ఆటలతో,

తే. వేడుకలు మోసులెత్త గొన్నేడు లిట్లు/కడిపి, పదపడి, ఒకనాడు పుడమిఱేడు
మెలతయును, దాను పెట్టప్రొద్దలత మాన/వీటివెలుపలి ఆటపూదోటలోన. 30

మోసులెత్త=మొలకెత్త, కొన్ని+ఏడులు+ఇట్లు+కడిపి=కొన్ని+సంవత్సరములు+ఈవిధముగా+వెళ్ళబుచ్చి, పదపడి=మరియు, మెలత=స్త్రీ, వెట్ట+ప్రొద్దు+అలత+మాన=వేసవి+కాల+అలసట+మాన్పగా, వీటి+వెలుపలి =నగరపు+బయటి,

సీ. ఎండకన్నెన్నడు నెఱగని తఱుచైన/అలరుటీరముల లోనెలవులందు,
తీర్చిదిద్దిన పూవుదేనె కాల్వల పజ్జ/చెన్నొందు చలువరాతిన్నెలందు,
కలిగొట్లు బొండుమల్లెలు కమ్మతావుల/ప్రోవులు వెదజల్లు తావులందు,
అలల నుయ్యెల లూగి పొలయు తెమ్మరతోడి/వెలిదమ్మికొలకుల కెలకులందు,
తిరిగి తిరిగి, పెక్కు తెఱగుల ఆటల/దగిలి తగిలి, సొగసి సొగసియుండ,
సరవి ప్రొద్దు క్రుంకె, జక్కవదోయిపై/కటిక దయ్యమునకు కన్నుకుట్టె. 31

తఱుచైన+అలరు+ఈరముల=దట్టమైన+పూల+పొదరిళ్ళ, లో+నెలవులందు=పల్లపు+చోటు లందు, తీర్చి+దిద్దిన=తిన్నగా+వేసిన, పజ్జ=సమీపపు, చెన్నొందు+చలువరా+తిన్నెల+అందు=అందమైన+చలువరాతి+వేదిక+పైన, కలిగొట్లు=పాటల వృక్షము, బొండు మల్లెలు=గండు మల్లె, కమ్మ+తావుల+ప్రోవులు=మధుర+పరిమళముల+సమూహము, తావులందు=స్థానములందు, పొలయు+తెమ్మర+తోడి=వీచు+చల్ల గాలి+తోడ, వెలి+తమ్మి+కొలకుల+కెలకులందు=తెల్లని+తామర+చెఱువుల+తీరముల, పెక్కు+తెఱగుల+ఆటలన్+తగిలి +తగిలి=చాలా+విధములైన+ఆటలందు+ఆసక్తిచే+మోహింపబడి, సొగసి+సొగసి+ఉండ=అందమునకు+పారవశ్యముచెంది+ఉండ, సరవి=క్రమముగా, జక్కవ+దోయిపై=చక్రవాకపక్షుల+జంట-ఈ దంపతులు, కటిక+దయ్యమునకు=కఠోరమైన+దేవునకు, కన్నుకుట్టె=సహింపలేకపోయెను,

వ . ఆ సమయమున దక్షిణసముద్రతీరమున గోకర్ణక్షేత్రమున నియతనివాసి యైన
దృక్కర్ణకుండలుని వీణాగానమున సేవింపగోరి, తదుద్యాననేదిష్ఠమున విహాయస మార్గమున
వెడలుచున్న త్రైలోక్యజంఘాలుడగు నారదమునీంద్రుని ఆతోద్యమునకు శేఖరీభూతమైన
అపార్థివప్రసూనదామమును, అధివాసస్పృహయాళువు బలె గంధవహుం డపహరించె. 32

నియత+నివాసి=నిత్యము+నివసించు వాడైన, దృక్కర్ణ+కుండలుని=పాము+చెవిపోగులుగా కలవాని-శివుని, తత్+ఉద్యాన+నేదిష్ఠమున=ఆదంపతులువిహరించుచున్న+వనమునకు+మిక్కిలి సమీపమున, విహాయస=ఆకాశ, త్రైలోక్య+జంఘాలుడు+అగు=మూడులోకములు+మిక్కిలివడిగా సంచరించువాడు+అయిన, ఆతోద్యమునకు+శేఖరీభూతమైన=వీణయొక్క+అగ్రమునందుఉన్న, అ పార్థివ+ప్రసూన+దామమును=భూమి

మీదపుట్టని-దేవ+పుష్ప+మాలను, అధివాస+స్పృహయాళువు+బలె=అలంకరించు కొను+కోరికతో +అన్నట్లుగా, గంధవహుండు+అపహరించె=గాలి+(మోసపుచ్చి)తీసికొని పోయెను,

క. విరిదండ బాసి సురముని/పరివాదిని తోచె భ్రమర పర్యావృతయై
కరువలి అవమతికి పొరిం/బొరి విడిచెనొ సాంజనాశ్రుపూరము నాగన్. 33

సురముని=నారదుని, పరివాదిని=ఏడుతీగలుకలవీణను, బాసి=విడచి, విరిదంద=పూలదండ, కరువలి +అవమతికి=గాలి+అవమానమునకు, భ్రమర+పర్యావృతయై=ఆదండలోని తుమ్మెదలు+వ్యాపించగా, పొరిం+ పొరి+విడిచెనొ+స అంజన+అశ్రు+పూరము+నాగన్=బొట+బోట+కార్చెడి+కాటుక+కండ్లనీటి+ధార+అనునట్లు, తోచె=కనబడే, (గాలిచేసిన అవమానముతో వీణ దుఃఖించగా, నల్లనితుమ్మెదలతో సహా క్రింద పడ్డ దండ, వీణ నల్లనైన కాటుక కంటి నీటి ధారగా కనబడెను)

తే. ఆకసమునుండి డిగి, తదుద్యాన వీరు/ధార్తవసుగంధసంపద నతకరించు
భుగభుగలులు ముంచుకొన వచ్చి పూవుటెత్తు/పడియె, వైదర్భి పృథుకుచోపరితలమున.34

డిగి=దిగి, వీరుధ+ఆర్తవ+సుగంధసంపదన్+అతకరించు=భూమిపైఉన్న చెట్లతీగలకు+ఋతువులవలన ప్రాప్తించిన+మంచివాసనలను+హేళనచేయు, భుగభుగలులు+ముంచుకొన=వాసనలు+కప్పివేయ, పృథు+ కుచ+ఉపరితలమున=పెద్ద+స్థనముల+చూచుకములమీద, పూవుటెత్తు+పడియె=పూలమాల+పడినది,

క. పాలిండ్లకు క్షణసఖి యగు/పేలుపు విరిచెండు జూచి విలవిలయై, భూ
పాలసతి, రాహుహృతచం/ద్రాలోకము భాతి, తన నయనములు మూసెన్. 35

పాలిండ్లకు+క్షణ+సఖియగు+వేలుపు+విరిచెండు=స్థనములకు+క్షణమాత్రము+చెలికత్తెగాకలిసిన- తగిలిన+ దేవ+పూష్పమాల, రాహు+హృత+చంద్ర+ఆలోకము+భాతి=రాహువుచే+అపహరింపబడిన+చంద్రుని+ వెన్నెల+వలె, భూపాలసతి=రాణి, విలవిలయై=ప్రాణమువీడుచుట అందు అనుకరణ, తన=ఇందుమతి, నయనములు+మూసెన్=కండ్లు+మూసె-చనిపోయె,

క. కరణవ్యపేతవపువున/తరుణీమణి నేలకొరిగె, ధవునిం దనతో
నొరగించె, దీపికాశిఖ/ధర దైలనిషేకకణయుతంబుగ, బడదే! 36

కరణ+వ్యపేత+వపువున=ఇంద్రియజ్ఞానము+శూన్యమైన+శరీరమున, ధవునిం+తనతోన్+ఒరగించె=భర్తను+ తనతో+పడవైచె, దీపికా+శిఖ=ద్వీప+జ్వాల, ధరన్=లోకములో, తైల+నిషేక+కణ+యుతంబుగ=నూనె+ స్రవించు+బిందువుల+సమేతముగా, (దీపశిఖ క్రింద పడ దీపమారిపోవును.కాని నూనె మిగులును: దీపము- ఇందుమతి-మరణము. తైలబిందువు-అజుడు -మిగులును.)

వ. ఆ యాకశ్మికదారుణసంఘటనకు పార్శ్వవర్తులగు రాజదాసీదాస మడలి, కాల్సేతు లాడక, లబలబలాడి, హాహాకారములు చేసిరి. ఆ యాక్రోశమునకు బెగ్గడిలి తుల్యావస్థ నొందినవియుంబలె, సమీపకమలాకరాశ్రయవిహంగవితానములు, పెద్దపెట్టునగూయ దొడగె. అంత 37

పార్శ్వ+వర్తులగు=ప్రక్క+ఉన్నవారైన, దాసీ+దాసము=దాసీలు+దాసులు, అడలి=విలపిల్లి, బెగ్గడిల్లి=భయపడి, తుల్య+అవస్థ+ఒందినవి+వలె=దాసీలతోసమాన+స్థితి+పొందినవి+అనునట్లుగా, సమీప+కమల+ఆకర+అశ్రయ+విహంగ+వితానములు=దగ్గరి+తామర+కొలను+ఉనికిపట్టైఉన్న+పక్షి+సమూహము, తొడగె=ప్రారంభించె,

క. ముదుసలి పరిచారిక లొక/పదుగురు పఱతెంచి, వడిగ ప్రాణము లొడలన్
కుదుటంబడు నుపచారము/అది యని, ఇది యని యొనర్చి రాలుమగలకున్ 38

వడిగ=వెంటనే, ఒడలన్+కుదుటంపడు=శరీరమున+స్థిరపడు, ఉపచారము= చికిత్స,

ఉ. దాసజనోపచారఫలితంబుగ ఁజేనికి గన్ను విచ్చె, ని
శ్వాసము వచ్చె, గుండియకు సంచలనంబును హెచ్చె, దేవికిన్
మూసిన నేత్రయుగ్మకము మూసినయట్లనెయుండె, జీవితా
శ్వాసము పూర్తియైన ఫలవంతము లౌనె? చికిత్స లెవ్వియున్. 39

విచ్చె=విడె, సంచలనము=కొట్టుకొనుట, నేత్రయుగ్మకము=రెండు కండ్లు, జీవిత+ఆశ్వాసము=జీవితపు+పరిమాణము, చికిత్సలు=వైద్యములు

చ. క్రమముగ దేహముందెలిసి, కాంతుడు కన్నులు విప్పి, భిన్నవ
ర్ణముననను, సత్త్వవిప్లవమునన్ ప్రతియోజయితవ్యవల్లకీ
సమదశ నొందియున్న తన జాయ గనుంగొని గ్రక్కునన్ నిజాం
కమునకు జేర్చి చూచి, మరి, కార్యము లేదని యార్తమూర్తియై. 40

భిన్నవర్ణముననను=రంగు చెడి, సత్త్వ+విప్లవమునన్=ప్రాణము+నశించిన, ప్రతియోజయితవ్య+వల్లకీ+సమదశను=తీగలతోకూర్పవలసినది(తీగలు తెగిన)+వీణతో+సమానస్థితిని, అంకమున=ఒడిలో, కార్యము+లేదని=ఫలితము+లేదని, ఆర్త=దుఃఖ,

ఆ. ఎలుగు రాలుపడగ విలపించె నరపతి/సహజమయ్యు దాల్మి జాఱవిడిచి,
కాలి ఇనుము కూడ కడు మెత్తబడునన్న/దేహధరుల మాట తెలుప నేల! 41

ఎలుగు+రాలుపడగ+విలపించె=కంఠధ్వని+కంపింప+దుఃఖించె, సహజమయ్యున్+తాల్మి+జాఱవిడిచి =తననైజగుమైన+సహనము+విడచిపెట్టి, దేహధరుల=మానవుల, తెలుప=చెప్ప,

క. "అలరులకు సైత మద్దిర/అలవియె? ఇటు మేను సోకి ఆయువు మాపన్
బలుసాధనముగ, నెయ్యది/అలవడ దిక, హంతుకాముడగు, దుర్విధికిన్! 42

అలరులకు+సైతము+అద్దిర+అలవియె=పువ్వులకు+కూడ+ఔరా!+శక్యమా, మేను+సోకి=ఒంటికి+తగిలి, మాపన్=తీయ, హంతు+కాముడగు+దుర్+విధికిన్=చంప+కోరికకల+చెడు+దైవమునకు, పలు+సాధనము గన్=అనేక+ఆయుధములుగా, ఎయ్యది+అలవడదు=ఏది+సాధ్యముకాదు,

క. తలప మృదువస్తువును విధి/బలివారునో? మృదువె యైన ప్రతివస్తువుతో,
తిలకించమె మంచున దెగు/ఎలదామరపూవు మొదటి దృష్టాంతముగన్. 43

తలప=ఆలోచించ, మృదువస్తువును=కోమలమైన-ఇందుమతిని, విధి+బలివారునో=దైవము+చంపకోరునో, మృదువె+ఐన=కోమలమే+ఐన, ప్రతి+వస్తువుతో=సమానమైన+వస్తువుతో- పూదండ, తిలకించమె=కనమా, మంచునన్+తెగు=మంచుచే+నశించును, ఎలన్+తామరపూవు=లేత+పద్మము, దృష్టాంతముగన్=ఉదాహరణగా,

ఉ. అక్కట! పూలదండ యిది, అంటిన అంగన పాలి మృత్యువై
అక్కున బెట్టికొన్న నను, ఆగతి చంప దిదేమి హేతువో?
ఒక్కొకకాలమం దమృత ముగ్రవిషంబుగ మారు, ఒక్కచో
తక్కక కాలకూటమె సుధారసమై చను ఈశ్వరేచ్ఛచే. 44

అంటిన=తాకిన, అంగన=స్త్రీ, అక్కునన్+పెట్టికొన్న=ఎదపై+ఉంచుకున్న, హేతువో=కారణమో, తక్కక=తప్పక, చను=చెల్లు,

ఆ. కురుల ముడిచికొనెడి విరిదండ పడతికి/కాలపాశమయ్యె కంఠమునకు
కానివేళ, చేతికట్టయె, పామయి/కఱచు నన్న మాట కల్ల గాదు. 45

కురుల=సిగలో, కానివేళ=కాలము కలిసిరాకపోయిన, కల్ల=అబద్ధము.

తే. ఔర! ఇది మా అభాగ్యము కారణముగ/పిడుగుగా మారి విఱుచుకపడియె నన్న,
ఏల కూల్పక విడిచె నీ మూలవిటపి/తునిమె అక్కొమ్మలకు అల్లుకొనిన లతనె" 46

ఇది=పూదండ, విఱుచుకు=భగ్నముచేయ, ఈమూలవిటపి=మూలమైన వృక్షమైన నన్ను, తునిమె= తుంచెను, అక్కొమ్మలకు=దానికొమ్మలకు-బాహువులందు, లతనె=లతవంటిఇందుమతినే,

క. అని కడవెళ్ళని వగపున/బనవుచు ఆసారబాష్పపర్యాకులలో
చనుడై, నిజాంకగత యగు/తన ప్రేయసి జూచి, అతడు దయనీయముగన్. 47

కడవెళ్ళని+వగపునన్=అంతులేని+దుఃఖమున, పనవుచు=ప్రలాపించుచు, ఆసారబాష్ప+పర్యాకుల+లోచనుడై=కనీళ్ళునిండిగా+తాఱుమాఱైన+దృష్టి కలవాడై,

ఉ. " హా! జగదేకసుందరి! ప్రియా! మనపాలిటి కెంత చెడ్డ దీ
రోజు? కఠోరదైవ మిటు మ్రుచ్చిలియెం ద్రుటిలోన ఈసుమ
వ్యాజమునన్, మదీయభుజపంజరవాసిని పైన నిన్ను, నా
రాజపదేశ్వరిం, బ్రణయరాజ్యరమారమణీయవైభవన్. 48

మ్రుచ్చిలియెం+త్రుటిలోన=దొంగలించె+క్షణకాలములో(తామరరేకున తీక్ష్ణమగుసూది దిగునంతటి కాలము), సుమ+వ్యాజమునన్=పూల దండ అను+మిషచే, మదీయ+భుజ+పంజర+వాసినిపైన+నిన్ను=నా+బాహు+బంధములో+ఉన్న+నిన్ను, నా+రాజపద+ఈశ్వరిం=నా+పట్ట+మహిషిని, ప్రణయ+రాజ్యరమా+రమణీయ+వైభవన్= ప్రేమ+సామ్రాజ్యలక్ష్మి+సుందర+విభవముకలదానిని,

సీ. పలకవా?పలవించి పిలిచిన నాతోడ/పలుకు పల్కునను నాకలత మాన్పి,
చూపవా? కనువిచ్చి వాపోవు నాకు నీ/నీలికన్నుల లోని కోలమెఱపు,
తుడువవా? దొనదొన దొరగు నా కన్నీరు/సందిట నన్ను వెచ్చగ బిగించి,
తనుపవా? నన్ను దొంతరల ముద్దుల తోడ/మోమున నీముద్దుమోము జేర్చి,
మధురతరమైన నీ ప్రేమమధురసంబు/నాని ఆనందరసమయ మైన నాదు
మనువు, నిటు కాళరాత్రిగా, మలపు త్రిప్పు/టనుచితము, లేచి రావ నా ప్రాణపదమా! 49

పలవించి=మొఱపెట్టి, పలుకుపల్కునను=మాటమాటకు, కలత=క్షోభము, చూపవా=చూపించవా, కను+విచ్చి=కనులు+తెఱచి, వాపోవు=దుఃఖించు, కోల+మెఱపు=వాలుచూపు+తళుకు, దొన+దొన=జాఱుటఅందు అనుకరణ, దొరగు=జాఱు, సందిట=బాహువుల, తనుపవా=తృప్తి కలిగించవా, దొంతరల=వరుస, మధుర తరమైన=మిక్కిలి తియ్యనైన, మధురసము=తేనె, ఆని=క్రోలి, రసమయమైన=సారవంతమైన, మనువు=జీవితము, ప్రాణపదమా=ప్రాణములకు+ఆశ్రయమైనదానా,

ఉ. చేసి ఎఱుంగ నెన్న డొక చిన్న అనాదరమైన నాకు, నా
దోసము బెద్దసేయమియె దొడ్డగుణంబుగ జెల్లెనీకు, హా!
నా సకలార్థసంపదధినాయకి! నా నయనామృతంబ! ఏ

దోసము జూసి, నీ ప్రియునితో ఎడ యైతిపు డున్నపాటునన్. 50

దోసమున్=దోషమును, పెద్దసేయమి=ఉన్నదానికంటెఎక్కువ చేయకుండుట, దొడ్డ=గొప్ప, చెల్లె=సాగె, నా+సకల+అర్థ+సంపద+అధినాయకి=నా+సమస్త+ఐశ్వర్య+సమృద్ధికి+అధిపతివి, ఎడ=వేరు,

చ. అకట! గ్రహించితేమొ?చెలియా! వినిగూహితవిప్రియుండు, వం
చకుడు, అళీకవత్సలుడు, చంచలచిత్తుడు, నంచు నన్ను, దా
నికి ప్రతిసేయ బూనితివె నిష్ఠురచర్యకు? కాకయున్న, మి
న్నక పరలొకమేగుదువె? నన్నెడబాసి అసన్నివృత్తవై. 51

గ్రహించితేమో=తెలిసికొంటివా, వి+నిగూహిత+విప్రియుండు=బాగా+దాచిపెట్టిన+ఇష్టములేనితనము కలవాడు, అళీక+వత్సలుడు=కపట+ప్రేమకలవాడు, ప్రతిక్రియ=ప్రతికారము, నిష్ఠుర+చర్యకు=కఠినమైన+పనికి, మిన్నక=ఊరక, అ+సన్నివృత్తవై=మరలి తిరిగిరాకుండుటకై,

తే. అపుడు నిన్ను వెంబడించియు అంతలోన/విడిచి, యేనేల వచ్చితి వెనుక దిరిగి?
అనుభవింపగ వచ్చితి ఆత్మకృతము/నీ విరహజన్య మీ హతజీవితార్తి. 52

అపుడు=నీవు పడినప్పుడు, వెంబడించియు=నీతోపాటు క్రిందపడినను, వచ్చితి=బ్రతికి లేచివచ్చితిని, ఆత్మ+కృతము=నా+చెడుచేష్టలరూపమైన తప్పుల ఫలితము, నీ+విరహ+జన్యము+ఈ+హతజీవిత+ఆర్తి=నీ+విరహమున+కలిగిన+ఈ+పాడుజీవితపు+దుఃఖము,

తే. అట్లు నీతోడిదే లోక మనుచు బోవ నైతి/పోగన్న దివికి మున్నరిగి అచట
స్వాగతము పల్కియుండనే, సకియనీకు/ఎంతవానికి, అంత అదృష్టరేఖ! 53

పోగన్న=పోయిఉండినచో, దివి=స్వర్గము, మున్ను+అరిగి=ముందు+వెళ్ళి, సకియ=సఖి,

చ. మనసున నైన విప్రియము మానిని! నీ కొనరింప నెన్నడున్,
నను బగవానిగా ఒక క్షణంబున పొత్తెడసేసి తేటికిన్?
పెనిమిటి, నేను మేదినికి, పేరునకే, సుమి! నిత్యభావబం
ధనముగ, నీకె, దక్కినవి నాప్రణయంబును, నా సమస్తమున్! 54

విప్రియము=అప్రియము, మానిని=ఆత్మాభిమానముకల స్త్రీ, పొత్తు+ఎడ+చెసితి+ఏటికిన్=సహవాసము +దూరము+చేసితివి+ఎందులకు, నిత్య+భావ+బంధనముగ=ఎప్పుడూ+తలపుల+ఆశ్రయించిన,

తే. ఆరిపోలేదు నీ వదనాంబుజమున/వనవిహారశ్రమస్వేదకణము లింక,
నాకు, లేవైతి వింతలోనన, మదాత్మ!/ప్రాణి మనుగడ, ఛీ, ఎంత అస్థిరంబు? 55

వదనాంబుజమున=ముఖపద్మమున, స్వేద+కణములు+ఇంక=చెమట+బిందువులు+ఇంకను, ఆరిపోలేదు =ఆరలేదు, ప్రాణి+మనుగడ=జీవి+జీవితము, అస్థిరంబు=నిలుకడలేనిది,

సీ. తుఱిమిన చిన్ని క్రొవ్విరులతో గాలికి/గదలు నీ నెఱికురుల్ గనిన గలిగె,
పులి నాకి విడిచిన పొలుపున మృత్యువు/నిన్నంటి పోనిచ్చె నన్న భ్రాంతి,
భ్రాంతి నిక్కము సేసి ప్రతిబోధితవు కమ్మ/తొలగింప రమ్మ నా కలత దేవి!
వెలిగింపు మోషధి వెలుగుపై చీకట్లు/కార్కొన్న నా మనోగహ్వరమును,
నోట నొక మాట లేక కన్నుగవ మూసి/భృంగముల సద్దు లోన మడంగి యున్న,
ముడుగు దామర యైన నీ మొగము గన్న/అకట! అడుగంటిపోయె నా యాస లబల! 56

తుఱిమిన=ముడిచిన, చిన్ని =మనోజ్ఞమైన, కొవ్విరులతో=క్రొత్త పూలతో, నెఱి+కురుల్=అందమైన+జుట్టును, కనిన+కలిగె=చూచిన+అనుమానము కలిగె, పులి నాకి విడిచిన=(సామెతలు:పులి నాకి విడిచునుదైవము కలవాని)పులిముట్టుకొని+విడిచి పైచిన, పొలుపున=విధంగా, నిన్ను+అంటి+పోనిచ్చెను+అన్న+భ్రాంతి= నీకు+దగ్గరగావచ్చి+విడచిపుచ్చెను+అను+భ్రమకలిగించెను, భ్రాంతి+నిక్కము+చేసి=ఆభ్రమ+నిజము+చేసి, ప్రతిబోధితవుకమ్మ=మేలుకొనిన దానవు అవుము, కలత=క్షోభము, ఓషధి=తృణజ్యోతి అను పేరుగల లతహిమాలయ గుహల వెలిగించును, చీకట్లు+కార్కొన్న+నా+మనో+గహ్వరమును=చీకటితో+అంధఃకారమైన +నా+మనస్సనెడి+గుహను, భృంగముల+సద్దు=తుమ్మెదల+రొద, మడంగి=క్షీణించిన, ముడుగు+తామర+ ఐన=ముకుళించిన+కమలము వంటిది+ఐన, అడుగంటిపోయె=మాడినవి, ఆసలు=కోరికలు,

తే. పొందు మాపట చంద్రుని పొందు రజని/సహచరుని జేరు వేబోక చక్రవాకి
కాన, విరహము సహియింప గలరు వారు/కాల్పవొకొ? నన్ను అత్యంతగతవు, నీవు 57

పొందు=కూడు, మాపట=రాత్రి, పొందు+రజని=అనుభవించు+రాత్రి, సహచరుని=చక్రవాకమును, వేబోక= వేకువ, చక్రవాకి=ఆడుచక్రవాకము, కాన=ఆ ఆశతో, కాల్పవు+ఒకో=విరహముకాల్పక+ఉండునా, అత్యంత+గతవు=తిరిగిరానిదానవై+వెళ్ళిపోయిన,(రజని మాపట చంద్రుని పొందు పొందు. చక్రవాకి వేబోక సహచరుని జేరు. కాన వారు విరహము సహించగలవారు.)

క. నవపల్లవ గర్భితమగు/నవకపు బూసెజ్జనైన నలుగుం గద నీ
నవనీతమృదు శరీరము/నవలా! చితి జేర్పజేయి నా కెట్లాడున్? 58

నవ+పల్లవ+గర్భితమగు=క్రొత్త+చిగుర్లు+కలిగిన, నవకపు+పూ+సెజ్జనైన=మృదువైన+పూల+పాన్పు నందు కూడా, నలుగుం=పీడింపబడు, నవనీత+మృదు=వెన్నవలే+సుకుమారమైన, నవలా=స్త్రీ,

తే. వనిత! అప్రతిబోధశాయినిని/నిన్ను గని, వగచి తోచె, జూచితే! అనుమృత వలె,
చారుమతి విభ్రమాపాయనీరవయయి/ప్రప్రథమనర్మసఖి, నీదు రత్నరశన. 59

అ ప్రతిబోధశాయినిని=మేలుకోలేనిస్థితిలోనున్న, నిన్ను+కని+వగచి=నిన్ను+చూచి+దుఃఖించి, విభ్రము+ఆపాయ+నీరవ+అయి=భ్రాంతి+కలిగి+నిశబ్దత+చెందిన, ప్రప్రథమ+నర్మ+సఖి+నీదు+రత్న+రశన=మొట్ట మొదటి+రహస్య+సఖివంటి+నీ+రత్నములు పొదిగిన+వడ్డాణము, అనుమృతవలె=(నీ కదలిక లేమిచే శబ్దించక)తానూమరణించినట్లు, తోచె=కనబడుచున్నది,

సీ. కర్ణపేశలమైన కలభాషణప్రౌఢి/గండుకోయిలకు గాను కిచ్చి,
మధుభరాలసమైన మంజులగమనంబు/అంచప్రోయాండ్రకు అప్పగించి,
చపలసుందరమైన చక్షుర్విలాసంబు/ఎలదేటి కొదమల కలవరించి,
ఆకర్షకం బైన అంగలావణ్యంబు/కదలు లేదీగల బదిలపఱచి,
అమరపురగమనోత్సుక వయ్యు బుడమి/ నిలిపితివి నాకుగా గొన్ని నీగుణములు
కాని, అవి త్వద్వియోగతాపానలంబు/ఆఱనిచ్చునె? నాహృదయమున, దేవి! 60

కర్ణ+పేశలమైన=చెవులకు+ఇంపైన, కల+భాషణ+ప్రౌఢి=మధురపు+మాటల+నేర్పు, గండు+కోయిలకు+కానుక+ఇచ్చి=మగ+కోయిలలకు+కనుకగా+ఇచ్చివేసి, భరా+అలసమైన+మంజుల+గమనంబు+అప్పగించి =మనోహరత+నిండి+మందమై+ఒప్పైన+నడక, అంచప్రోయాండ్రకు+అప్పగించి=ఆడుహంసలకు+ఆధీనము చేసి, చపల+సుందరమైన+చక్షుర్+విలాసంబు=చంచలమై+అందమైన+కంటి+చేష్టలు, ఎల+తేటి+కొదమలకు +అలవరించి=చిన్న+తుమ్మెద+పిల్లలకు+నేర్పి, అంగ+లావణ్యంబు+కదలు+లే+తీగలన్+పదిలపఱచి= శరీరపు+విలాసము+కదులుచున్న+లేత+తీగలలో+దాచిపెట్టి, అమరపుర+గమన+ఉత్సుకవు+అయ్యు= స్వర్గమునకు+వెళ్ళు+ఉత్సాహము కలదానివి+ఐననూ, పుడమి+నిలిపితివి+నాకుగాన్+కొన్ని+నీ+గుణములు=భూమిపై+వదిలితివి+నాకై+కొన్ని+నీ+గుణములు, త్వత్+వియోగ+తాప+అనలంబు+ఆఱనిచ్చునె=నీ+ఎడబాటుచేనైన+పరితాపమనెడి+అగ్నిని+పెంపొందించు కాని ఆర్పగలవా?

క. కవ గూర్పగ బెంచితి వల/నవకపు లేమావి, నచట నవమాలికనున్
జవరాల! తద్వివాహము/సవరింపక డించి పోవ జనునే, నీకున్? 61

కవన్+కూర్పగ=అంటుగా+జోడింప, అల+నవకపు+లేమావి=ఆ+కోమలమైన+లేత మామిడి చెట్టును, నవమాలికనున్=విరజాజి తీగకు, తత్+వివాహము=వాటి+కలయక, సవరింపక=చక్కపఱచక, డించి=విడచి, చనునే=న్యాయమా,

క. తిలకింపు మీ అశోకము/తొలిపూవులు పూచె, నీదు దోహదపటిమన్,
అలకాభరణము, బదులవి/అలివేణి! నివాపమాల్య మయ్యెనె? నీకున్. 62

దోహద+పటిమన్=అకాలమందు పుష్పింపజేయు పాదతాడనవంటి క్రియ అందలి+నేర్పుతో, అలకాభరణము =ముంగురుల ముడువదగ్గవి, నివాప+మాల్యము+అయ్యెనే=దహన సమయమునవేయు+దండగా+అయినవి,

తే. కృతమెఱిగి ఇప్పుడెటు సంస్మరింప కుండు/స్రుతసుమాశ్రువులను నవాశోకతరువు?
పరదురాపము, మధురశబ్దాయమాన/నూపురము త్వత్పదాంబుజానుగ్రహంబు. 63

పర+దురాపము=ఇతరచెట్లు+పొందని, మధుర+శబ్దా+అయమాన+నూపురము=మంచి+మాటలు+కూర్చి నట్లుండు+పదమంజీరముతో, త్వత్+పద+అంబుజ+అనుగ్రహంబు=నీ+పాద+కమలముల+దయను, కృతము +ఎఱిగి=నీ దోహదక్రియ విశేషము+తెలిసి, నవ+అశొకతరువు=లేత+అశోకవృక్షము, ఇప్పుడు+ఎటు+ సంస్మరిం పక+ఉండు=ఇప్పుడు+ఎట్లు+తలచుకొనక+ఉండును, స్రుత+సుమ+అశ్రువులను= విడచెను+పూల+కన్నీరు,

తే. పొలతి నీయూర్పు సెత్తావిబోలి వలచు/పొగడలను దెచ్చి, నను గూడి సగమె కాని,
పూల మొలనూలు చివరంట, పోహళింప/వింతలోననె, కనుమూయ, నేమి వచ్చె? 64

ఊర్పు+సెత్తావిబోలి+వలచు=నిట్టూర్పు+పరిమళమువలే+వాసనవచ్చు, సగమె+కాని+పూల+మొలనూలు =సగమేఅయి+పూర్తికాని+పూల+మేఖలను, చివరంట+పోహళింపవు= పూర్తిగా+కూర్చవు,

సీ. సమదుఃఖసుఖలు పొచ్చములేని భావత్క/పరమాభిముఖులు నీ ప్రణయసఖులు,
నేలంటు విడువని నిసువు ముద్దులబిడ్డ/అందాల పాడ్యమి చందమామ,
రమణుడు తుల్యానురక్తుడు నీ కన్ను/సన్నల మెలగు వశంవదుడు,
కలదు నీ కెంతేని బలగము వెనుక ముం/దర గూడ చుట్టాలసురభి వీవు,
ఇన్ని తగులము లున్నవే, ఇంతి! నీకు/ఎట్లు మనసొప్పెనో పోవ నెఱుగకుంటి
కటికిడెందాన నిందర గన్మొఱంగి/ఎందు కీభంగి? లేచిరా, సుందరాంగి! 65

పొచ్చము=కపటము, భావత్+పరమ+అభిముఖులు=నీకోసము+ఎక్కువగా+ఎదురుచూచువారు, నేల+ అంటు+విడువని+నిసువు=నేల+అనుకొనుట+విడవని(ఇంకానడక కూడారాని)+చిన్నబిడ్డ, పాడ్యమి= అప్పుడే ఉదయించిన- ప్రయత్న పూర్వకముగాచూడవలసిన అతి బాలుడు, రమణుడు=ప్రియభర్త, తుల్య+ అనురక్తుడు=నీకునాపై ఉన్నంతటి+ప్రేమకలవాడు, వశంవదుడు=విధేయుడు, బలగము=బంధువర్గము,

చుట్టాల+సురభివి+ఈవు=బంధువులకు+కామధేనువు+నీవు, తగులము=సంబంధములు, కటికి+డెందాన= కఠిన+మనస్సుతో, ఇందర+కను+మొఱంగి=ఇంతమంది+కన్నుల+కప్పిపుచ్చి,

తే. గృహిణి, పేకాంతసఖివి, మంత్రివి, పురంధ్రి!/లలితకళలందు శిష్యురాలవును నాకు

అట్టి నిన్ను దయాహీను డై హరించె/మృత్యు వక్కట నాకేమి మిగులనిచ్చె? 66

సులభము

తే. నిఖిలవిభవము లుండనీ, సుఖము సున్న/ నీవు వెలియైన అజునకు, నిజము, దేవి!

పరవిలోభంబులకు లోనుపడని వీని/అఖిలవిషయంబులును త్వదేకాశ్రయములు.67

నిఖిల+విభవములు=అన్ని విధముల+వైభవములు, సున్న=శూన్యము, వెలియైన=లేని, పర+విలోభంబులకు+లోనుపడడని=ఇతర+ఆకర్షణలకు+లొంగని, వీని+అఖిల+విషయంబుకును=నా+అన్ని+వ్యాపారములకు, త్వత్+ఏక+అశ్రయములు=నీ+తోడనే+కూడినవి,

ఉ. రావు వసంతమాసములు, రావిక నాకు శరద్విభావరుల్,

కావు వినోదహేతువులు, గానములున్ నటనాప్రయోగముల్

లేవు విహారయాత్రలు, విలేపనముల్, లలితాంగి! నేటితో

పూవులబాట, నా బ్రతుకు, వొల్పుఱియెన్ పెనుముండ్లబాటయై. 68

శరత్+విభావరుల్=శరత్కాల+రాత్రులు, విలేపనము=చందనాదులపూత, వొల్పు+అఱియెన్=ఉల్లాసము+నశించెను, పెను=అధిక,

ఉ. పల్లవపేశలం బయిన పాణిని బట్టిన దాదిగా, రసా

భ్యుల్లసితంబు ప్రస్తవనయోగ్యము నిత్యనవంబు నై ప్రవ

ర్తిల్లిన నీ చరిత్రమున దియ్యని ఒక్కొక భావమిప్డు నా

యుల్లమునందు బాఱి, అయయో! గతిమాలితి బ్రోవవే చెలీ!" 69

పల్లవ+పేశలంబు+అయిన+పాణినిన్+పట్టినది+ఆదిగా=చిగురులవలె+మృదువు+ఐన+నీచేతిని+చేపట్టినది+మొదలుగా, రస+అభి+ఉల్లసితంబు=అనురాగము+బాగుగా+పెరిగినందు వలన, ప్రస్తవన+యోగ్యము=బాగా ఎంచ+తగినది, నిత్య+నవంబునై=నిత్య+నూతనమై, ప్రవర్తిల్లిన=గడచిన, తియ్యని+ఒక్కొక+భావము+ఇప్డు=తీపైన+ఒక్కొక+గుర్తులు+ఇప్పుడు, ఉల్లమునందు+పాఱి=మనసున+జ్ఞప్తికి వచ్చి, గతిమాలితి=దిక్కులేని వాడనైతి

మ. అతడ ట్లాత్మసతీ వియోగపరితాపావిద్ధచేతస్కుడై,

హృతసర్వస్వుని భంగి, రాలు కరుగన్ రేయెల్ల వాపోవ, నా
అతివేలవ్యధ జూడలేక, అనుకంపార్ద్రంబు లైనట్లుగా,
స్రుతశాఖారసబాష్పదూషితములై, చూపట్టె వల్లీతరుల్. 70

వియోగ+పరితాప+ఆవిద్ధ+చేతస్కుడై=వియోగ+దుఃఖముచే+తొలువబడిన+మనస్సుకలవాడై, హృత+సర్వస్వుని+భంగి=కోల్పోయిన+సకలముకలవాని+వలె, రాలు+కరుగన్=రాళ్ళు+కరిగేవిధంగా, రే+ఎల్ల+వాపోవ=రాత్రి+అంతా+చింతింప, ఆ+అతివేల+వ్యధ=ఆ+పెల్లువగాఉబికిన+బాధను, అనుకంప+ఆర్ద్రంబులు=కనికరముతో+చెమ్మగిల్లిన, స్రుత+శాఖారస+బాష్ప+దూషితములై= స్రవించుచున్న+మకరందములనెడు+కన్నీళ్ళచేత+మలినములైన, చూపట్టె=కనబడె, వల్లి+తరుల్=భూమిపైనున్న+వృక్షములు,

తే. కరణ విశ్లేషమున జీవకళలు చెడిన/సుదతి దన యంకమున దాల్చి శోచనీయు
డయ్యె నరపతి, మాసిన హరిణరేఖ/దాల్చిన నిశాంతరోహిణీధవుని పగిది. 71

కరణ+విశ్లేషమున=ఇంద్రియములు+లేకపోవుటచే, జీవ+కళలు+చెడిన=బ్రతుకు+లక్షణములు+పోయిన, శొచనీయుడయ్యె=(ఇతరులచే)దుఃఖపడదగ్గవాడయ్యెను, మాసిన+హరిణ+రేఖ+తాల్చిన=మలిన పడిన+లేడి+గీత+ధరించిన, నిశాంత+రోహిణీధవుని+పగిది=వేకువఝామున వెల్లబోయిన+చంద్రుని+వలె,

శా. దావగ్ని క్రియ రాజపత్నినిధనోదంతంబు వ్యాపింప తో
డ్తో విచ్చేసి అమాత్యభృత్యహితబంధువ్యూహముల్ గాఢచిం
తావంతున్, దయనీయు నవ్విభుని చెంతం జేరి యోదార్చి, వే
కావింపించిరి వానిచే ననలసంస్కారంబు దేవేరికిన్. 72

దావగ్ని+క్రియ=దావానలము+వలే, నిధన+ఉదంతంబు=చావు+కబురు, తోడ్తో=వెంటనే, అమాత్య+భృత్య+హిత+బంధు+వ్యూహముల్=మంత్రుల+పరిజన+స్నేహితుల+బందువుల+సమూహము, వే+కావింపించిరి=వేగముగా+జరిపించిరి, అనల+సంస్కారంబు=అగ్ని+సంస్కారక్రియలు,

ఉ. "ఇంతిని వెంబడించి చనియెన్, ప్రభుధర్మము, వీటిబుచ్చె వీడెంత వీ
డెంత, విమోహి!" యంచు దన కిట్లొక యాడిక పుట్టకుండగా,
అంతిపురంబుతోడ సౌదయందు చొరంబడి తీఱడయ్యె గా
కంత యలంత మ్రింగి, మన డాతడు ప్రాణము మీది తీపిచే. 73

వీటి+పుచ్చె=నష్ట+పఱచె, ఆడిక=నిందమాట, అంతిపురంబుతోడ=అంతఃపురముకూడ, సౌదయందు+చొరంబడి+తీఱడయ్యె=దుఃఖముతో+అవసరార్ధముకూడా ప్రవేశింప+లేదు, కాక=కాకపోతే, అంత+అలంత+

మ్రింగి=అంతటి+బాధ+సహించి, మనడు+ఆతడు=బ్రతకడు+అతడు(నింద వహింపకుండుటకుమాత్రమే జీవించెను, రాజ్యకాంక్షచేకాదు),

వ. ఆ పురోపవనముననె దశాహములు కడపి, సుగుణావిశిష్టయగు సుందరికి పారలౌకిక క్రియలు నిర్వర్తించి, మృతాశౌచవిముక్తుడై బంధుమిత్రామాత్యబృందము వొదవికొని తేర, కాకుత్ స్థుడు నిజనివాసమునకు జనుదెంచెను. అపుడు 74

ఆ+పుర+ఉపవనముననె=ఆ+నగర+ఉద్యానవనమునందే, దశాహములు+కడపి=శ్రాద్ధకర్మ జరుగు పది దినములు+వెళ్ళబుచ్చి, సుగుణ+అవిశిష్టయగు=మంచిగుణములుగ మాత్రముగనే+మిగిలిన, పారలౌకిక+క్రియలు+నిర్వర్తించి=అపర+కర్మలు+జరిపి, మృత+అశౌచ+విముక్తుడై=మరణపు+మైల+తీరినవాడై, వొదవికొని+తేర=చేరదీసి+ఓదార్చ,

ఉ. భామిని గోలుపోయి ఇటు వచ్చిన శోకరసద్వితీయునిన్,
యామవతీవియుక్తమిహికాంశునిభున్, దమ జేని జూచుచో,
పేమరు జాలువారె, పెతపెల్లువ నిండిన అంతరంగపుం
దూములు వోని తత్పురవధూనయనంబులనుండి అశ్రువుల్. 75

శోకరస+ద్వితీయునిన్=శోకమే+భూమితోపాటు తనకు రెండవబార్యగా కలవాడైన, యామవతీ+వియుక్త+మిహికాంశు+నిభున్=రాత్రి+గడచినతరువాత-ప్రాతఃకాల-కాంతిహీనుడైన+చంద్రుని+వంటివాని, వేమరు+జాలువారె=చాలాసార్లు+కురిసినవి, పెత+పెల్లువ+నిండిన=దుఃఖ+ప్రవాహముతో+నిండిన, అంతరంగపుం+తూములు+వోని=మనస్సునుండి+కాలువకట్టు+వోలికను, తత్+పుర+వధూ+నయనంబుల+నుండి+అశ్రువుల్=ఆ+నగర+స్త్రీల+కండ్ల+నుండి+కన్నీళ్ళు,

శా. ఆనందంబు నశించె, వేడుకలపై ఆసక్తి చల్లారె, ఏ
గానంబుం జెవి కింపుకాదు, ఋతువుల్ కల్గింప వుల్లాసమున్,
నానాభూషలు మోతచేటు, పరిశూన్యంబయ్యె దల్పంబు, శుక్
పౌనఃపున్య మసహ్యమై, తెగుట బాగై తోచె, భూజానికిన్. 76

నానా+ఆభూషలు=వివిధ+అలంకరణలు, మోతచేటు=అనవసపు భారము, పరిశూన్యం బయ్యె దల్పంబు=బొత్తిగా(ఇందుమతి)లేనిదైనది+పడక, శుక్+పౌనఃపున్యము+అసహ్యమయ్యె=చిలుక మాటల+పునరిక్తి+సహింపలేనిదయ్యె, తెగుట+బాగై+తోచె=చచ్చిన+బాగుండునని+అనిపించె, భూ+జానికిన్=భూవల్లభుడు-రాజుకు,

తే. అతడు పేరోలగంబున కరిగి వగపు/నడచి, ఎంత గంభీరుడై, వ్యవహరించు,
అంతిపురి జేరి నంతనె అంత దుఃఖ/దళితచేతస్కుడై, క్రుంగు ధైర్య మెడలి. 77

పేరోలగంబునకు+అరిగి=మహాసభకు+వెళ్ళి, వగపును+అడచి=శోకము+అడచిపెట్టి, అంతనె=వెంటనే, దుఃఖ+దళిత+చేతస్కుడై=దుఃఖముచే+భేదింపబడిన+మనస్సుకలవాడై, క్రుంగు=మునుగు, ధైర్యము+ఎడలి=ధైర్యమునకు+దూరమై,

వ. ఆ సమయమున సవనదీక్షితుడై తపోవనమున నున్న వసిష్ఠమహామునీంద్రుడు, ప్రణిధానమున రాఘువుని శోకసంవిగ్నతయు, దన్మూలమును దెలిసికొని, ఉపశమనవాక్యములు కఱపి, అంతేవాసి నొకని సాకేతనగరమునకు బంపిన, వాడును త్వరితగమనమున జనుదెంచి, తన రాక ఎఱిగించి, నరేంద్రుని సందర్శించి, సముచిత సత్కారములు పడసి, అతనితో, నిట్లనియె. 78

సవన+దీక్షితుడై=యాగ+దీక్షలోనున్నవాడై, ప్రణిధానమున=చిత్తఏకాగ్రతతో, శోక+సంవిగ్నతయు=శోకముచే+క్షోభపడుటయు, తన్+మూలము=దాని+కారణము, కఱపి=బోధించి, అంతేవాసి=శిష్యుని, పడసి=పొంది,

ఉ. "పూనిన సత్రనిష్ఠ కడముట్టక, కాలుకదల్పరామిచే,
మౌనివరుండు నీ యనుగుమానిని హానియు, నీ మనోరుజా
గ్లానియు దా నెఱింగియును, రాడు, స్వయంబుగ నే డధీరతా
ధీనుడవైన, నిన్ను ప్రకృతిస్థుని జేసి, అనుగ్రహింపగన్. 79

సత్ర+నిష్ఠ+కడముట్టక=యాగ+నియమము+పూర్తికాకుండ, అనుగు+మానిని+హానియు=ప్రియమైన+భార్య + పోవుట, మనో+రుజ+గ్లాని=మనస్సునందలి+దుఖము+మనస్తాపము, అధీరత+అధీనుడవైన=అధైర్యమునకు+స్వాధీనమైన, ప్రకృతిస్థుని+చేసి=సహజ స్వభావమునందు+నిలబెట్టి, అనుగ్రహింపగన్=దయచూపగా,

క. మితపదసందేశసర/స్వతికిన్ మునివరుడు నన్ను జంగమలేఖా
యితుజేసి,యనిచె, అది నీ/మతి జొనిపి, కలంక యుడుగు, మహితవిచారా! 80

మితపదసందేశ=చెప్పదలచిన అర్థమును సంక్షిప్తముగా చెప్పగల, సరస్వతికిన్=వాక్యములకు, జంగమ+లేఖాయితు+జేసి+అనిచె=నడచుచున్న+ఉత్తరముగా+చేసి+పంపె, మతిన్+చొనిపి+కలంకన్+ఉడుగు=మనసున+నిలిపి+శోకము+విడుము,

క. అరయంగ విష్ణుపదముల/నిరునొకట జగత్రయిని అతీతంబున్నే?
పరమర్షియోగదృష్టికి/ధరణీశ! భవిష్యదద్యతనభూతములన్. 81

ఇరున్+ఒకట=రెండు+ఒకటి-మూడు, విష్ణుపదముల=వామనుని పదముద్రలుకల, జగత్రయిని=మూడు లోకాలలోనూ, భవిష్యత్+అద్యతన+భూతములన్=భవిష్యత్+వర్తమాన+భూతకాలముల, పరమర్షి+యోగ+దృష్టికి=వశిష్ఠుని+జ్ఞాన+నేత్రమునకు, అరయంగ=చూడగా, అతీతంబు+ఉన్నే=అతిక్రాంతము+ఉన్నదా?,

క. కులపతి నీ కుపశమనం/బలవడగ నుపన్యసింపుమని, కఱపిన యా
పలుకు, విను ముగ్గడించెద/అలఘుస్థిరసత్త్వసార! అవధానమునన్. 82

ఉపశమనము=ఊరట, అలవడ=సిద్ధింప, ఉపన్యసింపు+అని=చెప్పుము+అని, కఱపిన=బోధించిన, ఉగ్గడించెద=పలికెద, అలఘు+స్థిర+సత్వసార=గొప్ప+నిలకడైన+మనోబలముకలవాడ, అవధానమునన్=మనోయోగముతో,

క. మునుపు తృణబిందు డను ఋషి/ఘనతపము బొనర్చుచుండ గళవళపడి ఆ
అనఘుని సమాధి జెఱుపగ/అనిమిషపతి యనిచె, హరిణి యను నప్సరసన్. 83

ఒనర్చు=చేయు, కళవళపడి=కలతతోతొందరపడి, అనఘుని=పాపములేని-పుణ్యాత్ముని, సమాధి=తపస్సు, అనిమిష+పతి=రెప్పపాటులేని దేవతల+రాజు-ఇంద్రుడు, అనిచె=పంపెను,

మ. ప్రముఖావిష్కృతచారులీల బొడసూపం జూచి, కర్మంది డెం
దమునన్ మేల్పడు మాట దైవ మెఱుగుం, దత్కాలజాతప్రకో
పమునన్ మానిసిపై జనింపు మని శాపంబిచ్చె గీర్వాణికిన్,
శమవేలాప్రలయోర్మియైన స్వతపఃసంరోధకోపమ్మునన్. 84

ప్రముఖ+ఆవిష్కృత=తనఎదుటను+ప్రకటించి కనబడిన, చారు+లీలన్+పొడసూపం=మనోహర+విలాసముగా+కనబడ, కర్మంది=సన్యాసి, డెందమునన్=మనసున, మేల్పడు=మోహపడు, తత్+కాలజాత+ప్రకోపమునన్=ఆ+సమయమున పుట్టిన+అధిక కోపముచే, మానిసిపై=మనిషిపై, గీర్వాణికిన్=అప్సరసకు, శమ+వేలా+ప్రలయ+ఊర్మియైన=శాంతిఅనెడు+చెలియలికట్టకు+ప్రళయకాల+తరంగము వంటిదైన, స్వ+తపః+సంరోధ+కోపమ్మునన్=తన+తపస్సుకు+విఘ్నమునకు కలిగిన+కోపముచేత,

శా. " నానేరంబు సహింపవే? యమివరేణ్యా! కావవే నే, బరా
ధీనన్, బానిస" నంచు వేల్పునవలా దీనాస్యయై కుయ్యిడన్,
సానుక్రోశమనస్కుడై, త్రిదివపుష్పాలోకనప్రాప్తితో
ఏనోముక్తి లభించు, బొమ్మనియె, మౌనీంద్రుడు మర్త్యేశ్వరా! 85

పరాధీనన్+బానిస=ఇంద్రుని ఆధీనములోనున్న+దాసిని, యమి+వరేణ్యా=ముని+శ్రేష్ఠా, వేల్పు+నవలా= దేవతా+స్త్రీ, దీన+ఆస్యయై+కుయ్యిడన్=దీనమైన+ముఖము కలదై+మొఱపెట్ట, సుక్రోశ+మనస్కుడై= జాలికల+మనస్సుతో, త్రిదివ+పుష్ప+అలోకన+ప్రాప్తితో=దేవ+పుష్పముల+సందర్శన+లాభమున, ఏనో+ ముక్తి=ఏనస్సు-పాప+విముక్తి, మర్త్య+ఈశ్వరా=రాజా,

చ. కమలదళాక్షి యంత క్రథకైశికవంశమునన్ జనించి, భా
గ్యమున నినున్ వరించి, ప్రణయంబున నిన్నలరించి, కాలపా
కమున, దివ్యశ్చ్యుతంబు, విరి గన్గొని, శాపనివృత్తి జెందె, ఆ
సుమ మిటు త్రెంచిపైచె నల జోటికి నీకు ఋణానుబంధమున్. 86

ప్రణయంబున+నిన్ను+అలరించి=ప్రేమతో+నిన్ను+సంతసింపచేసి, కాల+పాకమున=కాలము+పూర్తికాగా, దివ్యః+చ్యుతంబు+విరిన్+కన్గొని=స్వర్గమునుండి+రాలిన+పువ్వును+చూచి, నివృత్తి=విముక్తి, అల+జోటికి =ఆ+స్త్రీకి,

ఉ. కావున దైవికంబయిన కామిని పోకకు వంత మానుమీ,
చావు లుపస్థితంబు లిట సంభవ మొందిన ఎల్లవారికిన్,
నీవు తదంగనన్ మఱచి, నెమ్మి వసుంధర నేలుకొమ్మికన్,
శ్రీవసుగర్భయే, సుమి! వరిష్ఠకళత్రము, రాచవారికిన్. 87

పోకకు=పోవుటకు, వంత+మానుము=విచారము+మానుము, ఈ+చావులు+ఉపస్థితంబులు+ఇట=ఈ+ మరణించుట అనునది+సిద్ధమైఉన్నది+భూమిపై, సంభవమొందిన=పుట్టిన, నెమ్మి=నిండుమనసుతో, శ్రీవసుగర్భయే=భూమియే, వరిష్ఠ+కళత్రము=శ్రేష్ఠమైన+భార్య,

ఉ. ఉన్నతి నొంది నప్పుడు మదోద్ధతుడన్ సడి జేరనీక, నీ
సన్నుతశాస్త్రజన్యమగు జ్ఞానసమగ్రత వెల్లడింపవే!
ఎన్నిక గన్న దాని వెలయింపుము వెండియు, వత్స! ఈ మనః
ఖిన్నత వేళ క్లీబతను గెంటి వికారవిదూరబుద్ధివై. 88

ఉన్నతిన్+ఒంది=వృద్ధి+పొంది, మద+ఉద్ధతుడన్+సడిన్+చేరనీక=మదముచే+దుడుకువాడుఅను+నింద+ కూడనీక, సన్నుత+శాస్త్రజన్యమగు+జ్ఞాన+సమగ్రత+వెల్లడింపవే=పొగడదగ్గ+శాస్త్రాధ్యాయనము వలన కలిగిన +ఆధ్యాత్మజ్ఞాన+పరిపూర్తి+చూపుమా, ఎన్నికన్+కన్నదాని=శ్రేష్ఠత+కలిగినదానిని, వెలయింపుము+వెండియు =ప్రకాశింపచెయ్యి+మరల, వత్స=బిడ్డ, మనః+ఖిన్నత+వేళ=మనస్సు+దుఃఖము పొందిన+సమయమున,

క్లీబతను+గెంటి= నోమరితనము+పోగొట్టి, వికార+విదూర+బుద్ధిపై=స్వాభావికము కాని వ్యవహారమునకు+మిక్కిలిదూరముగాచేర్చిన+మనస్సుకలవాడపై,

ఉ. మ్రుచ్చిరి యేడ్చినన్ బ్రతికి ముద్దియ నీకు లభింప దింక, తో
జచ్చియు, ప్రేయసిం గలియజాలుట కల్ల, పరంబునందు వి
న్మిచ్చటి బంధముల్ తగవు లెవ్వియు దేహుల వెంట నంటి పో
వచ్చుట భిన్నమార్గగతు లౌదురు, కర్మఫలానుగుణ్యతన్. 89

మ్రుచ్చిరి=దుఃఖించి, బ్రతికి=మరల బ్రతికి, తో+జచ్చియు=ఆమెతో+చనిపోయిననూ, కలియన్+చాలుట+కల్ల=కలియ+కలుగుట+వీలుపడదు, పరంబునందు=పరలోకమున, విన్ము=వినుము, ఇచ్చటి+బంధముల్+తగవులు+ఎవ్వియు=ఇక్కడి+ప్రేమబంధములైనా+జగడములైన+ఏవీ, దేహుల+వెంటన్+అంటి+పోవు=మనుషుల ఆత్మల+వెనకాల+కూడి+పోలేవు, భిన్న+మార్గ+గతులు+ఔదురు=వేరువేరు+మార్గముల+వెళ్ళు వారు+అవుదురు, కర్మఫల+అనుగుణ్యతన్=వారు చేసిన పాపపుణ్యముల+అర్హత ప్రకారము,

క. మనమున దుఃఖము మానుము/తనుపుము దేవిని నివాపదానాదులతో,
అనయము దహించు బ్రేతము/ననరే! స్వజనముల సంతతాస్రము, వత్సా! 90

తనుపుము=త్రుప్తిచేయుము, నివాప+దానాదులతో=పిండోదకము విడచుట+దానములు చేయుట మొదలైన వాటితో, స్వ+జనముల+సంతత+అస్రము=ఆత్మ+బంధువుల+ఎడతెగని+కన్నీరు, అనయము+దహించున్+ప్రేతమును=మఱిమఱి+కాల్చు+ప్రేతాత్మను,

క. మరణము ప్రకృతి శరీరికి, అరయగ/జీవితము వికృతి, యందురు విజ్ఞుల్,
నరవర్య! క్షణమె, బ్రతికిన/శరీరియును గూడ, లాభశాలియె, సుమ్మీ! 91

అరయగ=పరిశోధించిన, ప్రకృతి=సహజస్వబావము, వికృతి=స్వాభావికము కానిది,

క. ఉరమున శల్యము నాటిన/పరుసున గతబుద్ధి ప్రియవిపత్తికి నడలున్,
స్థిరబుద్ధి, దాని నూడం/బెరికిన శల్యముగ, ముక్తి పెరవుగ, దలచున్ 92

ఉరమున=గుండెపై, శల్యము=ఇనుపమేకు, నాటిన=గ్రుచ్చుకొనిన, పరుసున=విధమును, గత+బుద్ధి=పోయిన+బుద్ధికలవాడు, ప్రియ+విపత్తికి=ప్రియమైనదానికైన+కష్టమునకు, అడలున్=భయపడు, స్థిరబుద్ధి=స్థితప్రజ్ఞుడైనవిద్వాంసుడు, దానిన్=నాటిన విషయము, ఊడం బెరికిన=తీసివేయ బడిన, శల్యము=దుఃఖ కారణముగ, ముక్తి+పెరవుగ=విముక్తి+ఉపాయముగ(ప్రియవస్తునాశము కర్మవిమోచనమై శ్రేయస్కరము ), తలచును=ఆలోచించును,

తే. ప్రాకృతుని భంగి, శోకవిహ్వాలుడ వగుట/పాడియే? యతాత్ముడవు, నీవు పండితుడవు,
అంతరంబేమి, ద్రుమ సానుమంతములకు/అనిలవశమున రెండు దూగాడు నేని. 93

ప్రాకృతుని+భంగి=పామరుని+వలే, శోక+విహ్వాలుడవు=దుఃఖముచే+అధైర్యపడువాడవు, పాడియే=ధర్మమా, యతి+అత్ముడవు=జితేంద్రుడవు, అంతరంబేమి+ద్రుమ+సానుమంతములకు=బేధమేమిటి+చెట్టుకు +పర్వతమునకు, అనిలవశమున+రెండు+దూగాడున్ ఏని=గాలివల్ల+చెట్లవలే కొండలు కూడ+తూగినట్లయిన,

తే. చాల మృదు వయ్యు, సమయానుకూలధైర్య/శాలి వని నిన్ను దలచి, నే సంతసింతు,
బాలకుని, లీల బేలపై తేల, తండ్రి!/మనసు మార్పుము, గతమును మఱచిపొమ్ము.94

మృదువు+అయ్యు=సౌమ్యుడవు+అయిననూ, సమయ+అనుకూల+ధైర్యశాలివని=సమయమునకు+తగినట్టు +ధైర్యము ప్రదర్శించువాడవని, బేలపై=తెలివితక్కువవాడపై, తేల=మోహమున మునుగుటకు,

వ. అని మహనీయప్రబోధమాననీయుడు మైత్రవరుణి నిన్ను ప్రబోధింపమని యానతిచ్చెను.
నీవు నీ వాక్యములు మనమున బట్టుకొలిపి, అపశోకమనస్కుడవు కమ్ము" అని పలికిన
ఉదారమతియగు గురుపాదుని సాంత్వనవచనము లాదరించి, నరేంద్రుడు సంయమిశిష్యవటువును
సముచిత ప్రకారమున సత్కరించి సవినయముగ వీడుకొలిపెను. కాని, శోకఘనమగున్నపుని
హృదయమున, నా గురూపదేశ మిరవుకొన జాలక, గురుసన్నిధికి నివృత్తమైన చందము తోచెను. 95

మహనీయ+ప్రబోధ+మాననీయుడు+మైత్రవరుణి=గొప్పవిషయములను+చక్కగాచెప్పు+పూజనీయుడైన+ వశిష్ఠుడు, ప్రబోధింపుము+అని=మేలుకొలుపుము+అని, పట్టుకొలిపి=నిలుపుకొని, అపశోక+మనస్కుడవు= శోకములేని+మనస్సుకలవాడవు, ఉదారమతి=గొప్పబుద్ధికలవాడు, సాంత్వన+వచనములు+ఆదరించి= ఓదార్పు+మాటలు+గౌరవించి, శోక+ఘనమగు+నృపుని+హృదయమున=శోకము+దట్టముగానిండిన+రాజు+ మనసులో, ఇరవుకొనన్+చాలక=యుక్త స్థానముపొంద+లేక, గురు+సన్నిధికి+నివృత్తమైన+చందము+ తోచెను=గురువుగారి+వద్దకు+మరలిపోయె+అనట్లు+అనిపించెను,

సీ. మరువఱాక, మనంబు మరలింపగానీక/మొగమున ముద్దియ మూర్తి ప్రేల,
ఆకారసామ్యచిత్రాలోకనంబుల/పరితాపపాథోధి తరగలెత్త,
రాచకార్యముల పర్యాలోకముల్/పగల్ కుందుపాటు నొకింత డిందు పఱుప,
స్వప్నసమాగమక్షణికోత్సవంబులు/పృథుబాధలో కొంత మధురిమముగ,
ప్రాణములు రాఘవుడు, బిగ్గపట్టి మనియె/ అష్టవర్షము లెటొ కడు కష్టపడుచు,
ఏకపుత్రుడు మాతృవిహీనుడైన/కందు పెద్దయై, తన చేతి కందు దనుక. 96

మొగమున=ఎదురుగా, ముద్దియ=స్త్రీ-ఇందుమతి, మూర్తి+ప్రేల=ఆకృతి+విడువక ఉండగా, సామ్య=పోలు, చిత్ర+ఆలోకనంబున=బొమ్మల+చూచినంత, పరితాప+పాథోధి+తరగలు+ఎత్త=శోక+సముద్ర+కెరటములు+పొంగ, పర్యాలోకము=ఆలోచనలో, కుందుపాటును+ఒకింత+డిందు+పఱుప=శోకఅవస్త+కొంచము+తగ్గు+పడ, స్వప్న+సమాగమ+క్షణిక+ఉత్సవంబులు=స్వప్నములో+ఇందుమతిని కలసిన+క్షణకాల+సంబరము, పృథు+బాధలో+కొంత+మధురిమముగ=గొప్ప+కష్టములో+కొంత+తీపికాగ, బిగ్గపట్టి+మనియె=బిగపట్టి+జీవించె, కందు=బిడ్డ, దనుక=వరకు,

సీ. దుర్వారమై పేర్చి దుఃఖశంకువు చీల్చె/పాయపాయలుగ భూపతి యెడంద,
మేటిసౌధతలంబు, బీటలు వేయింప/గలిగిన చిఱుజువ్వి మొలక వోలె,
ఘనచికిత్సలకు లొంగక దురంతదురాధి/ప్రాణగొడ్డంబుగా పరిణమింప,
అడలకుండె జనేంద్రు డవిలంబదయితాను/గమనంబునకు సహకారి యనుచు,
అవల సమ్యగ్వినీతుని, కవచధరుని/సుతుని, సామ్రాజ్యమున ప్రతిష్ఠితుని జేసి,
వ్యసనరోగోపస్పృష్టదుర్వసతి దనువు/రోసి, విడువంగ ప్రాయోపవేశ ముండి, 97

దుర్వారమై+పేర్చి=నివారింప శక్యముకానట్లు+విజృంభించి, దుఃఖ+శంకువు+చీల్చెపాయపాయలుగ=దుఃఖమనెడి+మేకు+చీలికలుగాచీల్చెను, ఎడంద=హృదయము, చిఱుజువ్వి=చిన్నరావి, దురంత+దురాధి=అంతములేని+ఎదిరింపలేని, ప్రాణగొడ్డంబుగా=ప్రాణహింసగా, పరిణమింప=మాఱగా, అడలక+ఉండె=భయపడక+ఉండె, అ విలంబ+దయిత+అనుగమనంబునకు=ఆలస్యములేక+భార్యను+అనుసరించుటకు, అవల=పిమ్మట, సమ్యక్+వినీతుని=స్థిరమైనవిద్యఅభ్యాసముచేత+వినయవంతుడైన, వ్యసన+రోగ+ఉపస్పృష్ట+దుర్+వసతి=చింతఅను+రోగముచేత+వ్యాప్తమైన+చెడు+స్థితిలో, తనువు+రోసి=దేహమనిన+విసిగి, ప్రాయోపవేశము+ఉండి=మరణార్థము ఉపవాసము+సలిపి,

మ. సరయూ జాహ్నుసుతానదీద్వయపయస్సంభేదతీర్థంబునన్,
త్వరితత్యక్తశరీరుడై, అజుడు, సద్యఃప్రాప్తలేఖత్వవి
స్ఫురితుండై, చని, యా పురాధికవపుఃశోభాఢ్య నాత్మప్రియన్
మరి, చేపట్టి రమించె నందనవనాంతఃకేళీసద్మంబులన్. 98

సరయూ+జాహ్నుసుతా+నదీ+ద్వయ+పయస్+సంభేద+తీర్థంబునన్=సరయూ+గంగ+నదులు+రెండిటి+నీళ్ళు+సంగమించు+తీర్థమునందు, త్వరిత+త్యక్త+శరీరుడై=వేగముగా+విడచిన+శరీరుడై, సద్యః+ప్రాప్త

లేఖత్వ+విస్ఫురితుండై=వెంటనే+పుణ్యకర్మ ఫలముగాదేవతగాలెక్కింపబడి+మిక్కిలి ప్రాకాశవంతుడై, పురా+అధిక+వపుః+శోభ+ఆఢ్య=పూర్వముకంటె+అధిక+శరీర+కాంతి+కల, ఆత్మప్రియన్=ఇందుమతి రూపమెత్తినహరిణిని, నందన+వనాంతః+కేళీ+సద్మంబులన్=నందన+వనములోని+క్రీడా+గృహములందు,

# నవమ సర్గము దశరథ వర్ణనము

తే. గురుని పిమ్మట , ఉత్తరకోసలమును/ఏలికొనియె, సమాధిజితేంద్రియుండు,
యములలో, రక్షకులలోన నగ్రసరుడు/దశరథుండు సుతోషితదశదిశుండు. 1

గురుని=తండ్రి అజుని, సమాధి+జితేంద్రియుండు=నియమనిష్ఠలచే+ఇంద్రియములజయించినవాడు, యములలో=నియమములు పాటించువారలలో, అగ్రసరుడు=అగ్రగణ్యుడు, సు+తోషిత+దశ+దిశుండు=బాగా+సంతోషించిన+పది+దిక్కులైనవాడు,

సీ. కఱవయ్యె రుజలకు గాలానుకొను చోటు/జనపదంబులు సుభిక్షంబులయ్యె,
శత్రువిప్లవభీతి సర్వథా లేకుండె/ఆర్తనాదము స్వప్నవార్త యయ్యె,
తలయెత్తలేవయ్యె దౌర్జన్యశక్తులు/అవినీతి ఎల్లడ నాస్తి యయ్యె,
ప్రజలమధ్యను సామరస్యము రేకెత్తె/వర్గవిద్వేషబావములు మాసె,
దశదిగంతవిజేత, పితామహునకు/ఘనుడు కన్నతండ్రికి తుల్యకక్కుడగుచు,
అజతనూభవు డభ్యుదయంబు నొందె/నిజకులోచితధర్మంబు నిర్వహింప. 2

కఱవయ్యె=లేనిదయ్యె, రుజ=రోగము, కాలు+ఆను=అడుగు+పెట్టు, జనపదంబులు=గ్రామములు, సుభిక్షంబులు=పాడిపంటలకలిమికలవి, శత్రు+విప్లవ+భీతి=శత్రువుల+తిరుగుబాటుదారుల+భయము, సర్వథా=ఎల్లవేళలందూ, ఆర్త+నాదము=దుఃఖితుల+ఏడుపు, స్వప్నవార్త=కలలోని విషయము, దౌర్జన్య=దుర్జన, నాస్తి=లేనిది, సామరస్యము+రేకెత్తె=సమతాభావము+వర్ధిల్లె, వర్గ+విద్వేష+బావములు+మాసె=జాతులందు+విరోధపు+ఆలోచనలు+మానె, దశ+దిగంత+విజేత=పది+దిక్కుల అంతము వరకూ+జయించిన వాడు, పితామహునకు=రఘువుకి, కన్నతండ్రికి=అజునికి, తుల్య+కక్కుడు=వారి+మార్గములోచరించువాడు, అభ్యుదయము=ప్రగతి, ఒందె=పొందెను, నిజ+కుల+ఉచిత+ధర్మంబు+నిర్వహింప=తన+వంశమునకు+తగిన+రాజధర్మము+పాటింపుచు,

తే. పొగడి రా ఇద్దఱిని, నాడు బుధజనంబు/కాలవర్షిత్వమున, కృతకర్ములనియు,
శ్రమనిషూదను లనియు, పర్జన్యు నొకని/వాని, మనుదండధరవంశవర్యు నొకని. 3

కాల+వర్షిత్వమున=సమయమున+వానలు కురిపించి తద్వారా సంపత్తిని కలిగించు,
పర్జన్యును+ఒకని+వాని= ఇంద్రుడు+ఒకడే+అయినవాని,

కాల+వర్షిత్వమున=సమయమున+ధనముకురిపించుటందు, మను+దండ ధర+వంశ+వర్యున్+ఒకని=మను+రాజ+కులములో+గొప్పవాడైన+ఒకేఒక-దశరథుని, కృతకర్ములని= స్వకర్మనిరతులని, శ్రమ+నిషూదనులు=శ్రమను+పోగొట్టువారని, నాడు=అప్పుడు, బుధజనంబు= బుద్ధిమంతులు,

సీ. సమతాగుణంబున యమునంత వాడన్న/ఆత్తదండతయందు నంతవాడె,
భువనబంధుతయందు రవియంత వాడన్న/అతులతేజమునందు నంతవాడె,
హరిభక్తిలో నిధీశ్వరు నంతవాడన్న/అర్థవర్జనమందు నంతవాడె,
అసదపాకృతి ప్రచేతసు నంతవాడన్న/అమలినత్వమునందు నంతవాడె,
పదయుగానమ్రనైకనృపాలమకుట/భవ్యమణిరోచిరుపచితస్వనఖకాంతి,
పూరితాశేషసుజనమనోరథుండు/తనువిజితమన్మథమదుండు, దశరథుండు. 4

సమతాగుణంబున=అందఱియందు సమభావమున, ఆత్త+దండత=దొంగలకు+శిక్షించుటందు, భువనబంధుత =ప్రజలనుబంధువులుగాచూచుటలో(భువనబంధుడు=సూర్యుడు=రవి), అతులతేజము=సాటిలేని ప్రకాశము, నిధీశ్వరు=కుబేరుడు-ఈశ్వరభక్తుడు, అర్థ+వర్జనమందు=ధనము+త్యజించుట-దానములో, అసత్+అపాకృతి =చెడు+తొలగించుటలో, ప్రచేతసుడు=వర్షముకురుపించు వరుణుడు, అమలినత్వము=స్వచ్ఛత, పదయుగ+ ఆనమ్రనైక+నృపాల+మకుట+భవ్య+మణి+రోచిర్+ఉపచిత+స్వ+నఖ+కాంతి=రెండుపాదముపై+బాగుగా వంగిన+అనేకరాజుల+కిరీటములందలి+గొప్ప+రతనముల+వెలుగులచే+సన్మానింపబడిన+తన+వేలిగోళ్ళ+ వెలుగుకలవాడు, పూరిత+అశేష+సుజన+మనోరథుండు=పూర్తిచేయబడిన+అనేక+మంచి జనుల+ఇచ్ఛలు కలవాడు, తను+విజిత+మన్మథ+మదుండు=శరీరసౌష్ఠవముచె+గెలిచిన+మన్మధ+గర్వము కలవాడు,

సీ. కలమాట నుడువంగ దలకడు, రానీడు/సురరాజు కడనైన పిఱికిమాట,
పలికినమాట తప్పడు నవ్వులకైన/కలనైన పలుకడు కల్లమాట,
అనుచితం బగు మాట యనడు/వచింపడు పరమశత్రువు నైన దురుసుమాట,
లేని యే మాట కల్పింపడు, పరుబిల్చి/చెప్పడు చెవిబడ్డ చెడ్డ మాట,
కపట మెఱుగడు, వ్యసనసంగతికి జనడు/ధనవయోరూపవిద్యామదములు సున్న,
రసికతకు తావు, తాలిమి రచ్చపట్టు/మానవతకు నిధాన, మా మానవుండు. 5

కలమాట=ఉన్న మాట, నుడువంగ=చెప్పుటకు, తలకడు=వెనుదీయడు, సురరాజు+కడనైన=ఇంద్రుని+వద్ద కూడా, కల్లమాట=అసత్యము, అనుచితంబు=తగని, దురుసు=కఠినపు, వ్యసన+సంగతిన్+చనడు=చెడుఅల

వాట్ల+వైపు+వెళ్ళడు, మదము=గర్వము, సున్న=శూన్యము, ఠావు=స్థానము, సంగతి=చేరిక, తాలిమి+రచ్చపట్టు=సహనమునకు+కొలువుకూటము, నిధానము=నిక్షేపము,

క. ఉదయాస్తమయంబులు రెం/డొదవెను, రాజులకు శ్రీరఘూద్వహువలనన్,
ఒదిగిన వారికి, సదయుడు/ఎదిరించిన వారి, కశనిహృదయుడు నగుటన్ 6

ఉదయ+అస్తమయంబులు=అభివృద్ధి+నాశము, ఒదవె=పొందించె, ఒదిగిన=వశులైన, అశని+హృదయుడు పిడుగువంటి+మనసుకలవాడు,

ఉ. ఏకరథంబునం జని జయించెను జిష్ణుడు, రాఘవుండు ర
త్నాకరనేమి భూతలము నంతయు, భూరిరథాశ్వవారణ
ప్రాకటసేన కేవలము వాని జయంబును జాటె, నుర్వి న
స్తోకపు మ్రోత దద్విజయ దుందుభులయ్యె జతుస్సముద్రముల్. 7

ఏకరథంబునం=ఒక్కడే తనరథముపైనుండి, జిష్ణుడు=జయించు శీలము కలవాడు, రత్నాకర+నేమి=సముద్రము+చుట్టుకమ్మి-పరిధి-గాకల, భూరి+రథ+అశ్వ+వారణ+ప్రాకట+సేన=అధిక+రథములు+గుఱ్ఱములు+ఏనుగులు+కలిగిన ప్రసిద్ధ+సైన్యము, కేవలము=ఒక్క, చాటె=చాటించె, ఉర్వి=భూమి, అస్తోకపు+మ్రోత=మిక్కిలిపెద్ద+ఘోషతో, చతుర్+సముద్రముల్=నాలుగు+సముద్రముల, తత్+విజయ+దుందుభులయ్యె=వాని+విజయముచాటు+నగారామ్రోతలయ్యెను.

క. పరిమార్చె బక్షబలములు/అరివర్గం బయిన భూభృదావళి కెల్లన్,
స్వరుధారల ఘనరథుడును/శరధారల దశరథుడును సమధికశక్తిన్ 8

పరిమార్చెన్+పక్ష+బలములు=ఖండించె+రెక్కలచే+బలవంతమైన, అరి+వర్గము=శత్రుల+కూటమైన, భూభృత్ +ఆవళి=కొండల+పంక్తిని, స్వరు+ధారల+ఘనరథుడు=వజ్రాయుధపు+పదనుచే+మబ్బులు రథముగాకల ఇంద్రుడు, పరిమార్చె+పక్ష+బలములు=చంపెను+శత్రుల+సేనలు కల, భూభృత్+ఆవళి=రాజుల+సమూహ మును, శర+ధారల=బాణపు+వానలచే,

తే. సచివకారితపుత్రకాంజలిపుటముల/అభయ మడిగిన, అలకశూన్యుల, సపత్న
రాజపత్నుల గరుణించు, రాఘవుండు/వారు వీరను, భేదభావంబు విడచి. 9

సచివ+కారిత=మంత్రులసలహాతో+చేసిన, పుత్రక+అంజలి+పుటముల+అభయము+అడిగిన=చిన్నవారగు పుత్రులచే+నమస్కారపూర్వముగా+దోసిలితో+అభయమును+ఆచించిన, అలకశూన్యుల=భర్తపోవుటచే ముంగురులు దిద్దని, సపత్న+రాజపత్నుల=శత్రురాజుల+భార్యలను, కరుణించు=కనికరించు,

చ. అనుపమసత్త్వుడై అనుదితాన్యసితాతపవారణుండునై,
అనలదినేశతేజమున, ఆజి మహీవరమండలంబులో,
అనితరసాధ్యనాభిదశ నందియు, నిత్య మదృప్తచిత్తుడై,
అనలసు డౌను, రంధ్రచల యంచు సిరిన్, మది నిశ్చయించుచున్. 10

అనుపమ+సత్త్వుడై=సాటిలేని+పరాక్రవంతుడై, అనుదిత+అన్య+సిత+ఆతప+వారణుండునై= పైకెత్తబడని+ఇతరరాజుల+తెల్లని+వేడిని+వారించుగొడుగు-శ్వేతఛత్రము కలవాడై, అనల+దినేశ+తేజమున=అగ్ని+సూర్యుల+తేజస్సుకలిగి, ఆజి=యుద్ధములో, మహీవర+మండలంబులో=ద్వాదశ+రాజమండలములో, అనితర+సాధ్య+నాభిదశన్+అందియు=ఇతరులు+సాధింపలేని+మధ్యస్థానము+పొందియు(చక్రవర్తి రథముపై మధ్యలోఉండి ఇతర రాజమండలులల చుట్టు ఉంచుకొని యుద్ధముచేయును), నిత్యము+అ తృప్త+చిత్తుడై=ఎల్లప్పుడు+తృప్తిచెందని+మనస్సుతో, న+అనలసుడు+ఔను=అప్రమత్తుడు+అగును, రంధ్ర+చల=అన్యాయ ఆలస్యాది దోషముల చూచుకొని+జారునది, సిరిన్=లక్ష్మిని, నిశ్చయించుచున్=స్థిరపరచికొని,

క. హరిహయునకు ముందర చని/తఱచుగ వినుతాతిరథుడు, దశరథు డడచున్,
సురరిపుల రుధిరమున దిన/కరాభిముఖమైన నిబిడ కదన రజంబున్. 11

హరిహయునకు=ఇంద్రునికి, తఱచుగా=చాలసార్లు, వినుత+అతిరథుడు=ప్రసిద్ధిచెందిన+రథులలో శ్రేష్ఠుడు, అడచున్=చంపు, సురరిపుల+రుధిరమున=రాక్షసుల+రక్తముతో, దినకర+అభిముఖమైన=సూర్యునికి+ఎదురుగా, నిబిడ+కదన+రజంబున్=గట్టిపడిన+యుద్ద+ధూళి కలదిగా-(సూర్యుని కప్పివేయు చున్న ధూళిని తను చంపిన రాక్షసుల రక్తము తడపగగా, దుమ్ము అణగి ప్రకాశమునకు అడ్డుతొలగెను.)

క. వాసవసము డతడు, గుణో/ద్భాసితలను, చెట్టవట్టె పతిదేవతలన్,
శ్రీసుభగమగధ కేకయ/కోసల నరపాలసుతల గురువినమితలన్. ‘12

వాసవ+సముడు=ఇంద్రునితో+సమానుడు, గుణోద్భాసితలను=మంచిగుణములతో ప్రకాశించువారల, చెట్ట+పట్టె=పాణి+గ్రహించె-పెండ్లాడె, పతిదేవతలన్=పతివ్రతలను, శ్రీ+సుభగ=లక్ష్మితో+భాగ్యవంతమైన, గురు+వినమితలన్=పెద్దలందు+వినయతోమిక్కిలిఒంగువారిని,

క. ప్రేమవతులైన యా కుల/భామలు ముగ్గురు భజింప భాసిల్లె, రఘు
గ్రామణి, త్రిశక్తియుతముగ/భూమండలమునకు దిగిన పురుహూతు డనన్. 13

భజింప=సేవింప, భాసిల్లె=రాజిల్లె, గ్రామణి=ముఖ్యుడు. త్రిశక్తియుతముగ=ప్రజాపాలనకు కావలసిన ప్రభు మంత్ర ఉత్సాహ శక్తుల వంటి ముగ్గురు దేవేరులతో కలిసి, పురుహూతుడు=ఇంద్రుడు,

సీ. అండయై నిలిచె, భీమాయోధనంబున/రక్షోవిహస్తసంక్రందనునకు,
పాడించె, నవధూతభయవియచ్చరలచే/నిజనిరంకుశ శౌర్యభుజబలములు,
కయిసేసె, నుల్లసత్కనకయూపశ్రేణి/సారవతామసతీరయుగళి,
పాత్రార్పితము సేసె, పరిహృతమౌళియై/స్వభుజసంచితహరిద్వసుచయంబు,
అవభృధస్నానపావిత్ర్య మధిగమించి/అమరసంసత్సమాక్రమణార్హుడయ్యె,
మానితేందుమతీశుక్తిమౌక్తికంబు/రమ్యరుచిహేళి, దశరథరాజమౌళి. 14

అండయై+నిలిచె=తోడుగా+నిలచిపోరాడెను, భీమ+అయోధనంబున=భయంకర+యుద్ధమున, రక్షో+విహస్త+సంక్రందనునకు=రాక్షసులనుండి+కాపాడుకొనుటకు సహాయములేని+ఇంద్రునికి, అవధూత+భయ+వియచ్చరలచే=తొలగిన+భయముకల+దైవఅప్సరలచే, నిజ+నిరంకుశ+శౌర్య+భుజ+బలములు=తన+అడ్డులేని+పరాక్రము+బాహు+బలములను, కయిసేసెను=అలంకరించెను, ఉల్లసత్+కనక+యూప+శ్రేణి=ప్రకాశింప చేసెను+బంగార+యూపస్తంభపు(యజ్ఞమందుబలిపశువుకట్టురాట)+వరుసలతో, సారవతామస+తీర+యుగళి=సరయూనది+రెండు+ఒడ్డుల, పాత్ర+అర్పితముసేసె=అర్హులైనవారికి+సమర్పించెను, పరిహృత+మౌళియై=(యాగసమయమున) తీసిఉంచిన+కిరీటముతో, స్వభుజ+సంచిత+హరిత్+వసు+చయంబు=స్వంతభుజబలముచే+సంపాదించిన+పచ్చని+బంగారపు+సముదాయము, అవభృధస్నాన+పావిత్ర్యము+అధిగమించి=యాగసమాప్తియందుచేయు స్నానముచే+కలిగిన పవిత్రతను+గ్రహించి, అమర+సంసత్+సమాక్రమణ+అర్హుడయ్యె=దేవ+సమాజమున+సమాన పీఠమునకు+తగినవాడయ్యెను, మానిత+ఇందుమతీ+శుక్తి+మౌక్తికంబు=మన్నింపదగు+తల్లి ఇందుమతిఅను+ముత్యపుచిప్పఅందలి+ముత్యము, రమ్య+రుచి+హేళి=మనోహరమైన+వెలుగుల+సూర్యుడు-సూర్యవంశజుడు,

తే. సరవి బొడసూపె నంత వసంతలక్ష్మి/యమవరుణవైశ్రవణవజ్రిసమధురీణు
వాని, వసుధైకవిభుగొల్వవచ్చె ననగ/సమధుమధురసుమోపహారములతోడ. 15

సరవిన్+పొడసూపె=క్రమముగ+ప్రత్యక్షమయ్యె, వసంతలక్ష్మి=వసంతఋతువు, యమ+వరుణ+వైశ్రవణ+వజ్రి+సమ+ధురీణు=యముడు+వరుణుడు+కుబేరుడు+ఇంద్రుడు+వారితోసమాన+నేర్పరి, వసుధ+ఏక+విభున్+కొల్వ+వచ్చెన్+అనగ=భూమిపై+ఎకైక+ప్రభువును+కొలవ+వచ్చెను+అనునట్లుగా, స+మధు+మధుర+సుమ+ఉపహారములతోడ=మంచి+తేనెచే+తియ్యనైన+పువ్వుల+కానుకలతోడ,

క. భాను డుదగ్దిశ కేగన్/బూని, అనూరుండు తురగముల ద్రిప్ప, హిమా
నీ నాశవిశదదినముఖు/డై నగమున్ మలయ మపుడు త్యజియించి చనెన్. 16

భానుడు+ఉదక్+దిశకు+ఏగన్=సూర్యుడు+ఉత్తర+దిక్కుకు+వెళ్ళగా-ఉత్తరాయణము ప్రారంభము కాగ, అనూరుండు=సూర్యసారథి, తురగములన్+త్రిప్ప=గుఱ్ఱముల+ఉత్తరపుపక్కకు సంచరింపచేయ, హిమానీ+నాశ+విశద+దిన+ముఖుడై=మంచు+నశించుటచేత+స్పష్టమైన+ప్రాతః+కాలమై, నగమున్ మలయము+అపుడు+త్యజించి+చనెన్=మలయపర్వతమును+అప్పుడు+వీడి+ఉత్తరమునకువెళ్ళెను,

చ. తొలి దళుకొత్తె, లేదలిరుతోడనె మ్రాకులు పూతవట్టె, అ
వ్వల జిగురాకు మేసి, పికవర్గము గొంతుక విప్పి కూయగా,
అలరుల దేనె లాని, మధుపావళి మ్రోయగ సాలవద్వన
స్థలమున దోచి, ఆమని యథాగతి సంభృతమయ్యె నెల్లడన్. 17

తొలిన్+తళుకొత్తె=ముందు+శోభిల్లె, లే+తలిరు+తోడనె+మ్రాకులు+పూతవట్టె=లేత+చిగురు+తోడచెట్లు+పూత పూసె, అవ్వలన్+చిగురాకు+మేసి+పికవర్గము=పిమ్మట+లేతఅకులు+తిని+కోయిలల గుంపు, అలరులన్+తేనెలు+ఆని=సంతోషముతో+తేనెను+తాగి, మధుపావళి+మ్రోయగ=తుమ్మెదల గుంపు+ఝుంకారము చేయగా, సాలవత్+వనస్థలమున+తోచి=ఇంటి+తోటలందు+కనబడి, ఆమని=వసంతము, యథాగతి+సంభృతమయ్యె=స్వస్వరూపానుసారము+సంపూర్ణమైనదయ్యె,

తే. నయగుణోపచితైశ్వరు డయిన సదుప/కారశీలుని మార్గణగణము వోలె,
చైత్రసంభృతమయిన కాసారనళిని/నాశ్రయించె, మిళిందనీరాండజములు. 18

నయ+గుణ+ఉపచిత+ఈశ్వరుడు=నీతిమొదలైన+గుణములచే+అభివృద్ధిచెందిన+ప్రభువు, సత్+ఉపకార+శీలుని=మంచి+ఉపకారముచేయు+మనస్సుకలవాని, మార్గణ+గణము=యాచక+బృందము, చైత్ర+సంభృత మయిన+కాసార+నళినిన్+ఆశ్రయించెను=వసంతునిచే+చక్కగాపోషింపబడిన+సరస్సులందలి+తామరతీగ లను+చేరెను, మిళింద+నీర+అండజములు=తుమ్మెదలు+నీటి+హంసలవంటి పక్షులు,

క. నవకపుటశోకవల్లిక/పువు మాత్రమె కాదు, భోగపురుషులకు మనో
భవదీపకమయ్యె, బ్రియా/శ్రవణార్పితమైన, తత్కిసాలము గూడన్. 19

నవకము+అశోక+వల్లిక=కోమలమైన+అశోకవృక్ష+తీగ, భోగపురుషులకు=విలాస వంతులకు, మనోభవ+దీపకమయ్యె=మన్మథభావము+ప్రేరేపించునదయ్యె, ప్రియా+శ్రవణ+అర్పితమైన=ప్రియురాలి+చెవిని+ఉంచబడిన, తత్+కిసాలమున్+కూడన్=అశోకవృక్ష+చిగురాకు+కూడ,

చ. వనమున నెందులేని చెలువంబున, సానలసాన్యపుష్టియై,
వనజవనీరజోమిళితవాయుసమీరితమంజరీభరా

పనతయునై, అశోకసుమవల్లిక విక్లబితాధ్వగాంగనా

జనముల మానసం బనలసాత్కరణంబొనరించె నయ్యెడన్. 20

ఎందులేని=ఎక్కడాలేని, చెలువంబున=విధముగా, సొనలస+అన్యపుష్టియై=సాలవృక్షము అధారముగా+పోషణపొందినదై, వనజ+వనీ+రజో+మిళిత+వాయు+సమీరితము=తామర+రాశి+పుప్పొడులచే+కలిసిన+గాలిచే+వీచబడిన, మంజరీ+భర+ఆపనతయునై=లతల+నిండి+లభించినదైన, అశోక+సుమ+వల్లిక=అశోక మను+పూల+లత, విక్లబిత+అధ్వగ+అంగనా+జనముల=కలవరపడిన+పథిక+స్త్రీ+వర్గముల, అనల+సాత్కరణంబు=తాపాగ్ని+స్వాధీనము

క. సమధికమరందదాన/క్షమములు, మాధుకర గాన కారణములునై,

రమణించె గోరటలు, వన/రమణికి మధులిఖితపత్త్రరచనము లగుచున్.. 21

సమ+అధిక+మరంద+దాన+క్షమములు=మిక్కిలి+ఎక్కువైన+మకరందము+కానుకగాఇవ్వగల+శక్తికలవై, మాధుకర+గాన+కారణములునై=తుమ్మెదలచే+వసంతశోభను కీర్తిస్తూ ఝుంకార గీతములపాడ+ప్రోత్సహించు నవై, రమణించె=అందగించినవి, గోరటలు=గోరంట్లచెట్లు, వన+రమణికి=ఉద్యాన+లక్ష్మికి, మధులిఖిత+పత్త్ర+రచనములు+అగుచున్=వసంతముచేత+రచించబడ్డ+మకరికాది పత్త్రముల+రేఖలు+అగుచు,

క. వనితల ముఖాసవమున ద/దనువాది, సుగంధగుణసమన్వితముగ, బూ

చిన, పొగడమ్రాకు, లలజడి/గనియెన్, మధులోలమధుపగణములవలనన్. 22

వనితల+ముఖ+ఆసవమున=స్త్రీల+ముఖమునుండి+పుక్కిలించిన తాంబూలముచే, తత్+అదనువాది=దానిపోలిన+గుణములుకల, సుగంధ+గుణ+సమన్వితముగ=మంచివాసన+గుణము+కూడు కొన్నదై, పూచిన+పొగడమ్రాకు=దోహదముగావనితల పుక్కిలింతల ప్రభావమున పూచిన+అశోకవృక్షము, మధు+లోల+మధుప+గణముల+వలనన్=తాంబూలము+పోలిన+మకరందముత్రాగిన+తుమ్మెదల+గుంపు వలనను, అలజడిన్+కనియెన్=చలనము+కలిగినవి,(పుష్పములు-తుమ్మెదలు, స్త్రీలు-అశోకవృక్షము),

తే. తనరె,శిశిరాపగమరమాదత్తమైన/మోదుగుల మీది, మవ్వపుమొగ్గచాలు,

మదవిసర్జితలజ్జలు, మగువలిడిన/మగలమీది, నఖక్షతమండనముగ. 23

శిశిర+అపగమ+రమా+దత్తమైన=హేమంతఋతువు+పోయినందువలన వచ్చిన+వంసంతలక్ష్మిచేత+ఈయ బడిన, మోదుగుల మీది=మోదుగచెట్టుమీది, మవ్వపు+మొగ్గ+చాలు=కోమల+మొగ్గల+అందము, మద+

విసర్జిత+లజ్జలు+మగువలు+ఇడిన=మద్యముచేత అమితోత్సాహముతో+విడచిన+సిగ్గుకల+స్త్రీలు+ఉంచిన, నఖ+క్షత+మండనముగ=గోళ్ళచే+గీరబడిన+భూషణములవలె, తనరె=అతిశయించె,

చ. సలయసవిభ్రమాభినయసాధనసేయ దొడంగెనో, యనన్
మలయసమీకరకంపిత సమంచితపల్లవలై, నవీనకో
మలకలికాభిరామలగు, మామిడిశాఖలు, మానసంబులన్
గలచి, చివుర్పజేసె, గలికామవిజేతలకైన రాగముల్. 24

స లయ+స విభ్రమ+అభినయ+సాధన+సేయన్+తొడంగెనో+అనన్=లయతో+విలాసముగా+నృత్య+సాధన+చేయ+ప్రారంభించెనో+అనునట్లుగా, మలయ+సమీకర+కంపిత+సమంచిత+పల్లవలై=మలయ పర్వతము నుండివచ్చు+గాలిచే+చలించు+సుందరమైన+చిగుళ్ళుకలదై, నవీన+కోమల+కలిక+అభిరామలగు=క్రొత్త+మృదువైన+మొగ్గలచే+ఒప్పు, కలికామ+విజేతలకైన=రాగద్వేషములు+జయించిన వారికైనను, మానసంబులన్+కలచి=మనస్సులను+కామవికరము కలవానిగాచేసి, రాగముల్=వలపులు, చివుర్పన్=చిగురింప,

చ. హుతహుతవాహదీప్తి, గడునుజ్జ్వలమై, తపనీయభూషణ
ప్రతినిధియై, వసేందిరకు పండువు, చూడ్కికి చూఅలిచ్చు, నే
అతిమృదుకేసరంబు, అలకాభరణంబుగ, జేసి రా ప్రియా
హితమగు, కొండగోగు విరి నించిన పేడ్క నరాళకైశికల్. 25

హుత+హుతవాహ+దీప్తి=హోమమునందలి+అగ్ని వంటి+కాంతితో, కడున్+ఉజ్జ్వలమై=ఎక్కువ+ప్రజ్వలమై, తపనీయ+భూషణ+ప్రతినిధియై=బంగారు+ఆభరణముల+బదులైనదిగా, వసేందిరకు+పండువు=వనలక్ష్మికి+ఉత్సవము, చూడ్కికి+చూఅలిచ్చును=కంటికి+కనబడచేసెను, ఏ+అతి+మృదు+కేసరంబు=ఏపైతే+ఎక్కువ+కోమలమైన+కింజల్కము, అలక+ఆభరణంబుగన్+చేసిరి=ముంగురులందు+భూషణముగా+చేసిరి, ఆ+ప్రియా+హితమగు=అట్టి+ప్రియురాలకు+ఇష్టమైన, కొండగోగు+విరిని=ఏకకర్ణికా+పుష్పమును, ఇంచిన+పేడ్కన్+అరాళ+కైశికల్=మించిన+పేడుకతో+ఉంగరాల+కేశములుకల స్త్రీలు,

క. ఎలదేటులు కాటుక చు/క్కల పొలుపున, విరుల వ్రాలగా నొప్పిదమై,
అలరించె, వనస్థలముం/దిలకము, తిలకము, నితంబినీముఖము బలెన్. 26

ఎలన్+తేటులు=చిన్న+తుమ్మెదలు, పొలుపున=విధముగా, విరుల=పూలపై, ఒప్పిదమై+అలరించె=శోభిస్తూ+సంతసింపచేసె, వనస్థలముం+తిలకము=ఉద్యానవమునందు అట్టిపువ్వులుకల+తిలకపుచెట్టు, తిలకము+నితంబినీ+ముఖమున్+వలెన్=పుట్టుమచ్చఉన్న+స్త్రీ+ముఖముపై+వలె,

క. సురుచిర నవప్రవాళా/ధరరుచితో, గుసుమ సంభృతస్మితశోభన్,
విరజాజి తరువిలాసిని/మరుల్కొలిపె మనసు మధురమధుగంధమునన్. 27

సు+రుచిర=బాగా+సుందరమైన, నవ+ప్రవాళ+అధర+రుచితో=కొత్త+చిగుళ్ళనెడు పెదవుల+కాంతితో, కుసుమ+సంభృత+స్మిత+శోభన్=పువ్వులు+చేకూర్చిన+చిరునవ్వుల+కాంతిచే, విరజాజి+తరు+విలాసిని= విరజాజి+చెట్టుతీగలను+వయ్యారి, మరుల్కొలిపె=మోహము+కలిగించె, మధుర+మధు+గంధమునన్= ఇంపైన+మకరందపు+సువాసనతో,

చ. కలమృదుషట్పదస్వనము గానముగా, వికచప్రసూన కో
మల రదనద్యుతుల్ నిగుడ, మందమరుచ్చలితప్రవాళముల్,
సలయకరంబులై తనర, సామ్యమువచ్చె, విదగ్ధలాసికా
లలనలతోడ, బోషితవిలాసమనోజ్ఞవనాంతవల్లికల్. 28

కల+మృదు+షట్పద+స్వనము+గానముగా=అవ్యక్తమై+కోమలమైన+తుమ్మెదల+ఝుంకారము+పాటగా, వికచ+ప్రసూన+కోమల+రదన+ద్యుతుల్+నిగుడ=వికసించిన+పూవులు+కోమలమైన+దంత+కాంతులై+ వ్యాపింప, మంద+మరుత్+చలిత+ప్రవాళముల్=మందమైన+గాలిచే+కదల్పబడిన+చిగురాకులు, స లయ+ కరంబులై+తనర=లయయుక్తముగా నాట్యము చేయు+చేతులై+అతిశయించ, పోషిత+విలాస+మనోజ్ఞ+ వనాంత+వల్లికల్=పెంపబడిన+వినోదము కొఱకైన+మనోహరమైన+ఉద్యానవనమందలి+లతలు. విదగ్ధ+ లాసికా+లలనల+తోడ=నేర్పరియైన+లాస్యముచేయు-నర్తకస్త్రీల+తోడ, సామ్యము+వచ్చె=పోలిక+కుదిరినది,

సీ. నీటిలోపల గ్రేళ్ళుదాటు బేడిసమీలు/తరళవిస్ఫురిత నేత్రములుగాగ,
నిండారవిరిసిన పుండరీకంబులు/సస్మిత సుందరాస్యములు గాగ,
చిలువతోకల లీల జెలువారు బిసములు/లలిత కోమల బాహులతలు గాగ,
కొలకొలమని కూయు జలవిహంగశ్రేణి/శింజానరత్నకాంచికలు గాగ,
కలసిమెలసి చరించు జక్కవల కవలు/రాజితోన్నత వృక్షవక్షోజములుగ,
భవనదీర్ఘిక లలరె, యౌవనవసంత/విలసన మనోజ్ఞు లైన, తొయ్యలుల రమణ. 29

క్రేళ్ళుదాటు=ఎగిరిపడు, బేడిసమీలు=బేడిస అనేచాపలు, తరళ+విస్ఫురిత+నేత్రములు=చలించుచు+ వెలుగులు చిమ్ము+కండ్లు, పుండరీకంబులు=తెల్లతామరలు, సస్మిత=చిరునవ్వుతో కూడిన, సుందర+ ఆస్యములు= అందమైన+ముఖములు, చిలువ+తోకల+లీలన్+చెలువారు+బిసములు=పాము+తోకల+ విధంగా+అందగిం చు(చెట్లపై పాములుండునుకనక)+తామరతీగలు, లలిత+కోమల+బాహు+లతలు=

మనోజ్ఞమై+మృదువైన +చేతులనెడి+తీగలు, కొలకొలమని=కూయుటఅందుఅనుకరణ, జల+విహంగ+శ్రేణి= నీటిలో+సంచరించు హంసలు మొదలగుపక్షుల+గుంపు, శింజాన+రత్న+కాంచికలు=మ్రోగుచున్న+మణులు కూర్చిన+వడ్డాణములు, జక్కవల కవలు=కవలైన జక్కవపక్షులు, రాజిత+ఉన్నత+చెట్లు+వక్షోజములుగ= ప్రకాశించు+పొడుగైన+చెట్లు+పాలిండ్లుగ, భవన+దీర్ఘికలు+అలరె=ఆఇండ్ల+(నాలుగువందల ధనువుల పరిమాణము కల) జలాశయములు+ఒప్పె, యౌవన+వసంత+విలసన=తరుణవయస్సుఅనే+వసంతముచే +తళుకు తళుకు న మెఱయు, తొయ్యలుల+రమణ=స్త్రీల+మనోజ్ఞతతో,

తే. ననలతావి గుబాళించు వనములందు/వీనుదోయికి ఉండుండి విందుచేసె,
పరభృతారంభపంచమస్వరము ముగ్ధ/సతుల ప్రవిరళ నర్మ భాషణము వోలె. 30

ననల+తావి+గుబాళించు=పువ్వుల+పరిమళము+వాసనవెదజల్లు, పరభృత+అరంభ+పంచమ+స్వరము= కోయిలచే+ప్రారంభింపబడిన+ఇంపైనఐదవ+స్వరము, ముగ్ధ+సతుల=సిగ్గరితనము విడని+స్త్రీల, ప్రవిరళ+ నర్మ+భాషణము=మిక్కిలిసున్నితమైన+పరిహాసపు+మాటలవలె, వీనుదోయికి=రెండు చెవులకు, విందు+చేసె=సంతోషము+కలిగించె,

తే. తిలకమస్తకహర్మ్య ప్రతిష్ఠులైన/షట్పదవిలాసు, లంగనాసఖులు మధుర
రాగముల నాలపించి రారజముమీర/ప్రసవమధ్వనుషంగ సౌరభము నడుమ. 31

తిలక+మస్తక+హర్మ్య+ప్రతిష్ఠులైన=తిలకవృక్షపు+తలఅనెడుపైభాగపు+మిద్దెపైని+ఆశ్రయించిన, షట్పద విలాసులు=విలాసవంతులైన ఆడుతుమ్మెదలు, అంగనాసఖులు=స్త్రీలకునెచ్చలులు, ఆరజము+మీర= కలకలధ్వని+అతిశయింప, ప్రసవ+మధ్వ+అనుషంగ=పూలనుండి+తేనెతీగల+చేరిన, సౌరభము+నడుమ= సువాసన గుభాళింపుల+మధ్య, మధుర+రాగములను+ఆలపించి=తీయని+ఝుంకార గీతము+ ఆలపించినవి,

తే. వ్రణగురుప్రమదాధరవ్యధకరంబు/జఘననిర్విషయీకృత సారసనము
హిమము నిశ్శేషముగ నిగ్రహింప లేడు/విరళమొనరించె గాని యవ్వేళ నినుడు. 32

వ్రణ+గురు+ప్రమద+అధర+వ్యధకరంబు=దంతముచేపడ్డ క్షతములు+పెద్దవై+స్త్రీల+పెదవుల+బాధకలిగించు నవి, జఘన+నిర్విషయీకృత+సారసనము+హిమము=కటి ప్రదేశమున+లేకుండా చేయబడిన+మొలనూలు /మేఖల+యొక్క చల్లదనమును -మేఖల వంటిని ఆనుకొని చలి పెంచును కనుక, నిశ్శేషముగ నిగ్రహింప లేడు=చలివలనకలిగిన పై రెండు బాధలు పూర్తిగా మాన్పలేడు, కాని+విరళము+ఒనరించె=అయినా+చిన్నది గా+చేసెను, ఇనుడు=సూర్యుడు,

తే. "కడప వలతురుగారు సుఖముగ నన్ను /అలసు లీపాంధజను"లని యాత్మనెంచి
నెనరు జూపింపెగాబోలు నిడుపు గాదు/రజని రపనీశవతి నాడు రమ్యయయ్యు. 33

కడప వలతురుగారు=గడపఇష్టపడరు, నన్ను =వసంత రాత్రి, అలసులు=సోమరులు, పాంధజనులు= బాటసారులు, నెనరు=దయ, నిడుపు గాదు=పొడవుకాదు/తక్కువవును, రజని+రప+ఈశవతి=రాత్రిపై+ ఆధీనమున్న +ప్రభువైనస్త్రీ,

క. మధు ఖండితయై రజనీ/వధువు విధూదయవిపాండువదనచ్ఛవియై,
అధవసమాగమసౌఖ్య/వ్యధితాంగనవోలె దానవమును భజించెన్, 34

మధు+ఖండితయై=వసంతకాలమగుటచే+కుదింపబడి, రజనీ+వధువు=రాత్రి అను+స్త్రీ, విధు+ఉదయ+ విపాండు+వదన+చ్ఛవియై=చంద్రుడు+ఉదయింప+వెన్నెలచేతెల్లబడిన+ముఖ+కాంతితో, అధవ+సమాగమ+ సౌఖ్య+వ్యధిత+అంగన+వోలె=భర్తదగ్గరలేక+కలియు+సుఖము+వంచింపబడిన+స్త్రీ+వలె, తానవము= అల్పత్వము, భజించెన్=ఆపేశించె,

తే. ధ్వజపటం బిక్షుధన్వకు, దర్పకునకు/ఛవికరానన చూర్ణము, చైత్రరమకు,
అలరుపుప్పొడి, తేటిపిండనుగమింప/సపవనోపవనోత్థమై, చదలు బర్వె. 35

ధ్వజ+పటంబు=జెండా+బట్టవంటి, ఇక్షు+ధన్వకు=చెఱకు+విలుకాడైన, దర్పకునకు=మన్మధునకు, ఛవి+ కర+ఆనన+చూర్ణము=కాంతి+కలిగించుటకు+ముఖమున దిద్దుకొను+పొడి(నేటి పౌడరు), చైత్రరమకు =వసంతలక్ష్మికి, అలరు పుప్పొడి=పువ్వుల పుప్పొడి, తేటి+పిండు+అనుగమింప=తుమ్మెదల+గుంపు+ వెంబడింప, స పవన+ఉపవన+ఉత్థమై=గాలితోకూడిన+ఉద్యానమందు+రేగి, చదలు=ఆకాసము, పర్వె= వ్యాపించెను.

తే. అరుణరాగము మించు చీనాంకుశములు/శ్రవణవినిపేశితయవాంకురములు, మధుర
పరభృతరవంబు, మొదలైన స్మరబలంబు/ప్రబలి అభికుల లలనైకరసుల జేసె. 36

అరుణరాగము+మించు=కొంచముఎఱుపుకలసంధ్యారాగమును+మించిన, చీనాంకుశములు=పట్టువస్త్రములు, శ్రవణ+వినిపేశిత+యవాంకురములు=చెవులందు+అలంకారముగాబాగాచొచ్చిన(పెట్టుకున్న )+గరికపరకలు, మధుర+పరభృత+రవంబు=మధురమైన+కోయిలల+మ్రోతల, స్మర+బలంబు=మదనుని+సేనలు, ప్రబలి= వర్ధిల్లి, అభికుల=కాముకులను, లలన+ఏక+రసులన్=స్త్రీల+అందే+రాగవివసులుగా,

క. అతనుని కటారి యత్తరి/కృతతేజితమయ్యె జంద్రకిరణంబులచే,
అతుషారవిశదములచే/రతిరాగశ్రమముహుర్నిరాసకములచే. 37

అ తనుని+కటారి=మదనుని+కత్తి, అత్తరి=త్వరితముగా, కృతతేజితమయ్యె=పదును చేయనడిన దయ్యెను, అ తుషార+విశదములచే=మంచు లేకపోవుటచే కలిగిన+స్పష్టత చేత, రతిరాగశ్రమ+ముహుర్+నిరాసకములచే=సంభోగశ్రమ+మరలమరల+వెడలగొట్టబడుటచే,

వ. మరియు వనప్రియము"లంగనలార! మానము డిగద్రావుడు, విగ్రహముకూడ నిష్ప్రయోజకము, లలితోపభోగచతురమగు నెలప్రాయము చక్రమువలె దొల్లుచు బోవును గాని, వెనుకకు మరలి రాసేర" దని కందర్ప సందేశమును పర్యాయమున నివేదించుచు, హెచ్చరింపగా, దదీయహితోపదేశాను గుణంబుగనో? యన, హావభావవిభ్రమైకభాజనంబులగు దరుణీజనంబులు నవవికచవివిధతరులతాంత వాసనాపేటికలగు, లీలోద్యానవాటికలందు ప్రియసహితంబుగ, రమింపుచు, వసంతోత్సవకుతుక మనుభవించుచు, బూదీగల తూగుటుయ్యలల నూగుచు డోలా విహారసమయమున బతనభయ వ్యాజమున బ్రియుల కంఠములను నిర్దయముగా నాశ్లేషించుచు దమ సుకుమారబాహువల్లిక, లాసనరజ్జుపరిగ్రహణమున నవిదగ్ధములగుట నటించిరి 38

వనప్రియములు=(ఆడ)కొయిలలు, అంగనలార!=ఓ స్త్రీలారా!. మానముమ్+దిగద్రావుడు=సిగ్గు+విడచి పెట్టుడు, విగ్రహము+కూడ+నిష్ప్రయోజకము=ప్రణయకలహము+చేయుటకూడా+ఉపయోగము లేదు, లలిత+ఉపభోగ+చతురము+అగున్+ఎలప్రాయము=శృంగారచేష్టా విశేషకమై+అనుభవింప+నేర్పుకలది +అగును+యవ్వనము, కందర్ప+సందేశమును=మదనుని+ఉపదేశము, పర్యాయమున+నివేదించుచు=స్త్రీలచుట్టూ తిరుగుచు+ఎఱిగించుచు, హావ+భావ+విభ్రమైక+భాజనంబులగు=కనుబొమల, కండ్లచలనముల చేత+రాగము ప్రస్ఫుటమై+తొట్రుపాటుకు పాత్రమైన, నవ+వికచ+వివిధ+తరులతాంత+వాసనా+పేటికలగు =క్రొత్తగా+వికసించిన+రకరకాల+చెట్ల లతల+సుగంధమునకు+స్థానమైన, లీల+ఉద్యాన+వాటికలందు=క్రీడకు +ప్రయోజకరమైన+తోటలందు, కుతుకము=సంతోషము, పతన+భయ+వ్యాజమున=పడిపోవు+భయపు+మిషతో, నిర్దయముగాన్+ఆశ్లేషించుచు=కఠినముగా+కౌగలించికొనుచు, తమ+సుకుమార+బాహు+వల్లికలు =వారి+కోమల+చేతులను+తీగలతో, ఆసన+రజ్జు+పరిగ్రహణమున=ఊయలబల్ల+త్రాడు+పట్టుకొనగా, అవిదగ్ధములగుట=గాయపరచబడినదిగా, నటించిరి=ప్రవర్తిల్లిరి,

మ. అపనీహార విశుద్ధ చంద్రకర ముక్తాసార రమ్యంబు,పు
ష్పపరాగాలసమారుతంబు, పరపుష్టశ్రావ్యగానోదయం,
బుపభోగైకరసంబు, పంచశరబాణోత్తేజనప్రౌఢ, మా
ప్తపరాకాష్ఠము, చైత్రవేళ అమృతౌపమ్యంబు, జూపెం గడున్. 39

అప+నీహార+విశుద్ధ+చంద్ర+కర+ముక్తా+సార+రమ్యంబు=తొలగిన+మంచుచే+స్వచ్ఛమైన+చంద్ర+కిరణములను+ముత్యముల+జడివాన+సుందరత, పుష్ప+పరాగ+అలస+మారుతంబు=పువ్వుల+పుప్పొడి బరువుచే+మందమైన+గాలి, పరపుష్ట+శ్రావ్య+గాన+ఉదయంబు=కోయిలచే+వినసొంపైన+పాటలు+పుట్టుట, ఉపభోగైక+రసంబు=అనుభవింపదగు+శృంగారరసము, పంచశర+బాణ+ఉత్తేజన+ప్రౌఢము=మన్మథ+బాణములచే+ప్రభావితమైన+నేర్పు, ఆప్త+పరాకాష్ఠము=తన+అవధిని తానే మించినది, చైత్ర+వేళ+అమృత+ఉపమ్యంబు+చూపెం+కడున్=వంసంత+కాలమును+అమృత+ప్రాయముగా+వ్యక్తముచేసె+ఎక్కువగా.

క. మధుమహము యథాసుఖముగ/విధువదనాసహిత మనుభవించిన తుది, ఆ
మధుమన్మధు మన్మథనిభ/పృధివీపతి కిచ్చవొడమె, మృగయాభిరతిన్. 40

మధు+మహము=వసంతఋతు+ఉత్సవము, విధువదనా+సహితము=చంద్రముఖులైనస్త్రీలతో+కూడి, తుది=ముగియగా, మధుమత్+మధు+మన్మథ+నిభు=విష్ణునికి+వసంతునికి+మన్మథునికి+సముడుడైన, ఇచ్ఛ+వొడమె+మృగయాభిరతిన్=కోరిక+పుట్టెను+జంతు వేటపై+ఆసక్తి,

సీ. చరలక్ష్యములమీదగుఱిపెట్టి పడనేయ/అవితథపరిచయం బలవరించు,
భయకోపవశమున పరువెత్తు మెకముల/ఇంగితం బేర్పడ నెఱుకపఱచు,
సమధికంబుగ లాఘవము దెచ్చి మేనికి/శ్రమనిగ్రహక్షమత్వము నొసంగు,
రాజకార్యపరంపరా విచారమునుండి/తరలించి మనసు నుత్సాహపఱచు,
ఇతని కాచ్ఛోదనం బని యెంచి సచివు/లనుమతింపగ, సజ్జుడై చనియె నృపతి,
మృగవనోపగమక్షమహృద్యవేషు/డంసదేశనిషక్తశరాసనుండు. 41

చర+లక్ష్యము=కదులుతున్న జంతువుల+గురి, అవితథ+పరిచయంబు+అలవరించు=వ్యర్థము కాని+మెలకువలు+అలవాటుపరచు, మెకముల+ఇంగితంబు+ఏర్పడన్+ఎఱుక+పఱచు=జంతు+చేష్టల జ్ఞానము+స్పష్టముగా+తెలియ+చేయు, సమ+అధికంబుగ+లాఘవమున్+తెచ్చి=మంచి+ఎక్కువ+నిపుణత/చుఱుకుతనము/ఆరోగ్యము+ఇచ్చి, మేనికి+శ్రమ+నిగ్రహ+క్షమత్వమును+ఒసంగు=శరీరమునకు+కష్టము+నియంత్రణ చేయు+సామర్థ్యము+ ఇచ్చును, తరలించి=తొలగించి, ఆచ్ఛోదనంబు=వేట, సచివులు=మంత్రులు, సజ్జుడై=సన్నాహియై, మృగ+వన +ఉపగమ+క్షమ+హృద్య+వేషుడు=క్రూరమృగములుకల+అడవి+సమీపించుటకు+యుక్తమైన+మనసు కింపైన+వస్త్రభూషణ అలంకారము కలవాడై, అంసదేశ+నిషక్త+శరాసనుండు=మూపుపై+ఉండిన+విల్లు అమ్ములు కలవాడై,

క. పవనాధ్యే యజవంబున/అవిహతగతి బోవుచుండ అంబరమెల్లన్,

సవితాన మన గనంబడె/సవితృకులుని హయఖురోద్ధచరరేణువునన్. 42

పవన+ఆధ్యేయ+జవంబునన్=గాలి+కదులు+వేగముచే, అ విహత+గతి=అడ్డులేని+విధంగా, అంబరము= ఆకాశము, సవితానము+అనన్=చాందినీబట్ట కలదాని+వలె, సవితృ+కులుని=సూర్య+వంశుని, హయ+ఖుర +ఉద్ధ+అచర+రేణువునన్=గుఱ్ఱముల+గిట్టలచే+లేచి+నిలచిన+ధూళిచే,

తే. అరిగి,విపినాంతరము సొచ్చెఅవధసేత/తరుపలాశసవర్ణమౌ మఱుపు తాల్చి

కుటిల వనవల్లికాబద్ధకుంతలుండు/తురగవల్గనపరినటత్కుండలుండు. 43

విపిన+అంతరము+సొచ్చె=అడవి+మధ్యకు+వెళ్ళెను, అవధసేత=దశరథుడు, తరు+పలాశ+సవర్ణమౌ+ మఱుపు+తాల్చి=చెట్ల+ఆకులతో+సమానరంగుకలిగి+తన్ను మఱుగుపఱచు+వస్త్రాదులుతొడిగి, కుటిల+వన+ వల్లికా+బద్ధ+కుంతలుండు=కపటమైన+అడవి+తీగలు+కట్టుకొనిన+శిఖకలవాడు, తురగ+వల్గన+పరినటత్+ కుండలుండు=గుఱ్ఱము+దుముకుటవలన+బాగుగా కదలు+కర్ణకుండలములు కలవాడు,

క. తనువల్లీవినివేశిత/తనులై, భ్రమరీవిగాహితవిలోచనలై,

కనిరెలమి, విపినదేవత/లనూనరోచిష్ణు, నవ్వనాంతచరిష్ణున్. 44

తను+వల్లీ+వినివేశిత+తనులై=సుకుమార+లతలందు+బాగుగాచొచ్చిన+శరీరులై, భ్రమరీ+విగాహిత+ విలోచనలై=తుమ్మెదలలో+మునిగిన-దాగిన+కన్నులులతో, కనిరి+ఎలమి=చూసిరి+సంతోషముతో, విపిన +దేవతలు=వన+దేవతలు, అనూన+రోచిష్ణు=నిర్ధారింపలేనంతగొప్ప+ప్రకాశవంతుని, అవ్వనాన్త+చరిష్ణున్= ఆఅడవిలో+తిరుగువానిని,

వ నిరస్తపంకము, నిపానవంతమునగుట, నౌపవాహ్యసంచారయోగ్యమైన, అపేతదస్యు దవానలమైన కాంతారమున, జాగిలములు, వాగురికులు, ముంగలిగా ప్రవేశించి, కనక పింగతటిద్గుణ సంయుత మగుట శక్రాయుధముతో సంవదించు సింగాణి నెక్కుపెట్టి 45

నిరస్త+పంకము=తొలగింపబడిన+బురద, నిపానవంతము=బావులు చెఱువులుకలది, ఔపవాహ్యము=పట్టపు ఏనుగు, అపేత+దస్యు+దవానలమైన+కాంతారమున=తొలగింపబడిన+దొంగలు+అడవి అగ్నులుకల+అడవి లో, జాగిలములు=వేటకుక్కలు, వాగురికులు=వలలుపన్ని పక్షులుపట్టువారు, ముంగలిగా=ముందుగా, కనక +పింగ+తటిత్+గుణ+సంయుతమగుట=బంగారము+గోరోజన రంగులతో+మెఱపుతీగవంటి+అల్లెత్రాటితో+ కూడినట్టి, శక్ర+అయుధముతో+సంవదించు+సింగాణిని=ఇంద్రుని+బాణము-ఇంద్రధనస్సు-తో+పోటీపడు+ విల్లును,

క. గవయోరు వరాహకురం/గవయో విశసన విహారకౌతూహలి, జ్యా

రవరోషిత గజరిపుడు న/రవరోత్తము, డవ్వనాంతరమున జరింపన్. 46

గవయ+ఉరు+వరాహ+కురంగ=అడవిఎద్దుల+గొప్ప+అడవిపందుల+జింకల, అవయో+విశసన=తక్షణము+చంపు, జ్యా+రవ+రోషిత+గజరిపుడు=వింటితాడు+ఠంకారశబ్దముచే+కోపముచెందిన+సింహములు కలవాడు

ఉ. సారెకు డాయవచ్చి తమ చన్గుడువంగ బెనంగు బిడ్డలన్,
గూరిమి గెంటలేక, గతికుంటువడం జను పెంటి లేళ్ళతో,
చేరువ దారసిల్లె రఘుసింహునకున్ కుశగర్భవక్త్రమై,
హారికురంగయూధము నిజాగ్రసరోద్ధతకృష్ణసారమై. 47

సారెకున్+డాయవచ్చి=మాటిమాటికి+దగ్గరకు వచ్చి, తమ+చన్+కుడువంగన్+పెనంగు=వాటి+పాలు+త్రాగ+చుట్టుకొను, కూరిమిన్+గెంటలేక=ప్రేమచే+తోయలేక, గతి+కుంటువడం=వేగము+తగ్గుచుండగా, చను+పెంటి+లేళ్ళతో=వెళ్ళు+ఆడ+జింకలతో, నిజ+అగ్రసర+ఉద్ధత+కృష్ణ+సారమై=వాని+ముందునడచుచు+గర్వము తో తలలెత్తు+నల్ల+మగజింకలుకలదై, హారి+కురంగ+యూధము=మనోహరమైన+జింకల+గుంపు, కుశ+గర్భ+వక్త్రమై=దర్భలు+నములు+నోరులు కలవై, చేరువ+తారసిల్లె=సమీపమున+ఎదురయ్యె,

మ. అలుగుం దూణమునుండి లాగి భయదుండై పైబడన్ వచ్చు నా
విలుకానిన్, జవనాశ్వపృష్ఠనిలయున్, వీక్షించి విభ్రాంతి జిం
కలు చెల్లాచెదరయ్యె, అవ్విపినమున్ గప్పార్చె వాతేరితో
త్పలపత్త్రప్రకరంబుబోని తమ బిభ్యద్ దృష్టి పాతంబులన్. 48

అలుగుం+తూణమునుండి=బాణము+అమ్ములపొదినుండి, భయదుండై=భయము కలిగించువాడై, జవన+అశ్వ+పృష్ఠ+నిలయున్=వేగవంతమైన+గుఱ్ఱపు+వీపుమీద+కూర్చుండినవాని, విభ్రాంతి=ఆతురతో, అ+విపినమున్+కప్పార్చె=ఆ+అడవిఅంతటనీ+నల్లబడజేసె, వాత+ఈరిత+ఉత్పల+పత్ర+ప్రకరంబున్+పోని=గాలిచే+త్రోసికదల్పబడిన+నల్లకలువల+రేకులయొక్క+మొత్తము+వలె, బిభ్యద్ దృష్టి+పాతంబులన్=భయముచే కన్నీరు కమ్మినచూపుల+సంభవమున,

మ. మనుజేంద్రుండొక ఇఱ్ఱిపోతు బ్రహరింపంబూని, పే దానికిన్
తనమే నడ్డము పెట్టి నిల్చిన, విముగ్ధం బెంటి నీక్షించి, ది
గ్గన బాణం బుపసంహరించె చెవిదాకన్ లాగియుం జేయి, రా
కనుకంపాతిశయంబు, కామితయు జోడై తన్ను వారించుటన్. 49

ఇట్టిపోతు=మగజింక, ప్రహరింపం+పూని=కొట్ట+పోయి, వే=వేగముగా, విముగ్ధం+పెంటిన్+ఈక్షించి=ప్రక్క నున్నచక్కని+ఆడుజింకను+చూచి, దిగ్గన=తటాలున, ఉపసంహరించె=వెనుకకు తీసుకొనెను, రా+ అనుకంప అతిశయము=కలుగగా+ఎక్కువదయయు, కామితయు=తానుకూడా కాముకుడగుటయు, వారించుటన్= నివారింపగా,

చ. ఘనభుజు డంత, తక్కిన మృగంబులమీద శరప్రయుక్తికిన్
మునుకొనినన్, దదీయ ధృఢముష్టి తనంత విశీర్ణమయ్యె, త
జ్జనితభయాతిమాత్రచలచక్షులు, ప్రౌఢనిజప్రియావిలో
చనసవిలాసచేష్టితము చప్పున సంస్మరియింప జేసినన్. 50

శర+ప్రయుక్తికిన్+మునుకొనినన్=బాణము+వేయుటకు+పూనుకొనిన, తదీయ+ధృఢ+ముష్టి+తనంత+విశీర్ణ మయ్యె=వాని+గట్టి+పిడికిలి+తనకు తానై+వదులైపోయినది, తత్+జనిత+భయ+అతిమాత్ర+చల+చక్షులు= బాణము చూచుటచే+కలిగిన+భయము యొక్క+అతిశయమువల్ల+కదులుతున్న+జింకలకండ్లు, ప్రౌఢ+నిజ +ప్రియా+విలోచన+సవిలాస+చేష్టితము+చప్పున=యవ్వనవంతురాలు అయిన+తన+ప్రియురాలి+చూపుల+ విలాసముకలిగిన+కదలికల+వలెఉండి, చప్పున=శ్రీఘ్రముగా, సంస్మరియింపన్+చేసినన్=బాగాగుర్తు+తెచ్చిన

వ. అపుడు, నేల గాలూదక పారు సారంగముల జూచి, కీడు శంకించి పల్వలపంక మధ్యముల నుండి వెలువడి కాలికొలది పలాయనము సేయు వనవరాహములను ముస్తాప్రరోహ కబళావయవానుకీర్ణమై, ఆయతార్ద్రపదపంక్తులచే సువ్యక్తమైన తన్మార్గము వెంట దఱుముకొని సమీపించి, ఏటలవికి వాహనము నుండి, మనాగవనతోత్తరకాయుడైన యా ధానుష్కునిమీద చండ్రనిప్పులవలె దీడ్రించు కనుమించు లతో, సటలెత్తుకొని కదియ నుంకించిన యా ఏకలముల శరీరము లంతలో నిశితేషుపరంపరలచే జఘునాశ్రయవృక్షముల కొక్కుమ్మడి గీలితములయ్యె. 51

నేలన్+కాలు+ఊదక+పారు+సారంగమల=నేలపై+కాళ్ళు+నిలపక-వడిగా+పరుగెట్టు+జింకల, కీడు=హాని, పల్వలపంక+మధ్యము=చిన్నబురదనీటిగుంటల+నడుమనుండి, వెలువడి+కాలికొలది+పలాయనము+ చేయు=బయటపడి+కాళ్ళశక్తికొలది+పాఱి+పోవు, వన+వరాహములను=అడవి+పందులను, ముస్తా+ప్రరోహ +కబళ+అవయవ+ఆనుకీర్ణమై=నములుతున్నతుంగగడ్డిమొక్కల+మొలకల+ముద్దల+శకలములు+ఉప కరణములుగా+వరుసగా వ్యాపింపగా, ఆయత+ఆర్ద్ర+పద+పంక్తులచే=పొడుగైన+తడిసిన+పాదముద్రల+ వరుసచే, సువ్యక్తమైన=బాగుగా తెలియబడిన, ఏటలవికి=వేటుకు అందు బాటు దూరములోఉన్నదానిని,

మనాగ+అవనత+ఉత్తరకాయుడైన=సగము+వంచబడిన+శరీరపుపైభాగుడైన, చండ్ర+నిప్పులవలెన్+తీడ్రించు +కను+మించులతో=మండుతున్న+నిప్పులవలే+ప్రజ్వలించు+కనుల+మెఱుపులతో, సటలు+ఎత్తుకొని= జూలు+పైకెత్తి, కదియన్+ఉంకించిన=ఎదిర్కొన+ప్రయత్నించిన, ఏకలముల=అడవిపందుల, నిశిత+ఇషు+ పరంపరలచే=వాడి+బాణ+వరసలచే, జఘన+అశ్రయ+వృక్షములకు+ఒక్కుమ్మడిన్+కీలితము లయ్యె= దుమకడానికి ముందు కటి ప్రదేశమునకు+ఊతగా ఉంచుకున్న+చేట్లకు+ఒక్కసారిగా+(బాణముచే) గుచ్చబడినట్లుగా అయినవి,

చ. బరవసమెత్తి తన్ వొడవ వచ్చిన కారెనుపోతు లోచనాం
తరమున, అమ్మహాబలుడు నాటిన వాలిక మిట్టకోల అ
చ్చెరువుగ నిండు విగ్రహము జీల్చి, అశోణితలిప్తపుంఖమై
బరువగు దాని ముందు పడపైచె, ధరంబడె దాను పిమ్మటన్. 52

బరవసమెత్తి=వేగిరపడుతూ, కారు+ఇను+పోతు=నల్లని+పెద్ద+దున్న, లోచన+ఆంతరమున=కంటి+నడుమ, నాటిన=వేసిన, వాలిక+మిట్ట+కోల=వొడపైన+తీక్ష్ణమైన+బాణము, అశోణితలిప్త+పుంఖమై=రక్తముపూయ బడని+పిడికలదై, బరువగు దాని=భారీకాయముకల పోతుయొక్క, తాను=బాణము(శరీరమును దూసుకు పోయిన వేగముచే బాణపు మొనకు కాని కనీసము పిడికి కూడా రక్తము అంటలేదు),

మ. సమదాభీలము లైన ఖడ్గములకున్ సద్యః ప్రయుక్తక్షుర
ప్రములన్ గొమ్ములు త్రుంచి, ఉత్కటశిరోభారంబు బోగొట్టె వి
క్రమదుర్వారు డతండు, ప్రాయికముగా ప్రత్యర్థికిన్ శృంగభం
గమె కావింతురు, కాని ప్రాణముల కల్గంబోరు వీరోత్తముల్ 53

సమత్+ఆభీలము=ఎక్కువ+భయానకరమైన, ఖడ్గముల=ఖడ్గమృగముల, సద్యః+ప్రయుక్త+క్షురప్రములన్+ కొమ్ములు+త్రుంచి=అప్పుడే+విడిచిన+ఒక బాణ విశేషముచే+కొమ్ములు+విరచి, ఉత్కట+శిరో+భారంబు+ పోగొట్టె=మదించిన+తలమీది+బరువు+లేకుండాచేసెను, విక్రమ+దుర్వారు=పరాక్రమముచే+నివారింపలేని వాడు, ప్రాయికముగా=సామాన్యముగా, ప్రత్యర్థికిన్+శృంగ+భంగమె=శత్రువుకు+గర్వము+అణచుటే, ప్రాణములకు+అల్గం+పోరు=ప్రాణములకు+హానిచేయ+పయత్నింపరు,

ఉ. శైలబిలంబునుండి రభసంబున బెబ్బులి వాయుభంజితో
త్తాలకుజాగ్రశాఖ చెయిదంబున మీదికి దూకవచ్చినన్,
వాలిక వాడికోలలు జవంబున రంధ్రము లందు నాటి, శి

క్షాలఘుహస్తు డంపపొదిగా నొనరించె దదీయ వక్త్రమున్. 54

శైల+బిలంబు=పర్వత+గుహ, రభసంబున=కోపముగా, వాయు+భంజిత+ఉత్తాల+కుజ+అగ్ర+శాఖ+చెయిదంబున=గాలిచే+విరుగగొట్టబడిన+ఎత్తైన+చెట్ల+పైనున్న+కొమ్మ+విధముగా, వాలిక+వాడి+కోలలు=పొడవైన+పదునైన+బాణములు, జవంబున=వేగముగ, రంధ్రములు=నోరు మలద్వారముల, శిక్ష+అలఘు+హస్తుడు=అభ్యాసముచే+గొప్ప+హస్తలాఘువముకలవాడు, అంపపొదిగా=అమ్ముల పొదిగా, వక్త్రమున్=ముఖమును (పలుబాణములు గుచ్చుకొని రంధ్రములు అమ్ములపొదిగా అయినవి),

క. నిర్ఘాతోగ్రంబగు జ్యా/నిర్ఘోషమునం గలంచి నెమకి వధించెన్,
నిర్ఘృణుడై పంక్తిరథు డ/నర్ఘౌజుడు, కుంజలీన హర్యక్షములన్. 55

నిర్ఘాత+ఉగ్రంబగు=పిడుగువలే+భయంకరమగు, జ్యా+నిర్ఘోషమునం=అల్లిత్రాడు+మ్రోత-ధనుష్టంకారము వలన, కలంచి+నెమకి+వధించెన్=క్షోభపెట్టి+వెదకి+చంపెను, నిర్ ఘృణుడై=కనికరములేనివాడై, అనర్ఘ+ఔజుడు=వెలలేని+పనిమంతుడు, కుంజలీన+హర్యక్షములన్=పొదరింఢ్లలోదాగిన+సింహములను,

తే. వాని మృగరాజసంజ్ఞకు దా నసూయ/పడినగతి సింగముల నిట్లు బారిసమరి,
కంటి, సమరాంగణకృతోపకారు లైన/కరుల యానృణ్య మని యెంచె, నరవరుండు. 56

మృగ+రాజ+సంజ్ఞకు=జంతువులకైనను+రాజు+అన్న బిరుదుకు, అసూయపడినగతి=ఓర్వలేనట్లు విరోధించి, బారి+సమరి=పరుగెత్తించి+సంహరించి, కంటి=భాగ్యముపొందితిని అనితలచెను, సమర+అంగణ+కృత ఉపకారులు ఐన+కరుల=యుద్ధ+భూమిలో+సహాయముచేయు+ఏనుగుల, ఆనృణ్యము+అని+ఎంచె=ఋణముక్తుడను+అని+తలచె,

క. శితభల్లవర్షమున శా/శ్వతముగ విమతులకుబోలె జమరంబులకున్,
సితవాలవ్యజనము లప/గతములు కావించి నృపతి కనియె, బ్రశాంతిన్. 57

శిత+భల్ల+వర్షమున=వాడి+బాణ+వర్షముచే, శాశ్వతముగ=స్థిరముగా, విమతులకుబోలె=బుద్ధిలేని వారివలె, చమరంబులకున్=(మాకు కూడ స్వేతచ్ఛత్రము-తెల్లని వీవనలవంటి తోకలుకలవు కానన రాజులవంటి వారమని విఱ్ఱవీగు)చమరమృగములకు, సిత+వాల+వ్యజనములు+అపగతములు+కావించి=తెల్లని+తోక+విసనలు+పోయినవిగా+చేసి(కోసి),

మ. రమణీయోజ్జ్వలపింఛమై యనతిదూరం బందె తారాడు వ
న్యమయూరంబును బాణలక్ష్యముగ జేయండయ్యె సాకేత రా
జమహేంద్రుండు, విశీర్ణదామయుతమున్ సంభోగవిస్రస్త బం

ధము నౌ, ప్రేయసి కేశపాశమున సద్యస్సక్తచేతస్కుఁడై. 58

రమణీయ+ఉజ్జ్వల+పింఛమై=అందమైన+ప్రకాశించు+పింఛము కలదై, అనతిదూరంబందె=దగ్గరగా, తారాడు=తిరుగు, వన్య+మయూరంబును=అడవి+నెమలిని, లక్ష్యముగా=గురిగా, విశీర్ణ+దామ+యుతమున్=సడలిన+హారములు+కలది, సంభోగ+విస్రస్త+బంధమునౌ=రతికాలమున+వదులైన+ముడికలదౌ, కేశపాశమున=కొప్పునందు, సద్యస్+సక్త+చేతస్కుడై=బాగా+చిక్కుకున్న+మనసుకలవాడై,

క. అవిరతమృగయాజనితా/స్రవ ముడుపుచు, నతనిమీద సహాశీకరమై,
ఇవతాళించు వనాలస/పవమానము వీచె, భిన్నపల్లవపుటమై. 59

అవిరత+మృగయా+జనితా+స్రవము+ఉడుపుచు=ఎడతెగని+జంతువేటచే+పుట్టిన+చెమటధారలను+పొగొట్టుచు, సహాశీకరమై=నీటిబిందువులు కలదై, ఇవతాళించు=చల్ల పరచుచు, వనాలస=అడవిలోఉండు, పవమానము=గాలి, భిన్న+పల్లవ+పుటమై=విచ్చినట్లుచెయబడిన+చిగుళ్ళ+దొన్నెలతో,

క. హరియించె నిత్యసేవా/పరివర్ధితగాఢరాగబంధుని ఇటులా,
నరవరుని విస్మృతేతర/కరణీయుని వేట చతురకామిని కరణిన్. 60

నిత్య+సేవా=ఎడతెగని+వేటఅందుతత్పరత్వముచే, పరివర్ధిత+గాఢ+రాగబంధుని=చక్కగాపెరిగిన+అధిక+రక్తికలవాని, విస్మృత+ఇతర+కరణీయును=మరువబడిన+అన్య+కర్తవ్యములుకలవాడిని, వేట+చతుర+కామిని+కరణిన్=వేట+నేర్పరియైన+కాముకురాలు+విధంగా, హరియించె=మనస్సును అపహరించెను,

తే. లలిత కుసుమ ప్రవాళ తల్పమున గడిపె/జ్వలితవిపినౌషధీప్రదీపముల నడుమ,
ఒక ఉపాంశుస్థలమున ఆ̆డొక్కనాడు/పటుధనుర్ధరు, డసమేత పరిజనుండు. 61

లలిత+కుసుమ+ప్రవాళ+తల్పమున=సుకుమారమైన+పువ్వులు+చిగుర్ల+పానుపుపై, జ్వలిత+విపిన+ఔషధీ+ప్రదీపముల=వెలుగునట్టి+అడవిఅందలి+మినుకుమినుకుమొక్కలే+మంచి దీపముల, ఉపాంశు+స్థలమున=ఏకాంత+ప్రదేశమున, అసమేత+పరిజనుండు=దగ్గగాలేని+ సేవకులతో,

సీ. వేగుజామున వన్యనాగఘటాకర్ణ/తాళకాహళములు మేలుకొలుప,
క్రందుకొన్న విహంగబృంద వికూజిత/వందిగానములు చెల్వంది మొరయ,
కన్నువిందగు విభాతోన్నిద్రలక్ష్మీ వి/లాసమాధుర్య ముల్లాసపఱుప,
చల్లనైన దరప్రఫుల్లపద్మామోద/భరితమారుతము హెచ్చరికసేయ,
శ్రమపరిస్విన్నజవయుతాశ్వంబు మీద/రురువు వెన్నంటి పార్శ్వవర్తుల కలక్ష్య
మాణుడై అవ్వనిన్ మునిస్నానపూత/వారిపూర్ణము తమసాస్రవంతి కరిగి. 62

వేగుజామున=తెల్లవారగనే, వన్య+నాగ+ఘట+ఆకర్ణ+తాళక+ఆహాళములు=అడవి+ఏనుగు+గుంపుల+చెవులకదుల్పులు+తాళములవలేకొట్టిన+చప్పెట్లు, క్రందుకొన్న+విహంగ+బృంద+వికూజిత=గుమికూడి మూగిన+పక్షి+గుంపుల+అఱపులు, వందిగానములు+చెల్వంది+మొరయ=వందిమాగదుల మేల్కొలుపు+విధముగా+పాడగా, విభాత+ఉన్నిద్ర+లక్ష్మీ+విలాస+మాధుర్యము+ఉల్లాసపఱుప=పేకువన+మేలుకొనిన+వనలక్ష్మి+సౌందర్యపు+ఆకర్షణ+సంతసింపచేయ, దర+ప్రఫుల్ల+పద్మ+అమోద+భరిత+మారుతము+హెచ్చరికసేయ=విడి+బాగావిరసిన+పద్మముల+పరిమళముతో+నిండిన+గాలి+మేలు కొలుప, శ్రమ+పరి+స్విన్న+జవయుత+అశ్వంబు=శ్రమచే+బాగుగా+ఉఱగలు కక్కుతున్న+వేగ వంతమైన+గుఱ్ఱము, రురువు+వెన్నంటి=ఒకవిధమైనలేడిని+వెంటాడి, పార్శ్వవర్తులకు+అలక్ష్యమాణుడై=అనుచరులకు+కనబడనంతగా-వారికంటె ముందుకు పోయి, ముని+స్నాన+పూత+వారి+పూర్ణము=మునులు+స్నానము చేయు+పుణ్య+నీటిచే+నిండిన, తమసా+స్రవంతికి+అరగి=తమసా+నదివద్దకు+వెళ్ళి,

వ. జలపానాభిలాషమునవచ్చు మెకములను దెగవ్రేయు వేడుకతో, నదీతీరవానీరనికుంజమున
విధివిలాసచోదితుడై పొంచియుండి, అవధనేత కొంతవడికి నదీసలిలమునుండి 63

జల+పాన+అభిలాషమున=నీరు+త్రాగు+కోరికతో, మెకముల=జంతువుల, తెగవేయ=చంపు, నదీ+తీర+వానీర+నికుంజమున=నదియుక్క+గట్టుపైనున్న+ప్రబ్బలిచెట్ల+పొదరిల్లున, విధివిలాస+చోదితుడై=కర్మానుగుణమున+ప్రేరేపింపబడినవాడై, అవధనేత=అయోధ్యాపతి, వడికి=కాలమున, సలిలమునుండి=నీటినుండి,

ఆ. కడవనింప బొడము బుడబుడ ధ్వని వంటి/ఉచ్చపటునినాద ముచ్చలింప
దాని దంతిబృంహితం బని తలపోసి/శబ్దపాతి నిశిత శరము విడిచె. 64

పొడము=పుట్టు, ఉచ్చ+పటు+నినాదము+ఉచ్చలింప=అధిక+గట్టి+శబ్దము+పైకి వినబడ, దంతి+బృంహితంబు+అని=ఏనుగు+ఘీంకారము+అని, తలపోసి=ఊహించి, శబ్ద+పాతి=శబ్దముననుసరించి+గురికొట్టగల దశరథుడు, నిశిత+శరము=మిక్కిలివాడియైన+బాణమును,

క. నృపునకు నిషిద్ధమగు టాత్మ నెఱిగి యెఱిగి/దంతివధ కుత్సహించెను దశరథుండు,
కాని త్రోవను బోదురు ఘనమనీషు/లైనను రజోనిమీలితులైన వేళ. 65

నిషిద్ధము=చేయకూడనిపని, దంతివధకు=అడవి ఏనుగు చంపుటకు, ఉత్సహించెను=యత్నించెను, కాని+త్రోవను+పోదురు=తగని+మార్గమున+వర్తింతురు, ఘన+మనీషులైనను=గొప్ప+విద్వాంసులైననూ, రజో+నిమీలితులైన=రజోగుణముచే+కన్నుమూయుచున్న,

క. హా! తండ్రీ! చచ్చితి నని/వీతెంచిన యొక్క యేడ్పు విని కంపితుడై,

పేతసనిగూఢమగు నా/హేతువు నరయంగ పెదకి, నృపు డొకచోటన్. 66

వీతెంచిన=వినవచ్చిన, పేతస+నిగూఢమగు=ప్రబ్బలిచెట్ల+చాటైఉన్న, హేతువు=కారణము, అరయంగ=చూడ,

క. శల్యప్రోతుని ముఖపై/కల్యుని మునిపుత్రు నొకని ఘటయుతు గని ఆ
బాల్యకృపానిధి, అంత/శ్శల్యుని గతి గ్రుంగె, గాఢసంతాపమునన్. 67

శల్య+ప్రోతుని=బాణముచేత+గుచ్చబడినవాని, ముఖపైకల్యుని=వికలితమైనముఖముకలవాడు, ఘట+యుతు=కుండ+పట్టుకొనినవాడు, ఆబాల్య+కృపానిధి=పుట్టినప్పటినుండి+కరుణకలిగిన, అంత+శ్శల్యుని+గతిన్+క్రుంగె=తనకేబాణముగుచ్చుకొనెను+అట్లు+దుఖఃపడె,

సీ. ప్రథితాన్వయుడు వారువము డిగ్గి సమ్రాట్టు/శరవిద్ధు నన్వయం బెఱుగ పేడ,
విపుల పేదన గన్ను విప్ప కీరెలుగున/మాట తొట్రిలగ నా మాణవకుడు,
"తనయుడ నొక ద్విజేతరతపస్వికి, రెండు/కనులు కానని వారు కన్నవారు,
నను వారికడ కిప్డె కొనిపొమ్ము, వగవకు/విధివిలాసంబు దప్పింప గలపే"
అను యుడుగ, నిల్వనీఅయి అవధనేత/జటికుమారు ననుద్ధృతశల్యు దెచ్చి
జనకు ముందర బెట్టి అజ్ఞానవశత/తన యొనర్చిన ఘోరకృత్యమును వినిచె. 68

ప్రథిత+అన్వయుడు=ప్రసిద్ధ+కులమున పుట్టిన వాడు, వారువము+డిగ్గి=గుఱ్ఱము+దిగి, శర+విద్ధుని+అన్వయంబు=బాణముచే+గాయపడినవాని+పేరును, విపుల+పేదన+కన్ను+విప్పక+ఈరు+ఎలుగున=అధిక+బాధచే+కనులు+విప్పలేక+స్వల్ప+కంఠస్వరముతో, తొట్రిలగ=తడబడ, మాణవకుడు=బాలుడు, ద్విజ+ఇతర+తపస్వి=బ్రాహ్మణుడు+కాని+ముని, ఉడుగ=మాటలు చాలించ, నిల్వనీఅయి=స్థైర్యము బూడిదవగా, జటి+కుమారు=ముని+కుమారు, అ ఉద్ధృత శల్యు=బాణము శరీరమునుండి తీయబడనివాని, అజ్ఞాన+వశత=తెలియక+పోవుటచే, వినిచె= వినిపించెను,

వ. నిర్ఘాతపాతాతిగమైన తమయేకపుత్రుని హఠాన్మరణమునకు, జాత్యంధవృద్ధదంపతులు కన్నీరు మున్నీరుగా, గరుణముగా నేడ్చిరి. తన్నియోగమున నరేంద్రుడు తత్కుమారుని యురఃస్థలమునుండి మార్గణము నూడబెఱకిన, నాక్షణమ యతడు గతాసుడయ్యెను. శోకోద్వేగము బట్టజాలక, వర్షీయుడు తన కవోష్ణబాష్పజలమును గరపుటమున బట్టి శిశుప్రహర్తను శపించె. 69

నిర్ఘాత+పాత+అతిగమైన=పిడుగు+పాటుకంటె+అధికమైన, జాత్యంధ=పుట్టుగ్రుడ్డివారైన, మున్నీరు=సముద్రము, కరుణమున=దీనముగా, తన్+నియోగమున=వారి+ఆజ్ఞతో, మార్గణము=బాణము, గత+ఆసుడు=

పోయిన+ప్రాణములుకలవాడు, వర్షీయుడు=ముదుసలి, కవోష్ణ+బాష్పజలమును=వేడి+కన్నీళ్ళను, శిశు+ప్రహర్తను=బిడ్డని+చంపినవానిని,

చ. "భరమగు పుత్రశోకమున పంచత బొందుము నీవుకూడ నీ
చరమవయస్సునందు, గతి చాలని నా వలె" నంచు దిట్టినన్,
చరణవిమర్ధితంబయి, విషంబును గ్రక్కుచు గాటువేయు భీ
కరభుజగంబు బోని ముని గన్గొని ప్రాగపరాధి నమ్రుడై. 70

భరమగు=సహింపలేనంతఅధికమైన, పంచతన్+పొందుము=మరణము+పొందెదవు, చరమ=ఆఖరి, చరణ+విమర్ధితంబయి=కాలిచేత+బాగాతొక్కబడినదై, భీకర+భుజగంబు+పోని=భయంకర+పామును+పోలిన, ప్రాక్+అగపరాధి=ముందుగా+తప్పుచేసినవాడు, నమ్రుడై=వంగి,

ఉ. "ఇంతటి శాపమిచ్చియు నదృష్టసుతాననశోభినైన నా
చింతదొలంగబెట్టి దరిజేర్చితి వంజలినీకు నోదయా
వంతుడ! ఇంధనజ్వలితవహ్ని యుదగ్రత గాల్చుగాక, తా
నంతట బీజముల్ మొలుచునట్లుగజేయదె బీడునేలపై. 71

ఇంతటి=ఇంత ఘోరమైన, న దృష్ట సుత ఆనన శోభినైన=కొడుకు ముఖపు అందము చూడలేనట్టి, చింతన్+తొలంగ+పెట్టి=చింతను+పో+కొట్టి, తరిన్+చేర్చితి=గట్టు+ఎక్కించితివి, ఇంధన+జ్వలిత+వహ్ని+ఉదగ్రతన్+కాల్చున్+కాక=(ఉదాహరణకు చెఱకు పంట)కట్టెను+మండు+అగ్ని+ఎక్కువగా+కాల్చు+అప్పటికి, తానంతట=తనంతట తానే,

చ. తెలిసిన ధర్మమూర్తివి, గతించినదానికి వంతయేల? కా
వలసిన కారణార్థము లవంబును దప్పునె? తాపసేంద్ర! నీ
వలిగి శపింపకున్న సరియా! క్షమింపగరాని ఈ మహా
కలుషమె నాడునాటికధికంబయి నన్ దెగటార్ప కుండునే! 72

లవంబు=అల్పము, కలుషము=దోషము, తెగటార్పక=చంపక

ఉ. చేయగరాని దుష్కృతము జేసె, వధార్హుడు వీడు, మీకికన్,
చేయగలట్టి కార్యమును చెప్పుడు మీ" రని అంజలించినన్,
"పోయిన బిడ్డ వెంబడిన పోయెద మిద్దఱ మేము గాన మా,
కీయవె పే చితాగ్ని" యని వృద్ధుడు వేడె, నిరుద్ధకంఠుడై. 73

చేయగరాని+దుష్కృతము=చేయకూడని+పాపము, వధార్హుడు=చంపదగ్గవాడు, వీడు=నేను, అంజలించినన్ =నమస్కరించిన, మాకు+ఈయవె+పే+చితాగ్ని=మాకు+ఇవ్వుము+వేగముగా+నిప్పంటినకాష్ఠము, నిరుద్ధ +కంఠుడై=అడ్డుపడిన+కంఠస్వరముకలవాడై,

చ. అవిసిన గుండెతో తపసి ఆనతి దీర్చి, దురంతపాతక
ప్రవిహతశాంతుడై, మగిడి, పాయక ఆంతరసంప్రవిష్టమై
స్వవిలయమూలమై అలచు శాపము నిర్వికృతిన్ భరించె, నా
అవిరతధీరతాజలధి, అర్ణవ మౌర్వహుహతాశనున్ బలెన్. 74

అవిసిన=పగిలిన, ఆనతి=ఆజ్ఞ, దురంత+పాతక+ప్రవిహత+శాంతుడై=అంతులేని+పాపముచే+లోపించిన+ మనశ్శాంతితో, మగిడి=వెనుతిరిగి, పాయక+అంతర+సంప్రవిష్టమై=విడువక+మనస్సునందు+బాగావిస్తరిల్లి, స్వ+విలయ+మూలమై+అలచు=తన+నాశనమునకు+కారణమై+బాధించు, నిర్ వికృతిన్=నిర్వికారుడై, అవిరత+ధీరతా+జలధి=ఎల్లప్పుడు+ధైర్యమున+సముద్రమువంటివాడు, ఓర్వ+హుతాశనున్=ఓర్చుకొను చున్న+బడబాగ్ని అనే అగ్నిగల, అర్ణవము=సముద్రము, బలెన్=వలే,

# దశమ సర్గము---రామ జననము

క. క్ష్మానేలె, దశశతాంగుడు/శౌనాసీరానుభావసందీపితుడై,

నానాప్రజానుమతముగ/ఊనాయుతవత్సరము లనూనసమృద్ధిన్. 1

క్ష్మానేలె=భూమిని పాలించెను, దశ+శతాంగుడు=దశ+రథుడు, శౌన+ఆసీర+అనుభావ+సందీపితుడై=వేట అందు+పొందినదాని(శాపము)+సూచనచే+పురికొల్పబడినవాడై, నానా=అనేక, ఊన+అయుత+వత్సరము =కొంచము తక్కువగా+పదువేల+సంవత్సరములు, అనూన+సమృద్ధిన్=నిండైన+పుష్కలతతో,

ఆ. పడయడయ్యె నతడు పరమనిధానంబు/స్వపితృఋణవిముక్తిసాధనంబు,

సుతసమాఖ్యమైన జ్యోతి సద్యశ్శోక/ఘనతమోఽపహరణ కారణంబు 2

పడయడయ్యె=పొందడయ్యె, నిధానము=ఆశ్రయము, సుత+సమాఖ్యమైన+జ్యోతి=కొడుకు+అనుపేరుగల+ వెలుగును, సద్యస్+శోక+ఘన+తమోపహరణ+కారణంబు=పుట్టిన వెంటనే+దుఖఃమనెడు+దట్టమైన+ చీకటిని తొలగించు+సాధకము,

తే. పుత్రయోగము పట్టకపోవ దనుచు/గడపె విశ్వాసియై పెద్దకాలమతడు

తఱచుటకు ముందు మణిగణోత్పత్తికలిమి/వెల్లడింపని అల పాలవెల్లి వోలె. 3

పుత్ర+యోగము+పట్టకపోవదు+అనుచు=పుత్రుడు+కలుగు భాగ్యము+తప్పక కలుగునని+నమ్మికతో, తరచుట=మధించుట, మణి+గణ+ఉత్పత్తి+కలిమి=రత్నముల+గుంపు+పుట్టుటచే కలుగు+సంపదను, వెల్లడింపని=బయటపరచని, అల+పాల+వెల్లి=ప్రసిద్ధిచెందిన+పాల+సముద్రము,

తే. ఋష్యశృంగాదులైన ఆర్త్విజ్యకరుల/పావనాధ్వర్యవమున నుపక్రమించె,

అజసుతుండంత పుత్రీయ మైన ఇష్టి/కశ్వమేధక్రతుక్రియానంతరమున. 4

ఆర్త్విజ్యకరుల=యజ్ఞము చేయించువారి, పావన+అధ్వర్యవమున=శుభమైన యాజమాన్యమున, ఉపక్ర మించె=ప్రారంభించె, పుత్రీయమైన+ఇష్టికి=పుత్రులకలిగించు+యజ్ఞమునకు, క్రతు+క్రియ=యజ్ఞ+ప్రక్రియ,

క. ఆయెడ దశాస్యు పీడల/నాయాసితు లైన అమరు లచ్యుతు జూడన్

బోయిరి నిదాఘతప్తులు/ఛాయావృక్షమును చేరజను చందమునన్. 5

ఆయెడ=అక్కడ, దశాస్యు+పీడలన్=రావణుడు పెట్టిన+బాధలచే, ఆయాసితులైన+అమరులు=శ్రమ పొందిన +దేవతలు, నిదాఘు+తప్తులు=ఎండతీవ్రతచే+తాపముపొందువారు, ఛాయా వృక్షము=నీడకల చెట్టు,

క. ఆ పాలకడలి నమరులు/ప్రాపించిరొ లేదొ భువనపతి మేల్కొనియెన్

రూపింప నిట్టి అవ్యా/క్షేపంబులె భావికార్యసిద్ధికి గుఱుతుల్ 6

ప్రాపించిరొ=చేరిరో, రూపింపన్=రూఢిచేయగా, ఇట్టి+అవ్యాక్షేపంబులె=ఈవిధముగా+కాలవిలంబము లేక పోవుటే, భావి+కార్యసిద్ధికి+గుఱుతుల్=కాబోవు+కార్యప్రాప్తికు+సూచనలు,

సీ. కలశాంబునిధి వీచికాడోలికల నూగు/భోగి భోగాభోగమున శయించి,

తత్ఫణామండలోదంశురత్నములచే/ద్యోతమానాంగుడై ఒప్పు లొలికి,

ధవళపట్టాంశుకాంతరితమేఖల యైన/రమణి యూరువుల పాదములు సాచి,

పాణిపల్లవముల పాదపద్మము లొత్తు/పద్మవాసిని గంట బహుమతించి,

అలఘు దోరంతరమున ప్రభానులిప్త/చిహ్నమగు కౌస్తుభమును లక్ష్మీవిలాస

దర్పణముగ ధరించి బృందారకులకు/ఎలమి సన్నిధిచేసె సర్వేశ్వరుండు. 7

కలశాంబునిధి=పాలసముద్రము, వీచికా+డోలికలను+ఊగు=తరంగములపై+ఉయ్యాల+ఊగు, భోగి+భోగాభోగమున+శయించి=పడగలుకల+ఆదిశేషు శరీరముమీద+పడుకొని, తత్+ఫణా+మండల+ఉదంశు+రత్నములచే=దాని+పడగల+సమూహమందు+మెఱయుచున్న+మణులచే, ద్యోతమాన+అంగుడై=ప్రకాశింప చేయబడిన+దేహముకలవాడై, ఒప్పులొలికి=శోభిల్లి, ధవళ+పట్ట+అంశుక+అంతరిత+మేఖల=తెల్లని+పట్టునూలు+చీరచేత+దాచబడిన+మొలనూలు కల, ఊరువుల=తొడల, పద్మవాసినిన్+కంట+బహుమతించి=లక్ష్మీదేవిని+చూపులతో+సన్మానించి, అలఘు+దోర+అంతరమున=గొప్ప+భుజముల+మధ్య-వక్షస్థలమున, ప్రభ+అనులిప్త=కాంతిచే+కూడుకొనిన, చిహ్నము+అగు+కౌస్తుభము=అభిజ్ఞానముద్ర+అయిన+కౌస్థుభరత్నము, లక్ష్మీ+విలాస+దర్పణముగ=లక్ష్మీదేవికి+నోయగము చూచుకొను+అద్దముగ, బృందారకులకు=దేవతలకు, ఎలమి=అనుగ్రహముతో, సన్నిధి చేసె=ప్రత్యక్షమయ్యె,

క. తరుణాతపనిభవసనుడు/పరిఫుల్లసితారవింద పత్రాక్షుడునై

మురహరి ప్రారంభమనో/హరదర్శనుడయ్యె శారదాహము లీలన్. 8

తరుణ+అతప+నిభ+వసనుడు=బాలసూర్యుని+లేయెండవర్ణమైన-అరుణము+పోలు+పట్టువస్త్రము ధరించినవాడు, పరిఫుల్ల+సిత+అరవింద+పత్ర+అక్షుడునై=బాగావికసించిన+తెల్లని+తామర+రేకులవంటి+కండ్లుకలవాడై, ముర+హరి=మురుడు అనేరాక్షసుని+చంపిన విష్ణువు, ప్రారంభ+మనోహర+దర్శనుండయ్యె

=ఆదిలోనే+ఇంపుగా+కనబడెడు వాడయ్యెను, శారద+అహము+లీలన్=శరత్కాలపు+పగలు+అట్లు (శరత్కాలమున విష్ణువు యోగ నిద్ర నుండి లేచును)

తే. దివ్యభూషాన్వితంబులై తేజరిల్లు/బాహువులు దీర్ఘవిటపరూపము వహింప
అర్ణవము మధ్య పుట్టిన అపరపారి/జాతమై కానిపించె విశ్వంభరుండు 9

దివ్య+భూష+అన్వితంబులై+తేజరిల్లు+బాహువులు=భవ్యమైన+ఆభరణములచే+కూడి+ప్రకాశించు+చతుర్భుజములు, దీర్ఘ+విటప+రూపము=పొడవైన+వృక్షమానుల+రూపమున, అర్ణవము=సముద్రము, అపర=రెండవ,

సీ. పసిడి బెత్తము కేల బట్టి కందోయిలో/ముదలకై దళవాయి ఎదురు చూడ
దనుజఘుస్మరములు తనకైదువులు సచే/తనములై జయనినాదములు సేయ
స్వరుకిణాంకితుడైన వైనతేయుడు ముక్త/శేషవిరోధియై చేరికొలువ
ఘనయోగసిద్ధులు సనకభృగ్వాదులు/సౌఖశాయనికులై సన్నుతింప
అట్లు సాక్షాత్కరించిన ఆదిపురుషు/డాదరించె సుపర్వుల అడలు వాపి,
పావనమ్ములు యోగనిద్రావసాన/విశదములు నయి యొప్పు స్వవీక్షణముల. 10

పసిడి=బంగారు, కేల=చేత, కందోయిలో+ముదలకై=రెండు కండ్లలో+ఆజ్ఞకై, దళవాయి=సేనాధిపతి-విష్వక్సేనుడు, దనుజ+ఘుస్మరములు=రాక్షసుల+చంపినవి, కైదువులు=ఆయుధములు-పాంచజన్యము, సుదర్శనము, కౌమోదకి, నందకము, శార్ఙ్గము, అను శంఖ చక్ర గద ఖడ్గ ధనస్సులు, సచేతనములై=స్వయముగా రూపు చైతన్యము కలవై, స్వరు+కిణ+అంకితుడైన=(అమృతము తల్లికై తెచ్చు నప్పుడు తగిలిన) వజ్రాయుధపు దెబ్బల+గాయపు కాయలచే+గుర్తింపబడిన, వైనతేయుడు=గరుత్మంతుడు, ముక్త శేష విరోధియై=తన సహజమైన పాములపై విరోధము(ఆదిశేషువునందు) విడచినవాడై, సౌఖశాయనికులై =విష్ణువుని సుఖముగా నిద్రించితివా అని అడుగగల సన్నిహిత్వము కల సనకుడు భృగువు మొదలగు వారు, సన్నుతింప=స్తుతింప, సుపర్వుల=దేవతల, అడలు=భయము, వాపి=పోగొట్టి, అవసాన=అంతపు, విశదము =ప్రసన్నము, ఈక్షణములు=చూపులు,

క. వినుతించిరపుడు సంభ్రమ/వినయంబుల సాగిమ్రొక్కి విశ్వంభరు, వా
ఙ్మనసాగోచరు ననిమిషు/లనిమిషరిపుదమను నాశ్రితాంహశ్శమనున్. 11

వినుతించిరి=బాగుగా స్తోత్రించిరి, సంభ్రమ=వేగిరపాటు, వాక్+మనసా+అగోచరు=మాటలకు+మనస్సునకు +అందని, అనిమిష+రిపు+దమను=దేవతల+శత్రువుల+చంపువాని, ఆశ్రిత+అంహస్+శమనున్=శరణు కోరినవారి+పాపము+శాంతింపువాడు,

గమనిక: 7,8,9,10 పద్యములలో విష్ణుని రూపవర్ణన.

దేవతల మాటలుగా ఇటుపై 25 వ పద్యము వరకు విష్ణు తత్త్వఆవిష్కారము.

సీ. "శరణార్థులము నీకు పరతత్త్వమగుదేవ! /కాలజగద్వ్యాపకస్వభావ!
అవనీయులము నీకు అఖిలజగన్మాన్య!/బహిరంతరాద్యంతభావశూన్య!
పాదప్రణతి నీకు భక్తలోకావన!/గాఢచిదాత్మప్రకాశరూప!
ప్రార్థనాంజలి నీకు భవమహార్ణవపోత!/అవ్యాజనైజదయాపరీత!
వందనము నీకు విశ్వప్రపంచసృష్టి/కర్తవై భర్తవై యేలి కడకు దాని
హర్తవగు దేవునకు త్రిమూర్త్యాత్మకునకు/ఏక! అద్వయరూప! త్రిలోకశరణ! 12

పరతత్త్వ=పరబ్రహ్మ, కాల+జగత్+వ్యాపక+స్వభావ=కాలమును+లోకమును+నిండిన+నిజగుణాతి శయ స్వభావ, అవనీయులము=రక్షింపదగ్గవారము, మాన్య=పూజ్యనీయుడా, బహిర్+అంతర్+ఆద్య+అంత+ భావ+శూన్య=బయట+లోపల+మొదలు+కొస+అను బేధములు+లేకుండా అంతావ్యాప్తమైన వాడా, ప్రణతి =నమస్కారము, భక్తలోక+అవన=భక్తులను కాపాడువాడా, గాఢ+చిత్+ఆత్మ+ప్రకాశ+ రూప=అధిక+ జ్ఞానముతో+స్వయం+ప్రకాశమైయిన+రూపము కలవాడా, భవ+మహార్ణవ+పోత=సంసారమనే+గొప్ప సముద్రమును దాటుటకు+పడవవంటి వాడా, అవ్యాజ+నైజ+దయా+పరీత=కారణము లేకయే+స్వభావ సిద్ధంగా+కరుణ+నిండిన వాడా, హర్త=హరించు వాడు, త్రిమూర్తి+ఆత్మకునకు=బ్రహ్మ విష్ణు శివుల+ స్వరూపము కలవానికి, ఏక=అద్వితీయ, అద్వయరూప=జీవ బ్రహ్మైక్యరూప, త్రిలోక+శరణ=మూడు లోకములకు+శరణు ఇవ్వగలవాడా!,

సీ. కూటస్థుడవు నీవు గుణసమాశ్రయమున/ప్రాపింతు త్రైరూప్యభావ మభవ!
ఏకైకరసమగు ఆకాశసలిలంబు/స్థలగుణంబున రసాంతరము బోలె
స్వీకరింతువు నీ వవిక్రియుండవు స్వామి!/అయా యవస్థ లౌపాధికములు
స్ఫటికంబునకు రాగసంయోగమున బలె/నీకు నానాత్వంబు నివ్వటిల్లు

కలవె భవరూపములు నవస్థలును నీకు/మాటి కన్నియు నీవు నీమాయవలన,
అనుమతింతువు క్రీడార్థ మాదిపురుష!/తామస విదూర! అపరిమితప్రకార! 13

కూటస్థుడవు=కులపర్వతశృంగమువలె నిర్వికారముగా ఉండువాడవు, గుణ+సమాశ్రయమున=సత్వ రజ తమములను గుణముల+మేలుకలయచే, ప్రాపింతు=కలుగ చేయుదువు, త్రైరూప్యభావము=బ్రహ్మ విష్ణు ఈశ్వర విభూతి, అభవ=పుట్టుకలేనివాడా, ఏక+ఏక+రసము+అగు=ఒకే+ఒకటి+ద్రవము+అయిన, ఆకాశ+ సలిలంబున=ఆకాశగంగ+నీటిలో, స్థల+గుణంబున=తాను ప్రవహించు స్థలపు+గుణములు పొంది, రస అంతరమున్+పోలె=వేర్వేరు రుచులు+పొందునట్లు, అవిక్రియుండవు=నిర్వికారుడవు, ఔపాధికములు= ఉపాధివలనకలిగినవి, రాగ+సంయోగమున=రంగుల+మేలుకలయికచే, నానాత్వంబు+నివ్వటిల్లు=ఎట్లు వివిధ రూపబేధములు+కలుగు, భవ+రూపములును+అవస్థలును=పుట్టుటలు+రూపబేధములు+దశలు, మాటికి=అడుగడుగునకు, తామస+విదూర=అజ్ఞానము+దూరము చేయువాడా, ప్రకార=విశిష్టజ్ఞానముతో విశేషముగాతోచు పదార్థము

సీ. మేయేతరుండవు మితలోకుడవు నీవ/నర్థివి సంప్రార్థనావహుడవు
అవ్యక్తమూర్తివి వ్యక్తకారణుడవు/సర్వజ్ఞుడవు అవిజ్ఞాతగతివి
అవిరతహృదయస్థుడవు దవీయుండవు/సర్వయోనివి స్వయంసంభవుడవు
నాథుండ వఖిలంబునకు నిరీశ్వరుడవు/అనభిలాషివి తపోఽధ్యయనరతివి
అద్వయుడవు సమస్తరూపాత్మకుడవు/అతిపురాతనుడవు నిర్జరామయుడవు
వితతకరుణాళుడవు అనిర్విణ్ణమతివి/అజితుడవు జిత్వరుడవు సర్వాత్మసాక్షి! 14

మేయేతరుండవు=ఊహాతీతుడవు, మితలోకుడవు=లోకమింతదని చెప్పగలవాడవు, నీవు+న అర్థివి=నీవు +కోరికలు లేనివాడవు, సంప్రార్థన+ఆవహుడవు=బాగుగా ప్రార్థించువారికి+కోరికలు తీర్చువాడవు, అవ్యక్త +మూర్తివి=ఇంద్రియములకు గోచరింపని సూక్ష్మ+స్వరూపుడవు, వ్యక్త+కారణుడవు=కనిపించు స్థూల ప్రపంచమునకు+కారణ భూతుడవు, సర్వజ్ఞుడవు=విశ్వమునందలి ప్రతి అణువు ఎఱిగిన వాడవు, అవిజ్ఞాతగతివి=జ్ఞానములేనివానికి ఎరుకబడవు, అవిరత+హృదయస్థుడవు=ఎల్లప్పుడు+అందరి హృదయ ములలో ఉండువాడవు, దవీయుండవు=చాలదూరముగా ఉండువాడవు, సర్వ+యోనివి=సకలవిశ్వము+ పుట్టుటకు కారణుడవు, స్వయం+సంభవుడవు=నీయంతటనీవే+పుట్టువాడవు, నాథుండవు అఖిలంబునకు =అన్నిటికి అధిపతివి, నిర్ ఈశ్వరుడవు=నీకుఎవరు అధిపతికాదు, న+అభిలాషివి=కోరికలు లేనివాడవు, తపో+అధ్యయన+రతివి=తపస్సును+సాధనచేయుట అందు+ఇచ్ఛకలవాడవు, అద్వయుడవు=నీ అంత

నీవే అయినవాడవు, సమస్త రూప+ఆత్మకుడవు=అన్ని+రూపములలో+నీవే ఉండువాడవు, అతి+పురాతనుడవు=ఆది+పురుషుడవు, నిర్జర+అమయుడవు=దేవతలకు+ఉపకర్తవు, వితత కరుణాళుడవు=విస్తరించిన దయకలవాడు, అ నిర్విణ్ణ+మతివి=సూక్ష్మముగాపరిశీలించుటకు సాధ్యము కాని+బుద్ధివి, అజితుడవు =జయుంపలేనివాడవు, జిత్వరుడవు=అందరిని జయించిన వాడవు, సర్వ+ఆత్మ+సాక్షి=అన్ని+ఆత్మల+ప్రత్యక్ష జ్ఞానము కలడవు,

క. సప్తార్ణవజలశయనుని/సప్తార్చిర్ముఖుని సప్తసామోపనుతున్
సప్తజగదేకసంశ్రయు/సప్తాశ్వశతౌజు బొగడ జాలము నిన్నున్ 15

సప్త+అర్ణవ+జల+శయనుని=లవణ, ఇక్షు సురా సర్పిస్ దధి క్షీర జల అను ఏడు+సముద్రముల+శయనించువానిని, సప్త+అర్చిర్+ముఖుని=కరాళి ధూమిని శ్వేత లోహిత నీలలోహిత సువర్ణ పద్మరాగ అను ఏడు+జ్వాలలు+ముఖముగా కల అగ్నిని, సప్త+సామ+ఉపనుతున్=గాయత్రి రథంతర వామదేవ్య బృహత్సామ వైరూప వైరాజ శక్వరీ అను ఏడు విధములైన+సామ వేద భాగములచే+గానము చేయ బడుచున్నవానిని, సప్త+జగత్+ఏక+సంశ్రయు=భూ భువర్ సువ మహ జన తపో సత్య అను ఏడు+లోకములకు+ఒకే+ఆశ్రయమైన వానిని, సప్త+అశ్వ+శత+ఓజు=గాయత్రి బృహతి ఉష జగతి త్రిష్టుభ అనుష్టుభ పంక్తి అను ఏడు (ఇవి మంత్రాధిదేవతలు, ఛందస్సు అనికూడా పిలుస్తారు)+గుఱ్ఱములు కలిగిన సూర్యునికి+ వందరెట్లు+తేజముకలవానిని,

తే. ఘనచతుర్వర్గఫలమైన జ్ఞానమునకు/కడచను చతుర్యుగంబైన కాలమునకు
మొగి చతుర్వర్ణమయమైన భువనమునకు/మూలమని పల్కుదురు చతుర్ముఖుని నిన్ను. 16

ఘన+చతుర్వర్గ+ఫలమైన=గొప్ప+ధర్మ అర్థ కామ మోక్షములను పురుషార్థముల+కలిగించు, కడ+చను=అంతము లేక+చనునట్టి, చతుర్యుగంబు+ఐన=కృత త్రేతా ద్వాపర కలి యుగములు+అయిన, మొగి=పూనికతో, చతుర్+వర్ణ+మయమైన=బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర+కులములు+కల, భువనము=బ్రహ్మాండము, మూలము+అని+పల్కుదురు=నీవే మూలమైనవాడవు+అని+అందురు, చతుర్ముఖుని=నాలుగు ముఖముల బ్రహ్మవని,

తే. చిరతరాభ్యాసనిగృహీతచిత్తులైన/యోగివరులు తపోదయాత్యాగపరులు
వెదకి దర్శింత్రు ముక్తికై హృదయగతుని/నిన్ను జ్యోతిర్మయాకారు, నిష్కలంక! 17

చిరతర+అభ్యాస+నిగృహీత+చిత్తులైన=చాలాఎక్కువ కాలము+యమ నియమాది యోగాంగముల సాధనచే +నిలకడగా ఉంచిన+మనస్సుకల, వెదకి+దర్శింత్రు=శోధించి+తెలిసికొందురు, హృదయ+గతుని=తమతమ హృదయములోనే+ఉన్న, జ్యోతిర్మయ+ఆకారు=జ్యోతిస్స్వరూపుడు, నిర్+కలంక=పరిశుద్ధుడా,

తే. అజుడవు గృహీతజనివి నానావతార!/వీతకామివి నిహతమిత్రేతరుడవు

యోగనిద్రాపరుండవు జాగరితవు/ఎవ్వ డెఱుగును? నీతత్వ మీశ్వరేశ! 18

అజుడవు=పుట్టుక లేనివాడవు, గృహీత+జనివి=స్వయముగా స్వీకరించు+పుట్టుక కలవాడవి, నానా + అవతార=మత్స్యకూర్మాది+అవతారములు స్వీకరించినవాడవు, వీత కామివి=కోరికలు లేనివాడవు, నిహత +మిత్రేతరుడవు=చంపబడిన+(మిత్రులుకానివారు)శత్రువులుకలవాడవు, జాగరితవు=యోగనిద్రనున్నను సర్వప్రబుద్ధుడవు,

తే. అర్థి సేవింపగలవు శబ్దాదులైన/స్పర్శములు, చేయగలవు దుశ్చరతపంబు

ప్రజల బాలింప నేర్తువు పరమపురుష!/తాల్పనేర్తు వుదాసీనతాభరంబు. 19

అర్థి+సేవింపన్+కలవు+శబ్దాదులైన+స్పర్శములు=ప్రీతితో+అనుభవింపసామర్థ్యము(అవతారములలో)+ కలవాడవు+శబ్ద స్పర్శ రూప రస గంధ మూలకమైన+ఇంద్రియములు అభిలషించు విషయములు, దుశ్చర +తపంబు=ఎవ్వరూ చేయలేనంత+తపస్సు, తాల్పన్+నేర్తువు+ఉదాసీనతా+భరంబు=స్వీకరింప+కలవు +తటస్థభావపు+అతిశయము,

తే. దార్శనికభేదముల బహుధావిభిన్న/సరణులగుగాక పరమార్థసాధకములు

కడకు నీయందె కలియు జగన్నివాస!/జాహ్నవీయౌఘములు మహాజలధి బోలె 20

దార్శనిక+భేదముల+బహుధా+విభిన్న+సరణులు+అగున్+కాక=ఆస్తికమైన న్యాయ వైశేషిక సాంఖ్య యోగ మీమాంసా వేదాంత దర్శనములు+విశేష గుణముల+అనేకమైన+వేరువేరు+త్రోవలు+అవును+కాని, పరమార్థ+సాధకములు=పురుషార్థము+కలిగించునవి, కడకు+నీయందె+కలియు=తుదకు+నిన్నే+ చేరునవి, జాహ్నవీయ+ఔఘములు=గంగయొక్క+ప్రవాహములు,

క. భవదావేశితమతులకు/భవదర్పితకర్ములకు అపాకృతరాగో

ద్భవులకు నీవె సదాగతి/భవలంఘనమునకు పరమపదసాధనకున్. 21

భవత్+ఆవేశిత+మతులకు=నీఅందే+నిలిపిన+మనస్సుకలవారికి, భవత్+అర్పిత+కర్ములకు=నీఅందే+ సమర్పించిన+తమ సర్వకర్మఫలము కలవారికి, అ పాకృత+రాగ+ఉద్భవులకు=దూరము చేయ బడ్డ+రాగ

ద్వేషముల+పుట్టుక కలవారికి, సదా+గతి=ఎల్లప్పుడు+శరణాగతివి, భవ+లంఘనమునకు= సంసారమును + దాటుటకు, పరమపద+సాధనకున్=మోక్షము+సాధించుటకు,

తే. అంతు చిక్కదు ప్రత్యక్షమైన నేమి?/నీవు చేసిన భువనమహావిభూతి
ఆప్తవాగనుమాన సాహాయ్య ముననె/పట్టువడు నీమహిమగూర్చి పలుకనేల? 22

ప్రత్యక్షము+అనన్ ఏమి=ప్రత్యక్ష ప్రమాణము+అయినా+కూడా, భువన+మహా+విభూతి=పృధ్వి జలము తేజస్సు వాయువు ఆకాశము అను అయిదు భూతములు కల సృష్టియొక్క+గొప్ప+మహత్వము, ఆప్తవాక్ +అనుమాన+సాహాయ్యముననే=వేదశబ్ద ప్రమాణము+అనుమాన ప్రమాణము+తోడ్పాటుచే మాత్రము, పట్టువడు=తెలియవచ్చు, పలుకన్+ఏల=చెప్ప+ఏల,

క. కేవల సంస్మరణముననె/పావను గావింతు వంట భక్తుని మరి సం
సేవన కీర్తనముల ఫల/మేవిధమగునో ఎఱుంగ నెవ్వని తరమౌ? 23

సంస్మరణముననే=నామము తలచుటచేతనే, పావనున్=పవిత్రునిగా, సంసేవన+కీర్తనముల=సేవించుట+ కీర్తించుటవంటి ఇతర నవ మార్గముల,

క. శరధి రతనముల కైవడి/హరిదశ్వుని ప్రభల రీతి అమనోవాగ్గో
చరములు అగణేయంబులు/స్థిరవిశ్వజనీనములు త్వదీయ చరితముల్. 24

శరధి=సముద్రము, హరిదశ్వుని+ప్రభల+రీతి=సూర్యుని+కిరణముల+విధముగ, అ మనో వాక్ గోచరములు =మనస్సుకు మాటలకు అందనివి. అ గణేయంబులు=లెక్కపెట్ట లేనివి, స్థిర+విశ్వ+జనీనములు=నిశ్చయ ముగా+సర్వజన+హితమైనవి,

క. నీ కందరాని దెయ్యది?/ఏ కందువ నందదగిన దెయ్యది? తలపన్
లోకానుగ్రహమొక్కటి/యేకద! సంజననకర్మహేతువు నీకున్" 25

అందరానిది=పొందలేనిది, ఏ+కందువను=ఎటువంటి+మర్మమున, అంద దగినది=పొంద దగ్గది, లోక+అను గ్రహము+ఒక్కటి=సర్వ లోకముల పట్ల+దయ+ఒక్కటే, సంజనన కర్మ+హేతువు=అవతార మెత్తుటకు+ కారణము,

క. ప్రీతాత్ముని జేసిరి పురు/హూతాది నిలింపు లిట్లధోక్షజు శౌరిన్,
భూతర్థవ్యాహృతియది/ప్రాతపడిన స్తవము కాదు పరమాత్మునకున్. 26

ప్రీతి+ఆత్ముని=ప్రీతి+పొందినవానిగా చేసిరి, పురుహూతు+ఆది+నిలింపులు=ఇంద్రుడు+మొదలగు+ దేవతలు, అధోక్షజు+శౌరిన్=ఎవ్వని చూచుటకు ఇంద్రియములు చాలవో అట్టి+విష్ణుని, భూతర్థ+వ్యాహృతి+

అది=సత్యము+పలుకబడినది+ఇది, ప్రాతపడిన+స్తవము+కాదు=యధాలాపముగా పూర్వము చెప్పిన+స్తోత్రము+కాక మనసునుండి వచ్చిన నిజమైన విష్ణుస్వరూపము,

తే. కుశల సంప్రశ్నమున దన కూర్మి పేర్మి/వెల్లడించిన చక్రికి విన్నవించి
రవిలయోద్వేలమగు రావణాంబురాశి/వలని ముప్పు సుపర్వు లాకులితు లగుచు. 27

కుశల=క్షేమము, సంప్రశ్నమున=మంచిగా అడుగుటచే, కూర్మి+పేర్మి=వాత్సల్యపు+అతిశయమున, అవిలయ+ఉద్వేలము+అగు+రావణ+అంబురాశి=ప్రళయకాలము కాకపోయిననూ+పొంగుచున్నది+అగు+రావణుడనే+సముద్రము, ముప్పు=చేటు, సుపర్వులు=దేవతలు, ఆకులితులు=చెదిరినవారు,

తే. విన్నవించిన విని తీరసన్నికృష్ట/ శైలరంధ్రానునాదితోచ్చైః స్వరమున
అధరితార్ణవనినదుడై అనునయమున/అనియె భగవంతు డిట్లు నాకౌకసులకు. 28

తీర+సన్నికృష్ట=పాలసముద్రపు ఒడ్డు+దగ్గరగాఉన్న, శైల+రంధ్ర+అనునాదిత+ఉచ్చైః+స్వరమున=కొండ+గుహనుండి+ప్రతిధ్వనిస్తున్న+పెద్ద+కంఠధ్వనితో, అధరిత+అర్ణవ+నినదుడై=తక్కువపఱపబడిన+సముద్రపు+మ్రోతయైన వాడై, అనునయమున=ఊఱడింప, నాక+ఓకసులకు=ఆకాశము+ఇల్లుగా కలవారు-దేవతలు,

క. ప్రాచీనకవివరేణ్యుని/వాచాస్థానముల నుండి ప్రకటీకృతయై
ఏచిన సంస్కారముతో/తోచెను చరితార్ధ పలుకుతొయ్యలి అచటన్. 29

ప్రాచీన+కవి+వరేణ్యుని=పురాతనుడు+సర్వజ్ఞుడగు+శ్రేష్ఠుని, వాచాస్థానము=నోటిచే, ప్రకటీకృతయై=వెల్లడి చేయబడిదై, ఏచిన=పెరిగిన, సంస్కారముతో=సాధుత్వ స్పష్ట ఉచ్చారణ ఆది పద వాక్యాదుల వ్యాకరణ శుద్ధికలదై, తోచెను=కనబడెను, పలుకు తొయ్యలి=సరస్వతి,

క. సదశనకౌముదియై విభు/వదనోద్గతయైన అమృతవాణి యపుడు త
త్పదనిర్యాతమున మిగిలి/నదియై నిలువునకు నెగయునదియై వెలిగెన్. 30

స దశన కౌముదియై=వెన్నెలవంటి దంతకాంతి కలవాడైన, విభువు=విష్ణువు, వదన+ఉద్గతయైన=ముఖము నుండి+బయలుపడిన, అమృత+వాణి=అమృతమువంటి+మాటలు, అపుడు=అలామాటలాడు నపుడు, తత్+పద+నిర్యాతమున+మిగిలినదియై=విష్ణు+పాదములనుండి+భూమిపైకి జారగా+మిగిలినట్టి, నిలువున కును+ఎగయు+నదియై+వెలిగెన్=పాదముల నుండి ముఖమునకు+ప్రాకు+గంగా ప్రవాహముగా+ప్రకాశించెను-(తెల్లని దంతములు కల విష్ణువు నోటి నుండి వచ్చిన మాటలు పాదములవద్ద ఉన్న తెల్లని స్వచ్ఛమైన గంగ ఎగసి నోటివరకు ప్రవహించి వచ్చెనా అనిపించెను),

క. "ఎఱుగుదు మీ అనుభావము/పరాక్రమము పొల్లుపోయె పంక్తిశిరునిచే,

పురుషునకు తమోవశమున/కొఱమాలిన మొదటినడిమిగుణముల కరణిన్. 31

అనుభావము=అధికారము, వొల్లుపోయె=నిస్సారమయ్యె, పంక్తిశిరునిచే=రావణునిచే, పురుషులకు=దేహధారులకు, తమోవశమున=తమోగుణముచే, కొఱమాలిన=నిరుపయోగమయిన, మొదటినడిమి+గుణముల+కరణిన్=సత్వ రజో+గుణముల+వలె,

క. విదితంబె నాకు సజ్జన/హృదయమును ప్రమాదజనితవృజినం బెటు లా

పదిమోముల రక్కసు డటు/పదినాల్గుజగాల బట్టి పాలార్చుటయున్. 32

సజ్జన+హృదయము=సాధువుల+మనస్సు, ప్రమాద+జనిత+వృజినంబు=జాగ్రత్త లేకపోవుటచే+పుట్టిన+బాధ, పాలార్చుటయున్=పీడించుటయు,

క. వాలంచున దెగనఱుకక/పౌలస్త్యుడు నిలిపికొనియె పదియవ తల, నా

వాలారుకైదువునకుం/చాలది యని యేమొ? దాని పనిపట్టింతున్. 33

వాలు+అంచున=కత్తి+అంచున, తెగనఱుకక=ఖండింపక, పదియవతల=పదవతల( నఱకబోవు చుండగా బ్రహ్మ వరములు ఇచ్చును), వాలారు+కైదువునకుం=వాడియైన+ఆయుధమునకు,

క. క్రూరాత్ము డతని అత్యా/చారము వేధోవరాతి సర్గము కతనన్

సైరించితి చిలువల అ/త్యారూఢము సైచు చందనాగము పగిదిన్. 34

వేధో+వర+అతిసర్గము+కతనన్=బ్రహ్మ+వరముల+దానము+వల్ల, సైరించితి=సహించితి, చిలువల=పాముల, అత్య+ఆరూఢము=మిక్కిలిగా+పైకి ఎక్కుట, సైచు=సహించు, చందనాగము=శ్రీగంధపుచెట్టు, పగిదిన్=విధముగా,

సీ. దైవజాతులనుండి చావులేకుండుట/నడిగె తపఃప్రీతుడైన యజుని

నరుల వానరుల నా నరభోజి ఖాతరు/సేయడయ్యె అశక్తజీవులనుచు

కాన మర్త్యమునందు నేను దాశరథినై/సంభవించి కఠోరసాయకముల

సమరభూమికి బలిక్షమము గావించెద/కైకసీసుతు శిరఃకమలపంక్తి,

వచ్చి నన్నిందు కర్థింపవలెనె వజ్రి?/ఏకకార్యర్థులమె కాదె? ఇరువురమును,

ఆచరింపదె సారథ్య మమరులార!/స్వయమె వే చని గాడ్పు వైశ్వానరునకు. 35

దైవజాతులు=దేవ గరుడ గంధర్వ కింపురుష సిద్ధ సాధ్య విద్యాధర యక్షులు మొదలగువారు, అజుని=బ్రహ్మను, నరభోజి=రాక్షసుడు, ఖాతరు=లక్ష్యము, మర్త్యము=భూలోకము, కఠోర+సాయకముల=వాడి+బాణముల, బలిక్షమము=పూజకుతగినదానిదిగా, కైకసీసుతు=కైకసి పుత్రుడైన రావణుని, శిరః+కమల+

పంక్తి=తలలనే+తామరల+వరుసను, ఏక+కార్య+అర్థులమై=ఉభయులకు రావణవధ చేయు ఒకే+పని+కోరిక కలవారమై, సారధ్యము=సహాయము, వేచను+గాడ్పు=వేగమైన+గాలితోకూడిన, వైశ్వానరునకు=అగ్నికి,

క. అందుకొన గలుగు కాలము/తొందరగా వచ్చు మీకు దుర్ణయరక్షో
బృందావరోధరహితత/బృందారకులార! క్రతుహవిర్భాగములన్. 36

అందుకొన=పుచ్చుకొన, తొందరగా=త్వరలో-రామజననము తరువాత 38సంవత్సరములకు, దుర్ణయ+రక్షో+బృంద+అవరోధ+రహితత=దుర్నీతికల+రాక్షసుల+గుంపుచే+నిరోధింపబడుట+లేకపోవుటచే, బృందారకులార=దేవతలారా, క్రతు+హవిర్+భాగములన్=యజ్ఞపు+హవిస్సు+భాగములను,

తే. అచ్చరల గూడి విహరింపవచ్చు నింక/అచిరకాలమునందె విహాయసమున
పుష్పకాలోకచకితులై మొగిలులోన/మఱువడుట తీరు దివిజవైమానికులకు. 37

విహాయసము=ఆకాశమార్గము, పుష్పక+అలోక+చకితులై=రావణుడుపయనించు పుష్పక విమానము+చూచుటచే+భయసంభ్రమములు చెంది, మొగిలులోన+మఱువడుట=మేఘముల+చాటున ప్రయాణించుట, తీరు=తీరిపోవును,

తే. విప్పుదురు లెండు వే పోయి వేల్పులార!/బలిమి లంకాధిపతి కొప్పువట్టి ఈడ్చి
శాపభయమున జెఱపంగ జాల కలచు/స్వర్గబందీల చిరవేణిబంధములను". 38

వే+పోయి=వేగముగా+పోయి, శాప+భయమున=స్త్రీలచెఱపట్టిన తలముక్కలవునన్న రంభ శాపము+భయముచే, అలచు=బాధించు, చిరవేణిబంధములను=చాలకాలమునుండి విడదీయని జుట్టు ముడులను,

తే. ప్రబలతరమైన రావణావగ్రహమున/వాడి మాడిన వేలుపుపైరుమీద
వాగమృత మిట్లు వర్షించి వన్నె దెచ్చి/కృష్ణమేఘము తోడ్తో అదృశ్యమయ్యె. 39

ప్రబలతరము+ఐన=ఎక్కువతీవ్రము+అయిన, రావణ+అవగ్రహమున=రావణుడను+వర్షపు ప్రతిబంధకము వలన, వాడి+మాడిన=కృంగి+కృశించిన, వాక్+అమృతము=మాటలనెడు+అమృతము, వన్నెన్+తెచ్చి=శోభ+కూర్చి, కృష్ణ+మేఘము=విష్ణుడనునల్లని+మేఘము, తోడ్తో=వెంటనే.

క. సురకార్యసముద్యుతుడగు/హరిని నిజాంశములతోడ హరిహయముఖ్యుల్
సుర లవని కనుగమించిరి/తరువులు కుసుమములతో సదాగతి బోలెన్. 40

సముద్యుతుడగు=సవ్యముగాప్రయత్నించువాడు, హరిహయడు=ఇంద్రుడు, అవనికి+అనుగమించిరి=భూమికి+అనుసరించి, సదాగతి=వాయువు.(వృక్షములు కదలవు. కాని వాటి పువ్వుల వాసన గాలిలో ప్రసరించి దూరప్రాంతముల తమ ఉనికిని చాటును. అటులే దేవతల అంశలు భూమిపైకి వచ్చినవి)

వ. అంత నక్కడ దశరథుని పుత్రకామక్రియావసానమున ఋత్విగ్జనవిస్మయావహముగ చతుర్దశభువ నోదరుడైన ఆదిపురుషుని అనుప్రవేశమున, దుర్వహమైన పావనపయశ్చరువుతో పరిపూరితమైన పసిడిపళ్లెరమును పాణిద్వయమున పట్టికొని అగ్ని నుండి పురుషు డొకడు ప్రాదుర్భవించె. 41

పుత్రకామక్రియ+అవసానమున=పిత్రకామేష్టి+చివర, ఋత్విక్ జన+విస్మయ+ఆవహముగ=యజ్ఞము జరిపించు పురోహితులకు+ఆశ్చర్యము+కలిగించు నట్లు, చతుర్దశ+భువన+ఉదరుడైన=పదునాల్గు + భువనములు+కడుపులోఉన్నట్టి, ఆదిపురుషుని=విష్ణుని, అనుప్రవేశమున=మనసుకు తగినట్టు నడచు కొను, దుర్+వాహమైన=మోయ శక్యముకాని, పావన+పయస్+చరువుతో=పవిత్రత కలిగించు+పాలతో+ వార్చకుండాయాగ అగ్నిలోఉడకవేసి హవ్యముతో, పరిపూరితమైన=పూర్తిగా నిండిన, పసిడి+పళ్లెరమును= బంగారపు+భోజనపాత్రను, పాణి ద్వయమున=రెండు చేతులతో, ప్రాదుర్భవించె=అవతరించె,

ఆ. వినతి చేసి పుచ్చుకొనియె ప్రాజాపత్య/సముపనీతమైన చరువు నృపతి
పాలకడలినుండి తేలివచ్చిన పయ/స్సార మందికొనిన శక్రునట్లు. 42

వినతి చేసి=ముందుకువాలి నమస్కరించి, ప్రాజాపత్య=బ్రహ్మకుసంబంధించిన పురుషుడు, సమ+ఉపనీత మైన=తనవద్దకు+తీసుకురాబడిన, పయస్+సారము=పాల+సారమైన అమృతము, శక్రుడు=ఇంద్రుడు,

తే. అతని కడుపున బుట్టంగ నాసపడియె/పరమపురుషుడు త్రిభువనప్రభవు డజుడు,
దాన కథనీయమయ్యెను దశరథేశు/అనితరదురాపభాగధేయాతిశయము. 43

త్రిభువన+ప్రభవుడు=ముల్లోకముల+పుట్టించువాడు, అజుడు=పుట్టుకలేనివాడు, కథనీయము+అయ్యెను= చెప్పదగినది+అయినది, అనితర+దురాప+భాగధేయ+అతిశయము=ఇతరులు+పొందరాని+అదృష్టపు+ వృద్ధి,

క. ఆ వైష్ణవతేజంబును/సావిత్రుడు పంచియిచ్చె సతు లిద్దఱకున్
ద్యావావిశ్వంభరలకు/వేవెలుగు నవాతపమును విభజించు గతిన్. 44

వైష్ణవ+తేజంబును=విష్ణుసంబంధ+తేజస్సుకలపాయసమును, సావిత్రుడు=సూర్యవంశపు దశరథుడు, సతులు+ఇద్దఱకున్=భార్యలైన కౌసల్య కైకలకు, ద్యావా+విశ్వంభరలకు=భూమికి+ఆకాశమునకు, వేవెలుగు =సూర్యుడు, నవ+ఆతపమును=లేత+ఎండను,

తే. మధ్యభార్య సుమిత్రను మఱచికాదు/పెద్దపెండ్లము కౌసల్య, ముద్దుటాలు
కైకయును, వారు పాలిచ్చి గారవింప/వలయునని, దశరథు డాత్మ దలచెగాని. 45

గారవింప=ఆదరించ, తలచెన్+కాని=తలచెను+అంతేకాని,

క. పరమౌచిత్యవిదుండగు/వరుని మనోగతము నరసి వనిత లిరువురున్
చెఱియొక సగమిచ్చిరి తమ/చరుపరమాన్నముల, నుండి సవతికి నెమ్మిన్. 46

పరమ+ఔచిత్య+విదుండగు+వరుని+మనోగతము=మిక్కిలి+యోగ్యత+తెలిసిన+భర్త+మనసు లోని భావము, అరసి=తెలిసికొని, చరు=హవ్యకుండలోనిప్రసాదము, సవితి=సుమిత్ర, నెమ్మిన్=మిత్రభావముతో,

క. దేవులు ముప్పురు పాయస/సేవనమున జేసి చీరచిక్కినవారై
దేవాంశసముద్భవములు/పావనగర్భములు జగదభయ కారణముల్. 47

సేవనమున=ఆరగించిన, చీరచిక్కు=గర్భము ధరించు, దేవ+అంశ+సముద్భవములు=విష్ణుని+అంశ కారణముగా+పుట్టబోవువారు, జగత్+అభయ+కారణముల్=జగత్తునకు+అభయమిచ్చు+సాధకులు,

వ. ప్రజాభ్యుదయము నిమిత్తము సౌరములైన అమృతాభిధాననాడులు జలమయగర్భములు
ధరించులాగున సమకాలమున ధరించిన వారై 48

ప్రజ+అభ్యుదయము=పిల్లలు+కలుగుట, సౌరములైన=సూర్యసంబంధములైన, అమృత+అభిధాన+నాడులు =అమృతము+అను పేరుగల+కిరణములు(సూర్యుని సహస్ర కిరణములలో నాలుగు వందల కిరణములకు అమృతములు అనిపేరు), జలమయగర్భములు=జలముతో నిండిన గర్భములు, సమకాలమున=ఒకే కాలమున,

క. తెలుపెక్కిన మేనులతో/అలసతతో రాజపత్ను లంతర్వత్నుల్
తలపించిరి అంతర్గత/ఫలోద్గమము లైన పచ్చపైరుల శోభన్. 49

అంతర్వత్నుల్=గర్భిణిలు, తలపించిరి=స్మరింప చేసిరి, అంతర్గత=కడుపులోనున్న, ఫల+ఉద్గమము=పండ్లు +వెలువడు,(క్రిందటి పద్యములో ద్రవరూపమున ఉన్న బిడ్డలు ఘనరూపముగా పరిణామము చెందిరి.)

సీ. చక్రనందకగదాచాప లాంఛితులైన/వామనుల్ కావలి వచ్చినట్లు,
స్వర్ణగరుత్ప్రభాశబలితాంబరుడైన/విహగేంద్రుపై స్వారి వెడలినట్లు,
అప్సరోయుతముగ ఆకాశగంగలో/అఘమర్షణస్నాన మాడినట్లు,
ప్రత్నయోగులు పరబ్రహ్మవాదులు తమ్ము/భృగ్వాదిమునులు దీవించినట్లు,
నలిననిలయ పయోధరాంతరవిలంబి/కౌస్తుభన్యాసవహనియై కమలపత్ర,

వీజనము వీచి తమ్ము సేవించినట్లు/గర్భిణులు ముప్పురును రేయి కలలు కనిరి. 50

లాంఛితులైన=చిహ్నముముకల, వామనుల్=చిన్నపిల్లల రూపమున(ఆయుధములు చేతనములు కనుక ), కావలి=రక్షణకై, స్వర్ణ+గరుత్+ప్రభా+శబలిత+అంబరుడైన=బంగారపు+రెక్కల+కాంతి+విస్తరించిన+శరీర ముతో, విహగేంద్రుపై=గరుత్మంతునిపై, యుతముగ=కలిసి, అఘమర్షణ+స్నానము+ఆడినట్లు=పాపము శమించుటకు మంత్రసహిత+స్నానము+చేసినట్లు, ప్రత్న+యోగులు+పరబ్రహ్మవాదులు=ఆచారవంతులై+యోగ దీక్షావంతులయిన+ఉత్కృష్ట బ్రహ్మ పదార్థము గురించి వచింపగలవారైన, తమ్ము=తమను, భృగ్వాది మునులు=భృగువు మొదలగు మునులు, నలిననిలయ=పద్మమునందు నివసించు, పయోధర+అంతర+విలంబి=స్తనముల+మధ్యమున+ప్రేలాడు, కౌస్తుభ న్యాస+వహనియై=భర్తతనవద్ద దాచిన కౌస్తుభతర్నము +ధరించినదై, కమలపత్ర=లక్ష్మి దేవి, వీజనము+వీచి=విసనికఱ్ఱతో+వీచుచు,

క. నరపతి యా స్వప్నంబులు/విరిబోడులు విన్నవింప విని విశ్వజగ
ద్గురువునకు తాను గురుపై/పరార్థ్యు డగుటకు ప్రహర్షపరవశు డయ్యెన్. 51

విరిబోడులు=పూలవంటి శరీరములుకల కౌసల్య సుమిత్ర కైకలు, విశ్వజగత్+గురువునకు=సృష్టిలోని లోకము లకంతటికి+జనకుడైన విష్ణువుకు, తాను+గురుపై+పరార్థ్యుడు+అగుటకు=తను+తండ్రి+శ్రేష్ఠుడు+అగుటకు, ప్రహర్ష=మిక్కిలి సంతోషము,

క. హితమని వసించె నటులా/అతివల యుదరముల ఒంటి యయ్యును త్రిజగ
త్పతి సుప్రసన్న జలముల/ప్రతిమాశశిచందమున విభక్తాత్మకుడై. 52

హితము+అని=లోకసంక్షేమము+అని, ఒంటి=ఒక్కడే, సుప్రసన్న=నిర్మలమైన, ప్రతిమా+శశి+చందమున=ప్రతిబింబించుచున్న+చంద్రుని+విధముగా, విభక్త+ఆత్మకుడై=నాలుగుగావిభజింపబడిన+ఆత్మకలవాడై, (40వ పద్యములో దేవతలు వాసనగా, ఇందు విష్ణువు ప్రతిబింబముగా అవతరించారు),

క. భావుకవతి పదబడి రఘు/భూవల్లభు పట్టమహిషి ప్రొద్దులు నిండన్
రే వెలుగు నీను ఔషధి/కైవడిని తమోఽపహారు గనియె కుమారున్. 53

భావుకవతి=మాంగల్యయుక్తమైనది-పుణ్యస్త్రీ, పదబడి=పూని, ప్రొద్దులు+నిండన్=ప్రసవసమయము+కాగా, రే+వెలుగును+ఈను+ఔషధి+కైవడిని=రాత్రికి+వెలుతురును+కలిగించు+ఒకానొక ఓషది మొక్క+వలె, తమస్ +అపహారు=అజ్ఞానమనేచీకటిని+తొలగించు-వైష్ణవతేజోరూపుడగు,

క. రాముడని పెట్టె అత్యభి/రామము తద్వపువు జూచి రంజిల్లి రఘు
గ్రామణి సుతునకు శ్రీమద్/నామము భువనత్రయీ ప్రథమ మంగళమున్. 54

అతి+అభిరామము=అత్యంత+మనోహరమైన, తత్+వపువున్=వాని+శరీరసౌందర్యమును, రంజిల్లి= సంతోషము పొంది, శ్రీ+మత్+నామము=శుభముల+కలిగించు+ఆపేరు, ప్రథమ మంగళమున్=మంగళము నకై మొట్టమొదట వ్రాయు/పలుకు పేరుగా,

క. అరుణాంశువంశదీపకు/నిరుపమవర్చస్కు నిసువునిం గని తోడ్తో
పురిటింటి దీపకళికలు/పరిభూతము లయ్యె ననగ పలుకంబాఱెన్. 55

అరుణాంశు+వంశ+దీపకు=సూర్య+కులమునకు+దీపమువంటి, నిరుపమ+వర్చస్కు=అసమాన+తేజస్సు కలవాని, నిసువునిం+కని=శిశువును+చూసి, తోడ్తో=వెంటనే, దీప+కళికలు=దీప+శిఖలు, పరిభూతము లయ్యె+అనగ=తిరస్కరింపబడినవి+అనునట్లుగా, పలుకంబాఱెన్=వెల్ల వోయినవి,

ఆ. పట్టితోడ పురటిపాన్పున బవడించి/క్షామమధ్య రామచంద్రజనని
అందగించె సైకతాంభోజ బలితోడి/శారదావసన్న జాహ్నవి వలె. 56

పట్టితోడ=కొడుకుతో, పవడించి=పడుకొని, క్షామ+మధ్య=సన్నగిల్లిన+నడుముకలకౌసల్య, సైకత+అంభోజ +బలి+తోడి=ఇసుకతిన్నెలమీదఉన్న+కమలములనెడి+పూజాపుష్పముల+తో, శరత్+అవసన్న+జాహ్నవి =శరత్కాలము+సమీపింపగా+సన్నబడినగంగానది,

క. జనియించెను కైకేయికి/అనవద్యగుణుండు భరతు డతడు సమంచ
ద్వినయము సంపదనుం బలె/జనయిత్రి నలంకరించె జగము నుతింపన్. 57

అనవద్య+గుణుండు=నిందలేని+మంచిగుణములు కలవాడు, సమంచత్+వినయము=సంపూర్ణముగాఒప్పు చున్న+వినయగుణము, సంపదనుం+బలే=ఐశ్వర్యము+కలవానివలే, జనయిత్రి=తల్లి,

క. పుత్రుల సుమిత్ర లక్ష్మణ/శత్రుఘ్నుల గనియె గవల, సద్గురుశిక్షన్
పాత్రున కలవడు విద్య, అ/ముత్రవివేకమును వినయమును ఈను గతిన్. 58

పాత్రున=యోగ్యునకు, అముత్ర+వివేకమును=పరలోకముకలిగించు+తత్వవిచారణచేయుశక్తి, వినయము =ఇంద్రియ నిగ్రహము, ఈను+గతిన్=కలిగించు+విధముగా,

భావము: మంచి విద్య వివేకమును వినయమును కలిగించి పరలోకసాధకముగా ఉండవలెను

ఆ. శమితదోషగణము సమ్యగావిష్కృత/సకలగుణము నయ్యె సర్వ జగతి
అనుగమించె నాక మవనికి వసుధావ/తీర్ణుడైన ఆది దేవు ననగ. 59

వసుధ+అవతీర్ణుడైన+ఆదిదేవు=భూమిపై+అవతరించిన+మహావిష్ణువు, అనుగమించె=వెంబడించె, నాకము +ఆవనికి=స్వర్గము+భుమిపైకి, అనగ=అనునట్లు, సర్వజగతి=లోకమంతటా, శమిత+దోషగణము=అణగి

నట్టి+దుర్భిక్షాది దోష సమదాయము కలదై, సమ్యక్+ఆవిష్కృత+సకల+గుణము+అయ్యె=సరిగా+ప్రాకాశితమైన+అన్ని+మంచిగుణములు+కలదైనది,

తే. హరిచతూరూపియై భూమి నవతరింప/తేటి యూపిరి విడచిన తెఱగు తోచె,
చండదశకంఠపీడితస్వపరివృఢలు/కాష్ఠ లపరజోమారుతకైతవమున. 60

హరి+చతూరూపియై+భూమిని+అవతరింప=విష్ణువు+నాలుగు+రూపములతో+భూమిపై+అవతరింప, చండ+దశకంఠ+పీడిత+స్వ+పరివృఢలు=భయంకరుడైన+రావణునిచే+పీడింప బడుచున్న+స్వర్గ+అధిపతులు-దిక్పాలకులు(ఇంద్ర వరుణ యమ కుబేరులు), తేటి+ఊపిరి+విడచిన+తెఱగు+తోచె=ఉపశమిల్లి+నిట్టూర్పుగాశ్వాస+విడచిన+విధము+అనునట్లున్నది, కాష్ఠలు+అపరజో+మారుత+కైతవమున=దిక్కులు+ధూళిలేని+స్వచ్ఛమైన గాలి+మిష,

క. రావణ నిరాకృతులు రవి/పావకు లవ్వేళ వ్యక్తపఱచిరి స్వభయా
భావమును ప్రస్ఫుటముగ అ/నావిలతేజస్సువలన అపధౌమ్యమునన్. 61

నిరాకృతులు=తిరస్కరింపబడినవారు, రవి+పావకులు=సూర్యుడు+అగ్నులు, స్వ+భయ+అభావమును+ప్రస్ఫుటముగ=తమ+భయము+లేకపోవుటను+బాగాస్పష్టముగా, అనావిల+తేజస్సు=కలుషములేని+ప్రకాశముతో(సూర్యుడు), అపధౌమ్యమునన్=తొలగినపొగవలన(అగ్ని),

ఆ. ధరణి రాలిపడియె తత్క్షణంబె దశాస్యు/మకుటచయము నుండి మణిగణంబు
ఆగతంబు నెఱిగినట్టి దానవలక్ష్మి/కంటినుండి అశ్రుకణము లనగ. 62

తత్క్షణంబె=రాముని జనన సమయముననే, దశాస్య+మకుట+చయము=రావణుని+పదితలలకిరీటముల+సమూహము, ఆగతంబున్+ఎఱిగి=జరగబోవునది+తెలిసికొని, దానవలక్ష్మి=రాక్షసరాజ్యలక్ష్మి,

క. ఔరసవంతుని నృపుని కు/మారకజన్మప్రవేశ్యమంగళతూర్య
ప్రారంభకంబులై మును/బోరుకలగె దేవదుందుభులు గగనమునన్. 63

ఔరసవంతుని=కొడుకులుకలవాడైన, జన్మ+ప్రవేశ్య+ప్రారంభకములై=రాముడుపుట్టగా+ఏర్పాటు చేసిన పండుగతో+మొదలుపెట్టి, మును=ముందుగానే, బోరుకలిగె=భేరిమున్నగు వాద్యములధ్వనిశబ్దించె-ఆకాశములో దేవతలు దుందుభులు మ్రోగించి, నగరిలోప్రజలు భేరిమ్రోగించి ఉత్సవములు సల్పిరి.

ఆ. కురిసె పారిజాతకుసుమమయంబైన/వాన పంక్తిరథుని భవనమందు
శాస్త్రదృష్టమైన సన్మంగళోపచా/రముల కదియె ఆదిరచన యయ్యె. 64

శాస్త్రదృష్టమైన=శాస్త్ర ప్రకారమైన, సన్మంగళ+ఉపచారములకు=మంచిశుభమందలి+పూజాసాధనములకు, అదియె=పారిజాతపు పూవులే, ఆది+రచన=ప్రధమ+ఏర్పాటు,

క. అనవద్యకళల ధాత్రీ/స్తనంధయులు సుప్రయుక్త సంస్కారులు రా
తనయులు పెరిగిరి జననీ/జనకుల ఆనందరసము సమగతి బెరుగన్? 65

న+అవద్య+కళల=పెరుగుచున్న+చంద్రునికళలవలె, ధాత్రీ+స్తనంధయులు=తల్లి+పాలుత్రాగువారు, సుప్రయుక్త+సంస్కారులు=బాగా అనుష్టించి+మంచి గుణములు అలవఱుచుకొన్నవారు, సమగతిన్+పెరుగన్=తనయులవయస్సు మరియు జనకుల ఆనందము సమానముగా+పెరుగగా,

క. పూవునకు తావివలె స్వా/భావికమగు తద్వినీతభావోన్నతి శి
క్షావిధి దోహదమందెను/పావకునిజదీప్తి హవిరవాప్తిని బోలెన్. 66

తావి=వాసన, స్వాభావికమగు=పుట్టుకతోవచ్చిన, తత్+వినీత+భావ+ఉన్నతి=వారి+చక్కని+ప్రవర్తన+గొప్పదనము, శిక్షావిధి+దోహదము+అందెను=విద్యాభ్యాసముచే+వృద్ధి+పొందెను, పావకు+నిజ+దీప్తి+హవిరవ+అప్తిని=అగ్నుల+సహజ+తేజస్సు+నెయ్యి మొదలగు ద్రవ్యములు+సంప్రాప్తిచే,

క. పౌరపౌచ్చంబు లెఱుంగని/సరాగసౌభ్రాత్రమునకు సత్ప్రథమౌదా
హరణము సమస్తసద్గుణ/ధురంధరము దాశరథిచతుష్టమ మవనిన్. 67

పౌరపౌచ్చంబులు=పైరుధ్యములు, స రాగ+సౌభ్రాత్రమునకు=అనురాగముకలిగిన+తోబుట్టువులమైత్రికి, సత్+ప్రథమ+ఉదాహరణము=అన్నిటికంటె+ముందుఎంచదగ్గ+ప్రమాణము, ధురంధరము=శ్రేష్ఠత (కార్యనిర్వాహకత్వము), దాశరథిచతుష్టమము=దశరథుని నల్గురుకొడుకులు, అవనిన్=భూమిపై,

క. ఇతరేతరావిరుద్ధత/అతిశయదీప్తముగ జేసి రా సహజన్ముల్
ఋతువులు సురవనమున్ బలె/అతులోదాత్తంబు గులము నైక్ష్వాకంబున్. 68

ఇతరేతర+అ విరుద్ధత=పరస్పర+వ్యతిరేకములేని, అతిశయ+దీప్తముగ=మిక్కిలి+ప్రకాశమైనదిగా, సుర వనమున్=నందనవనమందు, అతుల+ఉదాత్తంబున్+కులమున్=సాటిలేని+గొప్పదైన+వంశము, ఐక్ష్వాకంబున్=ఇక్ష్వాకువంశము,

వ. అయ్యన్నదమ్ముల సౌభ్రాత్రము సర్వసమానమే అయినను, స్నేహమున రామలక్ష్మణులుభయు
లెట్లు, భరతశత్రుఘ్ను లిరువురు నట్లు, జంటగా నేర్పడిరి. 69.

క. కలకాలమొక్కవిధముగ/అలవడియె సమైక్యభావ మా జంటలకున్
జ్వలననభస్వంతములకు/బలె చంద్రసముద్రములకు బలె అవిహతమై. 70

అలవడియె=సిద్ధించె, జ్వలన+నభస్వంతము=అగ్ని+ఆకాశము గమన స్థానముగా కల వాయువు, అ విహతము=అడ్డులేక,

క. సమధికతేజంబున విన/యమునను జనకోటిమనసు హరియించిరి రా
కొమరులు సజలశ్యామా/భ్రములు నిదాఘాంతవాసరముల విధమునన్. 71

సమధిక=బాగాఎక్కువ, సజల+శ్యామ+అభ్రములు=నీటితోనిండిన+నల్లని+మబ్బులు, నిదాఘ+అంత+వాసరముల=ఎండాకాలము+ముగిసినతరువాతి+దినముల,

తే. రాజిత గుణాభిరతుల ఆ రాజసుతుల/నలువురను చూచి లోకులు తలచి రాత్మ
నవతరించుట గాగ ధర్మార్థకామ/మోక్షములు నాల్గు జగతిపై మూర్తి కట్టి. 72

రాజిత+గుణ+ఆభిరతుల=ఒప్పైన+గుణములందు+ఆసక్తికలవారు, ఆత్మను+అవతరించుటన్+కాగ=తామే+పుట్టినవి+అనునట్లు, మూర్తి కట్టి=మూర్తీభవించి,

క. గురుదేవు దనియజేసిరి/గురువత్సలు లగుచు నాత్మగుణగణమున దా
శరథులు శరధులు రత్నో/త్కరమున మున్నతని మనసు తనిపిన కరణిన్. 73

గురుదేవు=తండ్రిని, తనియన్+చేసిరి=తృప్తి+పొందించిరి, గురువత్సలులు=తండ్రిముద్దుబిడ్డలు, ఆత్మ+గుణ+గణమున=తమ+మంచి గుణముల+సమూహముచే, దాశరథులు=దశరథునినలుగురు పిల్లలు, శరధులు=నాలుగు సముద్రములు, రత్న+ఉత్కరమున=రత్నముల+రాశిచే, మున్ను+అతని+తనిపిన+కరణిన్=అంతకు ముందు+దశరథుని+తృప్తిపరచిన+విధంగా,(ముందు రత్నరాశులిచ్చి సముద్రుడు తృప్తిపరచునట్లు, తమ గుణములరాశిచే దశరథుని తృప్తి పఱచిరి. )

మంజీరద్విపద. దళితదైత్యకృపాణధారలౌమేటి/దంతాలతోడి చౌదంతి యనంగ
ఫలవినిష్పత్తిచే వ్యక్తంబులగు ఉ/పాయ యుక్తులతోడి ప్రభునీతి యనగ. 74

దళిత+దైత్య+కృపాణ+ధారలౌ+మేటి+దంతాలతోడి+చౌదంతి=చీల్చబడిన+రాక్షసుల+కత్తుల+వాడిమొనలచే తాకబడిన+గొప్ప+దంతాలు కలిగిన+ఇంద్రుని ఏనుగు-ఐరావతము, ఫల+వినిష్పత్తిచే+వ్యక్తంబులగు+ఉపాయయుక్తుల+తోడి+ప్రభు+నీతి=ఫలితము+బాగా సిద్ధించుటచే+తెలియబడు+సామ దాన బేధ దండన ఉపాయములు+కలిగిన+రాజ+నీతి,

మంజీరద్విపద. ఖలశిక్ష సాధురక్షయు నిర్వహింప/గల బాహువులతోడి కమలాక్షుడనగ
విలసిల్లె నలువురు విశ్వంభరాంశ/కలితజన్ములు తనూజులతోడ నృపతి. 75

ఖల=చెడ్డవారి, కమలాక్షుడనగ=విష్ణువు అనునట్లు, విశ్వంభర+అంశకలిత+జన్ములు=విష్ణువు+అంశతో +జన్మించిన, నృపతి=దశరథుడు, విలసిల్లె=సంతోషించె, (ముందు పద్యముతో అన్వయము. ఐరావతము వంటి పరాక్రమము, రాజనీతి, దుష్టశిక్షణ, సాధురక్షణ అను నాలుగుభుజములు కల విష్ణునివలే దశరథుడు నలుగురు పుత్రులతో ప్రకాశించెను.)

# ఏకాదశ సర్గము సీతాకల్యాణము

తే. కౌశికుడు కోసలేశ్వరు గానవచ్చి/తన క్రతువిఘాతశాంతికై అనుపవేడె
కౌసలేయుని చిఱుతకూకటులవాని,/వీరుల ఎడాటమున, జూడబోరు వయసు. 1

కౌశికుడు=విశ్వామిత్రుడు, క్రతు+విఘాత+శాంతికై=యాగ+విఘ్న ఉపద్రవములను+తొలగించుటకై, అనుప వేడె=పంప+కోరెను, చిఱుతకూకటులవాని=బాలునికితగ్గజుట్టుకల-బాలుడై ఉన్న-వాని, వీరుల+ఎడాటమున= పరాక్రమము+విషయమున, చూడబోరు వయసు=వయస్సుకాక వారిసమర్థతను పరిగణింతురు,

తే. కాన కనిచెను కానకకన్న సుతుని/మౌని వెంట మహీపతి సానుజముగ
అర్థులడిగిన నిత్తురు ప్రాణమైన/మిన్న కంపరు రఘుకులోత్పన్ను లెపుడు. 2

కానకు+అనిచెను=అడవులకు+పంపెను, కానకకన్న =లేకలేకపుట్టిన, స+అనుజముగ=తమ్ముడు లక్ష్మణుని తోసహా, అర్థులు=కోరికకోరువారు, మిన్నక+అంపరు=ఏమియుఇవ్వక+పంపరు, రఘు+కుల+ఉత్పన్నులు+ ఎపుడు=రఘు+వంశములో+పుట్టినవారు+ఎల్లవేళలా,

చ. అనుగుల జూచి పుత్రగమనాధ్వము జక్కగ సంస్కరింప బొం
డని, ఒకమాట పంక్తిరథు డానతి యిచ్చెనో లేదొ, అంతలో
అనిలుడు మార్గమెల్లను నిరస్తరజంబుగ వీచె, దానిపై
చినుకులు చల్లె మబ్బు, కురిసెం బలువన్నెల క్రొన్ననల్ బయల్. 3

అనుగుల=దగ్గఱిసహాయకుల, పుత్ర+గమన+అధ్వము=కొడుకు+పోవు+మార్గము, సంస్కరింప=చక్కపఱచ, పొండని=వెళ్ళమని, ఆనతి=ఆజ్ఞ, అంతలో=ఆసమయమున(వారి అవసరములేక ), అనిలుడు=గాలిదేవుడు, నిరస్త రజంబుగ=దుమ్ము తొలగింప బడునట్లుగా, పలువన్నెల=వివిధ రంగుల, క్రొత్త+ననల్=కొత్తగా పల్లవించిన పువ్వులు,

సీ. సన్నద్ధులై సంభృతోన్నిద్రచాపులై/పే వచ్చి భరతాగ్రజావరజులు
నిరవగ్రహనిదేశకరణోద్యతులు నెమ్మి/తనకు పాదాభివాదనము సేసి
ఆనమ్రులై ప్రవాసానుజ్ఞ నర్థింప/ఆనందపరిఫుల్లమానసమున
జలజల శిశిరాశ్రువులు చిందె తన కన్న/కడుపులపై గొన్ని పుడమి ఱేడు,
చింది సమయోచితముగ విశేషరీతి/మంగళాచారవిధులు సేయంగ బనిచె
పయనమై చను వారికి నయనవారి/కించి దుక్షితచూడాసమంచితులకు . 4

సన్నద్ధులై=ప్రయత్నపరులై, సంభృతఉన్నిద్ర చాపులై=సిద్ధముచేయబడిన విల్లులు హెచ్చరికతో ధరించినవారై, వే+వచ్చి=వెంటనే+వచ్చి, భరత+అగ్రజ+అవరజులు=భరతుని+అన్న-రాముడు+తమ్ముడు-లక్ష్మణుడు, నిరవగ్రహ+నిదేశ+కరణ+ఉద్యతులు=స్వచ్ఛందముగా+తండ్రి ఆజ్ఞను+చేయ+సన్నద్ధులు, నెమ్మి=ప్రేమతో, ఆనమ్రులై=గౌరవ సూచకముగా కొంచము వంగి, ప్రావాస+అనుజ్ఞను+అర్థింప=దేశముదాటి వెళ్ళుటకు+ అనుమతి+కోరగా, పరిఫుల్ల=వికసించిన, శిశిత+అశ్రువులు+చిందె=చల్లని+ఆనందబాష్పములు+పడెను, చింది=సంభ్రమపడి, విశేషరీతి=ప్రత్యేకముగా, పనిచె=పంపించెను, కించిత్+ఉక్షిత+చూడా+సమంచితులకు =కొంచము+కన్నీరు చిలకరింపగా తడిసిన+జుత్తుల+సౌందర్యము కలవారికి,

తే. మాతృవర్గపు టడుగుదామరల నంటి/మునివతంసుని వెన్నంటి చనుచునుండ,
శుభనిమిత్తము లెదురయ్యె సోదరులకు/పౌరవీక్షణకృతమార్గతోరణులకు. 5

మాతృవర్గపు+అడుగు+తామరలను+అంటి=తల్లుల+పాద+కమలములను+తాకి, వెన్నంటి=వెనుక, నిమిత్తములు=శకునములు, పౌర+వీక్షణ+కృత+మార్గ+తోరణులకు=ప్రజల+కలువలవంటి కంటి చూపులచే +చేయబడిన+దారిపొడవునాఉన్న+కలువపూల తోరణమాలలు కలవారలకు,

తే. రాము లక్ష్మణమాత్రానుగామి నొకని/వేడె ముని, కాన సుతులకు దోడుదొనగ
వాహినులు కాదు, తండ్రి దీవన యొసంగె/ఏడుగడ వారి కదియ సు మ్మెల్ల ప్రొద్దు. 6

లక్ష్మణ+మాత్ర+అనుగామిని+ఒకని=లక్ష్మణుని+మాత్రమే+వెంటవచ్చు+ఒక్కడిగా, తోడుదొనగ=సహాయముగ, వాహినులు=సైన్యము, ఏడుగడ=రక్షణ, ఎల్లపొద్దు=ఎల్లప్పుడు,

క. ఉరుతరతోజోనిధి యా/పరమర్షిపథంబు బట్టి భాసిల్లిరి, భా
స్కరు గమనమునకు లోబడి/చరించు మధుమాధవులకు, సాటిగ నుభయుల్. 7

ఉరుతర+తోజో+నిధి=మిక్కిలి అధిక+తేజస్సుకు+స్థానము, పథంబున్+పట్టి=మార్గము+అనుసరించి, భాసిల్లిరి =ప్రకాశించిరి, భాస్కరు=సూర్యుని, మధుమాధవులకు=చైత్ర వైశాఖ మాసములకు-వసంత ఋతువున ఎండ ఎక్కువైననూ ప్రకృతి రంజకము.

సీ. సిగపూవు వాడదు చెక్కుచెమర్చదు/కందదు మే నెండ కాక సోకి,
ముండ్ల కంపలతోడి మెరపనేలల బాట/రత్నకుట్టిమతలప్రాయమయ్యె,
కలుగ దాకలిదప్పికల గాసి, తమతల్లి/కెలకుల మెలగు పాపలకుబోలె,
నలిగి మాఱవు రూపుకళలు, జనింపదు/కలనైన దుడుకురక్కసుల చేటు,
వెల్లివిరిసె మహోత్సాహవిక్రమములు/నిఖిలమంత్రాత్మకములు మునిప్రదిష్ట

ములు బలాతిబలాఖ్యవిద్యలు జపించి/ఉరుమహిమయుతులైన రఘూత్తములకు. 8

చెక్కు+చెమర్చదు=చెక్కిలిపై+చమట పట్టదు, కందదు=ఎఱ్ఱ బారదు, మేను=శరీరము, కాక+సోకి=వేడి+తగిలి, మెరప=ఎండినమెట్ట, రత్న+కుట్టిమ+తల+ప్రాయమయ్యె=రతనములతో+కట్టిన+సమప్రదేశము+పోలిక (రాచబాట వలె)అయ్యెను, అకలి+దప్పికల+గాసి=ఆకలి+దాహముల+వ్యధ, కెలకుల+మెలగు=ప్రక్క+ఉండు, నలిగి=బాధపడి, జనింపదు=కలగదు, దుడుకు=చెడ్డ, చేటు=హాని, వెల్లివిరిసె=ప్రకటితమయ్యె, మహ+ఉత్సాహ+విక్రమములు=గొప్ప+ప్రయత్నముచేయు+వీరులు, నిఖిల+మంత్ర+అత్మకములు=సర్వ+మంత్ర+స్వరూపములు, ముని+ప్రదిష్టములు=మునిచే+చెప్పబడినవి, బల+అతిబల+ఆఖ్య=బల+అతిబల+అను పేరుగల, ఉరు+మహిమ+యుతులైన=అధిక+గొప్పదనము+కలిగిన,

ఉ. కాననసీమ గాలినడకం జనుచుంట నెఱుంగరైరి, పో
రాని హితుండు తండ్రికి, బురావిదు డమ్ముని చెప్ప విన్న వి
జ్ఞానకరంబులైన పలుగాథలె తమ్మటు మోచి తెచ్చినన్
పైనము చేసిన ట్లయిరి వాహనయోగ్యులు తత్సహోదరుల్. 9

పోరాని+హితుండు=ఆప్త+శ్రేయోభిలాషి, పురా+విదుడు=పూర్వకథలు+తెలిసినవాడు, గాథలె+తమ్మటు+మోచి+తెచ్చినన్=కథలే+తమ్ము+మోసుకొని+చేర్పినట్లు(కథల తేలి పోయిరి), పైనము=ప్రయాణము, వాహన+యోగ్యులు=వాహన ప్రయాణమునకు+తగినవారు, తత్+సహోదరుల్=ఆ+సోదరులు,

సీ. రసవదంభఃప్రపూరములు శీతలసరో/వరములు తమనీరువట్టు మాన్ప,
అవ్యక్తమధురమై అండజనినదంబు/శ్రుతిపుటంబులకు నిర్వృతిఘటింప,
ఇవతళించు సుగంధపవనంబు తమ మీద/నూత్నప్రసూనరేణువులు చిలుక,
ప్రాంశుబంధురపాదపముల స్నిగ్ధచ్ఛాయ/లూష్మశామకములై ఉపచరింప,
అకృతకవనాంతరోజ్జ్వలప్రకృతి దృశ్య/పరిచయము మానసోన్మేషకరము గాగ
విపినసంచార ముపవన విహృతి కించి/దూనమైతోచె రఘువంశధూర్వహులకు. 10

రసవత్+అంభః+ప్రపూరములు=మధురమైన+నీటితో+బాగానిండిన, శీతల=చల్లని, నీరువట్టు=దప్పిక, అవ్యక్త+మధురమై=చెప్పలేనంత+శ్రావ్యమై, అండజ+నినదంబు=పక్షుల+కూతలు, శ్రుతి+పుటంబులకు=చెవి+రంధ్రములకు, నిర్వృతి+ఘటింప=సుఖము+కలిగింప, ఇవతళించు+సుగంధ+పవనంబు=చల్లని+సువాసన కల+గాలి, నూత్న+ప్రసూన+రేణువులు+చిలుక=క్రొత్త+పూవుల+పుప్పొడులు+జల్ల, ప్రాంశు+బంధుర+పాదపముల=ఉన్నతమై+వంగిన+చెట్ల, స్నిగ్ధ+చ్ఛాయలు=దట్టమైన+నీడలు, ఊష్మ+శామకములై

+ఉపచరింప=వేడిని+శాంతింప చేయునవై+సేవింప, అకృతక+వన+అంతర+ఉజ్జ్వల+ప్రకృతి+దృశ్య+పరిచయము=సహజముగాఉండు+అడవి+అందలి+విశృంఖలమై+స్వతస్థిత+ఇంపుదనము+ఎఱుకపడగా, మానస+ఉన్మేష+కరము+కాగ=మనస్సు+వికసింప+చెయునది+అవగా, విపిన+సంచారము=అడవిలో+తిరుగుట, ఉపవన+విహృతి+కించిత్+ఊనమై+తోచె=తమ నగరి ఉద్యాన+విహారము+కొంచము+తక్కువదై+అనిపించెను, ధూర్వహులకు=ధురంధరులకు,

మ. కమలేందీవరషండమండిత కనత్కాసారశోభావలో
కమునం గాంచరు, కాంచ రుత్కటనిదాఘక్లేశనిర్వాపక
ద్రుమవాటీ పరిఖేలనంబున మహర్షుల్ నిండు సంప్రీతి, నే
త్రమనోహ్లాదకులన్ రఘూద్వహుల, సందర్శించి కన్నట్లుగన్. 11

నేత్ర+మన+ఆహ్లాదకులన్=కండ్లకు+మనస్సుకు+ఆనందము కలిగించు వారైన, రఘూద్వహుల+సందర్శించి+కన్నట్లుగన్=రామలక్ష్మణుల+చూచినప్పుడు+కలిగినట్లు, మహర్షుల్+నిండు+సంప్రీతి=మునులకు+పూర్తి+ఆనందము, కమల+ఇందీవర+షండ+మండిత=తెల్ల కమలముల+నల్ల కమలముల+సమూహముచే+అలంకరింపబడిన, కనత్+కాసార+శోభ+అవలోకమునం+కాంచరు=ప్రాకాశవంతమైన+సరస్సుయొక్క+సొగసులు+చూచుటయందు+కనరు, ఉత్కట+నిదాఘ+క్లేశ+నిర్వాపక+ద్రుమ+వాటీ+పరిఖేలనంబున=అధిక+వేడిమి+బాధను+చల్లార్చు+చెట్లు+తోటలు+చక్కగా అల్లాడుటలో,

తే. స్థాణుదగ్ధశరీరుని స్థానమునకు/డాసి రాఘువు డాత్తశరాసనుండు
కర్మచే గాదు, రుచిరవిగ్రహముచేత/అంగభవునకు ప్రతినిధి యయ్యె దాను. 12

స్థాణు+దగ్ధ+శరీరుని+స్థానమునకు+డాసి=శివునిచే+దహింపబడిన+శరీరము కలిగిన-మన్మధుని+ఆశ్రమమునకు+చేరి, కర్మచే+కాదు=శివుని ఎదిరించిన పాడుపనిచే+కాక, రుచిర+విగ్రహముచేత=అందమైన+శరీరముచే, అంగభవునకు=మన్మధునకు, ప్రతినిధి=సమానుడు,

ఉ. ఆనతి యిచ్చె గాధిసుతు డప్పుడె ఎవ్వత శాపగాథ, ఆ
దానవి ఆ సుకేతుసుత తాటక శూన్యభయంకరంబు సె
ద్దాని నొనర్చె ఆ వనపథంబును జొచ్చి, తపస్వి పంపునన్
భూనిహితాటనుల్ రఘువిభూషణు లెక్కడి రాత్మధన్వముల్. 13

ఆనతియిచ్చె=చెప్పెను, దానవి=రాక్షసి, శూన్య=నిర్జనముగా, పథంబు=మార్గము, పంపునన్=ఆజ్ఞచే, భూనిహిత+ఆటనుల్=నేలమీద ఉంచిన+వింటి కొప్పు- ఆతరువాత అల్లె త్రాడు వింటికి సంధిస్తారు, ఎక్కిడి= ఎక్కుపెట్టిరి-ధనుష్టంకారము చేసిరి, ఆత్మ+ధన్వముల్=తమతమ+విల్లులు,

చ. పెలుచని తద్గుణస్వనము పెద్ద సవాలుగ నీసురోసమున్
చిలివిలివోవ వచ్చె రజనీచరి చీకటితోడబుట్టు కా
గల మెయిచాయతోడ చలకర్పరకుండలయై రవోగ్రయై
కలితబలాకయై యుఱుము కాళిక భంగి నభంగురోద్ధతిన్. 14

పెలుచని+తత్+గుణ+స్వనము=కఠినమైన+ధనస్సు+నారి+ఠంకారము, సవాలుగ=తనను ప్రశ్నించగా, ఈసు+రోసమున్+చిలివిలివోవ=అసహనము+కోపము+సందడించ, రజనీచరి=రాత్రి సంచరించునది-రాక్షసి, చీకటి+తోడబుట్టు+కాగల+మెయి+చాయ+తోడ=చీకటినలుపుల+సమానము+అవగల+శరీర+రంగు+కలిగి, చల+కర్పర+కుండలయై=కదలుచున్న+తలపుఱ్ఱెలు+కుండలములుగా కలదైన, రవ ఉగ్రయై=భయంకరమైన కంఠ స్వరముతో, కలిత+బలాకయై=తనచుట్టు(రాక్షసినోటినుండిపడుమాంసముక్కలకై) ఆహారముకొఱకై ఎగురుచున్న+కొంగలుకలదై , ఉఱుము=వీరహుంకారముచేయు, అభంగుర+ఉద్ధతిన్=స్థిరమైన+గర్వముతో,

ఆ. భూరి కటివిలంబి పురుషాంత్రరశనతో/ప్రోద్యత్తైకదీర్ఘభుజముతోడ
పితృవనోత్థమయిన పెనువాత్యవలె దీవ్ర/ వేగవిధుతమార్గవృక్షయగుచు. 15

భూరి+కటి+విలంబి+పురుష+ఆంత్ర+రశనతో=పెద్దదైన+నడుము భాగమున+వ్రేలాడుచున్న+మనుషుల+ ప్రేగులు+మొలనూలుగా కలదై, ప్రోద్యత్తైక+దీర్ఘ+భుజముతోడ=లేపబడిన+పొడవైన+భుజములతోడ, పితృవన +ఉత్థమయిన=శ్మశానమున+లేచిన, పెను+వాత్య+వలె=పెద్ద+సుడిగాలి+వలె, తీవ్ర+వేగ+విధుత+మార్గ +వృక్ష+అగుచు=అధిక+వేగముచే+బాగా ఊపబడిన+త్రోవలోని+చెట్లు+కలిగి,

క. తను జంపం గవియు దానిం/గనుగొని భరతాగ్రజుం డకంపితమతియై
వనితావధవైముఖ్యము/ఘనవిశిఖము నొక్కమాటె గ్రక్కున విడిచెన్ 16

కవియు=పరుగెడుతున్న, అకంపిత+మతియై=చెదరని+బుద్ధితో, వైముఖ్యము=అయిష్టమును, విశిఖము= బాణము, గ్రక్కున=ఒక్కసారిగా,

తే. భూరిరంధ్రము దొలిచె నా నారసంబు/వజ్రఘనమైన దానవి వక్షమందు,
సురరిపుల మండలము మున్ను నొరగలేని/దండధరునకు నది మహాద్వారమయ్యె. 17

భూరి+రంధ్రమున్+తొలిచె=పెద్ద+కన్నము+చేసెను, నారసంబు=బాణము, వజ్ర+ఘనమైన=వజ్రమువలె+దిట్టమైన, దానవి=రాక్షసి, సురరిపుల+మండలము=దేవతల+సమూహము, సొరగలేని=చొఅబడలేని, దండధరునకు=యమునకు, మహా+ద్వారము=గొప్ప+ప్రవేశము,

ఉ. చండశరప్రహారమును సైపక "హా"యని యాతుధాని పె
న్గొండవలెన్ ధరిత్రిపయి గూలిన, గేవల మయ్యరణ్యభూ
ఖండమె కాదు, చేవ చెడి కంపము నొందె గడుం ద్రివిష్టపా
ఖండజయంబునన్ స్థిరత గాంచిన రావణు రాజ్యలక్ష్మియున్. 18

చండ+శర+ప్రహారమున=తీక్ష్ణమైన+బాణపు+దెబ్బచే, సైపక=తాళలేక, యాతుధాని=రాక్షసి, కడు=పెద్ద, ఖండము=భాగము, త్రివిష్టప+అఖండ+జయంబునన్+స్థిరతన్ కాంచిన=స్వర్గమును+సంపూర్ణముగా+జయించి+నిలదొక్కుకున్న, కంపమున్+ఒందె=భూకంపపు ఒణుకు+పొందెను,

తే. రామమన్మథతీవ్రమార్గణవిభిన్న/హృదయయై యా నిశాటనారీలలామ
గంధవద్రక్తచందనగాత్రయగుచు/పే సనియె జీవితేశ నివాసమునకు. 19

రామమన్మథ=సుందరమైన రాముని, తీవ్ర+మార్గణ+విభిన్న+హృదయయై=తీక్ష్ణమైన+బాణముచే+చీల్చ బడిన+గుండె కలదై, గంధవత్+రక్త+చందన+గాత్రయగుచు=దుర్గంధము కల+రక్తము+చందనమువలె పూయబడిన+శరీరము కలదై, పే+సనియె=వేగముగా+పోయినది, జీవితేశ=యముని,

తే. రాక్షసఘ్నము నొక మహాస్త్రమును బడసె/మునివరుచేత నవదానముదితుచేత
సూర్యుచే గాష్ఠదాహకజ్యోతి బడయు/అర్కకాంతము వలె దాటకాంతకుండు. 20

రాక్షసఘ్నము=రాక్షసుల చంపునట్టి, పడసె=పొందె, అవదాన+ముదితు=పరాక్రముచే+సంతోషించిన, కాష్ఠ+దాహక+జ్యోతి+పడయు=కట్టెలను+కాల్చు+మంట+పొందు, అర్కకాంతము=సూర్యకాంత మణి, తాటక+అంతకుండు=తాటకిని చంపిన రాముడు,

ఉ. అంత బునః ప్రయాణసమయమ్మున గౌశికు నోట వామనో
దంతము నంతయున్ విని, పదంపడి తన్మహితాశ్రమంబు న
ల్లంతనె చూచి, ఉత్సుకత నందె రఘూద్వహ నామశౌరి, జ
న్మాంతరసంస్మృతుల్ తలపునం దొక యింత స్ఫురింపకుండియున్. 21

పునః=మరల, వామన+ఉదంతము=వామనుని+వృత్తాంతము, పదంపడి=మఱియు, తన్+మహిత+ఆశ్రమంబు=వామనుని+గొప్పదైన+ఆశ్రమము, ఉత్సుకత=కుతూహలముతో, శౌరి=విష్ణువు, జన్మాంతర+

సంస్మృతుల్=పూర్వ వామన అవతారపు+జ్ఞాపకాలు, ఒక+ఇంత+స్ఫురింపక+ఉండియున్=ఏమీ+కొంచమైననూ+గుర్తు+రాకున్ననూ,

సీ. సంభృతార్ఘణవస్తుసంభారులై శిష్య/తతి యెదుర్కొని స్వాగతము వచింప,
వృక్షకసేకంబు విరమించి వెస వచ్చి/మునుల బిడ్డలు పాదములకు మ్రొక్క,
చెంగుచెంగున డాసి చిన్నారి జింకలు/తళుకు జూపులతోడ పలుకరింప,
పాదపంబులు బద్ధపల్లవపుటముల/నెపమున నంజలి నివ్వటింప,
వడుగు లందఱు దన వెంట వచ్చినట్టి/తేజుకూనల ననిమేషదృష్టి జూడ,
గాధిజుడు వచ్చి చొత్తెంచె గౌతుకమున/పావనంబు స్వశాంతతపోవనంబు. 22

సంభృత+అర్ఘణ+వస్తు+సంభారులై=చక్కగాసిద్ధముచేసిన+పూజా+సామగ్రి+సేకరించినవారై, వృక్షక+సేకంబు=చెట్లకు+నీరు పోయుట, విరమించి=ఆపి, వెస=వేగముగా, డాసి=చేరి, పాదపంబులు=చెట్లు, బద్ధ+పల్లవ+పుటముల+నెపమున=మూసిన+చిగుర్ల+దొన్నెల+మిషను, నివ్వటింప=ఒప్పునట్లుచేయ, వడుగులు=శిష్యులు, తేజు+కూనల=తేజస్సుకల+బిడ్డల-రామలక్ష్మణుల, అనిమేష+దృష్టి=రెప్పపాటుమఱచి+చూచి, చొత్తెంచె=ప్రవేశించె, పావనంబు=పవిత్రము,

ఉ. ఆయతతేజు లక్కొమరు లచ్చట గాచిరి విఘ్నసంతతిన్
సాయకశక్తితో నడచి, సత్క్రతు దీక్షితు నాతపోధనున్,
స్వీయకరప్రసారమున జీకటి నంతయు బాఱదోలి ప
ర్యాయసముత్థితుల్ రవిసుధాంశులు లోకము గాచు తీరునన్. 23

ఆయతతేజు=ప్రభావవంతమైన+పరాక్రమముకలవారు, కాచిరి=రక్షించిరి, విఘ్న+సంతతిన్=ఆటంకముల+సమూహమునుండి, సాయక+శక్తితోన్+అడచి=బాణముల+బలముతో+ఆపి, సత్క్రతు+దీక్షితున్=మంచి యాగ+నియమములో ఉన్న, స్వీయ+కర+ప్రసారమున=తన+కిరణముల+వ్యాపింప చేసి, పర్యాయ+సముత్థితుల్=ఒకరి తరువాత ఒకరు+కృషిచేసి, రవిసుధాంశులు=సూర్యుడు చంద్రుడు

సీ. వేదిపై గన్నేరు విరులంతలై చాల/తొరగిన రక్తబిందువులు చూచి,
యాగంబు దూషితం బయ్యె నంచు నవోఢ/కర్మలై యాజకుల్ కళవళింప,
దొననుండి పెరకిన తూపు వింట నమర్చి/సద్య ఉన్ముఖుడు దాశరథి యరసె,
గ్రద్దరెక్కల గాలి గదలు టెక్కెములతో/గగనాంగణమున రక్కసుల దండు,
అరసి ముఖ్యుల నిరువుర గుఱిగ జేసె/విడచె నాతడు చిల్లరవిఘ్నకరుల,

చండభుజగేంద్రముల బట్టి చెండు గాని/బురదపాముల జోలికి బోడు గరుడి. 24

వేదిక=యాగస్థలము, గన్నేరు+విరులు+అంతలై+చాల+తొరగిన=గన్నేరు+పువ్వుల+అంతపరిమాణము కలవై+ఎక్కువగా+రాలిన, అపోఢ+కర్ములై=విడచిన+తమతమ పనులు కలవారై, కళవళింప=తొట్రుపడ, దొననుండి+పెరకిన+తూపు=అమ్ములపొద నుండి+తీసిన+బాణము, సద్య+ఉన్ముఖుడు=అప్పుడే+మొగము పైకెత్తి, అరసె=చూసె, టెక్కెములతో=జెండాలతో, గగన+అంగణమున=ఆకాశ+ప్రదేశమున, దండు=సేన, చండ+భుజగేంద్రములన్+పట్టి+చెండు=క్రూర+పాముల+పట్టి+చీల్చు, గరుడి=గరుత్మంతుడు,

క. కారాకు నెగచు తీరున/బారావారమున ద్రోచె బ్రహరణవిద్యా

పారగుడు రఘుకిశోరుడు/మారీచు మహీధ్రకాయు మరుదస్త్రమునన్. 25

కారాకును+ఎగచు+తీరున=పండుటాకులను+ఎగరవేయు+విధముగా, పారావారమున+ద్రోచె=సముద్రపు అవతలబడ్డున+పడవైచె, ప్రహరణవిద్యా+పారగుడు=బాణవిద్యలో+మిక్కిలి కుశలుడు, మహీధ్రకాయు= కొండవంటి శరీరము కలవాని, మరుత్+అస్త్రమునన్=వాయువ్య+అస్త్రముచే,

క. కృతహస్తుడు కాకుత్ స్థుడు/పతంగముల కామెతలుగ బంచి యొసంగెన్

శతధాక్షురప్రశకలీ/కృతదేహు సుబాహు నపరఋషివిద్రోహున్. 26

కృతహస్తుడు=గురితప్పక వేయువాడు, పతంగములకు+ఆమెతలుగ=పక్షులకు+విందుగా, శతధా+క్షుర+ ప్రశకలీకృత+దేహు=వందలుగా+బాణముచే+ముక్కముక్కలుగాచేయబడిన+శరీరముకల, అపర=నికృష్ట మైనట్టి, ఋషి+విద్రోహున్=మునులకు+బాగాకీడుచేయువానిని,

సీ. అపహతప్రత్యూహమై అట్లు కడముట్టె/గాధినందన మహాక్రతుమహంబు,

వినుతించి రలరి ఋత్విజు లక్కుమారుల/సాంయుగీనావార్యశౌర్యగరిమ,

శమియించె హృదయభారము నాటితో కొంత/దానవోపప్లుతతాపసులకు,

అభినందనము లంపి రమృతాశనశ్రేణి/పారిజాతాసారవర్షణమున,

ప్రణతిచలకాకపక్షుల రఘుకిశోర/వరుల దన దర్భపాటిత కరతలమున

అంటి లాలించె దీవన కనుపదముగ/అవభృథస్నానకృతకృత్యు డపరధాత. 27

అపహత+ప్రత్యూహమై=పోగొట్టబడిన+విఘ్నమై, కడముట్టె=సమాప్తమయె, మహా+క్రతు+మహంబు=గొప్ప+ యాగపు+ఉత్సవము, వినుతించిరి=పొగడిరి, అలరి=ఆనందించి, ఋత్విజులు=యాగము నడిపించినవారు, సాంయుగీన+అవార్య+శౌర్య+గరిమ=సమర కుశలతలో+వారింపరాని+విక్రమపు+శ్రేష్ఠతను, శమియించె= శాంతించె, దానవ+ఉపప్లుత+తాపసులకు=రాక్షసులనుండి+ఉపద్రవము పొందిన+మునులకు, అభినందన

ములు+అంపిరి=ప్రశంసలు+పంపిరి, అమృత+అశన+శ్రేణి=అమృతము+తినుదేవతల+సమూహము, పారిజాత+సార+వర్షణమున=పారిజాత పువ్వుల+అమృతమయ+వానతో, ప్రణతి+చల+కాకపక్షుల= సాష్టాంగముగా నమస్కరించుచున్న+కదులుతున్న+చిన్నజుత్తులు కలవారిని, దర్భ+పాటిత+కరతలమున +అంటి=పవిత్రములైన ధర్భలు+పొదువబడిన(ధరించిన)+అరచేతితో+శిరస్సుల తాకి, లాలించె=ముద్దుచేసె, దీవనకు+అనుపదముగ=ఆశీర్వచనముగా+కంఠమునందు చుంబనముచేసి, అవభృథస్నాన+కృతకృత్యుడు+ అపర+ధాత=యజ్ఞసమాప్తిన యాజకుడు దోషపరిహార్థము యజ్ఞపరికరములతో చేయు శుద్ధి స్నానము చేయుటచే+కృతార్థుడైన+రెండవ+బ్రహ్మవంటివాడు.

వ. అంత యియక్షమాణుడైన మైథిలునిచే సమాహూతుడై, మిథిలానగరము పయనమైన
విశ్వామిత్రుడు రాఘవులను గూడ దనవెంట గొనిచనియెను. 28

యియక్షమాణుడైన+మైథిలునిచే=యాగము చేయు కోరికకలవాడైన+జనకునిచే, సమ+ఆహూతుడై= విధివిధముగా+పిలవబడినవాడై,

శా. కుంఠీభూతుల జేసె మేటి సురరక్షోమర్త్యధానుష్కులన్
కంఠచ్ఛేదసమానమైన వికృతిం గల్గించి యే కైదు, వా
కంఠేకాల మహాధనుర్విషయ మాకర్ణించి తద్దర్శనో
త్కంఠాచోదితచిత్తులై వెడలి రా కాకుత్ స్థ కంఠీరవుల్. 29

కుంఠీభూతుల=ముక్కవోయిన వారిగా, మేటి+సుర+రక్షో+మర్త్య+ధానుష్కులన్=గొప్ప+దేవ+దానవ +మానవులలో+విల్లు ధరించినవారిని, కంఠ+చ్ఛేద+సమానమైన+వికృతిం=గొంతు+కోతతో+సమాన+ మార్పును, కైదువు=ఆయుధము, ఆ+కంఠే+కాల=అట్టి+గొంతునందు+నలుపుకలవాని-శివుని, మహా+ ధనుర్+విషయము+ఆకర్ణించి=గొప్ప+విల్లు+సంగతి+విని, తత్+దర్శన+ఉత్కంఠ+చోదిత+చిత్తులై= దానిని+చూచుటయందు+తహతహచే+ప్రేరేపింపబడిన+మనస్సుతో, కంఠీరవుల్=సింహములు,

తే. క్షణకళత్రతనొందె వాసవుని కెందు/చపలమానస అల దీర్ఘతపసు గృహిణి,
వసతి సమకూడె నా తపోవనమునందు/బాటసారులు ముగురికి నాటిరేయి. 30

క్షణ+కళత్రతను+ఒందె+వాసవునికి=కొద్దిసేపుమాత్రమే+భార్యగా+కూడె+ఇంద్రునికి, చపల+మానస=చంచల +స్వభావ, అల+దీర్ఘ+తపసు+గృహిణి=ప్రసిద్ధిచెందిన+చాలాకాలము+తపస్సుచేయుచుండిన గౌతమముని +ఇల్లాలు,

చ. మలచె జగంబునం దనుపమానము గాగ విధాత దేని, ఆ

లలితపురాస్వరూపము శిలామయి గౌతమపత్ని కయ్యెడన్

కలిగె, తదుచ్చసంఘటన కారణమునన్ భువనప్రసిద్ధమే

కలుషహరంబు రామపదకంజరజంపుటనుగ్రహంబుగన్. 31

మలచె=చెక్కె, అనుపమానము=సాటిలేనిదిగా, విధాత=బ్రహ్మ, లలిత+పురా+స్వ+రూపము=మనోహరమైన+మొదటి+స్వంత+రూపము, శిలామయి=రాయిగా మారిన, అయ్యెడన్=అక్కడ, రామ+పద+కంజ+రజంపు+అనుగ్రహంబుగన్=రాముని+పద+పద్మపు+ధూళి+దయవలన, తత్+ఉచ్చ+సంఘటన+కారణమునన్=ఆ+గొప్ప+వృత్తాంత+కారణముగా, భువన+ప్రసిద్ధమే=లోకమున+ఖ్యాతికెక్కినది,

చ. పనితతపఃప్రభావమున బ్రహ్మఋషిత్వము గన్న గాధిరాట్

తనయుడు, రామలక్ష్మణయుతంబుగ వచ్చు టెఱింగి యాతనిన్

జనకనృపుం డెదుర్కొనియె సారపుధర్మము దేహబద్ధమై

తనకడ కర్థకామ సహితంబుగ వచ్చిన భంగి బొంగుచున్. 32

పనిత+తపః+ప్రభావమున=పొగడదగిన+తపస్సు+శక్తితో, బ్రహ్మఋషిత్వము=ఋషులలోఅత్యగ్ర స్థానము, గాధిరాట్+తనయుడు=విశ్వామిత్రుడు, యుతంబుగ=కూడి, సారపుధర్మము+దేహబద్ధమై=పరమార్థమైన ధర్మము+దేహముగా ధరించి, అర్థకామ సహితంబుగ=అర్థ కామ పురుషార్థములతో కూడినట్లు, పొంగుచున్=సంతోషించుచు,

సీ. అలవోక వసుమతీతలమున దివినుండి/దిగిన పునర్వసుయుగళమనగ,

నరలోకదృశ్యసందర్శనోత్సుకులైన/సంచరిష్ణువులు నాసత్యు లనగ,

కరచరణములతో కరువున బోసిన/నయపునీతోత్సాహజయము లనగ,

క్రీడార్థకలిత కృత్రిమవేషధరులైన/ప్రచురకాంతులు పుష్పవంతు లనగ

శోభిలు రఘుప్రవీరుల లోభనీయ/రూపురేఖలు కన్నుల గ్రోలునపుడు,

తమ నిమేషము కూడ మోసముగ దోచె/ఆస తీఱని మిథిలాపురౌకసులకు. 33

అలవోక=విలాసముగా, వసుమతీ+తలమున=భూ+ప్రదేశమున, దివి=స్వర్గము, పునర్వసు+యుగళము=దేవమాతఅదితి అధిదేవతగాకల (రామునిజన్మనక్షత్రమైన) చల్లని పునర్వసు నక్షత్రముల జంట (రామ లక్ష్మణులుండుటచే జంట), సందర్శన+ఉత్సుకులైన+సం+చరిష్ణువులు=చూడ+కుతూహలపడు+మంచి+జంగమములు గామారిన, ఆ+సత్యులు=ఆ+విష్ణువులనగా, కరువునన్+పోసిన+నయ+పునీత+ఉత్సాహ+జయములు+అనగ=కరిగించి+పోతపోసిన+నేర్పు+పవిత్రత+ఉత్సాహము+గెలుపు అను గుణములు

కలిసినవి+అనునట్లు, క్రీడార్థ+కలిత=లీలగా+గ్రహించిన, ప్రచురకాంతులు=విపులమైన+తేజస్సు కలవారైన, పుష్పవంతులు=సూర్య చంద్రులు, లోభనీయ=ఆకర్షణీయ, క్రోలు=ఆశ్వాదించు, నిమేషము=రెప్పపాటు, మోసముగ+తోచె=అడ్డుగ+అనిపించెను, ఔకసులకు=నివసించువారలకు,

తే. అవసితమహేష్టియై చరితార్థు డయిన/జనకరాజర్షివరునకు సమయవిదుడు
కుశికకులవర్ధనుండు రఘుప్రవీరు/ఇష్వసనదర్శనౌత్సుక్య మెఱుకపఱప. 34

అవసిత+మహేష్టియై=పూర్తైన+గొప్పయాగముకలవడైన, చరితార్థుడు=కృతకృత్యుడు, సమయ విదుడు=కాల అకాలములు తెలసినవాడు, కుశికకుల వర్ధనుండు=విశ్వామిత్రుడు, ఇష్వసన+దర్శన+ఉత్సుక్యము=(రామ లక్ష్మణుల)శివునివిల్లు+చూచు+కుతూహలము, ఎఱుక+పఱప=తెలియ+చేయ,

వ. ఆ మహారాజు ప్రథితవంశశేఖరజన్ముడైన ఆ కుమారుని గోమలశరీరుని జూచి, అమానుషసత్త్వ
సంపన్నులకు గాని మోపెట్ట నలవికాని తన కార్ముకమును దలంచికొని దుహితృశుల్క
మతిమాత్రమగుటకు పెద్ద వగచి నిట్టూర్చి తపోధనున కిట్లనియెను. 35

ప్రథిత=ప్రఖ్యాతి కాంచిన, అమానుష+సత్త్వ+సంపన్నులకు=మనుషులశక్తికిమీఱిన+బల+సంపదకల వారికి, మోపెట్ట=ఎక్కుపెట్ట, అలవికాని=శక్యము కాని, కార్ముకము=విల్లు, దుహితృ+శుల్కము=అల్లుడగుటకు+ ఓలిగాచేయవలసినపని, ఎక్కువప్రమాణము+అయినందులకు=మానవులుసాధించలేనంత మిక్కిలి ప్రమాణపుది+అగుటకు, వగచి=చింతించి,

తే. "గండుమిగిలిన మేటి వేదండములకె/కడగి సాధింపగా రాని కార్యమందు
కన్ను దెఱచియు దెఱవని గున్న యేన్గు/నెటు నియోగింతు విత యగు టెఱిగి యెఱుగి? 36

గండుమిగిలిన=బలము మీరిన, వేదండములకె=ఏనుగువంటి వారికే, కడగి=ప్రయత్నించి, నియోగింతువు= పంపుదువు, వితయగుట+ఎఱిగి+ఎఱిగి=వ్యర్థమగుట+తెలసి+తెలసి, గున్న ఏన్గు=ఏనుగు పిల్ల

ఉ. హేళనపాలుగారె ముని పెందఱొ దవ్వుల విల్లు జూచియే
కాలికి బుద్ధిసెప్పరె? ప్రగల్భధనుర్ధరు లెందఱో మహో
త్తాలము దాని నెక్కిడుట దైవ మెఱుంగు, కదల్ప సైతమున్
జాలక, జ్యాకిణాంకభుజసారము నెంచరె సిగ్గుచేటుగన్" 37

దవ్వుల=దూరమునుండియే, ప్రగల్భ+ధనుర్ధరులు=ప్రతిభకల+విలుకాళ్ళు, మహా+ఉత్తాలము=గొప్ప+విల్లు, చాలక=సమర్ధతలేక, జ్యా+కిణాంక+భుజసారమున్=అల్లెత్రాడు+రాపిడిచే కాయలు కట్టిన+తమభుజముల యొక్క+బలమును, ఎంచరె=పరిగణించరా,

తే. నావిని మహర్షి మార్వల్కె"నరవరేణ్య!/ఈ కుమారుని బలము వర్ణింప నేల
భిదురశక్తిని గిరి వోలె వీని చేవ/కార్ముకంబె నిరూపింపగలదు చూడు" 38

భిదుర+శక్తిని=వజ్రాయుధపు+శక్తిని, గిరి=కొండ, చేవ=బలము, కార్ముకంబె=విల్లే,

వ. అనిన మహర్షి యాప్తవచన మాదరించి, త్రిదశగోపమాత్రక మయిన అనలమున దాహశక్తి వలె,
కూకటితాల్పయిన రాఘవునియందును అనర్ఘపౌరుష మనభివ్యక్తమై యుండవచ్చుననివిశ్వసించి,39

త్రిదశగోపమాత్రకమయిన=చిన్న ఆరుద్రపురుగులంత పరిమాణముకల, అనలమున=నిప్పురవ్వలో, దాహశక్తి =దహించుశక్తి, కూకటితాల్పయిన=చిన్న శిఖ+ధరించినట్టి బాలునిలో, అనర్ఘ+పౌరుషము=వెలలేని+ విక్రమము, న అభివ్యక్తమై=కనబడకుండా,

సీ. పార్శ్వవర్తుల మేటి బలియుర వైదేహు/డనిచె గోదండాభిహరణమునకు,
వింట దైజసమగు విల్లు ప్రవర్తింప/దైవతపతి తోయదముల బోలె,
వృషకేతు డెందుండి విడిచె విద్రుతయజ్ఞ/హరిణానుసారినిజాశుగమును,
ఆ ప్రసుప్తమహోరగాభీలమగు దాని/భరతాగ్రజుడు కేల బట్టి యెత్తి,
నిబిడవిశ్మయ నిష్పంద నేత్రు లగుచు/సభ్యు లీక్షింప, నల పంచశరుడు సుమశ
రాసనము బోలె, గిరిసారమయ్యు దాని/అనతియత్నమునసె అధిజ్యంబు చేసి. 40

వింటన్+తైజసమగు+విల్లు+ప్రవర్తింప+దైవతపతి+తోయదములన్+పోలె=ఆకాశములో+తేజస్సుసంబంధ మైన+విల్లు-ఇంద్రధనస్సు-ను+పుట్టింప+ఇంద్రుడు+మేఘములను+అజ్ఞాపించినట్లు, పార్శ్వవర్తుల+మేటి+ బలియుర=సమీపముననున్న+గొప్ప+బలవంతుల, కోదండ+అభిహరణమునకు=విల్లును+తెచ్చుటకు, వైదేహుడు+అనిచె=జనకుడు+పంపెను, వృషకేతుడు+ఎందుండి+విడిచె+విద్రుత+యజ్ఞ+హరిణ+అనుసారి+ నిజ+ఆసుగమును=శివుడు కోపించి+ఏ వింటినుండి+విడిచెనో+పారిపోవుచున్న+యాగపు+జింకను+ అనుసరించివెళ్ళిన+తన+బాణమును(పూర్వము దేవతలు యజ్ఞము చేస్తూ తపస్సు చేస్తున్న శివుని పిలవక పోవుటచే శివుడు కోపించి ఒక ధనస్సుని సృష్టించిన, భయపడి యజ్ఞము లేడి రూపమున పారిపోవుతుండగా దానిని శివబాణము వెంబడించెను. ఆ విల్లే శివధనుస్సు అని కథ), ఆ+ప్రసుప్త+ మహా+ఉరగ+ఆభీలమగు+దాని=అటువంటి+నిద్రించుచున్న+గొప్ప+సర్పమువలే+భయంకర మైన+విల్లును, గిరి+సారమయ్యు+దాని=కొండవంటి+గట్టిదనము+కలదైననూ, నిబిడ+విశ్మయ+నిష్పంద+నేత్రులు+అగుచు= అధిక+ఆశ్చర్యముచే+చలనములేని+కన్నులు కలవారగుచు, సభ్యులు+ఈక్షింపన్=రాజసభ సభ్యులు+ చూస్తూండగా, అల+పంచశరుడు+సుమ+శరాసనమున్+పోలె=ఆ+మన్మథుడు+పూల+విల్లునుఎత్తుట+

వలె, న అతి యత్నమునసె=ఎక్కువ ప్రయత్నము లేకయే, కేలన్+పట్టి+ఎత్తి=చేతితో+పట్టుకొని+ఎత్తి, అధిజ్యంబు+చేసి=అల్లెత్రాడుమోపెట్టి+ఎక్కించెను,

మ. చెవిదాకన్ గొనయమ్ము లాగుటయు నా సింగాణి రెండై పడెన్,
భువిమీదం దలయెత్తి" నేడిదిగొ! నిర్మూలంబు కాలేదు సు
మ్మవదానోగ్రము, క్షత్రజాతి" యని దీర్ఘామర్ష జాత్యంధు బా
ర్గవునిం బేర్కొని హెచ్చరించె నన వజ్రస్ఫార ఘోరార్భటిన్. 41

సింగాణి=విల్లు, నిర్మూలంబు+కాలేదు+సుమ్ము=నాశము+కాలేదు+సుమా, అవదాన+ఉగ్రము=హెచ్చరికతో+తీవ్రమైనది, క్షత్ర=క్షత్రియ, దీర్ఘ+అమర్ష+జాత్యంధు=చాలాకాలమునుండి+కోపముచే+గుడ్డివాడైన, భార్గవుని=పరశురాముని, పేర్కొని=ప్రత్యేకముగాపేరుపెట్టి, అనన్=అనునట్లు, వజ్ర+స్ఫార+ఘోర+అర్భటిన్=పిడుగువలే+అధిక+భయంకరమైన+ధ్వని విజృంభణముతో,

చ. ధనువున దర్శితం బయిన తద్భుజసారము వీర్యశుల్కమున్
మనమున మెచ్చి శ్రీరఘుకుమారునకిచ్చె ఋతప్రతిజ్ఞుడై
జనకుడు వహ్నిసాక్ష్యసదృశంబగు పూజ్యమహర్షి సన్నిధిన్
తనయ రమా స్వరూపిణి యనందగు, దాని నయోనిసంభవన్. 42

దర్శితంబు=చూడబడిన, తత్+భుజ+సారము=రాముని+బాహువుల+బలము, వీర్యశుల్కమున్=జనకుడు విధించిన వీరత్వ ప్రదర్శన నియమము, ఋత+ప్రతిజ్ఞుడై=సత్యమైన+ప్రతిజ్ఞకలవాడై, వహ్ని+సాక్ష్య+సదృశంబగు=అగ్నికి+సాక్షాత్తు+సమానుడైన, సన్నిధి=ఎదుట, రమా+స్వరూపిణి+అనం+తగు=శ్రీమహాలక్ష్మి+రూపము+అన+తగు, అయోనిజన్=స్త్రీయందుకాక భూమినుండి పుట్టిన, శ్రీరఘుకుమారునకు+ఇచ్చె=శ్రీరామునకు+ఇత్తునని వాగ్దానము చేసెను

సీ. సందేశమంపె గోసలమహీనేతకు/మైథులు డంత పురోధచేత,
తమకన్య జేపట్టి నిమికులోద్భవులకు/భృత్యభావమనుగ్రహింప వేడి,
దగినకోడలి గోరె దశరథేశుడు దాని/కనుకూలకర్తయై చనియె ద్విజుడు,
ధర్మవంతులకు సద్యఃపక్వమగు గాదె/కల్పద్రుఫలధర్మికాంక్షితంబు!
అతని బూజించి తద్వాక్యమవధరించి/పరిణయ మహోత్సవమునకు దరలి వచ్చె
శక్రమిత్రుండు దశరథక్ష్మావరుండు/ఉరుచమూరేణు ముషితభాస్కరకరుండు. 43

పురోధ=పురోహితుని, నిమికులోద్భవులకు=నిమివంశములోనివారికి, భృత్య+భావము+అనుగ్రహింప+వేడి= సేవించు+విభూతి+కలిగింప+కోరి, అనుకూలకర్తయై=సహాయకుడై, ద్విజుడు=పురోహితుడు, సద్యః+పక్వమగు =వెంటనే+ఫలించును, కల్పద్రు+ఫల+ధర్మి+కాంక్షితంబు=కల్పవృక్షము+ఇచ్చును+ధర్మబద్ధ మైన+కోరికను, అవధరించి=విని, తరలి=ప్రయాణమై, శక్ర+మిత్రుడు=ఇంద్రుని+స్నేహితుడు -దశరథుడు, ఉరు+చమూ+ రేణు+ముషిత+భాస్కర+కరుండు=గొప్ప+సైన్యపు+ధూళిచే+అపహరింప(కప్పివేయ) బడిన+సూర్యుని+ కిరణములుకలవాడు

తే. వచ్చి వేష్టించె నాత్మీయబలనిపీడి/తోపవనసాలమును మిథిలాపురమును
ప్రీతిరోధము నెల్ల సైరించె నగరి/రమణి ప్రియుని ప్రసక్తసంగమము బోలె. 44

వేష్టించె=నగరముచుట్టూఆక్రమించె, ఆత్మీయ+బల+నిపీడిత+ఉపవన+సాలమును=తన+సైన్యముచే+ బాగాబాధింపబడిన+ఉద్యానములందలి+చెట్లను, ప్రీతి+రోధమున్+ఎల్ల+సైరించె=సీతాకల్యాణమనే ప్రియము జరుగుచుండుటచే+అటంకములను+అన్నిటిని+ఓర్చిరి, రమణి+ప్రియుని+ప్రసక్త+సంగమమున్+బోలె= స్త్రీ+ప్రియునికి+అనుమతించిన+కలయకఅందు+వలె,

చ. వరుణ శతక్రతూపములు వైదికధర్మపథానువర్తు లా
పరివృఢు లిద్దఱుం గలిసి బంధుసుహృత్పరిషత్సహాయులై
జరిపిరి స్వప్రభావసదృశంబుగ లోకమనోబహుప్రియం
కరముగ కన్యకాతనయకౌతుకశోభనముల్ యథావిధిన్. 45

వరుణ+శతక్రతు+ఉపములు=వరుణునితో+ఇంద్రునితో+సమానులు, వైదిక+ధర్మ+పథ+అనువర్తులు=వేద+ ధర్మ+మార్గము+అనుసరించువారు, పరివృఢులు=రాజులు, బంధు+సుహృత్+పరిషత్+సహాయులై= బంధువుల+మంచికోరువారల+సమూహ+సహాయముతో, స్వ+ప్రభావ+సదృశంబుగ=తమ+గొప్పదనము నకు+తగినట్టు, లోక+మనో+బహు+ప్రియంకరముగ=లోకములోని ప్రజల+మనస్సులకు+ఎక్కున+ ప్రియమౌనట్లు, కన్యకా+తనయ+కౌతుక+శోభనముల్+యథావిధిన్=కూతుళ్ళ+కొడుకుల+ఉత్సాహకరమైన +శుభకర్మములు -వివాహములు+విధివిధానముగా,

వ. పార్థివి యైన జానకిని, శ్రీ రామచంద్రుడును; జానకీ యవీయసి నూర్మిళను లక్ష్మణుడును, జానకీ పితృవ్యపుత్రికలు కుశధ్వజుని కూతులు మాండవీ శ్రుతకీర్తులను భరత శత్రుఘ్నులును, జ్యేష్టానుపూర్విగ నుద్వహమైరి. వసిష్ఠవిశ్వామిత్రశతానందుల ఆశీర్వాదాభినందనము లందుకొనిరి.46

పార్థివి=పృధివీపుత్రి, అవీయసిని=చెల్లెలు, పితృవ్య+పుత్రికలు=తండ్రి తోడపుట్టిన వాని+కుమార్తెలు, జ్యేష్టాను పూర్విగను=పెద్దవారికి ముందు అను విధముగా, ఉద్వహమైరి=వివాహితులైరి,

క. ఆ నలువురు శోభిల్లిరి/శ్రీ నిలయులు నవవధూపరిగ్రహులై రా
సూనులు సిద్ధియుతంబులు/భూనాధుని చతురుపాయములు తామనగన్. 47

శోభిల్లిరి=ప్రకాశించిరి, శ్రీనిలయులు=శ్రీనివాసులు-లక్ష్మికినిధానులు, పరిగ్రహులై=స్వీకరించినవారై, సిద్ధియుతంబులు=ఫలసిద్ధి కూర్చిన, చతురుపాయములు=సామ దాన భేద దండ ఉపాయములు, తాము+అనగన్=తామే+అనినట్లు,

క. రఘుకిశోరులు నిమివంశరాజసుతలు/ఘనకృతార్థత గని రొండొకళ్లవలన,
పరమరమ్యమై ప్రత్యయ ప్రకృతియోగ/సదృశమయ్యె నవ్వరవధూసంగమంబు. 48

ఘన+కృతార్థతన్=సంపూర్ణముగా+నెఱవేరినకోరికలతో, ఒండొకళ్ళవలన=ఒకరినుండి ఒకరు, పరమ రమ్యమై=గొప్ప+మనోహరమై, ప్రత్యయ+ప్రకృతి+యోగ+సదృశమయ్యెను=ప్రత్యయముల+ప్రకృతుల+కలయకవలె+వలె(బాషలో ప్రత్యయములు ప్రకృతుల కలయక వలన పదాలు పుట్టి అర్థవంతములగును. మంచి సంబంధ మున్న మంచి మాటలు పుట్టును), ఆ+వర+వధూ+సంగమంబు=వరులు+వధువుల+కలయక, కనిరి=అనుభవించిరి,

వ. పాణిగ్రహణమహోత్సవానంతరమున జనకరాజన్యప్రతిపాదితబహుప్రకారసత్కారముల వలనను తదానందనిష్యందిసౌహార్ధమువలనను సంతోషసంపద్భరితహృదయుడై పంక్తిరథుడు పయనమై త్రిరాత్రముపిదప దన్ననువ్రజించిన వియ్యంకుని వీడుకొలిపి నిజనగరాభిముఖుడై చనుచుండ నొకనాడు మధ్యాహ్నసమయమున ఆకస్మికముగ 49

ప్రతిపాదిత=కలిగించిన, తత్+ఆనంద+నిష్యంది+సౌహార్ధము=వాని+ఆనందము+ఒలికించు+మైత్రి, సంతోష+సంపత్+భరిత=సంతోషమును+సంపదచే+నిండిన, తన్ను+అనువ్రజించిన=తనను+సాగనంపుటకు

సీ. పడగలొక్కుమ్మడి బడద్రోసి మొనలకు/బెదురు పుట్టగ వీచె నెదురుగాలి,
పరిసరంబుల ముంచి పరవళ్ళు త్రొక్కుచు/ఉరవడించిన ఏటి వరద వోలె,
చూడచూడగ మాసె వేడిమి చెడిబద్ధ/పరివేషవలయుడై అరుణరశ్మి,
గరుడి దెబ్బకు నేల కొరగి సొంపెడలిన/ఫణిఫణామండలిమణి విధమున,
కడల రుధిరత తోచె, డేగలు భ్రమించె/అర్కుదెస నక్క లెలుగెత్తి అఱవ సాగె,
రాచ నెత్తుట బితృకార్య మాచరించు/పరశుహస్తుని ఎసకొల్పు తెఱగు తోప. 50

పడగలు+ఒక్కుమ్మడి+పడన్+త్రోసి=జండాలు+ఒక్కసారిగా+విరిగిపడునట్లు(అశుభ సూచకము)+కూల్చి, మొనలకు+బెదురు+పుట్టగ=సైన్యమునకు+జంకు+కలిగించగా, వీచె+ఎదురుగాలి=వీచెను+అపశకునముగా ఎదురుగాలి, ఉరవడించిన=విజృంభించిన, మాసె=కాంతి విహీనమయ్యె, చెడి=తగ్గి, బద్ధపరివేషవలయుడై+ అరుణరశ్మి=వర్తులాకారములో బంధీయై+సూర్యకాంతి(సూర్యుని చుట్టు ఇంద్రధనస్సు వలె మృతదేహము చుట్టులా పరివేషము కనబడుట అశుభసూచకము), నేలకు+ఒరిగి=భూమిపై+పడి, సొంపు+ఎడలిన+ఫణి+ ఫణామండలి+మణి=అందము+పోయిన+పాము+పడగలమధ్యనున్న+మణివలె (పాము దర్శనము అపశకునము), కడల+రుధిరత+తోచె=అంతటా వ్యాపించి+నెత్తుటిఎఱ్ఱదనము+కనిపించెను, డేగలు+భ్రమించె =మృత్యుసూచకముగాగ్రద్దలు+తిరిగె, అర్కు+దెస=సూర్యుని+వైపు, ఎలిగెత్తి= గొంతెత్తి(నక్కలుసూర్యుని వైపు చూచి మొఱగుట అశుభ సూచికము), రాచ+నెత్తుట+బిత్రృ+కార్యము+ఆచరించు=రాజుల+రక్తముతో+తండ్రి+ తద్దిననివాపములు(నీటికి బదులు)+సమర్పించు, పరశుహస్తుని+ఎసకొల్పు+తెఱగు+తోప=పరశురాముని +పురికొల్పు+విధముగా+అనిపించ,

ఉ. ఆ కొఱగాములం గని భయాతురుడై గురుదేవు బిల్చి యై
క్ష్వాకుడు సత్వరం బుచిత శాంతివిధుల్ పచరింపవేడ"ఈ
వైకృత మెగ్గుసేయదు, సుపర్వవసాయి యగున్ రయంబునన్
వ్యాకులపాటు మాను" మని వాని వసిష్ఠుడు తేర్చుచుండగన్. 51

కొఱగాములం+కని=దుశ్శకునములను+చూచి, భయ+ఆతురుడై=భయముచే+తొందరపడినవాడై, సత్వరంబు=వెంటనే, ఉచిత+శాంతివిధుల్+పచరింప+వేడ=తగిన+ఉపశాంతి క్రియలు+కావించ+కోరగా, వైకృతము+ఎగ్గుసేయదు=ఈ బీభత్సము+కీడుచేయదు. సు+పర్యవసాయి=మంచి+ఫలితముగా పరిణామము కలించునది(సుపర్వ+అవసాయి=పొగగా+సమాప్తి), రయంబునన్=త్వరలో, వ్యాకులపాటు= కలత, తేర్చుచుండగన్=ఊఱడించుచుండగా,

క. సరగున సేనాముఖమున/ఉరుతేజోరాశి యొకటి యుత్థితమయ్యెన్
పురుషాకృతిగా దానిని/గుఱుతించిరి కనులు నులిమికొని చూచి భటుల్. 52

సరగున=వేగముగ, సేనా+ముఖమున=సేనకు+ముందు, ఉరు+తేజో+రాశి=గొప్ప+కాంతి+పుంజము, ఉత్థితమయ్యెన్=పైకిలేచినది,

మ. ఉరమున తండ్రివంక దగు ఒంటరిజందెము ప్రేలియాడగా
కరమున తల్లివంక దగు కార్ముకమున్ ధరియుంచి వచ్చె స

త్వరగతి భార్గవుండు ససుధాకరతిగ్మమరీచిరీతి స

ద్విరసనచందనద్రుమము తీరున శాంతభయానకాకృతిన్. 53

ఉరమున=గుండెపై, తండ్రివంక=బ్రాహ్మణతండ్రివంశాచారపు, ఒంటరి+జందెము=పెండ్లి కాలేదుకనుక ఒంటివరస+యజ్ఞోపవీతము, తల్లివంక=క్షత్రియురాలైనతల్లివంశాచారపు, కార్ముకము=విల్లు, స సుధాకర+తిగ్మ+మరీచి+రీతి=చంద్రునితో కూడిన+ప్రచండ+సూర్యుడు+విధముగా, స ద్విరసన+చందన+ద్రుమము=రెండు నాలుకలుకల సర్పముతో కూడిన+శ్రీ చందన+వృక్షము,

సీ. క్రోధకర్కశుడైన గురుని యానతి దీర్ప/వెనుదీయబోని యే వేపమాన

జననీ శిరశ్ఛేధి మును ఘృణాలుత్వంబు/గెలిచె నవ్వల మహీతలము గెలిచె,

దక్షిణశ్రవమున దాల్చినరుద్రాక్ష/వలయబీజంబుల వంకబెట్టి

గణియించు నెవ్వడు క్షత్రియాంతకమహా/సమరాంగణముల త్రిసప్తసంఖ్య,

అతని బిత్రువధజనితదురాగ్రహమున/రాజవంశనిర్మూలనప్రసితుడయిన

జామదగ్న్యు గనుంగొని సంచలించె/అడలి తన బాలసుతులకై అజసుతుండు. 54

క్రోధ+కర్కశుడైన+గురుని+యానతిన్+తీర్ప=కోపముచే+కఠోరుడైన+తండ్రి+ఆజ్ఞ+నెరవేర్చుటకు, వేపమాన+జననీ+శిర+శ్ఛేధి=భయముచే వణుకుచున్న+తల్లి+తల+నరకినవాడు, మును=ముందుగా, ఘృణాలుత్వంబు+గెలిచె=దయాగుణమును+జయించి-పోగొట్టుకొని, అవ్వల=ఆతరువాత, మహీతలము=భూమిఅంతయు, అతని+బిత్రు+వధ+జనిత+దుర్+ఆగ్రహమున=అతను+తండ్రిని+చంపుటచే+పుట్టిన+దుష్ట+కోపముతో, రాజ+వంశ+నిర్మూలన+ప్రసితుడు+అయిన=క్షతియ+కుల+వినాశముచేయ+తత్పరుడు+అయినట్టి, దక్షిణ+శ్రవమునన్+తాల్చిన+రుద్రాక్ష+వలయ+బీజంబుల+వంకబెట్టి+గణియించు=కుడి+చెవిన+ధరించిన+రుద్రాక్షల+గుండ్రటి+గింజల+విధపు+లెక్కప్రకారము, క్షత్రియ+అంతక+మహా+సమర+అంగణముల+త్రిసప్త+సంఖ్య=రాజులను+చంపు+గొప్ప+యుద్ధ+రంగముల+3x7ఇరువదిఒక్కమారులు అను+లెక్కచేసినట్టి, జామదగ్న్యు=జమదగ్నికుమారుడు- పరశురాముని, సంచలించె=కంపించె, అడలి=భయపడి,

తే. రాముడను నామము మనోఽభిరామ మయ్యె/హారమణియై కుమారు నెడాటమందు,

అవధసేతకు నదియె భార్గవుని పట్ల/సర్పమణియై భయోత్కంపజనక మయ్యె. 55

మనోభిరామయ్యె=మనసుకు ఆనందము కలిగించునదయ్యె, ఎడాటమందు=విషయమున, అవధనేత= అయోధ్యరాజు దశరథుడు, భార్గవుని=పరశురాముని, సర్ప+మణియై=పాముపడగమీది+మణిగా, భయ+ఉత్కంప+జనకము+అయ్యె=భయముచేత+బాగావణుకు+పుట్టించునది+అయ్యెను,

ఆ. "అర్ఘ్యమర్ఘ్య" మనుచు నతిసంభ్రమము తోడ/దరియ వచ్చినట్టి దశరథునకు
పెడమొగంబు పెట్టి భృగుకులీనుడు రయం/బడర రాముడున్న యెడకు వచ్చె. 56

అతి+సంభ్రమము=అధిక+తొట్రుపాటుతో, దరియ=సమీపింప, పెడమొగంబు+పెట్టి=మారుమొగము+పెట్టి, భృగుకులీనుడు=పరశురాముడు, రయంబు+అడర=వేగము+అతిశయింప, ఎడకు=స్థానమునకు,

చ. తలకక తన్ను జూచి కరతామరసంబులు మోడ్చి ముందటన్
నిలచిన యా స్వరూపమహనీయుని క్షత్రియవంశదాహదో
హలచిరకోపవహ్ని శిఖయైన వినిష్ఠురదృష్టి జూచుచున్
కలపనగంపయై పలికె కార్ముకదండనిషక్తముష్టియై. 57

తలకక=చలించక, స్వరూప+మహనీయుని=తనవంటి+ఘనుని, క్షత్రియ+వంశ+దాహ+దోహల+చిర+కోప+ వహ్ని+శిఖయైన+వినిష్ఠుర+దృష్టి=రాజ+కులము+కాల్చుటఅందు+తోడ్పడిన+చిరకాల+కోపమనే+అగ్నికి+ కీలఅయి+బాగాపరుషమైన+చూపుతో, కలపనగంపయై=కలహశీలుడై, కార్ముక+దండ+నిషక్త+ముష్టియై= వింటి+దండమును+గట్టిగా పట్టిన+పిడికితో,

సీ. "క్షత్రజాతి మహాపకారశత్రువు నాకు/కనలించె నను గండకావరమున
దారుణశరవహ్ని దాని బూర్ణాహుతి/గావించి శాంతత గంటి నాడు,
క్రమ్మఱ నేడు నా కడకన్నులకు గెంపు/కదిరె త్వద్విక్రమాకర్ణనమున,
కెరలించితివి మీదు పరికింపక ప్రసుప్త/కాలసర్పంబును గాలద్రొక్కి,
అశ్రమంబున విఱిచితివంట! అన్య/భూపతులచేత అనమితపూర్వమైన
మైథిలుని విల్లు, దాని నా మహితవీర్య/శృంగభంగముగా నెంచ కెట్టులుందు? 58

కనలించె=ఆగ్రహింపచేసె, కండకావరమున=క్రొవ్వున, దారుణ+శర+వహ్ని=తీక్ష్ణ+బాణములను+అగ్ని అందు, పూర్ణ+ఆహుతి+కావించి=పూర్తిగా+హవిస్సుగా+చేసి, క్రమ్మఱ=మఱల, కడకన్నులకున్+కెంపు+కదిరె= కంటిచివర+ఎఱుపు+చేరె, త్వత్+విక్రమ+ఆకర్ణనమున=నీ+శౌర్యముగురించి+వినుటచే, కెరలించితివి =ప్రకోపింప చేసితివి, మీదు+పరికింపక=కానున్నపర్యవసాయము+లెక్కచేయక, ప్రసుప్త=బాగా నిద్రిస్తున్న,

అశ్రమంబున=తేలికగా, న అమిత పూర్వమైన=పూర్వమెప్పుడూ వంచబడని, నా+మహిత+వీర్య+శృంగ+ భంగముగా=నాయొక్క+గొప్ప+శౌర్యమునకు+తల+తీసినట్లు,

తే. జగతిలో రాముడనుచు నుచ్చరితమైన/ఈ పదము నాకె వర్తించె నింతవఱకు,
వ్యస్తవృత్తియై అది తలవంపుదెచ్చె/వర్ధమానుడనైన నీవలన నేడు. 59

ఉచ్చరితమైన=పలుక బడిన, వ్యస్త+వృత్తియై=మరియొకనికి+అర్థముగాచెప్ప బడుచున్నదై, వర్ధమానుడనైన =ఇంకాచిన్నవాడవైన,

ఉ. ఏపున నద్రి నైన నగలింపగ జాలిన నాకు అస్త్రవి
ద్యా పరశూలపాణికి సమాగసు లిద్దఱె సుమ్ము, ధేనువ
త్సాపహృతిప్రవర్తకుడు హైహయుడొక్కడు నా మహాయశః
శ్రీ పరిణామము న్నపహరింపగ బూనిన నీ వొకండవున్. 60

ఏపునన్+అద్రిని+ఐన=ఔద్ధత్యముతో+కొండను+అయిననూ, అగలింపగన్+చాలిన=పెల్లగింప+సమర్థమైన, అస్త్రవిద్య+అపర+శూల+పాణికి=అస్త్రవిద్యలో+సాటిలేని+గండ్రగొడ్డలి+చేతిలో ధరించిన నాకు, సమ+అగసులు= తుల్య+అపరాధులు, ధేను+వత్స+అపహృతి+ప్రవర్తకుడు=మాతండ్రి హోమధేనువు+దూడను+దొంగతనము+ జరిపినవాడు, హైహయుడు=కార్తవీర్యుడు, నా+మహా+యశః+శ్రీ+పరిణామమును+అపహరింపగన్+పూనిన= నాయొక్క+గొప్ప+కీర్తిసంపద+పరిపాకము+దొంగలింప+ఉద్దేశించిన,

ఉ. నిండుముదంబు నా కిడునె నిన్ను జయుంపగ లేని నాదుదోః
పాండితి క్షత్రముం బిడుగుపాటిన డొంకగ జేయజాలియున్?
ఎండినపూరిగడ్డిపయి నెట్లటు సంద్రముమీద సైతమున్
మండిన గాదె అగ్ని మహిమం గొనియాడగవచ్చు గొప్పగన్. 61

ఇడునె=ఇచ్చునా, దోః+పాండితి=బాహువుల+సామర్థ్యము, పిడుగుపాటిన+డొంకగ=పిడుగుపడిన+పొదగా- పూర్తిగా నశించినదిగా, ఎట్లు+అటు=(గడ్డిపై)ఎలాగో+అదేవిధముగా, సంద్రము+మీద+సైతమున్= సముద్రము+ఎడల+కూడబడబాగ్ని,

ఉ. ఎఱుగవు గాక నీవు, మునుపెన్నడొ పాడటి త్రుప్పుపట్టె నీ
విఱచిన శైవకార్ముకము పెన్నునిచే నపనీతసారమై,
సరయునదీప్రవాహము వశంబున మూలబలంబు జాఱి లా
వఱిన తటద్రుమంబు మృదువాయువుచేతనె కూలుటబ్రమే. 62

పాడు+అరి=పాడు+పడి, శైవ+కార్ముకము+వెన్నునిచేన్+అపనీత+సారమై=శివ+ధనుస్సు+విష్ణు తేజస్సుచే (శివ విష్ణువుల యుద్ధములో)+తొలగింపబడిన+ధృఢత్వముకలదై, వశంబున=లోబడి, మూల+బలంబు+జాటి+లావు+ఆఱిన+తట+ద్రుమంబు=ప్రేళ్ళ+బలము+నశించి+ధృడత+తగ్గిన+నదిగట్టుపైనున్న+వృక్షము, అబ్రమే=ఆశ్చర్యమా?

తే. ఇది మదీయాయుధము దీని నెక్కుపెట్టి/సశరముగ కర్షణము సేయజాలితేని
రణముపనిలేదు సమదోస్తరస్వి వనుచు/నీకు నోడితి ననుచు నంగీకరింతు 63

మదీయ=నా, సశరముగ+కర్షణము=బాణముకూర్చి+లాగుట, సమ+దోః+తరస్వి=సమాన+బాహు+బలముకలవాడవని,

ఉ. భీరుడ వేని నీ వజగభీరుడ వేని మహోద్గతార్చి నా
ఘోరకుఠారధార గని గుండియజాఱిన వాడవేని సిం
గారమె జ్యానిఘాతకఠినంబు కరాంగుళి నీకు గాన జో
హారు ఘటించి పట్టు మభయాంజలి నాకు నృపాలడింభకా" 64

భీరుడవేని=భయపడువాడవైతే, నీవు+అజ+గభీరుడ=నువ్వు+మేకపోతు+గాంభీర్యము కలవాడవైతే, మహా+ఉద్గతార్చి=గొప్ప+జ్వాలలు క్రక్కుచున్న, ఘోర+కుఠార+ధారన్+కని=తీవ్రమైన+గొడ్డలి+అంచును+చూచి, సింగారమె+జ్యా+నిఘాత+కఠినంబు+కర+అంగుళి+నీకు+కాన=అలంకరణ ప్రాయమే+అల్లెత్రాడు+లాగుటచే+మొద్దుబారిన+చేతి+ప్రేళ్ళు+నీకు+అయితే, జోహారు+ఘటించి=నమస్కారము+చేసి, డింభకా=పిల్లవాడా,

క. అనుటయు దదుగ్రదర్శను/ధను వల్లన నందికొనియె దడయక రఘునం
దనుం డదియె తగిన యుత్తర/మను తలపున హాసవిచలితాధరుడగుచున్. 65

తత్+ఉదుగ్రదర్శను=ఆ+మండిపడుచున్నట్లుకనపడుతున్న, అల్లన=మెల్లగ, తడయక=ఆలస్యము చేయక, ఉత్తరము=సమాధానము, హాస+విచలిత+అధరుడు+అగుచున్=చిఱునవ్వుచేత+కదలుచున్న+పెదవులు+కలవాడై,

తే. ప్రాగ్జననదివ్యచాపము బట్టి సొబగు/డతడు లఘుదర్శనుం డయ్యె నతితరముగ,
క్రొమ్మొయిల్ కేవలంబైన గొమరుమిగులు/ఇంద్రధనురంకితంబైన ఏల చెప్ప! 66

ప్రాక్+జనన+దివ్య+చాపము=ముందటి+జన్మపు(నారాయణుడుగా)+గొప్ప+ధనుస్సును, సొబగుడు=చక్కనివాడు, లఘు+దర్శనుండు+అయ్యెను+అతితరముగ=ప్రీతితో+చూడదగ్గ వాడయ్యెను+చాలాఎక్కువగా,

క్రొత్త+మొయిల్+కేవలంబైనన్+కొమరుమిగులు=తొలకరి+మెఱపులు+తనంతతామే+మిక్కిలినొంపుగా ఉండును, ఇంద్రధనుర్+అంకితంబైన+ఏలచెప్పు=ఇంద్ర ధనస్సు+కూడినదైన+చెప్పఅవసరములేదు,

సీ. ధనువందికొని మహాధన్వి రాఘవు డంత/కుంభినిపై నొక్కకొమ్ము మోపి,
అశ్రమంబున దాని నధిరోపితము జేయ/తత్రత్యజనజయధ్వనులు మ్రోయ,
కలవరపడి ఈలకఱచి రాజవిరోధి/తటుకున ద్యుతిదరిద్రాణుడయ్యె,
ధూమావశేషితధూమకేతను రీతి/పలుకబాఱిన ప్రదీపంబు పగిది,
దృగ్విషయభూతులైరి వారిరువురు రపుడు/ఉపచితాపచితౌజులై ఒండొకళ్ళ,
కభిముఖంబుగ నిలిచి దినాత్యయమున/కాననగు పార్వణేందుభాస్కరుల భంగి. 67

కుంభిని+పైని+ఒక్కకొమ్ము+మోపి=భూమి+పై+ఒక విల్లుచివర+ఆనించి, అశ్రమంబున=శ్రమపడక, అధిరోపితమున్+చేయ=అల్లెత్రాడుకూర్చి+ఎక్కుపెట్ట, తత్రత్య+జన+జయధ్వనులు+మ్రోయ=అక్కడఉన్న +జనుల+జేజేకారము+గర్జిల్ల, కలవరపడి=కలత చెంది, ఈలకఱచి=ప్రాణములు బిగపట్టి, రాజ+విరోధి= రాజులందరికి+శత్రువు-పరశురాముడు, తటుకున=ఆకస్మికముగ, ద్యుతి+దరిద్రాణుడు+అయ్యె=కాంతి+ హీనుడు+అయ్యె, ధూమ+అవశేషిత+ధూమకేతను+రీతి=పొగే+మిగిలిన+అగ్ని+వలె, పలుకబాఱిన+ ప్రదీపంబు+పగిది=వివర్ణమైన+పెద్ద దీపము+వలె, దృక్+విషయభూతులైరి=కన్నులుమాత్రమే+పనిచేస్తున్న ఇంద్రియలుకలవారైరి. ఉపచిత+అపచిత+ఓజులై+ఒండొకళ్ళకు=బలిమినొందిన+క్షీణించిన+దీప్తి+కలవారైరి- రాముడు పరశురాముడువరుసగా, అభిముఖంబుగ=ఎదురెదురుగా, దిన+అత్యయమున=రోజు+అంతమున - సాయంకాలమున, కాననగు=కనబడు, పార్వణ+ఇందు+భాస్కరుల+భంగి=పర్వదినమైన పౌర్ణమినాటి+ చంద్రుడు+సూర్యుల+విధముగా- ఆనాడు సూర్యుడస్తమించగా తేజస్సు చంద్రుని(రాముని)లో చేరెను,

వ. అంత సంహితమైన తన యాశుగ మవితథోద్యమ మగుట దలంచికొని నిరర్గళవిక్రముడైనను
నిరతిశయదయామృదుహృదయుడగుట కౌసల్యేయుడు రైణుకేయు నుపలక్షించి ఇట్లడిగె. 68

సంహితమైన=సంధింపబడిన, ఆశుగము=బాణము, అవితథ+ఉద్యమము+అగుట=వ్యర్థముకాని+పూనిక+ కావలెను, నిరర్గళ+విక్రము డైనను=అడ్డులేని+శౌర్యము కలవాడైననూ, నిరతిశయ+దయా+మృదు+ హృదయుడు+అగుట=అత్యధిక+కరుణకల+మెత్తని+చిత్తముకలవాడు+కనుక, రైణుకేయు=రేణుక కుమారుడు-పరశురాముని, ఉపలక్షించి=చూచి,

ఉ. "పేరిమితోడ నన్నభిభవింపగ వచ్చినవాడ వైన నే
క్రూరతకోర్చి విప్రతిలకుం బ్రహరింపగ జాల నిన్ను, దు

ర్వార మమోఘ మీ శితశరంబున, దేని హరింతు? నీదు, సం
చారమొ? నీ తపస్స్వనసంచితలోకమొ? తెల్పవేడెదన్" 69

వేరిమి+తోడ=విరోధము+తో, అభిభవింపగ=అవమానింపగ, విప్ర+తిలకుం+ప్రతిహరింపగన్+చాల=బ్రాహ్మణ+ఉత్తముని+మరల కొట్టగ+లేను, దుర్వారము+అమోఘము+ఈ+శిత+శరంబున=నివారింప శక్యముకానిది+వ్యర్థము కానిదిఅయిన+ఈ+వాడి+బాణము, హరించు=నాశముచేయమందువు, సంచారమొ=గమనశక్తో, తప+స్స్వన+సంచిత+లోకమొ=తపస్సుచేత+యజ్ఞములచేత+ఆర్జించిన+పుణ్యలోకములో,

వ. అనిన భార్గవుం డిటు లనియె 70

సీ. "శ్రీరామ! రఘువంశసింధురాకాసోమ!/అద్వితీయపరాక్రమాభిరామ!
నే నెఱుంగనివాడ గాను నీవు పురాణ/పురుషుండ వని స్వయంభువుడ వనియు,
శాంబరీమనుజవేషవిడంబనంబున/కారణార్థము మహీగతుడ వైన,
నిన్ను ల్లజేసితి నీ దివ్యవైష్ణవ/తేజోమహత్త్వదిదృక్ష కతన,
పుణ్యతీర్థము లాడంగ బోవ వలతు/కావున ననుగ్రహింపు నా గమనశక్తి,
నాకమార్గఖిలీభవనమున కాత్మ/నుపతపింప, నభోగలోలుపుడ నేను, 71

రఘు+వంశ+సింధు+రాకా+సోమ=రఘు+కులమను+సముద్రమునకు+పున్నమినాటి+చంద్రుడా, అద్వితీయ+పరాక్రమ+అభిరామ=సాటిలేని+శౌర్యముకూడిన+మనోహరాకారా, స్వయంభువుడవు=నీవు లీలగా నీఅంతట పుట్టినవాడవు, శాంబరీ+మనుజ+వేష+విడంబనంబున=మాయా+మానుష+రూపమున+అనుకరించుచు, కారణార్థము=దేవకార్యముకొఱకు, మహీ+గతుడవు+ఐన=భూమిమీదకి+దిగిన+అట్టి, నిన్ను+అల్గ+జేసితి=నీకు+కోపము+తెప్పించితిని, దివ్య+వైష్ణవ+తేజో+మహత్త్వ+దిదృక్ష+కతన=లోకాతీత+విష్ణుసంబంధ+తేజస్సుయొక్క+గొప్పతనము+చూడకోరిక+వలన, ఆడంగ=తిరుగ/స్నానమాడ, వలతు=కోరుదును, నాక+మార్గ+ఖిలీభవనమునకు+ఆత్మను+ఉపతపింపను=స్వర్గనకు పోవు+మార్గమున+వెళ్ళ వీలుపడకుండా చెఱుపబడిన దైననూ+మనసులో+దుఃఖపడను, అభోగ+లోలుపుడ+నేను=భోగముల విడుచుటఅందు+అత్యాసక్తికలవాడను+నేను,

మ. పితృవిద్వేషణమైన రాజకము దోర్వీర్యాగ్నిలో భస్మ సా
త్కృతముం జేసితి, సార్ణవంబుగ ధరిత్రీచక్రముం బాత్రసా
త్కృతముం జేసితి, నింక నాకు భువనజ్యేష్ఠుండవై నట్టి, నీ
కతనం గల్గు జయేతరం బయిన, శ్లాఘ్యం బెంతయున్ రాఘవా!" 72

పితృ+విద్వేషణమైన+రాజకము=తండ్రికి+పగవారైన+క్షత్రియులను, దోర్+వీర్య+అగ్నిలో+భస్మ+సాత్కృతముం +జేసితి=బాహువుల+పరాక్రమమనేడు+అగ్నిలో+బూడిద+పాలు+చేసితిని, స అర్ణవంబుగ=సముద్రములతో కలిపి, ధరిత్రీ+చక్రముం=భూమిమీది+రాష్ట్రముల, పాత్ర+సాత్కృతముం=తగినవారికి+స్వాధీనము, నీకతన=నీ +వల్ల, జయేతరంబు=ఓటమి, శ్లాఘ్యంబు ఎంతయున్=ఎంతో పొగడదగినది,

తే. అట్ల చేయుదు, నని రాము డనుమతించె/తూర్పుమొగమై, విసర్జించె దొడ్డ శరము,
కడు సుకృతి యైన నేమి, భార్గవుని త్రిదివ/పదవి, కది తా దురత్యయపరిఘమయ్యె. 73

తూర్పుమొగమై=తూర్పువైపుకుతిరిగి, విసర్జించె=విడచె, దొడ్డ=గొప్ప, సుకృతి=పుణ్యము, త్రిదివ=స్వర్గ, పదవి=సంపదకు/భాగ్యమునకు, దురత్యయ+పరిఘము+అయ్యె=అతిక్రమింపలేని+తలుపుఅడ్డు గడియ +అయినైది,

క. క్షంతవ్యుడ నని రాఘవు/డంతట, భృగుపతిపదంబు లంటెను, సత్వా
క్రాంతుల మన్నించిన వి/క్రాంతులకు, యశం బితోఽధికంబుగ బెరుగున్. 74

భృగుపతి=పరశురాముడు, సత్వ+ఆక్రాంతుల=బలముచే+ఆక్రమింపబడినవారిని, మన్నించిన=గౌరవించిన, విక్రాంతులకు=వీరులకు, యశంబు+ఇతః+అధికంబుగన్+పెరుగున్=కీర్తి+ముందుకంటె+అదనముగా+ ఎక్కువగును,

తే. చిరతపఃసమృద్ధిపరికల్పితంబైన/ఆత్మపుణ్యలోక, మవ్విధమున,
అంతరింప గనియు, అవికృతహృదయుడై/భార్గవుండు, రామభద్రు, జూచి. 75

చిర+తపః+సమృద్ధి+పరికల్పితంబైన+ఆత్మ+పుణ్య+లోకము=చాలాకాలము చేసిన+తపస్సు అను+సంపదచే +ఏర్పాటు చేసుకొన్న+తన+పుణ్యఫలమైన+లోకములు, అంతరింప=చెడ, అవికృత=భావోద్రేకమేలేని,

సీ. "కనువిప్పు కలిగె నీ కతన మాతృకమైన/రాజసత్వము దిగద్రావగంటి,
పితృపితామహసమాగతమైన శమము జే/పట్టితి, వేఱొక పుట్టు గంటి,
పరిణమించె ననింద్యఫలితమై నాకు నీ/నిగ్రహం బిట్టు లనుగ్రహమున,
నిర్విఘ్నముగ, నింక నిర్వహింపుము దేవ/కార్యంబు నవతారకారణంబు,
దుష్కృతుల గాలరాచి, సాధువుల బ్రోచి/సంతరింపుము ధర్మ సంస్థాపనంబు,
పోయివచ్చెద" నని రాము బుజ్జగించి/సరగున దిరోహితుండయ్యె, పరశుధారి. 76

కనువిప్పుకలిగె=రాజస అహంకారముచే మూసుకుపోయిన నాకండ్లుతెరచుకొన్నవి, కతన=వలన, మాతృకమైన+రాజసత్వము=తల్లినుండి సంక్రమించిన+రజోగుణము, దిగన్ త్రావన్+కంటి=పరిత్యజింప

+కలిగితిని, పితృ+పితామహ+సమాగతమైన+శమమున్+చేపట్టితి=తండ్రి+తాతలనుండి+పొందిన+శాంతి మార్గము+అవలంభించితిని, వేఱొక+పుట్టున్+కంటి=ఆవిధముగా మరొక జన్మ ఎత్తితిని, పరిణమించె= పండినది, అ నింద్య=పొగడదగ్గ, నిగ్రహంబు=దండన, అనుగ్రహమున=దయచేే, సంతరింపుము=చక్కబెట్టు, సంస్థాపనంబు=నిలబెట్టుట, సరగున=వేగముగా, తిరోహితుండు+అయ్యె=వెనుకకువెళ్ళినవాడు+అయెను,

వ. పరశురాముని నిర్గమనముతో దెప్పిఱిలిన పంక్తిరథుడు విజేతయైన కుమారు నాలింగనము
చేసికొని, ఆజానజమైన తత్తేజోవిశేషమును, బుత్రస్నేహమున, బెద్దసేయక, బులినాకివిడిచిన
వానిగ, బునర్జన్మమెత్తినవానిగ, భావించె. 77

నిర్గమనముతో=వెళ్ళగా, తెప్పిఱిలిన=(మూర్ఛనుండి)తేఱిన, ఆజానజమైన=పుట్టకతోవచ్చిన, తత్+తేజో+ విశేషమును=రాముని+పరాక్రమ+ప్రత్యేకతను, పెద్దచేయక=అధికముగాపట్టించుకొనక, పులినాకివిడిచిన= పులినోటినుండితప్పించుకున్న-సామెత, పునర్+జన్మము ఎత్తిన=మళ్ళీ+పుట్టిన,

క. విక్షోభక్షణభారవి/మోక్షితునిం దేల్చె బ్రమదపూరం బతనిన్,
కక్షాగ్నివిలంఘితవన/వృక్షంబును, సపది కుంభవృష్టి విధమునన్. 78

విక్షోభ+క్షణభార+విమోక్షితునిగన్+తేల్చె=బాధనుండి+ఆల్పకాలములోనే+ముక్తిపొందినవాడిగా+ నిర్ణయించెను, ప్రమదపూరంబు=సంతోషమునిండినమనస్సుతో, కక్ష+అగ్ని+విలంఘిత+వన+వృక్షంబును =ఎండిన వనము అందలి+దావాగ్నిచేత+బాగా చుట్టిపేయనడిన+అడవి అందలి+చెట్టును, సపది+కుంభవృష్టి+ విధమునన్=వెంటనే+కురిసిన కుండపోతవాన+కాపాడు విధముగా,

చ. అలయక రేపులన్నిట ప్రయాణము చేయుచు, మాపులన్నిటన్
లలితములైన చప్పరములన్ బసచేయుచు, బోయి చేరె గో
సలపతి, మైథిలీవదన చంద్ర దిదృక్షుపురాంగనాదృగు
త్పలిత గవాక్షమైన, నృపధానికి యక్షపురావమానికిన్. 79

అలయక=ఆలస్యముచేయక, రేపు=పగలు, మాపు=రాత్రి, చప్పరములన్=గుడారముల, మైథిలీ వదన చంద్ర =చంద్రునివంటి ముఖముకల సీతను, దిదృక్షు+పురాంగనా=చూడగోరు+అయోధ్యాపుర స్త్రీల, దృక్+ఉత్పలిత +గవాక్షమైన=చూపులను+ఉత్పలముల సమూహము కల+కిటికీలుకలదైన, యక్ష+పుర+అవమానికిన్= కుబేరుని+పురమైన అలకాపురిని+కించపరచునది-అయోధ్య.

# ద్వాదశ సర్గము రావణవధ

మ. చిర మవ్యాహతలీల భూరివిషయస్నేహంబు సేవించి, సు
స్థిరతేజోగరిమానుషంగమున సందీపించి, తోడ్తో దశా
పరిణామంబును జెంది, యౌషసికదీపజ్వాల చందాన, పం
క్తిరథక్షోణితలేశ్వరుండు దఱిసెన్, నిర్వాణనేదిష్టమున్. 1

దశరథుని పక్షమున: చిరము=చాలాకాలము, అవ్యాహతము=నిరోధములేక, భూరి+విషయ+స్నేహంబు +సేవించి=ఎక్కువ+భోగములందు+ఆసక్తుడై+అనుభవించి, సు+స్థిర+తేజో+గరిమ+అనుషంగమున+సందీపించి=బాగా+శాశ్వతమైన+ప్రభావపు+శ్రేష్ఠత+కూడికచే+అతిశయించి, తోడ్తో=వెంబడి, దశాపరిణామము=చివరిదశకు, తఱిసెన్=సమీపించెను, నిర్వాణము=మరణము, నేదిష్టము=మిక్కిలి సమీపమునకు, పంక్తిరథ+క్షోణితలేశ్వరుండు=దశరథ+మహారాజు, తఱిసెన్=(దీపజ్వాల విధముగా) సమీపించెను,

దీపము పక్షమున: చిరము=చాలాసేపు, అవ్యాహతలీల=నిర్విఘ్నముగ, భూరి+విషయ+స్నేహంబు+సేవించి=ఎక్కువగా+ప్రమిదయందలి+తైలమును+త్రాగి, సుస్థిర+తేజో+గరిమ+అనుషంగమున+సందీపించి=నిలకడైన+వెలుగు+గొప్పదనపు+చేరికతో+మండివెలిగి, తోడ్తో=వెంబడి, దశాపరిణామంబును =వత్తిచివరి దశకువచ్చుటచే, ఔషసిక=ప్రాతఃకాలపు, దీపజ్వాల=దీపశిఖ, నిర్వాణ+నేదిష్టమున్=ఆరిపోవుటకు+దగ్గరగా, తఱిసెన్=సమీపించెను

తే. ముదిమి నరల నెపంబున గదియ వచ్చి/రాముని పరంబు సేయుము రాజ్యమనుచు,
ఱేని, కేకాంతమున జెవిలోన నూదె/కీడు శంకించె నేమొ? కైకేయివలన. 2

ముదిమి=ముసిలితనము, నరల+నెపంబునన్=చెవిలోవచ్చినతెల్లవెంట్రుకల+మిషచే, కదియ=సమీపమునకు, చెవిలోనన్+ఊదె=రహస్యముగాచెవిలో+చెప్పె, పరంబు=వశము

తే. పురజనబహిశ్చరప్రాణభూతు డగుట/జనుల కొక్కొక్కనికి నిండుతనుపు గూర్చె
కాలువ జలంబు తోటమొక్కలకు, బోలె/రామపట్టాభిషేకవార్తామృతంబు. 3

బహిశ్చర+ప్రాణ+భూతుడు=వెలుపలి+ప్రాణముతో+సమానుడు, నిండు+తనుపు=పూర్తి+సంతృప్తి,

క,. కలుషితము సేసె బట్టిన/చలముడుగక తదభిషేకసంభారంబున్,
ములుచతనంబున కింతయు/సొలయని కైకేయి నృపుని శోకాశ్రువులన్. 4

పట్టిన=పూనిన, చలము+ఉడుగక=పట్టుదల+విడువక, ములుచతనంబునకు=మూర్ఖత్వమునకు, ఇంతయు=కొంచము కూడా, నొలయని=జంకని, శోకాశ్రువులన్=దుఃఖపు కన్నీటిచే, సంభారంబున్=సామగ్రిని, కలుషితము+చేసె=చెడునట్లు+చేసెను

తే. అధిపుచే ననునీతయై, అ ప్రచండి/వెఱక మదిలోని తద్దత్తవరయుగమును
వెలువరించెను, పుట్టలోపలి కరాళ/భుజగయుగి, వానదడిసిన భూమివోలె. 5

అధిపుచే+అనునీతయై=దశరథునిచే+బతిమాలబడినదై, ప్రచండి=కోపాకుల-కైక, వెఱక=భయపడక, తత్+దత్త+వర+యుగమును=దశరథు+ఇచ్చిన+వరముల+జంటను, వెలువరించెను=బయటపెట్టెను, కరాళ+భుజగ+యుగి=విషపు+పాముల+జంట, భూమివోలె=భూమిలోనుండి బయటకువచ్చినట్లు,

తే. మొదటి వరమున గైక రాముని బ్రవాస/మనుప వేడె, జతుర్దశహాయనములు,
కొడుకునకు వేడె, దన తల చెడుట యొకటె/చివరి ఫలమైన సిరిని, రెండవ వరమున. 6

ప్రవాసము+అనుప=పరదేశము(అడవులకు)నకు+పెడలగొట్ట, చతుర్దశ+హాయనములు=పదునాలుగు+సంవత్సరములు, తల చెడుట+ఒకటె=విధవరాలగునట్టి+విషయముఒకటే, సిరి=రాజ్యలక్ష్మి, అంతిమ+ఫలము=చరమ+ప్రయోజనము,

క. మును తండ్రి పనుప రాముడు/పనవుచు మేకొనియె రాజపదవి వహింపన్
వని కేగుమన్న తదుపరి/జనకాజ్ఞబరిగ్రహించె, సంతోషముగన్ 7

పనుప=నియోగింప, పనవుచు= తలచుకొని, మేకొనియె=అంగీకరించె, పరిగ్రహించె=స్వీకరించె,

సీ. లలితమంగళదుకూలము గట్టినప్పుడు/కఱకు వల్కములను గట్టినపుడు,
సమముఖరాగుడై సంభ్రమవిక్రియా/రహితయోగీంద్రుడు రాఘవుండు,
జనకుని సత్యనిష్ఠకు లోటు రాకుండ/అరిగి పత్నీ యవీయసులతోడ,
విపినమునందు ప్రవేశము సల్పెను/ఎల్లసత్పురుషుల ఎడదలందు,
తద్వియోగవ్యథాపరితప్తుడైన/జనపతియు, నాత్మకర్మసంజనితమైన,
తొంటి శాపము దలచి, యా దురితమునకు/ప్రాణముక్తియ శుద్ధిలాభముగ నెంచె. 8

లలిత+మంగళ+దుకూలము=మనోహర+శుభంకర+సన్నవస్త్రము, కఱకు+వల్కలము=ముదురు+నార చీర, సమ+ముఖ+రాగుడై=ఒకేవిధమైన+ముఖ+కళతో, సంభ్రమ+విక్రియ+రహిత+యోగీంద్రుడు=సంక్షోభముచేత+మనోవికారము+చెందని+ఇంద్రియ నిగ్రహముకలవాడు, అరిగి=వెళ్ళి, యవీయసుడు=తమ్ముడు, ఎడదలందు=హృదయములలో, తత్+వియోగ+వ్యథా+పరితప్తుడైన=రాముని+ఎడబాటు

వలని+బాధచే+తపింపబడిన, ఆత్మ+కర్మ+సంజనితమైన=తను+పూర్వముచేసిన మునికుమారవధచే+సంభవించిన, దురితమునకు=పాపమునకు, ప్రాణ ముక్తియ=ప్రాణముల విడుచుటయే, శుద్ధి+లాభముగ=పాయశ్చిత్త+ప్రాప్తి,

తే. ప్రోషితకుమారకము, కీర్తిశేషభూవ/రమ్ముసై, యట్లు కోసలరాజ్యలక్ష్మి,
కుశలరంధ్రగవేషదక్షులకు, మరి వి/పక్షులకు, సజ్జితామిషప్రాయమయ్యె. 9

ప్రోషిత+కుమారకము=ప్రావాసమందున్న+రాకుమారుడు, కీర్తిశేష+భూవరమ్మును+ఐ=మరణించిన+రాజు+కలదైన, కుశల+రంధ్ర+గవేష+దక్షులకు=నేర్పుతో+లోపములను+వెదుకుట యందు+సిద్ధహస్తు లైన వారికి, సజ్జిత+ఆమిష+ప్రాయమయ్యె=సిద్ధము చేయబడిన+భోగ్యవసువు+వంటిదయ్యెను

సీ. ప్రకృతు లనాథులు పనుప నియంత్రిత/బాష్పులై, రఘుకులప్రణయిజనులు
పనివిని తోడితేర అనుజసమేతుడై/భరతుడు మాతులపురమునుండి
పఱతెంచి తమ యన్న ప్రవ్రాజనమునకు/తండ్రి కాలంబుసేతకును గుంది,
కన్నతల్లిసె కాదు, తన్నువరించిన/సిరి గూడ గర్హించి పరిహరించి,
వెడలెను ససైన్యముగ రాముకడకు గదిలి/తాపసజనంబు లందందు జూపి చెప్ప
వదినతో గూడ అన్నకు వసతి యిడిన/వృక్షముల జూచి కంట నీర్వెట్టికొనుచు. 10

ప్రకృతులు=అమాత్యులు, అనాథులు=రాజులేనివారై, నియంత్రిత=ఆపుకొనిన, ప్రణయి=ప్రేమకల, పనివిని=సెలవుపుచ్చుకొనివెళ్ళి, తోడితేర=పిలుచుకొనిరా, మాతుల=తాతగారి, పఱతెంచి=పరుగునవచ్చి, ప్రవ్రాజనమున=అడవికివెళ్ళిపోవుట, కాలంబుసేత=మరణించుట, కుంది=దుఃఖించి, గర్హించి=నిందించి, పరిహరించి=విడచి,

మ. హృదయాపేదనతోడ చిత్రశిఖరం బేతెంచి ప్రత్యగ్రనీ
రదసుశ్యాముని రాము జూచి, పితృనిర్యాణంబు వ్రాక్కుచ్చి త
త్పదపద్మంబుల నంటి, ఎల్లప్రజకుం బ్రాపై అనుచ్ఛిష్టసం
పదయౌ, రాజ్యము దాల్పగా నతని సంప్రార్థించె వే భంగులన్. 11

హృదయ+ఆ+వేదన=గుండె+నిండా+దుఃఖము, చిత్ర+శిఖరంబు=చిత్రకూట+పర్వతము, ప్రత్యగ్ర+నీరద+సుశ్యాముని=నూతన+నీరుకలమేఘమువంటి+మంచినీలవర్ణుని, నిర్యాణంబు=మరణము, వ్రాక్కుచ్చి=చెప్పి, ప్రాపై=రక్షకుడై, అనుచ్ఛిష్ట+సంపదయౌ=అనుభవింపని+సొమ్మైన, తాల్పగా=భరించగా, వే+భంగులన్=వేయి+విధములుగా,

క. చోరడయ్యె, నకృతలక్ష్మీ/పరిగ్రహున, కగ్రజునకు బదులు ధరాస్వీ
కరణంబు సేయ భరతుడు/పరివేత్తృత, యొదవు నన్న పాపభీతిన్. 12

చోరడయ్యెన్=పూనుకొనడయ్యె, అ కృత లక్ష్మీ పరిగ్రహునకు=రాజ్యలక్ష్మిని భార్యగా స్వీకరించనట్టి, ధరా+స్వీకరణంబుసేయ=రాజ్యమును+తీసుకొనుటకు, పరివేత్తృత+ఒదవును=అన్నకన్నముందు పెండ్లానిన వాడిని+అగుదునను,

తే. అమరుడైన తండ్రి యాదేశముననుండి/అతని వెనుకద్రిప్పనలవికాక,
అడిగె, రాజ్యమునకు అధిదేవతలు గాగ/భరతు, డన్నగారి పావుకోళ్ళు. 13

అమరుడైన=చనిపోయిన, ఆదేశము=ఆజ్ఞ, అలవి=శక్యము, అధిదేవతలు=ఉత్సవిగ్రహములుగా అధిష్టించిన దేవతలు,

క. రాముడు పాదుక లిడి త/న్నామంత్రితు జేయ, వీటి కరుగక నంది
గ్రామమున నుండి, యతడు/ద్దామన్యాసముగ బ్రోచె, దద్రాజ్యంబున్. 14

ఆమంత్రితు=వీడుకోల్ప, వీటికి=అయోధ్యకు, అరుగక=వెళ్ళక, ఉద్దామ=అధిక, న్యాసము=తనవద్ద ఒకరుదాచినసొమ్మును తాను అనుభవింపక తిరిగి అప్పగింప వలసినది, ప్రోచె=పోషించెను, తత్+రాజ్యంబున్=రాముని+రాజ్యమును,

క. నిరతిశయరాజ్యతృష్ణా/పరాఙ్ముఖుడు, భాతృభక్తిపరతంత్రుడునై,
భరతు, డిటు చేసికొనియెను/పరిహారము మాతృలబ్ధపాతకమునకున్. 15

నిర్ అతిశయ=అంతకంటెఆధికములేని, రాజ్య+తృష్ణా+పరాఙ్ముఖుడు=రాజ్య+పిపాసకు+విముఖుడు, భాతృ=అన్న, పరతంత్రుడునై=ఆధీనుడై, పరిహారము=దిగవిడుచుకొనుట, మాతృ+లబ్ధ+పాతకమునకున్ =తల్లిచే+పొందిన+పాపమునకు,

ఆ. దాశరథియు, ధరణీతనయాసమేతుడై/వనములోన వన్యవర్తనమున,
స్థవిరులైన కొలముసాములు నడపిన/వ్రతము నడపె, బిన్నవయసునాడె. 16

వన్య+వర్తనమున=వనములోలభించుకందమూలములతో+జీవనము గడుపుచు, స్థవిరులైన+కొలము+సాములు=వృద్ధులైన+రఘువంశపు+ప్రభువులు, నడపిన+వ్రతము+నడిపె=ఆచరించిన+వానప్రస్థ వ్రతము+ఆచరించె,

సీ. ఒకనాడు రఘుపతి ఒక వనస్పతిక్రింద/స్వమహిమస్తంభితచ్ఛాయ క్రింద
వైదేహి తొడదోయి మీద నిమీలిత/నేత్రుడై విశ్రాంతి నిద్రవోవ,

బలభేదికొడు కొక పలుగాకి, బలుగాకి/వనిత చన్గవ జీఱె వాడిగోళ్ళ,

రమణోపభోగచిహ్నముల పౌరోభాగ్య/మాచరింపగ వచ్చె ననగ వచ్చి,

వానిపై నల్గి, మంత్రించి పైచె నొక్క/పుడక రాముడు, రామావబోధితుండు

త్రుళ్ళడగి వచ్చి కుయ్యిడి కాళ్ళబడిన/పిట్ట కట, చావు దప్పె, కన్ లొట్టవోయె. 17

వనస్పతి=చెట్టు, స్వ+మహిమ+స్తంభిత+చ్ఛాయ=తన+విస్తారముచే+ఎండను ఆపిన+నీడలో, నిమీలిత =మూయబడిన, బలభేది+కొడుకు=ఇంద్రుని+కొడుకు, పలుగాకిన్+పలుగాకి=తుంటరి తనముతో+ దుష్టుడైన-కాకి, రమణి+ఉపభోగ+చిహ్నముల=పూర్వము రామునిచే సీతపై+ఉంచబడిన+నఖక్షతము లందు, పౌరోభాగ్యము+మాచరింపగ=దుడుకు దనము+చేయగా, రామ+అవబోధితుండు=సీతచే+ చెప్పబడినవాడై, వావిపైన్+అల్గి=ఆకాకిపై+కోపించి, పుడక=గరిక, త్రుళ్ళు+అడగి=గర్వము+తగ్గి, కుయ్యిడి =మొఱపెట్టి, కన్+లొట్టవోయె=కన్ను+తక్కువయ్యె,

తే. చిత్రకూట మయోధ్యకు జేరు వగుట/తఱచు రావచ్చు భరతుడన్ తలపు పుట్టి,

పాయ, మదిరాకయును, ఱేడు పాసి పోయె/అన్నగమును, సముత్సుకహరిణకమును.18

తలపు=భావము, పాయ=విడుచుటకు, మది రాకయును=మనసు ఒప్పకున్నను, పాసిపోయె= విడచిపోయె, అన్నగము=ఆ+కొండ, సముత్సుక+హరిణకమును=అత్యాసక్తమైన+జింకలుకలదానిని,

క. మునుల తపోవనవాటిక/లను వార్షికఋక్షరాశులందు, నిలుచుచున్,

చనియె గ్రమంబున రఘునం/దను డను భాస్వంతు, డంత దక్షిణదిశకున్. 19

వార్షిక+ఋక్ష+రాశులందు=వర్షాకాల+నక్షత్ర+రాశులందు, భాస్వంతుడు=సూర్యుడు.

భావము: వర్షాకాలమైన దక్షిణాయణమున సూర్యుడు జనులకు ఆనందము కూర్చునట్లు రాముడు రాక్షసులచంపి ఋషులకు ఆనందము కూర్చుచూ దక్షిణ దిక్కుకు వెళ్ళెను.

ఆ. రామచంద్రపదనుగామిని యై యప్డు/దేవయజనజాత, దేవి వెలిగె,

అలిగి కైక ఎంత వలదన్నను గుణాభి/లాష, వెంటబడిన లక్ష్మి యనగ. 20

పద+అనుగామినియై=పదముల+వెంటడించుచున్నదై, దేవ+యజన+జాత+దేవి=దేవతా+యజ్ఞమున నుండి+పుట్టిన+సీతాదేవి, గుణ+అభిలాష=మంచి గుణములు+కోరునట్టి, వెంటబడిన+లక్ష్మి+అనగ= వెంటవచ్చిన+రాజ్యలక్ష్మి+వలె,

క. అనసూయాప్రతిపాదిత/ఘనాంగరాగంబు, పుణ్యగంధోన్నతిచే,

ఒనరించె దేవి, సుమనో/వినివర్తితమధులిహముగ, విపినద్రుతతిన్. 21

ప్రతిపాదిత=ఇచ్చిన, ఘన+అంగరాగంబు=గొప్ప+గంధాదులపూత యొక్క, పుణ్య+గంధ+ఉన్నతిచే=పవిత్రమైన+సువాసనల+వృద్ధిచే, విపిన+ద్రుతతిన్=అడవిఅందలి+చెట్లను, సుమనో+వినివర్తిత=పువ్వుల నుండి+మరలింపబడిన, మధులిహముగ=తుమ్మెదలు కలదిగా, ఒనరించె=చేసె,

సీ. మనువంశచంద్రుని మార్గావరోధియై/రాకానిశాకరు రాహువట్లు,
ఘనబలుండు, విరాధుడను నిలింపవిరోధి/సంధ్యాభ్రకపిశప్రచండమూర్తి,
అపహరించె సహోదరాంతరమున నున్న/జానకిన్, లోకశోషణకరుండు,
అడరి నభోనభస్యంబుల నడిమింటి/వర్షపాతంబును, వఱపు వోలె,
దనుజు నుక్కున నుగ్గాడి, దాశరథులు/పూడ్చిరి తదీయశవమును భూమిలోన,
కలయ నటమీద దత్పూతి గంధ మలమి/కాననతలం బమేధ్యము గాకయుండ. 22

మార్గ+అవరోధియై=దారికి+అడ్డుగా, రాకానిశాకరు=చంద్రునికి, నిలింప+విరోధి=దేవతల+శత్రువు-రాక్షసుడు, సంధ్య+అభ్ర+కపిశ+ప్రచండ+మూర్తి=సంధ్యాసమయపు+మేఘమువలె+నలుపు ఎఱుపు కలిగినరంగువాడై+భీషణ+విగ్రహుడు, అపహరించె=దొంగలించె, సహోదర+అంతరమున=అన్నదముల+మధ్య, లోక+శోషణ+కరుండు=లోకముల+బాధింప+చేయువాడు, అడరి=పూని, నభో+నభస్యంబుల=శ్రావణ+భాద్రపదమాసముల-వర్షాకాలపు, నడిమింటి=మధ్యనున్న, వఱపు=వానలేని రోజులు, ఉక్కునన్+ఉగ్గాడి=ప్రతాపముతో+నాశనముచేసి, కలయ=అంతటా, తత్+పూతి+గంధము+అలమి=దాని+కుళ్ళిన+వాసన+ఆక్రమించి, కానన+తలము=అడవి+ప్రదేశము, అమేధ్యము=అపవిత్రము,

క. చని కౌసలేయు డంతట/అనపోఢస్థితి వసించె, నల పంచవటిన్
ఘను డగు ఘటజన్ముని శా/సనమున, ప్రకృతిస్థవింధ్యశైలము భంగిన్. 23

అనపోఢ+స్థితి=అతిక్రమించని+మర్యాదకలవాడై, అల=ప్రశస్తి చెందిన, ఘటజన్ముని=అగస్త్యుని, ప్రకృతి+స్థ=పూర్వస్థితిఅందు+నిలచిన,

క. ఆలోన గవయ వచ్చె న/శాలీనత, రామచంద్రచందనతరువున్,
పౌలస్త్యయవీయసి యను/వ్యాళి, మనోభవనిదాఘబాధాతురయై. 24

అ శాలీనత=సిగ్గులేక, పౌలస్త్య+యవీయసి=పులస్త్యునికొడుకైన రావణుని+చెల్లెలు, మనోభవ+నిదాఘ+బాధ+అతురయై=మన్మదునిచే+మిగులతపింపబడ్డ+తాపముచే+ఆత్రముకలదై, వ్యాళి=ఆడుసర్పము, రామచంద్రచందనతరువున్=రాముడనే గంధపు చెట్టును, కవయ=చేర

క. ధృతి దూలి రాఘవుని తత్/సతి యెదుటనె వలచె, కథితదనుజాన్వయయై,

మితి మీఱి, పెచ్చు పెరిగిన/అతివల భావభవు డసమయజ్ఞుడు కాడే! 25

ధృతిన్+తూలి=స్థిరత+తొలగి, కథిత+దనుజ+అన్వయయై=పైచెప్పబడిన+రాక్షస+వంశములో పుట్టిన శూర్పణఖ, భావభవుడు=మన్మథుడు, అసమయజ్ఞుడు+కాడే=సమయము గుర్తించువాడు+కాడు కదా,

సీ. "ఎలనాగ! పెండ్లము కలవాడ నేను, మా/తమ్ముని గొలువంగ బొమ్ము, నీవు"

అని అ వృషస్యంతి నా వృషస్కంధుడు/వదిలించుకొనె, బుజ్జవంబు నెరపి,

తొలుదొల్త అన్నపై దలపునిల్పిన తన్ను/సౌమిత్రి తనకొల్లరామి దెలుప,

ఉభయకూలంబుల నొరయు స్రవంతియై/అసురి క్రమ్మఱ రాము నడుగవచ్చె,

ఆమె గనుగొని ఆపలే కవనితనయ/అల్ల నగుటయు క్షణసౌమ్య యైన దితిజ,

సంక్షుభించె నివాతనిశ్చలిత యైన/అంబునిధివేల చంద్రోదయమున బోలె. 26

ఎలనాగ=యువతి, వృషస్యంతిని=కాముకిని, వృషస్కంధుడు=ఎద్దుమూపులవంటి భుజములుకలవాడు, బుజ్జవంబు+నెరపి=బుజ్జగింపు+జరిపి, ఒల్ల+రామి=ఇచ్చ+ఉండుక, ఉభయ+కూలంబులన్+ఒరయు+స్రవంతియై=రెండు+ఒడ్డుల+రాచు+నదియై, ఆపలేక=తట్టుకోలేక, అవనితనయ=సీత, అల్ల+నగుటయు=చిన్నగా+నవ్విన, క్షణ+సౌమ్య+ఐన+దితిజ=అతి స్వల్పకాలము+ఆశ్చర్యముతో శాంత+అయిన+రాక్షసి, సంక్షుభించె=బాగావ్యాకుల పడె, ని వాత+నిశ్చలిత+ఐన=గాలి లేకపోవిటచే+కదలికలు లేనిది+ఐన, అంబునిధి+వేల=సముద్రపు+ఒడ్డు,

ఆ. "మిడిసిపడకు కట్టికుడుపక మాన నీ/నగిన ఫలము చూడు! నా తడాక

కావరమున గన్నుగానక బోయెత/బరిహసించి నట్టి హరిణి వైతి" 27

మిడిసిపడకు=గర్వముతోత్రుళ్ళకు, కట్టికుడుపక+మానను=అనుభవింప చేయక+వదలను, ఈ+నగిన=ఈ+నవ్విన, తడాక=సామర్ధ్యము, కావరమున=మదమున, కన్నుగానక=గర్వముచే అంధురాలవై, బోయెత=బోయరాలిని, పరిహసించిన=ఎగతాళిచేసినట్టి, హరిణివి+ఐతి=లేడివంటిదానవు+అయితివి,

క. అని కనుల నుల్క లొల్కగ/దన శూర్పణాఖాహ్వయము యథార్థంబుగ నా

మనుజాశని విషమత్రా/సనరూపము దాల్చి తనదు సన్నిధి నిలువన్. 28

ఉల్కలు+ఒల్కగ=తోకచుక్కలవలెనిప్పుకణములు+కురియ, శూర్ప+నఖ+ఆహ్వాయము=చేటంత+గోళ్ళు కలది+అను పేరు, యథార్థంబుగన్=తగ్గ రూపముగ, ఆ+మనుజ+అశని=ఆ+మనుషులు+ఆహారముగా కలరాక్షసి, విషమ+త్రాసన+రూపమున్+తాల్చి=కుటిల+భయంకరమైన+శరీరమును+ధరించి, తనదు+సన్నిధి= సీత+ఎదుట,

ఆ. ప్రాణవిభుని బాహుపంజరమున దూఱె/చల్లజంపు గండుబిల్లి గనిన
రామచిలుక వోలె, రామాంకవాసిని/దేవి జలదరించి దిగులుసొచ్చి. 29

చల్లజంపు=భయంకరమైన, రామ+అంక+వాసిని=రాముని+తొడపై+కూర్చొని, జలదరించి= కంపించి,

సీ. మును దాని కోకిలా మోహన వాణియు/తరువాతి జంబుకస్వరము విన్న,
పర్ణశాలకు వెలుపల నున్న సౌమిత్రి/దాని మాయావినిగా నెఱింగి,
పరువున బోయి యా భయదవిరూపకు/ఈరసంబున కరాచూరితోడ,
పాయని వైరూప్యపౌనరుక్త్యము గూర్చి/తలపట్టి యీడ్చి అవ్వలకు గెంట
దానవియు పెద్ద ఎలుగున మానవులను/వేణుకర్కశపర్వంబు వికృతవక్ర
నిశితనఖరము నగుట అంకుశము బోని/ప్రేల దర్జించుచును వినువీథి కెగసి. 30

కోకిలా+మోహన+వాణియు=కోకిలవంటి+వలపు గొను+మాటలను, జంబుక+స్వరము=నక్కవంటి+కంఠము, భయద+విరూపకు=భయముకలిగించు+వికృత రూపకు, ఈరసంబున=సహింపలేక, కరాచూరి=కత్తి, పాయని=తీఱని, వై+రూప్య+పౌనరుక్త్యమున్+కూర్చి=వికార+రూపము+రెట్టింపు(చెవులు ముక్కు కోసి)+కలుగచేసి, ఎలుగున=బిగ్గరగా, వేణు+కర్కశ+పర్వంబు=వెదురు కణువలె+కఱుకు+గణుపులు, వికృత+వక్ర+నిశిత+నఖరము=వికారమైన+వంకరలుతిరిగిన+వాడి+గోళ్ళు, అంకుశము+బోని+ప్రేలన్=(ఏనుగును నియంత్రించు)వొడపైన ఆయుధమును+పోలిన+చేతివేలితో, తర్జించుచును=బెదరించుచూ,

క. చనియె జనస్థానమునకు/వినిచె ఖరప్రభృతి దనుజవిక్రాంతులకున్
తనపడిన బన్నమును, అది/దనుజపరాభవనవావతరణమె, అనియున్. 31

వినిచె=వినిపించె, ఖర+ప్రభృతి+దనుజ+విక్రాంతులకున్=ఖరుడు+దూషణుడు త్రిశరుడు మొదలగు+రాక్షస+యోధులకు, బన్నము=అవమానము, అది+దనుజ+పరాభవ+నవ+అవతరణమె=తన పరాభవము+రాక్షసుల+భంగపాటుకు+క్రొత్త+అవతారికే,

ఆ. ముక్కు సెవులు తెగిన మొండి మొగమ్ముతో/నసురసేన కామె నడచె ముందు,
రాఘవాభియాయి రక్షోగణమునకు/అదియ తిరుగులేని అశుభమయ్యె. 32

రాఘవ+అభియాయి=రామునిపై+యుద్ధమునఎదుర్కొను,

తే. ఉద్యతాయుధులై మీది కుఱుకు దృప్త/రాక్షసుల జూచి రఘుమహారథుడు నిలిపె
అంగనారక్షణభరంబు ననుజమీద/విజయసంపాదనభరంబు వింటిమీద. 33

ఉద్యత+ఆయుధులై=పైకెత్తిన+ఆయుధములుకలవారై, ఉఱుకు=దుముకు, దృప్త=దర్పించిన, భరంబు=భారము, సంపాదన+భరంబు=కలిగించు+బాధ్యత,

క. వందలు పే లసురులు దుర/మందు రఘూద్వహుడొకండె యైనను, పగవా
రెందఱు కల రచ్చట వా/రందఱి కత డన్ని రూపులై కనిపించెన్. 34

దురమందు=యుద్ధములో,

ఆ. దుర్జనప్రయుక్తదూషణోద్ధతి స్వదూ/షణముగా సహింపజాల డయ్యె,
ఆర్యవినుతమంగళాచారు డకృతాన్య/దూషణుండు రఘువిభూషణుండు. 35

దుర్జన+ప్రయుక్త+దూషణ+ఉద్ధతి=చెడ్డదైన శూర్పణకచే+పంపబడిన+దూషణుని+గర్వము, ఆర్య+వినుత+మంగళ+అచారుడు=పెద్దలచే+పొగడదగ్గ+శుభప్రదమైన+నడతకలవాడు, అ కృత అన్య+దూషణుండు=వేఱొకరిచే+దూషింపబడనివాడు, స్వ+దూషణముగా=తనను+అవమాన పఱచునదిగా, సహింపజాలడు+అయ్యె=ఓర్చుకోలేకపోయెను,

క. సమగతి నాతని, రిపుదు/ర్దముల ఖరత్రిశురులను అతం, డెదిరించెన్,
క్రమముక్తములయ్యు, బున/స్సమముక్తము లట్లు తోచు శాతాస్త్రములన్. 36

ఆతని+రిపు+దుర్దముల=రాముని+అడపరాని+శత్రువులను, సమగతిన్=వాయువేగముతో, శాత+అశ్త్రములన్=వాడి+బాణములను, అతండు=రాముడు, ఎదిరించెన్=ఎదుర్కొనెను, క్రమముక్తములయ్యు=ఒకదాని వెంట ఒకటి విడచినవయిననూ, పునఃసమ+ముక్తములు+అట్లు+తోచె=ఆబాణములేమో ఏక కాలమందే+విడచినవి+వలె+కనబడుచుండెను,

తే. దనుజదేహాతిగములై యథాతథముగ/అమలినము లైన రాఘవీయాశుగములు
రిపుల ఆయుష్యముల జప్పరించి విడువ/చప్పరించె, దద్రుధిరము శకునిగణము. 37

రాఘవీయ+ఆశుగములు=రాముని బాణములు, దనుజ+దేహ+అతిగములై=ఖర దూషణ త్రిశర మొదలగు రాక్షసుల+శరీరములుదూరి+బయటకువచ్చుచూ, రిపుల+ఆయుష్యముల+జప్పరించి+విడువ=పైరుల+ప్రాణముల+త్రాగి+విడచి పెట్టగా, శకుని+గణము=గ్రద్దలవంటి పక్షుల+సమూహము, తత్+రుధిరము=ఆబాణముల నంటిన+రక్తమును, చప్పరించె=నాకివేయుటచే, యథాతథముగ=పూర్వమువలె, అమలినములు=శుద్ధముగా ఉండెను.

క. చండ రఘువీరకాండ వి/ఖండితమై పడిన యా పగఱ బల్మొనలో
మొండెములుమాత్ర దక్కగ/నొండేవియు లేవు లేచియుండిన వరయన్. 38

చండ=వాడి, కాండ+విఖండితమై=బాణములచే+తెగిన, బలు+మొనలో=పెద్ద+సైన్యములో, తక్కగ=తప్ప, లేచియుండినవి=నిలబడిఉన్నని, అరయన్=చూడగా,

క. అతివీర్యవంతుడగు రఘు/పతితోడ బెనగి పెనగి పడి నిద్రించెన్
దితిజవరూథిని లుప్త/ప్రతిబోధిని, బహుళగృధ్రపక్షచ్ఛాయన్. 39

దితిజ+వరూథిని=రాక్షస+సేన, లుప్తప్రబోధిని=మరల మేల్కొనకుండుటకై, నిద్రించెన్=చనిపోయినవి, బహుళ+గృధ్ర+పక్ష+చ్ఛాయన్=అధికసంఖ్యలోఉన్న+గ్రద్దల+రెక్కల+నీడలందు,

క. దురమున రామశరాగ్ని/స్ఫురణకు నుసి యైన రక్కసుల దుర్వార్తా
హరయై మిగిలెను దశకం/ధరు సన్నిధి కేగ శూర్పణఖ ఒక్కతయే. 40

దురమున=యుద్ధములో, శర+అగ్ని+స్ఫురణకు+నుసిన్+ఐన=బాణ+అగ్నికి+అదిరి+మసి+అయున, దుర్+వార్తా+హరయై=చెడు+సమాచారము+పోయిచెప్పునదియై, దశకంధరు+సన్నిధి=రావణు+ఎదుట,

ఆ. భగిని భంగపఱచి బంధుజనంబును/బొడవడంచు టనిన నెడమకాలు
దశరథాత్మజుండు, తన శిరఃపంక్తిపై/మోపు టనుచు గోపతాపవశత 41

భగిని+భంగపఱచి=చెల్లిలిని+అవమానపరచి, పొడవు+అడంచుట+అనిన=రూపు+మాపుట+ అనగా, తన+శిరః+ పంక్తిపై+మోపుట+అనుచు=తన+తలల+వరసపై+మొత్తుట+అన్నట్లు, కోప+తాప+వశత =కోపము+బాధలకు+లోబడి,

శా. హారిస్స్వర్ణకురంగమైన తన పూర్వామాత్యు తోడ్పాటుతో
వీరాగ్రేసరు లైన దాశరథులన్ బేల్పుచ్చి సన్యాసియై
చేరంబోయి దశాననుం డపహరించెన్ మైథిలిన్ వంచనై
కారంభుండు తలంగె బక్షిపతిజోక్యం బన్ సకృద్విఘ్నమున్. 42

హారి+స్వర్ణ+కురంగమైన=మనోహరమైన+బంగారు+జింకగామారిన, తోడ్పాటు=సహాయము, బేల్పుచ్చి= మోసగించి, వంచన+ఏక+ఆరంభుండు=మోసము+ఒక్కటే+ప్రయత్నముగా ఉన్నవాడు, తలంగె= తొలగించెను, పక్షిపతి+జోక్యంబు+అన్=జటాయువు+ప్రమేయము+అను, సకృత్+విఘ్నమున్=కొద్ది కాలపు+ఆటంకమును,

సీ. జనకపుత్రీగవేషకులు కాకుత్ స్థులు/గృధ్రనాయకుని, నికృత్తపక్షు
హితుడైన దశరథు ఋణము నీగిన ధన్యు/గంఠగతప్రాణు గాంచి దఱియ
హీనస్వరమున లంకేశ్వరు డవనిజా/పాటచ్చరుండౌట నోట దెలిపి,

దారుణక్షతముల దనవీరకృత్యంబు/గానిపించి యతడు కన్ను మూయ,

అభినవీభూత పితృవియోగార్తులగుచు/కన్నతండ్రికి బోలె నా యన్నదమ్ము

లాచరించిరి సుకృతాత్ము డతని కర్థి/దహనకర్మము మరి యౌర్ధ్వదైహికములు. 43

గవేషకులు=వెదకువారు, గృధ్ర=పక్షి, నికృత్త+పక్షు=నఱకబడిన+రెక్కలుకలవాని, ఈగిన=తీర్చిన, కంఠగత ప్రాణు=ప్రాణములుపోవుచూకంఠములోఆగిన, తఱియ=సమీపింప, అవనిజా=సీత, పాటచ్చరుండు+ఔట= దొంగ+అగుట, క్షతముల=గాయముల, కానిపించి=చూపించి, అభినవీభూత=మరలక్రొత్తగాఅయిన, సుకృతాత్ముడు=పుణ్యాత్ముడు, అర్థి=ప్రీతితో, దహనకర్మము=అంత్య క్రియలు, ఊర్ధ్వదైహికములు= మరణించిన తరువాత మంచి దేహము లభించుటకు చేయు క్రియలు,

తే. వధవినిర్ధూతనిజశాపబంధుడైన/అల! కబంధుని యుపదేశ మనుసరించి

అర్కజునితోడ, సమమనోవ్యసనితోడ/సఖ్యము గుదిర్చికొని రామచంద్రు డంత. 44

వధ+వినిర్ధూత+నిజ+శాప+బంధుడైన=చంపబడుటచే+పూర్తిగాతొలగింపబడిన+తన+శాపపు+చెఱకల వాడైన, అల=అట్టి, అర్కజుని=సుగ్రీవుని, సమ+మనో+వ్యసని=తనవలే భార్యను రాజ్యమును పోగొట్టు కొనిన+మానసిక+కష్టముకలవాడైన,

క. శాతైకవిశిఖమున వి/ఖ్యాతబలున్ వాలి దునిమి ఆదేశంబున్,

ధాతుస్థానమునన్ బలె/ఆతని పదమందు నిలిపె, నల! సుగ్రీవున్. 45

శాత+ఏక+విశిఖమున=వాడియైన+ఒకే+బాణముతో, విఖ్యాత=ప్రసిద్ధిచెందిన, తునిమి=చంపి, ఆ+ దేశముంబున్=ఆ+రాజ్యమును(వ్యాకరణమున ఒకఅక్షరము బదులు మరొకఅక్షరమును నిలుపుట), ధాతుస్థానమునన్=తనస్వభావస్థలమైన(ధాతువుస్థానములో), పదమందు=రాజపదవియందు (పదములో), నిలిపెన్=స్థాపించెను, అల=ప్రసిద్ధితో,

క. తిరిగిరి సీతాన్వేషణ/పరులై హరివీరవరులు ప్రభుచోదితులై

విరహార్తు డయిన మనుజే/శ్వరుని మనోరథము లట్లు బహువిషయములన్. 46

హరి=కోతి, చోదితులై=అజ్ఞాపింపబడినవారై, విరహ+ఆర్తు=విరహముచే+దుఃఖితుడైన, మనోరథములు+ అట్లు=మనస్సు+విధముగా, విషయములన్=స్థానముల,

మ. దనుజాధీశుని వీట నున్న దని సీతావార్త సంపాతిచే

విని, లంఘించె సమీరసూతి విలుఠద్వీచీకరాళోదధిన్,

జనిమృత్యువ్యసనావగాఢ మగు సంసారంబు యోగావలం

బనుడై దాటు నిరూఢనిర్మముని ఠేవన్, బాహు సత్త్వోన్నతిన్. 47

సీతా+వార్త=సీతగురించిన+సమాచారము, లంఘించె=దాటెను, సమీరసూతి=హనుమంతుడు, విలురత్+వీచీ+కరాళ+ఉదధిన్=బాగా పొర్లుచున్న+తరంగములుతో+భయంకరమైన+సముద్రమును, జని+మృత్యు+వ్యసన+అవగాఢమగు+సంసారంబు=భార్య+మరణముఅనే+దుఃఖములతో+అధికల్లోతైన+జననమరణ ప్రవాహమును, యోగ+అవలంబనుడై=యోగమును+పూనినవాడై, నిరూఢ+నిర్ మముని+ఠేవన్=మిక్కిలి ప్రవీణతకలగి+మమకారములేనివాడైన+విధముగా, బాహు+సత్త్వ+ఉన్నతిన్=చేతుల+బలపు+వృద్ధిచే,

ఆ. కాననయ్యె మృగయమాణున కతని క/శోకవనికలోన శోకమూర్తి

విషలతావితానవృతమహౌషధివోలె/రాక్షసీపరీత రామ దయుత. 48

మృగయ+మాణునకు=వెదుకు+వానికి, వనిక=చిన్నవనము, విష+లతా+వితాన+వృత+మహ+ఔషధి+వోలె=విషపు+తీగల+గుంపుచే+ఆవరింపబడిన+గొప్ప+(సంజీవని వంటి)మందు+వలె, రాక్షసీ+పరీత=రాక్షసస్త్రీలచే+చుట్టుకొనబడినదైన, దయుత=భార్య,

క. చెంత జని ఆనవాలుగ/కాంతుని యుంగరము నిచ్చె కపి సీతకు, త

త్సంతోషశీతలాశ్రుల/దొంతరదొంతరలు రహి నెదుర్కొన, దానిన్. 49

తత్+సంతోష+శీతల+అశ్రుల+దొంతరదొంతరలు=ఆమె+ఆనందపు+చల్లని+కన్నీటి+పరంపరలు, రహిన్=ఆసక్తితో, ఎదుర్కొన=మూర్కొన,

చ. పెనిమిటి వాచికంబు వినిపించి మహీసుత దేర్చి, అంతతో

దనియక, అక్షముఖ్యబహుదైత్యవధోద్ధతుడై మహేంద్రశా

సనుని నిమేషనిగ్రహము సైచి, పురిన్ మసిచేసి, చూచిర

మ్మన, నిటు కాల్చి వచ్చె, పవనాత్మజు డేలికచెంత కుబ్బునన్. 50

పెనిమిటి+వాచికంబు=భర్త+సందేశము, తేర్చి=ఊరడిల్లచేసి, తనియక=తృప్తి పడక, అక్షముఖ్య+బహు+దైత్య+వధ+ఊద్ధతుడై=అక్షుడు మొదలగు ముఖ్యమైన చాలా+రాక్షసుల+చంపి+గర్వించినవాడై, మహేంద్ర శాసనుని=ఇంద్రజిత్తుని, నిమేష+నిగ్రహము+సైచి=నిమషముపాటు+పట్టుబడుటకు+సహించి, ఏలిక=రాజు-సుగ్రీవుడు, ఉబ్బునన్=ఉత్సాహముతో,

చ. "జానకి చూచి వచ్చి"తని సత్వరకర్ణరసాయనంబుగా

ఆనతగాత్రుడై వినిచి, యాకృతకృత్యుడు, మూర్తిమంతమై

తా నయి వచ్చినట్టి దయితాహృదయంబును బోని, ప్రత్యభి

జ్ఞానమణిన్, నరేంద్రున కొసంగి, యొసంగె మనఃప్రమోదమున్. 51

సత్వర+కర్ణ+రసాయనంబుగా=వెంటనే+చెవులకు+అమృత ప్రాయముగా, ఆనత+గాత్రుడై=వంగిన+శరీరుడై-నమస్కరించి, కృతకృత్యుడు=విహిత కృత్యమును చేసినవాడు, మూర్తిమంతమై=సాకారమైన, దయిత=భార్యయొక్క, ప్రతి అభిజ్ఞాన+మణిన్=గుఱుతుపట్టుటకై ఉంగరమునకు బదులుగా ఇచ్చిన+చూడామణిని, ఒసంగె=కలిగించె, ప్రమోదమునన్=హర్షముతో,

తే. స్వహృదయన్యస్తతన్మణిస్పర్శరాగ/రసనిమీలితుడై వొందె రఘువరుండు

ప్రేయసీపరిరంభనిర్వృతిమహం బ/విద్యమానపయోధరోత్పీడనంబు. 52

స్వ+హృదయ+న్యస్త+తన్+మణి+స్పర్శ+రాగ+రస+నిమీలితుడై=తన+గుండెపై+ఉంచిన+సీతయొక్క+చూడామణి+స్పర్శచేత కలిగిన+అనురాగ+రసముచే+మూసిన కన్నులతో, ప్రేయసీ+పరిరంభ+నిర్వృతి+మహంబు=సీతాదేవి+ఆలింగ+సుఖముయొక్క+ఉత్సవమును, అ విద్యమాన+పయోధర+ఉత్పీడనంబు=సమక్షమునలేని+పాలిండ్ల+పటురాపిడి, వొందె=అనుభవించెను,

క. దేవి యుదంతము విని తా/భావించెను తదవలోకపర్యుత్సుకుడై

రావణపురిజుట్టిన మక/రావసథము ఖేయసులభ మని రాము డెదన్. 53

ఉదంతము=వృత్తాంతము, భావించెను=తలచెను, తత్+అవలోక+పర్యుత్సుకుడై=సీతను+చూచుటయందు+మిక్కిలి తమకము కలవాడై, మకర+అవసథము=మొసళ్ళ+ఇల్లు-సముద్రము, ఖేయ+సులభము=అగడ్తవలే+సులభము,

క. కడిది పగతు గడదేర్పగ/వెడలెను కోదండపాణి వెగ్గల మగు సం

దడి భువియె కాదు దివియుం/గడు సంకటపడగ నడచు కపిసైన్యముతోన్. 54

కడిది+పగతున్+కడదేర్పగ=గొప్ప+శత్రువు+చంపగ, వెగ్గలమగు+సందడి=అధికమైన+సంక్షోభముతో, సంకటపడగ=భాధపడగ,

ఉ. అంబుధివేలపై విడిసినట్టి రఘూద్వహు నాశ్రయించె, గే

హంబు గుటుంబమున్ విడిచి, ఆప్తులు దాను సురారిరాజవం

శంబున దప్పబుట్టిన, ప్రశస్తగుణుండు విభీషణుండు నె

య్యంబున కర్జముం గఱపి, అంపెనో, రాక్షస లక్ష్మి యాతనిన్. 55

అంబుధి+వేలపై+విడిసినట్టి=సముద్ర+తీరమున+సేనలు బసచేసినట్టి, ఆశ్రయించె=శరణుకోరె, గేహంబు=ఇల్లు, ప్రశస్త=కొనియాడదగ్గ, నెయ్యంబున+కర్జముం+కఱపి=స్నేహముతో+కర్తవ్యము+బోధించి, అంపెనో=పంపించెనో, రాక్షస+లక్ష్మి=లంకాపట్టణ+రాజ్యలక్ష్మి,

క. దానవకులాధిపత్యము/వాని పరము సేయ ప్రతినపట్టె, నృపతి యో
గ్యానేహః ప్రారబ్ధం/బైన నయం, బిడక మాన దాశాస్యంబుల్. 56

పరము=వశము, ప్రతినపట్టె=శపథముచేసె, యోగ్య+అనేహః+ప్రారబ్ధంబైన+నయంబు+ఇడక+మానదు =సరియైన+సమయమున+ప్రారంభించిన+నీతి+ఇవ్వక+మానదు, ఆశాస్యంబుల్=కోరికలు,

ఆ. చౌటికడలిమీద సరగున గట్టించె/సేతు వొకటి కపులచేత స్వామి,
తెలివచ్చెనో? అధోలోకముననుండి/చక్రధరు ననంతశయన మనగ. 57

చౌటి+కడలి=ఉప్పు+సముద్రము, సరగున=వేగముగ, అధోలోకముననుండి+చక్రధరుని+అనంత శయనము=పాతాళలోకముననుండి+విష్ణుని+ఆదిశేషుడు,

క. స్వర్ణాపరవరణముగా/పూర్ణోత్సాహమున జుట్టు ముట్టిరి లంకన్,
తీర్ణపయోధులు పింగళ/వర్ణులు సముదీర్ణబలులు వానరవీరుల్. 58

తీర్ణపయోధులు=సముద్రనుదాటిన, పింగళ+వర్ణులు=బంగారపు+రంగుకలవారు, సమ+ఉదీర్ణ+బలులు =చాలా+ఉద్రేకము పొందిన+బలముకలవారు, స్వర్ణ+అపర+వరణముగా=బంగారపు (పింగళ వర్ణ కోతులు లంక సువర్ణ కోటను చుట్టుముట్ట)+రెండవ బంగారు+ప్రాకారముగా, చుట్టుముట్టిరి=ముట్టడించిరి,

సీ. సాలనిర్దళితదుర్జయమహాయోధంబు/శైలరుగ్ణసగంధసామజంబు,
పటుపాదఘాతనిర్భగ్న శతాంగంబు/ఘోరముష్టివినష్టఘోటకంబు,
అతిశస్త్రనిష్ఠురశితనఖన్యాసంబు/అశ్మనిష్పిష్టనానాయుధంబు,
పృధివీపరాగ సంభృతసాంద్రతిమిరంబు/తర్పితభూతబేతాళగణము,
సాగె నంత ప్లవంగ రాక్షసుల మధ్య/ఉగ్రసంరంభశుంభదాయోధనంబు,
దిగ్విజృంభితమై దేవదితిసుతోక్త/రామరావణజయజయార్భటి సెలంగ. 59

సాల+నిర్దళిత+దుర్జయ+మహాయోధంబు=సాలవృక్షములచే+పూర్తిగా బేధింపబడిన+జయించరానిది అనికీర్తిపొందిన+గొప్పసైన్యము, శైల+రుగ్ణ+సగంధ+సామజంబు=రాళ్ళచేత+విఘాతము చెందిన+మదము తోకూడిన+ఏనుగులు, పటు+పాద+ఘాత+నిర్భగ్న +శతాంగంబు=పెద్ద+పాదములచే+త్రొక్కబడి+వికృతా కారమైన+రథములు, ఘోర+ముష్టి+వినష్ట+ఘోటకంబు=భయంకరమైన+పిడికిలిచే+బొత్తిగాజాతి

భ్రష్టమైన+గుఙ్జములు, అతిశస్త్ర+నిష్ఠుర+శిత+నఖ+న్యాసంబు=శస్త్రములను మించి+కఠినమైన + వాడియైన+గోళ్ళ+విన్యాసము, అశ్మ+నిష్పిష్ట+నానా+ఆయుధంబు=రాళ్ళచే+పిండిచేయబడిన+అనేక+ ఆయుధములు, పృధివీ+పరాగ+సంభృత+సాంద్ర+తిమిరంబు=నేల+ధూళిచే+నిండిన+దట్టమైన+చీకటు లు , తర్పిత+భూత+బేతాళ+గణము=తృప్తి చెందిన+భూమిపై కల జంతువులు+యమకింకర+సమూహ ములు, సాగె=కొనసాగె, అంత=అక్కడ, ప్లవంగ=కోతుల, ఉగ్ర+సంరంభ+శుంభత్+ఆయోధనంబు=తీవ్రమై +ఉద్రేకముతో+ప్రకాశించెడు+యుద్ధము, దిగ్వి+జృంభితమై=గెలుచుటకై+చెలరేగిన, దేవ+ దితిసుత+ ఉక్త=దేవతల+రాక్షసులు+చెప్పిన, జయ+ఆర్భటి+సెలంగ=జయజయ+ధ్వానములు+ మ్రోతమ్రోగగా,

ఉ. రాముని రక్తరంజితశిరశ్శకలంబులు కంట జూచి, సం
గ్రామములోననీల్గె నని కంపిలి దిగ్గననొల్లబోయినన్,
"బూమెలమారి రక్కసుని మోసము సుమ్మ"ని నచ్చజెప్పి, సా
ధ్వీమణిమైథిలిం ద్రిజట తేఱిచి, నిల్పె దదుద్గతాసువుల్. 60

రక్త+రంజిత+శిరః+శకలంబులు=రక్తపు+రంగుకల+తల+భాగములు, ఈల్గెన్=మరణించె, కంపిలి=వణికి, దిగ్గనన్+ఒల్లబోయినన్=తటాలున+మూర్ఛచెందిన, బూమెలమారి=మాయలమారి, తేఱిచి=ఉపశమింప చేసి, నిల్పెన్ తత్ గత ఆసువుల్=పోయిన ఆమె ప్రాణములను నిలిపెను,

క. పతిని సజీవునిగా దన/మతి నమ్మి కలంక యుడిగె మైథిలి, మును ద
న్మృతి తథ్యమని ఎఱింగియు/బ్రతికితి, జావ కని, సిగ్గుపడి నీఱయ్యెన్. 61

కలంక+ఉడిగె=కలత+మానె, తథ్యము=నిజము, నీఱయ్యెన్=బూడిదయ్యె(మాటవరస),

ఆ. శక్రజిత్ప్రయుక్తసర్పాస్త్రబంధము/విహగరాజు వచ్చి విప్పి చనగ
దశరథాత్మజులకు దత్పరిక్లేశము/క్షణికమయిన పీడకలగ దోచె. 62

శక్రజిత్+ప్రయుక్త+సర్ప+అస్త్ర+బంధము=ఇంద్రజిత్తు+వేసిన+నాగ+అస్త్రముచే+కట్లు, విహగరాజు= గరుత్మంతుడు, తత్+పరిక్లేశము=దాని+మిక్కిలిక్షోభ,

క. వక్షము బగిల్చె నంతట/రక్షఃపతి శక్తివైచి లక్ష్మణునకు, దా
నక్షతుడయ్యును రాముడు/నాక్షణమె విదీర్ణహృదయు డయ్యె మహార్తిన్. 63

రక్షఃపతి=ఇంద్రజిత్తు, తాన్+అక్షతుడయ్యును=రాముడు+దెబ్బకొట్టబడనివాడయ్యునూ, విదీర్ణ+ హృదయుడు+అయ్యె+మహా+ఆర్తిన్=చీల్చబడిన+గుండెకలవానిగా+అయ్యెను+గొప్ప+బాధతో,

క. పావని కొనితెచ్చిన సం/జీవినిచే లేచి యతడు శితకాండములన్

కావించె నిశాచర కాం/తావళికి బునఃప్రరోదనాచార్యకమునన్. 64

పావని=హనుమ, కొనితెచ్చిన=తీసుకువచ్చిన, శిత+కాండములన్=వాడి+బాణములతో, నిశాచర+కాంత +ఆవళికి=రాక్షస+స్త్రీ+శ్రేణికి, పునః+ప్రరోదన+ఆచార్యకమునన్=మరల+రోదించుట యందు+ ఉపాధ్యాయత్వము,

ఆ. అడచె నడపొడ గనరాని య ట్లటుండు/మేఘనాథుని నాదము, మేఘవాహ

నాయుధప్రభమయిన, శరాసనమును/తజ్జలదశోభలన్, శరత్కాలమటులు. 65

అడచె=నశింపజేసె, అడపొడ+కనరాని+అట్లు+అటుండు+మేఘనాథుని+నాదము=జాడ+కనబడని +విధముగా-(అదృశ్యుడై)(యుద్ధము)చేయుచుండు+ఇంద్రజిత్తుని+ఊపిరితీయు స్వరమును-ప్రాణమును, మేఘవాహన+ఆయుధ+ప్రభమయిన+శరాసనమును=ఇంద్రుని+ఇంద్రధనస్సనెడి ఆయుధపువంటి+ కాంతికలిగిన+ఇంద్రజిత్తు విల్లును, తత్+జలద+శోభలన్=దాని+నీలివర్ణపు+సొంపును, శరత్కాలము+ అటులు=శరత్కాలము మేఘముల ఎట్లుశాంతింపచేయునో+అట్లు,

మ. చెలియల్ గన్న యవస్థ భానుజునిచే సిద్ధించినన్ రేగి దో

ర్బలసంపూర్ణుడు, కుంభకర్ణుడు గళద్రక్త ప్రసిక్తాంగుడై,

ఉలిచే జెక్కగబడ్డ జేగుఱులతో నొప్పారు శృంగీంద్రముం

దలపం జేయుచు వచ్చి, తాకె బెలుచం గాకుత్ స్థవీరాగ్రణిన్. 66

చెలియల్ కన్న+అవస్థ=చెల్లి శూర్పణఖ (ముక్కు చెవులకోత)+పరిస్థితి, భానుజునిచే= సుగ్రీవునిచే, సిద్ధించినన్=దాపురించిన, రేగి=చెలరేగి, దోర్బల+సంపూర్ణుడు= భుజబలము+ బాగా నిండినవాడు, గళత్ +రక్త+ప్రసిక్త+అంగుడై=కుత్తుకనుండికారు+రక్తముచే+బాగా తడపబడిన+శరీర అంగములు కలవాడై, ఉలిచేన్+చెక్కగబడ్డ+జేగుఱులతోన్+ఒప్పారు+ శృంగ+ఇంద్రముం+తలపన్+చేయుచు =రాళ్ళనుచెక్కు పనిముట్టు-ఉలి-చేత+చెక్కబడిన+ ఎఱ్ఱని ధాతువులుకల మణిశిల రంగుతో+ఒప్పిన+ కొండకొన+ శ్రేష్టమును+గుర్తు+చేయునట్టు, తాకె=ఎదురించె, పెలుచం= ఆటోపముతో,

ఉ. కన్నుల నిద్ర తీఱదు, అకాలమునన్ నిను మేలుకొల్పి మీ

యన్న భవత్ ప్రియస్వపన మక్కట ఆఱడిబుచ్చె, మేము నీ

బన్నము దీర్చువార మని పల్కి రఘూద్వహ ముక్తకాండముల్

క్రన్నన దీర్ఘనిద్ర కవకాశము గల్గగజేసె వానికిన్. 67

అకాలమునన్=నిద్రాసమయము పూర్తి కాకుండా, భవత్+ప్రియ+స్వపనము+అక్కట+ఆఱడిన్+పుచ్చె= నీకు+ప్రియమైన+నిద్రను+అయ్యో+వ్యర్థము+చేసె, బన్నము=విఘ్నము, ముక్త+కాండముల్=విడచిన+ బాణములు, క్రన్నన=శ్రీఘ్రముగా, దీర్ఘనిద్ర=మరణము,

ఆ. వాడు వడిన జలము బలమును బొలివోయి/ప్లవగవరుల బారిబడి యడంగె

దనుజసైన్య మెల్ల దద్రక్తనదులలో/రణసముత్థభూమిరజము వోలె. 68

వాడు+పడినన్=కుంభకర్ణుడు+మరణించిన, చలము+బలమును+పొలి+వోయి=పట్టుదల+సత్తువ+ సారము+పోయి, పారి+బడి=పాలిట+చిక్కుకొని, తత్+రక్త+నదులలో=వాని+రక్తపు+ప్రవాహములలో, రణ+సముత్థ+భూమి+రజము+వోలె=యుద్ధములో+పుట్టిన+నేల+ధూళి+వలె, అడంగె=అణిగిపోయినవి,

చ. రణమున కుంభకర్ణుడు, పురందరజేతయు పడ్డ పాటను

క్షణము, మదిన్ దహింప, ప్రతికారమనీష నితాంత రోషభీ

షణదశవక్త్రుడై, దివిజశాసను డిల్ వేడలెన్, జగం బరా

వణమొ? అరామమో? అగు నవశ్యము, నే డను గట్టి తెంపునన్. 69

పురందరజేతయు=ఇంద్రజిత్తు, పడ్డ+పాటు+ఆనుక్షణము=మరణించిన+విధము+ఎల్లప్పుడూ, దహింప= కాల్ప, ప్రతికార+మనీష=పగతీర్చు+బుద్ధిచే, నితాంత+రోష+భీషణ+దశ+వక్త్రుడై=అధిక+కోపముచే+ భయంకర మైన+పది+ముఖములతో, దివిజశాసనుడు+ఇల్+వేడలెన్=దేవతలనే ఆజ్ఞాపించు వాడు- రావణుడు+ఇంటినుండి+బయలుదేరెను, జగంబు=లోకము, అరావణమొ=రావణుడులేనిదో, అరామమో= రాముడు లేనిదో, అగున్+అవశ్యము=అగును+నిశ్చయముగా, తెంపునన్=తెగువతో,

సీ. కాలరియైన రాఘువుని, వరూథియై/వచ్చిన లంకాధిపతిని జూచి,

హరియుగ్మములు పూంచి ఆత్మజైత్రరథంబు/తన్నిమిత్తము పురందరుడు పనుప,

వ్యోమగంగోర్మివాయువ్యూహవేల్లిత/ధ్వజపటాంచల మైన దాని దెచ్చి,

అఖిలమోదంబుగ నమ్మహావీరుని/జేయూత యిడి అధిష్ఠింప జేసి,

అమరపరిపంథివీరుల అస్త్రములకు/కలుగజేసె నుత్పలదళక్లైబ్య మెద్ది,

శాతమన్యవ మా తనుచ్ఛదము దొడగె/స్వయము మాతలి మానవేశ్వరుని మేన. 70

కాలరియైన=నేలపై నిలబడి యుద్ధము చేయుచున్న, వరూథియై=రథమునందుండి, హరి+యుగ్మములు +పూంచి=గుఱ్ఱముల+జంటను+పూనిచి, ఆత్మ+జైత్రరథంబు=తన+జయరథమును, తన్+నిమిత్తము=

రాముని+కొఱకు, పురందరుడు+పంప=ఇంద్రుడు+పంపగా, వ్యోమ+గంగ+ఊర్మి+వాయు+వ్యాహ+వేల్లిత+ధ్వజ+పట+అంచలము+ఐన=ఆకాశ+గంగ+తరంగములపైనుండివచ్చిన+గాలులచే+కదలుచుండిన+టెక్కపు కంబమున ఉన్న+జెండా+వస్త్రపుకొనలు+కల, అధిష్ఠింప+జేసి=కూర్చుండ+పెట్టి, అమర+పరిపంథి+ వీరుల+అస్త్రములకు+కలుగజేసెను+ఉత్పల+దళ+క్లైబ్యము+ఎద్ది=దేవతల+శత్రు (రాక్షసుల)+వీరుల+ ఆస్త్రములతాడికి+ఏది కలిగించెనో+కలువ+రేకుల+మెత్తదనమును మాత్రము+అటువంటి, శాతమన్యవము+ఆ+తనుచ్ఛదము=ఇంద్రసంబంధమైన-ఇంద్రుని+అటువంటి+వజ్రకవచము, మానవేశ్వరుని+మేన=రాముని+ఒంటికి,

తే. అపుడు మునపటియట్లుగా కాజి నొంటి/నిలిచినను కైకసీసూతి నిజశిరోధి
బాహుబాహుళ్యమున, గానబడియె నమ్మ/వంక బలగంబుతో నున్నవాని బోలె.71

మునపటి+అట్లున్+కాక=ఇంతకుముందు+ఉన్నట్లు+కాక, ఆజిన్+ఒంటి=యుద్ధములో+ఒంటరిగా, కైకసీ+సూతి=రాక్షసియైనకైకసి+కుమారుడు-రావణుడు, నిజ+శిరోధి+బాహు+బాహుళ్యమున=తన+పది మెడలు+ఇరువది చేతుల+విస్తారముచే, అమ్మవంక+బలగంబుతో=రాక్షసియైన తల్లి కైకసి తరపు రాక్షస+సైన్యముతో,

శా. త్రైలోక్యంబు జయించె, నీశ్వరు సమారాధింప జెక్కెం దలల్,
కైలాసాచల మెత్తె గందుకముగా, గాలాదిదిక్పాలక
శ్రీలుంటాకపటుప్రతాపభుజరోచిష్ణుండు, వీడల్పుడే!
పౌలస్త్యుండని, పెద్దగా బగతు సంభావించె రాముం డెదన్. 72

సమారాధింప=పూజింప, చెక్కెం+తలల్=తెగకోసికొనెను+తనతలలు, కైలాస+అచలము+ఎత్తె+కందుకముగా=కైలాసపు+కొండ+ఎత్తెను+పూలచండుగా, కాల+ఆది+దిక్పాలక+శ్రీ+లుంటాక+పటు+ప్రతాప+భుజ+రోచిష్ణుండు=యముడు+మొదలగు+దిక్పాలకుల+సిరిని+దోచుకొను+గొప్ప+వీర్యవంత మైన+భుజములతో+ప్రకాశవంతమైనవాడు, సంభావించె=గౌరవించె,

క. సీతాసంగమశంసక/మై తద్దయు నదరుచున్న యైక్ష్వాకుని స
వ్యేతరభుజపీఠంబున/దైతేయుడు నాటె దొలుత దారుణశరమున్. 73

సీతా+సంగమ+శంసకమై+తద్దయున్+అదరుచున్న=సీతను+కలియుట+సూచించుచూ+అధికముగా+శుభసూచకముగా అదురుతున్న, సవ్య ఇతర+భుజ+పీఠంబున=ఎడమకాని(కుడి)+భుజము+పీఠ స్థానమున, నాటె=గ్రుచ్చె,

క. రామాస్తము తత్ప్రత్యు/ద్దామాస్త్రము బీటవేసి దశవదను నుర
స్సీమ బడి వెడలి యురగుల/కా మేలు వచింప బోయె నన భువి దూఱెన్. 74

రామ+అస్తము=రామునిచే ప్రయోగింపబడిన+బాణము, తత్+ప్రతి+ఉద్దామ+అస్త్రము=రావణుని దానికి+బదులైన+గొప్ప+బాణము, బీటవేసి+దశవదనున్+ఉరస్సీమ+బడి+వెడలి=పగులకొట్టి+రావణుని + వక్షస్థలమును+చొచ్చి+వెనుకనుండి బయటకు వచ్చి, ఉరగులకు+ఆ+మేలు+వచింపన్+పోయెన్+అన =పాతాళమునఉన్న పాములకు+ఆ+శుభసమాచారము+చెప్పుటకు+వెళ్ళెనా+అనునట్లు,

తే. యుక్తి యుక్తిచే ఖండింప నోపు, వాద/దక్షులకు బలె నస్త్ర మస్త్రంబు చేత
బెండుపడజేయ గన్న యా దండిమగల/కొండొరుల మీఱు తమకము మెండుకొనియె. **75**

యుక్తి=ఉపాయము, ఖండింపన్+ఓపు=నిరాకరించ+ఏవిధముగా తగునో, వాద+దక్షులకు=వాదన చేయుటలో+నిపుణులకు, అస్త్రము+అస్త్రంబు+చేత=వేసిన అస్త్రముపై+మారు అస్త్రము వేయబడుట+చేత, బెండు పడన్+చేయన్+కన్న=బలహీనము+చేయుట+చూచిన, దండి+మగలకు=గొప్ప+పరాక్రమ వంతులకు, ఒండొరుల+మీఱు+తమకము=ఒకరిపైనఒకరు+అతిక్రమించు+త్వరత, మెండుకొనియె= అతిశయించె,

తే. హిమనగేంద్రంబునకు సాటి హిమనగంబె/వారిరాశికి సాటి దుష్పారమయిన
వారి రాశియె, రామరావణ మహోగ్ర/రణమునకు సాటి రామరావణరణంబె. 76

హిమనగేంద్రము=హిమాలయము, వారిరాశి=సముద్రము, దుష్+పారమయిన=దాటలేని,

తే, పౌరుషవ్యతిహారము కారణముగ/సొరిది జేతులు మారుచు నిరువురకును,
యుద్ధజయలక్ష్మి మత్తేభయుగళమునకు/మధ్య వేదిక మాడ్కి సామాన్య యయ్యె. 77

పౌరుష+వ్యతిహారము=పరాక్రమతో+దెబ్బకు మారుదెబ్బకొట్టు, సొరిది=శీఘ్రముగా, యుద్ధ జయలక్ష్మి= విజయలక్ష్మి, మత్తేభ+యుగళమునకు+మధ్యవేదిక+మాడ్కి=ఏనుగు+జంట+మధ్యనున్న+అరుగు+వలె, సమాన్య+అయ్యె=మధ్యమము+అయినది, (రెండు ఏనుగులు మధ్య పోరాటమున ఒక అరుగు ఉండును. ఒకదానిని ఒకటి తోసి ఎక్క ప్రయత్నించును. అరుగు దాటుట గెలుపు.)

క. కృతహస్తులు వారి కృత/ప్రతికృతముల కలరి సురలు రక్షోగణముల్
వితరించు పుష్పవృష్టుల/నితరేతరవిశిఖతతి సహింప దదటునన్. 78

కృతహస్తులు=గురితప్పక బాణముపేయువారు, కృత+ప్రతికృతములకు+అలరి=చేసినదానికి+మారు చేసినదానికి+సంతోషించి, వితరించు=జల్లు, పుష్పవృష్టులన్=పూలవానలను, ఇతర+ఇతర+విశిఖ+తతి=

ఒకరిపై ఒకరు వేసిన+బాణ+సమూహము, అదటునన్=గర్వముతో, సహింపదు=ఓర్చదు-వారిబాణములు దేవతలు రాక్షసుసులు జల్లిన పుష్పముల క్రింద పడనీయవు,

చ. శలయుతలోహశంకుచయసంహతమై యమరాజు కూటశా
ల్మలి కెనయౌ శతఘ్నిని, సలాఘువుడై పగవాడు ఋవ్వినన్,
బలువడి నర్ధచంద్రముఖబాణముతో నరత్రోవయందె, జే
డలవున జేసె దానిని, సురారిజయాశను ఖండఖండముల్. 79

శల+యుత+లోహ+శంకు+చయ+సంహతమై=ఈటెలు+కూడిన+ఇనుప+మేకుల+సమూహము+చేర్చ బడినదై, యమరాజు+కూటశాల్మలికి+ఎనయౌ+శతఘ్నిని=యముని+గదాదండమునకు+సమాన మగు +ముళ్ళతో నిండిన గద ఆయుధమును, సలాఘువుడై+పగవాడు+ఋవ్వినన్=తేలికగా+రావణుడు+ విసరగా, పలు+వడి=మిక్కిలి+వేగముగా, అరత్రోవయందె=మార్గమధ్యముననే, అలవున=ఉపాయముతో, సురారి+జయ+ఆశను=రావణునియొక్క+జయించు+కోటికను, ఖండఖండముల్=ముక్కలు ముక్కలుగా,

మ. అసురాధీశనిబర్హణంబునకు దివ్యాస్త్రంబు లన్యంబు ల
త్యసమర్థంబులుగా దలంచి, జగదేకామోఘధానుష్కు డి
ష్వసనారూఢము జేసె, దాశరథి ఆపన్న ప్రియాశోకశ
ల్యసముద్ధారకనిస్తులౌషధము, బ్రహ్మాస్త్రంబు గాఢోద్ధతిన్. 80

అసురాధీశ+నిబర్హణంబునకు=రాక్షసరాజును+చంపుటకు, అన్యంబులు=ఇతరములు, అతి+అసమర్థంబు లుగా=అత్యంతము+శక్తివంతము కావని, జగత్+ఏక+అమోఘ+ధానుష్కుడు=లోకములో+ఏకైక+ వ్యర్థము కానట్లు బాణములు వేయు+విలుకాడు, ఇష్వసన్+ఆరూఢమున్+చేసె=విల్లును+ఎక్కు+పెట్టెను, ఆపన్న+ప్రియా+శోక+శల్య+సముద్ధారక+నిస్తుల+ఔషధము=ఆపదలోనున్న+సీతయొక్క+దుఖఃమనెడు +విషమునుండి+లేవనెత్తు+సాటిలేని+మందు, గాఢ+ఉద్ధతిన్=అధిక+గర్వముతో,

క. శతధా విభక్తమై యది/ద్యుతలంబున గోచరించె ద్యుతిమన్ముఖమై
అతిరూక్షసహస్రఫణా/న్వితమైన మహోరగేంద్రు విగ్రహమనగన్. 81

శతధా+విభక్తమై=అనేకగా+విభజింపబడి, ద్యుతలంబున+గోచరించె=ఆకాశమున+కనబడెను, ద్యుతిమన్+ ముఖమై=ప్రాకాశించుచున్న+ముఖములుకలదై, అతి+రూక్ష+సహస్ర+ఫణ+అన్వితమైన+మహా+ఉరగ+ ఇంద్రు+విగ్రహము+అనగన్=ఎక్కువ+కఠినమైన+వేయి+పడగలు+కూడుకొన్నదైన+గొప్ప+సర్ప+రాజైన శేషుని+రూపము+అనునట్లుగా,

క. ప్రణతిపురస్సర మా మా/ర్గణము బ్రయోగించి దాశరథి అజ్ఞాత
వ్రణసంవేదనముగ రా/వణుని శిరఃపంక్తి నేల బడపైచె వడిన్. 82

ప్రణతి+పురస్సరము=నమస్కారపు+ముందుగా ఆచరించి, ఆ+మార్గణము=ఆ+బ్రహ్మాస్త్ర బాణమును, ప్రయోగించి=వేసి, అజ్ఞాత+వ్రణ+సంవేదనముగ=అతివేగముచే తెలియబడని+గాయపు+దుఃఖ అనుభవముగా,

తే. ఉరలు నెత్తురుతో నేల కొరగుచుండి/పంక్తిశిరుని శిరశ్ఛేదపంక్తి మెఱసె
అలలచే దున్కలై నీళులందు దోచు/ బాలభానుని విచలితప్రతిమలట్లు. 83

ఉరలు=కాఱు, పంక్తిశిరుని=రావణుని, శిరశ్ఛేద+పంక్తి=ఖండించినతలల+వరుస, మెఱసె=ప్రకాశించెను, అలలచేన్+తున్కలై+నీళులందున్+తోచు=తరంగములచే+విరుగబడి నప్పుడు+నీటిలో+కనబడు, బాలభానుని+విచలిత+ప్రతిమలు+అట్లు=ఎఱ్ఱనికాంతులుకల ఉదయపు సూర్యుని+బాగుగాకదలు చున్నట్టి+ప్రతిబింబములాఅన్న +విధముగా,

క. కంధరములు తెగి తలలు వ/సుంధరపై బడుట గంట జూచియును బున
స్సంధానశంకితులకు సు/ధాంధసులకు దొలుత ప్రత్యయము లోపించెన్. 84

కంధరములు=మెడలు, వసుంధర=భూమి, కంటన్+చూచియును=కంటితో చూచినప్పటికీ, పున+స్సంధాన+శంకితులకు=మునపటివలేమఱల+కలియునను+అనుమానము కలవారైన, సుధ+అంధసులకు=అమృతము+ఆహారముగా కలవారు-దేవతలు, తొలుత+ప్రత్యయము=తలలు కలియునను ముందటి+ధృఢ అభిప్రాయము, లోపించెన్=మఱుగుపడెను,

చ. అపుడు నభంబునుండి సమదాలఘుపక్షములై దిశాధిప
ద్విపకటకుడ్యముల్ విడచి వెంబడి వచ్చిన తేటిపిండుతో
విపులసుగంధపుష్పమయ వృష్టిపడెన్ సురహస్తముక్తమై
ఉపనతరత్నబంధమగు ద్యోపతివైరివిజేత మౌళిపై. 85

నభంబు=ఆకాశము, స మద+అలఘు+పక్షములై=ఏనుగుల గండస్థలములనుండి అంటిన మదముచే+బరువెక్కిన+రెక్కలు కలవై, దిశాధిప+ద్విప+కట+కుడ్యముల్+విడచి=దిక్పాలకుల+ఏనుగుల+గండస్థల+ప్రదేశము+విడచిపుచ్చి, తేటిపిండుతో=తుమ్మెదల గుంపులతో, విపుల+సుగంధ+పుష్పమయ+వృష్టి+పడెన్=విస్తారముగా+పరిమళించు+పువ్వులునిండిన+వాన+పడినది, సుర+హస్త+ముక్తమై=దేవతల+

చేతులనుండి+విడువబడినదై, ఉపనత+రత్న బంధమగు=త్వరలో+కిరీటధారి అగునట్టి, ద్యోపతి+వైరి+విజేత+మౌళిపై=దేవరాజైనఇంద్రుని+శత్రువుడైన రావణుని+జయించిన రాముని+తలపైన,

శా. లోకస్తుత్యభుజోర్జితంబున జగల్లుంటాకు భంజించి, నా
కౌకః కార్యము దీర్చి, సంహృతధనుర్జ్యావల్లియై మాతలిన్
కాకుత్ స్థప్రవరుండు వీడ్కొలిపె, సత్కార ప్రమోదంబునన్,
కైకస్యాత్మజసాయకాంకితపతాకస్యందనేంద్రంబుతో. 86

లోక+స్తుత్య+భుజ+ఊర్జితంబున=లోకములచే+పొగడదగిన+భుజ+బలముచే, జగ+లుంటాకు+భంజించి=లోకములను+దొంగలించువాని+చంపి, నాకౌకః+కార్యమున్+తీర్చి=ఆకాశమున నివసించు దేవతల+పనిని+నెరవేర్చి, సంహృత+ధనుర్+జ్యావల్లియై=ఊడతీసిన+వింటి+నారికలవాడై, మాతలి=ఇంద్రుని సారధి, సత్కార+ప్రమోదంబునన్=గౌరవించి+సంతోషముతో, కైకస్య+ఆత్మజ+సాయక+అంకిత+పతాక+స్యందన+ఇంద్రంబుతో=కైకసి+కుమారుడైన రావణుని పేరుకల+బాణపు+గుర్తులు కల+ధ్వజదండము కల+రథ+రాజముతో,

సీ. ప్రశమితరాక్షసాపాయులైన త్రిలోక/వాసులకేకోత్సవము ఘటించి,
సాధుసమ్మతు విభీషణుని రక్షఃప్రాజ్య/రాజ్యసంపదకు వారసుని జేసి,
తననిమిత్తము దురంబున మృత్యువశులైన/ప్లవగవీరులకు జీవములు పోసి,
అగ్నిహోత్రవిశుద్ధ యైన ప్రేయసి దేవ/ఋషిసమక్షమున బరిగ్రహించి,
స్వభుజవిజితవిమానరాజంబు నెక్కి/అసుర వానరపతులు తన్ననుగమింప
సప్రియానుజుడై, రఘుస్వామి యంత/స్వపురయాత్రామిళత్ ప్రీతి బయనమయ్యె. 87

ప్ర+శమిత+రాక్షస+అపాయులైన=బాగుగా+తీరిన+రాక్షస+బాధకలవారైన, త్రి+లోక+వాసులకు+ఏక+ఉత్సవము+ఘటించి=మూడు+లోకములములలో+ఉన్న వారికి+సాటిలేని+సంబరము+కలుగ చేసి, రక్షః+ప్రాజ్య+రాజ్య+సంపదకు=రాక్షసులు+అధికముగాకల+రాజ్య+లక్ష్మికి, దురంబున=యుద్ధమున, ప్లవంగ=వానర, అగ్నిహోత్ర+విశుద్ధ+ఐన=అగ్నిప్రవేశమున+పవిత్రురాలు+ఐన, సమక్షమున=ఎదుట, పరిగ్రహించి=చేపట్టి, స్వ+భుజ+విజిత+విమాన+రాజంబు=తన+బాహుబలముచే సాధించిన+విజయముచే ప్రాప్తించిన+పుష్పక విమాన+రాజమును, అనుగమింప=వెంటరాగా, స ప్రియ అనుజుడై=సీతా లక్ష్మణ సహితుడై, స్వ+పుర+యాత్రా+మిళత్+ప్రీతి=తనస్వంత+అయోద్యా నగరమునకు+బయలుదేరుటలో+ కలిగిన+సంతోషముతో, పయనమయ్యె=బయలుదేరెను.

# త్రయోదశ సర్గము- అయోధ్యాపునరాగమనము

తే. పయనమై శబ్దగుణమైన స్వపదమందు/అంచిత విమానమున జొచ్చి యరుగుచుండి,
ఎదుటి రత్నాకరము జూపి ఏకతమున/దయుత కిట్లను రామాభిధానశౌరి. 1

రామాభిధానశౌరి=రాముడను పేరుధరించిన విష్ణువు, శబ్దగుణమైన=శబ్దము గుణము గాకల (భూమికి గంధము, జలమునకుశీతలము, ఆకాశమునకుశబ్దము, గుణములు), స్వ+పదమందు=విష్ణు+పదము-ఆకాశమున, అంచిత=సుందరమైన, అరుగుచుండి=ప్రయాణముచేయుచూ, రత్నాకరము=సముద్రము, ఏకతమున=ఏకాంతమున, దయితకు=భార్యసీతతో,

ఉ. "నోరణగండ్ల మార్గమున జూడుము గందపు గట్టు దాక నా
వారధిచే విభక్తమయి వారక నుర్వులుదేఱు సంద్రమున్,
క్షీరపథంబు మధ్య విభజింపగ ఋక్ష గణంబుతోడ నొం
పారు శరత్ప్రసన్నము విహాయసముం దలపించు ప్రేయసీ! 2

నోరణ+గండ్ల=కిటికీ+రంధ్రముల, గందపుగట్టు+దాకను=మలయ పర్వతము+వఱకు, వారధిచే విభక్తమయి =నేను కట్టించిన వంతెనచే రెండుగా విభజింపబడి, వారక=ఎల్లప్పుడువిరమింపక, తేఱు=తేలు, క్షీర+పథంబు=పాల+పుంత-milky way, విభజింపగ=రెండుభాగములుగాచేసినట్లున్న, ఋక్ష+గణంబు=నక్షత్ర+సమూహములతో, నొంపారు=అందగించెడు, శరత్+ప్రసన్నము+విహాయసముం=శరత్కాలపు+సంతసింప చేయు+ఆకాశము, తలపించు=అనిపించు,

సీ ముత్యాల మొలనూలు పుడమిప్రోయాలికి/పెట్టినపేరు గాంభీర్యమునకు,
మర్యాద మీఱని మహితజీవనశాలి/మాణిక్యములకు మాగణిపొలము,
సలిలేంధనపు మంట సైరించు నుపకర్త/రవిమరీచులకు గర్భప్రదాత,
ఆహ్లాదనజ్యోతి కావిర్భవనసీమ/కాదంబినీప్రపాకల్పనంబు,
అపహృతం బైన యయువును అతలజగతి/నెమక బూనిన మా పూర్వనృపులు త్రవ్వ
పదబడి ప్రపూరితం బైన ప్రాక్ స్రవంతి/చారుభీమము, సాధ్వి! ఈ సాగరంబు. 3

సాధ్వి=పతివ్రత, ముత్యాల+మొలనూలు=సూర్యకాంతి ప్రతిబింబించి ముత్యములవలే ఒప్పు నురుగలు+వడ్డాణము, పుడమి+ప్రోయాలికి=భూమిఅనే(పోషించు)+స్త్రీకి, పెట్టిన+పేరు=గుణముచూచి పెట్టిన+పేరు, గాంభీర్యమునకు=వికార రాహిత్యమునకు, మర్యాద+మీఱని=చెలియలికట్ట+దాటని, మహిత+జీవనశాలి=

పుణ్య+జలముకలది, మాణిక్యములకు=రత్నాదులకు, మాగణి+పొలము=పంటకుఅనువైన పల్లపు+ భూమి, సలిలేంధనపు+మంట=బడబాగ్ని+మంటను, సైరించును+ఉపకర్త=తానేఓర్చి+మేలు చేయునది, రవి+ మరీచులకు+గర్భప్రదాత=సూర్య+కిరణముచే+జలముకలమేఘముల ధరింప చేయునది, ఆహ్లాదన+ జ్యోతికి+ఆవిర్భవన+సీమ=ఆనందము కలిగించు+చంద్రుడు+పుట్టిన+ప్రదేశము, కాదంబినీ+ప్రప+ ఆకల్పనంబు=మేఘపంక్తికి+పానీయశాలగ నీరుఅనేపన్ను+కలిగించునది, అపహృతంబైన+యయువును= దొంగలింపబడిన+అశ్వమేధాశ్వమును, అతల+జగతి=పాతాళ+లోకమున, సెమకన్+పూనిన=వెదక+ ప్రయత్నించిన, పూర్వ నృపులు=మాముందు రాజులు-సగరులు, త్రవ్వ+పదబడి=త్రవ్విన+తరువాత, ప్రాక్+ స్రవంతి=తూర్పుగా ప్రవహించు+నది-గంగచే, ప్రపూరితంబైన=పూర్తిగా నింపబడినట్టి, చారు+భీమము= ఒకసారి సుందరముగా+మరోసారిభయంకరముగా ఉండునది.

తే. దశల వైవిధ్యమున దశదిశల మేర/విస్తరించిన కతమున విష్ణుమూర్తి
కరణి దీని స్వరూపము దురవగాహ/మతివ! ఈ దృక్తయందు ఇయత్తయందు. 4

ఆతివ=వనిత, దశలవైవిధ్యమున+దశదిశల+మేర+విస్తరించిన+కతమున=పదిఅవతారములలో వామనా వతారమునందువలె+పదిదిక్కుల+సీమలవరకు+వ్యాపించిన+అందువల్ల, విష్ణుమూర్తికరణి=అంతర్యామి విష్ణువు వలే, దీని+స్వరూపము=ఈసముద్రపు+స్వభావము, ఈదృక్తయందు=ఇట్టిది అని కాని, ఇయత్తయందు=ఇంతపరిమాణము కలదని కాని, దురవగాహము=తెలిసికోలేనిది,

ఉ. దేవి! యుగావసానమున దీని పయిం బవళించు సర్వభూ
తావళి ద్రుంచి లోకముల నంబుమయం బొనరించి యోగని
ద్రావిహృతిన్ పరేశుడు పురాణమహాపురుషుండు నాభిరా
జీవనివిష్టుచే, నలువచే బహుభంగుల స్తూయమానుడై. 5

దేవి=రాణి, యుగ+అవసానమున=కల్ప+అంతమున, సర్వ+భూతావళిన్+త్రుంచి=సమస్త+భువనములను +ఉత్తరించి-రూపుమాపి, అంబు+మయంబు=జల+మయము, యోగ+నిద్రా+విహృతిన్=ఆత్మనిష్ఠచే+నిద్రగా చెప్పబడిన+క్రీడావినోదముచే, పరేశుడు=విష్ణువు, నాభి+రాజీవ+నివిష్టుచే=బొడ్డునందలి+కమలము నందు+కూర్చున్నట్టి, నలువచే=బ్రహ్మచే, స్తూయమానుడై=స్తుతింపబడుచున్నవాడై,

తే. పక్షములు ద్రుంచు గోత్రారి భయము మాన్పి/ఇతడు లోగొనె శతశో మహీధ్రములను,
పరజనోపప్లవము మాన్పి దొరల గాచు/పరమధార్మికమధ్యమప్రభువు రీతి. 6

పక్షములు+త్రుంచు=ఱెక్కలు+ఖండించు, గోత్ర+అరి=పర్వతములకు+శత్రువైన-ఇంద్రుడు, లోన్+కొనె=తనలో+రక్షణగాఉంచుకొనె, శతశో+మహీధ్రములను=వందలకొలది+కొండలకు, పరజన+ఉపప్లవము=శత్రువుల+విపత్తునుండి, మధ్యమ+ప్రభువు=మధ్యవర్తిఅగు+రాజు,

ఉ. కావరు డైన రక్కసుని గండడగించి చతుర్భుజుండు సం
భావనమై రసాతలనిమగ్నను, దన్ను సముద్వహింప, వ్రీ
డావనతాస్య యైన వసుధాంగనకున్ వదనావకుంఠనం
బై విలసిల్లె దీని విశదాంబువె, వే విలయప్రవృద్ధమై. 7

కావరుడైన=గర్వితుడైన, రక్కసుని=హిరణ్యాక్షుని, గండు+అడగించి=గర్వము+నశింప చేసి, సంభావనమై=సన్మానింపబడి, రసాతల+నిమగ్నను=పాతాళలోకమునకు+అణగింపబడినట్టి, తన్ను=భూమిని, సమ+ఉద్వహింప=బాగా+పైకెత్త, వ్రీడ+అవనత+ఆస్య=సిగ్గుచె+వంగిన+ముఖము కలదైన, వసుధ+అంగనకున్=భూ+దేవికి, వే+విలయ+ప్రవృద్ధమై=వేగవంతమై+ప్రళయకాలమున+పెరిగినదై, దీని+విశద+అంబువె=ఈ సముద్రపు+విస్తారమైన+నీరె, వదన+అవకుంఠనంబై=ముఖముపై+మేలిముసుగై, విలసిల్లె-ప్రకాశించె,
సూచన:విష్ణువు భూమిని పాతాళమునుండి సముద్రముద్వారా ఎత్తునపుడు క్రిందకుజాఱు నీరు భూకన్యకు మేలిముసుగుగా అనిపించెను.

మ. మొగ మందింప బ్రగల్భలై చనువునన్ మోసాలకున్ వచ్చు ఆ
పగలం బైకొని తద్రసాధరము లాస్వాదించు, దా వారికిన్
యుగపత్ పానఫలాప్తికై, తన తరంగోష్ఠంబు నిచ్చుం దగన్
జగతిన్ వీని కళత్రవర్తనము నిస్సామ్యంబు, నీలాలకా! 8

నీల+ఆలకా=నల్లని+కురులు కలదానా, మొగము+అందింపన్=నదీముఖము+అందునట్లు చేయగా, ప్రగల్భలై+చనువునన్=ప్రౌఢలై+ప్రేమతో, మోసాలకున్=ముంగిలి, ఆపగలం=నదులను, పైకొని=ఎదుర్కొని, తత్+రస+అధరముల+ఆస్వాదించు=వాని+రసవంతమైన+పెదవులను+గ్రోలు, తా+వారికిన్=తనుకూడా+నదులతో, యుగపత్+పాన+ఫల+ఆప్తికై=ఇద్దరూఒకేసారి+పెదవుల అమృతముత్రాగు+ఫలితము+పొందుటకై, తరంగ+ఓష్ఠంబు=కెరటములను+పెదవులను, కళత్ర+వర్తనము=భార్యలయందలి+ప్రవర్తన, నిస్+సామ్యంబు=సాటిలేనిది,

సీ. తెఱనోట ఈ మహాతిమి యుద్ధవిడి సస/త్వముగ నదీముఖోదకము గ్రోలి,
సరగున దౌడలు చప్పరించుచు శిరో/వివరంబునందుండి వెలువరింప,

దద్వారిపూరమంతయు సన్నధారగా/గగనంబునకు బుటం బెగసె జూడు,
కడలి పేరిటి చుట్టగా జుట్టుకొన్నట్టి/నిడుప డెత్తిన గొప్ప పడగ యనగ,
వాహినీవల్లభుడు నింగివాక మీద/కొసరి చిమ్మిన చిమ్మనగ్రోవి నీటి
ధార పొలుపున గనుపట్టె నారజముగ/ఉవిద! రాకామృతాంశుసహోదరాస్య! 9

రాక+అమృతాంశు+సహోదర+ఆస్య=పున్నమనాటి+చందురుని+తోడబుట్టిన లక్ష్మీదేవివంటి+ముఖము కలదానా! ఉవిద=భార్య, తెఱనోట=తెఱచిననోటితో, మహాతిమి=గొప్పనూరుయోజనములు పొడవున్న తిమింగలమువంటిచేప, ఉద్ధవిడి=సంతోషముతో, స సత్త్వముగ=నీటిలోనిప్రాణులతో, నదీముఖోదకము+క్రోలి=సంగమందునదుల నీరును+తాగి, సరగున=వేగముగా, శిరో+వివరంబు=తలకుగల+రంధ్రమునుండి, తత్+వారి+పూరము=ఆ+నీటి+సమూహమును, పుటంబు+ఎగసె=హెచ్చుగా+ఎగిరె, పేరిటి=పేరున, నిడుపడు+ఎత్తిన=నిలువగా+ఎత్తినటునంటి, పడగ=ధ్వజము, వాహినీ+వల్లభుడు=నదుల+భర్త-సముద్రుడు, నింగి+వాక=అకాశ+ప్రదేశమున, చిమ్మన+క్రోవి=నీరుచిమ్ము+నాళము-గొట్టము, పొలుపున=విధముగా, ఆరజముగ= మనోజ్ఞముగ,

తే. పడతి! ఇరుపాయలుగ జీల్చె గడలి నురుగు/నిట నదాటుగ నెగసి ఈ యేన్గుమొసలి
అది, వెస దదీయగండకుడ్యముల మీద/ప్రాకి క్షణకర్ణచామరత్వము భజింప. 10

పడతి=స్త్రీ, ఇరు+పాయలు=రెండు+భాగములు, అదాటుగ=అకస్మాత్తుగా, ఎగసి=ఎగిరి, యేన్గు+మొసలి=ఏనుగు ప్రమాణపు+మొసలి, వెసన్=వేగముగా, తదీయ+గండ+కుడ్యముల=దాని+చెక్కిలి+గోడల, ప్రాకి=నురుగు జాఱుచు, క్షణ+కర్ణ+చామరత్వము+భజింప=క్షణమాత్రకాలము+దాని+చెవులకు+వింజామరములవలే+సేవించ,

శా. వేలావాయువు నాస్వదింప, నదిగో! వెల్వడ్డ యా సర్పముల్
కూలోల్లోలమహోర్మిజృంభణములో గుర్తింప రాకుండియున్
బాలార్కద్యుతిపుంజరంజిత ఫణాప్రస్ఫీత మాణిక్యసాం
ద్రాలోకంబున వ్యక్తమయ్యె, అనసూయారుంధతీసుస్నుషా!" 11

వేలా+వాయువును+ఆస్వదింప=సముద్రతీరపు+గాలిని+త్రాగుటకు, వెలు+పడ్డ=బయటకు+వచ్చిన, కూల+ఉల్లోల+మహా+ఊర్మి+జృంభణములో=పడుచున్న+సముద్రపు+గొప్ప+అలలు+ఎగిరిపడిఒళ్ళువిఱచుకొనుటలో, గుర్తింప=తెల్లని పాములు అను తెల్లని నురుగలోవేరుచేయ, బాల+అర్క+ద్యుతి+పుంజ+

రంజిత= ఉదయిస్తున్న +సూర్యుని+ఎఱ్ఱని కాంతుల+రాశిచే+ఎఱ్ఱనైన, ఫణా+ప్రస్ఫీత+మాణిక్య+సాంద్ర+ ఆలోకంబున+ వ్యక్తమయ్యె=పడగలందు+ప్రకాశించు+మాణిక్యముల+దట్టమైన+చూపులకాంతిచే+ తెలియబడుచున్నవి, సుస్నుషా=మంచి కోడలా,

ఆ. కలికి! నీరు ద్రావ గైవ్రాలి పెనుసుడి/వడి కతమున మొయిలు సుడియుచుండ
కనుము సొంపు మిగిలె గవ్వపు గొండచే/మరల దరువబడిన కరణి గడలి. 12

కలికి=మనోహరమైనస్త్రీ, కైవ్రాలి=ఒంగి, పెను+సుడి+వడి+కతమున=గొప్ప+సుడిగాలి+వేగము+చేత, మొయిలు=మేఘము, సుడియు+చుండ=సుడిగాతిరుగు+చుండగా, సొంపు మిగిలె=అందగించె, కవ్వపు గొండచే=పాల సముద్రమున కవ్వముగా వాడబడిన మందరపర్వతముచే, మరలన్+తరువబడిన+కరణి= మరల+చిలకబడిన+విధముగా, కడలి=సముద్రము,

శా. దూరాకాశము నుండి చూచు మనకుం దోచున్, సమీక్షింపుమా!
క్షారాంభోనిలయంబు నిద్దపుటయశ్చక్రంబు చందాన త
ద్ధారాబద్ధకళంకరేఖ కరణిన్, దన్వంగి! చూపట్టు నా
తీరక్షోణి తమాలతాళవనసధ్రీచీనమై నీలమై. 13

తన్వంగి=సన్న అంగములుకలస్త్రీ, తోచున్=కనబడుచున్నది, సమీక్షింపుమా=పరిశీలించుమా, క్షార+అంభో నిలయంబు=ఉప్పు+సముద్రము, నిద్దపు+అయస్+చక్రంబు+చందాన=నున్నని+ఇనుప+చక్రము+ విధముగా, తత్+ధారా+బద్ధ+కళంక+రేఖ+కరణిన్=దాని+చక్రమునకు+కట్టిన+ఇనుపకమ్మపై+గీఱ+వలె, తీర+క్షోణి=తీర+ప్రదేశము, తమాల+తాళవన+సధ్రీచీనమై+నీలమై=క్రానుగుచెట్లతో+తాటిచెట్లతో+కూడినదై+ నల్లరంగుతో,

తే. మొగలిపుప్పొళ్ళు దిద్దె నీ నగుమొగమున/ముదిత! వేలాసమీరము, మోవితేనె
గ్రోలు తమకాన మండనకాలహాని/కేను సైరింపనని మరి యెఱుగు నేమొ? 14

ముదిత=సంతోషించు స్త్రీ , మొగలి+పుప్పొళ్ళు+దిద్దె=మొగలిపూల+పువ్వుల పుప్పొడిని+అలంకరించినది, వేలా+సమీరము=సముద్రపు+గాలి, తమకాన=త్వరతతో, మండన+కాల+హానికి=అలంకరించుట అందలి+ కాల+యాపనకు, సైరింపనని=సహనముచేయనని,

చ. చిలుకలకొల్కి! వచ్చితిమి చెల్లెలికట్టకు చూడు మప్పుడే
అలఘువిమానయానమున అంబుధి గోష్పదమయ్యె, అల్లవే!
పులినతలంబునం జెదరి ముత్తెపుజిప్పలు ముత్తియంబులున్

ఫలభరనమ్రపూగతరువాటిక తోరణకట్టె వేలకున్. 15

చిలుకలకొల్కి=చిలికవలె మాటాడుదానా, చెల్లెలి+కట్టకు=చెలియలి+కట్ట-తీరము, అలఘు=గొప్ప, గోష్పదమయ్యె=ఆవు అడుగు మాత్రమయ్యె, అల్లవే! =అల్లవిగో, పులిన+తలంబునం+చెదరి=ఇసుక+దిబ్బలపై+వ్యాపించి, ముత్తెపు=ముత్తియ=ముత్యాల, ఫల+భర+నమ్ర+పూగతరు+వాటిక+తోరణకట్టె=ఫలముల+భారముచే+వంగిన+పోకచెట్ల+ఉద్యానవనము+తోరణము+కట్టినట్లున్న ది, వేలకున్=సముద్ర తీరమునకు,

సీ. తరుపర్వతాదుల తప్పించుకొని పెళ్ళు/ఉర్వికి చేర్పుగా నొక్కమాటు,

పక్షులు పయనించు పథము బ్రవేశించి/ఉడ్డీన మొనరించు నొక్కమాటు,

కాదంబినులలోన సౌదామినీలత/యొఱపున జరియించు నొక్కమాటు,

విద్యాధరశ్రేణి విహరించు వీథిలో/ఒయ్యారముగ నేగు నొక్కమాటు,

ఎవ్విధంబుగ వర్తింప నిచ్ఛగించు/దాని, మామకస్వాంతము, తద్విధంబు

తెలిసి, వర్తించుచున్న దస్ఖలితకామ/గమన మీ వాహనము విచిత్రము, లతాంగి! 16

లతాంగి=తీగవంటి అంగములుకలస్త్రీ, తరు+పర్వత+ఆదుల=చెట్లు+పర్వతములు+మొదలైన, ఉర్వికి చేర్పుగా=భూమికి+దగ్గరగా, పథము=మార్గము, ఉడ్డీనము+ఒనరించు=పైకి+ఎగురు, కాదంబినుల=మేఘముల, సౌదామినీ+లత+ఒఱపున=మెఱుపు+తీగ+శోభతో, విద్యాధర+శ్రేణి=మేఘములకంటె పైన విహరించు దేవతలలోని వారైన విధ్యాధరుల+సమూహము, ఒయ్యారముగ=విలాసముగ, వర్తింపన్+ఇచ్ఛగించు=నడుచుకొన+ఇష్టపడు, మామక+స్వాంతము=నా+మనస్సు, అస్ఖలిత+కామ+గమనము=తొట్రుపాటులేక+కోరినచోటికి+తనంతట పోవునది,

చ. కమలదళోల్లసన్నయన! కంటివె పేకువ నూగుటెండకే

చెమరుచు, నీకు దా సురటిసేవ ఘటింపగ మందమందమై

విమలవియత్సమీరణము వీచె సురద్విపదానసంగతిన్

గమగమవల్చుచున్ త్రిపథగాజలవీచి విమర్దశీతమై. 17

కమల+దళ+ఉల్లసన+నయన=తామర+రేకుల+పరిహసించెడు+కండ్లుకలదానా, నూగు+ఎండ=లేత+ఎండ, సురటి+సేవ+ఘటింపగ=విసనకఱ్ఱతో+సపర్య+చేయగా, మందమందమై=మెల్లమెల్లగా, విమల+వియత్+సమీరణము+వీచె=స్వచ్ఛమైన+ఆకాశ+గాలి+విసరెను, సుర+ద్విప+దాన+సంగతిన్+గమగమ+

ఒల్చుచున్=దేవతల+ఏనుగు-ఐరావతపు+మదజలము+కలిసిన+పరిమళము+చిందించుచూ, త్రిపథగా+ జల+వీచి+విమర్ద+శీతమై=ఆకాశగంగ+జల+తరంగముల+సంపర్కముచేత+చల్లనై,

తే. అంబరము తాకు మాల్యవదద్రిశృంగ/మదుగో! ఆవిర్భవించెను, సుదతి అచట
కురిసె జీమూత మానాడు కుంభవృష్టి/నేను గార్చితి విడని కన్నీటి వాన. 18

సుదతి=చక్కనిపలువరసకలస్త్రీ, అంబరము=ఆకాశము, మాల్యవత్+అద్రి+శృంగము=మాల్యవంత+కొండ+ శిఖరము, ఆవిర్భవించెను=కానవచ్చుచుండెను(దగ్గరకువెళ్ళుచుండగా పుట్టినట్లు అనుపించును), జీమూతము=మబ్బు, కుంభవృష్టి=నా కన్నీటి కుండపోత వాన,

సీ. విపులధారాహతపేశంతములనుండి/ప్రభవించు భూయిష్ఠపరిమళంబు,
నిబిడనీరదకుక్షినిర్ముక్తమై వీచు/కహ్లారసుఖశీతగంధవహము,
అరవెల్వడిన చిన్ని అకరువు లొప్పార/గనుగవ దనియించు గడిమిపూలు,
మేఘగర్జనలకు మినమిన పురివిచ్చి/శిఖు లించు కేకల చెలగియాడు,
త్వద్వియోగదుస్సహములై, వనిత! అవ్వి/పెచ్చనూర్పింప నన్నతివివశు జేయ
కళవళింపుచు గడపితి నెలలు నాల్గు/ప్రస్రవణకందరమున నీపై విరాళి. 19

వనిత=అనురాగముకలస్త్రీ, విపుల+ధారాహత+పేశంతములనుండి=అధిక+జడివానచే+చిన్నసరస్సుల నుండి, ప్రభవించు+భూయిష్ఠ+పరిమళంబు=పుట్టిన+మిక్కుటమైన+సువాసన, నిబిడ+నీరద+కుక్షి+ నిర్ముక్తమై+వీచు+కహ్లార+సుఖ+శీత+గంధవహము=దట్టమైన+తుంగగడ్డి+మధ్యభాగమునుండి+విడువ బడి+వీచిన+సౌగంధికముల+స్వచ్ఛంద+చల్ల+గాలి, అర+వెల్వడిన+చిన్ని+అకరువులు+ఒప్పార+కను+ కవన్+తదనియించు+గడిమిపూలు=సగము+విరసిన+మనోజ్ఞమైన+కేసరములతో+శోభిల్లి+కండ్లు+ రెండిటికి+తృప్తిపరచు+గడిమిపూలు, శిఖులు+ఇంచు+కేకల+చెలగి+ఆడు=నెమళ్ళు+ఇంపైన+పురులతో +విజృంభించి+నాట్యముచేయు, త్వత్+వియోగ+దుస్సహములై=నీ+విరహముచే+ఆ సుగంధము నాట్యము సహింపలేనివై, పెచ్చన్+ఊర్పింప=వేడి+శ్వాసతీయించ, నన్ను+అతి+వివశు+చేయ=నన్ను+ఎక్కువగా+ వశముతప్పినవానిగా+చేయగా, కళవళింపుచు=కలత పడుచు, విరాళి=మోహము.

తే. తరుణి! పూర్వానుభూతము దావకీన/గాఢకంపోత్తరస్వయంగ్రాహసుఖము
జ్ఞాపకము సేయుచు గుహావిసారితములు/కలచె, దలమున్కలై నన్ను ఘనరవములు. 20

తరుణి=యవ్వనవంతురాల, పూర్వ+అనుభూతము=ముందు+అనుభవింపబడిన, తావకీన=నీయొక్క, గాఢ+కంప+ఉత్తర+స్వయం+గ్రాహ+సుఖము=అధికమైన+వణుకుతో+నీ అంతట నీవే+కవుగలించుకొనుట

యందలి+సుఖము, గుహ్+విసారితములు+కలచె=గుహలో+వ్యాపించి+వ్యాకులపఱిచె, తలమున్కలై= మిక్కుటమై, ఘన+రవములు=మేఘ+ఘర్జనలు,

మ. చలిగాడ్పుల్ మునుముందు సూచకములై చన్దెంచె గన్మల్లవే
జలజాతాస్య! ఉపాంతవంజులవనచ్ఛన్నంబు లాలక్ష్యచం
చలకారండవచక్రవాకబకహంసక్రౌంచముల్ విస్ఫుటో
త్పలనాళీకపరాగధూసరితముల్ పంపాసరోనీరముల్. 21

జలజాతాస్య=పద్మముఖి, చన్దెంచె=చను+దెంచె, కన్మ+అల్లవే=చూడుము+అవే, ఉపాంత+వంజుల+వన+చ్ఛన్నంబులు=దగ్గగానున్న+ప్రబ్బలి+వనముచేత+కప్పబడినటు వంటి, ఆలక్ష్య+చంచల=దూరముచే చిన్నవిగాకనబడుచున్న+కదులు(ఈదు)తున్న, కారండవ+చక్రవాక+బక+హంస+క్రౌంచముల్=వివిధ పక్షులు(కన్నెలేడిపిట్ట+జక్కవపక్షి+నక్కుకొంగ+హంస+క్రౌంచపక్షి), విస్ఫుట+ఉత్పల+నాళీక+పరాగ+ధూసరితముల్=ప్రకాశించు+కలువల+తామరల+పుప్పొడులచే+బూడిదరంగు కలవిగా చేయబడిన,

క. దూరావతీర్ణమై ఇపు/డారని తృష నానుచున్నయట్లయ్యె, జుమీ!
ధీరనిమివంశరాజకు/మారిక! నా దృష్టి అచటి మధురోదకముల్. 22

ధీర+నిమివంశ+రాజ+కుమారిక=వీరులైన+నిమివంశపు+రాజు+కుమార్తె, దూర+అవతీర్ణమై=దూరము నుండి+దిగినందునలన, ఇపుడు+ఆరని+తృషన్=ఇప్పుడు+తీరని+దాహముచే, నా+దృష్టి=నా+చూపుల మాత్రముననే, మధుర+ఉదకముల్=తీయని+నీరు, ఆనుచున్న+అట్లు+అయ్యె=త్రాగుతు+ఉన్నట్లు+అనిపించెను, జుమీ=సుమీ,

వ దేవి! నాడు సుదూరాంతరవర్తిని వగు నీ పూర్వానుభూతనర్మచేష్టలను మనమున భావించుకొనుచు, నొక్కయెడనైనను గాలునిలుపక, పంపాతీర ప్రదేశముగలయ గ్రుమ్మరుచు, బరవసమునముక్కులతో నొండొకళ్ళ ఫలరస మిచ్చి పుచ్చికొనుచు మైమఱచిన చిలుకజంటలను, అవియుక్తములై అన్యోన్య దత్తోత్పలకేసరములై జాంపత్యస్నేహమును బరాకాష్ఠనొందించు రథాంగరమణీరమణులను, సకౌతుకమును సవిషాదమును సవితర్కమునుగా నుపలక్షింపుచు, నీ ధారావాహికసంస్మరణ ప్రవాహమున దేలియాడుచు, నిచ్చోట వృత్తస్తనాభిరామస్తబకాభినమ్రయైన యీ తటాశోకవల్లరిని చిరకాలావలోకిత పైన నీవ యను భ్రాంతి, నాలింగనముసేయ దమకించిన నన్ను, నాహృదయ నిర్విశేషుడు సౌమిత్రి సాంత్వనపూర్వకముగా నివారించె. 23

దేవి=రాణి, సు+దూరఅంతర+వర్తినివి=చాలా+దూరములో+ఉన్నదానివి, పూర్వ+అనుభూత+నర్మ+చేష్టలను=ముందు+అనుభవింపబడిన+పరిహాసపు+చేతలను, కాలు+నిలుపక=కాళ్ళు+ఆడక, కలయన్+క్రుమ్మరుచు=అంతయు+తిరుగుచు, అవియుక్తములై+అన్యోన్య+దత్త+ఉత్పల+కేసరములై=విడువ బడనిపై+ఒకరికొకరు+ఇచ్చుకున్న+కలువ+పుప్పొడులు కలవై, జాంపత్య=దాంపత్య, పరా+కాష్ఠ= అత్యంత+ఉత్కర్షము, రథాంగ+రమణీ రమణులను=చక్రవాక+జంటలను, స కౌతుకమును+సవిషాదము ను+స వితర్కమునుగాను+ఉపలక్షింపుచు=సంతోషముతో+విచారముతో+సంశయముతో+చూచుచు, ధారావాహిక+సంస్మరణ+ప్రవాహమున+తేలియాడుచు=ఎడతెగక ప్రవహించు+జ్ఞాపకముల+వెల్లువలో+ కొట్టుకొని పోవుచు, వృత్త+స్తన+అభిరామ+స్తబక+అభి+నమ్రయైన=గుండ్రపు+వక్షోజములవలె+అందముగా ఉన్న+పూగుత్తులచేత+ఎదురుగా+వంగియున్న, తట+అశోక+వల్లరిని=వడ్డునఉన్న+అశోక+లతను, చిరకాల+అవలోకితపైన=చాలకాలమునుండి+కనబడనిదానపైన, నీవ=నేవే, భ్రాంతి=భ్రమచే, తమకించిన=త్వరపడిన, నా+హృదయ+నిర్విశేషుడు=నా+మనస్సుతో+వేఱుకానివాడగు, సాంత్వన+పూర్వకముగా+నివారించె=ఓదార్పువచనములు+ముందుగాచెప్పి+ఆపెను.

చ. మఱువగరాని దా స్థలము, మానిని! నా కది, చూడుమట్లు ని
న్నరయుచు వచ్చివచ్చి నిరు డచ్చట నే కనుగొంటి, గాదె! నీ
అరుణపదారవిందవిరహార్తివశంబున నేమొ మూగయై
ఒఱపుదొఱంగి నేలబడి యుండిన నీ కుడికాలి యందియన్. 24

మానిని=అభిమానము కలదానా, అరయుచు=వెతుకుతు, నిరుడు=క్రిందటిసంవత్సరము, నీ+అరుణ+పద+అరవింద=నీ+ఎఱ్ఱని+పాదములనే+కమలములందు, విరహ+ఆర్తి+వశంబున=విరహముచే పొందిన+బాధచే+వివశతచే, మూగయై=నీ పాదముల కదలికలేక రవళించక మూగవోయిన, ఒఱపున్+తొఱంగి=ఒప్పు +విడచి,

శా. ఏ మార్గంబున నిన్ను నెత్తికొని పోయెన్ నాడు లంకేశ్వరుం,
డా మార్గంబును జూపె నీ లతలు నా కప్వేళ నుద్యద్దయా
సామీచీన్యనతప్రవాళకలికాశాఖాకరవ్యాపృతిన్,
భామా! నాడు గ్రహింపజాల నయితిన్ దన్మూకనిర్దేశమున్. 25

భామా=స్త్రీ, ఉద్యత్+దయా+సామీచీన్య+నత+ప్రవాళ+కలికా+శాఖా+కర+వ్యాపృతిన్=పుట్టుచున్న+కృపచే+నమస్కారము చేయునట్లు+వంగిన+చిగురులు+మొగ్గలుకల+కొమ్మలనెడు+చేతుల+ఉంచు ప్రయత్నముచే, తన్+మూక+నిర్దేశము=వాటి+మౌనముగా+నిర్ణయపూర్వకముగా చెప్పబోవునది,

చ. హరిణకుటుంబినుల్ సయిత మప్డు కుశాంకుర నిర్వ్యపేక్షలై
దరియగ బోయినట్టి నను, దావకగత్యనభిజ్ఞ జూచి స
త్వరముగ నోగచూపులను దక్షిణదిక్కుకు ద్రిప్పియుంచె, చె
ల్వరో! గరుపాటు నా యొడలు వాని అహేతుక హార్దమెంచినన్. 26

చెల్వరో=అందమైనదానా, హరిణకుటుంబినుల్=ఆడులేళ్ళు, కుశ+అంకుర+నిర్+వ్యపేక్షలై=దర్భ+చివర లందు+లేని+శ్రద్ధతో, దరియగన్=దగ్గరకు, తావక+గతి+అనభిజ్ఞ+చూచి=నీవు+వెళ్ళిన మార్గము+తెలియని నన్ను+చూచి, నోగ=వాలు, త్రిప్పి+ఉంచె=తిప్పి+దారిచూపునట్లు అలాగే ఉంచినవి, గరుపాటు+నా+ఒడలు=రోమాచితమగును+నా+శరీరము, అహేతుక+హార్దము+ఎంచినన్=నిష్కారణ+స్నేహము+తలచిన,

తే. అదిగో! చూడు విమానమందు ప్రేలు/జాళువాకింకిణుల నాద మాలకించి
నిన్నెదుర్కొన గాబోలు నింగి కెగసె/చారుశీల! గోదావరీసారసములు. 27

చారుశీల=ఒప్పైనగుణములుకలదాన, ప్రేలు+జాళువా+కింకిణుల=ప్రేలాడు+బంగారు+చిరుగంటల, నాదము+ఆలకించి=శ్రోత+విని, నింగికి+ఎగసె=ఆకాశమున+ఎగిరె, సారసములు=సారసపక్షులు,

క. కన నోచితి మిన్నాళ్లకు/వనితామణి! మరల బంచవటి నిద్దఱమున్
కనులు చరితార్థములుగా/మనంబు లానందరసనిమగ్నంబులుగా. 28

వనితామణి=స్త్రీ రత్నమా, చరితార్థము=సఫల ప్రయోజనమై, ఆనంద+రస+నిమగ్నంబులు=సంతోష+సారములో+మునిగినట్టుగా,

క. చేరెడు కన్నుల వేడుక/మూరింబోవగ విమానమును గనుగొను ఆ
సారంగకిశోరము లం/భోరుహముఖి!, నాకు నీకు బుత్రీకృతముల్. 29

అంభోరుహ+ముఖి=పద్మ+ముఖి, చేరెడు+కన్నుల+వేడుక+మూరింబోవగ=విశాలమైన+కన్నులకు+పండుగ+ఒఱిగింప, సారంగ+కిశోరము=జింక+పిల్లలు, పుత్రీకృతముల్=పిల్లలుగా పెంచబడినవి,

చ. కడు సుకుమారి వయ్యు గసుగందుల కోరిచి రెండుసంజలన్
కడవల దెచ్చి తెచ్చి నునుగౌ నసియాడ నీరువోసి నీ
పెడయని మక్కువం బెనుప నేచిన యా ఎలమావిగున్నలన్,

పడతుక! కంటె నేటికిని బంచవటిం దనరించు నెంతయున్. 30

పడతుక=ఇంతి, కసు+కందులకు=బాధకు+ఎట్టిగాకందుటకు, రెండుసంజలన్=ఉదయము సాయంకాలము , నునున్+కౌనున్+అసి+ఆడ=సన్నని+నడుము+అల్పముగా+ఊగ, ఎడయని+మక్కువంబు+ఎనుపన్+ ఏచిన=తొలగని+ప్రేమతో+కలిపి+పెంచిన, ఎల+మావి+గున్నలన్=లేత+మామిడి+మొక్కల, తనరించు= వర్ధిల్లు,

ఉ. ధీరగజేంద్రయాన! గుఱుతించితివే, మన ఆకుటింటి వా
నీరగృహంబు? మున్నచట నిద్దురపోదును గాదె! గౌతమీ
తీరవనీమృగవ్యమున ద్రిమ్మరి వచ్చి, శిరంబు నీదు రం
భోరువుమీద జేర్చికొని యూర్మిసమీరగతశ్రముండనై. 31

ధీర+గజేంద్ర+యాన=గంభీరమైన+ఏనుగుకువంటి+నడకకలదాన, వానీర+గృహంబు=నీటిప్రబ్బలి చెట్ల+ ఇల్లు, గౌతమీ+తీర+వనీ+మృగవ్యమున+త్రిమ్మరి=గోదావరి+గట్లమీది+అడవులందు+వేటకై+తిరిగి, రంభోరువు=తొడపై, ఊర్మి+సమీర+గత+శ్రముండనై=తరంగములపైనుండివచ్చు+గాలిచే+తీరిన+అలసట కలవాడనై,

శా. భీమ భ్రూకుటి చేతసే నహుషు దింపెం గ్రింది కెవ్వాడు సు
త్రామస్థానమునుండి, పంకమయపాథఃశుద్ధిమూలం బెవం
డామిత్రావరుణాంశసంభవున కత్యాదిత్యతేజస్వికిన్
భౌమస్థానపరిగ్రహం, బిదిగో! లోపాముద్రతో బాటుగన్. 32

భీమ భ్రూకుటి=భయము పుట్టించు+కనుముడి, నహుషు=నహుషుడను రాజును. సుత్రామ+స్థానము నుండి=ఇంద్ర+పదవి నుండి, పంకమయ+పాథః+శుద్ధి+మూలంబు+ఎవండు=వర్షాకాలమున బురదతో నిండిన+నదీజలమునకు+ఏ మునిపేరిటి నక్షత్రము పుట్టి శరదృతువున నిర్మలత్వమునకు+కారణమైన వాడు+ఎవ్వడో, ఆ+మిత్రావరుణ+అంశ+సంభవునకు=అట్టి+మిత్రావరుణుని+వంశములో+పుట్టిన అగస్త్యముని, అతి+ఆదిత్య+తేజస్వికిన్=అధికమైన+సూర్యుని+ప్రకాశముకలవానికి, భౌమ+స్థాన+ పరిగ్రహంబు+ఇదిగో=భూమిపై+నివాసస్థలముగా (ఆశ్రమముగా)+స్వీకరించినది+ఇదే, లోపాముద్ర= అగస్త్యుని భార్య,

తే. ఆజ్యగంధిలమై విమానాయనము స/మాక్రమించిన తపసి త్రేతాగ్ని జనిత
ధూమమును మూర్కొని రజోవిధూతమయ్యె/ఎంతో! తేలికపడియె నా అంతరాత్మ 33

ఆజ్య+గంధిలమై=హవిస్సుగా అగ్నిలో వేసిన వస్తువుల+వాసనతోకూడి, విమాన+అయనము+సమాక్రమించిన=మన విమాన+మార్గమున+క్రమ్మిన, త్రేతాగ్ని=మూడు అగ్నులలోని, ధూమమును+మూర్కొని=పొగను+ఆఘ్రాణించి, రజో+విధూతమయ్యె=రజోగుణము+పోగొట్టబడినది, తేలికపడియె=రజోగుణము పోవుటచే ఆరోగ్యవంతమైనది,

సీ. హృద్యమై అనవద్యవాద్యగోష్ఠి అదృష్ట/జనమైన ఇచ్చోట వినగ వచ్చె,
కతము విన్మది శాతకర్ణిమునీంద్రు పం/చాప్సరోనామవిహారసరసి,
జలదాంతరాలక్ష్యశశిబింబమై తోచు/ద్రుమపరీవృతమై సుదూరమునకు,
మెలగె బూర్వము మృగావళుల గూడిఅతండు/ప్రత్యగ్రదర్భాంకురైకవృత్తి,
తరుణి! తుదకా నిరాబారి తత్ సమాధి/భయవికలుడైన సురపతి పన్నినట్టి,
హారిపంచాప్సరోయౌవనాభిధేయ/కూటబంధమునం దగుల్కొనియె నంట. 34

తరుణి=యవ్వనవంతురాల, హృద్యమై=మనసుకింపై, అనవద్య+వాద్య+గోష్ఠి=శ్రేష్ఠమైన+వాద్యముల+సల్లాపము, అదృష్ఠ జనమైన=జనులు కనబడని, కతము+విన్ము=కారణము+వినుము, అది=ఆ కనపడునది, విహార+సరసి=వినోదసంచార+సరస్సు, జలద+అంతర+అలక్ష్య+శశి+బింబమై+తోచు=మేఘముల+మధ్య+కనీకనబడు అట్లుగా+చంద్ర+బింబమువలె+కనబడు చున్నది, ద్రుమ+పరీ+వృతమై=చెట్లచే+ఎక్కువగా+చుట్టబడినందు వలన, సుదూరమునకు=విమానము నుండి చూసువారికి, మెలగె=ఉండెను, మృగ+ఆవళుల=జింకల+సమూహముతో, ప్రత్యగ్ర+దర్భ+అంకుర+ఏకవృత్తి=లేత+దర్భల+చివరలు+మాత్రమే+ఆహారమైన ప్రవృత్తితో, నిరాబారి=ముని, తత్+సమాధి+భయ+వికలుడైన=వాని+తపస్సు+భయముచే+బెదిరిన, సురపతి=ఇంద్రుడు, పన్నినట్టి=పన్నాగముచేసిన, హారి+పంచ+అప్సర+యౌవన+అభిధేయ+కూట+బంధమునం+తగుల్కొనియెను=మనోహరమైన+ఐదుగురి+అప్సరసల+యవ్వనమను+పేరుగల+కపట+చెఱ+చిక్కుకొనెను, అంట=అనిచెప్పుదురు,

మ. సలిలాంతర్హితకేళిసౌధమున నా సంభోగశృంగారదో
హలు రాగాంబుధి దేల్చుచున్ జెవులు వట్టాడించు గీర్వాణకాం
తల, సంగీతమృదంగఘోషము వియన్మార్గంబు బ్రాపించి, కో
మలి! వైమానికచంద్రశాలికలలో మార్మోగు సుశ్రావ్యమై. 35

కోమలి=చక్కనిదానా, సలిల+అంతర్హిత+కేళి+సౌధమునన్=నీటిలో+మఱుగబడి ఉండిన+క్రీడా+మందిరము నుండి, ఆ+సంభోగ+శృంగార+దోహలు=వారి+సంగమ+శృంగారపు+కోరికపూర్తి ఉత్సాహముతో, రాగ+

అంబుధిన్+తేల్చుచున్=అనురాగ+సముద్రమున+ఓలలాడించుచూ, చెవులు+పట్టి+ఆడించు=చెవులకు+ఆకట్టుకొని+చలింపచేయు, గీర్వాణ+కాంతల=దేవతా+స్త్రీల-అప్సరసల, ఘోషము=ధ్వని, వియత్+మార్గంబున్+ప్రాపించి=ఆకాశ+వీధిని+చేరగా, వైమానిక+చంద్రశాలికలలో=మన విమానపు+చంద్రకాంత శిలానిర్మాణములందు, మార్మోగు=ప్రతిధ్వనించుచున్నవి, సుశ్రావ్యమై=బాగావినఇంపై,

క. ధీరుడు నిరహంకారుడు/చారుస్మిత! చూడు మితడు శమదమగుణవి

స్తారుడు సుతీక్ష్ణుడనగా/పేరొకముని తీక్ష్ణతపము పెంపున గ్రాలున్. 36

చారుస్మిత=అందమైన నవ్వు కలదానా, ధీరుడు=నిర్వికారుడు, నిరహంకారుడు=దేహ ఇంద్రియములందు నేను అను అభిమానములేనివాడు, శమదమగుణవిస్తారుడు=అంతర బాహ్య ఇంద్రియముల నిగ్రహము బాగాకలవాడు, తీక్ష్ణ=ఎక్కుడు, పెంపున=ఔన్నత్యమున, క్రాలున్=ప్రవర్తిల్లు,

క. పేలాదియేడు లయ్యెను/ హేలావతి! ఈ యతాత్ము డేధవదనల

జ్వాలలు నాల్గిటి నడుమన్/ఫాలంతపతపనుడై తపంబుండు నిటన్. 37

హేలావతి=విలాసిని, యత+ఆత్ముడు=నిగ్రహించిన+మనస్సు కలవాడు-ముని, ఏధవత్+అనల+జ్వాలలు+నాల్గిటి+నడుమన్=ఏకాగ్రతతో+అగ్ని+జ్వాలలు+నాలుగు(త్రేతాగ్నులు మూడు, అగ్నిస్వరూపు డైన తన్ను కలిపి నాలుగు)+మధ్య, ఫాల+అంతప+తపనుడై=నుదుటి+భాగముననున్న+సూర్యుడు ఉన్నట్టు ఉండువాడై, తపంబుండు=తపస్సు చేయుచుండు,

చ. వలపు బిసాళిచూపులును, వంకలుపన్ని వపుర్విలాసముల్

వెలువడజేయుటల్ సొలపులేనగవుల్ మొదలైనవెన్నియో

చెలువపుపేల్పుముద్దియల చిట్టకముల్ కొఱగానిచేతలై

చలనవిహీనమయ్యె దృతి శక్రుడు భీతిల నీ తపస్వికిన్. 38

వలపు+బిస+అళి=వగలొలికి+పేడెక్కించి+మత్తెక్కించు, వంకలు+పన్ని=కుత్సితపు+పన్నుగడ చేసి, వపుర్+విలాసముల్+వెలువడన్+చేయుటల్=శరీర+శృంగారచేష్టలు+ప్రదర్శన+చేయుచుండుట, సొలపు+లే+నగవుల్=పారవశ్యము కలిగించు+చిఱు+నవ్వులు, చెలువపు+పేల్పు+ముద్దియల=అందమైన+దేవతా+స్త్రీల-అప్సరసల, చిట్టకముల్=శృంగారచేష్టలు, కొఱగాని+చేతలై=ప్రయోజనములేని+పనులై, చలన+విహీనమయ్యె=చిత్తవికారము కలిగింప+లేని వయ్యె, దృతి=ఆతని ధృఢతకు, శక్రుడు=ఇంద్రుడు,

చ. నిలువుగ బాహులెత్తి జపనిష్ఠితుడైన ఇతండు లేత ద

ర్భలు చిదుమంగ, బోషితకురంగకుమారుల వీపు గోకగా

అలయని అక్షదామవలయాంచితదక్షిణబాహు విప్డు నా
వలనికి ద్రిప్పెజూడు, వరవర్ణిని! గౌరవసూచకంబుగన్. 39

వరవర్ణిని=శ్రేష్టమైన శరీరకాంతి కలదానా, జప+నిష్ఠితుడైన=తపస్సు+నియమములోనున్న, చిదుమంగ= గిల్లుటకు, పోషిత+కురంగ+కుమారుల+వీపు+గోకగా+అలయని=పెంచుతున్న+జింక+పిల్లల+వీపు+ ఆత్మీయతతో రాయుట+శ్రమ అనుకొనని, అక్షదామ+వలయ+అంచిత+దక్షిణబాహువు=జపమాల లైన రుద్రాక్షలు+హస్తకటకముగా+ఉండిన+కుడిచేయితో, ఇప్డు+నా+వలనికి+త్రిప్పె=ఇప్పుడు+నా+వైపుకు+ తిప్పెను,

తే. ఇతడు వాచంయముడు గాన నేను మ్రొక్క/చిఱుశిరఃకంపమున దాని స్వీకరించె
పుష్పకవ్యవధానవిముక్తమయిన/దృష్టి రవిమీద మరల గేంద్రీకరించె. 40

వాచంయముడు=మౌనవ్రతము కలవాడు, చిఱు+శిరః+కంపమున=చిన్నగా+తల+ఊపుటచేతనే, పుష్పక +వ్యవధాన+విముక్తమయిన=విమానముకలిగించిన+సూర్యునికిఅడ్డగింత+విడువగా, రవి=సూర్యుని, కేంద్రీకరించె=లగ్నముచేసె,

ఉ. ఆ కనుపించుచున్న దొక యాశ్రమ మచ్చట బెద్దకాల మ
వ్యాకులు డాహితాగ్ని శరభంగు డభంగురసత్రసంగుడై,
స్తోకనతాంగి! ఆహుతులతో ననలుం బరితృప్తు జేసి హ
వ్యీకరణం బొనర్చె దుది స్వీయశరీరము మంత్రపూతమున్. 41

స్తోక+నత+అంగి=అల్పముగా+వంగిన+అంగములుకలస్త్రీ, అవ్యాకులుడు=కలతపొందనివాడు, ఆహితాగ్ని= నిత్యాగ్నిహోత్రుడు, అభంగుర+సత్ర+సంగుడై=ఆటంకములేని+యాగములందు+ఆసక్తి కలవాడై, ఆహుతు లతో=హోమద్రవ్యములతో, అనలుం=అగ్నిదేవుని, హవ్యీకరణంబు+ఒనర్చెన్+తుది+స్వీయ శరీరము= హవిస్సుగా+సమర్పించెను+ఆఖరకు+తనశరీరమునే, మంత్రపూతమున్=మంత్రముచేత+పవిత్రమైనట్టిది,

తే. నిర్వహించుచునున్నవి నేడు కూడ/అతని అతిథిసపర్య తత్సుతుల రీతి
ఛాయలన్ బాటసారుల శ్రమము దీర్చి/స్వాదుసంభావ్యఫలము లా పాదపములు. 42

తత్+సుతుల+రీతి=వాని+పిల్లల+వలె, చాయలన=తమనీడచేత, స్వాదు+సంభావ్య+ఫలములు= రుచికరములై+గౌరవించు+తమపండ్లచే, ఆ+పాదపములు=అక్కడి+చెట్లు, నిర్వహించు=సలుపు

సీ. అభ్రంకషంబైన ఆలపోతు విధాన/అగుపించు నదిగో! శృంగాగ్రలగ్న

ఘనవప్రపంకమై, కలికి! ధారాస్వనో/ద్గారి భూరి దరీముఖంబు చూడు!
పర్వత మిది నీకు బరిచితపూర్వము/చిత్రకూటము, సమీక్షించుకొనుము!
తన వింతసొబగుచే మునువోలె మనదృష్టి/బంధించుచున్నది, బంధురాంగి!
అదియె మందాకినీ నది అద్రి యఖుత/అలసవిమలప్రవాహమై, హంసగమన!
దవ్వులం జూడ గనిపించె దనుతరముగ/ధరణి మెడలోని ముత్యాల సరము వోలె. 43

కలికి=మనోజ్ఞురాల, బంధురాంగి=రమ్యమైన+అంగములు కలదానా, హంసగమన=హంసవంటి నడక కలదాన, అభ్ర+అంకషంబైన=ఆకాశమును+తాకుచున్నట్లున్న, ఆలవోతు+విధాన=ఆబోతు+వలె, శృంగ +అగ్ర+లగ్న+ఘన+వప్రపంకమై=కొండ+శిఖరమున+తగులుచున్న+మేఘములతో నిండిన+కైవారముతో, ధారా+స్వన+ఉద్గారి+భూరి+దరీ+ముఖంబు=జలధారల+ధ్వని+వెలువరించు+పెద్ద+తీరము+ముందర, సమీక్షించుకొనుము=సూక్ష్మముగా చూడుము, సొబగు=అందము, మునువోలె=మనము అక్కడ ఉన్నప్పుడువలె, అద్రి+అఖుత=కొండ+సమీపమున, అలస+విమల+ప్రవాహమై=మందముగా+స్వచ్ఛమైన +నీటితో ప్రవహించునదై, దవ్వుల=దూరముగా, తనుతరముగ=మరీ చిన్నదిగా, సరము=మాల,

తే. మగువ! ఆ కొండ మీది తమాల, మదిగొ!/చేయుచుంటిని దాని లేజిగురు తెచ్చి
మొగలిరేకుల నేలు కపోలపాళి/బొలుపు తళుకొత్త నీ కర్ణభూషణముగ. 44

మగువ=ఇంతి, తమాలము=క్రానుగుచెట్టు, లే+చిగురు=లేత+చిగురుటాకులు, మొగలిరేకులన్+ఏలు= మొగలిరేకుల+శాసించు-తక్కువచేయు, కపోల+పాళిన్=చెక్కిలి+అంచుల, బొలుపు=ఒప్పు,

ఉ. మొసల కేగుదెంచితిమి, ముద్దియ! అత్రి మహర్షి పాదవి
న్యాసపునీతమైన మహితాశ్రమ మల్లది ధర్మదేవతా
వాస, మపుష్పలింగఫలబంధితరూల్లసితం, బనిగ్రహ
త్రాసవినీతసత్త్వము నిదర్శన మమ్ముని యోగశక్తికిన్. 45

ముద్దియ=ముగ్ధ, మొసలకు=మొగసాలకు-దగ్గరకు, పాద+విన్యాస+పునీతమైన=పాదములు+ఉంచుటచే+ పవిత్రమైన, వాసము=నివాసము, అ పుష్పలింగ+ఫలబంధి+తరు+ఉల్లసితంబు=పుష్పముల నిమిత్తము లేకనే+పండ్లుపండునట్టి+వృక్షములతో+ప్రకాశించునది, అ నిగ్రహత్రాస+వినీత+సత్త్వము=దండన భయము లేనిదైనను+వినయముకల+జంతువులు, నిదర్శనము=దృష్టాంతము, అమ్ముని=ఆ మునియొక్క,

మ. వనజాతేక్షణ! దాని పజ్జ బ్రవహింపం జేసె నా విందు మా
అనసూయాసతి తాపసాభిషవకార్యార్థంబు, సప్తర్షి పా

వనహస్తోద్ధృతహేమపద్మను, నిజాంభఃస్నాతృపాపౌఘనో
దనపారీణ, ననంగఘస్మరశిరోదామంబు దివ్యాపగన్. 46

వనజాతేక్షణ=పద్మాక్షి, పజ్జ=చేరువ, నాన్+విందుము=ఆవిధముగా+వినుదుము, ఆ+అనసూయా+సతి= ప్రశస్థి చెందిన+అనసూయ+పతివ్రత, తాపస+అభిషవ+కార్య+అర్థంబు=తాపసులు+పవిత్ర స్నానము+ చేయు+కొఱకై, సప్తర్షి+పావన+హస్త+ఉద్ధృత+హేమ+పద్మను=సప్తఋషుల+పవిత్రమైన+చేతులతో+ కోయబడు+బంగారు+పద్మములుకల, నిజ+అంభః+స్నాతృ+పాప+అఘన+ఓదన+పారీణను=తన+నీట+ స్నానముచేసిన+పాపుల+పాపముల+కడుగుటయందు+సిద్ధహస్తను, అనంగ+ఘస్మర+శిరో+దామంబు =మన్మధుని+చంపిన శివుని+తలపై+పూలదండ, దివ్య+ఆపగన్=దేవతల+నదిని-గంగను

తే. ధ్యాననిష్టితులగుచు వీరాసనముల/ఋషులు కూర్చున్న యా వితర్దికల నడిమి
ద్రుమములును గూడ యోగాధిరూఢములటు/పొలచు జూడు!నివాతనిశ్చలము లగుట. 47

ధ్యాన+నిష్టితులు+అగుచు=ధ్యానమునందు+దీక్షపూనిన+వారై, వీరాసనము=పద్మాసనము, వితర్దిక= వేదిక, ద్రుమములు=చెట్లు, యోగ+అధిరూఢములు+అటు=యోగ+ఆసనములువేసినవి+వలె, పొలచు= ఉండె, ని వాత+నిశ్చలము=గాలిలేక+కదలికలులేనివై,

తే దేవి! అలనాడు నీవు ప్రార్థించుకొన్న/మఱ్ఱిచెట్టిది, శ్యామనామమున వెలసి
ఫలితమై యుల్లసిల్లె సపద్మరాగ/రమ్యమరకతమాణిక్యరాశి వోలె. 48

దేవి=రాణి, మఱ్ఱిచెట్టిది=అన్యగ్రోధముఅనుమఱ్ఱిచెట్టు, వెలసి=ప్రసిద్ధికెక్కి, ఫలితమై=నీకోరిన కోరికలుతీరగా, ఉల్లసిల్లె=వికసించెను, సపద్మరాగ+రమ్య+మరకత+మాణిక్య+రాశివోలె=అరుణవర్ణముకల+అందమైన కాంతులొలుకు+మరకతములు+మాణిక్యములుకల+కుప్పవలె,

సీ. అంతరాంతరముల హరినీలములు చేర్చి/గ్రుచ్చిన ముత్యాల కోవ కరణి,
ఇందీవరముల నెడబెట్టి కట్టిన/తళుకొత్తు దెలిదమ్మి దండ మాడ్కి,
కాదంబసంసర్గకలితమై రవణించు/ప్రియమానసాండజశ్రేణి పగిది,
కృష్ణాహిభూషణోత్కీర్ణమైన మహేశు/రక్షాంగరాగవిగ్రహము భంగి,
నడుమనడుమ బరిఛ్ఛిన్ననభము దోప/మలయు పరిశుభ్రశరదభ్రమాల లీల,
ఉవిద! పేర్వేఱు తావుల నొప్పు మిగిలె/కనుముయమునోర్మిలం గూడి గాంగలహరి. 49

ఉవిద=భార్య, అంతరాంతరముల=మధ్యమధ్యలో, హరి+నీలములు=ఇంద్ర+నీలమణులు, కోవ+కరణి= హారము+వలె, ఇందీవరములను+ఎడన్+పెట్టి=నల్లకలువ పువ్వులను+మధ్యలో+పెట్టి, తెలి+తమ్మి+దండ

=తెల్ల+తామరపువ్వుల+దండ, కాదంబ+సంసర్గ+కలితమై+రవణించు=మేఘముల+సంపర్కము+వొంది+ఒప్పైన, ప్రియ+మానస+అండజ+శ్రేణి+పగిది=ప్రియమైన+మానస సరోవరపు+హంసల+వరుస+వలె, కృష్ణ+అహి+భూషణ+ఉత్కీర్ణమైన+మహేశు+రక్ష+అంగరాగ+విగ్రహము+భంగి=నల్లకాల+సర్పము+అలంకారమై+పైకిచిమ్ముచున్న+శివుని+రక్షణకలిగించు+భస్మము+పూసుకొన్న+దేహము+వలె, పరిచ్ఛిన్న+నభము+తోప=దాపబడిన+ఆకాశము+కనుపింప, మలయు+పరి+శుభ్ర+శరద+అభ్ర+మాల+లీల=మలయ మారుతముచే+బాగా+శుద్ధి పఱపబడిన+శరత్కాల+మేఘ+మాల+విధముగా, వేర్వేఱు+తావులన్+ఒప్పు+మిగిలె=ఒక్కొక్క+చోటుల ఒక్కొకలా+అందము+మీరె, కనుము+యమున+ఊర్మిలం+కూడి+గాంగ+లహరి=చూడుము+నల్లని యమునా నది+అలల పరంపరలు+కలిసిన+తెల్లనిగంగా+నదిని

వ. మరియు నొక్కచోట గాలాగురుకల్పిత మకరికాపత్త్రరచనతోడి చందనద్రవవిలిప్తవితర్దికాతలము
తెఱగున, మఱొక్కచోట విరళచ్ఛాయావిలీనాంధకారముతో శబలితమైన కౌముదీలహరి లాగున,
సర్వత్ర తిలతండులన్యాయమున మనోఽభిరామమై యున్నది, పరికింపుము. **50**

కాల+అగురు+కల్పిత+మకరికాపత్ర+రచనతోడి=నల్లని+అగురు+వ్రాయబడిన+మకరికా పత్రములతో+సృష్టించిన రేఖలతో, చందన+ద్రవ+విలిప్త+వితర్దికా+తలము+తెఱగున=శ్రీ చందన+రసముతో+ముగ్గులు రాయ బడిన+మేడ ముందరి అరుగు+సమ ప్రదేశము+వలే, విరళ+చ్ఛాయా+విలీన+అంధకారము తో+శబలిత మైన+కౌముదీ+లహరి+లాగున=విశాలమైన+నీడ ప్రదేశములందు+మఱుగుపడు+చీకట్లలో +బూడిద వర్ణముగా మారిన+వెన్నెల+ప్రవాహము+వలె, సర్వత్ర తిలతండుల న్యాయమున=అంతటా నువ్వులు బియ్యము కలిసియుండినట్లు(కలిసి ఉన్ననూ వేఱుపఱుప సాధ్యమగును), మనోఽభిరామమై =మనోజ్ఞమై, పరికింపుము=పరీక్షించుము,

చ. జలనిధి రాణివాసముల సంగమ మిచ్చట గ్రుంకులిడ్డ ని
ష్కలుషులకున్ కృతాత్ములకు, జానకి! వారొక ధర్మచింతకున్
దలకొన లేకపోయినను, తత్త్వవిచారము సేయమానినం
గలుగవు దేహబంధములు కాయము బాసిన మీద క్రమ్మఱన్. 51

జలనిధి+రాణివాసముల+సంగమము=సముద్రము+రాణులైననదులతో+కలిసిన ప్రదేశము, క్రుంకులిడ్డ=మునకలిడిన, నిష్కలుషులకున్=కలుషము లేనివారికి, కృతాత్ములకు=మనసు ఆధీన పరచుకున్న వారికి, తలకొన=యత్నింప, తత్త్వ విచారము సేయమానినం=తత్వ చింతన చేయుట మానిననూ, దేహ

బంధములు=మరల శరీరము ధరించుట, బాసిన=విడచిన, క్రమ్మఱన్=మఱల,

చ. పొలతి! నిషాదనాయకుని ప్రోలదె, చూడుము! దానిచెంత నే
దలపయి మానికంబు దిగద్రావి జడల్ ముడువంగ జూచి అ
గ్గలమగు శోకవేగమున "గైకరో! నీ యభిలాష లన్నియున్
ఫలితము లయ్యె నే" డనుచు బాగుగ నేడ్చె సుమంత్రుడయ్యెడన్. 52

పొలతి=స్త్రీ, నిషాదనాయకుని+ప్రోలదె=బోయల దొరయైన గుహుని+స్థానము, మానికంబున్+తిగద్రావి=రత్నము-కిరీటము+పరిత్యజించి, అగ్గలమగు=అతిశయమగు,

సీ. ప్రభవ మే నదికి వైశ్రవణపత్తనవధూ/పరిభుక్తసలిలంబు, బ్రహ్మసరిసి,
అమరు నేయేఱు పుణ్యశ్లోకు లిక్ష్వాకు/మానవేంద్రుల రాజధాని నొరసి,
ఏ యేటి జలము బుణ్యీకరించిరి పూర్వు/లశ్వమేధావభృథాప్లుతముల,
కావించు నేయేటి కాల్వల నీరు మా/మాగాణముల నదీమాతృకములు,
మాకు, సైకతోత్సంగసమాశ్రయులకు/తత్పయోవర్ధితుల కయోధ్యాపతులకు,
తన్వి! ఏ యేఱు సామాన్యధాత్రి యయ్యె/అట్టి సరయూతరంగిణి, అదిగొ! చూడు. 53

తన్వి=పలుచనిదేహముకలస్త్రీ, ప్రభవము=పుట్టుక, వైశ్రవణ+పత్తన+వధూ+పరిభుక్త+సలిలంబు=కుబేరుని+పట్టణపు(అలకాపురి)+యక్షస్త్రీలచె+చక్కగా అనుభవింపబడిన+నీరుకల, బ్రహ్మ+సరసి=మానస+సరోవరము, అమరును=పొందికపడు, పుణ్యశ్లోకులు+ఇక్ష్వాకు+మానవేంద్రుల=పుణ్యము కలిగించు కీర్తికల+రఘువంశ+రాజుల, రాజధాని=అయోధ్య, ఒరసి=రాచుకొని, ఏటి=నది, పుణ్యీకరించిరి=పవిత్రము చేసిరి, పూర్వులు+అశ్వమేధ+అవభృథా+ప్లుతముల=మాపూర్వులు+అశ్వమేధ యాగము+ముగించిన తర్వాత చేయు+స్నానములకై+మునుగుటచే, కావించును=ఫలవంతముచేయు, మాగాణముల=పల్లపు భూముల, నదీ+మాతృకములు=నదియొక్క+కుమారస్వామికి పాలిచ్చిన సప్తమాత్రుకలవలే పారు కాలువలు, సైకత+ఉత్సంగ+సమాశ్రయులకు=ఇసుక తిన్నెల+ఒడిఅందు+ఆశ్రయించిన, తత్+పయః+వర్ధితులకు+అయోధ్యా+పతులకు= దాని+నీటిచే+పెంపబడిన+అయోధ్యాపుర+రాజులకు, సామాన్య+ధాత్రి+అయ్యె=అందరిని సమానముగా పెంచు+దాది+అయునది,

తే. తన విభుని గోలుపోయి మా జనని వోలె/కలగి ఈ సరయువు వనాగతుని నన్ను
నెయ్యమున గౌగిలించినట్లయ్యె నాకు/శిశిరపవనాపదేశవీచీకరముల. 54

విభుని=భర్తను, మా+జనని=మా+తల్లి కౌసల్య, కలగి=వ్యాకుల పడి, వన+ఆగతుని=అరణ్యము నుండి+వచ్చుచున్న, నెయ్యమున=ప్రేమతో, శిశిర+పవన+అపదేశ+వీచీ+కరముల=చల్లని+గాలి+వ్యాజ్యమున+సుఖముకలిగించు+చేతుల,

ఉ. జేగుఱురంగు ధూళి నెగసెన్ వినువీథికి, జూచితే! పురో
భాగమునందు దట్టముగ వాయుతనూభవువల్ల నాదు ప్ర
త్యాగమనం బెఱింగి చతురంగచమూయుతుడై మదీయ సు
స్వాగతభాషిగా, నెదురువచ్చెనొ! మా పెదతమ్ము డుగ్మలీ! 55

ఉగ్మలి=ఇంతి, జేగుఱు+రంగు+ధూళిన్+ఎగసెన్=ఎఱ్ఱమట్టి+రంగు+దుమ్ము+ఎగురుచున్నది, పురో+భాగమునందు=పట్టణ+స్థలమందు, వాయుతనూభవు=హనుమంతుని, ప్రత్యాగమనంబు= మరలి వచ్చుట, చమూ+యుతుడై=సైన్య+సమేతుడై,

సీ. వాడె పదాతియై వచ్చె మా భరతుడు/చీరవాసుడు జటాజినధరుండు,
గురుదేవు ముందిడుకొని అర్ఘ్యపాణియై/పరిమితవాహినీపరిజనముగ,
కాచి యొప్పించె లక్ష్మణుడు నిన్నలనాడు/ఖరుని జక్కడచిక్రమ్మఱిన నాకు,
ప్రతిసమర్పించు బాలితసంగరునకు నా/కనవద్య రమను నే డనుజు డితడు,
తరుణుడై యుండియును గురుదత్త యైన/అంకగత యైన రాలచ్చి నంటి యెఱుగ
డకట! మదపేక్షియై చేసె నామెతోడి/తీవ్రతరమైన ఖడ్గధారావ్రతంబు." 56

పదాతియై=నడచుకొనుచు, చీర+వాసుడు=నారచీర+ధరించినవాడు, జట+అజిన+ధరుండు=జడలు+చర్మము+ధరించినవాడు, గురుదేవు+ముందు+ఇడుకొని=కుల గురువు-వశిష్ఠుని+ముందుగా+ఉంచుకొని, అర్ఘ్య+పాణియై=కాళ్ళుకడుగునీళ్ళు పూజా ద్రవ్యముల+చేతిలోకలవాడై, పరిమిత+వాహినీ+పరిజనముగ=తక్కువగా+సైన్యము+సేవకులు తీసికొని, కాచి+ఒప్పించె=రక్షించి+నాకు ఒప్పగించె, నిన్ను+అలనాడు=నిన్ను(సీతను)+అరణ్యములో అప్పుడు, చక్కడచి+క్రమ్మఱిన=చంపి+మరలి వచ్చు, ప్రతి+సమర్పించు=తిరిగి+ఇచ్చు, పాలిత+సంగరునకు=నెరవేర్చిన+వాగ్దానము కలవాడు, అనవద్య+రమ=నిందలేని+రాజ్య లక్ష్మిని, తరుణుడై=యుక్తవయస్కుడై, గురు+దత్త+ఐన=తండ్రిచే+ఇవ్వబడినది+అయి, అంక+గత+ఐన+రా+లచ్చిని=ఒడిని+చేరినది+అయిన+రాజ్య+లక్ష్మిని, అంటి+యెఱుగడు=తాక+నేఱడు, మత్+అపేక్షియై=నా+కొఱకు, తీవ్రతరమైన=మిక్కిలి కష్టమైన, ఖడ్గ+ధారా+వ్రతంబు=కత్తి+పదునుపై ఉండిచేయు+నడవడి (సామెత: వాడి కత్తితో నాలుకపై రాయుట),

వ. అని అవరోహణార్థియై విరమించిన దాశరథిజ్యేష్ఠుని మనోగతమును దేవతాప్రబోధమున నెఱింగికొని, అవ్విమానరాజము భరతానుగులైన ప్రకృతిజనులు కనుబొమ్మ లెత్తి సాద్భుతంబును, సకౌతుకంబు నుగా విలోకింప, మెఱపు మెఱసిన తెఱగున కళాంతరములోన నేల వ్రాలెను. 57

అవరోహణార్థియై=విమానము దిగకోరి, విరమించిన=సీతతో చెప్పుమాటలు ఆపిన, మనోగతము= ఉద్దేశము, దేవతా ప్రబోధమున=దైవజ్ఞానముచే, భరత+అనుగులైన+ప్రకృతి+జనులు=భరతుని+వెంటవచ్చు+ మంత్రులు ప్రజలు, స అద్భుతంబును=ఆశ్వర్యముతోడ, స కౌతుకంబును=వేడుకతో, విలోకింప=చూచు చుండగా, కళ+అంతరములోన=మరుక్షణములో(కళ=540 ఱెప్పపాట్ల కాలము),

తే. అపుడు సేవావిదగ్ధులై యాదరమున/ప్లవగవిభుడు కరావలంబనము నొసగ
దారిచూపించుచుండగ దనుజవిభుడు/యానముననుండి రఘునాథు డవతరించి, 58

సేవా+విదగ్ధులై=శుశ్రూష అందు+నేర్పరులై, ప్లవగ+విభుడు=కోతులకు+రాజైన-సుగ్రీవుడు, కర+ అవలంబనమును+ఒసగ=చేతి+ఊత+అందించ, దనుజ+విభుడు=రాక్షస+రాజు-విభీషణుడు, యానము= వాహనము-విమానము, అవతరించి=దిగి,

సీ. అత్యంతభక్తి సాష్టాంగమ్ముగా మ్రొక్కె/ఇక్ష్వాకుకులదేశికేశ్వరునకు
వేర్వేఱ తదితరవిప్రసత్తములకు/చేసె ప్రణామముల్ చేతులెత్తి
అర్ఘ్యంబు జేకొని అక్కున గదియించె/అనుజన్ము నియమకృశావయవుని
ప్రమదాశ్రులవముల పరిహృతరాజ్యాభి/షేకమైన తదీయ శిరము దడిపె
శ్మశ్రువులు మట్టియూడల మాడ్కి బెరిగి/వికృతముఖులైన ఆ నమ్రవృద్ధమంత్రి
వరుల వార్తానుయోగసంభాషణమున/కరుణ నినుపారు చూపున గారవించె. 59

ఇక్ష్వాకు+కుల+దేశిక+ఈశ్వరునకు=రఘు+వంశమునకు+గురు+దేవునకు-వశిష్ఠునికి, విప్ర+సత్తములకు= బ్రాహ్మణ+శ్రేష్ఠులకు, అక్కునన్+కదియించె=గుండెలపై+చేర్చె, నియమ+కృశ+అవయవుని=రామునివలే నిగ్రహము పాటించుటచే+చిక్కిన+దేహము కలవాని, ప్రమద+అశ్రు+లవముల=సంతోషపు+కంటినీటి+ బిందువుల, పరిహృత+రాజ్య+అభిషేకమైన=పరిహరించిన+రాజ్య+పట్టాభిషేక కిరీటమైన, తడిపె=అశ్రులచే చెమ్మగిల్లచేసె, శ్మశ్రువులు=గడ్డములు మీసములు, నమ్ర=గౌరవముతో వంగిన, వార్త+అనుయోగ+ సంభాషణమున=కుశలము+అడుగు+మంచి మాటలచే, నినుపారు=పైకుబుకు, గారవించె=గౌరవించె,

సీ. దుఃఖమునందు బంధువు నాకు సర్వర్క్ష/కీశవల్లభుడు సుగ్రీవు డితడు,
ఆజి నన్ను పురఃప్రహర్తయై గెలిపించె/చారుశీలుడు విభీషణు డితడు,

మమ్ము శోకాబ్ధిపారమ్ము నొందించిన/అనవద్యచరితుడు హనుమ ఇతడు,

కడిది రావణు శక్తి బడిన సౌమిత్రికి/ప్రాణప్రదాత సుషేణు డితడు,

నిపుణమతి సేతునిర్మాత నీలు డితడు/అని కృతమెఱింగి వేర్వేఱ నన్న తనకు

పరిచయముసేయ వరుస నందఱకు మ్రొక్కె/పరమబహుమానభరితుడు, భరతుడెలమి 60

సర్వ+ఋక్ష+కీశ+వల్లభుడు=ఎల్ల+భల్లూకములకు+వానరులకు+ప్రభువు, ఆజి=యుద్ధమున, పురః+ప్రహర్తయై=ముందుగా+దూకునట్టివాడై, చారుశీలుడు=మంచి నడతకలవాడు, శోక+అబ్ధి+పారమ్ము=దుఃఖ+సముద్రము+దాటుట, అనవద్య=నిందలేని, కడిది=ఆపదకరమైన, కృతము ఎఱింగి=చేసిన మేలు+తెలియజేసి, పరమ+బహుమాన+భరితుడు=ఉత్కృష్ట+గౌరవము+నిండిన, ఎలమి=ప్రేమతో,

ఉ. అంతట లక్ష్మణుం దఱిసి ఆతని నమ్రశిరస్కు మాండవీ

కాంతుడు లేవనెత్తి ఎసకంబున గౌగిట గ్రుచ్చియెత్తె, దు

ర్దాంతసురేంద్రజిత్పటుశరవ్రణకర్కశ తత్ప్రభూతదో

రంతరపీరిచే, తన భుజాంతర మెంతయు బీడితంబుగన్. 61

తఱిసి=సమీపించి, నమ్ర+శిరస్కు=వంచిన+శిరస్సుకలవాని-నమస్కరించిన, మాండవీ కాంతుడు=భరతుడు, ఎసకంబున=ఉద్రేకముతో, దుర్దాంత+సురేంద్రజిత=నిగ్రహింపరాని+ఇంద్రజిత్తు యొక్క, పటు+శర+వ్రణములచే+కర్కశ+కఠినమైన=దిట్టమైన+బాణములుచేసిన+గాయములచే+మొద్దు బారిన, తత్+ప్రభూత+దోరంతర+పీరిచే=వాని+నిడుద+బాహువులమధ్య+భాగముచే, భుజాంతరము=ఱొమ్ము, పీడితంబుగన్=రుద్దబడి బాధితము అగునట్లు,

క. హరివీరు లంత సీతా/వరునాజ్ఞ మనుష్యరూపవపులై సమద

ద్విరదాధిరూఢులై చని/రురుతర శైలాధిరోహణోల్లాసమునన్. 62

హరి=వానర, మనుష్య+రూప+వపులై=మనుషుల+శరీరము+తాల్చినవారై, సమద+ద్విరద+అధిరూఢులై=మదించిన+ఏనుగులు+ఎక్కినవారై, ఉరుతర+శైల+అధిరోహణ+ఉల్లాసమునన్=బాగాపెద్ద+కొండలు+ఎక్కు+సంతోషముతో,

క. ఇభఘటల వెనుక నసుర/ప్రభుడును సానుప్లవముగ పంక్తిశతాంగ

ప్రభావానుశిష్టుడై, అ/త్యభిరామరథోపవిష్టుడై పయనించెన్. 63

ఇభ+ఘటల=ఏనుగుల+కుంభస్థలముల, అసురప్రభుడు=రాక్షస+రాజు-విభీషణుడు, స అనుప్లవముగ=అనుచరులతోకూడి, పంక్తి శతాంగ+ప్రభావ+అనుశిష్టుడై=దశ రథునికి+జనించిన రామునిచే+చక్కగా+

ఆజ్ఞాపింపబడినవాడై, అతి+అభిరామ+రథ+ఉపవిష్టుడై+పయనించెన్=ఎక్కువ+అందమైన+రథముపై+కూర్చుండినవాడై+బయలుదేఱెను.

ఉ. భ్రాతృయుగానుషంగమున గ్రమ్మఱ గామగమైన యా కన
త్కేతువిమాన మెక్కి రఘుకేతువు లోలతటిద్విశోభి దో
షాతనమేఘబృందమున సౌమ్యబృహస్పతియోగదృశ్యుడౌ
శీతమరీచి వోలె, విలసిల్లుచు వీటికి బోయె జయ్యనన్. 64

భ్రాతృ+యుగ+అనుషంగమున=తమ్ములు+ఇద్దరతో+కూడి, కామగమైన=కోరిక ప్రకారము పోనునది, కనత్+కేతు=ప్రకాశించుచున్న+జెండాకల, రఘు+కేతువు=రఘు+శ్రేష్ఠుడు, లోల+తటిత్+విశోభి+దోషాతన+మేఘ+బృందమున=చంచలమైన+మెఱపుచేత+బాగా అలంకరింపబడిన+రాత్రి సమయపు+మబ్బుల+గుంపులోని, సౌమ్య+బృహస్పతి+యోగ+దృశ్యుడౌ+శీతమరీచి+వోలె+విలసిల్లుచు=బుధుడు+బృహస్పతుల+కలయకచే+చూడదగ్గ+చంద్రుని+వలె+ప్రకాశించుచు, వీటికి=ఇంటికి, చయ్యనన్=శ్రీఘ్రముగా,( విమానము, రాముడు, సీత, భరతుడు, లక్ష్మణుడు వరుసగా వారికి ఉపమానములు: మేఘములు, చంద్రుడు, మెరుపు, బుధుడు, బృహస్పతి).

సీ. విశ్వంభరునిచేత విలయార్ణవమునుండి/ఉద్ధరింపగబడ్డ యుర్వియనగ,
శారదాగమముచే వారిదావరణంబు/వలనబాసిన చంద్రకళ యనంగ,
సమ్యగ్గురూపదేశమున మోహతమోని/రస్త యైన ప్రబోధరమ యనంగ,
తొలిమేనిపున్నెంబువలన బావురుపిల్లి/తొలగిపోయిన రామచిలక యనగ,
రాక్షసేశ్వరు చెఱనుండి రాఘవేంద్రు/వలన విడివడి వికసితవదనయగుచు
అచట గనిపింప భరతు డత్యధిక భక్తి/వదినె కొనరించె బాదాభివందనంబు. 65

విశ్వంభరుని=సర్వముభరించు విష్ణుని, విలయ+అర్ణవము=ప్రళయకాల+సముద్రము, ఉద్ధరింపగన్+పడ్డ+ఉర్వి+అనగ=రక్షింప+పడిన+భూదేవి+అనునట్లు, శారద+ఆగమముచే=శరత్కాలము+వచ్చుటచే, వారిద+ఆవరణంబు=మేఘములు+ఆఛ్ఛాదనము, వలనన్+పాసిన=ప్రమాదము+తప్పిన, చంద్ర+కళ+అనంగ=చంద్రుని+కాంతి+అనునట్లు, సమ్యక్+గురు+ఉపదేశమున=సరియైన+గురువు+హితబోధచే, మోహ+తమో+నిరస్త+ఐన=అజ్ఞానపు+చీకటి+విడువబడినది+అయినట్టి, ప్రబోధ+రమ+అనంగ=జ్ఞాన+లక్ష్మి+అనునట్లు, తొలిమేని+పున్నెంబు=పూర్వజన్మ+పుణ్యము, బావురుపిల్లి=గండుపిల్లి(చిలుకకు శత్రువు), వికసిత+వదన=పుష్పమువలె వికసించిన+ముఖముకలదైన,

మ. దనుజేంద్రప్రణిపాతభంగధృఢనాథవ్రత్యసందీప్తమై
పనితంబైన యయోనిసంభవ పదద్వంద్వంబు, జ్యేష్ఠానువ
ర్తనసన్నిష్ఠజటాధరుండయిన యద్ధర్మాత్ము మూర్ధంబు, ని
ట్లనుషంగస్థితి గాంచి, కాంచె నతిలోకాన్యోన్యపావిత్ర్యమున్. 66

దనుజేంద్ర+ప్రణిపాత+భంగ=రావణుని+(కోరికతీర్చమనిప్రార్ధనాపూర్వక)ప్రణామమును+నిరసించు, ధృఢ+నాథవ్రత్య+సందీప్తమై=నిచ్చలమైన+పతివ్రతా నిష్ఠచే+ప్రకాశింప చేయబడినదై, పనితంబైన+అయోని+సంభవ+పద+ద్వంద్వంబు=పొగడదగ్గట్టు+భూమినుండి+పుట్టిన సీత యొక్క+పదముల+జంట, జ్యేష్ఠ+అనువర్తన+సత్+నిష్ఠ+జటా+ధరుండయిన+అద్ధర్మాత్ము+మూర్ధంబును=అన్న రాముని+అనుసరించుచూ+మంచి+నిశ్చయముతో+జటాజూటము+ధరించిన+ఆ ధర్మాత్ముడైన భరతుని+శిరస్సును, ఇట్లు+అనుషంగ+స్థితి+గాంచి=ఆవిధమైన+సంబంధ+ఔచిత్యము+చూచి, కాంచెన్+అతిలోక+అన్యోన్య+పావిత్ర్యమున్=దర్శించె+పారలౌకికమైన+పరస్పర+పావనత్వము,

చ. పతగకులంబు గూడులకు బర్వులుతీయు తఱిన్ స్వలంకృత
ప్రతిగృహమైన జన్మనగరంబును డాయగవచ్చి పార్థివీ
పతి, డిగి నాటి రేయి విడిపట్టుగ నిల్చె, గనిష్ఠసోదర
ప్రతివిహితోపకారికల, బట్టణబాహ్యవనాంతరంబునన్. 67

పతగ+కులంబు=పక్షుల+గుంపు, తఱిన్=వేళ, స్వ+అలంకృత+ప్రతిగృహమైన+జన్మ+నగరంబును+డాయగ+వచ్చి=ప్రజలు తమంతట తామే+అలంకరించినట్టి+స్వంత ఇంటికి సమానము+అయిన+తను పుట్టిన+పట్టణము-అయోధ్యను+చేర+వచ్చి, పార్థివీ+పతి=పృథ్వితనయసీత+పతి-రాముడు, డిగి=విమానము దిగి, విడిపట్టుగ+నిల్చె=విడిదిగా+నిలచెను, కనిష్ఠ+సోదర+ప్రతివిహిత+ఉపకారికల=ఆఖరి+తమ్ముడుశత్రుఘ్నునిచే+వేయించబడిన+గుడారముల, పట్టణ+బాహ్య+వన+అంతరంబునన్=అయోధ్య+వెలుపలి+ఉద్యానవనము+మధ్యలో,

# చతుర్దశ సర్గము సీతాపరిత్యాగము

తే. పతి వియోగంబునకు గుంది పాలబడిన/బల్లివిధమున బడుగలై పట్టుమ్రాను
తెగనఱుక మూలబడినట్టి తీవలైన/తల్లులను చూచి రచ్చట దాశరథులు. 1

కుంది=చింతించుచూ, బడుగలై=కృశించినవారై, పట్టుమ్రాను=అల్లుకొన్న చెట్టుమొదలు, మూలబడినట్టి=చెడిన,

వ. చూచి, యథాక్రమమున ఉభయులు ఉభయులకు అభివాదములు చేసిన, అద్దేవీద్వయము పేరు మోసిన జెట్టిబిరుదులయిన తమ కన్నకడుపుల మెడలు పట్టి కౌగిలించుకొని తమ ఉమ్మలికమును త్రవ్వికొని శోకము వెల్లిగొన ఎలుగెత్తి ఏడ్చి యేడ్చి, పదంబడి కుమారులు సముచితముగ తమ్ము సంబోధించి యూరార్ప, ఎట్టకేలకు మాని కడలుకొను కన్నీటి తెరలలో కొడుకుల నంత విస్పష్టముగ కనుగొనలేక, పటీరరసతుషారమైన తదీయగాత్రస్పర్శనమున అనిర్వచనీయమైన ఆనందము డెందమున అనుభవించిరి. 2

యథాక్రమమున=తమతమ తల్లులకు ముందుగా, ఉభయులు=రామలక్ష్మణులు, ఉభయులకు=కౌసల్య సుమిత్రలకు, అభివాదము=నమస్కారము, ద్వయము=జంట, జెట్టి+బిరుదులయిన=శూరులు అని+ప్రఖ్యాతులైన, ఉమ్మలికము=సంతాపము, త్రవ్వికొని=ప్రస్తావన తెచ్చుకొని, వెల్లిగొన=అతిశయింప, ఎలుగెత్తి =గొంతెత్తి, పదంబడి=మఱియు, సముచితముగ=తగినవిధముగా, సంబోధించి=బాగా తెలియచెప్పి, ఊరార్ప =ఊఱడింప, ఎట్టకేలకు=చివరకు, కడలుకొను=ఉప్పొంగు, విస్పష్టముగ=బాగా తెలియునట్లు, పటీర+రస+తుషారమైన=చందన+పూతరసముచే+చల్లనైన, గాత్ర+స్పర్శనమున=శరీర+స్పర్శజ్ఞానమున తెలిసికొని, డెందమున=హృదయములో,

తే. సమధికానందజాశ్రువు చల్లబఱచె/వారి శోకజాశీతబాష్పమును, ముంచి
ఉష్ణతప్తగంగాసరయూజలమును/ధరకు దిగిన హిమాద్రి నిర్ఝరము వోలె. 3

సమ+అధిక+ఆనంద+జ+అశ్రువు=బాగా+ఎక్కువైన+ఆనందము చేత+పుట్టిన+చల్లనైన కన్నీరు, శోక+జ+అశీత+బాష్పమును=ఇంతవరకు దుఃఖముచే+పుట్టు చుండెడి+చల్లవి కాని-వేడి+కన్నీటిని, ముంచి=కప్పివేసి , ఉష్ణ+తప్త=వేసవి ఎండకు+వేడెక్కినట్టి, ధరకు+దిగిన+హిమాద్రి+నిర్ఝరము+వోలె=భూమిపైకి +దిగిన+మంచుకొండ నుండి ప్రవహించు+చల్లనినీరు+విధముగా,

వ. కౌసల్యాసుమిత్రలు, రామలక్ష్మణుల గాత్రముల మీది నైరృతశస్త్రప్రహారజన్యములైన పచ్చిపుండ్లు తమ కడుపుల గాయములు గాకుండని, అంపపు కోతగీయ, వాని గరతలముల తడవి చూచి విమనస్కలై, క్షత్రియకులాంగనల కెంత అత్యంత గర్వకారణమైనను, వీరసూశబ్ద మనీప్సనీయమనియె భావించిరి. 4

గాత్రముల=శరీరముల, నైరృత+శస్త్ర+ప్రహార+జన్యములైన=రాక్షసుల+ఆయుధపు+దెబ్బలచే+పుట్టిన, కడుపుల+గాయములు+కాకుండని=తమతమకడుపులో+దెబ్బలు+పడక పోయుననూ, కరతలముల+ తడవి=అరచేతుల+తాకిచూచి, విమనస్కలై=వ్యాకుల పడినవారై, గర్వకారణము+ఐనను=రాజులకు శత్రువులు చేసిన ఎన్నిగాయములున్న అంత ప్రతాపవంతులని గౌరవము+అయునప్పటికి, వీరసూ+ శబ్దము=వీర మాత+అనుమాట, న+ఈప్సనీయము+అనియె+భావించిరి=కోరదగ్గది కాదని+అని+ఎంచిరి,

క. "పెనిమిటి నిడుమల ముంచిన/వనితను, సీతాఖ్య గలుగు బహుదౌర్భాగ్యన్"
అని సీత యెఱగె నప్పుడు/తనయత్తల కేకభక్తితాత్పర్యమునన్. 5

ఇడుమల=ఆపదల, ఎఱగె=నమస్కరించె, ఏక+భక్తి+తాత్పర్య మునన్=సత్యమైన+భక్తి+తత్పరతతో,

ఉ. "లెమ్ము కుమారి! నీవలన లే దొక తప్పును నీ విశుద్ధ వృ
త్తమున, గాదె! నీమగడు తమ్ముడు, దాను దురంతమైన దుః
ఖమ్ము ధరింపగల్గె" నని గాదిలికోడలి సానురాగస
త్యమ్ములు వాక్కులం బలికి, రక్కున జేరిచి అత్త లిద్దఱున్. 6

విశుద్ధ+వృత్తమున=పవిత్రమైన+జీవనముచే, దురంతమైన=అంతము లేని, ధరింప=భరింప, గాదిలి= కూర్మి, సత్యమ్ములు+వాక్కులం=మంచి+మాటలు, ఆక్కున=ఱొమ్మున,

వ. అంతట జననీజనానందాశ్రుజలముతో సమారబ్ధమయిన శ్రీ రఘువంశకేతుని రాజ్యాభిషేకమును, జాంబూనదకుంభసంభృతమైన తీర్థాహృత పవిత్రతోయముతో, వృద్ధపురోహితామాత్యులు సమీచీనముగ నిర్వర్తించిరి. సరిత్సముద్రసరోవరములకు పనివిని లంకాసంగ్రామమిత్రులు రక్షఃకపీంద్రులు, కొనితెచ్చిన పావనోదకము, శ్రీ వసిష్ఠకరావర్జితమై, ధారాధరోత్పన్న వారిధార వింధ్యాద్రిశృంగము పయిం బలె గాకుత్ స్థుని మూర్ధముపై బడియె. 7

జననీ+జన+ఆనంద+అశ్రు+జలముతో=తల్లుల+ప్రజల(జననీజన=ఇద్దరుతల్లుల)+ఆనంద+బాష్పములతో, సమారబ్ధమయిన=మొదలుపెట్టబడిన, కేతుని=శ్రేష్ఠుని, జాంబూనద+కుంభ+సంభృతమైన+తీర్థ+ఆహృత+ పవిత్ర+తోయముతో=బంగారు+కలశముల+సిద్ధము చేయబడిన+పుణ్య తీర్థములనుండి+చక్కగా తేబడిన+

పావన+జలముతో, సమీచీనముగ+నిర్వర్తించిరి= ఔచిత్యముగా+నెఱవేర్చిరి, సరిత్+సముద్ర+సరోవరము లకు=గంగ ఆదినదులకు+సప్త సముద్రములకు+మానసవంటి సరస్సులకు, పనివిని=ఆజ్ఞాపింపబడి, పావనోదకము=పవిత్ర జలము, వసిష్ఠ+కర+ఆవర్జితమై=వసిష్ఠుని+చేతులనుండి+విడువబడినదై, ధారాధర +ఉత్పన్న+వారి+ధార=మేఘములనుండి+పుట్టిన+నీటి+పరంపర, వింధ్య+అద్రి+శృంగము=వింధ్య+పర్వ తపు+శిఖరము, మూర్ధము=తల,

తే. స్వాత్త్వికం బైన తపసివేసమున గూడ/అతితరప్రేక్షణీయుడై అలరె నెవడు,
ఆ రఘువతంసమునకు రాజాధిరాజ/వేషజాభిఖ్య, పునరుక్తదోషమయ్యె. 8

స్వాత్త్వికంబైన=సత్వగుణముకల, అతి+తర+ప్రేక్షణీయుడై=బాగా+అధిక+దర్శనీయుడై, అలరె= ప్రకాశించె, వతంసమునకు=సిగబంతి-శ్రేష్ఠునికి, వేష+జ+అభిఖ్య=అలంకారముచే+కలిగిన+ప్రకాశము, పునరుక్త+ దోషము+అయ్యె=మరలచెప్పుటఅను+వాక్యదోషము+కలిగినదయ్యె,

సీ. నిబిడమంగళతూర్యనిర్ఘోషపరితోషి/తాబాలవృద్ధ పౌరాకులంబు,
మందిరోద్గతపౌరమహిళాప్రవర్షిత/నవ్యలాజాంకఘంటాపథంబు,
తోరణభ్రాజితోత్తుంగసౌధశిఖాగ్ర/కీలితాంలంకార కేతనంబు,
కాశ్మీరజాలేపఘనసారరంగవ/ల్ల్యభిరామనివసనప్రాంగణంబు,
సమయసముచితశోభనసంవిధాన/సావధానప్రధానాతిసంభ్రమంబు,
పత్నితోడ ప్రవేశించె పట్టభద్ర/రాఘవేశ్వరు డన్వయరాజధాని. 9

నిబిడ+మంగళ+తూర్య+నిర్ఘోష+పరితోషిత=గట్టి+శుభప్రదమైన+వాద్యపు+మహాధ్వనిచే+మిక్కిలి సంతోషించు, ఆబాలవృద్ధ+పౌర+ఆకులంబు=బాలురనుండిముసలి+నాగరికులతో+నిండినది, మందిర+ ఉత్+గత+ పౌర+మహిళా+ప్రవర్షిత=సౌధముల+పై+ఉన్న+నగర+స్త్రీలచే+కురుపింపబడిన, నవ్య+లాజ+ అంక+ఘంటా పథంబు=క్రొత్త+పేలాల+గుర్తులుకల+రాజమార్గము, తోరణ+భ్రాజిత+ఉత్తుంగ+సౌధ+శిఖ+ అగ్ర+కీలిత+ అలంకార+కేతనంబు=పూలదండలచే+ప్రాకాశించు+ఎత్తైన+మేడల+మీద+ నాటబడిన+ అలంకరించిన+టెక్కె ములుకలది, కాశ్మీరజా+లేప+ఘనసార+రంగవల్లి+అభిరామ=ఎఱ్ఱని కుంకుమపువ్వు +అలది+తెల్లని కర్పూరపు+ముగ్గులతో+అందగించిన, నివసన+ప్రాంగణంబు=ఇండ్ల+ముంగిళ్ళు, సమయ+ సముచిత+ శోభన+సంవిధాన+సావధాన+ప్రధాన+అతిసంభ్రమంబు=ఆయాకాలములకు+సరియైన+ శుభప్రదమైన+ ఏర్పాట్లపనిఅందు+ఏకాగ్రత+ముఖ్యముగా ఉండుటచే కలిగిన+ఎక్కువవేగిరపాటు తనము, పట్టభద్ర=పట్టాభి షేకమునకు సిద్ధమైన, అన్వయ+రాజధాని=వంశ+రాజధాని అయోధ్యను,

వ. పురప్రవేశము సేయునప్పటి మహోత్సవమున, శ్రీరామభద్రునకు భరతుడు ముక్తాఫలప్రాలంబ మాలికలతోడి సితచ్ఛత్రము బట్టె, సౌమిత్రులిరువురు చంద్రికాధవళవాలవ్యజనములు వీచిరి, పావమాని పాదపద్మములు గొలుచుచు వచ్చె, సుగ్రీవాదివానరవర్గము, విభీషణప్రభృతి దానవవితానము, మగధకేకయకోసలులు, లోనుగాగల రాజలోకము, చతురంగబలములు, పరివేష్టించి నడచిరి. 10

ముక్తాఫల+ప్రాలంబ+మాలికలతోడి+సిత+చ్ఛత్రము=ముత్యాలు+వ్రేలాడు+దండలుకల+శ్వేత-తెల్లటి+ఆత పత్రము(మొదటి రాజలాంఛనము), చంద్రికా+ధవళ+వాల+వ్యజనములు+వీచిరి=వెన్నెలవలే+ తెల్లనైన+ గుబ్బపుతోక వెంట్రుకలతో చేసిన+చామరముతో (రెండవ రాజలాంఛనము)+విసరిరి, పావమాని= హనుమంతుడు, ప్రభృతి=మొదలైన, దానవ+వితానము=రాక్షస+సమూహము, లోనుగాగల=మొదలైన, పరివేష్టించి =చుట్టివచ్చి,

క. అపుడేకరథస్థితమై/నృపసూను చతుష్టయము వినిర్భరశోభన్
ఉపబృంహితమగు, సాక్షా/దుపాయ సంఘాత, మనగ ఒప్పెసలారెన్. 11

ఏక+రథ+స్థితమై=ఒకే+రథముపై+కూరుండి, చతుష్టయము=నలుగురు, వినిర్భర+శోభన్=సంపూర్ణమైన+ దీప్తితో, ఉప బృంహితమగు=చక్కగా వర్ధిల్లిన, సాక్షాత్=ప్రత్యక్ష, ఉపాయ+సంఘాతము+అనగ=సామ దాన భేద దండో పాయముల+సహవాసము+అనునట్లు, ఒప్పు+ఎసలారె=ప్రశస్తముగా+అతిశయించిరి,

వ. వివిధాలంకరణవిశోభితమై, సాకేతనగరము, పట్టాభిషేకమహోహూత్సవమను, మాధవేందిరకు లలితోద్యానవనమై సూర్యోదయ సమయకమలాకరము విధమున వికసించె. ప్రాసాద వాతాయనవినిర్గతకాలాగురుధూమరేఖ, వాయువశమున చెదురుమదురై, చిరప్రత్యాగతు డైన, రఘువల్లభుడు స్వహస్తములతో విప్పిన పుర శ్రీ పెన్నెఱివేణియై గోచరించె! 12

మాధవ+ఇందిరకు+లలిత+ఉద్యాన+వనమై=వసంత+లక్ష్మీ+సయ్యాటలాడుటకు వెడలు+తోటలోని+నివాస స్థలమై, కమలాకరము=తామరకొలను, ప్రాసాద+వాతాయన+వినిర్గత+కాల+అగురు+ధూమరేఖ=రాజ సౌధపు+కిటికీలనుండి+బయట వెడలు+నల్లని+అగరు+పొగల+సమూహము, వాయువశమున=గాలి వాటుకు, చిర+ప్రత్యాగతుడైన=చాల కాలమునకు+మరలివచ్చు, విప్పిన=విడతీసిన, పెను+నెఱి+వేణియై= గొప్ప+అందమైన+జడ అనునట్లు,

మ.ద్వి. శ్వశ్రూస్వనుష్ఠితచారుశృంగార/కలితయై, కాంచనకర్ణీరథమున,
వల్లభు వామపార్శ్వమున, వసించి/మస్పృణస్ఫురత్ ప్రభామండలమనగ 13

శ్వశ్రూ+స్వ+అనుష్ఠిత+చారు+శృంగార+కలితయై=అత్తగారు+స్వయముగా+చేసిన+అందమైన+అలంకారము+కలిగినదై, కాంచన+కర్ణీరథమున=బంగారపు+పల్లకిలో, వామ+పార్శ్వమున=ఎడమ+ప్రక్క, మసృణ+స్ఫురత్+ప్రభా+మండలము=మనోహరముగా+ప్రకాశించు+కాంతి+పుంజము,

మ.ద్వి. ఆనసూయము శాశ్వతాంగరాగమును/దాల్చి, కాంతుని వీట దన మనశ్శుద్ధి
కాన్పింప, పునరగ్నిగతయైన కరణి/రాజిల్లు సాధ్వి శ్రీరాముని పత్ని. **14**

ఆనసూయము=అనసూయాదేవిఇచ్చిన, శాశ్వత+అంగరాగమును+తాల్చి=చెదరకచిరకాలముండు+ఎట్టిని మైపూత కలపము+రాసుకొని, కాంతుని+వీట=భర్త+పట్టణములో, మనస్+శుద్ధి+కాన్పింప=మనస్సు యొక్క+స్వచ్ఛత+వెల్లడవు నట్లుగా, పునర్+అగ్ని+గతయైన+కరణి+రాజిల్లు=మరల+అగ్నిలో+ప్రవేశించి పునీతయైవచ్చిన+విధముగా+ప్రకాశించెను, సాధ్వి=పతివ్రత,

మ.ద్వి. తమ గేహజాలమార్గమున, దర్శించి/చేమోడ్చి, చల్లిరి, సీమంతవతులు
లలితముక్తాఫలమిళితాక్షతలను/బహుగంధలులితపుష్పప్రకాండమును. **15**

గేహ+జాల+మార్గమున=ఇండ్ల+కిటికీల+ద్వారా, సీమంతవతులు=ముత్తైదువులు, లలిత+ముక్తాఫల+మిళిత+అక్షతలను=మంచి+ముత్యాలు+కలిపిన+సేసలను, బహు+గంధ+లులిత+పుష్పప్రకాండమును =ఎక్కువగా+సువాసనలు+వెదజల్లు+శ్రేష్ఠమైన పువ్వులను,

తే. సపరిబర్హములైన వేశ్మములలోన/పరమసౌహార్దనిధి, సుహృద్వరుల నిల్పి,
చిత్రశేషము కరము పవిత్రమైన/తండ్రి యింట, దుఃఖమున రాముండు నిలిచె. **16**

స పరిబర్హములైన=స్వేతచ్ఛత్రాది రాజయోగ్య ఉపకరణములు పరివారము కలిగిన, వేశ్మముల= గృహము లలో, సౌహార్ద నిధి=మైతికి స్థానమైన రాముడు, సుహృత్+వరుల+నిల్పి=సుగ్రీవుడు విభీషణుడు మొదలగు మిత్ర +శ్రేష్ఠుల+విడిదిగాఏర్పాటుచేసి, చిత్రశేషము=పూజఅందుకొనుచిత్రపఠముగామిగిలిన,కరము=మిక్కిలి,

శా. "సత్యశ్రీనిధి యయ్యె పాలితప్రతిజ్ఞావాక్యుడంచున్ జగ
న్నుత్యౌన్నత్యము నొందె, స్వర్గసుఖమున్ జూఱాడె మాతండ్రి, నీ
కృత్యం బెంతయు, శ్లాఘనీయ"మనుచున్ కేల్మోడి చేయించె ల
జ్జాత్యాగంబును, కౌసలేయుడు సమాశ్వాసించి, పిన్నమ్మచేన్. **17**

సత్య+శ్రీ+నిధి=సత్యము అనెడు+సంపదకు+స్థానము, పాలిత+ప్రతిజ్ఞా+వాక్యుడు+అంచున్=నెరవేర్ప బడిన +ఇచ్చిన+మాట కలవాడు+అనుచు, జగత్+నుత+ఔన్నత్యము=లోకులు+కీర్తించు+గొప్ప తనము, చూఱాడె=కొల్లగొట్టె, నీ+కృత్యంబు+ఎంతయు+శ్లాఘనీయము+అనుచున్=నీవు+చేసినపని+మిక్కిలి+

పొగడదగినది+అనిబోధించి, లజ్జా+త్యాగంబును=తప్పుచేసాను అనుబిడియమునుండి+విడుదలను, సమాశ్వాసించి=నమ్మకము కలిగించి, పిన్నమ్మచేన్=కైకచే,

శా. ప్రేమోదాత్తమతిన్ విభీషణుని, సుగ్రీవున్, హనూమంతు, సం
గ్రామస్నిగ్ధుల నన్యులన్, సకలభోగప్రాప్తులం చేసి, చే
తోమోదంబున, గారవించె రఘునాథుం, డప్డు వారెల్ల ఇ
చ్ఛామాత్రోదితసిద్ధులై, సమధికాశ్చర్యంబునన్, దేలగన్. 18

ప్రేమ+ఉదాత్త+మతిన్=ప్రేమ+గౌరవము+కలమనస్సుతో, సంగ్రామ+స్నిగ్ధులన్+అన్యులన్=యద్ధ+స్నేహితులగు+మిగిలినవారిని, ప్రాప్తులం=పొందినవారిగా, చేతో మోదంబున=మనస్సులో సంతోషముతో, ఇచ్ఛ+మాత్ర+ఉదిత+సిద్ధులై=తలచినంత+మాత్రముననే+కలుగు+సమర్ధతకల దివ్య పురుషులైన వారైననూ, సమధిక+ఆశ్చర్యంబునన్=మిక్కిలి ఎక్కువైన+విస్మయముతో, తేలగన్=సంతోషించగా

చ. మునివరు లత్రికుంభభవముఖ్యులు తన్ననురక్తితో సభా
జన మొనరింప వచ్చి, కృతసత్క్రియులై, వివరింపగా, వినెన్,
తన భుజవిక్రమంబున కుదాత్తత దెచ్చు హతారివృత్తమున్,
జననతపోవిభూతిబలసత్త్వవిశేషసమన్వితంబుగన్. 19

అత్రి+కుంభభవ+ముఖ్యులు=అత్రి+అగస్యుడు+మున్నగువారు, తన్ను+అనురక్తితో+సభాజనము+ఒనరింప=తనను+ప్రేమతో+అభినందనము+చేయుటకు, కృతసత్క్రియులై=సత్కారముచేయబడినవారై, ఉదాత్తతన్+తెచ్చు=గౌరవము+కలిగించు, హత+అరి+వృత్తమున్=చంపబడ్డ+శత్రువు రావణుని+చరిత్రను, జనన+తపో+విభూతి+బల+సత్త్వ+విశేష+సమన్వితంబుగన్=వానిపుట్టుక+తపస్సు+మహత్వము+సత్తువ+వ్యక్తిత్వపు ప్రత్యేకతల+కూడుకొన్నదై,

వ. విని, వినతుడై సముచితముగ ఆమంత్రణము చేసిన అత్తపోధను లంతర్ధానము చేసిరి. సకల సుఖోపేతులగుట, అవిజ్ఞాతగతార్ధమాసులైన రక్షఃప్లవంగవీరులను, దాశరథి సీతాస్వహస్తోపహృతోపహారసమర్పణపూర్వముగ సంభావించి, స్వనగరములకు సస్నేహముగ, సాగనంపె. పంక్తికంధరునుండి, తజ్జీవితముతోబాటు హరించిన, నభఃపుష్పభూతమైన పుష్పకవిమానమును ఆత్మచింతాసులభముగ మగుడ గైలాసనాధుని వహింప బొమ్మనెను. 20

వినతుడై=వంగి నమస్కరించినవాడై, ఆమంత్రణము=సాగనంప, సకల+సుఖ+ఉపేతులు+అగుట=అన్ని+సుఖముల+కూడినవారు+అగుటచే, అవిజ్ఞాత+గత+అర్ధమాసులైన=తెలియకుండా+గడచిన+సగమునెల

గడిపినవారైన, రక్షః+ప్లవంగ=రాక్షస+వానర, సీత+స్వ+హస్త+ఉపహృత+ఉపహార+సమర్పణ పూర్వముగ= సీత+తన+చేతులతో+ఇయ్యబడిన+కానుకలు+ముందేఅందగా, సంభావించి=సత్కరించి, పంక్తికంధరు= రావణుడు, నభః+పుష్ప+భూతమైన=ఆకాశ+పుష్పమువలే ఆభరణ+ప్రాయమైన, ఆత్మ+చింతా+సులభ ముగ=తన+ఇష్ట+అనుసారముగా, మగుడ=వెనుకకు మరలివెళ్ళ, కైలాస నాధుని=కైలాసపు రాజైన కుబేరునివద్దకు(శివుడు కైలాసవాసి మాత్రమే)

 మ.ద్వి. తండ్రిపంపున చతుర్దశవత్సరములు/వనవాస మొనరించి, వచ్చి, ఈ రీతి
ప్రతిపన్నరాజ్యుడై రఘుకులస్వామి/ధర్మార్థకామవర్తనములందెట్లో, **21**

ప్రతిపన్న+రాజ్యుడై=తిరిగికైకొన్న+రాజ్యముకలవాడై, వర్తనము=ప్రవృత్తి,

మ.ద్వి. అవరజన్ములు, ముప్వురందు, దానట్లె/వ్యవహరించె సదా అవైషమ్యబుద్ధి,
రమ్యసద్గుణపుంజరారజ్యమాన/భువనుడై, పాలించె, భూయిష్ఠమహిమ. **22**

అవరజన్ములు=తమ్ములు, ముప్వురు+అందు=ముగ్గురుతమ్ముల(ధర్మఅర్థ కామములుఎట్లో)+అందున, అ వైషమ్య+బుద్ధి=కలిసి మెలిసిన+మనస్సుతో, రమ్య+సద్గుణ+పుంజర+ఆరజ్యమాన+భువనుడై= మనోహరమైన+మంచిగుణముల+రాశిచే+ఇంపైన+భూమికలవాడై, భూయిష్ఠ+మహిమ=అధిక+ గొప్పదనముతో,

 మ.ద్వి. అనురక్తి గొలిచె నాతడు/జనయిత్రుల నెల్ల సమరసప్రతిపత్తిన్,
మునుపు షడాననపీత/స్తనలగు కృత్తికల వేల్పు దళవాయి, వలెన్. **23**

జనయిత్రులన్+ఎల్ల=తల్లులను+అందరనూ, సమరస+ప్రతిపత్తిన్=సమానమైన అనురాగము+ గౌరవముతో, మనుపు=పూర్వము, షట్+ఆనన+పీత+స్తనలగు+కృత్తికల=ఆరు+ముఖములతో+త్రాగిన+ స్తనములుకల+కృత్తికమాతలను, వేల్పు+దళవాయి=దేవతల+సేనాధిపతి-కుమారస్వామి.

సీ. ప్రజల కల్మి కసూయ పడని యీవరి యౌట/అంతకంతకు విత్తవంతులైరి,
అంతరాయము లెల్ల నడచు కాపరి యౌట/పంతగించుచు క్రియావంతు లైరి,
తిరమైన నడవడి దిద్దు శాసకు డౌట/సాంతత్యమున తాతవంతు లైరి,
చింతమాన్పి సుఖింప జేయు వత్సలు డౌట/సంతానసాహిత్యవంతులైరి,
పతి సుత వియోగముల, ఈత్యుపద్రవముల/అహితసంక్షోభముల, నిష్ఠురామయముల,
శోకభయములు కల్లలై లోకు లెల్ల/భద్రసంధాయకుడు, రామభద్రువలన. **24**

కల్మికి=సంపదకు, ఈవరి=దాత, అంతరాయము=విఘ్నము, క్రియావంతులు=పని అందు పూన్కికలవారు, తిరమైన=స్థిరమైన, సాంతత్యమున=సంపూర్ణముగా, తాతవంతులైరి=పోషించుతండ్రి(రాముడు) కలవారైరి, వత్సలుడు=బిడ్డలపై ప్రేమవలె కలవాడు, సంతాన+సాహిత్యవంతులైరి=పిల్లల అందు+స్నేహము కలవారైరి, ఈతి+ఉపద్రవముల=ఈతిబాధల+హాని, అహిత=కోరదగని, సంక్షోభము=ఉపద్రవము, నిష్ఠుర+ ఆమయముల=కఠిన+రోగముల, కల్లలై=లేనివై, భద్ర+సంధాయకుడు=శుభములు+కలిగించువాడు,

చ. అవహితుడై సకాలమున ఆరయు నిత్యము పౌరకార్యముల్,
ప్రవిమలగృహ్యాజీవనపరాయణుడై, రమియించు, సంగమో
త్సవనిరతిన్, దదీయతనుసంశ్రయమందిన సింధురాజసం
భవ యనన దోచు రాగవతి మైథిలితో, రఘువర్యుడాదటన్. **25**

అవహితుడై=సావధానముకలవాడై, ఆరయు=తెలిసికొను, ప్రవిమల+గృహ్య+జీవన+పరాయణుడై= పరిశుద్ధమైన+గృహస్త+జీవనమందు+ఆసక్తుడై, రమియించు=క్రీడించు, సంగమ+ఉత్సవ+నిరతిన్=కూడ+ కోరికపుట్ట+అత్యంత ఆసక్తితో, తదీయ+తను+సంశ్రయమందిన=సీతాదేవి+శరీరమున+ఆశ్రయించిన, సింధు +రాజ+సంభవ+అనన్+తోచు=సముద్ర+రాజు+కుమార్తె-లక్ష్మీదేవి+అనునట్లు+కనబడు, రాగవతి= అనురాగము కలది, ఆదటన్=ప్రేమతో,

చ. సురుచిరవర్ణచిత్రపరిశోభితకేళినికేతనంబులన్,
సరస యథేష్టభోగముల సౌఖ్యరసాంబుధి దేలు ఆ వధూ
వరులకు, చిత్రదర్శనము వల్ల స్మరించిన యట్టి తొంటి దు
స్తరవనవాసకష్టములు సైతము, వేడుక లయ్యె, నయ్యెడన్. **26**

సు+రుచిర+వర్ణ+చిత్ర+పరిశోభిత+కేళి+నికేతనంబులన్=మంచి+మనోహరమైన+రంగుల+చిత్ర పఠములతో +మిక్కిలి ప్రకాశించు+క్రీడ+గృహములలో, సరస+యథా ఇష్ట+భోగముల+సౌఖ్య+రస+అంబుధిన్+తేలు= రసవత్తరమై+ఇష్ట ప్రకారము+అనుభవించిన+సుఖముల+ఆనందరసమనెడు+సముద్రమున+తేలియాడు, స్మరించిన=స్ఫురించి నట్టి, తొంటి+దుస్తర+వనవాస+కష్టములు+సైతము=పూర్వమనుభవించిన+దాట చాలని+అరణ్యవాస+కష్టములు+కూడా,

ఉ. మానితవిభ్రమస్ఫురణ మైథిలి అంత నలర్చె వల్లభున్,
నాన తొలంకు స్నిగ్ధనయనంబున, పాండురితాననంబునన్,
మేని వికర్శనంబున వినీలతరాగ్రకుచోల్బణంబునన్,

యానము మందతన్, తన అనక్షరశంసితదౌహృదంబునన్. 27

మానిత+విభ్రమ+స్ఫురణ=మన్నింపదగు+అతిత్వరచే అలంకారము తబ్బిబ్బుగా చేసికొనినట్లు+తోచుటచే, అలర్చె=అలరించె, నాన+తొలంకు+స్నిగ్ధ+నయనంబున=సిగ్గు+తొణకు+అందమైన+కండ్లతో, పాండురిత+ఆననంబునన్=పెల్ల బోయిన+ముఖముతో, మేని+వి+కర్శనంబున=శరీరము+బాగా+కృశించుటచే, వినీలతర+అగ్రకుచ+ఉల్బణంబునన్=బాగుగానల్లబడిన+స్థనచూచుకముల+మిక్కుటముచే, యానము+మందతన్=నడక+మెల్లన అగుటచే, న అక్షర+శంసిత+దౌహృదంబునన్=మాటలులేక+స్థిరపరుపబడిన+గర్భిణీలక్షణము(దౌహృదిని=రెండు హృదయములు కలది),

తే. నిర్భరానందయిత్రి నా గర్భగుర్వి/నంకగత జేసి, జ్ఞాతదోహదుడు ప్రియుడు,

లాలనాలాపముల పేడె చూలు కోర్కి/సిగ్గుతెర దీసి, చెలినోరు, చెవికి దార్చి. 28

నిర్భర+ఆనందయిత్రి=అధిక+సంతోషము కలిగించునది, గర్భగుర్వి=చూలుకలిగిన గర్భిణి, అంకగత=తోడపై కూర్చుండ, జ్ఞాతదోహదుడు=గర్భిణికి అభిలాష ఉండునని తెలిసినవాడు, లాలన+ఆలాపముల=లాలించు+మాటలతో, చూలు కోర్కి=చూలాలి కోరిక, చెలి+నోరు+చెవికిన్+తార్చి=ఆమె+నోరు+తనచెవిదగ్గరకు+చేర్చి,

మ. మమతం గాంతుడు గ్రుచ్చిగ్రుచ్చి యడుగన్, మందాక్ష మందాక్షర

ప్రమదారత్నము కొంకి కోరికొనియెన్, భాగీరథీతీర వ

న్యమృగాకీర్ణతపోవనంబుల పునర్వ్యాలోకనంబున్, తదా

శ్రమవైఖానసకన్యకాజన ముహుసాంగత్యసౌహిత్యమున్. 29

మమతం=ప్రేమతో, మందాక్ష=సిగ్గుతో, మంద+అక్షర=మెల్లని+పలుకులకల, ప్రమదారత్నము=స్త్రీ శ్రేష్ఠ, కొంకి=సంకోచించి, భాగీరథి=గోదావరి, వన్య+మృగ+ఆకీర్ణ+తపో+వనంబుల=అడవిలో+జంతువులతో+ఎడములేకనిండిన+తపసుల+ఆశ్రమముల, పునః+వి+ఆలోకనము=మరల+విశేషముగా+చూడగా, తత్+ఆశ్రమ+వైఖానస+కన్యకా జన=ఆ+ఆశ్రమందలి+ముని+స్త్రీల సముదాయముతో, ముహు+సాంగత్య+సౌహిత్యమున్=మరల+సన్నిహిత+స్నేహమును,

క. తదభీప్సిత మీడేర్చగ/మదిరాక్షికి, మాట యిచ్చి, మనుజేంద్రుడు స

మ్ముదితాయోధ్యను సదనము/తుది నిలువున నుండి కను కుతూహల మెసగన్. 30

తత్+అభీప్సితము+ఈడేర్చగ=ఆమె+కోరిక+తీర్చగ, సమ్ముదిత+అయోధ్యను=సంతోషముతో నిండిన+అయోధ్యాపట్టణమును, సదనము=రాజభవనము, తుది+నిలువున=పై+అంతస్తునుండి, ఎసగన్=అతిశయింప,

వ. ఎక్కి, సమస్తవస్తువిస్తారసమృద్ధములైన నిషద్యలను, యాతాయాతవాహనపదాతిచయ సమ్మర్దభరితములైన శృంగాటకములను, నౌకావిగాహ్యమానసరయువును, విలాసివిలాసినీ జనాధ్యుషితపురోపవనవాటికలను, తదితరవిచిత్రశోభావైభవములను, విలోకించి, మహోల్లాస మనుభవించి, 31

విస్తార+సమృద్ధములైన=విరివిచే+పుష్కలమైన, నిషద్యలను=అంగడివీధులను, యాత+ఆయాత+వాహన +పదాతి+చయ=వెళ్ళు+వచ్చు+వాహనముల+పాదచారుల+సమూహములచే, సమ్మర్ద+భరితములైన= త్రొక్కిసలాటచే+నిండిన, శృంగాటకము=నాలుగు వీధుల మొగ, నౌకా+విగాహ్యమాన+సరయువును= ఓడలు+సులభముగాప్రవేశించుచున్న+సరయూనదిని, అధ్యుషిత+పుర+ఉపవన+వాటికలను= కూర్చుండిన+నగర+ఉద్యానవన+స్థలములను, మహా+ఉల్లాసము=గొప్ప+సంతోషము,

తే. కలవె?జగమున గింవదంతులు మదీయ/వర్తనముగూర్చి యని, శుద్ధవర్తనుండు,
సర్పరాజోరుభుజు, డపసర్పవరుని/భద్రు బ్రశ్నించె, విజితారిభద్రు డతడు. 32

కింవదంతులు=జనవాక్యములు, శుద్ధ+వర్తనుండు=నిర్మల+నడవడికలవాడు, సర్పరాజ+ఉరు+భుజుడు= ఆదిశేషునికి తగునట్టి+పొడుపైన+బాహువులు కలవాడు, అపసర్ప+వరుని=గూఢచారులలో+శ్రేష్ఠుని, విజిత+అరి+భద్రుడు=జయింపబడ్డ+శత్రువులుకల+శ్రేష్ఠుడు,

తే. తఱిమి అడిగిన, ఆ వేగు వెఱచి చెప్పె/"నెరసు లెన్నరు జనులు మీ చరిత మందు,
రావణగృహప్రవాసిని రమణి దెచ్చి/ఏలుకొనుట వినా, దాని కేమి, దేవ!" 33

తఱిమి=తఱచి, వెఱచి=భయపడి, నెరసులు+ఎన్నరు=కళంకము+ఆక్షేపింపరు, ప్రవాసిని=పరదేశవాసి, ఏమి=అంతటిది-కాదు,

చ. అనిన, అతర్కితోపనతయై, శ్రుతిసూచికమైన, ప్రేయసీ
ఘనపరివాదవాచికము కాలినయిన్మును, సుత్తిపెట్టు చొ
ప్పున, బెడిదంబుగా హృదయముం బగిలించిన, నేలపై విచే
తను డయి వ్రాలి, మైథిలసుతాప్రియబంధుడు, లేచె, నంతలో. 34

అతర్కిత+ఉపనతయై=అకస్మాత్తుగా+ప్రాప్తించినదై, శ్రుతి+సూచికము+ఐన=ఆమాట+సూది+అవగా, ఘన+పరివాద+వాచికము=సమ్మెటవంటి+నింద+మాట, బెడిదంబుగా=కఠినముగా, విచేతను=చైతన్య రహితముగా, మైథిల+సుత=మిథిలరాజు జనకుని+కూతురు,

మ. "జన నిర్వాదము రజ్జు లెమ్మని ఉపేక్షాబుద్ధిగైకొందునా?

అనవద్యం బ్రియురాలి బొమ్మని, పరిత్యాగంబు గావింతునా?"
అని, డోలాచలచిత్తుడయ్యెను మనం బత్యంతఘూర్ణంబు గా
గ, నరేంద్రాగ్రణి ఏకపక్షగతవైక్లబ్యాతిరేకంబునన్. **35**

నిర్వాదము = నికృష్టవాదము, రజ్జు = వ్యర్థబాషణ, ఉపేక్ష = విడచు, అనవద్యం = లోపములేనిది, పరిత్యాగంబు = బొత్తిగా విడచుట, డోలాచల = ఊగిసలాడు, అత్యంత + ఘూర్ణంబున్ = ఎక్కువగా + తూగిసలాడునది, ఏకపక్షగత + వైక్లబ్య + అతిరేకంబునన్ = రెంటిలో ఒకటినిస్వీకరించుటలోని + తడపాటు + ఆధిక్యతచే,

చ. హితతములురాలు నాక, మనుజేంద్రు డనన్యనివృత్తియైన, యా
అతితరనింద మాయగ, దయారహితంబుగ మైథిలీబహి
ష్కృతికి గడంగె, ఔనవు! గరీయసి కీర్తియె, కీర్తికామికిన్,
స్వతనువుకంటె నన్న, మరి పల్కగసేల, సతీసుతాదులన్! **36**

హితతములురాలు = అందరికంటె ప్రియమైనది, నాక = అనక, అనన్య + నివృత్తియైన = మరియొకదానిచేత + తొలగింపలేనిదానిగా, ఆ + అతితర = అటువంటి + బాగాఎక్కువైన, బహిష్కృతికిన్ + కడంగె = వెలివేయుటకు + సాహసించితొడగె, ఔను + అవు = అట్లే + అగును, గరీయసి = అన్నిటికంటెగొప్పది, స్వ + తనువుకంటెను + అన్న = స్వంత + శరీరముకంటె + అనగా, పల్కగసేల = చెప్పడమెందుకు, సతీసుతాదులన్ = భార్యపిల్లలను,

ఉ. జానకి నిష్కళంక యను సంగతి మాని పరిత్యజించినన్,
గాని అకీర్తి పోదు, సడి కల్లని లోకులనోళ్ళు మూయగా
రానివి, అంచు రాఘవుడు, రాయినొనర్చికొనెన్ మదిన్, యశో
హానికి నోర్వ రెంత ప్రళయంబు పయింబడనీ యశోధనుల్. **37**

నిష్కళంక = పరిశుద్ధ, మాని = ఆ విషయము విడచిపెట్టి, పరిత్యజించినన్ + కాని = విడచిపెట్టిన + కాని, అకీర్తి = అపకీర్తి, సడి = అపవాదు, కల్లని = అసత్యమని, రాయిన్ ఒనర్చికొనెన్ మదిని = గుండె రాయి చేసికొనెను, యశో + హానికి = కీర్తి + నష్టమునకు, ప్రళయంబు + పయిం + పడనీ = మృత్యువు + మీద + వచ్చిపడిననూ, యశోధనుల్ = కీర్తే ధనముగా కలవారు,

వ. అని తెంపుచేసి, అత్యంతచింతాక్రాంతస్వాంతుడగుట నిస్తేజస్కుడై, తనతమ్ముల నప్పుడె రావించి, నిజవిక్రియాదర్శనవిలుప్తహర్షులైన వారికి, చారుని నివేదనమును, స్వవిషయమున బుట్టిన కౌలీనమును, వ్రాకుచ్చి, రఘుపతి అంతర్బాష్పుడై, డగ్గుత్తికతో మరల నిట్లనియె. **38**

తెంపుచేసి=తీర్పుచేసి, అత్యంత+చింత+ఆక్రాంత+స్వాంతుడు=అధిక+శోకము+ఆవరించిన+మనస్సు కలవాడు, నిస్తేజస్కుడై=తేజస్సు కోలుపోయినవాడై, నిజ+విక్రియా+దర్శన+విలుప్త+హర్షులైన=తన+ముఖ కళవికలు+చూచిననే+పోయిన+ఆనందముకలవారైన, నివేదనమును=ఎఱిగింపు, కౌలీనము=అపవాదము, అంతర్బాష్పుడై=కన్నీరు లోపల అడచినవాడై, డగ్గుత్తికతో=గద్గదస్వరముతో,

ఉ. "దానవు నింట నున్న వనితం బెఱశంకలు మాని తెచ్చితిన్,
నేను విమోహినై, యనుచు నిందలు పల్కిరి లోకు లెల్ల, ఈ
శానముఖుల్ సుశీల యని శ్లాఘ యొనర్చిన సాధ్వి దెచ్చి, వై
శ్వానరు డిచ్చె నా, కయిన వంకరమాటలు తప్పలే, దిటన్. 39

పెఱ+శంకలు=పనికిమాలిన+అనుమానములు, విమోహినై=మోహమునకులోనై, ఈశానముఖుల్=దిక్పాలకులు, శ్లాఘ=ప్రశంస, వైశ్వానరుడు=అగ్ని, వంకర=వక్రపు,

సీ. రాజర్షివంశము రవివంశమున కిట్లు/నా మూలమున కళంకము జనించె,
అఖిలలోకారాధ్యమగు వేదరాశికి/చార్వాకువలన దూషణము వోలె,
జలతరంగము లందు చమురు బొట్టయి నింద/ఆనోట ఆనోట అలము కొనియె,
సైరింప జాల తద్బార మాలానిక/స్థాణుయాతన గంధదంతి వోలె,
దాని దొలగించు కొనుటకు ధరణితనయ/నుజ్జగించెద వంశాంకురోదయంబు
దటిసినను నిర్వ్యపేక్షుడ, తండ్రియాజ్ఞ/సింధునేమిని మును విసర్జించినట్లు. 40

రాజర్షి+వంశము=రాజర్షులుకల+వంశము, రవి=సూర్యని, కళంకము=దోషము, అఖిల+లోక+ఆరాధ్యమగు =అన్ని+లోకములకు+పూజనీయమైన, చార్వాకు=దేముడులేడనునాస్తికమతచార్వాకుని, దూషణము= ఖండనపు మాటలు, చమురు=(కరగక నీటి పై తేలి వ్యాపించు)నూనె, ఆలానిక+స్థాణు+యాతన+గంధ+దంతి+వోలె=కట్టుకొయ్య+స్థంబముపెట్టు+బాధను సహించు+మదపు+ఏనుగు+వలే, ఉజ్జగించెద= త్యజించెద, వంశ+అంకుర+ఉదయంబున్+తటిసినను=వంశోద్ధారకుడైన+పిల్లడు+పుట్టు కాలము దగ్గఱపడినను, నిర్వ్యపేక్షుడ=నిస్పృహకలవాడనగుచు,

సీ. నిప్పునుచెదలంటునే? ఏ నెఱుంగుదు/ఆజన్మపరిశుద్ధురాలు సీత,
చెఱగొన్న రాక్షసేశ్వరుని దుశ్శీలము/పడతిపై నిందయై ప్రతిఫలించె,
భూమి నీడనె జగంబు విశుద్ధుడగు చంద/మామ కారోపించు మచ్చగాగ,
కాని కల్లని, త్రోయగా రాని, దపవాదు/అదియె, బలీయము, అన్నలార!

రావణవధాంతమైన నా శ్రమము కూడ/సుదతికై కాదు, వైరసంశుద్ధి కొఱకె,

ప్రతికృతియెకాక మట్టిన వాని గినిసి/పాము కఱచున శోణితపానకాంక్ష?. **41**

ఏన్=నేను, చెఱగొన్న=బంధించిన, దుశ్శీలము=చెడ్డనడవడి, ప్రతిఫలించె=రావణుని దుశ్శీల దోషము అద్దమునందువలే ఆమెఅందు ప్రతిబింబించెను, నీడనె=నీడే, విశుద్ధుడగు=పరిశుద్ధుడగు, ఆరోపించు =లేనిదిమోపు, మచ్చగాగ=మచ్చఅయినట్లు, బలీయము=ఎక్కువ బలము కలది, అన్నలార=తమ్ములార, శ్రమము=పరిశ్రమ, సుదతికైకాదు=సీతకొరకు మాత్రమే కాదు-అపకీర్తి పోగొట్టుకొనుటకు, వైర+సంశుద్ధి= శత్రువుల వైరభావము+నిర్మూలనచే తప్పుదిద్దుట, మట్టినవాని=త్రొక్కినవానిపై, కినిసి=కోపగించి, ప్రతికృతి యెకాక=బదులుచేయుటే ముఖ్యముకాని, కఱచున=కాటువేయునా, శోణిత+పాన+కాంక్ష=రక్తము+త్రాగు+ కోటికచేత,

తే. ఇదియె నా నిశ్చయము, దీని కెదురు పలుక/నెంచకుడు, మీరు కరుణార్ద్రహృదయులార!

అపగతానల్పవాచ్యశల్యంబులైన/ప్రాణములతోడ నేనుండ వలతు రేని." **42**

నిశ్చయము=నిర్ణయము, కరుణ+ఆర్ద్ర+హృదయులార=దయచే+చెమ్మగిల్లు+మనస్సు కలవారా, అపగత+ అనల్ప+వాచ్య+శల్యంబు+లైన=జరిగిపోయిన+పెద్ద+నిందమాటలే+ఈటెలు+అవగా, వలతురు+ఏని= కోరుదురు+అయినచో,

మ. అని సుగ్రీవసఖుండు, మైథిలిపరిత్యాగంబెకర్జంబుగా,

ఘనరూక్షాభినివేశుడై పలికినం గంపించి, రన్యోన్యమా

ననముల్, సూచుచు అన్నగారి తెగువన్ వారింపగా శక్తి లే,

కనుమోదింపగ నోరు రాక, మన మూటాడంగ రామానుజుల్. **43**

సుగ్రీవసఖుండు=రాముడు, కర్జంబుగా=కార్యముగా, ఘన+రూక్ష+అభినివేశుడై=ఎక్కువ+క్రూరమైననూ+ అవశ్యము చేయపట్టుదలతో, కంపించిరి=వణికిరి, తెగువన్=సాహసమును, వారింప=ఆప, అనుమోదింపగ =అంగీకరించుటకు, మనము+ఊటాడంగ=మనస్సు+తూగిసలాడగ,

క. అవనీశు డంత లక్ష్మణు/సవిధమునకు బిలిచి, "నాదు శాసన మెపుడున్

జవదాట వింతవర కిపు/డవుగా దన బోకు"మనుచు నాదేశించెన్. **44**

సవిధమునకు=చేరువకు, ఇపుడు+అవున్+కాదు+అనన్+పోకు=ఇప్పుడు+అవును+కాదు+అన+వద్దు, ఆదేశించెన్=ఆజ్ఞాపించెను,

క. "పోరాని కర్మబంధము/ప్రేరేపగ గర్భవాంఛ పేరిట గంగా

తీరాశ్రమముల కనుపం/గోరినయది దేవి, ఇయ్యకొంటి, నేనున్. 45

పోరాని=తప్పించు కోలేని, ప్రేరేపగ=పురికొల్పగ, అనుపం=పంపగా, ఇయ్యకొంటి=అంగీకరించితి,

క. అదిసాకుపెట్టి కొనిచని/ముదితను ప్రాచేతసుని తపోవని కెలనన్,

వదలి చనుదెమ్ము, విను, మీ/వదినకు మనకును ఋణానుబంధము తెగియెన్." 46

అది+సాకు+పెట్టి=ఆ+మిష+పెట్టి, కొనిచని=తీసుకుపెళ్ళి, ముదిత=స్త్రీ, ప్రాచేతసుని=వాల్మీకి, కెలనన్=సమీపమున,

తే . జనని దెగటార్చె జనకుని శాసనమున/భార్గవుండని తా విన్నవాడు గాన

అగ్రజునిదేశమున కాత డనుమతించె/కూడ దనరా దలంఘ్యము, గురుజనాజ్ఞ! 47

జననిన్+తెగటార్చె=తల్లిని+చంపెను, జనకుని+శాసనమున=తండ్రి+ఆజ్ఞవల్ల, కాన=కనుక, నిదేశము=ఆజ్ఞ, అలంఘ్యము=దాటశక్యము కానిది, గురుజన+అజ్ఞ=పెద్దల+ఆనతి,

మ. అనుకూలశ్రవణప్రతీతమతియై ఆయత్తయై యున్న, జా

యను, కాకుత్ స్థుడు గర్భిణీవహనయోగ్యంబైన, మేలైన, స్యం

దన, మెక్కించి మఱంది వెంట వితతాంతర్బాష్పుడై, సాగనం

పె నరణ్యానికి, పాలతోడ విసమున్ మ్రింగించు చందంబునన్. 48

అనుకూల+శ్రవణ+ప్రతీత+మతియై=ఇష్టమైనమాట+వినుటచే+హర్షముకల+మనస్సుతో, ఆయత్తయై=సిద్ధమై, జాయ=భార్య, గర్భిణీ+వహన+యోగ్యంబైన=చూలాలును+తీసికొనిపోవుటకు+తగిన, స్యందనము =రథము, వితత+అంతర్+భాష్పుడై=విరివిగా కురుస్తున్నను+లోదాచిపెట్టిన+కన్నీరుకలవాడై, చందంబు=విధము,

తే. వేడిన మనోజ్ఞసీమలు చూడనంపె/ప్రియుడు, ప్రియకరుడని అతిప్రియము నొందె,

మతి నెఱుగ దయ్యె కల్పద్రుమత్వ, మెడలి/వెలది, తన కత డసిపత్రవృక్ష మగుట. 49

మనోజ్ఞ+సీమలు=మనోహరమైన+ప్రదేశముల, ప్రియకరుడని=ప్రియము కలిగించువాడని, కల్ప+ద్రుమత్వము+ఎడలి=పారిజాత+వృక్షపుపెంపు+విడచి, తనకు+అతడు=తనకు+రాముడు. అసిపత్ర+వృక్షము=కత్తివంటి ఆకులుకల(విషపు)+చెట్టు,

తే. దాచె, దనకు వచింప కెద్దాని, మఱది/భావి తద్విపత్తును దెల్పె ద్రోవయందు,

తడవ తడవకు నదరెడు కుడినయనము/శాశ్వతవిలుప్తదయితదర్శనకృపణము. 50

భావి+తత్+విపత్తునున్+తెల్పె=రాబోవు+ఆ+ఆపదను+సూచించెను, తడవ తడవకున్=మాటిమాటికి, అదరెడు=చలించు, శాశ్వత+విలుప్త+దయిత+దర్శన+కృపణము=ఎప్పటికీ+లోపింపబోవు+భర్త+చూపు అనెడి+దైన్యమును,

క. ఆ దుర్నిమిత్తములు కని/వైదేహి, తలంకు వొడమి, వడి వేడుకొనెన్,
సోదరయుతముగ పతికి, శు/భోదయమగు గాక యనుచు నుల్లములోనన్. **51**

తలంకు+వొడమి=సంకోచము+కలిగి, వడి=వెంటనే, ఉల్లము=మనసు,

మ.ద్వి. పలుగాకు లైన లోకుల మాటలోని/కల్లనిజంబులు కనుగొనలేని,
గురునియోగంబున బరిశుద్ధచరిత/నాపన్నసత్త్వ నుగ్రాటవిలోన. **52**

పలుగాకులు=తుంటరులు, గురు+నియోగంబున=అన్న+పనుపున, ఆపన్నసత్త్వన్=లోపలప్రాణికల గర్భిణిని, ఉగ్ర+ఆటవిలోన=భయంకరమైన+అడవిలో,

మ.ద్వి. త్రోయబూనిన కౌసలేయానుజన్ము/వలదని చే యెత్తి వారించె ననగ,
రంగదుత్తుంగతరంగయై, ఎదుట/గాన్పించె ద్రోవలో గంగాభవాని. **53**

త్రోయన్+పూనిన=విడవ+ప్రయత్నించు, రంగత్+ఉత్తుంగ+తరంగయై=నాట్యము చేయు+ఎత్తైన+అలలతో,

వ. నదీతటమున ఓడరేవుకడ ప్రజావతియు, దానును రథావతరణము సేసి, నిషాదానీత దృఢప్రవహణముపైజాహ్నవి నుత్తరించి, ఆవల వాల్మీకితపోవనోపాంతమునుచేరి, అచట ఊర్మిళాకళత్రు డన్నగారి కృతనిశ్చయమును నిర్వహింప దడబడి ఎట్టకేలకు. **54**

తటము=ఒడ్డు, ప్రజావతి=తోడబుట్టినవాని భార్య-వదిన, అవతరణము సేసి=దిగి, నిషాద+ఆనీత=బోయవారిచే+తేబడిన, దృఢ+ప్రవహణముపై+జాహ్నవిని+ఉత్తరించి=గట్టి+పల్లకిలో+గంగను+దాటించి, ఆవల=ఆవైపు, తపోవన+ఉపాంతమును=ఆశ్రమ+సమీపమునకు, ఊర్మిళాకళత్రుడు=లక్ష్మణుడు, కృత నిశ్చయము=ధృఢఉద్దేశము, నిర్వహింప=పూర్తిచేయ, తడబడి=తొట్రుపాటు పొంది, ఎట్టకేలకు=చిట్టచివరకు,

ఉ. స్వాంతము గూడదెచ్చికొని, వంత ప్రయత్నముమీద మ్రింగి, నే
త్రాంతరరుద్ధబాష్పుడు, నతాస్యుడునై, లయకాలమేఘ మ
త్యంతవిపత్కరంబగు శిలాశనివర్షము బోలె, మేదినీ
కాంతు నిదేశమున్ వెడలగ్రక్కె, వ్యవస్థితభాషణంబునన్. **55**

స్వాంతమున్+కూడన్+తెచ్చికొని=మనస్సును+కుదురు+చేసుకొని, వంత=బాధ, నేత్ర+అంతర+రుద్ధ+బాష్పుడు=కండ్ల+అందే+అడ్డగింపబడిన+కన్నీళ్ళు కలవాడు, నత+ఆస్యుడునై=వంచిన+ముఖముతో,

లయకాల=ప్రళయసమయపు, అత్యంత+విపత్+కరంబగు+శిల+అశని+వర్షము=అధిక+నాశము+కలుగ చేయు+రాళ్ళు+పిడుగులు+కురిపించు వాన, మేదినీకాంతు=రాజు, నిదేశమున్=ఆజ్ఞను, వెడలగ్రక్కె= బయటపెట్టె, వ్యవస్థిత+భాషణంబునన్=ప్రయత్న మీద స్వాభావికముగా ఉంచుకొనిన+మాటలతో,

తే. ఆ బహిష్కారవాత్యాభిహతికి నొరసి/ఆభరణపుష్పములు తూల ఆక్షణంబ

సాధ్వి, ఎలదీగ కైవడి శరణునొచ్చె/ఆత్మతనులాభదాయిని యైన భువిని. **56**

బహిష్కార+వాత్య+అభిహతికిన్+ఒరసి=పరిత్యజించుట+అనేసుడిగాలి+దెబ్బచే+రాచబడి, ఆభరణ= అలంకరించుకొనిన, తూల=క్రిందపడ, ఆక్షణంబ=తత్క్షణమే, సాధ్వి=పతివ్రత, ఎల+తీగ+కైవడి=లేత+తీగ+ వలె, శరణునొచ్చె=శరణాగతి కోరె(భూమిపై పడెను), ఆత్మ+తను+లాభదాయిని=తన+శరీరమును+ పొందించిన,

ఉ. ఏల పరిత్యజించు మగ డీమె నకారణమిట్లు? సాధుసం

శీలు డతండు భవ్యకులశేఖరజన్ముడు నంచు సంశయాం

దోళితచిత్తయై, అపుడు తోచని హేతు వెఱుంగ వేచె, గా

బోలు! ధరిత్రి వచ్చి కొనిపోవదు లోనికి కన్న కూతురిన్. **57**

పరిత్యజించు=విడచిపెట్టు, అ కారణము+ఇట్లు=కారణములేకుండా+ఇలా, సాధు+సంశీలుడు=సుజను లందు+మంచి స్వభావము కలవాడు, భవ్య+కుల+శేఖర+జన్ముడు=యోగ్యతకల+వంశ+శ్రేష్ఠుడు- దశరథుని+కుమారుడు, సంశయ+ఆందోళిత+చిత్తయై=సందేహముచే+తూగిసలాడు+మనస్సు కలదై, తోచని హేతువు+ఎఱుంగ+వేచె=తట్టని+కారణము+తెలియగా+(సీత శరణాగతి కోరిననూ)వేచియుండెను,

తే. వగపెఱుంగదు సంజ్ఞావిపర్యయమున/పిదప ప్రత్యాగతాసువై మది దపించె,

కష్టతరమయ్యె, మోహము కతన మఱది/యత్న ఫలము, ప్రబోధము యజనభవకు. **58**

వగపు+ఎఱుంగదు=కీడు+తెలియలేదు, సంజ్ఞా+విపర్యయమున=తెలివి+తప్పుటచే, అజనభవకు= అయోనిజకు, మఱది+యత్న ఫలము=లక్ష్మణుడు+ప్రయత్నించితెప్పించిన, ప్రబోధము=మెలకువవలన, ప్రత్యాగతాసువై=మరలివచ్చిన+తెలివి కలదై, మోహము+కతన=దుఃఖము+చేత, తపించె=తాపము పొందె,

తే. "మదనురక్తుడు వాక్కర్మమానసముల/ఏల నన్ననాగసు నిరసించు విభుడు?

దైవకల్పిత మీ ఉపద్రవము దైవ/దోష మాతని తప్పని దూఱజాల. **59**

మత్+అనురక్తుడు=నాఅందు+ప్రీతికలవాడు, అనాగస=అపరాధము లేనిదాననైన, నిరసించు =విడచు, ఉపద్రవము=పీడ, దైవ+దోషము=బ్రహ్మ+తప్పు, దూఱజాల=నిందింపలేను.

తే. బహువిధానూనదుఃఖానుభవము కొఱకె/సీతనై యేను పుట్టితి, జేసి యుందు
దుష్కృతి పరశ్శతంబును దొలిభవమున/అందులకు నన్నె దూషించుకొందు నిపుడు" **60**

బహువిధ+అనూన+దుఃఖ+అనుభవము+కొఱకె=పలురకముల+అంతములేని+దుఃఖములు+అనుభవిం చుటకు+మాత్రమే, దుష్కృతి+పరశ్శతంబును=పాపములు+నూటికంటె అధికముగా, తొలి+భవమున= ముందు+జన్మలో, నన్నె+దూషించు+కొందు=నన్ను మాత్రమే+నిందించు+కొందును,

వ. అని గద్గదికానిరుద్ధవచనయై కరుణముగా బల్కిన, ఆ మహాసాధ్విని సముచితముగ ఆశ్వాసించి, సౌమిత్రి" తల్లీ! ఆ కనిపించు కాలిబాట వెంబడి బోయిన, నించుక దూరమున వాల్మీకుల తపోవనము వచ్చును. మానవతావాది అమ్మహర్షి ఆశ్రమమున నీవు వసింప, నిటమీద నీ వల్లభు డాశ్రమవిరహితుడై తపించును. విధివిలసిత మిట్లున్నది. ఇంతసేసిన పెనిమిటిని పల్లెత్తుమాట యనని యపూర్వక్షమారాశివి. గురునిఘ్నుడనై తదాజ్ఞాకరణమున నీయెడ పారుష్యమును జూపిన నన్ను క్షమింపుము. పురమునకు బోవ ననుమతింపుము. అనన్యదురాపమైన నీ సౌశీల్యమె సర్వదా నీ కేడుగడ" అని తచ్చరణము లంటి ప్రణమిల్లి అధోముఖుడై వాపోవుచుండ, వైదేహి వానిని సాంత్వనపూర్వకముగ లేవనెత్తి **61**

గద్గదికా+నిరుద్ధ+వచనయై=డగ్గుత్తుకచే+అడ్డగింపబడిన+మాటలతో, కరుణముగాన్+పల్కిన=జాలి పుట్టించునట్లు+పలికిన, మహా+సాధ్విని=గొప్ప+పతివ్రతని, సముచితముగ=యుక్తముగా, ఆశ్వాసించి =ఊఱడించి, నీ+వల్లభుడు+ఆశ్రమ+విరహితుడై+తపించును=నీ+భర్త+గృహస్థాశ్రమము+లేనివాడై+ తాపము పొందును, విధి+విలసితము=బ్రహ్మదేవుని+క్రీడ, పల్లెత్తు+మాట=అల్పపు+పరుషపు పలుకు, అపూర్వ+ క్షమారాశివి=అపురూపమైన+ఓర్పునకు ప్రోగువు, గురు+నిఘ్నుడనై=అన్న+అధీనుడనై, తత్+ఆజ్ఞా+ కరణమున=రాముని+ఆనతిని+చేయుటలో, పారుష్యమును=నిష్ఠురత్వము, అనన్య+దురాపము+ఐన= మరెవరికిని+పొందరానిది+అయిన, సౌశీల్యమె=సుశీలత్వము, ఏడుగడ=ఏడుగురి (తల్లి తండ్రి గురుడు పురుషుడు విద్య దైవము ధాత)రక్షణ, వాపోవు=ఏడ్చు, సాంత్వన+పూర్వకముగ=ఓదార్పు మాటలు+ముందుచెప్పి,

తే. "సంతసించితి, వజ్రికి శౌరి వోలె/అగ్రజునకు విధేయుడ వైతి విట్లు,
మనసరివి నీవు చిరముగ మనగవలయు/చల్లనై, తండ్రి! నిను గన్నతల్లికడుపు. **62**

వజ్రికి శౌరి వోలె=ఇంద్రునికివిష్ణువువలే, మనసరివి=మంచిమనస్సుకలవాడవు,

తే. అత్తలకు నా ప్రణామము లందజేసి/విన్నవింపుము నాయందువృద్ధినందు,

సూనుని ప్రజానిషేకము శోభనమున/కాత్మ జింతింప వేడితి నినుము, వత్స. 63

సూనుని=కొడుకు(రాముడు), ప్రజా+నిషేకము=బిడ్డ+(గర్భా)దానమునకు-పుట్టబోవు బిడ్డకు, శోభనమునకు=శుభమునకు, ఆత్మన్+చింతింప=మనసులో+భావింప-దీవింప,

ఉ. దేవర కిట్లు పల్కుము త్వదీయసమక్షమ అగ్ని జొచ్చి, నా
పావనశీలమున్ రుజువుపర్చితి, దాని ననాదరించి, దు
ర్భావులు కొందఱన్న పెడపల్కులు పాటిగ బట్టబోలునే?
మీ వినుతశ్రుతంబునకు మేటి కులోన్నతికిన్, మహాప్రభూ! 64

దేవరకు=రామునికి, త్వదీయ+సమక్షమ=మీ+ఎదుటనే, దుర్+భావులు=చెడ్డ+తలంపుకలవారు, పెడ+పల్కులు= తుచ్ఛపు+మాటలు, పాటిగ=ప్రమాణముగ, పట్టబోలునే=గ్రహించవచ్చునా, వినుత + శ్రుతంబునకు =పొగడదగిన+ధర్మశాస్త్ర జ్ఞానమునకు,

మ. మతి లోకోత్తరులై జగద్విదితసమ్యక్కర్ములైనట్టి, మీ
కృతమున్ నాయెడ నిష్టయుక్తమని శంకింపన్, జనాధీశ! నా
గతజన్మాంతరఘోరపాతకవిపాకం బిప్డు దంభోళిసం
పతనం బాయె నవిప్రసహ్యముగ, దేవా! నాపయిన్, మీ పయిన్ 65

మతి+లోక+ఉత్తరులై=బుద్ధిలో+ప్రపంచములో+ఉత్తములై, జగత్+విదిత+సమ్యక్+కర్ములు+ఐనట్టి = లోకమున+ప్రసిద్ధిచెందునట్లు+సరియైన+విద్యుక్తధర్మము+నిర్వహించువారు+అయినటువంటి, కృతమున్ =చేసినపని, నా+యెడ=నా+విషయమున, ఇష్ట+యుక్తమని+శంకింపన్=మీఇష్ట+ప్రకారమని+సందేహించను, ఘోర+పాతక+విపాకంబు=ఘోరమైన+పాపపు+పర్యవసానము, ఇప్డు+దంభోళి+సంపతనంబు+ఆయెను=ఇప్పుడు+వజ్రాయుధము+గట్టిగాపడునట్లు+అయ్యెను, అవిప్రసహ్యము= సహించుటకు ఎంతమాత్రము శక్యముకానిదై, నాపయిన్+మీ పయిన్=నాపై+మీపై(కూడ)

తే. వలచి వచ్చిన లచ్చి నవ్వలకు గెంటి/నన్ను దోడ్కొని చనిరి కానలకు నాడు,
ఏల చల్లాఱు, నన్ను మీ ఇంటినుండి/వెడలగొట్టక నే డామె కడుపుమంట?. 66

లచ్చిని=రాజ్యలక్ష్మిని, అవ్వలకు=బయటకు, తోడు+కొని=తీసు+కొని, నేడు+ఆమె=ఇప్పుడు+ఆరాజ్యలక్ష్మి,

చ. వనమున నుండి మున్ను సురవంచితభర్తృకలైన తాపసాం
గనలకు మీ అనుగ్రహము కల్మి నజస్రశరణ్యనైతి, మీ
రనితరసాధ్యదీప్తి వసుధైకవిభుత్వమునన్ వెలుంగగా,

ఇనకులనాథ! అన్యు నిపు డేవిధి నే శరణంబు వేడుదున్. 67

మున్ను+అసుర+వంచిత+భర్తృక+లైన=ముందు+రాక్షసులచే+బాధింపబడ్డ+భర్తలుకలవారు+అయిన, అంగనలకు=స్త్రీలకు, కల్మి=కలుగుటచే, అజస్ర+శరణ్యనైతి=ఎల్లప్పుడు+రక్షించమని కోరదగినదాన నైతిని, మీరు+అనితర సాధ్య+దీప్తి=మీరు+ఇతరులుసాధింపరాని+ప్రకాశముతో, వసుధ+ఐక+విభుత్వ మునన్+ వెలుంగగా=భూమి+అంతటికి+ప్రభువువై+ప్రకాశింపగా, ఇనకుల+నాథ=సూర్యవంశపు+రాజా-రాముడా, అన్యుని+ఇపుడు+ఏవిధి=ఇతరులను+ఇప్పుడు+ఏవిధముగా.

సీ. కడగానరాని మీ ఎడబాటు కతమున/నిష్ప్రయోజనమైన, నీడ లేని,
ఈ తుచ్ఛజీవితం బేమని ఇక సిగ్గు/మాలి అపేక్షింతు, మానవేంద్ర!
రక్షణీయంబు నా కుక్షియం దున్న మీ/ తేజంబు నను నిరోధించె గాని,
కాన ప్రాణములు బిగ్గంబట్టి నిలుపుచు/మలుజన్మమున గూడ మరల నాకు,
దేవరయె భర్త యగుటయు, మీ వియోగ/విరహితతయు, వరంబుగా వేడికొనుచు,
ప్రసవసమయము పిమ్మట రవినివిష్ట/దృష్టినై తపముండ యత్నించు దాన. 68

కడన్+కనరాని=అంతు+కనబడని, కతమున-కారణమున, ని ష్ప్రయోజనమైన=ఏకార్యయోగ్యముకానిది, నీడలేని=ఆశ్రయములేని, తుచ్ఛ=హీన, అపేక్షింతు=కోరుదు, కుక్షి+అందు=కడుపులో, నిరోధించె=ఆపెను, బిగ్గంబట్టి=బిగపట్టి, మలు+జన్మమున=మరు+జన్మమున, విరహితతయు=లేకుండుటయు, రవి+నివిష్ట+ దృష్టినై=సూర్యునిపై+నిల్పిన+ఏకాగ్రతదృష్టి కలదాననై,

వ. రాజులకు వర్ణాశ్రమపాలనము ధర్మముగ మనువు విధించె. కావున మీచే నిర్వాసితనైనను తపస్విసామాన్యమునకు లభించు మీ అపేక్షణము నుండి ఈ అభాగినిని వెలివెట్ట దలపరని నావిశ్వాసము అని విన్నవింపుము. పొమ్ము మీవదినను మఱచిపొమ్ము. కన్నీరు మున్నీరుగా నేడ్చి నీవు విధివిలాసమును తప్పింపలేవు". 69

విధించె=ఆజ్ఞాపించె, నిర్వాసిత నైనను=వెళ్ళగొట్టబడినదాన నైనను, తపస్వి+సామాన్యము=తాపసుల +జాతి, అవేక్షణము=పర్యవేక్షణలోకాచుట, అభాగినిని=మందభాగ్యురాలిని, వెలిపెట్ట+తలపరని=దూరము చేయ+ తలపరని(ఒక తాపసిగా నన్ను రక్షించు ధర్మము వదలొద్దని), విధి+విలాసమును=బ్రహ్మ+క్రీడ,

చ. అనుటయు మాట లేక భరతావరజుండు తరంగితాశ్రు లో
చనములతోడ నియ్యకొని చయ్యన దృష్టిపథవ్యతీతుడై
చనిన, లతాంగి వాచఱచె సాధ్వసశోకభరాకులాత్మయై,

కనుగవ యుబ్బగా కురరి కైవడి పెక్కుచు ముక్తకంఠయై. 70

అవరజుండు=తమ్ముడు, తరంగిత+అశ్రు=అలలుగాకారుచున్న+కన్నీరు, ఇయ్యకొని=అంగీకరించి, చయ్యన =శీఘ్రముగా, దృష్టి+పథ+వ్యతీతుడై+చనిన=కంటి+చూపుకు+కడచి-కనబడనంత దూరము+వెళ్ళిన, వాచ+అఱచె=నోరు విప్పి+విలపించె, సాధ్వస+శోక+భర+అకుల+ఆత్మయై=ఉద్వేగము+దుఃఖము +నిండుటచే+చెదిరిన+మనస్సుతో, కురరి+కైవడి+పెక్కుచు=పెద్దగా అరచు అనాగరికస్త్రీ+వలె+రోదన ధ్వనితో, ముక్తకంఠయై=బిగ్గరగాఏడ్చుచూ,

సీ. ఉఱుము సందడి కుబ్బి పురి విప్పిన నెమిళ్ళు/మధ్యలో దమ యాట మాని నిలచె,
మృగములు తెలియని నెగులుతో కొఱికిన/నవకుశాంకురములు నమల కుమిసె,
మచ్చిక చెలు లాననిచ్చిన మల్లికా/మధువు ముట్టక త్రోచె మధుకరములు,
ముమ్మరమ్ముగ రెమ్మరెమ్మకు విరబూచు/పూమొక్క లువ్వెత్తు పూత యుడిగె,
కరుణముగ నేడ్చిన కఠోరగర్భగుర్వి/దేవితో గూడ సమదుఃఖభావమంది,
రాఘవేశ్వరు సదనాంతరమున బోలె/కానలో చెమ్మగిల్లని కన్ను లేదు. 71

ఉఱుము+సందడికి+ఉబ్బి=ఉఱుముల+సంక్షోభమునకు+సంతోషించి, మృగములు=లేళ్ళు, ఎగులు= విచారము, నవ+కుశ+అంకురములు+నమలక+ఉమిసె=లేత+దర్భ+మొలకలు+నమలుట ఆపి +ఉమ్మివేసె, మచ్చిక+చెలులు+అననిచ్చిన=ప్రేమతో+పువ్వులనే స్త్రీలు+త్రాగనిచ్చిన, మధువు=తేనెను, త్రోచె=నిరాకరించె, మధుకరములు=తుమ్మెదలు, ముమ్మరమ్ముగ=మిక్కుటముగా, రెమ్మరెమ్మకు= కొమ్మకొమ్మకు, ఉవ్వెత్తు+పూత+ఉడిగె=తటాలున+పూలపూత+త్యజించె, కరుణముగ=జాలిపుట్టునట్టు, కఠోర+గర్భ+గుర్వి=నిండు+గర్భవతిఅయిన+గర్భిణి, రాఘవేశ్వరు+సదన+అంతరమునన్+పోలె= రాముని+గృహము+లోపలభాగమునందు+వలే,

చ. పరుసని బోయతూపునకు బడ్డ పులుంగును జూచి ఆర్తితో
పరవశుడైన ఏ ఘనకృపాళుని శోకము శ్లోక మయ్యె, నా
కరుణరసప్రధానకృతికర్త, సమీపమునం గుశేంధనా
హరణమతిన్ మెలంగు మహితాత్మకు డాది కవీంద్రు, డయ్యెడన్. 72

పరుసని=కఠినపు, బోయ=బోయవాని, తూపునకున్+పడ్డ=బాణమునకు+చచ్చిక్రిందపడిన, పులుంగు= క్రౌంచపక్షి, ఆర్తితో+పరవశుడైన=మనోవ్యధతో+పరాధీనుడైన, ఏ+ఘన+కృపాళుని+శోకము+శ్లోకము+ అయ్యె=ఎటువంటి+గొప్ప+కరుణామయుని+దుఖఃము+శ్లోకముగా+పరిణమించినదో, ఆ+కరుణరస+

ప్రధాన+కృతి+కర్త=అటువంటి+కరుణరసమే+ప్రధానముగాకల+రామాయణకృతి+వ్రాసిన వాడు-వాల్మీకి, కుశ+ఇంధన+ఆహరణ+మతిన్+మెలంగు=కుశలు+సమిధలు+తెచ్చు+బుద్ధితో+సంచరించు చున్న, మహిత+ఆత్మకుడు+ఆది+కవీంద్రుడు=పూజింపదగ్గ+మనస్విఅయిన+మొట్టమొదటి+కవీశ్వరు డైనట్టి వాల్మీకిమహర్షి, అయ్యెడన్=అక్కడ,

వ. ఆక్రందనరవానుసారియై తన్ను జేరవచ్చుటయు, మైథిలి సంభ్రమించి పరిదేవనము మాని, నయనావరణమైన కన్నీరు పైటచెఱగుతో దుడిచికొని, ఆ మహానుభావునకు సభక్తికప్రణామము గావించె. తదీయదౌహృదలింగదర్శియైన ఆ సహృదయసార్వభౌము డామెను సుపుత్రవతివికమ్మని, కమ్మనిదీవెన నొసంగి, సంతర్పణవాక్యపూర్వకముగ అనునయించుచు నిట్లనియె. 73

ఆక్రందన+రవ+అనుసారియై=ఏడుపు+శబ్దము+అనుసరించి, సంభ్రమించి=తత్తరపడి, పరిదేవనము =ఏడుపుతోకూడినమాటలు, నయన+ఆవరణమైన=కండ్లను+ఆచ్ఛాదముచేసిన, సభక్తిక+ప్రణామము= భక్తితో కూడిన+వందనము, తదీయ+దౌహృద+లింగ+దర్శియైన=ఆమె+గర్భిణిఅని+ధృవపరచు లక్షణములు+చూచినవాడై, సహృదయ+సార్వభౌముడు=మంచిమనస్సుకలవారిలో+చక్రవర్తి వంటివాడు, సు పుత్రవతివి కమ్మని=మంచి పుత్రులు కలదానివి అగుమని, కమ్మని+దీవెనను+ఒసంగి=అమృత ప్రాయమైన+ఆశీర్వాదమును+ఇచ్చి, సంతర్పణ+వాక్య+పూర్వకముగ+అనునయించుచు=ఉల్లాసపరచు +మాటలు+ముందుగా చెప్పి+ఊఱడించుచూ,

చ. "తెలియగ వచ్చె మాకిపుడు తెల్లముగా ప్రణిధాన దృష్టిచే
కలనిజ మెల్ల, తల్లి! రఘుకాంతుడు నిన్ను మృషాపవాదసం
చలితమనస్కుడై, ఇట విసర్జనచేసె దయావిహీనతన్,
వలవదు బెంగ, నీవిపుడు వచ్చితి వింకొక పుట్టినింటికిన్. 74

తెల్లముగా=స్పష్టముగా, ప్రణిధాన+దృష్టిచే=మనస్సుఏకాగ్రసమాధిఅందు+చూచుటచే, మృష+అపవాద+ సంచలిత+మనస్కుడై=అసత్యపు+నిందచే+కలవరపడు+బుద్ధితో, విసర్జనచేసె=వదిలివేసెను,

చ. గరిమ వహించె ఉద్ధృతజగత్త్రయకంటకు డంచు సత్యసం
గరుడని సాటిలేని అవికత్థనుడై, మరి యట్టిమేటికిన్
కరకరి నెట్టపంట నిను గానల ద్రోయుట ఏమి పాడి? ఎ
వ్వరు, వెగడొందరమ్మ! రఘువర్యుని ఈ కలుషప్రవృత్తికిన్. 75

గరిమ వహించె=శ్రేష్ఠత+పొందె, ఉద్ధృత జగత్త్రయ కంటకుడు=ముల్లోకములను ముల్లువలే కష్టపెట్టు రావణుని తీసిపైచిన-చంపిన, సత్యసంగరుడని=అడితప్పనివాడని, అ వికత్థనుడై=ఆత్మస్తుతి లేనివాడై, కరకరి=పట్టు దలతో, నెట్టపంట=నిష్కారణముగా, పాడి=న్యాయము, వెగడొందరు=తల్లడిల్లరు-చలించరు, కలుష+ ప్రవృత్తికిన్=కలతనొందించు+నడవడికి,

తే. మాకు సఖు డిద్ధకీర్తి మీ మామగారు/యోగులకె మీ గురుండు, తత్త్వోపదేష్ట,
పుణ్యపతిదేవతల కగ్రగణ్య వీవు/కాన మాకు కావలసినదానవైతి. 76

ఇద్ధ+కీర్తి=అప్రతిహత+కీర్తిమంతుడుడు, గురుండు=తండ్రి-జనకుడు, తత్త్వ+ఉపదేష్ట=పరమాత్మ స్వాభావము+ఉపదేశింపకలవాడు, పుణ్య+పతిదేవతలకు+అగ్రగణ్యవు+ఈవు=పవిత్రమైన+పతివ్రతలలో +మొదట లెక్కింపదగ్గదానవు+నీవు,

సీ. మునిజనసహవాసమున వినీతములైన/పలుసత్వములతోడ ఫలితవృక్ష
వాటికతోడ నివారితచిత్తవి/క్షేపమై చేతనాచేతనముల
మైత్రీనిలయమైన మనతపోవన, మదె!/వసియింపు మట మనోవ్యసనముడిగి,
పుట్టినింటికి, రారే? పురిటికై పొలతులు/ప్రియమైన మా యాడుబిడ్డ వీవు,
అందు నీ గర్భ మభ్యుదయంబు నొందు/ముదుకటిల్లాంఢ్రు పురుడు పోయుదురు నీకు,
తల్లి! కావింతు నీదు సంతానమునకు/జాతకర్మాది సంస్కారజాత మేను. 77

సహవాసమున=కలిసిఉండుటచే, వినీతములైన=మచ్చిక చేయబడిన, పలు+సత్వములు=వివిధ+ జంతువులు, ఫలిత+వృక్ష+వాటిక=పండ్లుకల+చెట్ల+తోట, నివారిత+చిత్త+విక్షేపము+ఐ=పోగొట్టబడిన+ మనస్సుయొక్క+కలవరము+కలదైకానవై, మైత్రీ+నిలయమై=చెలిమికి+ఇల్లై, మనో+వ్యసనము+ఉడిగి= మనస్సులోని+దుఃఖము+మాని, పొలతులు=స్త్రీలు, అభ్యుదయంబును+ఒందు=మేలుకాన్పు+కలుగు, ముదుకటి=వృద్ధ, కావింతు=చేయుదును, జాతకర్మ+ఆది+సంస్కార+జాతము=పిల్లల్లుపుట్టినప్పుడు చేయుక్రియ+మొదలగు+ఆచార సంబంధక్రియల+మొత్తము,

సీ. కలమాన్నములు కల్లగాని మాయిండ్లలో/నివరిగింజలొకప్డు నిండుకొనవు,
పిండివంటలకేము పెట్టిపుట్టముగాని/కందమూలములకు కరువులేదు,
మణిమందిరములు మాకెక్కడివి కాని/ఆభ్రపుష్పములు కా వాకుటిండ్లు,
నునుదూదిరాచపాన్పులు మృగ్యములు కాని/పూరిసెజ్జలు, లేకపోవు మాకు,
కనక వసనంబులకు నోచికొనము కాని/నారచీరలు వెండిబంగారు కావు,

సిరికి మాకును విను సగమెరుకె కాని/పేదఱిమి మానవతలోన లేదు మాకు. 78

కలమ+అన్నము=మేలుజాతిబియ్యపు+అన్నము, నివరి=తనంతతనేపండే వరి, నిండుకొనవు=అయిపోవు, అభ్ర+పుష్పములు=గగన+కుసుమములు-అందనివి, ఆకు+ఇండ్లు=పూరి+గుడిసెలు, మృగ్యములు= కనబడవు, పూరి+సెజ్జలు=ఆకులతోపేసిన+పడకలు, కనక+వసనంబులు=జరీ+చీరలు, వెండిబంగారుకావు =దొరకలేనివికావు, సగమెరుకె=పూర్తిగా తెలియదు, పేదఱిమి=పేదఱికము,

సీ. మన తపోవసతికి కనుచూపుమేరలో/మునిసన్నివేశసంపూర్ణమైన
తీరము వెంబడి పారుచున్నది పుణ్య/తమ తరంగిణి తమశ్శమన తమస,
అనుదినంబును నీవు మునిపురంధ్రుల గూడి/చని వేగుబోక నీ చరితవోలె
అకలంకమై యొప్పు నయ్యేటి జలమున/అఘమర్షణస్నాన మాచరించి,
సైకతోత్సంగమున కర్మసాక్షి కెరగి/విహితముగ దేవపూజ గావింతువేని,
మనసు తెలివొందు నీరోగ మగు నెడంద/పుణ్యసంపద పెంపొందు పుత్రి, నీకు. 79

తపో+వసతి=తపసుల+స్థానము-ఆశ్రమము, ముని+సన్నివేశ+సంపూర్ణమైన=మునుల+కుటీరములతో+ నిండిన, పుణ్యతమ+తరంగిణి=అత్యధికపుణ్యకరమైన+నది, తమస్+శమన+తమస=శోకము+నశింప చేయు+తమసానది, పురంధ్రుల=స్త్రీల, వేగుబోక=తెల్లవారు ఝామున, అకలంకమై=బురదలేనిదై, అఘమర్షణ స్నానము=తల స్నానము, సైకత+ఉత్సంగమున=ఇసుకదిబ్బల+మధ్యలో, కర్మసాక్షికి+ఎరగి= సూర్యునికి+నమస్కరించి, విహితముగ=యథావిధిగా, తెలివి+ఒందు=ప్రసన్నత+పొందు, నీరోగ+మగు+ నెడంద=స్వస్థత+చెందు+హృదయము, పెంపు+ఒందు=హెచ్చు+అగు,

మ. బలిబీజంబులు ఆర్తవంబులగు పుష్పంబుల్ ఫలవ్రాతమున్
కలవారై కొనితెచ్చి యిత్తు రెలమిన్ కన్నీరు వోదుడ్చి, నీ
కలతన్ మాన్పుదు రాటపాటల చమత్కార ప్రసంగంబులన్,
తలలో నాలుకగా మెలంగి, మునికన్యల్, నీకు పృథ్వీసుతా! 80

బలి+బీజంబులు=పూజకుయోగ్యమైన+నీవారాది ధాన్యపుగింజలు, ఆర్తవంబులగు=ఆఆఋతువు లందు లభించు, వ్రాతము=సముదాయము, కలవారై=ఆప్తులై, ఎలమిన్=ప్రేమతో, వో+తుడ్చి=పోవునట్లు+ఒత్తి, కలతన్=క్షోభను, తలలో నాలుకగా=సురక్షితముగా,

తే. ఓపికకు యుక్తమైన పయోఘటముల/మన తపోవన బాలద్రుమముల బెంచి,
కనగలవు కన్నతల్లివి కాకమునుపె/పాపలకు చనుబాలిచ్చి పడయు, హాయి." 81

యుక్తమైన=సరియైన, పయో+ఘటముల=నీటి+కుండల, బాల+ద్రుమముల=చిన్న+మొక్కల, పడయు=పొందు,

క. అని యూరడించి తడయక/అనుకంపామతి ననుగ్రహప్రత్యభినం
దినియైన, యామె దోడ్కొని/మునితిలకుడు వచ్చె నిజతపోవనమునకున్. 82

తడయక=ఆలస్యముచేయక, అనుకంప+మతిని=కనికర+స్వభావముతో, అనుగ్రహ+ప్రత్య+అభినందిని యైన=కరుణకు+ప్రతిగా+సంతోషించిన,

తే. అప్పగించె గవీంద్రు డా యార్తమూర్తి/పరిచయము చేసి, వృద్ధతపస్విను లకు,
కోరి అమవస పితృభుక్తసారయైన/తుహినకరు నంత్యకళ నోషధులకుబోలె. 83

ఆర్తమూర్తి=శోకమూర్తిని, అమవస=అమావాస్యనాడు, పితృ+భుక్త+సారయైన=పితృదేవతలకు+తినుటకు వీలుగా+సారవంతమైన, తుహినకరుని=చంద్రుని, అంత్యకళ=అమావాస్యనాటి ఆఖరికళ, ఓషధులకు బోలె =మందు చేట్లవలె,(అమావాస్యనాడు పితరులు తినివేయగా మిగిలిన చంద్రకళ ఓషదుల చేరును-వ్యాసవచనము.)

వ. అప్పగించిన దదాగమప్రీతులైన వా రామె బొదివికొని అర్ఘ్యపాద్యము లిచ్చి స్నానాన్నపానములు చేయించి ఇంగుదీస్నేహకృతప్రదీపమును, ఆస్తీర్ణమేధ్యాజిన తల్పమునైన ఒక పర్ణకుటీరమును దన్నివాసార్థ మేర్పాటు చేసిరి. జానకియు నచట తమసాజలాభిషేకప్రయతయై వల్కలవాసినియై మునివధూ ప్రయుక్తనిత్యసత్కారయై పతిప్రజాసంతతినిమిత్తము వన్యాహారమున శరీరయాత్ర నడపుచు, ప్రజననసమయమును బ్రతీక్షింపుచు గడవనికాల మొకరీతిగడుపుచుండెను. ఈలోన 84

పొదవికొని=చుట్టుకొని, ఇంగుదీ+స్నేహ+కృత+ప్రదీపమును=గారపప్పు+నూనెచే+పేసి-వెలిగించిన+ పెద్దదీపమును, ఆస్తీర్ణ+మేధ్య+అజిన=పఱపబడిన+పరిశుద్ధమైన+కృష్ణాజినముపేసిన, ప్రయతయై= పరిశుద్ధయై, వల్కలవాసిని=చెట్టుపట్టతో చేయబడిన నారచీర కట్టుకొని, ప్రయుక్త=మిక్కిలి స్నేహముగా చేయు, పతి+ప్రజా+సంతతి+నిమిత్తము=భర్తయొక్క+బిడ్డద్వారా+వంశవ్యాప్తి+కొఱకు, వన్యాహారమున =శాఖాహారమున, ప్రజనన+సమయమును+ప్రతీక్షింపుచు=బిడ్డకను+నెలకు+ఎదురు చూచుచు, గడవనికాలము=కష్టముచే గడవనట్లుండు సమయమును, ఒకరీతి=ఏదోఒకవిధముగా,

ఉ. ఆపగరాని అత్యనుశయంబున సంతతశోకమగ్నుడై,
మాపులు, ఱేపులున్ మఱుగు మైథిలివల్లభుజేరవచ్చి, వి
జ్ఞాపనచేసె దీనవదనంబున వాసవజిద్విభేది, సీ

తాపరిదేవనాంతముగ దానొనరించిన తన్నిదేశమున్. 85

అతి+అనుశయంబున=ఎక్కువ+పశ్చాత్తాపమున, మగ్నుడై=మునిగినవాడై, మాపులు=రాత్రులు, ఱేపులు =పగళ్ళు, మఱుగు=మిక్కిలి దుఃఖించు, మైథిలివల్లభు=రాముని, విజ్ఞాపన=మనవి, వాసవ+జిత్+విభేది= ఇంద్రుని+జయించిన ఇంద్రజిత్తును+చంపిన-లక్ష్మణుడు, పరిదేవనాంతముగ=విలాపమువరకు, తన్+ నిదేశమున్=రాముని+ఆజ్ఞమొదలుకొని

తే. మంచుజడివాన గురియు హేమంతచంద్రు/డయ్యె రామచంద్రుడు సపద్యశ్రుముఖుడు,
స్వగృహముననుండి యే కాని సడికినోడి/ప్రేయసి నెడందనుండి వోద్రోయ, లేమి. 86

హేమంత+చంద్రుడు+అయ్యె=హేమంత ఋతువునందు+మంచుకప్పిన చంద్రుని అట్లు+అయ్యెను, సపది+ అశ్రు+ముఖుడు=తక్షణమే+కన్నీరుకమ్మిన+ముఖము కలవాడయ్యెను(హేమంత చంద్రుడు), సడికిన్+ ఓడి=నిందకు+భయపడి, ఎడద+నుండి+వో+త్రోయ+లేమి=హృదయము+నుండి+సీతనువెళ్ళ+కొట్ట+లేక ,

తే. తను దానె యూరార్చికొని ధీరడగుట/నిజమనోధృతికి నున్మేషంబు దెచ్చి,
మమత బోనడచి శోకము నిగ్రహించి/అనవధానత కాశ్రయము గోలుపుచ్చి. 87

నిజ+మనో+ధృతికిన్+ఉన్మేషంబున్+తెచ్చి=తన+మనస్సుయొక్క+స్థిరతకు+మెలకువ+తెచ్చిపెట్టుకొని, మమతన్+వోనడచి=మమకారమును+త్యజించి, నిగ్రహించి=అడచి, న+అవధానతకు=ఏకాగ్రత లేమికి, ఆశ్రయమున్+కోలుపుచ్చి=అండ+వోగొట్టి,

తే. వివిధవర్ణాశ్రమాపేక్షణజాగ/రూకమనస్కుడై కాకుత్ స్థమౌళి,
భాతృసాధారణపరిభోగమైన/రాజ్యమేలెను రజోరహితవృత్తమున. 88

ఆపేక్షణ+జాగరూక+మనస్కుడై=పర్యవేక్షణమునందు+అప్రమత్త+బుద్ధితో, భాతృ+సాధారణ+పరిభోగమైన= తమ్ములే+సామాన్యముగా+అనుభవించినదైన(తను అనుభవించని), రజో+రహిత+వృత్తమున=రజో గుణము+లేని+ప్రవర్తనతో,

ఉ. "జానకి బాసెగాని రఘుసత్తము డెవ్వత కీయలేదు తత్
స్థానము, అధ్వరక్రియకు తత్ప్రతిమాసఖుడయ్యె"నం, చిటుల్
వీనులవిందుగా విభుని వృత్తము దా విని, ఎట్టులో సమా
ధానమనస్కయై సయిచె తన్వి దురంతనిరాకృతివ్యథన్. 89

పాసె=విడచె, అధ్వర+క్రియకు=యజ్ఞము+చేయుటకు, తత్+ప్రతిమా+సఖుడు+అయ్యె=ఆమె+విగ్రహ మూర్తి+సహాయుడు+అయ్యెను, సమాధాన+మనస్క+ఐ= శాంతమైన+మనస్సు+కలదై, సయిచె=ఓర్చె, దురంత+నిరాకృతి+వ్యథన్=అంతులేని+నిరాకరణచేకలిగిన+దుఖమును,

# పంచదశ సర్గము- రామావతారవిరమణము

క. పరివాదభీతి సీతా/విరహితుడై రాఘువప్రవీరుడు రత్నా

కరరశన యైన కేవల/ధరిత్రిసే యేలికొనియె, ధర్మోత్తరుడై. 1

పరివాద+భీతి=నింద+భయముచే, ప్రవీరుడు=మిక్కిలివీరుడు, రత్నాకర+రశన=సముద్రము+వడ్డాణము గాకలది-భూమి, కేవలధరిత్రిసే=భూమిని మాత్రమే, ఏలుకొనియె=పాలించె, ధర్మ+ఉత్తరుడై=ధర్మపాలన అందు+ఉత్తముడై,

క. చనుదెంచిరి లవణుండను/క్షణదాచరుచే, విలుప్తసవనక్రియులై,

మునులు యమునాతటస్థులు/చనవున నా యార్తశరణు శరణము వేడన్. 2

క్షణద+ఆచరుడు=రాత్రి+చరించువాడు-రాక్షసుడు, విలుప్త+సవన+క్రియులై=పూర్తిగాలోపించిన+యజ్ఞపు+పనులుకలవారై, తటస్థులు=ఒడ్డునఉండువారు, చనవున=చెల్లుబడితో, ఆర్తశరణు=దుఃఖితులకు+రక్షణ ఇచ్చువాడు,

క. ఘను రాము జూచి, చెఱుపరు/దనుజు, స్వతేజమున వారు, త్రాణాభావం

బునగాని, ప్రయోగింపడు/ముని శాపాయుధము నిజతపోవ్యయభీతిన్. 3

చెఱుపరు= కీడుచేసికొనరు, స్వతేజమున=వారివారి తపః ప్రభావముచే, త్రాణ+అభావంబునన్+కాని+ప్రయోగింపడు=రక్షించువాడు+లేనప్పుడే+కాని+ఉపయోగింపడు, నిజ+తపో+వ్యయ+భీతిన్=తమ+తపస్సు తరుగునను+భయముచే,

క. ప్రతిన యొనరించె విఘ్న/ప్రతిఘాతము సేయ దాశరథి తపసులకున్

ప్రతిహతసద్ధర్మపునః /ప్రతిష్ఠయే, కద! ప్రవృత్తి, పరమాత్మునకున్! 4

ప్రతిన=ప్రతిజ్ఞ, విఘ్న+ప్రతిఘాతము=అడ్డంకులకు+మారుదెబ్బ, ప్రతిహత+సత్+ధర్మ+పునః+ప్రతిష్ఠయే=త్రోసిపుచ్చపడిన+మంచి+ధర్మమును+మరల+స్థాపించుటే, ప్రవృత్తి=నడవడి,

క. ఆ లవణుని పరిమార్ప నృ/పాలునకును దెలిపి రొక ఉపాయము దపసుల్,

శూలియగువా డవధ్యుడు/శూలరహితు డయిన, చంప సులభుడు ననియున్. 5

పరిమార్ప=చంప, శూలిఅగు=శూలముధరించినవాడయితే, అ వధ్యుడు=చంపబడడు, శూలరహితుడు=శూలము లేనివాడు,

క. సేమించె నమ్మునీంద్రుల/బాములు కడతేర్ప నవనిపతి శత్రుఘ్నున్,

భీమారిహననమున ద/న్నామము సార్థముగ జేయ దలచె, ననంగన్. **6**

నేమించె=నియమించెను, బాములు=కష్టములు, కడతేర్ప=సమాప్తిచేయ, శత్రుఘ్నుడు=శత్రువుల చంపువాడు, భీమ+అరి+హననమున=భయంకర+శత్రువుల+చంపుటఅందు, సార్థముగ=అర్థవంతము,

తే. ఒనర రఘువీరులందు ఏ ఒక్కడైన/పగతు ద్రోసిపుచ్చ సమర్థుడగు, విశేష

సూత్ర మెప్పుడు సామాన్యసూత్రము బలె/అని వినిశ్చయమ్ముగ నిరూపణము సేయ. **7**

ఒనర=పొందికగ, త్రోసిపుచ్చ=తొలగజేయ, సామాన్య+సూత్రము=వంశ సహజ+నియమము-శత్రువుల చంపుట రఘుకులులందరకు సామాన్యము, వినిశ్చయమ్ముగ=నిర్ధారణగా,

క. ఆశరవిజయావహమగు/నాశీర్వాదము నొసంగి అగ్రజు డనుపన్,

దాశరథి దివ్యరథియై/ఆశుప్రస్థానమయ్యె అకుతోభయుడై. **8**

ఆశర+విజయ+ఆవహమగు=రాక్షసునిపై+గెలిపు+కలిగించు, అనుపన్=పంపగా, దివ్య+రథియై=ఇంపైన+రథమెక్కినవాడై, దాశరథి=శత్రుఘ్నుడు, ఆశు+ప్రస్థానమయ్యె=వెంటనే+యుద్ధమునకై వెడలె, అకుతో భయుడై=దేనివలననూ వెఱపులేనివాడై,

ఆ. స్యందనాగ్రగాములై త్రోవచూపిన/మునుల వెంట చనుచు వెలిగె,

స్యందనాగ్రగాములగు వాలఖిల్యుల/ననుసరించి యేగు నినుని, భంగి. **9**

స్యందన+అగ్రగాములై=రథముకు+ముందుగావెళ్ళి, వాలఖిల్యులు=చెట్టుకొమ్మకు తలక్రిందులుగా వేలాడి తపస్సుచేయు(మరియు సూర్యునికిముందు సాగి సూర్యకిరణములనుండి చెడుకిరణములను (ozine layer గా)తప్పించు) తపస్సులు, ఇనుడు=సూర్యుడు,

క. అరుగుచు మార్గవశంబున/అరిఘ్ను డొకరేయి గడిపె అనుచరయుతుడై,

ఉరుతరరథస్వనోన్ముఖ/హరిణము, వల్మీకభవుని, యాశ్రమవాటిన్. **10**

అరుగుచు=ప్రయాణము చేయుచు, మార్గవశంబున=దారిలో, అరిఘ్నుడు=శత్రువులఅణచు శత్రుఘ్నుడు, ఉరుతర+రథ+స్వన+ఉన్ముఖ+హరిణము=బాగాశ్రేష్ఠమైన+రథ+శబ్ధముచే+మెడలెత్తిపైకి చూచు+లేళ్ళు కలది, వల్మీక+భవుని=పుట్టనుండి+పుట్టిన-వాల్మీకి,

క. అలయికలు వాయ రాఘవు/బలుప్రీతిని సత్కరించె ప్రాచేతసు, డ

త్యలఘుతపస్సాధనమున/తలకూడిన యోగ్యసంవిధానము తోడన్. **11**

వాయ=తీర, ప్రాచేతసుడు=వాల్మీకి, అతి+అలఘు+తపస్సాధనమున+తలకూడిన+యోగ్య+సంవిధానము+తోడన్=అతి+గొప్ప+తపస్సు సాధనచే+సిద్ధించిన+తగు+ఏర్పాట్ల+చేతను,

క. ఆ రాత్రియె రఘుకులవి/స్తారకులం గనియె దత్ప్రజావతి జితబృం

దారకుల, గవలబిడ్డల/ధారుణి సంపన్నకోశదండములం బలెన్. **12**

రఘుకుల+విస్తారకులం=రఘువంశము+వ్యాపింప చేయువారల, తత్+ప్రజావతి=వాని+వదిన-సీత, జిత బృందారకుల=దేవతలనుకూడ జయించగల, ధారుణి+సంపన్న+కోశ+దండములం+వలెన్=భూమియొక్క+ సమృద్ధ+భాండాగారముపై+(హక్కుకల) రాజశాసన దండముల+వలె

ఆ. అన్న పుత్రజాతు డగుటకు పులకించి/ఉదయమందె లేచి తదవరజుడు

మునికి వినయమధురముగ మ్రొక్కి, వీడ్కొని/అరదమెక్కి తెప్పదెరల, జనియె.**13**

పుత్రజాతుడు=కొడుకులు కలవాడు, తత్+అవరజుడు=రాముని+తమ్ముడు, తెప్పదెరల=అతివేగముగా

తే. వచ్చె సౌమిత్రి మును మధూపఘ్నమునకు/వచ్చె నటకు కుంభీనసీభవుడుకూడ,

కాననమునుండి కప్పము గాగ గొన్న/సత్త్వనిచయముతో అదే సమయమునకు.**14**

మును=ముందుగా, మధూపఘ్నమునకు=మధూపఘ్నముఅను పేరుగల లవణపురము, కుంభీనసీ+ భవుడు=రావణుని చెల్లెలగు కుంభీనసి+కుమారుడు-లవణాసురుడు, కప్పమున్+కాగ+కొన్న=అడవినుండి పన్ను+అనునట్లు+తీసుకొనిన, సత్త్వ+నిచయము=చంపిన జంతువుల+రాసి,

తే. దుర్భరవసామగంధియు ధూమధూమ్ర/తనుడు జ్వాలాకడారకుంతలచయుండు,

సమదపలలాశిగణపరిజనుడు నగుట/జంగమచితాగ్ని బోని రాక్షసుని జూచి. **15**

దుర్భర+వసామ+గంధియు=భరింపరాని+చచ్చిన జంతువుల గుండె మెదడుల+వాసన కలవాడు, ధూమ+ ధూమ్ర+తనుడు=పొగవలే+నలుపు ఎఱుపు కలసిన రంగు+శరీరముకలవాడు, జ్వాలా+కడార+కుంతల+ చయుండు=మంటవలే+ఎఱ్ఱని+కేశముల+గుంపు కలవాడు, స మద+పలల+అశి+గణ+పరిజనుడు= మదముతోకూడిన+మాంసము+తిను+రాక్షసుల+పరివారముకలవాడు, జంగమ+చితాగ్నిన్+పోని = నడచుచున్న+శ్మశాన+మంటను+పోలిన,

క. అపశూలు నతని రయమున/ నృపనందను డడ్డగించె నిలు సొరకుండన్,

రిపురంధ్ర మెఱిగి పొడచిన/నిపుణునకును గెలుపు వచ్చి నిలువదె ఎదుటన్. **16**

అపశూలు=శూలముధరించని, అడ్డగించె=అడ్డుపడెను, ఇలు+సొరక+ఉండన్=ఇంటిలోనికి+వెళ్ళిశూలము గ్రహింప+కుండా, రిపు+రంధ్రము+ఎఱిగి+పొడచిన=శత్రువు+లొసుగు+తెలిసికొని+మోదిన,

ఉ. "నేడశనంబు నా కడుపునిండ లభింపమి జూచి ధాత, నా

పోడిమి యేమిపాకమున బొందెనొ? నిన్నిటు తెచ్చె"నంచు, పెన్

వేడుక చంకగ్రుద్దికొని నెట్టన దానవవీరు డాగ్రహా
మ్రేడితసత్త్వుడై పెటికె, వృక్షము నొక్కటి గోగుకాడగన్. 17

అశనంబు=భోజనము, ధాత=బ్రహ్మ, పోడిమి=భాగ్యము, పాకము=పంట, పెన్=ఎక్కువ, నెట్టన=అనాలోచితముగ, ఆగ్రహ+ఆమ్రేడిత+సత్త్వుడై+పెఱకె=కోపముచేత+రెట్టింపైన+బలముకలవాడై+పెకలించె, గోగుకాడగన్=గడ్డిమొక్కవలె,

తే. కనలి కాకుత్ స్థు డేసిన కడిది శక్తి/ద్రోవనడుమనె వెస తునాతునక లగుట
రక్కసుడు రువ్వినట్టి ఆ మ్రాను కాదు/దాని పుప్పొడి వచ్చి రాతనయు దాకె.18

కనలి=కోపగించి, కడిది=గొప్ప, వెస=శీఘ్రముగా, దాని పుప్పొడి=చెట్టుకున్నపూల పుప్పొడి మాత్రమే, రా తనయున్+తాకె=రా కుమారుని+పూలవానవలెస్పర్శించె,

క. వృక్షము వ్యర్థం బైనన్/రక్షోవిభు డలిగి విసరె రాఘువు రొమ్మున్
లక్షించి పృథక్ స్థితమగు/సాక్షాద్యమముష్టి, బోని స్ఫారోపలమున్. 19

లక్షించి=గురిపెట్టి, పృథక్+స్థితమగు=విడిగా+ఉండిన, సాక్షాత్+యమ+ముష్టి=స్వయముగా+యముని+పిడికిలి, స్ఫార+ఉపలమున్=పెద్ద+ఱాయిని,

మ. తఱి శత్రుఘ్నుధనుర్విముక్తమఘువద్దైవత్య మస్త్రంబు, దు
స్తరమై తాకిన ప్రస్తరంబు సికతాత్వం బంది తన్మాత్రలో,
పరమాణుత్వము నొంది నేత్రవిషయీభావంబు గోల్పోయె, చూ
పఱు లేమయ్యె మహోపలం బనుచు విభ్రాంతిన్ విలోకింపగన్. 20

తఱి=సరైనసమయమున, ధనుర్+విముక్త+మఘువ+ద్దైవత్యమ+అస్త్రంబు=వింటినుండి+విడవనడిన+ఇంద్రుని+దేవతా+అస్త్రము, దుస్తరమై+తాకిన=మీరరానిదై+గుద్దుకొన, ప్రస్తరంబు=ఱాయి, సికతాత్వంబు+అంది=పిండి వలే+అయిపోయి, తన్మాత్రలో=ఆక్షణములో, పరమాణుత్వము=చిన్నచిన్నరేణువులై, నేత్ర+విషయీ+భావంబున్+కోల్పోయె=కళ్ళకు+కనబడు+స్వభావము (చిన్న ప్రమాణముచే)+పోగొట్టుకొనె, మహా+ఉపలంబు=పెద్ద+ఱాయి,

తే. రాతి శైథిల్యమునకు అరాతి కనలి/కుడిభుజం బెత్తికొని మీద బడగవచ్చె,
దారుణోత్పాతమారుతప్రేరితైక/తాళసహితాద్రి, నాగ ఆభీలభంగి. 21

శైథిల్యమునకు=విరిగిపోవుటకు, అరాతి+కనలి=శత్రువు+కోపించి, దారుణ+ఉత్పాత+మారుత+ప్రేరితైక+ తాళ+సహిత+అద్రి+నాగ=ఘోరమైన+భూకంపమువంటి ఉపద్రవము పుట్టగా+గాలిచే+త్రోయబడిన+ తాటిచెట్ల +సహిత+కొండ+వలే, ఆభీల+భంగి=భయంకరమైన+విధముగా

క. ధృష్ణుడు, మహాస్త్రవిద్యా/నిష్ణాతుం డేచి దనుజ నిర్మథనాలం
భూష్ణువని, రఘుకుమారుడు/వైష్ణవశర మేయ, నదియు వచ్చి రయమునన్. **22**

ధృష్ణుడు=నిర్దయుడు, నిష్ణాతుండు+ఏచి=నిపుణుడు+విజృంభించి, నిర్మథనాలం+భూష్ణువని=ధ్వంసము +చేయగలదని, రయమునన్=శీఘ్రముగా,

క. ఉదుటున దాక విదారిత/హృదయుండై నేల కొరిగి దృప్తనిశాటుం
డొదవించె గంప ముర్వికి/తదభావము దేవమునివితానంబునకున్. **23**

ఉదుటున+తాక=ధృఢముగా+దెబ్బతీయగా, విదారిత=చీల్చబడిన, దృప్త+నిశాటుండు=దర్పించిన+ రాక్షసుడు, ఒదవించెన్+కంపము+ఉర్వికి=కలిగించె+కంపము+భూమికి, తత్+అభావము=వాడు లేడను భావము, వితానంబునకున్=సమూహమునకు,

ఆ. పడియె నపుడు విహతపలలాశిమేనిపై/క్షతజపానలోలపతగపంక్తి,
తద్విజేత మౌళితలముపై సురసిద్ధ/కరవిముక్త మయిన విరుల జల్లు. **24**

విహత+పలలాశి+మేనిపై=చంపబడిన+రాక్షసుని+శరీరముపై, క్షతజ+పాన+లోల+పతగ+పంక్తి=గాయము నుండి వచ్చు రక్తము చీము మాంసము+త్రాగ+కోఱు+పక్షుల+గుంపు, మౌళితలముపై=శిరస్సుపై, సుర+ సిద్ధ+కర+విముక్త=దేవతలు+సిద్ధులు మొదలగు వారి+చేతులనుండి+విడిచిన, విరుల=పువ్వుల, పడియె =(పక్షులు రాక్షసునిపై, పువ్వులు శత్రుఘ్నునిపై)పడినవి,

క. బిరుదు గల లవణు బొరిగొని/పరుషపరాక్రము డతండు భావించె సహో
దరుడ నిజ మింద్రజిద్వధ/పరికీర్తుడయిన మేటి బంటున కనుచున్. **25**

బిరుదు=శౌర్యము, పొరిగొని=చంపి, పరుష=కఠిన, సహోదరుడనిజము=నిజముగాతమ్ముడను, ఇంద్రజిత్ +వధ+పరికీర్తుడయిన+మేటి+బంటునకు+అనుచున్=ఇంద్రజిత్తును+చంపి+పొగడబడిన+ గొప్ప+ యోధునకు-లక్ష్మణునకు+అనుకొనుచు,

ఆ. సఫలితార్థు లయిన సమ్మునీంద్రులు సాభి/నందనముగ దీవనలను గురియ,
విక్రమోన్నతంబు వ్రీడావనతమునై/వాని శిరము శోభమాన మయ్యె. **26**

సఫలిత అర్థులు=తీరినకోరికకలవారు, స అభినందనముగ=ప్రశంసలతో, విక్రమ+ఉన్నతంబు=పరాక్రమము చే+ఎత్తబడినట్టియు(ప్రశంసకు), వ్రీడ+అవనతమునై=(ఆశీర్వదింప)సిగ్గుచే+వంచబడినట్టియు అగు, శోభమాన మయ్యె=దీప్తివంతమయ్యె,

క. కేళీనివాసముగ నొక/ప్రోలు వినిర్మించె నిర్మముడు కాళిందీ
కూలంబున ఆ విజయర/మాలాలితమధురమూర్తి మథుర, యనంగన్. **27**

కేళీ=విలాస, ప్రోలు=నగరము, నిర్ మముడు=మమకారము లేనివాడు, కూలంబున=ఒడ్డున, విజయ+రమా+లాలిత+మధుర+మూర్తి=విజయ+లక్ష్మిచే+ప్రేమించబడ్డ+మనోహర+ఆకారుడు,(అదే కృష్ణుని కేళీ విలాస మథురానగరము)

క. స్వారాజ్యభిష్యందము/ధారుణి పై ఉపనివేశితం బయ్యె ననన్
సౌరాజ్యంబుగ తత్పురి/పౌరులు ముదమొంద నతడు పరిపాలించెన్. **28**

స్వా+రాజ్య+అభిష్యందము=స్వర్గపు+రాజ్యము+ఎక్కువగానున్న జనముతో మిక్కిలి వృద్ధిచెంది, ఉపనివేశితంబు=స్థాపింపబడినది, సౌరాజ్యంబుగ=సుపరిపాలనముచే, ముదమొంద=సంతోషింప,

క. అవలోకించుచు నతడట/భువనముపై నుండి చక్రవాకిని యమునన్
అవనీవేణిగ దలచున్/సువర్ణభూషణములతోడ శోభిలుదానిన్. **29**

అవలోకించుచు=చూచుచు, చక్రవాకిని=చక్రవాకపక్షులుకల, అవనీ+వేణిగన్+తలచున్=భూదేవి+జడగా+తలచెను, సువర్ణ+భూషణముల=బంగారు+ఆభరణములు,

తే. జనక దశరథ నృపులకు సరిసమముగ/మిత్రుడగు మంత్రదర్శి వాల్మీకిమునియు,
ఉభయుల ప్రియంబు గోరి యథోచితముగ/జానకీసూను లుభయుల సంస్కరించె.**30**

మంత్ర+దర్శి=మంత్రములను+మననమాత్రమున ఎఱుగువాడు, యథా+ఉచితముగ=తగినట్టు, సంస్కరించె= జనన సంస్కారక్రియలు జరిపె,

క. కుశలవములచే గ్రమముగ/శిశుగర్భక్లేదమార్పుసేయించి/సుధీ
కుశలుండు, వానిపేరిట/కుశలవులని పేర్లు రాచకొడుకుల కిడియెన్. **31**

కుశ+లవముల+చే=దర్భల+ఆవుతోకవెంట్రుక+తోడ, శిశు+గర్భ+క్లేదము=పిల్లడు+పుట్టునప్పటి+కష్టము, ఆర్పు+చేయించి=చల్లార+చేసి, సు+ధీ+కుశలుండు=మంచి+విద్యలలో+నేర్పుకలవాడు,

తే. విద్యలన్నియు, గొట్టినపిండి గాగ/చెప్పె గులపతి శేముషీసింధువులకు,
చిన్ని సైతేయులకు, సూర్యసితకరప్ర/కాశులకు, కించిదుత్క్రాంత శైశవులకు. **32**

కొట్టినపిండి=తెలిసినవిషయము, శేముషీ+సింధువులకు=ప్రజ్ఞలో+సముద్రమువంటివారు, సైతేయులకు= సీత పుత్రులకు, సూర్య+సిత+కర+ప్రకాశులకు=సూర్యుని+తెల్లని+కిరణములవలే+వెలుగువారికి, కించిత్ +ఉత్క్రాంత+శైశవులకు=కొంచము+గడచిన+బాల్యము కలవారికి,

క. ముని మరియు మనీషిపృథ/గ్జనరంజకరాగతాళసహితంబుగ, రా
తనయులకు బాడ నేర్పెను/తనకృతిరత్నము, గవిప్రథమసత్పథమున్. **33**

మరియు=ఇంకను, మనీషి+పృథక్+జన+రంజక+రాగ+తాళ+సహితంబుగ=పండితులకే+కాక+సామాన్య జనులకుకూడా+ఆనందింపచేయు+రాగ+తాళ+సహితంబుగ, తన+కృతి+రత్నము=తను+రచించిన+శ్రేష్ఠ రామాయణమును, కవి+ప్రథమ+సత్పథమున్=కవులకు+మొదటి+ప్రశస్తమైనదారిని,

ఆ. కన్నతల్లి ఎదుట కర్ణపేయంబుగా/భవ్యరామకథను పాడి పాడి,
పతివియోగదవథుభారము నొక్కింత/అడచి, మనుపగలిగె, గొడుకుజంట. **34**

కర్ణ+పేయంబుగా=చెవులకు+విందుగా, భవ్య=శుభమైన, పతి+వియోగ+దవథు+భారము=రాముని+ ఎడబాటు+పరితాపపు+బరువు, మనుపన్+కలిగె=జీవింపచేయ+కలిగెను,

క. త్రేతాగ్నిసములు రామ/భ్రాతలు మువ్వురును గూడ పడసిరి సుగుణ
స్ఫీతల, తమతమ పాణిగృ/హీతుల వలనం చెరియొక ఇద్దఱు సుతులన్. **35**

త్రేతాగ్ని+సములు=గార్హపత్యము దాక్షిణాగ్ని ఆహవనీయము అనుమూడు అగ్నులతో+సమానమైన తేజము కలవారు, పడసిరి=ప్రాప్తించిరి, సుగుణ+స్ఫీతల=మంచి గుణములు+వ్యాపించి ఉన్న, పాణిగృహీతుల=భార్యల,

తే. రాజ్యభోగానుభవము, శ్రీరాము గొలుచు/సుఖమునకు ఈడు గామి, అచ్చోట నిల్వ,
మనసు రామి శత్రుఘ్నుడు, మథుర వీడి/భ్రాతృదర్శనలోలుడై బయలుదేరె. **36**

ఈడున్+కామి=సమానము+కాకపోవుటచే, రామి=రాకపోవుటచే, లోలుడై=మిక్కుటమైన కోరికకలవాడై,

ఆ. వలవ దిపుడు గూడ వాల్మీకులకు తపో/వ్యయమటంచు గడచి యరిగె నతడు,
మైథిలేయగీతమాధుర్యనిష్పంద/హరిణదారకము, దదాశ్రమమును. **37**

తపో+వ్యయము+అటంచు=సౌకర్యములచేయుటందలి తపస్సు+నష్టము+అనుచు, మైథిలేయ= సీతకుమారుల, గీత+మాధుర్య+నిష్పంద+హరిణ+దారకము=రామాయణపారాయణ+మధురిమకు+ నిశ్చలముగానిలుచున్న+లేళ్ళుకల,

శా. ఆసౌమిత్రి నిరర్గళద్రుతశతాంగారూఢుడై వచ్చి, ర

థ్యాసంస్కారవిశోభితస్వపురపర్యాలోకనాపాకృతా
యాసుండై, సుచిరాగతున్ లవణసంహర్తన్, దనుంజూచి, ఎం
తే సంభావన సేసి పౌరులభినందింపన్, మహోల్లాసియై. **38**

ఆ+సౌమిత్రి=ఆ+శత్రుఘ్నుడు, నిరర్గళ+ద్రుత+శతాంగ+ఆరూఢుడై=అడ్డులేని+వడిగల+రథము+ఎక్కిన వాడై, రథ్యా+సంస్కార+విశోభిత+స్వ+పుర+పర్యాలోకన+అపాకృత+ఆయాసుండై=(రాజ)రథముల మార్గము+సిద్ధపరచుటచే+బాగా ప్రకాశించు+తన+పురము అయోధ్యను+చక్కగాచూచుటచే+తొలగిపోయిన +శ్రమ కలవాడై, సుచిరాగతున్=చాలాకాలమునకు వచ్చుచుండిన, సంభావన=గౌరవము, అభినందింపన్= కీర్తించగా, మహ్+ఉల్లాసియై=గొప్ప+ఉత్సాహియై

వ. రాచనగరు సభామధ్యమున సభాసదులు సేవింప గొలువున్న వాని, సీతాపరిత్యాగహేతువున భువి కసామాన్యపతి యైన వాని, రాముని దర్శించి సవినయముగ పాదప్రణామము గావించె. అన్నయు లవణాంతకుని, గడగొట్టుదమ్ముని, ఆలింగనము చేసికొని సముచితముగ అభినందించె. ఆ ప్రక్రియ మునుపు తురాసాహుడు కాలనేమిసంహర్తను, చక్రధరుని గొనియాడిన విధంబును స్ఫురింపజేసె.**39**

భువికి+అసామాన్య+పతి=భూమికి+పట్టపురాణి లేని అసాధారణమైన+రాజు, కడగొట్టు=ఆఖరి, ఆ+ప్రక్రియ= రాముడు పొగడు+ప్రకరణము, తురాసాహుడు=ఇంద్రుడు, కాలనేమిసంహర్తను=కాలనేమి అను రాక్షసుని చంపిన, చక్రధరుని=విష్ణువుని, స్ఫురింపజేసె=జ్ఞప్తికి తెచ్చె,

ఆ. అన్నయడుగ వార్త లన్నియ్యు వినిపించె/నందనోదయము వినా, అతండు,
అదను చూచి తానె ఆవిష్కరించుట/ఆదికవి మనీష యగుట, ఎఱిగి. **40**

నందనోదయము+వినా=కొడుకులు పుట్టుట+మినహాయించి, ఆవిష్కరించుట=ప్రకటించుట, మనీష+అగుట +ఎఱిగి=తెలివికలవాడు+అగునని+తెలిసికొని,

క. అంతట గురుమంత్రులతో/మంతన మొనరించి రాజమహిమాస్పదమున్
చింతించి , సల్పె ధరణీ/కాంతుడు హయమేధ మనెడు క్రతురాజంబున్.**41**

మంతనము=ఆలోచన, రాజ+మహిమ+ఆస్పదమున్+చింతించి=రాజుకు రాజ్యమునకు+గొప్పదనము+ ఉన్నతస్థితి కలిగించు పని+అనిఆలోచించి, హయమేధము=అశ్వమేధము,

తే. వార్వము ఇయక్షమాణుడై వదలినట్టి/అవధవల్లభుపై గుప్పి రవిరళముగ,
పైరుపై వారిధార లభ్రముల రీతి/ప్లవగరక్షోనరేంద్రు, లుపాయనములు. **42**

వార్వము=గుఱ్ఱము, నియక్షమాణుడై=నియమము తాల్చినవాడై, అవధవల్లభు=అయోధ్యారాజు- రాముడు, గుప్పిరి+అవిరళముగ=కురిపించిరి+ఎడతెగక, అభ్రముల=మేఘముల, ప్లవగ+రక్షో+నర+ఇంద్రులు=వానర+రాక్షస+మావవ+శ్రేష్ఠులు, ఉపాయనములు=కానుకలు,

మ. పిలుపుం గైకొని వచ్చిరన్న గరికిన్ బృందంబులై నల్గడన్
కల స్వస్థానము లొక్క భౌమములనే, కా దల్ల జ్యోతిర్మయం
బుల గూడన్, విడనాడి, నిర్భరమనోమోదంబునన్ భావితా
త్ములు వేలాదిమహర్షు లధ్వరమహంబుం జూడ నొక్కుమ్మడిన్. 43

బృందంబులై=గుంపులుగా, స్వస్థానము=వారివారిస్థలములు, భౌమముల=భూమిమీద ఉండునవి, జ్యోతిర్మయంబుల=ఆకాశము ఉండునవి, నిర్భర+మనో+మోదంబునన్=సంతోషముతో నిండిన+హృదయ+ఆనందముతో, భావితాత్ములు=బ్రహ్మజ్ఞులు, అధ్వర+మహంబుం=యాగ+ఉత్సవము,

తే. జానకి పరిత్యజించియు శ్లాఘ్యుడయ్యె/యాగయజమాని రాము డనన్యజాని,
జాతరూపమయాయోనిజాప్రతిమయె/ప్రీతిమై జాయ గాగ, పరిగ్రహించి. 44

పరిత్యజించియు=విడచిపెట్టినను, న అన్య జాని=ఇంకొకరుభార్యగాలేనివాడు, జాతరూపమయ=బంగారు మయమైన, అయోనిజా+ప్రతిమయె=సీతాదేవి+విగ్రహమే, పరిగ్రహించి=స్వీకరించి,

క. అక్షయసంభారముతో/దక్షతతో అధ్వరము యథావిధి జరిగెన్,
సాక్షాత్క్రియావిఘాతులు/రాక్షసులే యైరి దాని రక్షకు లచటన్. 45

అక్షయ=తఱుగని, సంభారము=వస్తువులు మరియు పరికరములు, దక్షత=సమర్థత, సాక్షాత్+క్రియా+విఘాతులు=స్వయముగా+యజ్ఞములకు+విఘ్నముకలిగించు,

తే. అపుడు వాల్మీకిరచితరామాయణమ్ము/గురువుపంపున బాడి రధ్వరవిరామ
వేళలం దచ్చటచట నా శాలయందు/కుశలవులు జానకీపుత్రకులు క్రమముగ. 46

పంపున=పంపగా, అధ్వర=యజ్ఞ, క్రమముగ=పద్ధతిప్రకారము,

ఉ. స్వరరాగంబుల మేళనంబు రసభావస్ఫూర్తిభూయిష్ఠమై
పరభాగంబు వహింప బాడిరి క్రతుప్రాగ్వంశభాగంబు ముం
దర ప్రాచేతసుపంపునన్ కుశలవుల్ తత్ప్రోక్తసర్వాంగసుం
దరరామాయణమందు నున్న రసవద్ఘట్టంబు లొక్కక్కటిన్. 47

స్వర+రాగ+మేళనంబు=ఉదాత్త స్వరములు+వివిధ రాగములు+మిశ్రము చేయుట, రస+భావ+స్ఫూర్తి+భూయిష్ఠమై=శృంగారాదిరసముల+ఆత్మ+ఆవేశము+మిక్కుటమై, పరభాగంబు+వహింప=సు సంపత్తి+కలిగి, క్రతు+ప్రాగ్వంశ+భాగంబు+ముందర=యజ్ఞశాల( యజమానుడులోనగువారుండు గృహము)+తూర్పుపక్క+భాగము+ఎదుట, ప్రాచేతసు+పంపునన్=వాల్మీకి+పంపగా, తత్+ప్రోక్త+సర్వ+అంగ+సుందర+రామాయణము=వాల్మీకిచే+చెప్పబడిన+అన్ని+అంశములు+అందముగా కలిగిన+రామాయణము, రసవత్+ఘట్టంబులు=సారవంతమైన+భాగములు,

ఉ. గేయరసంబు నొంపున అకృతిమబంధుర భావభూషితం
బై యెనలేని రామకథ యంట! ప్రణేత మహర్షి యంట, ఆ
గాయను లిద్దఱున్ మధురకంఠులు గానకళానిరర్గళ
శ్రీయుతు లంట! శ్రోతృజనచిత్తములెల్ల కరంగు, టబ్రమే! **48**

నొంపున=సమృద్ధిచే, అ కృత్రిమ+బంధుర+భావ+భూషితంబు=కృత్రిమముకాక సహజమైన+ఇంపైన+స్థాయీభావముతో+అలంకరింపబడినదై, ఎనలేని=సాటిలేని, ప్రణేత=రచించినవాడు, గాన+కళా+నిరర్గళ+శ్రీయుతులు=పాటపాడు+విద్యయందు+యధేశ్చతఅను+సంపదకలవారు, శ్రోతృ+జన+చిత్తములు+ఎల్ల+కరంగుట+అబ్రమే=విను+వారి+హృదయములు+అన్నియు+పరవశమగుట+ఆశ్చర్యమేమిన్నది,

క. శ్రీరాము డంత సభ్యుల/ప్రేరణమున వారి మధురవిగ్రహ, గీతి
శ్రీరామణీయకము, గ/న్నార గనుంగొనియె, వీనులారగ, వినియెన్. **49**

ప్రేరణమున=పురికొల్పగా, మధుర+విగ్రహ=శోభన+ఆకారము, గీతి+శ్రీ+రామణీయకము=పాటయొక్క+సంపత్కరమైన+ఒప్పిదము/అందము,

క. కవల కమనీయగీత/శ్రవణైకాగ్రత నుదశ్రుజలముఖి యయ్యెన్,
ఇవము నొన చినుకు ప్రాత/ర్ని వాతవిపినస్థలంబు క్రియ, సభయెల్లన్. 50

కవల=కుశలవుల, కమనీయ+గీత+శ్రవణ+ఏకాగ్రత=ఇంపైన+పాట+వినుటఅందలి+నిశ్చలచిత్తముతో, ఉద+అశ్రు+జల+ముఖి=కారిన+కంటి+నీరు కలిగిన+ముఖము కలవారు, ఇవము+నొన+చినుకు+ప్రాతర్+ నివాత+విపిన+స్థలంబు+క్రియ=మంచు+ద్రవము+కురుయు+ప్రాతఃకాల+గాలిఆడని+అడవి+ప్రదేశము+ వలె(కన్నీరు ద్రవిస్తూ కదలికలేనివారైరి),

క. వారి వయోపేషము లవి/పేటైన, కుశీలవుల గభీరమనోజ్ఞా
కారముల రాము పోలిక/లారసి, కనుఱెప్ప లార్పరైరి, సదస్యుల్. **51**

గభీర+మనోజ్ఞ+ఆకారముల=గంభీర+మనోహర+విగ్రహముల, ఆరసి=చూచి, సదస్యుల్=సభలోనివారు,

క. ఉభయుల ప్రతిభకు నలరిన/సభాసదుల విస్మయమును, సంతోషము, భూ
విభు కానుక నొల్లని తత్/ప్రభూత నిస్పృహత జూచి, పారము ముట్టెన్. 52

ప్రతిభ=బుద్ధి, అలరిన=ఆనందించిన, విస్మయము=ఆశ్చర్యము, ఒల్లని=అపేక్షింపని, ప్రభూత+నిస్పృహత=పుట్టుకతోవచ్చిన+ఆశలేని గుణము, పారము=గరిమ,

మ. నరనాథుండు కుమారులం బిలిచి సన్మానించి, "మీ రెవ్వరె
వ్వరి కావ్యం బది పాడుచుంటి" రనుచుం ప్రశ్నింప వా రిట్లు, ప
ల్కిరి, "సారస్వతపట్టభద్రులగు, వాల్మీకుల్ గురుల్ మాకు, త
త్కరుణన్ గానము సేతు మిట్లు, తదుపజ్ఞం బీ మహాకావ్యమున్" 53

సారస్వత+పట్ట+భద్రులగు=వాఙ్మయ+పీఠము అధిష్ఠించు+ముఖ్యులు,
తత్+ఉపజ్ఞంబు=వాని+(ఉపదేశము లేక తనంతట మొట్టమొదట తెలిసికొనబడిన)జ్ఞానము,

చ. అన విని నిండు మోదమున సావరజుం డత డేగి నాకుజ
న్మునకు నమస్కరించి,"అతిపుణ్యుడ నైతి, మహాత్మ! మీకృపన్,
వినుతికి నెక్కె , నాదు లఘువృత్తము ప్రీతిసమర్పణంబుగా
తనువు వినా, మదంచితపదం బఖిలంబు, బరిగ్రహింపవే! 54

స అవరజుండు=తమ్ములతోసహా, నాకు+జన్మునకు=పుట్టనుండి+పుట్టిన-వాల్మీకి, అతి+పుణ్యుడను=ఎక్కువ+సుకృతము చేసిన వాడను, వినుతికిన్+ఎక్కె=ప్రసిద్ధి+చెందినది, నాదు+లఘు+వృత్తము=నా+స్వల్ప+చరిత్రము, ప్రీతి=సంతోషముతో, సమర్పణము=అప్పగించుట, మత్+అంచిత+పదంబు+అఖిలంబు=నాచే+పూజింపబడిన+అధికార స్థానము+అంతయు, పరిగ్రహించవే=పుచ్చుకొనుమా,

ఉ. మింటికి నెత్తె మమ్మిపుడు మీ ప్రియశిష్యుల పాట మానసం
బంటి కదల్చె ఇట్టి పరమాద్భుతగానకళాతపస్వు లీ
జంట కుమారు లీ చిఱుతచక్కని చిక్కనితేజకూన లే
ఇంటికి వెల్గులో, కవికులేశ్వర! మాకు వినంగ వచ్చునే?" 55

మింటికి=ఆకాశమునకు, అంటి=హత్తుకొని, తపస్వులు=సాధకులు, చిఱుత+చక్కని+చిక్కని+తేజు+కూనలు=చిన్న+అందమైన+స్నిగ్ధ+తేజస్వంతులైన+పిల్లలు, ఏ ఇంటికి వెల్గులో=ఎవరి పిల్లలో

క. అన విని మహర్షి సీతను/మనుకులతిలకునకు ప్రతిసమర్పణ సేయన్,

తనకదియె తగిన తరుణం/బని తలచి వచించె నిట్టు లందఱు వినగన్. **56**

మనుకులతిలకు=రామునకు, ప్రతిసమర్పణ=తిరిగిఇచ్చుట, తరుణంబు=సమయము,

సీ. "కడవారు కారు, నీ కొడుకుగుబ్బలె వీరు/కడుపార వైదేహి కన్నవారు,
జననితో బాటు చేకొనుము బిడ్డల వీరి/అధిప! ప్రత్యుపకార మదియె నాకు,
నీ సమక్షమునగా నిజపవిత్రత సీత/ఆవిష్కరించె నా డగ్ని జొచ్చి,
దనుజు దౌరాత్మ్యము దలచి ఇక్కడివారు/ఆ పరీక్షను నమ్మ రందు వేని,
మరల మైథిలి తన అకల్మషత ప్రజలు/విశ్వసించెడు గతి నిరూపింప గలదు,
అంత నా పుత్రవతిని నీ వాదరించి/ఏలికొన దగు, మామతం బిది, కుమార! **57**

కడవారు=పరాయివారు, కుబ్బలె=పిల్లలె, సమక్షమునగా=ఎదుటనేకదా, నిజ+పవిత్రత=తన+పాతివ్రత్యము, ఆవిష్కరించె=ప్రకటించె, దనుజు=రావణుని, దౌరాత్మ్యము=చెడ్డతనము, అకల్మషత=నిర్మలత్వము, గతి=విధముగా, మామతంబు=నా అభిప్రాయము,

ఉ. నీ పరమార్థ మేదయిన, నిస్తులపావనశీల, అంతె కా
దోపగలేని, దాని నిటు లొంటి వనంబున ద్రోయ, వచ్చునే?
కాపురుషప్రలాపములు కైకొనవచ్చునె? మాకు మిక్కిలిన్
కోపము వచ్చె, నీ పయి, రఘుప్రవరా! కలమాట చెప్పితిన్. **58**

పరమ+అర్థము=ప్రధాన+ప్రయోజనము, నిస్తుల=సాటిలేని, ఓపగలేని=శక్తిలేని, కాపురుష+ప్రలాపములు=నికృష్టుని+అర్థములేనిమాటలు, కైకొన=లక్ష్యపెట్ట, కలమాట=ఉన్నమాట,

చ. వనమున డించినన్ వెఱచి వాచఱవన్ విని చేరబోయి, నే
ననునయ మాడి చేర్చితి మదాశ్రమమున్, కనియెన్ శుభాంగి యీ
తనయుల, నేను నోపిన విధంబున బెంచితి, తెచ్చితిట్లుపా
యనముగ, నీకు యాగసమయంబున బిడ్డల నప్పగింపగన్". **59**

డించినన్=దింపగా, వెఱచి=నిశ్చేష్టయై, వాచఱవన్=నోరుకొట్టుకొని ఆక్రోశింప, అనునయము+ఆడి=ఊఱడింపు మాటలు+చెప్పి, ఓపిన+విధంబున=శక్తి+కొలది, ఉపాయనముగ=కానుకగా,

వ. అని పలికి, తన ప్రతిపాదనకు రాముని అంగీకారము బడసి, అమ్మహాతపస్వి తన యంతేవాసి నంపి, నేమమున సిద్ధిని బలె, తపోవనమునుండి అయోనిజ నటకు రావించె. మరునాడు కాకుత్ స్థుడు

విశాలరమణీయమైన బహిరంగణమున పౌరజానపదసముదాయమును సమావేశపఱిచి తన్ను

బిలువనంపిన, **59**

ప్రతిపాదన=ప్రస్తావన, పడసి=తీసికొని, అంతేవాసి=శిష్యుని, నేమమున సిద్ధి=తపోనియమముచే+ సత్ఫలితము,

మ. స్వరసంస్కారవిరాజమాన యగు శ్రీ సావిత్రితో గూడి, ని
ర్భరతేజోనిధి, వాసరాధిపుని గొల్వంబోవు స్వాధ్యాయత
త్పరు భంగిన్, రఘునాథు చెంత కరిగెన్ వాల్మీకి, ప్రజ్ఞాధురం
ధరపుత్రద్వయసేవ్యమానయగు నా ధాత్రీతనూజాతతో. **61**

స్వర+సంస్కార+విరాజమాన అగు=ఉదాత్త స్వరము+మంచి ఉచ్చారణ కలిగి+స్పష్టతకల, శ్రీ+సావిత్రితో+ కూడి=పుణ్య+సావిత్రి ఋక్కుతో- గాయత్రీ మంత్రముతో+కలిసి, నిర్భర+తేజోనిధి=పూర్ణ+ప్రకాశమునకు ఆశ్రయముమైన, వాసర+అధిపుని=దినమునకు+ప్రభువు-సూర్యుని, కొల్వంబోవు=పూజింప పోవుచున్న, స్వాధ్యాయ+తత్పరు+భంగిన్=వేద అధ్యయనము చేయుటయందు+శ్రద్ధకలవాని+వలే, ప్రజ్ఞా+ధురంధర= బుద్ధిఅందు+శ్రేష్టులు అయిన, పుత్రద్వయ+సేవ్యమానయగు=ఇద్దరు పుత్రులచే+రక్షింపబడుచున్న, ఆ+ధాత్రీతనూజాతతో=ఆ+సీతాదేవితో, రఘునాథు+చెంతకు+అరిగెన్=రాముని+వద్దకు+వెళ్ళెను.

సీ. విమల కాషాయ సంవీతమైన ప్రశాంత/విగ్రహముననె సాధ్వీత్వగరిమ
ఆవిష్కరింపుచు, అవికారమగు చూపు/పదపయోజములపై కుదురు కొలిపి
వచ్చిన వైదేహి, వంక చూడక ఎల్ల/జనులు తదాలోకసరణి నుండి
దృష్టులు ప్రతిసంహరించి, పండిన చేల/వడువున అవనత వదను లయిరి.
అంత, నాస్థితవిష్టరుడైన సుకవి/సీత గనుగొని, "తల్లి! నీ శీలశుద్ధి,
విషయమున నిప్డు పతిదృష్టివిషయమందె/జనుల సందేహములు తీర్పు"మనుచు బనిచె.**62**

సంవీతమైన=దుస్తులుధరించిన, సాధ్వీత్వ+గరిమ+ఆవిష్కరింపుచు=పాతివ్రత్య+సీమ+ప్రకటించుచు, అవికారమగు+చూపు=చిత్తవృత్తిలేని+చూపులు, పద+పయోజములపై+కుదురు+కొలిపి=పాద+ పద్మములపై+స్థిరముగా+నిలిపి, వంక+చూడక=ఆమెవేపు+చూడజాలక, తత్+ఆలోక+సరణి=ఆమె+ చూపుల+మార్గమునుండి, ప్రతిసంహరించి=లోపలచేర్చుకొని, వడువున=విధమున, అవనత+వదనులు+ అయిరి=అపనింద వేసినందుకు సిగ్గుతో వంచిన+తలలు+కలవారైరి. ఆస్థిత+విష్టరుడైన=సభలో+ ఆసీనుడైన, పతి+దృష్టి+విషయమందె=రాముడు+నిందను చూచిన+ప్రకరణలో, పనిచె=పంపెను,

వ. పనిచిన, జానకి సభామధ్యమునకు వచ్చి, అమ్మహామునికి మ్రొక్కి, తదీయ
శిష్యకరావర్జితమైనపుణ్యజలముల నాచమించి, మోడ్పుగేలు నిటలమున ఘటించి,
భూదేవి నుద్దేశించి ధీరగంభీరస్వరమున నిట్లనియెను. 63

కర+ఆవర్జితమైన=చేతియందు+వంపబడిన, ఆచమించి=జలము మూడుసార్లు ఆచమనము చేసి, మోడ్పున్+కేలు=ముకుళించిన+చేతులు, నిటలమున=నుదుట, ఘటించి=ఉంచి, ధీర+గంభీర+స్వరమున =ధృఢమై+మంద్రమైన+గొంతుతో,

మహాస్రగ్ధర. "మనసా కాయేన వాచా, మగనికి ఎపు డే మాత్రము దప్పనేనిన్,
మనువంశస్వామి, నాకుం బతియును, గురుడున్, మాన్యుడున్, దైవమేనిన్,
చనుదెమ్మా, భూతధాత్రీ! జననీ! భగవతీ! క్షాంతిదాక్షిణ్యమూర్తీ!
నను నీలో గల్పుకొమ్మా! ననిచిన కరుణన్ నా నెగులు మాన్పవమ్మా" 64

తప్పనేని=అపచారము చేయనేని, మాన్యుడు=గౌరవార్హుడు, చనుదెమ్మా=రా అమ్మా, భూతధాత్రీ=భూ దేవీ, భగవతీ=పూజ్యురాలా, క్షాంతి+దాక్షిణ్య+మూర్తీ=ఓర్పు+కనికరము+మూర్తీభవించినదానా, ననిచిన= అతిశయించిన, నెగులు=దుఃఖము,

శా. పాతివ్రత్యధురీణ పార్థివి ఇటుల్ బాసాడుటే జాగుగా,
తోతెంచెన్ జనతాసమక్షమున సద్యోభూతభూరంధ్రని
ష్ఠ్యూతంబై, అవితర్కితోపనతమై, ఉద్దండశాతహ్రద
జ్యోతిస్సన్నిభమై, వెలుగు నొక తేజోమండలం, బచ్చటన్. 65

పాతివ్రత్య+ధురీణ=పతివ్రతలలో+అగ్రగణ్య, పార్థివి=భూపుత్రి-సీత, బాస+ఆడుటే+జాగుగా=మాట+అనుటే+ ఆలస్యముగా, తోతెంచెన్=ప్రత్యక్షమయ్యె, సద్యోభూత+భూరంధ్ర+నిష్ఠ్యూతంబై=అప్పుడే కలిగిన+భూమి యొక్క రంధ్రమునుండి+వెదజల్లబడినదై, అవిత+అర్కిత+ఉపనతమై=రక్షకుడైన+సూర్యుని+సమీపించు నట్లున్నదై, ఉద్దండ+శాతహ్రద+జ్యోతి+స్సన్నిభమై=పొడవైన+మెఱుపు వంటి+కాంతి+సదృశమై, వెలుగు= ప్రకాశించు, తేజోమండలంబు=కాంతి పుంజము,

శా. అక్షీణద్యుతిమండలాంతరమునం దావిర్భవం బంది
ప్రత్యక్షంబయ్యె సదస్యు లచ్చెరువడన్, దర్వీకరేంద్రస్ఫటో
ద్వ్యక్షిప్తోన్నతసింహపీఠగతయై, తేజోదురాలోకయై
సాక్షాన్మేదిని సప్తసాగరసమంచత్కాంచి, చిత్రంబుగన్. 66

అక్షీణ+ద్యుతి+మండల+అంతరమున+అందు=ఎడతెగని+జ్యోతి+చక్రము+మధ్య+నుండి, ఆవిర్భవంబంది=పుట్టి, దర్వీకర+ఇంద్ర+స్ఫట+ఉద్విక్షిప్త+ఉన్నత+సింహపీఠ+గతయై=(చేతివంటిపడగకల) పాము-ఆదిశేషుని+ఇంద్రనీలముకల+పాము పడగవలె+తన్నుకు వచ్చిన+ఎత్తైన+సింహాసనమున+కూర్చున్నదై, తేజో+దుర్ ఆలోకయై=తేజస్సుచేత+చూడశక్యము కానిదై, సాక్షాన్మేదిని=స్వయముగా భూదేవి, సప్త+సాగర+సమంచత్+కాంచి=ఏడు+సముద్రములు+సుందరమైన+వడ్డాణముగా కలదై, చిత్రంబుగన్=ఆశ్చర్యముగా,

మ. క్షితిసీమంతిని వల్లభప్రణిహి తాక్షిం బుత్రి నంకోపరి
స్థిత గావించి, కవుంగిలించుకొని ఉద్రిక్తాంతరంగంబునం
"బతి సాంగత్యము చాలు నింక, పదవే మాతల్లి" యంచున్, సుతా
సుతు, లమ్మా! యని యేడ్చుచుండ త్రుటిలో జొచ్చెన్ బలిస్థానమున్. **67**

క్షితి+సీమంతిని=భూ+దేవి, వల్లభ+ప్రణిహిత+అక్షిం=భర్తరామునిపై+ఉంచబడిన+కన్నులు కలదైన, అంక+ఉపరిస్థితన్+కావించి=తోడపై+కూర్చున్నదానిగా+చేసి, ఉద్రిక్త+అంతరంగంబునం=స్పష్టమైన+మనస్సుతో, సాంగత్యము=కలయుక, సుత=సీత(అమ్మా అని తల్లిభూదేవినిఉద్దేశించి), సుతులు=కుశలవులు (అమ్మాఅనితల్లి సీతను ఉద్దేశించి), త్రుటిలోన్+చొచ్చెన్=ఇంచుక కాలములో+ప్రవేశించె, బలిస్థానము=పాతాళము,

మ. కవలం దేర్చి ప్రియాప్రతిగ్రహణకాంక్షాభంగసంరంభియై
భువిపై నల్గిన, రాఘవేంద్రు రభసంబున్ లౌల్యమున్ మాన్పి, యో
గ్యవచోయుక్తుల దైవతంత్ర మవిలంఘ్యం బౌట రూపించి, స
త్కవిచూడామణి సంఘటించె సుతయోగప్రీతిపారమ్యమున్. **68**

కవలం+తేర్చి=కుశలవుల+ఓదార్చి, ప్రియా+ప్రతిగ్రహణ+కాంక్ష+భంగ+సంరంభియై=సీతను+స్వీకరించు+కోరికకు+ఆటంకముచేత+ఉద్రేకియై(భూమిపై ధనస్సు తీసుకొని ఎదుర్కొను ప్రయత్నము ఆరంభించి), అల్గిన=కోపించిన, రభసంబున్+లౌల్యమున్+మాన్పి=తొందరపాటును+చపలతను+మానిపించి, యోగ్య+వచో+ఉక్తుల=తగిన+(శాస్త్ర శృతి స్మృతి బద్ధ)ఉపదేశపు+మాటల, దైవ+తంత్రము+అవిలంఘ్యంబు+ఔట+రూపించి=బ్రహ్మ+కార్యవిశేషము+దాటరానిది+అగుట+నిర్ణయింపచేసి, సత్కవి చూడామణి=మంచికవులలో+రత్నము-వాల్మీకి, సంఘటించె=రామునకు పొందుపఱచె, సుత+యోగ+ప్రీతి+పారమ్యమున్=కొడుకులను+కలియు+ప్రియపు+ఉత్కృష్టత,

క. ఆమూలవిధివదవసిత/శామిత్రుడు రాము డంత శాంతహృదయుడై

ఆమంత్రించె పురస్కా/రామోదితులైన ఋషుల నాప్తుల నెల్లన్. **69**

ఆమూల+విధివత్+అవసిత+శామిత్రుడు=ఆమూలాగ్రముగా+యథావిధిగా+ముగిసిన+అశ్వమేధయాగము కలవాడు, ఆమంత్రించె=వీడుకొలిపె, పురస్కార+అమోదితులైన=సత్కారముతో+సంతసించిన,

క. కృతముగ్గడించి వినయా/న్వితుడై ప్రణమిల్లి వీడ్కొనియె నాదికవిన్
వెత విడిచి నిలిపె సీతా/గతానురాగంబు, నామె కానుపుమీదన్. 70

కృతము+ఉగ్గడించి=చేసిన మేలును+ప్రకటించి, వినయ+అన్వితుడై=వినయము+కూడినవాడై, వెత = దుఃఖము, నిలిపె=లగ్నముచేసె, సీత+ఆగత+అనురాగంబు=సీతనుండి+ప్రాప్తించిన+అనురాగమును, ఆమె కానుపు=ఆమె బిడ్డల,

క. ఆశీర్వదించి భరతు న/ధీశుని గావించె, దా మహీయః ప్రీతిన్,
దాశరథి, యుధాజితు సం/దేశము బాటించి సింధుదేశంబునకున్. **71**

అధీశుని=రాజుని, మహీయః=అధికతర, యుధాజితు=భరతుని మేనమామ యుధాజిత్తు, సందేశమున్+పాటించి=నియోగము+ఆదరించి,

క. భరతుడు గంధర్వుల సం/గరమున విజయించి వారి నాతోద్యమునే
కరమున గ్రహింపజేసెను/స్థిరముగ, నాయుధములన్, త్యజింపగ జేసెన్. **72**

ఆతోద్యమునే=వీణవంటివాద్యములే, స్థిరముగ=శాశ్వతముగా, త్యజింపగ జేసెన్=విడుచునట్లు చేసెను,

వ. అతండు మాండవీశుక్తిమౌక్తికములు తక్ష, పుష్కలులను, తన తనయులను వారి పేర్ల ప్రసిద్ధికెక్కిన తక్షశిలా, పుష్కలావతీ నగరముల కధిపతుల గావించి రామాంతికమున కరుదెంచె. రామాదేశమున ఊర్మిళాగర్భసంభూతులు లక్ష్మణకుమారు లంగద, చంద్రకేతులు కారాపథదేశమున కేలికలైరి. శత్రుఘ్నుడు శ్రుతకీర్తివలన గనిన తన పుత్రుల సుబాహు బహుశ్రుతులను మధురా, విధిశానగరముల కభిషేకించి అన్న సన్నిధికేతించెను. **73**

అతండు=భరతుడు, మాండవీ+శుక్తి+మౌక్తికములు=మాండవిఅను+ముత్తెపుచిప్పనుండి పుట్టిన+ముత్యాలు, రామ+అంతికమునకు=రాముని+సమీపమునకు,

క. ఈ పగిది యథావిధి నా/రోపితసుతులైన సోదరులు నడపిరి త
ద్భూపతులు, భర్తృలోక/ప్రాపితలగు, మాతలకు నివాసాదివిధుల్. **74**

పగిది=ప్రకారము, అరోపిత+సుతులైన=(సింహాసనముల)ఎక్కింపబడిన+కుమారులు కలవారైన, భర్తృలోక +ప్రాపితలగు=దశరథుని పుణ్యలోకము+ప్రాప్తించిన-చనిపోయిన, నివాసాదివిధుల్=శ్రాద్ధ తర్పణ క్రియలు,

శా. కాలుండంత తపస్వివేషధరుడై కాకుత్ స్థునిం జేరి, "భూ
పాలేగ్రేసర! నే రహస్యముగ సంభాషింతు నీతోడ, ఆ
వేళన్ రాదగ డెవ్వడైన నటకున్ విచ్చేసెనా వాని నీ
వాలోచింపక ఇల్లువాపవలయున్ వ్యామోహదూరుండవై" 75

కాలుండు=యముడు, రా+తగదు=రా+కూడదు, ఇల్లువాపవలయున్=ఇంటిబహిష్కరణ చేయవలెను, వ్యామోహ+దూరుండవై=అతిప్రేమకు+దూరముగా ఉండి,

మ. అని ధాత్రీశుని అట్లొడంబరిచి ఏకాంతంబునన్ ధర్ముడా
తనికిం దత్ప్రకృతిస్వరూపమును తన్మాయానరాకార సం
జననంబున్ వివృతంబు సేసి ఇక స్వస్థానం బధిష్ఠింప బ్ర
హ్మనియోగంబున వేడవచ్చితని సంభాషించు చున్నంతలో 76

ధర్ముడు=యముడు, ఒడంబరిచి=సమ్మతింపచేసి, తత్+ప్రకృతి+స్వరూపమును=వాని+నిజమైన+విష్ణు స్వభావము, తన్+మాయా+నరాకార సంజననంబున్=వాని+కపట+మానవునిగా+పుట్టుట, వివృతంబు+సేసి=బైట+పెట్టి, స్వస్థానంబు=వైకుంఠము, అధిష్ఠింప=ఆశ్రయింప, బ్రహ్మ+నియోగంబున=బ్రహ్మగారి+పనుపున,

తే. తెలిసియు దదీయసమయ మతిక్రమించె/ద్వాఃస్థితుడు లక్ష్మణుడు మాయ దైవనియతి,
రామసందర్శనార్థి దుర్వాసువలన/కులమున కుపప్లవము దెచ్చికొనగ జంకి. 77

తెలిసియు=రాముడిచ్చిన మాట తెలిసియు, తదీయ+సమయము+అతిక్రమించె=రాముని+ఆజ్ఞ+మీఱె (దూర్వాసుని రామునివద్దకు పంపె), ద్వాః+స్థితుడు=ద్వారమున+ఉన్నవాడు, దైవనియతి=దేవుని+భాగ్యమున, ఉపప్లవము=(కోపశాపమున)ఉపద్రవము,

క. సరయూతరంగిణికి జని/విరజస్తము డలఘుయోగవిదు డతడు, వపుః
పరివర్జనమున నిజసో/దరశేఖరు ప్రతిన నవితథము గావించెన్. 78

తరంగిణి=నది, వి రజస్+తముడు=రజస్సు తమస్సుగుణములులేనివాడు, అలఘు+యోగ+విదుడు=విస్తారముగా+యోగమార్గము+తెలిసినవాడు, వపుః+పరివర్జనమున=శరీరమును+పూర్తిగావిడచి, అవితథము=యథార్థమైనదిగా,

క. తన నాలవ పాలైన త/దనుజన్ముడు మొదట నాక మధిరోహింపన్,
మనియె భువిమీద శిథిలిత, తనుడై శ్రీపతి త్రిపాదధర్మము కరణిన్. 79

నాకము+అధిరోహింపన్=స్వర్గమునకు+ఎక్కగా-మరణించగా, మనియె=జీవించె, శిథిలిత+తనుడై =లక్ష్మణుడుతనలోనాల్గవభాగముగాభావించుటచేసంధులు సడలిన+శరీరముకలవాడై, త్రిపాద+ధర్మము+ కరణిన్=మూడు కాళ్ళతో నడచు+ధర్మము+వలె(త్రేతాయుగమున ధర్మము త్రిపాదకము),

చ. అనుపమశీలయైన ప్రియురాలిని మున్నటు త్రోసి పుచ్చితిన్
నను నిరసించి పోయెను మనస్విని, యవ్వల ప్రాణమైన నా
అనుజుని గూడ బోనడచి, తక్కట! ఇన్నిట శూన్యమైన, నా
మను విక జాలు నంచు, రఘుమండను డాత్మ దలంచి గ్రక్కునన్. 80

అనుపమ=మేలైన, త్రోసిపుచ్చితిన్=గెంటివైసితిని, నిరసించి=పరిహరించి, అవ్వల=బహిః, పోనడచి= వెడలగొట్టి, మనువు=జీవితము, గ్రక్కునన్=వెంటనే,

తే. కుటిలపరిపంథికుంజరాంకుశుని కుశుని/మగని జేసి కుశావతీ నగరమునకు,
చారుతరసూక్తి సంచితసజ్జనాశ్రు/లవుని లవుని శరావతీధవుని జేసి. **81**

కుటిల+పరిపంథి+కుంజర+అంకుశుని=కపట+శ్రతువులనే+ఎనుగును+అణచుఅంకుశము వంటివాడు, చారుతర+సూక్తి+సంచిత+సజ్జన+అశ్రు+లవుని=మిక్కిలి చక్కని+మాటలచే+సంపన్నతతో+సుజనులకు+ ఆనందాశ్రుకణములు+కార్పించువాడు,

క. సయపీయసు డగుచు నుదక్/ప్రయాణమై చనియె దాశరథి, నిర్వికృతిన్
దయితస్నేహంబున, ద/న్నయోధ్య గృహవర్జితముగ ననుగమింపన్. **82**

స+అవీయసుడు=తమ్ములతోకూడి, ఉదక్+ప్రయాణమై=ఉత్తరదిక్కుకు+మహాప్రస్థానము చేసి, నిర్వికృతిన్ =వికారములేక, దయిత+స్నేహంబున=ప్రియమైనవాడు రాముని అందు+అనురక్తితో, తన్ను+అయోధ్య =తనను+అయోధ్యావాసులు, గృహవర్జితముగ=ఇండ్లను విడచి, అనుగమింపన్-వెంటరాగా,

క. భావాభిజ్ఞులు వెసర/క్షోవానరవరులు వచ్చి చొచ్చిరి, ముక్తా
పీవరజనాశ్రుకణికా/ప్లావితమగు తత్పథమును పరమోత్సుకులై. **83**

భావ+అభిజ్ఞులు=రాముని మనస్సు+తెలిసిన, వెస=శీఘ్రముగా, ముక్తా+పీవర+జన+అశ్రు+కణికా+ప్లావిత మగు+తత్+పథమును=రాల్చిన+పెద్దవైన+ప్రజల+కన్నీటి+బొట్లుతో+వ్యాప్తమైన+రాముని మార్గమును,

క. సురుచిర విమానమున రఘు/వరు డేగుచు గాఢభక్తివాత్సల్యమునన్,
సరయువు ననుయాయులకున్/సురపుర నిశ్రేణి జేసె సొంపెసలారన్ **84**

సు+రుచిర=మంచి+అందమైన, గాఢభక్తి+వాత్సల్యమునన్=వారి అధికమైన భక్తిచే+పిల్లలందు కలుగునట్టి ప్రేమకలిగి, అనుయాయులకున్=వెంటవచ్చువారికి, సురపుర=స్వర్గమునకు, నిశ్రేణి=నిచ్చెన, నొంపు+ ఎసలారన్=సంతోషము+అతిశయింపగా

తే. గోప్రతరకల్పమయ్యెను క్రుంకులిడిన/జనుల సమ్మర్దమున్న ఈసలిలమందు,
అట్లగుట, నాస్థలంబు తదాఖ్యతోడి/పావనోత్తమతీర్థమై ప్రణుతి కెక్కె. **85**

గొ+ప్ర+తర+కల్పము+అయ్యెను=గోవులు+సులభముగా+దాట+ఉచితమైనరేవు+ఆయెను, క్రుంకులిడిన+ జనుల+సమ్మర్దము+అన్న+ఈ+సలిలమందు=మునుగుచున్న+ప్రజల+త్రొక్కిసలాటతో+ప్రసిద్ధిచెందిన+ఈ +తీర్థము+అందు, తదాఖ్య+తోడి=ఆపేరు-గోప్రతారము+తోడ, పావన+ఉత్తమ+తీర్థమై=పవిత్రజలముతో +శ్రేష్ఠ+తీర్థస్థలమై, ప్రణుతి=ప్రసిద్ధి,

క. తమతొల్లిటి తేజోరూ/పము లొందిరి, దివము చేరి భానుసుతాదుల్,
అమరీభూతనిజాశ్రిత/సమితికి గల్పించె శౌరి స్వర్గాంతరమున్. **86**

తొల్లిటి=రామావతారమునకు పూర్వపు, దివము=ఆకాశము, భానుసుతాదుల్=సుగ్రీవాదులు, అమరీభూత +నిజ+ఆశ్రిత+సమితికి=క్రొత్తగా స్వర్గము చేరిన+తనను+ఆశ్రయించిన+అయోధ్యాపురవాస సమూహము నకు, కల్పించె=సృజించె, స్వర్గ అంతరమున్=వేఱొక స్వర్గమును,

మ. మరుదర్థంబుగ నిట్లు పంక్తిముఖ సంహారంబు గావించి, శ్రీ
హరి లోకత్రితయాశ్రయమ్మగు, స్వదేహంబున్ ప్రవేశించి, ప్రే
మరసైకాస్పదులన్ విభీషణ హనూమద్వీరులన్, దక్షిణో
త్తరశైలంబులబాదుకొల్పె, స్వయశఃస్తంభద్వయప్రక్రియన్. **87**

మరుత్+అర్థంబుగ=దేవతల+ప్రయోజనము కొఱకు, పంక్తిముఖ=రావణ, లోకత్రితయ+ఆశ్రయమ్మగు= మూడు లోకములకు+ఆశ్రయింపదగ్గ, స్వదేహము=విష్ణు స్వరూపము, ప్రేమరస+ఏక+ఆస్పదులన్= సౌహార్థము+ఒక్కటే+స్థానము చేసుకున్నవారైన, శైలంబులన్+పాదుకొల్పె=కొండలపై+స్థిరపఱచె, స్వ+యశః+స్తంభ+ద్వయ+ప్రక్రియన్=తన+కీర్తిచాటు+జయస్తంభాల+జంట+అధికార చిహ్నాములుగా (విభూషణుని దక్షిణమున, హనుమను ఉత్తరమున)

# షోడశ సర్గము కుముద్వతీ పరిణయము

<u>**గమనిక:**</u> అర్థములు, కొండకచో అన్వయముతో సహా ఇప్పటివరకు ఇచ్చినట్లు కాక, ఇటుపై క్లిష్టసమాసములకు మాత్రమే ఇవ్వబడును. మిగిలిన చోటుల పదములకు మాత్రమే అర్థములు ఇవ్వబడును. చదువరులకు అన్వయించుట అభ్యాసము అగుటచే, ఇటుపై ఈ ప్రక్రియవల్ల స్వయముగా అన్వయము చేయుట అలవాటు/అభ్యాసము అగునని ఆకాంక్ష. సుగమమైనప్పుడు సమాసముల పదవిభజన చూపడమైనది. అన్వయము ప్రకారము అర్థములు, పూర్తి సమాసార్థములు కొన్నిటి అందు మాత్రమే ఇవ్వబడినవి

చ. జనకుల పిమ్మటన్ తమకు జన్మగుణంబుల పెద్ద కావునన్,
సునిశితధీనిరంకుశు కుశుం దమ నాయకుగా వరించి, పా
యని యనురక్తి గొల్చిరి లవాదులు రాఘవవీరు లేడ్వురున్,
ఘనమగు, ఆనువంశికముగా, సహజన్ముల పొత్తు వారికిన్. 1

జన్మగుణంబుల=పుట్టుకలోనే కాక సత్య శౌర్యాది గొప్ప గుణముల, పెద్దకావునన్=అగ్రజుడు కనుక, సునిశిత =బాగాసాన పెట్టబడిన, ధీ=బుద్ధిచే, నిరంకుశు=అనివార్యుడు, పాయని=విడవని, ఘనమగు=ధృఢమైన, ఆనువంశికముగా=వంశపారంపర్యముగా,

తే. ప్రౌఢిమంతులు సేతువార్తామదేభ/బంధముఖకర్మకర్మఠుల్, భ్రాతలెల్ల,
కాని, కంరాశి చెలియలికట్ట బోలె/తలకడవ, రాత్మదేశసీమల నొకింత. 2

ప్రౌఢి=సమర్థత, సేతు=జలాశయము, వార్తా=వ్యవసాయము గోరక్షణ మొదలగుజీవనోపాయములు, మదేభ బంధ=ఏనుగులపట్టుకొనుట, ముఖ=మొదలగు, కర్మ+కర్మఠుల్=పనులందు+కార్యశూరులు,(రాజుకు ముఖ్య అభివృద్ధి ధర్మములు: ఎనిమిది: వ్యవసాయము, వాణిజ్యము, కోటలు, జలాశయములు, ఏనుగులు, గనులనుండి రత్నములు ఇతర ఖనిజముల సంపాదన, గ్రామములు), కంరాశి=సముద్రము, తలకడవరు=అతిక్రమించరు, సీమ=హద్దు

తే. విస్తృతి వహించె అష్టధాభిన్నమయ్యు/ఆ చతుర్భుజాంశప్రభవాన్వయంబు,
ప్రచుర దానప్రవృత్తి బారంబు ముట్టి/సామయోనిసురేభవంశంబు, రీతి. 3

విస్తృతి=వ్యాప్తి, అష్టధా+భిన్నమయ్యు=ఎనిమిదిగా+విభజింపబడిననూ, చతుర్భుజ+అంశ+ప్రభవ+అన్వయంబు=విష్ణువు+అంశ-రాముని+జన్మకు కారణమైన+వంశము, ప్రచుర=అధిక, దాన ప్రవృత్తి=త్యాగ

శీలత, పారంబు=పరాకాష్ట, సామయోని=సామవేదమునపుట్టిన(అని ప్రతీతి), సుర+ఇభ=దేవ+ఏనుగులు-ఎనిమిదిదిగ్గజములు,

వ. మైథిలీసుతాగ్రజు డొకనాడు స్తిమితప్రదీపమును, ప్రసుప్తసర్వజనంబును, అయిన నిజశయనాగారంబున కించిదావర్జితవదనుడై లోకహితరాజకార్యపరంపరాపర్యాలోచనా నిమగ్న మానసుడై, నిశీధినీ పర్యంతము మేలుకొని యుండి, ఎట్టకేలకు నెమ్మిగ మెత్తుటయు, గట్టెదుట అదృష్టపూర్వయైన వనిత యొకర్తు, ప్రవాసస్థకళత్రవేషధారిణి, గోచరించె. అప్పుడప్పుడమిఱేని గనుంగొని సంభ్రమమున 4

స్తిమిత+ప్రదీపము=నిశ్చలమైన+పెద్దదీపము, ప్రసుప్త=బాగానిద్రించిన, కించిత్=కొంచము, ఆవర్జిత=వంచిన, పర్యాలోచన=చక్కగా ఆలోచించుట, నిమగ్న=మునిగిన, నిశీధినీ=రాత్రి, పర్యంతము=అంతా, కట్టెదుట=ఎదురుగా, అదృష్టపూర్వయైన=ఇంతకుముందు చూడని, ప్రవాసస్థ+కళత్ర=భర్త దూరదేశమున+ఉండినభార్య, సంభ్రమము=వేగిరపాటు,

క. తలచీర అరసికొని, ఆ/పొలతుక జయజయనినాదపూర్వకముగ, అం
జలి సంఘటించి కొండొక/తొలగి నిలచె, నిభృతిగరిమ తొణికిసలాడన్. **5**

అరసికొని=సద్దుకొని, పొలతుక=స్త్రీ, పూర్వకముగ=ముందుగాచేసి, సంఘటించి=జోడ్చి, కొండొక=కొంచము, తొలగి=ఒదిగి, నిభృతి=వినయ, గరిమ=సీమ, తొణికిసలాడ=అతిశయించ,

క. అనపోఢదృఢార్గళ మగు/తన వాసగృహంబు అన్నితంబిని అద్దం
బును, నీడవోలె చొచ్చుట/కనయము వెఱగంది, ఆమె కత డిట్లనియెన్. **6**

న+అపోఢ=తీయబడని, దృడ+అర్గళము=దిట్టమైన+తలుపుగడియ, నితంబిని=స్త్రీ, అద్దంబును+నీడవోలె=అద్దములో+బింబమువలె, చొచ్చుటకు=ప్రవేశించుటకు, అనయము=మిక్కిలి, వెఱగంది=ఆశ్చర్యపడి

సీ. "అతిసురక్షితమైన అవరోధమునకు రా/అవరోధరహిత వెట్లయితి విపుడు?
ప్రతిహారికాంధంకరణి యైన శాంబరీ/శక్తి నీ కేవిద్య సంభవించె?
ప్రబలయోగప్రభావమున వచ్చితి వన్న/అదియు, మృగ్యంబు నీయందు జూడ,
పెనుమంచుజడికి గుందిన మృణాళిని మాడ్కి/దుఃఖభాజనవుగా తోచు కతన,
ఎవ్వతెవు? సాధ్వి! ఎవ్వని గృహిణి వీవు/తెలుపు మే నేమి కావింప గలను నీకు?
వింటి వనుకుందు, పరవధూవిముఖ మనుచు/మహితవిజితేంద్రియుల రఘూద్వహులమనసు". **7**

అవరోధము=అంతఃపురము, అవరోధ+రహిత=అడ్డగింపు+లేక, ప్రతిహారికి=ద్వారపాలకునకు, అంధంకరణి=అంధుని చేయు, ప్రబల=మిక్కిలిబలముకల, అదియు+మృగ్యంబు=(యోగులకు దుఃఖముండదు. నీవు

దుఃఖించుచున్నావు కనుక) అటువంటిది+కనబడదు, జడి=వాన, మృణాళిని=తామరతీగ, భాజన=స్థానము, తోచు=అనిపించు, కతన=కారణమున, పరవధూ విముఖము=పరస్త్రీలచూడ ఇచ్ఛగించరు, మహిత+విజితేంద్రియుల=గొప్ప+ఇంద్రియనిగ్రహముకల

చ. అనవిని ఆమె ఇట్లనియె," ఆత్మపదంబున కేగుచుండి, మీ,
జనయిత కట్టుకట్టుకొని, సర్వజనంబును వెంటనంటి రా,
ననుమతి యిచ్చి ఏ పురము నంతయు శూన్యము జేసె, నట్టి, మీ
మనుకుల రాజధానికి, క్షమావర! నేను చిరాధిదేవతన్. **8**

ఆత్మపదము=స్వ+స్థానము-వైకుంఠము, జనయిత=తండ్రి-రాముడు, కట్టుకట్టుకొని=కూడబెట్టుకొని, పురము=అయోధ్య, క్షమావర=భూవర, చిర=చిరకాలమునుండి, అధిదేవతన్=సంరక్షించుదేవతను,

వ. దేవతాస్వరూపిణులముకావున భవనాంతరప్రవేశముమాకు దుర్లభముకాదు. మరియు, పరధనపరదార విషయమున మీ అసిధారావ్రతము తెలియనిదానగాను. నా ప్రస్తుత మనోనిర్వేదము దేవరకు నివేదింప సాహసించి వచ్చితి. అవధారు, మహారాజా! **9**

అసిధారావ్రతము=వాడి కత్తిపై నాలుకతో రాయుటవంటి, నిర్వేదము=దుఃఖము, నివేదింప=విన్నపముచేయ, అవధారు=వినుము,

సీ. అతకరించితిని ము న్నమృతాశనౌకంబు/సౌరాజ్యసంభృతోత్సవసమృద్ధి,
అపహసించితిని, వస్వౌకసార నపేత/సారయంచు విభూతిసౌష్ఠవమున,
అధిగమించితిని సర్వాతిశాయిత్వంబు/ముక్తిదాయక మహాపురవరముల,
అనుభవించితిని పుణ్యశ్లోకు లైన/మీ పూర్వరాజేంద్రుల పోషణంబు,
అట్టి నే నిప్డు నా తొంటిపట్టు, వాసి/కతలుగా, వీతనాథనై చితికిపోతి,
పూవుటెత్తులు ముడిచిన తావునందె/మోయుచున్నాను, కట్టెలు పేయునేల. **10**

అతకరించు=మించు, అమృత+అశన+ఔకము=అమృతము+ఆహారముగాకలవారి+ప్రదేశము-స్వర్గము, సౌరాజ్య=సుపరిపాలనకల, సంభృత=సంపూర్ణమైన, ఉత్సవ=వేడుకల, సమృద్ధి=పుష్కలత, అపహసించు=కేలిసేయు, వస్వౌకసారము=అలకా పట్టణము, అపేత+సార=తొలగిపోయిన+ప్రాముఖ్యత, విభూతి=వైభవము, సౌష్టవము=ఆధిక్యత, అధిగమించితిని=పొందితిని, సర్వ+అతిశాయిత్వంబు=అన్నిట+ఆధిక్యము, దాయక=ఇచ్చు, మహా పురవరముల=అయోధ్య మధుర మాయా కాశి కంచి అవంతిక ద్వారవతి అని సప్తపుణ్య

క్షేత్రముల, పుణ్యశ్లోకులు=పవిత్రులు, పోషణ=ప్రాపకము, తొంటి=మునుపటి, పట్టు=శ్రేష్ఠస్థానము, వాసి=పోగొట్టుకొని, కతలుగా=కథమాత్రముగా, వీత=విడచిన, నాథుడు=రాజు, ఎత్తులు=దండలు, తావు=ప్రదేశము,

వ. శిథిలములైన కోటబురుజులతో, పలుతావుల విఱిగిపడిన ప్రాకారముతో, శోభాదరిద్రాణమై, మదీయ నివేశనము నేడు తిరోహితార్కమండలమై, ప్రభంజనపరిధ్వస్తమేఘమై, మసకమసకలు గమ్మి దివసావసానసమయమును విడంబించుచున్నది. రత్నప్రదీపరాజితో జాజ్వల్యమానములై వినోదక్రీడా మందిరములనుండి నిలయాభిగమ్యములగు పౌరజానపదులతో వాహనశ్రేణితో రాదారి వరకు గలకలలాడుచుండిన మత్పురశృంగాటకములు, నేడు గాఢాంధకారబంధురములై, చెవులు చిల్లులు వోవజేయు నూళలతో, ఆమిషార్థము దిరుగాడు కరాళసృగాలజాలమునకు ఆటపట్టులయినవి. జలక్రీడాసమయమున ఉత్తమప్రమదల మృదుకరాంబుజములచే మృదంగధీరస్వనోత్పాదన పూర్వకముగా మున్నాస్ఫాలితములగుచుండిన దీర్ఘికాతోయములు, నేడు విగాహితముష్కరవన లులాయసమూహశృంగాహతములై యాక్రోశించుచున్నవి. నివాసయోగ్యములైన తమ యష్టిఫలకములు భగ్నములగుట, నిశాసమయముల వృక్షశాఖలపై మేనులు వాల్చుచు మృదంగ శబ్దములతో కరతాళగతులతో దమ్మెలయించి ఆడించు నాథులు కఱవగుట, దొంటి లాస్యనైపుణ్యములు మఱచి, కారిచిచ్చునిప్పులకు కాలగా మిగిలిన తోకలాడించుచు క్రీడామయూరములు, వనమయూరములుగా పరిణమించిన మానీలకంఠములు నా కడుపు చుమ్మలుచుట్టించుచున్నవి. లావణ్యవతీజనములు మున్ను లాక్షారసార్ద్రములగు లలిత చరణారవిందములతో, అలసవిలాసముగా మెట్టిన నా నగరసౌధ మరకత సోపానములపై, నేడు సద్యోనిహతసారంగరుధిరప్రదిగ్ధ పదములు మోపుచున్న దుర్దమ శార్దూలములు నా మనంబును చింతాభరభుగ్నము జేయుచున్నవి. పిడియేనుగు లందించిన తామరతూడ్లతునకలతో తామర కొలనువెడలివచ్చిన ఆలేఖ్యశుండాలముల కుంభస్థలములు, తమ్మి ప్రహరించిన సంరబ్ధకంఠీరముల అకుంఠిత నఖరాంకుశాఘాతములచే నిర్దళితములై, మదీయ మందభాగ్యతకు ప్రతీకము లైనవి. విశీర్ణవర్ణవిన్యాసములై, పరిధూసరములైన, భవనస్తంభగత యోషిత్ప్రతిమలకు యాదృచ్ఛికముగ హత్తుకొని భుజంగనిర్ముక్తనిర్మోకములు, తదీయస్తనములకు వల్లెవాటులుగ నాచరించుచున్నవి. కాలాంతరమున దమ సున్నపుబూతలు నల్లబడుటవలన అపారదర్శకములుగా పరిణమించి, మాపటివేళల మునుపటివలె నిర్ధౌతహారగుళికావిశదము లయ్యును చంద్రపాదములను ప్రతిఫలింపజేయజాలక, అందందు మొలకెత్తిన చిఱుజవ్వి మొలకలతో బీటలు వాఱిన నా రమ్యహర్మ్య కుట్టిమములను విలోకించి, నాహృదయము వ్రయ్యలుగాక మానదు. పుష్పాపచయ

మునకు మున్ను లతాంగులచే మృదువుగా వంచబడుచున్న నా యుద్యానపాదపలతాశాఖలపై, నేడు క్రేళ్ళుదాటుచు, తైతెక్కలాడుచు వనవానరవర్గములు వానిని నా మనంబుతోపాటు క్లేశపఱచుచున్నవి. మందిరజాలకములు నేడు రేల భవనాంతర్గత దీపకాంతులను, పవళ్ళుబహిరాలోకనోత్కంఠలగు కామినుల దృగ్విలాసములను వెలువరించ నోచక, చెలదిపురువులు కట్టిన గూళ్ళపోగులచే మఱుగువడి ధూమప్రసరణ రేఖలు విచ్ఛిన్నములైయున్నవి. సలిలవిహారవిలోలవిలాసినీజనవపుర్విలిప్తపటీర రసాదిస్నానీ యద్రవ్యముల ప్రక్షాళనము లేక, దవ్వులకు గుబాళింపని జలములతోబలిక్రియావర్జిత ములైన వాలుకాప్రదేశములతో నీటి పాయచేరువ శూన్యవానీరకుంజములతో గుబురుగుబురుగ లేచిన అనేకవిధములైన పొదలతో నిరుపయుక్తమైన సరయూతరంగిణి, నా డెందము నస్తోకశోకతరంగితము సేయ కెట్లుండు? **11**

కోటబురుజ=కోటకొమ్మ, తావుల=స్థానముల, ప్రాకారము=ప్రహరిగోడ, దరిద్రాణము=బీదతనము, నివేశనము =పురము, తిరోహిత=మఱుగుపడిన, అర్కమండలము=సూర్యమండలము, ప్రభంజన=వాయువుచే, పరిధ్వస్త =బాగానశించిన, దివస+అవసాన=పగటి+చివరి- రాత్రి, విడంబించు=పోలు, రత్నప్రదీపరాజి=రతనములు ప్రకాశించుకాంతిపుంజము, నిలయ=ఇంటి, అభిగమ్యము=ఎదురుగాపోవు, రాదారి=రాజ మార్గము, శృంగాట కములు=నాలుగు వీధుల మొగ, బంధురము=కూడినదై, ఊళ=నక్కకూత, ఆమిషార్థము=మాంసముకొరకు, కరాళ=మిట్టపండ్లుకల, సృగాల+జాలము=నక్కల+గుంపు, ఆట+పట్టు=విహార+స్థలము, ప్రమద=స్త్రీ, ధీరస్వన =గంభీరధ్వని, ఉత్పాదన=పుట్టుంచు, ఆస్ఫాలితము=తాడించు, దీర్ఘిక=దిగుడుబావి, తోయము=నీరు, విగాహిత =మునుగుచున్న, ముష్కర=దుష్ట, వన+ులాయ+సమూగ=అడవి+దున్నపోతుల+గుంపు, శృంగ+ ఆహతములై=కొమ్ములచే+త్రొక్కబడి, ఆక్రోశించు=అఱచు, యష్టిఫలకములు=చదునైన కఱ్ఱలు, భగ్నము =విఱుగు, నిశా=రాత్రి, గతి=నడక, తమ్ము+ఎలయించి=తమను+వశపరచుకొని, నాథుడు=యజమాని, లాస్య =నృత్య, కారుచిచ్చు=దావాగ్ని, క్రీడా=విహరించు, మయూరము=నెమలి, వన=అడవి, పరిణమించిన=మాఱిన, నీలకంఠములు=నెమళ్ళు, లావణ్యవతి=చక్కనిది, లాక్షారస+ఆర్ద్రములగు=(పారాణి వంటి) లత్తుక ద్రవముచే+తడసిన, లలిత=సొగసైన, అలస=మంద, మెట్టిన=ఎక్కిన, సౌధ=భవన, మరకత=రత్నవిశేషము, సోపానముల=మెట్ల, సద్యో=అప్పుడే, నిహత=చంపబడిన, సారంగ=లేడి, రుధిర=రక్తము, ప్రదిగ్ధ=పూసిన, దుర్దమ=ఆపరాని, శార్దూలము=పులి, భుగ్నము=భగ్నము, పిడి+యేనుగు=ఆడ+ఏనుగు, ఆలేఖ్య=చిత్రించ బడిన, శుండాలము=ఏనుగు, ప్రహరించిన=కొట్టిన (-నిజపు ఏనుగు అనుకొని), సంరబ్ధ=ఉద్రేకించిన, కంఠీరము=సింహము, అకుంఠిత=వాడియైన, నఖర అంగుశ=అంకుశమువంటిగోళ్ళ, ఘాతము=దెబ్బలు,

నిర్దళితములై=పూర్తిగా చీల్చ బడినవై, ప్రతీకము=అనురూపము, విశీర్ణ+వర్ణ+విన్యాసములై=పాడైన+రంగులతో +రచనలతో, పరిధూసరము=ఎక్కువ బూడిదరంగు, భవన+స్థంభగత=భవనముల+స్థంభములపై చెక్కబడిన, యోషిత+ప్రతిమ=స్త్రీ+మూర్తి, యాదిచ్ఛికముగా=ఇచ్ఛవచ్చినట్లు, భుజంగము=పాము, నిర్ముక్త=విడచిన, నిర్మోకము=(వస్త్రమువంటి)కుబుసము, వల్లెవాటు=పైట, కాల+అంతరమున=కాలము+గడచుటచే, పరిణ మించి=మాఱి, మాపటి=రాత్రి, నిర్ధౌత=శుభ్రము చేయబడిన, హారగుళిక=హారములందలి ముత్యము, విశదము=స్పష్టము, చంద్రపాదముల=చంద్ర కిరణములను, అందందు=అక్కడక్కడ, రమ్య+హర్మ్య=అందమైన +భవన, కుట్టిమము=శలారత్ననిబద్ధ(భూమి)స్థలము, విలోకించి=చూచి, వ్రయ్యలు=ముక్కలు, అపచయము=కోయు, లతాంగి=స్త్రీ, పాదప=చెట్ల, శాఖ=కొమ్మ, క్రేళ్ళుదాటుచు=గంతులిడుచు, వన+వానర+ వర్గము=అడవి+కోతుల+గుంపు, క్లేశము=దుఃఖము, జాలకము=కిటికీ, రేల=రాత్రుల, అంతర్గత=అందలి, బహిర+ఆలోకన+ఉత్కంఠలగు+కామినుల+దృక్+విలాసములను=బయటకు+చూడ+ఉబలాటపడు+స్త్రీల+ చూపుల+హొయలు, వెలువరించ=ప్రసరింప, నోచక=అసమర్థమై, చెలది=సాలె, మఱుగు=దాగు, ధూమ= (మంటలులేని లేక సాంబ్రాణి వంటి)పొగ, ప్రసరణ=వ్యాపించు, రేఖ=మార్గము, విచ్ఛిన్నము=అంతము, సలిల +విహార+విలోల+విలాసినీ+జన=జల+క్రీడఅందు+ఆసక్తులైన+స్త్రీ+జనముల, వపుర్+విలిప్త+పటీర+రసాది+ స్నానీయ +ద్రవ్యముల+ప్రక్షాళనము=వంటికి+రాసుకొనిన+చందన+రసమువంటి+స్నానమునకు ఉపయోగించు+పదార్థములచే+శుభ్రపరచుట, దవ్వు=దూరప్రదేశము, బలిక్రియావర్జితములైన=పూజా ద్రవ్యములులేని, వాలుకా=దిగుడుబావి, నీటిపాయ=నదీ ప్రవాహము, శూన్య+వానీర+కుంజము=పాడు+ ప్రబ్బలి+పొదల, నిర్ ఉపయుక్తము=పనికిరాని, అస్తోక=అధిక, తరంగితము=పొంగిపొరలు

తే. గాథలయ్యె నిత్యకల్యాణములు పచ్చ/తోరణములు నాకు, పేరుగొప్ప,
ఊరు దిబ్బ, యనుట కొక గొప్ప తార్కాణ/నైతి, నేమిచెప్ప, భూతలేంద్ర. **12**

గాథ=పూర్వచరిత్ర, తాత్కారణము=ఉదాహరణ,

తే. ఆర్ప నేర్తురు నా యార్తి యనుచు, మిమ్ము/ఆశ్రయింపగవచ్చితి, అస్మదీయ
జీర్ణలక్ష్మీపునస్సృష్టి చేసి, కాని/మీదు లోకేశ్వరత్వము, మెప్పు గనునె? **13**

నేర్తురు=సమర్థులు, ఆర్తి=మనోవ్యథ, అస్మదీయ=నా, జీర్ణ=పురాతన, పునః+సృష్టి=మరల+సృజించ, కాని=కాకపోయిన,

ఉ. కావున నిప్పురిన్ విడచి కాపురముండగ వచ్చి నన్ను, స
ద్భావమునన్ గ్రహింపుడు, విపన్నను మీ కులరాజధాని, నో

క్ష్మావలయైకనాథ! అల, కారణమానుషదేహముం డిగం

ద్రావి, భవద్గురుండు తన ప్రాక్తనరూపము గొన్న కైవడిన్". 14

సద్భావము=సౌజన్యము, గ్రహింపుడు=స్వీకరింపుడు, విపన్న=ఆపదలోఉన్నదాన, అల=ఏవిధంగా, కారణ= దేవ కార్యార్ధియై, డిగంద్రావి=విడచి, భవత్+గురుండు=నీ తండ్రి రాముడు, ప్రాక్తన=మునుపటి (నీవుకూడా మీ మునుపటి రాజధానికి రా),

సీ. అనిన ప్రతీతుడై అంగీకరించె తత్/ప్రార్ధన రఘువుల ప్రాగ్రహరుడు,

పురియు, అభివ్యక్తముఖసుప్రసాదయై/తనుబంధమున తిరోధాన మందె,

అత్యద్భుతంబైన ఆ రాత్రివృత్తంబు/ద్విజులకు సభలోన వినిచె నృపతి,

తనుదానె కులరాజధాని వచ్చి వరించు/టాలించి కొనియాడి రతని వారు,

వైదికద్విజులకు కుశావతి నొసంగి/పవనుని పయోదబృందము వలె, బలంబు

తన్ననుగమింప శుభముహూర్తమున గదలె/సావరోధుండు, కుశు డయోధ్యాభిముఖుడు.**15**

ప్రతీతుడై=తెలపబడినవాడై, ప్రాగ్రహరుడు=శ్రేష్ఠుడు, అభివ్యక్త=ప్రతిబింబించు, సుప్రసాదము=మంచి ప్రసన్నత, తను+బంధమున=సంతుష్ట+పరిణామమున, తిరోధానము=అంతర్ధానము, వృత్తము=వృత్తాంతము, వినుచె= వినిపించె, వరించుట=కోరుట, పవను=వాయువు, పయోద+బృందము=మేఘముల+గుంపు, బలంబు= సైన్యము, అనుగమింప=వెంటరా, సలవరోధుండు=అంతఃపురస్త్రీలు కూడినవాడు,

క. కరిఘట లనుగతకృత్రిమ/గిరులుగ, కేతనచయంబు కేళివనులుగా,

అరదము లిండ్లుగ, రాణువ/నరపతికి ప్రయాణవేళ నడవీ డయ్యెన్. **16**

కరి+ఘట=ఏనుగుల+కుంభస్థలము, అనుగత=వెంబడించిన, గిరి=కొండ, కేతన+చయము=జెండాల+ సమూహము, కేళి+వనము=క్రీడా+ఉద్యానవనము, అరదము=రథము, రాణువ=సేన, నడ=నడుస్తున్న, వీడు+అయ్యెన్=నగరము+ఐనది,

ఉ. ఉల్లాసితాతపత్రవిశదోజ్జ్వలమండలు చేత, రాజుచే,

తొల్లిటి, వాసమేదినికి దోడ్కొని పోబడు సేన తోచె, అ

త్యుల్లసితాతపత్రవిశదోజ్జ్వలమండలుచేత, రాజుచే,

చెల్లెలికట్ట జేర్చబడు సింధువు భంగి నితాంతఘోషమై. **17**

ఉల్లాసిత+అతపత్ర+విశత్+ఉజ్జ్వల+మండలు+చేత=ప్రకాశించు+ఛత్రముల+స్పష్టమైన+వెలుగుల+ సమూహము+కలిగిఉండుట వలన, తొల్లిటి+వాస+మేదినికి=తానుపూర్వము+నివసించిన+భూమికి-

అయోధ్యకు, రాజుచే=కుశునిచే, తోడ్కొను+పోబడు+సేన=తీసుకొని+పోబడు+సేన, తోచె=(క్రిందివిధముగా) కనిపించెను. అతి+ఉల్లసిత+ఆతపత్ర+విశద+ఉజ్జ్వల+మండలు+చేత=అధిక+ప్రకాశవంతమైన+చత్రముల వలేస్వచ్ఛమైన+పూర్ణ+బింబము+కలిగిఉన్న, రాజుచే=చంద్రునిచే(సముద్రము ఉప్పొంగించబడి), చెలియలికట్ట= ఒడ్డుకు, చేర్చబడు= కెరటముల ద్వారా సముద్రపు తీసికొనుపోవు, సింధువు=సముద్రము, భంగి=వలే, నితాంత+ఘోషమై=ఎక్కువ+ధ్వనికలదైనవి(సేన, సముద్రము రెండు),

తే. తత్ప్రయాతవిశృంఖలధ్వజినివలని/అతితరగ్లాని సైరింపనలవి గాక,
భూమి పెంధూళి అపదేశమున ద్వితీయ/విష్ణుపదమున కెగసిన విధము తోచె.**18**

తత్+ప్రయాత=వాని+ప్రయాణమైపోవు, విశృంఖల=అడ్డులేని, ధ్వజిని=సైన్య, అతితర=చాలా ఎక్కువ, గ్లాని= క్లేశము, సైరింప=సహింప, అలవి=శక్యము, అపదేశము=నెపమున, ద్వితీయ=మఱియొక, విష్ణుపదము= ఆకాశము, భావము: సైన్య సంరంభము భరించలేక భూమి ధూళి నెపమున అకాశము చేరె.

తే. నగరియానమునకు సిద్ధమగుచు నడుమ/నడుచుచును, పురోభాగము నందు నిలిచి,
ఇనకులేంద్రుని ఆ సేన ఎచట గన్న/నచట నదియె సమగ్రమైనట్లు, తోచె. **19**

యానము=ప్రయాణము, పురీ=ముందు, సమగ్రము=సంపూర్ణము,

క. కరిమదజలసేకంబుల/తురగఖురవిఘట్టనముల త్రొవపొడవునన్,
బురదాయె రేణు వెల్లయు/పరాగతం బొందె, తిరిగి పంకంబెల్లన్. **20**

కరి=ఏనుగుల, మదజల=మదజలము, సేకంబుల=స్రవించగా, తురగ=గుఱ్ఱముల, ఖుర=డెక్కల, విఘట్టనముల=త్రొక్కుడులచే, రేణువు+ఎల్లయు=ధూళి+అంత, పరాగతంబు+అయ్యె=తిరిగిరేణువు+అయినది, పంకము+ఎల్లన్=బురద+అంతా,

మ. సుమవల్లీద్రుమజాలకర్బురములై శోభిల్లు తత్సానుభా
గములన్ తద్ భృగురామణీయకములన్ గన్గొంచు లంఘించె, విం
ధ్యము సైతేయుడు తద్గుహాముఖములన్ ద్రాఘిష్ట సేనావిరా
వము రేవావిలుఠత్తరంగరుతి రేవన్ మారుమ్రోగింపగన్. **21**

సుమ+వల్లీ+ద్రుమ+జాల=పూల+తీగలు+అల్లుకొనినచెట్ల+సమూహము, కర్బురములై=ఆకుపచ్చ తెలుపు కలిపిన రంగు కలదై, శోభిల్లు=అందముగా ప్రకటమగు, తత్+సాను=ఆ+కొండచరియ, తత్=వాటి, బృగు=గొప్ప, రామణీయకము=అందము, లంఘించె=దాటులతోవెళ్ళె, సైతేయుడు=సీత కుమారుడు-కుశుడు, తత్+గుహా+ ముఖము=వింధ్యపర్వత+గుహల+ద్వారము, ద్రాఘిష్ట=మిక్కిలిదీర్ఘమైన, విరావము=అరపులు, రేవ=

నర్మదానది, విలురత్=భూమిపై దొర్లుటచే, తరంగ=రంగముల, రుతి=ఘోష, రేవన్=విధముగా,

తే. బహుపుళిందోపపాదితోపాయనముల/కనుగొనుచు, అన్నగోపత్యకలను దాటి,
అరిగె ధాతుభేదారుణయాననేమి/ఉరుచమూధ్వని మిశ్రతూర్యుడు, కుశుండు. **22**

పుళింద=ఆటవికుల, ఉపపాదిత=ఇచ్చిన, ఉపాయనము=కానుక, కనుగొను=పొందు, అ+నగ=ఆ+కొండ, ఉపత్య=చేరువకలనేల, ధాతుభేద=గైరికాది ధాతువులు విఱిగి, అరుణ=ఎఱ్ఱనైన, యాన+నేమి=రథ+చక్రపు+కమ్మి, ఉరు=గొప్ప, చమూ=సైన్య, మిశ్ర=కలసిన, తూర్యుడు=ప్రయాణరథధ్వనికలవాడు

తే. కరిఘటాసేతుబంధము కలన నచట/గంగను, ప్రతీపగన్, దాటు క్ష్మావరునకు,
గగనలంఘనలోలపక్షంబులైన/మత్తహంస లయత్నచామరము, లయ్యె. **23**

కరి+ఘట=ఏనుగులు+కూర్చుటచే, సేతు బంధన=వంతెన కట్టుట, కలన=చేత, గంగ=కావేరి, ప్రతీపగన్=నీటివాలు కెదురుగ, గగన+లంఘన+లోల+పక్షంబు=ఆకాసమునకు+ఎగురుచు+కదలుచున్న+రెక్కలుకల, అయత్న=ప్రయత్నములేకుండా వీచు, చామరము=వింజామరము

తే. కాంచి అర్చించె, కుశుడు మార్గమున కపిలు/నలుక భస్మావశేషకృతాంగు లైన,
స్వపితరులకు, సురాలయావాసలబ్ధి/హేతువగు మేటి మయ్యేటి కేటికోళ్ళు. **24**

కపిల=కపిలముని, అలుక=కోపము, భస్మ+అవశేష+కృత+అంగు=బుడిదగా+మిగిలునట్లు+చేయబడిన+దేహములుకల, స్వపితరులు=తనపూర్వులు-సగరులు, సుర+ఆలయ+వాస+లబ్ధి+హేతువు=ఇంద్ర+లోక+నివాస+ప్రాప్తికి+కారణము, మేటిమి=గొప్పది, అ+ఏటికి=ఆ+నదికి, ఏటికోళ్ళు=నమస్కారములు,

వ. అర్పించి చని, కతిపయదినములకు వితతాధ్వరప్రవర్తకులగు పూర్వకాకుత్ స్థులచే ప్రతిష్టితము లైన
పాలగుంజలపరంపరతో దర్శనీయమైన సరయూతీరమునకు వచ్చి, పరమహర్షోత్కర్షమున
కులరాజధానీపురమును దరియబోవునెడ ప్రయాణసంక్షోభమున బడల్పబడిన దాశరథిసూనుని. **25.**

కతిపయ=కొంచము, వితత=విరివిగా, అధ్వర=యజ్ఞము, ప్రవర్తకులు=సలుపువారు, ప్రతిష్టితము=నిలుపబడిన, పాలగుంజల=యజ్ఞ పశుబంధన రాటల, పరంపర=ఎడతెగని వరస, ఉత్కర్షమున=అతిశయమున, దరియబోవు=దగ్గరకువచ్చు, సంక్షోభము=కలత, అడల్పు=బాధ,

క. పఱతెంచి ఎదుర్కొనియెను/సరయూశీతలతరంగసమ్మిళితంబుల్
పరిచలితతరులతాసుమ/పరిమళభరితములు, తదుపవనపవనంబుల్. **26**

పఱతెంచి=ప్రసరించి, సమ్మిళిత=కూడిన, పరిచలిత=బాగా కదలు, భరితము=నిండిన, తత్+ఉప పవనంబుల్=దాని+ఉద్యానపు+గాలులు,

తే. వలనగు పురోపశల్య/స్థలమున పరిపంథిమగ్న శల్యుడు, ఘనుడా
బలియుడు, చలద్ ధ్వజము, నిజ/బలము, గులధ్వజుడు విడియబనిచె యథేచ్ఛన్.**27**

వలను=అనుకూలము, పుర+ఉపశల్య=నగర+పొలిమేర, పరిపంథి+మగ్న+శల్యుడు=శత్రువుల శరీరముల+నాటబడిన+(తన)బాణములు కలవాడు, చలత్=ఎగురుచున్న, ధ్వజము=జెండా, ధ్వజుడు=శ్రేష్ఠుడు, విడియన్=బసచేయ, పనిచె=నియోగించె,

చ. పరిణతశిల్పు లవ్విభునిపంపున అంతకుమున్నె వచ్చి, ఆ
పురము పునర్వినిర్మితికి బూని, నిదాఘవితప్తకుంభినిన్
శరదము లోలిమై జలవిసర్గమునన్ బలె, నూతనీకరిం
చిరి, కమనీయభంగి నిజశిల్పకళాప్రతిపాదనంబునన్. **28**

పరిణత=నేర్పరి, పంపున=పంపగా, పునర్+వినిర్మితి=మరల+నిర్మింప, నిదాఘ=వేసవి, వితప్త=బాగుగా వేడెక్కిన, కుంభిని=భూమి, శరదములు=మేఘములు, ఓలిమై=వరుసగా, విసర్గము=కాఱు, ప్రతిపాదనంబు=నిరూపించుచు,

వ. అంతట, రఘుప్రవీరుడు సుప్రశస్తదేవతాయతనములకు ఉపోషితులైన వాస్తువిధాన విజ్ఞులచే, పశూపహారసహితముగ సముచితార్చనలను నిర్వర్తింపజేసి, తదనంతరంబున రాజోప పదమైన రమ్యనిశాంతమున, దాను నివాసమేర్పఱచుకొని, తక్కిన భవనములను అమాత్యులు లోనుగాగల తన అనుజీవులకు యథాప్రధానముగ సమర్పించె. అనతిచిరముననె, అప్పురి మరల అధిరోపిత పురాణశోభయై, విపణిగతనానావిధపణ్యద్రవ్యములతో మందురాసంశ్రితసైంధవములతో శాలావిధిస్తంభగతమత్తసింధురములతో సర్వాంగ విభూషితాభరణ యయిన సీమంతిని వలె ప్రేక్షణీయత సంతరించుకొనియె. పదపడి కాలక్రమమున, **29**

ఆయతనము=గుడి, ఉపోషితుడు=ఉపవాసము ఉన్నవాడు, పశు+ఉపహారము=పశు+బలి, రాజ+ఉపపదము=రాజకు+తగిన, రమ్య+నిశాంతము=అందమైన+గృహము, అనుజీవి=ఆశ్రయించినవాడు, అధిరోపిత=ప్రతిషింపబడిన, విపణి+గత=వ్యాపార స్థలము+ఉండిన, పణ్య=అమ్మ్మ, మందుర=గుఱ్ఱపుశాలలో, ఆసంశ్రిత=బాగాఅలవాటుపడిన, సైంధవము=గుఱ్ఱము, శాలా=గజశాల, విధి=ఉంచిన, స్తంభగత=రాటలకు కట్టబడిన, సింధురము=ఏనుగు, సీమంతిని=స్త్రీ, ప్రేక్షణీయత=చూడదగ్గసొబగు, సంతరించుకొని=చక్కబఱచుకొని, పదపడి=మఱియు,

ఉ. వేసవి వచ్చె నిర్మలనవీనమణిగ్రథితోత్తరీయమున్,

శ్వాససమీరహార్యవసనంబు, కుచద్వయలంబిపాండు ము
క్తాసరమున్, సుగంధసుమగర్భితకైశ్యము, కాలయోగ్యమౌ
వేసము, చిత్తహారి పృథివీశునిస్త్రీలకు, నేర్పనో! యనన్. 30

నిర్మల=స్వచ్ఛమైన, నవీన=క్రొత్త, మణి+గ్రథిత=ముత్యములచే+కూర్పబడిన, ఉత్తరీయము=ఉపవస్త్రము, శ్వాస=ఊపిరి, సమీర=గాలిచే, హార్య=తొలగింప వీలగు, వసనంబు=వస్త్రము, లంబిపాండు=వ్రేలాడునట్టి, ముక్తా=ముత్యాల, సరము=దండ, గర్భిత=నిండిన, కైశ్యము=కొప్పు, వేసము=వేషము, చిత్తహారి=మన్మథుడు,

తే. ఇను డపు డగస్త్యలాంఛనాయనము మాని/ పొత్తునకు పొంత కేతేర ఉత్తరాశ,
విడచె ఆనందశీతాశ్రువృష్టి యనగ/సాంద్రముగ హైమవతహిమస్రవము కురిసె.31

ఇనుడు=సూర్యుడు, అగస్త్య+లాంఛన+ఆయనము=అగస్త్య నక్షత్రము+గుర్తుగానున్న+దక్షిణాయన మార్గము, పొత్తు=సంగతము, పొంతకు+ఏతేర=దగ్గరకు+వచ్చిన, ఆశ=దిక్కు, శీత+అశ్రు+వృష్టి=చల్లని+ఆనందఅశ్రు+ధార సాంద్రముగా=దట్టముగా, హైమవత=హిమాలయపు, హిమ=చల్లని, స్రవము=ప్రవాహము,

తే. వేండ్రమగు కాకపెల్లున వేగె పగలు/నాడు నాటికి మిక్కిలి నవసె రేయి,
ఎడపడి విరుద్ధవృత్తులై రిరువు రిట్లు/వగల మిగులంగ బొగులు, ఆల్మగల పగిది. 32

వేండ్రము=తీక్ష్ణము, కాక=వేడి, పెల్లు=మిక్కిలి, వేగె=క్రాలె, నాడునాటికి=రోజురోజుకు, నవసె=క్షీణించె, ఎడపడి =వేరుపడి, విరుద్ధ వృత్తులైరి=(పగలు పెరిగి రాత్రి తరిగి)వేరువేరు ప్రవర్తనలు కలవారైరి, వగల+మిగులంగ=ప్రేమ +అతిశయించ, పొగులు=పరితపించు, ఆలు+మగలు+పగిది=భార్య+భర్తలు+వలె, (పెరిగిన పగలు-పుంలింగము -రాత్రికై తపించెను. రేయి-స్త్రీలింగము- క్షీణించి పగటికై ఎదురుచూచెను).

తే. మెండుకొని నాచుపట్టిన మెట్లు విడిచి/దినము దినమును క్రిందికి దిగుట జేసి,
గృహసరస్సుల తుంగవారిజము, జలము/పడతులకు నాడు పిఱుదులబంటి, యయ్యె. 33

మెండుకొని=అధికమై, తుంగవారిజము=ఒకగడ్డితామర, నాడు=ఆసమయమున, పిఱుదులబంటి= తోడలవఱకుమాత్రమే

ఉ చక్కదనంబు గ్రాల మలిసంజల గమ్మనితావి నల్గడల్
పిక్కటిలంగ బూచి వనవీథుల విచ్చిన మల్లెమొగ్గ లం
దొక్కొక దానిపై అడుగు లుంచి చనున్ రొదతోడ, ఆ విరుల్
లెక్కిడు చొప్పునన్, మధుమలిమ్లుచముల్ బయకాండ్రు తుమ్మెదల్. 34

క్రాల=ప్రకాశింప, మలిసంజ=సాయంకాలము, తావి=సుగంధము, నల్గడల్=నాలుగుదిక్కుల, పిక్కటిలంగ=ప్రసరింప, రొదతోడ=ఝుంకారముతో, లెక్కిడు చొప్పునన్=(ఒక్కొక్కమొగ్గపై వ్రాలి)లెక్కపెట్టు నట్లుగా, మధు=తేనె, మలిమ్లుచముల్=చోరులు, బయకాండ్రు=సంగీత కారులు,

తే. శ్రవణముననుండి జాఱియు, జాఱినపుడె/క్రింద బడిపోదు విశ్లిష్టకేసరంబు,

కామినీస్వేదసార్ద్రనఖక్షతాంక/మృదుకపోలగతంబు,శిరీషసుమము. **35**

శ్రవణము=చెవి, విశ్లిష్ట+కేసరంబు=విడివడిన+పుప్పొడి, కామినీ+స్వేద+స+ఆర్ద్ర=స్త్రీల+చెమటతో+కలిసి+తడసిన, నఖక్షతాంక=గోటిగిచ్చులుకల, కపోల+గతము=చెంపకు+అంటుకొన్న,

మ. వనితల్ మజ్జనమాడి ధూపములచే వాసింపగా జేసి చ

క్కని కీల్గంటుగ నల్లి మల్లియల సింగారించినన్, ముమ్మరిం

చిన యా స్నిగ్ధవినీలవక్రచికురశ్రీనుండి పొందెన్ బలం

బును వాసంతవినాశమందబలుడౌ పూవింటిజో దయ్యెడన్. **36**

మజ్జనము=స్నానము, వాసింప=పరిమళింప, కీల్గంటు=జాఱుముడి, అల్లి=జడవేసి, ముమ్మరించు=అతిశయించు, స్నిగ్ధ+వినీల+వక్రచికుర+శ్రీ+నుండి=తడిసిన చిక్కని+నల్లని+కుటిల+కేశ+సంపద+నుండి, వాసంత=వసంతకాలము, వినాశ=ముగియుటచే, మంద+బలుడు=తగ్గిన+బలముకల, పూవింటిజోదు=మన్మథుడు, పొందెన్+బలంబును=సత్తువ పుంజుకొనెను

తే. పుప్పొడులు చుట్టు పర్వంగ ఒప్పు మిగిలె/ కేవలాపింజరము మద్దిపూవుగుత్తి,

ఒడలు పొడిపొడి చేసియు మృడుడు కినుక/సనక తునిమిన వెడవిల్తు గొనయ మనగ.**37**

పర్వ=వ్యాపింప, ఒప్పు+మిగిలె=అందము+మీరె, కేవల=సమస్త, పింజరము=ఎఱుపు పసుపు రంగు, ఒడలు=శరీరము, పొడిపొడి=బూడిద, మృడుడు=శివుడు, కినుక=కోపము, సనక=పోక, వెడవిల్తు=మన్మథుని, తునిమిన=చించిన, గొనయము=వింటినారి,

క. అవిరామయంత్రసలిల/ప్రవాహావృతమందిరముల ప్రచురపటీర

ద్రవధౌతశిలాతలముల/పవళించిరి ధనికు లెండవడ తట్టుకొనన్. **38**

అవిరామ=ఎడతెగని, సలిల=నీటి, వృత=అవరింపబడిన, ప్రచుర=అధిక, పటీర+ద్రవ=చల్లని చందనపు+నీరు, ధౌత=తడువబడిన, శిలాతలము=చలువరాళ్ళు, వడ=సెగ

తే. కాకచే బిట్టలంచిన కాముకులకు/గట్టి పరిహారముగ నిచ్చె పెట్టకారు

మధురసౌగంధ్యములు తియ్యమావి చిగురు/ప్రత్నసీధువు ప్రత్యగ్రపాటలమును. **39**

కాక=పేడి, బిట్టు+అలంచిన=మిక్కిలి+అలసిన, పరిహారము=విడుపు, పెట్టకారు=వేసవి కాలము, సౌగంధ్యము=పరిమళము, ప్రత్న=పులియబెట్టబడిన, సీధువు=చెఱకు రసపుకల్లు(మధురిమ), ప్రత్యగ్ర=క్రొత్త, పాటల= ఎఱ్ఱలొద్దుగ పువ్వు(పరిమళము)

తే. ఆ కఠినవేళ జనుల కత్యంతముగను, ప్రియు లిరువురైరి తాపనివృత్తికొఱకు,
పాదసేవ యొనర్చ, భూపాలు డతడు, అమృతకిరణుండు నభ్యుదయస్థు లగుచు. **40**

తాప+నివృత్తి=దుఃఖము+పోవుటకు, పాద+సేవ=పాదము+పూజించుట(రాజుపట్ల), పాద+సేవ=కిరణము (వెన్నెల) అందు+ఆసక్తి(చంద్రునిపట్ల) , భూపాలుడు=రాజు, అమృతకిరణుడు=చంద్రుడు, అభ్యుదయస్థులు=శుభము కలిగించువారు,

తే. చలితజలవీచికాలోలసమదరాజ/హంసమున్ కూలవల్లీసుమాపవహము,
తాపహరమైన సారవోదకము లోన/ నారులం, గూడి విహరింప గోరె, నృపతి. **41**

చలిత=చల్లని, వీచిక=తరంగము, ఆలోల=అభిలాషకల, సమద=మదించిన, కూల=ఒడ్డు, వల్లీ=తీగ, సుమ=పూలు, ఆప+వహము=నీటి+ప్రవాహము, సారవ+ఉదకము=సరయూనది+నీరు, నారులు=భార్యలు,

వ. ఇట్లుత్సహించి తీరప్రదేశమున వసతియోగ్యమున గుడారములు వేయించి నిపుణులగు
జాలికులచే శోధింపించి తత్ప్రాంతనదీజలము మకరాదిఘాతుక యాదోరిక్తములగుట నిరూపించుకొని
సరిత్తోయవిగాహమునకు శ్రీ మహిమానురూపముగా నా చక్రధరప్రభావుడుపక్రమించె. అప్పుడు **42**

ఉత్సహించి=ఉత్సాహపడి, జాలికుడు=జాలరి, ఘాతుక=హాని, యాదో=క్రూరజలజంతువు, రిక్తము=లేనివి, సరిత్తోయము=సరయూనీరు, విగాహగము=స్నానముచేయుట, శ్రీ+మహిమ+అనురూపముగా=తనసంపద+గొప్పదనమునకు+తగినట్లు, చక్రధర+ప్రభావుడు=విష్ణుని-రాముని+కొడుకు,

తే. తీరసోపానపథమున దిగు నరేంద్ర/కాంతల పరస్పరాంగదఘట్టనముల,
కనకనూపురగళననిక్వణనములను/అవధవాహిని, ఉద్విగ్నహంస యయ్యె. **43**

సోపాన=మెట్ల, పథము=మార్గము, పరస్పర=అన్యోన్య, అంగద+ఘట్టనము=కేయూరముల+రాపిడి, కనక=బంగారు, నూపుర=అందెల, గళన=గలగల, నిక్వణనము=ధ్వని, అవధ+వాహిని=స్వచ్ఛమైన+ప్రవాహము, ఉద్విఘ్న=భయపడిన, హంస=నదిలోనిహంసలు,

మ. స్తనదఘ్నంబగు నిమ్నగాంబువున అంచల్లీల నన్యోన్య సే
చన కేళీరసలోలలైన తన యోషామండలిం జూపి చెం
తన వాలవ్యజనంబు బూనిన స్వభృత్యం గాంచి నౌకాస్థితుం

డనియెన్, భూపతి వారి వారివిహృతివ్యాసక్తి వర్ణింపుచున్. **44**

స్తన+దఘ్నంబగు=పాలిండ్ల+వరకు/బంటి, నిమ్నగ+అంబువు=నది+నీరు, అంచ+ల్లీల=హంసల+వలే, సేచన =చిమ్ము, యోష=స్త్రీ, వాలవ్యజనంబు=చామరమువీచు, స్వభృతి=తన సేవిక, స్థితుండు=కూర్చున్న, వారి= ఆస్త్రీల, వారి=నీటి, విహృతి+వ్యాసక్తి=వినోద+తత్పరత,

క. "జలగాహనమున గరగిన/అలిపేణుల అంగరాగమలమిన కతనన్
పలువన్నె లొంది, కనుమీ!/సలిలము తలపించె సాభ్రసంధ్యోదయమున్. **45**

గాహనమునన్=స్నానముచేయ, అంగరాగము=రాసుకున్న పసుపు గంధము మున్నగు మైపూతలు, అలమిన =వ్యాపించిన, కతనన్=వలన, పలు+వన్నెలు+ఒంది=బహు+రంగులు+కలిగి, సలిలము=నీరు, తలపించె= స్మరింపచేసె, స అభ్ర+సంధ్య+ఉదయము=మేఘములతోకూడిన+సాయంకాలము+అగుట( నీరుకల మేఘము లున్నాయికనుక ఇంద్రదనుస్సుకూడా ఉండిఉండొచ్చు)

చ. అలఘుకటిస్తనత్వమున ఆత్మశరీరమె మోయలేని, అ
త్యలసలు, చూడుమీ! అబల లందఱు తేలుచు నీదుచున్న, వా
రలలపయిన్ సుమాళముగ, సాంగదభారభుజద్వయంబులన్,
అలత ఎఱుంగనీయని నిజాంబువిహారకుతూహలోన్నతిన్. **46**

అలఘు+కటి+స్తనత్వమున=పెద్ద+పిరుదులు+స్తనములు కలుగుటచే, అతి+అలసలు=ఎక్కువ+అలుపుకల, సుమాళముగ=దండలవలె, స అంగద+భార+భుజ+ద్వయంబు=కేయూరములు కలిగిన+భారమైన+ బాహువులు+రెండిటితో, అలత ఎఱుంగనీయని=నీటిలో తేలుటచే బరువు తగ్గి అలసట లేని, ఉన్నతి=వృద్ధి,

తే. జలవిహారవశంబున జాఱి, అవిగొ!/తరుణుల శిరీషకుసుమావతంసకములు
వెల్లిలో దేలియాడుచు బేలుపుచ్చె/శైవలలతావిలోలపైసారిణముల. **47**

శిరీష+కుసుమ=దిరిశన+పూల, అవతంసకములు=కర్ణభూషణములు, వెల్లి=నదీ ప్రవాహము, బేలుపుచ్చె= మోసగించె, శైవల=నాచు, లతా=తీగలందు, విలోల=మిక్కిలి తృష్ణ కల, పైసారిణముల=చేపలను,

చ. అల లరచేతులం జఱచి ఆ చిఱుమద్దెలమ్రోత కెంతయున్,
వలనుగ పాడు ముద్దియలు, వక్షువచన్గవమీద ఆణిపూ
సల గడు మచ్చరించుచును జాల్గొను శీకర సంచయంబునన్
తెలియగలేరు, చూడు! తమ త్రెస్సిన ముత్తెపు సేవళంబులన్. **48**

వలనుగ=అనుకూలముగ, వట్రువ=గుండ్రపు, చన్గవ=స్తనద్వయము, ఆణిపూసలు=ముత్యాలు, కడు=ఎక్కువ, మచ్చరించుచు=పోటీచేయుచు, జాలుకొను=కాఱుచున్న, శీకర=నీటితుంపర, సంచయంబు=సముదాయము, త్రెస్సిన=తెగిన, సేవళము=మణులుగ్రుచ్చినహారము,

సీ. గంభీరతరనాభికాంతిపూరమునకు/పర్యంతబంధు రావర్తశోభ,
చపలస్వభావలోచనవిలాసములకు/పైసారిణార్భకోద్వర్తనములు,
కాంచీగుణోపేతకటిమండలమునకు/స్తనితాండజశ్రేణిసైకతంబు,
పేశలాయతనీలకేశపాశమునకు/శైవాలమంజరీజాలకంబు,
మంజులభ్రూలతావిభ్రమముల కలలు/ప్రబలవక్షోజములకు చక్రద్వయములు,
అమరు రూపాంగకోపమానము లదూర/వర్తులై ఇందు, మా రాణివాసములకు.**49**

గంభీరతర+నాభి+కాంతి+పూరమునకు=లోతుఎక్కువగాకల+బొడ్డుల+దీప్తి+వృద్ధికి, పర్యంత+బంధుర + ఆవర్త+శోభ=సమీపపు+రమ్యమైన+నీటిసుడుల+కాంతి, చపల+స్వభావ+లోచన+విలాసములకు=తరళ +నైజముకల+కండ్ల+సౌందర్యమునకు, పైసారిణ+అర్భక+ఉద్వర్తనము=చేప+కూనల+ఎగిరిపడుట, కాంచీ+ గుణ+ఉపేత+కటి+మండలమునకు=మొలనూలలయిక్క+శబ్దించు గుణము+పొందిన+పిఱుదుల+ ప్రదేశములకు, స్తనిత+అండజ+శ్రేణి+సైకతంబు=ధ్వనించు+పక్షుల+వరసకల+ఇసుకతీరము, పేశల+ ఆయత+నీల+కేశ+పాశము=చక్కని+నిడుపైన+నల్లని+కురుల+సముదాయము, శైవాల+మంజరీ+జాలకంబు =నీటినాచు+నీటిప్రబ్బలి+సమూహము, మంజుల+భ్రూ+లతా+విభ్రమములకు+అలలు=మనోజ్ఞమైన +కనుబొమముడి+ఇటు అటు సంచరించుటకు+నదియొక్క అలలు, ప్రబల+వక్షోజములకు+చక్రద్వయములు= మిక్కిలిబలముకల+పాలిండ్లకు+చక్రవాక జంట, అమరు+రూప+అంగక+ఉపమానములు+అదూర+వర్తులై= ఒప్పెను+రూపమునకు+శరీరమునకు+ఉపమానములు+దగ్గర+ఉన్నవై, ఇందు=నదిలో, రాణివాసము= అతఃపురస్త్రీలు,

క. లలితాంగుల గీతానుగ/జలమర్దలవాద్యసరణి శ్లాఘించె గడున్
కలకేకాముఖరములు/తత్కలాపములు, చూడు! తటశిఖావళగణముల్. **50**

గీత+అనుగ=పాటల+అనుసరించి, జల+మర్దల=నీటిపై+మద్దెలవాయించు, సరణి=విధము, శ్లాఘించె= కొనియాడె, కల=అవ్యక్తమధుర, కేకా=నెమలి కూత, ముఖరము=ధ్వనులు, తత్+కలాపములు=వాని+ మ్రోతలు, తట=ఒడ్డు, శిఖావళ=నెమళ్ళ, గణముల్=సమూహములు,

తే. తడిసి పిఱుదుల నంటు పావడలలోన/చంద్రకిరణాంతరితఋక్షసన్నిభముగ

సిక్తనిష్పందములు, చూడు చిగురుబోండ్ల/కనకరశనలు మూకీభవనము నొందె. **51**

చంద్రకిరణ=పెన్నెల, అంతరిత=కప్పబడిన, ఋక్ష=నక్షత్రముల, సన్నిభముగ=సమానముగ, సిక్త=తడసి పోవుటచే, నిష్పందములు=చలనములేనివై, కనక+రశనలు=బంగారు+మొలనూలులు, మూకీభవము=మూగత్వము,

తే. జల్లుపోరాటలో సఖీజనముచేత/మోముదమ్ములు తడసిన ముద్దరాండ్ర

అకుటిలాగ్రములైన చూర్ణాలకములు/అంబులవముల గురిసె, చూర్ణారుణముల. **52**

మోము తమ్ములు=పద్మ ముఖములు, అకుటిల+అగ్రము=తిన్నగాఅయిన+చివరలు, చూర్ణ+అలకములు=సింధురాది చూర్ణములు రాసుకొనిన+కురులు, అంబులవముల=నీటిబిందువులద్వారా, కురిసె=ప్రసరించె, చూర్ణ+అరుణముల=ఆ చూర్ణముల+ఎఱ్ఱని రంగుల,

సీ. ఉన్ముక్తకచము విచ్యుతపత్రలేఖంబు/శ్లథశీర్ణమాణలలామకంబు,

నాతివిలీనమనఃశిలాచిత్రకం/బత్యార్ధ్రలంబ చూర్ణాలకంబు,

పరిహృతాలేపపుష్పరజఃకపోలంబు/విగళితశ్రుతిపత్రవేష్టనంబు,

ప్రక్షాళితాలక్తరాగాధరోష్ఠంబు/లుప్తకజ్జలవిభాలోచనంబు,

అభినవద్యుతి హృద్యంబె యయ్యె జూడు/వారిజాక్షుల వదనాల వాలకంబు,

గాఢనిర్భరసలిలసేకంబువలన/ఆకులితమయ్యు సహజరమ్యంబు గాన" **53**

ఉన్ముక్త+కచము=ముడివిడిన+శిరోజములు, విచ్యుత+పత్ర+లేఖంబు=బాగాతొలగిన+మకరికాదిపత్ర+రచనలు, శ్లథ+శీర్ణమాణ+లలామకంబు=పట్టు+సడలిన+బొట్టు, న అతి+విలీన+మనఃశిలా+చిత్రకంబు=స్వల్పముగా+కరిగిన+మణినీల+తిలకము, అతి+ఆర్ద్ర+లంబ+చూర్ణ+అలకంబు=బాగా+తడసి+తిన్ననైనట్టి+సింధూరము కల+కేశములు, పరిహృత+ ఆలేప+పుష్ప+రజః+కపోలంబు=రాలిన+కర్పూర తైలాది ద్రవ్యములు+పువ్వుల +కేసరములుకల+చెక్కిలి, విగళిత+శ్రుతి+పత్రవేష్టనంబు=జాఱిన+చెవి+తాటంకములు, ప్రక్షాళిత+ఆలక్త+రాగ+అధర+ఓష్ఠంబు=కడుగబడిన+లత్తుక+రంగుకల+క్రింద+పెదవి, లుప్త+కజ్జల+విభా+లోచనంబు=చెరిగిన +కాటుకతో+ప్రకాశించు+కన్నులు, అభినవ+ద్యుతి=క్రొత్త+శోభతో, హృద్యంబు=మనోహరము, వాలకము=వేషము, గాఢ+నిర్భర+సలిల+సేకంబు=అధిక+పూర్ణమైన+నీటిలో+చన్నీటిస్నానము, ఆకులితమయ్యు=ఆసక్తి కలిగించునది,

మ. అని పే వోయి విలోలహారుడు కుశుం డచ్చోట నక్కామినీ

జనమధ్యంబున దాను నంబువిహృతిన్ సాగించె, గంగావిగా
హనకేళిన్ పిడియేనుగుల్ వొదవ నాహ్లాదించు స్కంధావల
గ్ననిజోత్పాటితపద్మినీకుడగు శుండాలేంద్రు సామ్యంబునన్. 54

వే=వేగముగా, విలోల+హారుడు= వ్రేలాడుతు కదుకుతున్న+హారములు కలవాడు, విహృతి=వినోదము, విగాహన= మునుగు, పిడి ఏనుగు=ఆడ ఏనుగు, వొదవ=కలుగ, స్కంధ+అవలగ్న+నిజ+ఉత్పాటిత+ పద్మినీకుడగు=భుజములకు+తగులుకొనిన+తనచే+పెఱకబడిన+తామరతీగలుకల, శుండాలేంద్రు=గజేంద్రుని, సామ్యము= వోలిక,

తే. మొదటె బలువన్నె మెఱయు ఆ ముదితపిండు/అతని రోచిష్ణు గూడి సొంపతిశయించె,
అసలె కనువిందు మణిపూస మిసిమి యొలుకు/నీలమున మేళవించిన, ఏలచెప్ప! 55

మొదటే=ముందుగానే, పలు=అధిక, వన్నె=శోభ, ముదిత+పిండు=స్త్రీ+సమూహము, రోచిష్ణు=సొగసుకాడు, మిసిమి=తళుకు, మేళవించిన=జతపఱచిన,

చ. సుందరు లెల్ల అచ్చరల సొంపున జుట్టును మూగి వేడుకల్
చిందులు త్రొక్క హేమమయశృంగముఖంబులనుండి రాజసం
క్రందను చిత్రవర్ణసలిలంబుల ముంచి మనఃశిలావిని
ష్యందపరీతుడైన కులశైలపతిం బొనరించి రాతనిన్. 56

హేమమయ+శృంగ+ముఖంబు=బంగారు+కొమ్ము+మూతి(జారీలాగ), రాజసంక్రందను=రాజేంద్రుని, మనఃశిలా +వినిష్యంద+పరీతుడైన=మణినీలములను+బాగుగా స్రవించు సెలయేఱులచే+ఆవరించినన వాడైన, కులశైల పతిం=కులపర్వతరాజు, వొనరించిరి=ఒప్పించిరి,

తే. అభిమతక్రీడనముల నీరాడి యాడి/వాలిన మనోముదంబున తేలితేలి,
కదలి నదినుండి తీరోపకార్య కరిగి/అవయవంబుల తడియొత్తు నవసరమున 57

అభిమత=మనసుకు ఇష్టమైన, వాలిన=విజృంభించిన, ముదము=సంతోషము, కదలి=బయలుదేఱి, తీర= ఒడ్డునఉన్న, ఉపకార్య=గుడారము, అవసరమున=సమయమున,

సీ. కానుకయిచ్చె సెద్దాని గుంభజునకు/వారాశి మోచనావక్రియముగ,
తనతండ్రి కిచ్చె సెద్దాని నమ్ముని దేవ/భరణీయమైన ఆభరణ మనుచు,
తనకిచ్చెజనకు డెద్దాని ప్రేమమెలర్ప/సామ్రాజ్యరమతోడ సమముగాగ,
ధరియించు దాను సెద్దాని రేలుపవళ్ళు/తాతపాదుని ప్రీతిధనము కాన

అట్టి రత్నానువిద్ధహేమాంగదమున/మాన్యతమైన అతిలోకమండనమున
భూషితముకాని తన బోసిభుజము గుశుడు/పులుకుపులుకున గనుగొని కళవళించె.**58**

ఎద్దాని=ఏ కేయూరమును, మోచనక్రియముగ=మ్రింగిన గంగను వదలినప్పుడు, వారాసి=సముద్రుడు, కుంభజునకు=అగస్త్యునకు, మునిదేవ+భరణీయమైన=అగస్త్యుడు+తను తాల్చవలసిన, ఎలర్ప=చిందగా, జనకుడు=తండ్రి-రాముడు, సమముగాగ=సామ్రాజ్యమెంత విలువకలదో అంత విలువైనదని, తాతపాదుడు=పూజ్యుడైనతండ్రి-రాముడు, అనువిద్ధ=పొదగబడిన, హేమ+అంగదము=బంగారు+కేయూరము, మాన్యతము=గౌరవార్థము ఇచ్చినది, అతిలోక=దివ్య, మండనము=అలంకారము, భూషితముకాని=అలంకరింపబడని, పులుకు పులుకున=భయదుఃఖ భావములతో, కళవళించె=సంభ్రమించె,

క. నీరాడుచు మైమఱచిన/కారణమున, గాదె! బాహుగళితంబై కే
యూరంబు నీటమునుగుట/ఆరయగా నేరనైతి నని యత డడలెన్. **59**

గళితము=జాఱినది, ఆరయు=చూచుకొన, అడలెన్=శోకించె

చ. ఘనతరవస్తులోభమునగా దత డా రవణంబు పోకకున్
దనమది గుందె, పూలవలె నాతడు చూచును భూషణంబులన్,
ముని ప్రణయంబుతో నొసగ, పూజ్యగురుండు ధరించినట్టి, భూ
షణము సదా సమిద్విజయసంవననం బని ఱేడసహ్యతన్. **60**

లోభము=పిసినారితనము, రవణము=భూషణము, ప్రణయము=ప్రేమ, సమిత్+విజయ+సంవననంబు+అని=యుద్ధమునందు+విజయమును+వశము+చేయునది, అసహ్యత=సహించలేక,

వ. నదీష్ణువులైన బెస్తల నప్పుడె రావించి, నదీజలముల నా యాభరణము నన్వేషింప బనిచె. వారును సత్వరమ సరయువున గ్రుంకి కలయగాలించి ఎందును గానక తిరిగి వచ్చి కుశుని సందర్శించి, తమకావించిన వంధ్యప్రయాసమును సవిస్తరముగా విన్నవించి, మరియు నిట్లనిరి. **61**

నదీష్ణుడు=నదిఈతలో నేర్పరి, కలయ=ఎడములేకుండా, వంధ్య=వ్యర్థ,

చ. "వలదు గవేషణంబు మన వాహినినీట మునింగినట్టి మీ
చెలువపుటంగదంబు మఱి చేపడ దేమిటి కన్న, దాని మ్రు
చ్చిలియె సువస్తులౌల్యమున జేసి, ప్రభూ! కుముదాఖ్యు డొక, పెం
జిలువ నదీహ్రదంబున వసించు నతం, డనిగృహ్యమాణుడై". **62**

గవేషణ=వెదకుట, చెలువపు=అందమైన, అంగదము=కేయూరము, చేపడుదు=చిక్కుదు, మ్రుచ్చిలియె=దొంగలించె, లౌల్యము=లోభము, పెను+చిలువ=పెద్ద+పాము, హ్రదము=నీటిమధ్య లోతు ప్రదేశము, అనిగృహ్యమాణుడై=ఎదిరింపలేనివాడై,

శా. ఆ మాటల్ విని, ఉత్తరక్షణమె రౌద్రాకారుడై లేచి "ఏ
మే మీ! ఇప్పనికిం దొడంగిన భుజంగేంద్రుం డెఱుంగండె? మా
సామర్థ్యంబ"ని పల్కి తీరమునకున్ చన్దెంచి, సంరంభియై
పామ్ముం జంపం కుశుండు చేకొనియె, సౌపర్ణాస్త్ర మత్యుద్ధతిన్. **63**

తొడంగు=ప్రారంభించు, సంరంభము=ఉద్రేకము, సౌపర్ణ+అస్త్రము+అతి+ఉద్ధతిన్=గరుడ+అస్త్రమును+అతి+గర్వముతో

క. మడుగుపయిన ఫణికై ఇటు/గడగిన యా జెట్టిబిరుదు, కడిమిన్ దెగువన్
కడలిపయి గనలి పొడువగ/నడరిన, యా యయ్య కొడుకె, యని యనిపించెన్. **64**

మడుగు=నదీ మధ్యపు అగాధ తలము, ఫణి=పాము, కడగిన=పూనిన, జెట్టి=శ్రేష్ఠ, బిరుదు=శూరుడు, కడిమి=పరాక్రమము, తెగువ=సాహసము, కడలి=సముద్రము, కనలి=కోపగించి, పొడవగ=పోట్లాడ, అడరిన=యుద్ధముపూనిన, అయ్య=తండ్రి/రాముడు,

సీ. తొడిగెనో లేదొ పెందూపు దండిమగండు/కాకుత్ స్థవీరుడు కార్ముకమున,
మడుపెల్ల గలగుండువడి సమావిద్ధోర్మి/కరములతో గట్టులురల ద్రోచి,
మొరసె నత్యాభీలముగ నోదమున బడ్డ/మదమత్తవన్య సామజము మాడ్కి,
ఆరవశ్రుతిసహాయాతుండు, సంకుచ/త్ఫణమండలుడు, నల్పపరిజనుండు,
వెలువడియె నంతలోన నుద్వృత్తనక్ర/మైన యందుండి, మథ్యమానాబ్ధినుండి
కమలతోగూడ, దివిజవృక్షంబు వోలె/కన్యకాసహితుడు, భుజంగమవిభుండు. **65**

తొడుగు=సంధించు, పెను+తూపు=పెద్ద+బాణము, దండి=గొప్ప, కార్ముకము=విల్లు, కలగుండువడి=క్షోభ పడి, సమా+విద్ధ+ఊర్మి+కరముల=చక్కగా+చాచబడిన+తరంగములనే+చేతులతో, ఉరలద్రోచి=దొర్లించి, మొరసె=ధ్వనించె, అతి+ఆభీలము=అధిక+బాధ, ఓదము=ఏనులపట్టుగొయ్యి, మదమత్త=మదముచే గర్వించిన, వన్య+సామజము+మాడ్కి=అడవి+ఏనుగు+వలే, ఆరవ+శ్రుతి=అరచు+ధ్వని, సహాయాతుడు=తోడ్పాటుకలవాడు, సంకుచత్+ఫణ+మండలుడు=ముడచిన+పడగల+సమూహముకలవాడు, ఉద్వృత్త

=పైకెత్తబడిన, నక్రము=మొసలి, మథ్యమాన=చిలికిన, అబ్ధి=పాలసముద్రము, కమల=లక్ష్మీదేవి, దివిజవృక్షము=కల్పవృక్షము, భుజంగము=పాము

తే. అంగదప్రత్యుపాయనహస్తు, నతని/కాంచినంతనె, ఉపసంహరించి కొనియె,
రఘుపతి నిజాశుగము, అనిర్బంధరోషు/లవనతుల పట్ల, తాదృశోదారమతులు. **66**

అంగద=కేయూరము, ప్రతి+ఉపాయన=తిరిగి+కానుకగాఇచ్చు, ఉపసంహరించు=వెనుకకుతీసుకొను, ఆశుగమము=బాణము, అనిర్బంధ=పట్టుదలేని, రోషులు=కోపులు, అవనతుల=లొంగినవారల, తాదృశ=ఎంత కోపమో అంత, ఉదార=సరళ,

క. అభయంబు వేడి, కుముదుడు/సభక్తికప్రణతి చేసి, సకలాండపతి,
ప్రభవుని పదంబు సన్నిధి/విభూషణము నుంచి పలికె వినయము మిగులన్. **67**

ప్రణతి=నమస్కారము, సకల+అండ+పతి=సమస్త+లోకములకు+ప్రభువు-రాముడు, ప్రభవుడు=కొడుకు, మిగులన్=అతిశయింప,

చ. "ఎఱుగనె! కారణాంతరగృహీతమనుష్యశరీరుడైన శ్రీ
హరికి సుతాఖ్యమైన అపరాత్మవు నీ వని, నే నెఱింగియున్
నిరతసమర్చనీయునకు నీ కొనరింతునె ప్రీతిభంగమున్?
పరమదయాళు! వచ్చె పొరపా టపరాధము సైపవే మమున్. **68**

కారణాంతర=దేవకార్యమై, గృహీత=స్వీకరించిన, సుతాఖ్య=కొడుకను పేర, అపర+ఆత్మ=రెండవ+రాముని, నిరత+సమర్చనీయు=ఎల్లప్పుడు+పూజింపదగ్గ,

ఉ. అందపు బంతి బైకెగచి, ఆననమెత్తిన ఇక్కుమారి, మిం
టం దెగిపడ్డ చుక్కవలె నాదు మడుంగుననుండి దిగ్గునన్
ముందట బడ్డ మీ రవణముం గని పిన్నది కాన దాని, జే
నంది పరిగ్రహించె, మనుజాధిప! నిక్కము విన్నవించితిన్. **69**

పైకి+ఎగచి=మీదకు+విసరి, ఆననము+ఎత్తిన=ముఖము+పైకెత్తిన, మింట=ఆకాశము, తెగిపడ్డ=రాలిన, చుక్క =నక్షత్రము, రవణము=భూషణము, పిన్నది=చిన్నది, పరిగ్రహించె=పట్టుకొనె, నిక్కము=నిజము,

వ. గుణఘాతరేఖాకిణములతో లాంఛింతమును, బృహదబ్ధిమేఖలావహనమునకు అతిప్రగల్భమును, గోత్రాచలదిశాకరీంద్రముల కూఱటపట్టును, వనీపకజనాశాపరిపూర్తికి కల్పశాఖియు నగు నీ ఎగుభుజముతో ఇమ్మహామండనము పునర్యోగము నొందుగాక. **70**

గుణ+ఘాత+రేఖా+కిణములతో+లాంఛింతము=అల్లెత్రాడు+దెబ్బలవల్లకలిగిన+గీతలు+గణుపు కాయల+గుర్తులుకలది, బృహత్+అబ్ధిమేఖల+వహనమునకు+అతి+ప్రగల్భమును=పెద్ద+సముద్రము మొలనూలుగా కల భూమిని+ప్రోచుట అందు+అధిక+ప్రావీణ్యతను, గోత్ర+అచల+దిశా+కరీంద్రములకు+ఊఅట+పట్టును=భూమికి+స్థిరము కలిగించు+ఎనిమిది దిక్కులందలి+ఏనుగులకు+సహాయము+అందించు నది(తానే మోసి), వనీపక+జన+ఆశా+పరిపూర్తికి+కల్పశాఖియు=యాచక+జనుల+కోరికల+పూర్తిగా తీర్పుట అందు+కల్ప వృక్షము, ఎగు=ఉన్నత, మండనము=భూషణము, పునర్+యోగము=మళ్ళీ+కలియుట,

మ. ఈపడంతి బరిగ్రహింపు, మహీనపుణ్యుడ నౌదు, నో
భూప! మా కడగొట్టుచెల్లిలి, బుణ్యశీల గుముద్వతిన్
నీ పదాంబురుహద్వయం బిది నేమ మొప్ప భజించి, ఆ
త్మాపరాధ మపాకరించి, కృతార్థతం గను గావుతన్". 71

పరిగ్రహించు=స్వీకరించు, అహీన=గొప్ప, కడగొట్టు=ఆఖరి, నేమము+ఒప్ప=నియమము+కూడి, భజించి=సేవించి, అపాకరించి=తొలగించి,

తే. అని, కుముదు డంత జనపతి యనుమతమున/స్వర్ణమయమైన బాహుభూషణముతోడ
హారికన్యామయంబైన ఆత్మవంశ/భూషణము గూర్చె రఘువంశభూషణునకు. 72

హారి+కన్యా+మయంబు=మనోహరమైన+కన్యలు+ఎక్కువగాకల, భూషణము=రత్నము,

మ. సహధర్మాచరణంబె లక్ష్యముగ నైక్ష్వాకుండు కన్యాకర
గ్రహణంబున్ జ్వలదగ్నిహోత్రు నెదుటన్ గావించుచో నల్గడలన్
బహుతూర్యస్వనితంబు మెండుకొనియెన్, వర్షించె అత్యద్భుతా
వహధారాధరముల్ సుగంధభరితప్రత్యగ్ర పుష్పౌఘమున్. 73

జ్వలత్=మండుచున్న, తూర్య+స్వనితంబు=మంగళ సన్నాయి వాద్యపు+ధ్వని, మెండుకొను=నిండుకొను, అతి+అద్భుత+ఆవహ+ధారాధరముల్=ఎక్కువ+ఆశ్చర్యము+కలిగించునట్లుగా+మేఘములు, ప్రత్యగ్ర=నూతన, ఓఘము=పరంపర,

మ.ద్వి. త్రైలోక్యగురుని యౌరసు మైథిలేయు/దమ యబ్బురపు పెండ్లికొమరునిగాగ,
ప్రథితతక్షకనాగపంచము గుముదు/బావమఱందిగా బడసి యీరీతి, 74

త్రైలోక్య+గురుని=మూడులోకములకు+తండ్రి-రాముని, ఔరసు=కుమారు, మైథిలేయు=జానకి కొడుకు-కుశుడు, అబ్బురపు=ఆశ్చర్యపు, ప్రథిత=కులశీలములుకల, తక్షక+నాగ+పంచము=తక్షకుడను+పాము+పంచమ పుత్రుని కుముదుని, పడసి=పొంది,

మ.ద్వి. ఫణివంగడమునకు పరమ యముండు/వైనతేయు భయంబు వర్జించె నొకడు,
శాంతపన్నగమైన జగతీతలంబు/నన్యుడు జనకాంతుడై ప్రశాసించె. **75**

ఫణి+వంగడము=పాము+వంశము, యముండు=మృత్యుదేవుడు, వైనతేయుడు=గరుత్మంతుడు, వర్జించె =విడువ చేసె, ఒకడు=విష్ణువు-రాముడు, శాంత+పన్నగము=శమించిన+క్రూరసర్పభయము, జగతీతలంబు =భూమి, అన్యుడు=కుశుడు, జన+కాంతుడై=ప్రజలకు+ప్రియుడై, ప్రశాసించె=పాలించె,

# సప్తదశ సర్గము - అతిథి ప్రశంస

ఆ. అతిథినాము గనియె సుతుని గుముద్వతి/కులవిభూతికరుని కుశునివలన,
ప్రస్ఫుటముగ రేయి పగటిజాముచే/తేటదనము బడయు ధిషణ, వోలె. 1

విభూతి=అభ్యుదయము, కరుని=చేయువాని, ప్రస్ఫుటముగ=వాస్తవముగా, పగటిజాముచే=తెల్లవారుఝాము, తేటదనము=మిక్కిలి స్పష్టత, ధిషణ=బుద్ధి (తెల్లవారుఝామున బుద్ధి చురుకుగా పనిచేయును),

క. అతులిత తేజోనిధియై/పితృమంతుడు చతురు డతడు పితృమాతృకుల
ద్వితయము వెలిగించె, అహ/ర్పతి పథముల దక్షిణోత్తరద్వయము, బలెన్. 2

అతులిత=సాటిలేని, నిధి=స్థానము, పితృమంతుడు=చక్కని శిక్షణతో కుమారుని తీర్చిదిద్దగలిగిన తండ్రి కలవాడు, ద్వితయము=రెంటినీ, వెలిగించె=ప్రసిద్ధికెక్కచేసె, అహర్పతి=సూర్యుడు, పథము=మార్గము,

క. మునుమును గ్రహింపజేసెను/జనయిత కులవిద్యలందు సారము సెల్లన్
వెనుక అనురూప యగు నృప/తనయామణి కేలుదలిరు తనయునిచేతన్. 3

మునుమును=ముందుగా, జనయిత=తండ్రి, సారము=సారాంశము, కేలు=చేయి, తలిరు=పల్లవము,

తే. తదభిజాతునిచేత యతాత్ముచేత/నిరతిశయబాహుబలధురంధరునిచేత,
ఏకకుని దన్ను దలచె ననేకకునిగ/జాత్యుడు జితేంద్రియుడు బాహుశాలి, కుశుడు.4

తత్+అభిజాతుడు=ఆ+కులీనుడు, యత+ఆత్ముడు=నిగ్రహింపబడిన+ఇంద్రియములు కలవాడు, నిరతిశయ =అత్యధిక, ధురంధరుడు=శ్రేష్ఠుడు, ఏకకునిన్+తన్నున్+తలచె+అనేకకునిగ=ఒంటరిఅయిన+తనను+ భావించెను+ఇటుపై ఒంటరితనము లేనివాడనని, జాత్యుడు=మంచికులమున పుట్టినవాడు, జిత+ఇంద్రియుడు =ఇంద్రియ నిగ్రహము కలవాడు, బాహుశాలు=భుజబలుడు.( ఒకే విశేషణాలతో తండ్రికి కొడుకుకూ, ఏకత్వంలో అనేకత్వ సాధన)

మ. నిజవంశోచితవీరకృత్యమున కున్మేషంబుగా జంభవృ
త్రజిదగ్రేసరుడై కుశుండు తనదుర్వారప్రతాపస్ఫుర
ద్భుజదర్పంబున దుర్జయాఖ్య దనుజేంద్రుం ద్రుంచి, రక్షశ్శర
వ్రజనిర్భిన్న శరీరుడై కలన వీరస్వర్గముం బొందినన్. 5

ఉచిత=యుక్త, ఉన్మేషంబుగా=ఉదాహరణగా, జంభ+వృత్ర+జిత్+అగ్రేసరుడై=నీచుడైన+వృత్రాసురుని+ జయించిన ఇంద్రునికి+ముందుగా నడచువాడై, దుర్వార=నివారింపరాని, స్ఫుర=ప్రకాశించు, దర్పము=

ఉత్సాహము, దుర్జయాఖ్య=దుర్జయుడను పేరుకల, త్రుంచి=చంపి, రక్షస్+శర+వ్రజ+నిర్భిన్న=రాక్షసుని+బాణ+సమూహముచే+చీల్చబడిన, కలన=యుద్ధమున,

క. కుముదాహివరునిసోదరి/కుముద్వతియు, సహగమించె కుశు నాత్మేశున్
కుముదానందవిధాయకు/అమృతాంశుని, చాంద్రి వోలె, నవిచలితధృతిన్. **6**

అహి=పాము, సహగమించె=భర్తతో చితిచొచ్చె, కుముద+ఆనంద+విధాయకు=కమలములకు+ఆనందము+కలిగించు, అమృతాంశుడు=చంద్రుడు, చాంద్రి=వెన్నెల, అవిచలిత=ఎంతమాత్రమూ సడలని, ధృతి=పట్టుదల,

ఆ. మాన్యు డయ్యె శాతమన్యవసింహాస/నైకదేశభాగియై, కుశుండు,
పారిజాతకాంశభాగినియై, కుము/ద్వతియు శచికి ప్రేమపాత్రమయ్యె. **7**

మాన్యుడు=గౌరవనీయుడు, శాతమన్యవ=ఇంద్రుని, ఏకదేశ+భాగియై=సింహాసనభాగము+పంచుకొన్నవాడై, పారిజాతక+అంశ+భాగినయై=పారిజాతములలో+భాగము+పంచుకొన్నదై,

క. అధినాయకు గావించిరి/పృథివికి, కౌముద్వతేయు వృద్ధామాత్యుల్,
ప్రధనాభియాయియై, ము/న్నధిపతి, తమ కిడిన ముదల కనువర్తనులై. **8**

అధినాయకు=రాజు, కౌముద్వతేయు=కుముద్వతి కుమారుడు-అతిథిని, ప్రధన=యుద్ధము, అభియాయి=ఎదురుగా పోవుచున్న, ముదల=ఆజ్ఞ, అనువర్తనులై=అనుసరించి నడచినవారై,

సీ. పట్టాభిషేకోత్సవమునకు శిల్పులు/రచియించి రత్యభిరామలీల,
ప్రత్యేకముగ సముజ్జ్వలమంటపంబును/ధృఢచతుఃస్తంభప్రతిష్ఠితముగ,
అందు నూత్ననృపాలు నసదృశావిచ్ఛిన్న/శుభసంపదావాప్తిసూచకముగ,
సానుబంధములు తూర్యస్వనంబులు స్నిగ్ధ/గంభీరముగ బోరు, కలుగుచుండ,
జరిపిరాప్తజనులు సచివులు భద్రాస/నస్థుజేసి కుశుని నందనునకు,
శాతకుంభకుంభసంభృతబహుతీర్థ/జలముతోడ, దదభిషవణమహము. **9**

అతి+అభిరామ+లీల=ఎక్కువ+మనోజ్ఞమైన+విధము, సముజ్జ్వల=మిక్కిలి ప్రకాశించు, ధృఢ=స్థిర, ప్రతిష్ఠితముగ=నెలకొలిపి, అసదృశ=సాటిలేని, అవిచ్ఛిన్న=నిరాటంక, అవాప్తి=ప్రాప్తి, సానుబంధము=ఎడతెగని, తూర్య=మంగళ వాద్యముల, స్వన=స్వర, స్నిగ్ధ=చక్కని, బోరు=ధ్వని, సచివులు=మంత్రులు, భద్రాసన+అస్థు=సింహాసనముపై+కూర్చున్న, శాతకుంభ=బంగారపు, కుంభము=కలశము, సంభృత=సిద్ధము, అభిషవణ=స్నాన, మహము=ఉత్సవము,

క. స్థవిరులగు జాతిముఖ్యులు/నివాళులెత్తిరి నవీననృపునకు నెమ్మిన్

నవసుభగప్లక్షత్వ/క్ప్రవాళదూర్వాయవాంకురంబులతోడన్. 10

స్థవిరులు=వృద్ధులు, జాతి=కుల, నివాళిలెత్తిరి=దృష్టిదోషము కొఱకు దిగతుడిచిరి, నెమ్మి=ప్రేమ, నవ+సుభగ= లేత+అడవిమల్లెలు, ప్లక్ష+త్వక్=రావి+బెరడు, ప్రవాళ=చిగురులు, దూర్వ=గఱికపరక, యవ+అంకురంబు= యవగడ్డి+మొలక,

క. మునుముం దభిషేకించిరి/మునిసములు, పురోహితాదిభూమీవిబుధుల్,

మనుకులుని దశరథుని ముని/మనుమని, మహనీయజైత్రమయ మంత్రములన్. 11

భూమీవిబుధులు=బ్రాహ్మణులు, మహనీయ=గొప్ప, జైత్రమయ=జయముకూర్చగల,

సీ. ద్విజహస్తములనుండి తీర్థతోయౌఘంబు/రఘుకులోద్వహుని మూర్ధమున దొరలె,

అంతరిక్షమునుండి అంధకరిపు జటా/స్థలముపై బడు గాంగధార వోలె,

మాగధజేగీయమానుడై శోభాయ/మానుడయ్యె ప్రవర్ధమాను డతడు,

చాతకగణముచే సంస్తూయమానుడై/క్రాలు ప్రవృద్ధపర్జన్యులీల,

నిగమమంత్రపూతనిర్మలోదకమున/తానమాడినట్టు మానవునకు,

వానదడసినట్టి వైద్యుతాగ్నికి బలె/అగ్గలించె, దీప్తి నిగ్గుదేఱి. 12

ద్విజ=బ్రాహ్మణుల, తీర్థ+తోయ+ఓఘము=పుణ్యతీర్థ+జల+ప్రవాహము, ఉద్వహుడు=అభివృద్ధి పొందించు వాడు, మూర్ధము=శిరస్సు, తొరలె=ప్రవహించె, అంతరిక్షము=ఆకాశము, అంధకరిపు=అంధకాసురిని చంపిన శివుడు, మాగధ=స్తుతించు మాగధులు, జేగీయము=జయజయనినాదము, ప్రవర్ధమానుడు=వృద్ధిపొందగల వాడు, చాతక+గణము=చాతక పక్షుల+గుంపు, సంస్తూయమానుడు=స్తుతింపబడినవాడు, క్రాలు=వర్తిల్లు, ప్రవృద్ధ= పెద్ద, పర్జన్య=మేఘము-వరుణుడు, నిగమ=వేద, వైద్యుతాగ్ని=విద్యుత్తు అగ్ని (బడబాగ్ని), అగ్గలించె= ఎక్కువయె, నిగ్గుదేఱి=కాంతిమంతమై,

తే. ఎంత విత్తము వితరించెనేని ముగియు/తన్మఖంబులు పర్యాప్తదక్షిణములు,

స్నాతకులకు కుముద్వతీసూతి యొసగె/అంతమొత్తము, నుత్సవానంతరమున. 13

వితరించెనేని=ఖర్చుపెట్టగా, తన్+మఖంబులు=ఆ+యాగములు, పర్యాప్త=ముగిసిన, స్నాతకుడు=యాగము పూర్తిచేసి స్నానముచేసిన/చేయించు పురోహితుడు,

తే. తృప్తమతులైన వార లేమేమి నృపుని/కాశిషంబు లొసంగిరో, అవ్వి వాని

కర్మనిర్వృత్తఫలపూర్తికారణమున/సల్పె స్వఫలదానావకాశప్రతీక్ష. 14

తృప్త=తృప్తిపొందిన, ఆశిషంబు=ఆశీర్వాదము, కర్మనిర్వృత్త+ఫల+పూర్తి=పూర్వ జన్మ పుణ్యము చేత కలిగిన+ఫలము+లభింపగా, స్వ+ఫల+దాన+అవకాశ+ప్రతీక్ష=ఇప్పటి ఆశీర్వాదములు తాము+ఫలితములు+సమకూర్పు+సమయమునకై+వేచి, సల్పె=ఉండె,

క. చెఱసాలలు తెఱపించెన్/ మరి వధ్యుల కహతి సల్పె నవభూపతి, మో
పరుల బరువు విడిపించెను/విరమింపగజేసె పాలుపిండుట పసికిన్. **15**

వధ్యులు=మరణశిక్ష పడినవారు, అహతి=చంపబడకుండుట, మోపరులు=బరువులుమోయు వారికిమఱియు ఎడ్లకు, పసి=ఆవుల,

తే. అతని క్రీడావినోదవిహంగములకు/పంజరస్థములగు శుకప్రభృతిసకల
శకునిసంతానమునకు తచ్ఛాసనమున/విడుదల లభించె విచ్చలవిడి జరింప. **16**

విహంగము=పక్షి, పంజరస్థము=పంజరములో ఉంచబడిన, శుక+ప్రభృతి=చిలికలు+మొదలైన, శకుని=పక్షి, సంతానము=సముదాయము,

క. అంతట నిజాభిషేకా/నంతరమున నరుగుదెంచె అభ్యంతర క
క్ష్యాంతరమున, సాస్తరణపు/దంతపుబీఠమున నున్న తరి వచ్చి వడిన్. **17**

అభ్యంతర=ఆంతరంగిక, కక్ష్య అంతరము=మరియొక భవనము, స ఆస్తరణపు=కంబళి పఱచిన, తరి=వద్దకు,

క. సముచితముగ గయిసేసిరి/తమ నేరుపు మెఱయ రఘువతంసుని నెమ్మిన్
విమలజలధౌతపాణులు/కమనీయోదాత్తవేషకరణవిదగ్ధుల్. **18**

కయిసేసిరి=అలంకరించిరి, మెఱయ=ప్రకటింప, నెమ్మిన్=ప్రేమతో, విమల=నిర్మల, ధౌత=కడిగిన, కరణ=చేయు, విదగ్ధులు=నేర్పరులు,

తే. స్రగ్విలేపనభూషావిరాజితుండు/హంసచిహ్న దుకూలసమంచితుండు,
నిశ్చలవిలోచనప్రేక్షణీయు డయ్యె/రాజ్యలక్ష్మీవధూమనోరము డతండు. **19**

స్రగ్వి=పూలదండ ధరించినవాడు, లేపన=చందన కస్తూరి ఆది ద్రవ్యములు రాసుకొని, భూషణ=ఆభరణములచే, విరాజితుండు=ప్రకాశించువాడు, హంసచిహ్న+దుకూల=హంసలు అంచులందు కల+పట్టువస్త్రము ధరించి, సమంచితుండు=సుందరమైన వాడు, నిశ్చలవిలోచన=రెప్పవాల్చక, ప్రేక్షణీయుడు=చూడదగ్గవాడు,

ఆ. అలరె రఘుకిశోరు డయ్యలంకృతిచేత/నిండుకలిమి చేత నీతి రీతి,
వితరణంబు చేత విఖ్యాతి విధమున/పుణ్యగరిమ చేత భూతి భాతి. **20**

అలరె=ప్రకాశించె, కిశోరుడు=శ్రేష్ఠుడు, నిండు+కలిమి+చేత=పూర్ణ+సంపద+ఉండుటచే, నీతి=రాజనీతి, వితరణంబు=దానము, విఖ్యాతి=కీర్తి, గరిమ=సీమ, భూతి=వైభవము,

ఆ. తనదు సొగసు హిరణ్మయదర్పణమున/అరసికొనుచున్న ఆ రఘూత్తరుని నీడ,
బాల్యరమణీయభానుబింబమున మెరయు/మేరునగకల్పకచ్ఛాయయై రహించె.. 21

సొగసు=అందము, హిరణ్మయ+దర్పణము=బంగారపు+అద్దము, అరసి=చూచు, నీడ=ప్రతిబింబము, బాల్య=లేత, భాను=సూర్య, మేరు+నగ+కల్పక+చ్ఛాయ+ఐ=మేరు+పర్వతముపై+కల్పవృక్షపు+నీడ+అయిమట్లు, రహించె=శోభిల్లె,

సీ. జేజేలు పలుకుచు రాజచిహ్న వ్యగ్ర/పాణు లభ్యంతరపార్శ్వచరులు,
కొలిచిరా నృపతి అవ్వల సుధర్మాస/దృక్షము తన కొలువుకూటమున కేగి,
ప్రణతనిశ్శేషభూపాలచూడారత్న/వితతోల్లిఖితపాదపీఠ మయిన,
సవితానపైతృకాసనమున గొలువుండె/సచివబాంధవసుహృజ్జనుల గోష్ఠి,
రఘుకిశోరునిచే సమాక్రాంతమైన/ఆ విశాలమంగళసమజ్యాయతనము.
వరలె శ్రీవత్సచిహ్నమై, వనజనాభు/కౌస్తుభాక్రాంతమైన వక్షంబు, లీల. 22

రాజచిహ్న=ఛత్రచామరములు, వ్యగ్ర=ధ్యానముకల, అభ్యంతరము=ఆంతరంగిక, పార్శ్వచరులు=ప్రక్కనడచు పరిచారకులు, కొలిచి=సేవించి, అవ్వల=పిమ్మట, సుధర్మా=దేవసభ, సదృక్షము=సమముగా కనబడు, ప్రణత=(వంగి) నమస్కరించిన, నిశ్శేష=అఖిల, చూడారత్న=తలలోని మణులచే, వితత=విరివిగా, ఉల్లిఖిత=గీయబడిన, సవితాన=మేలుకట్లతోకూడిన, పైతృక+ఆసనమున=తండ్రికిచెందిన+సింహాసనమున, సచివ=మంత్రుల, సుహృజ్జన=మంచివారి, గోష్ఠి=సభ, సమాక్రాంతము=చక్కగా ఆక్రమింపబడిన, సమజ్య+ఆయతనము=సభా+ మంటపము, వరలె=అంద గించె, శ్రీవత్సచిహ్నమై=శ్రీవత్సమను(గృహ)నిర్మాణశైలికలదై, వనజనాభు=విష్ణుని, ఆక్రంతము=ఆక్రమింపబడిన,

క. ఆవిధి యువరాజపదవి/కావల అధిరాజ్యమంది, ఆతడు రేఖా
భావంబునుండి, ఆభో/గావాప్తిని గన్న చంద్రుడై, విలసిల్లెన్. 23

ఆవల=పిమ్మట, అధిరాజ్యము=మహాసామ్రాజ్యము, రేఖాభావంబు=అర్ధచంద్రత్వము, ఆభోగ+అవాప్తి=పరిపూర్ణత+పొందిన, విలసిల్లెన్=ఒప్పెను,

మ. స్మితపూర్వప్రణయాభిభాషణముతో స్నిగ్ధప్రసన్నానన
ద్యుతితో, శీతలదృగ్విలాసములతో ఉద్దీప్యమానాంచితా

కృతితో, మాలిమిగొల్పు, నూతనవిభున్ వీక్షించి, ఎంచి ర్మదిన్

ప్రతిమాతీతసుమూర్తిమంతమగు, విశ్వాసంబుగా సంశ్రితుల్. 24

స్మితపూర్వ=చిరునవ్వుతోముందుగా, ప్రణయ=ప్రేమ, అభిభాషణ=మంచిమాట, స్నిగ్ధ=స్నేహ, ప్రసన్న= అనుగ్రహ, ఆనన=ముఖ, ధ్యుతి=కాంతి, శీతల=చల్లని, దృక్=చూపు, ఉద్దీప్యమాన=ప్రకాశించుచున్న, అంచిత=సుందరమైన, ఆకృతి=రూపము, మాలిమి=చనువు, ప్రతిమ+అతీత=పోలిక+రాని, సుమూర్తి మంతము=మంచి స్వరూపముకొన్న, విశ్వాసము=నమ్మకత్వము, సంశ్రితులు=ఆశ్రయించినవారు,

ఉ. దైవతమంత్రితుల్యులు ప్రధానులు సూరెలగొల్చి రాగ నై

రావణదంతి బోని గజరాజముపై నృపవీథి నేగుచున్,

భావుకకల్పకద్రుమనిభధ్వజమైన పురిం, బురందర

శ్రీవిభవోదయుం, డతడు చేసె ద్వితీయసురాలయంబుగన్. 25

దైవతమంత్రి=బృహస్పతి, తుల్యులు=సమానులు, ప్రధానులు=మంత్రులు, సూరెల=రెండు ప్రక్కల, ఐరావణ దంతి=ఐరావతము, భావుక=మంగళకర, కల్పద్రుమ=కల్పవృక్ష, నిభ=సమాన, ధ్వజము=జెండా, పురంధర= ఇంద్రు, శ్రీ=ఐశ్వర్యము, విభవ+ఉదయుండు=మహత్వము+కలవాడు, ద్వితీయ=రెండవ, సురాలయము= స్వర్గము,

ఆ. పట్టి రొక సితాతపత్రంబు మౌక్తిక/ప్రభల నిగుడ నూత్న పార్థివునకు,

సంఘటించె నదియె సకలధాత్రికి పురా/ప్రభువియోగజోష్మభరనివృత్తి. 26

సిత=తెల్లని, అతపత్రము=ఛత్రము, మౌక్తిక=ముత్యముల, ప్రభ=కాంతి, నిగుడ=ప్రసరింప, సంఘటించె =సమకూర్చె, అదియె=ఆవైభవము, పురాప్రభు=పాతరాజు-కుశుడు, వియోగజ=వియోగముచే పుట్టిన, ఔష్మ=సంతాప, భర=భార, నివృత్తి=తొలగింపు,

తే. పొగ యనంతరమున అగ్ని రగిలిమండు/ఇనుడు పొడమిన వెనుక తద్ ఘృణులువెలుగు

ఉత్థితుండాయె, స్వగుణసంయుక్తితోడ/అతిథి తేజోధనుల నైజ మవల ద్రోచి. 27

ఇనుడు=సూర్యుడు, పొడమిన+వెనుక=కనబడిన+తరువాత, ఘృణులు=కిరణములు, స్వ+గుణ=తన+ మంచిగుణముల, సంయుక్తి+తోడ=చక్కగాకలియు+కాలముతోసమానముగా, ఉత్థితుండాయె=వృద్ధిపొందిన వాడయ్యెను. తేజోధనులు=అగ్నిమరియుసూర్యుడు, నైజము=స్వభావము, అవల=అవతలికి.

ఆ. తదభిషేకవారి దడిసిన వేదిక/ఎంతలోన నాఱె నంతలోన,

విస్తరించె నుదధివేల దాక, తదీయ/శత్రుదుస్సహోగ్రశౌర్యమెల్ల. 28

ఉదధి=సముద్రము, వేల=తీరము, దుస్సహ=సహింపరాని, ఉగ్ర=భయంకర, ఎల్ల=అంతటా,

క. కులగురువు శ్రీ వసిష్ఠుని/బలవన్మంత్రమును తనదు పటుసాయకమున్,
కలసిన కౌశి కసాధ్యము/కలదే? సాధింపబడని కార్యము కలదే?. **29**

బలవన్మంత్రము=మహిమ కలమంత్రము బలము, పటు=సమర్థమైన, సాయకము=బాణము,

ఆ. జీవనాభివిద్ధి చెందిరి కుశునిచే/నరులు శ్రావణమున నదులు వోలె,
మెఱుగుపఱచె దాని నరులకెల్ల నతండు/నదుల నెల్ల భాద్రపదము, వోలె **30**

జీవన=బ్రతుకు, అభివృద్ధి=వికాశము, మెఱుగుపఱచె=వన్నెకెక్కె(శ్రావణమాసములోవానలవలన (జీవనము) నీరు ప్రారంభమై, భాద్రపదములో కొనసాగగా నదులు పొంగును.)

క. అతడాడితప్ప డెన్నడు/వితరించిన దాని గొనడు, విమతోత్థనన
ప్రతిరోపణముల వలననె/వ్రతచర్యాభంగమునకు బాల్పడుచుండున్. **31**

వితరించిన=దానమిచ్చిన, కొనడు=తీసికొనడు, విమత=శత్రువులను, ఉత్థనము=(రాజ్యమునుండి) పెల్లగించుట, ప్రతిరోపణ=మరల స్థాపించుట, వలననే=ఈ ప్రక్రియలోనే, వ్రతచర్య=నియమము, భంగము= లోపము, పాలు+పడు=పూనుకొను,

క. కులరూపవయోధన, సం/జ్ఞలలో నొక్కకటె చెఱుపజాలును పురుషున్!
వలయుకొలది నివి యన్నియు/తలకూడియు, నేలికొనదు! దర్పం బతనిన్. **32**

కుల=మంచి కులము, సంజ్ఞ=విద్య, చాలును=సమర్థము, వలయు=ఇష్టము, కొలది=పరిమాణము, తలకూడు=కలుగు, ఏలికొనదు=రాజ్యముచేయదు, దర్పము=గర్వము,

క. జనితానురాగులై, త/న్ననయము ప్రజ లాదుకొనగ, నక్షోభ్యుండ
య్యెను, నూతను డయ్యును, వెస/ జనపతి, దృఢమూలమైన, సాలము భంగిన్. **33**

జనిత అనురాగులై=అనురాగము కలిగినవారై, అనయము=ఎల్లప్పుడు, ఆదుకొనగ=వెనుదన్నుగా ఉండగా, అక్షోభ్యుడు=కదలించుటకు సాధ్యము కానివాడు, వెస=శీఘ్రముగా,

క. బయట వైరు లల్పబలులు, దవ్వులవారు/అదియుగా కనిత్యు, లని తలంచి,
అడచె మొదట, నిత్యు లైన, లోపలి మహా/శత్రు లార్వురను, కుశప్రసూతి. **34**

బయట=వెలుపలి, వైరులు=శత్రువులు, అల్ప=కొద్దిపాటి, దవ్వు=దూరము, అనిత్యులు=ఎల్లప్పుడూఉండు వారుకారు, నిత్యులు=ఎప్పుడూ ఉండు, లోపలి=అంతః, శత్రులార్వురు=కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యము లనెడి శత్రులు, అడచె=లొంగదీసికొనె, ప్రసూతి=కొడుకు,

ఆ. నిరతానుగ్రహు, ధరణీశ్వరునందు, నిసర్గముగను చంచల యయ్యున్,
సిరి, అత్యనపాయిని యై/ఒరగల్లున బసిడిగీత యొఱపున, నుండెన్. **35**

నిరతము=స్థిరముగా, అనుగ్రహుడు=ఏలుకొనువాడు, నిసర్గముగ=సహజముగ, సిరి=శ్రీ, చంచలఅయ్యున్=చంచల స్వభావము కలదైననూ, అతి+అనపాయినియై=ఎల్లప్పుడు+ఎడబాయనిదై, ఒరగల్లున=బంగారము పరీక్షించు ఱాయిపై, పసిడి+గీత=బంగారము+గీత, ఒఱపున=విధమున, ఉండెన్=శాశ్వతముగా ఉన్నది,

తే. పాఱుబోతుతనంబు, కేవలనయంబు/శ్వాపదవిచేష్టితంబు, కేవలబలంబు,
నయబలోచితసమ్మేళనమున, గలుగు/గెలుపె, కౌముద్వతేయు చికీర్షితమ్ము. **36**

పాఱుబోతుతనంబు=పఱిగెత్తు స్వభావము, కేవలనయంబు=(శక్తిలేని)నీతిమాత్రమే, శ్వాపద+విచేష్టితంబు=క్రూరమైన+తప్పుపనిచేయుట, కేవల బలంబు=(నీతిలేని)బలము మాత్రమే, నయ+బల+ఉచిత+సమ్మేళనమునన్=నీతి+శక్తుల+యుక్త+కలయిచే, కౌముద్వతేయు=కుముద్వతికుమారుని, చికీర్షితమ్ము=చేయు ఇచ్ఛ ,

ఆ. కలయ పేగు లనెడు వెలుగురేకలు కల/అతిథిపార్థివునకు, వ్యభ్రుడైన
సవితృనకును బోలె, స్వవిషయమందెల్ల/లే, దగోచరమ్ము లేశమైన. **37**

కలయ=అంతటా, పేగులు=చారులు(రాజు చారచక్షువు-చారులే కన్నులుగా కలవాడు), రేక=ఎడమలేని నిరంతరపంక్తి, వ్య+అభ్రుడైన=మేఘములు లేని, సవితృడు=సూర్యుడు, స్వ+విషయమందు+ఎల్ల=తన+దేశము+అంతటా, అగోచరము=కనబడనిది, లేశము=అణువు,

క. అవనీధవులకు రాత్రిం/దివసవిభాగములయందు నెవి విహితములో,
వివిధతదాదిష్టంబుల/అవికల్పనియుక్తి, నడపె నతడన్వహమున్. **38**

అవనీధవుడు=రాజు, దివస=పగలు, విహితము=విధింపబడినది(మనుధర్మప్రకారము), వివిధ+తత్+అదిష్టంబుల=అనేక విధములైన+వాటిని+ఆశ్రయించి, అవికల్ప=సంశయము తారతమ్యములు లేక, నియుక్తి=నిశ్చయముతో, నడపె=నిర్వహించె, అన్వహము=ఎల్లప్పుడు,

ఆ. మంత్ర మాచరించె, మానవనాథుండు/ప్రతిదినంబు మంత్రివరుల తోడ,
అది నిషేవ్యమాణ మయ్యు, సమావృత/ద్వారమగుట, బయలుపడ, దొకప్డు. **39**

నిషేవ్యమాణము=ప్రతిదినము చర్చింపబడునది, సమావృత=రక్షింపబడిన,

ఆ. పరుల, స్వీయజనుల పైన బ్రయుక్తులై/ఒండొరులకు, దెలియకుండ మెలగు,
పేగులవారివలన, జాగరూకుండగు/అర్ధకాలసుప్తుడయ్యు, నతడు. **40**

పరుల=శత్రువుల, స్వీయ+జనులు=తనదేశ+ప్రజల, ప్రయుక్తులై=నియోగింపబడి, ఒండొరులకు=ఒకవేగు గురించి వేరొకవేగుకు, మెలగు=ప్రవర్తించు, వేగు=గూఢచారి, అర్హకాల=సరైన సమయమున, సుప్తుడు= నిద్రించువాడు,

ఆ. స్వయమె పగఱ నాగజాలి యున్నను, వాని/దుర్గములు విపక్షదుర్గ్రహములు,
ఆశ్రయించునే? గజాస్కంది మృగరాజు/కొండగుహను, పిఱికికండవలన? 41

పగఱ=శత్రువుల, ఆగ+జాలి=నిగ్రహింప+సమర్ధుడై, దుర్గము=కోట, విపక్ష=శత్రువు, దుర్ గ్రహము=చేపట్ట రానిది, ఆశ్రయించు=ఆధారముగా చేసికొను, గజాస్కంది=ఏనుగుపై దుముకు, మృగరాజు=సింహము, పిఱికికండ=అధైర్యము,

తే. ప్రత్యవేక్షణవలన నిరత్యయములు/అంతిమమున ఫలానుమేయములు, నగుచు,
భవ్యముఖ్యము, లాతని పనులు గర్భ/శాలిసాధర్మ్యమున రహస్యముగ, పండు. 42

ప్రత్యవేక్షణ=పూర్వాపరములు ఆలోచించుట, నిర్ అత్యయములు=అపాయములేనివి, ఫల+అనుమేయము= ఫలితముబట్టి+ఊహింపదగినది, భవ్యముఖ్యము=కల్యాణ ప్రధానములు, గర్భ+శాలిసా+ధర్మ్యమున=పైరుపొట్ట లోనేఫలించు+వరిధాన్యము+సమానములగు న్యాయమున ,

క. చన డెన్నడు దానెంతటి/ఘనోపచితుడయ్యు నతడు కాని తెరువునన్,
తన కెంత పోటు రానీ/వనరాశి నదీముఖంబు బడియే, పొరలున్? 43

ఉపచితుడు=వర్ధిల్లినవాడు, కాని=చెడు, తెరువు=మార్గము, పోటు=పొంగు, వనరాశి=నీటిసమూహము, ముఖము=పైపు, పొరలు=పొంగు.

తే. ప్రజల కప్రియమగు దాని ప్రసవమందె/నెట్టన నడంప దా నెంత దిట్ట యయిన,
దాని దలయెత్తుటకు నిమిత్తంబులైన/స్థితిగతులు రూపుగొనకుండ జేసె, నతిథి. 44

ప్రసవమందె=పుట్టుటలోనే, నెట్టన=సమగ్రముగా, అడంప=అణచ, తలయెత్తు=మొలచు, నిమిత్తము= కారణము, స్థితిగతులు=పరిస్థితులు, రూపు=ఆకారము,

క. సువిజేయవైరి మీదనె/అవంధ్యశక్తియుతుడయ్యు నత డెత్తిచనెన్,
పవనము బాసట కలదని/దవానలము నీటితోడ, దలపడజనునే? 45

సువిజేయ=సులభముగాజయించగల, వైరి=శత్రువు, అవంధ్య=వ్యర్ధమును కాని, ఎత్తి=ఎదిరించి, బాసట= సహాయము, దవానలము=దావాగ్ని, తలపడ=ఎదురించ,

తే. ధర్మమున కర్థకామతత్పరతవలన/దానివలన నారెంటికి హాని సేయ,

డర్థకామంబులకును, అన్యోన్యహాని/సంఘటింపడు, మూడింట సము, డతండు. **46**

తత్పరత=ఆసక్తిచే, దాని=ధర్మముచే, ఆరెంటికి=అర్థ కామములకు, హాని=కీడు, అన్యోన్య=పరస్పరము, సంఘటింపడు=సమకూర్పడు,

సీ. స్వపరపక్షంబుల శక్త్యాదికములలో/హెచ్చుతగ్గులు నిశ్చయించి చూచు,

దాయపై తనకు ఉత్కర్షంబు కలదేని/అరుగు, తద్విపరీత మయిన నుడుగు,

పరకృత్యములు భంగపఱచుచు దన పనుల్/పెరవరియై చక్కబెట్టికొనును,

రంధ్రము నరసి అరాతుల పడగొట్టు/తన రంధ్రములను గోపనము సేయు,

అదన అనుపకర్త లగు హీనమిత్రులు/ అధికు లెదురుతిరిగి అపకరింత్రు,

కాన నెపుడు మధ్యమములగు శక్తుల/నిలుపు మిత్రగణము, నిపుణుడతడు. **47**

స్వ=తన, పర=శత్రు, పక్షంబుల=వర్గముల, శక్తి+అదికములు=శక్తి+దేశ కాల మొదలగునవి, దాయ=శత్రువు, ఉత్కర్షంబు=శ్రేష్టత. అరుగు=యుద్ధమునకు బయలుదేరు, తత్+విపరీతము=దానికి+వ్యతిరేకము, ఉడుగు=మాను, కృత్యములు=పనులు, పెరవరి=ఉపాయశాలి, రంధ్రము=లొసుగు, అరాతి=శత్రువు, గోపనము=కప్పిపుచ్చు, అదన=అదను=సమయముచూసి, అ ఉపకర్తలు=ఉపకారము చేయలేని వారు, అపకరింత్రు=అపకారముచేయుదురు ,

ఆ. కోశవంతుజేరి కొలుతు రందఱు గాన/అర్థసంగ్రహణము నతడొనర్చె,

సలిలగర్భుడయిన శ్రావణమేఘునే/సంశ్రయించుగాదె! చాతకములు. **48**

కోశవంతు=ధన భండారము కలవాని, సంగ్రహణము=పోషించుట, సలిలగర్భుడు=నీరుకలిగిన, సంశ్రయించు=ఆశ్రయించు,

తే. సాకు నిజదేహనిర్విశేషముగ నరసి/ప్రత్యహము తండ్రిచే ప్రవర్ధనము నొంది,

సాంపరాయికమై కృతాస్త్రంబు నైన/దండమును, అమ్మహోద్దండదండధరుడు. **49**

సాకు=కాపాడు, నిజ+దేహ+నిర్ విశేషముగన్+అరసి=తన+శరీరముతో+భేదములేకుండా+చూచి, ప్రతి+అహము=ప్రతి+దినము, ప్రవర్ధనము=వృద్ధి, సాంపరాయుకము=యుద్ధమునకు తగిన, కృతాస్త్రంబు=శిక్షితులైన, దండము=మూలసైన్యము(తండ్రి ఇచ్చినశరీరమును వలే సైన్యమును కూడాపెంచెను), అ+మహా+ఉద్దండ=ఆ+గొప్ప+ప్రచండ, దండధరుడు=సైన్యాధికారి-రాజు.

తే. తివియ జాలడు వాని శక్తిత్రయమును/పాము తలమీది రతనముం బలె విరోధి,

దాని నెల్ల నాకర్షించు దాయనుండి/మన నరేంద్రు, డయస్కాంత మినుము బోలె. **50**

తివియ+చాలడు=పైకితీయ+నేరడు, శక్తిత్రయము=ప్రభు మంత్ర ఉత్సాహ శక్తులు, దాని=ఆ శక్తి త్రయములు, దాయ=శత్రువు,

చ. ఘనగహనప్రదేశముల గాంతపురోపవనంబులన్ బలెన్,
కనుమల గొండలందు విధుకాంతశిలాసదనంబులన్ బలెన్,
వనధినదీనదంబులను వాపికలన్ బలె, నిర్భయంబునన్,
చనుపలు సంచరించు, బటుశాసనుడా రఘువీరు నేల్బడిన్. 51

ఘన+గహన=గొప్ప+దట్టమైన అడవి, కాంత=ఇంపైన, పుర=నగర, ఉప+వనంబు=ఉద్యాన+వాటిక, కనుమ=లోయ, విధుకాంత=చలువ, శిల=ఱాయి, సదనము=ఇల్లు, వనధి=సముద్రము, నది=తూర్పుగా సాగు నది, నదము=పడమరగా సాగు నది, వాపిక=దిగుడుబావి, చనుపలు=వర్తకులు, పటు=అధిక, శాసనుడు=దండించిపాలించువాడు, ఏల్బడి=పాలన,

తే. ఆస్తులకు తస్కరాదిభయములు మాన్పి/పుణ్యకర్మములకు విఘ్నముల నడంచి,
మనుగడలు నిల్పి, వర్ణాశ్రమములవలన/పడయును షడంశములు యథాస్వముగ నతిథి. 52

తస్కర=దొంగతనము, మనుగడ=సుఖజీవనము, నిల్పి=స్థిరపఱచి, వర్ణములు=బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర వర్ణములు, ఆశ్రయములు=బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ సన్యాస ఆశ్రయములు, పడయు=గ్రహించు, షడంశము=ఆదాయములో ఆరవభాగము, యథాస్వము=యుక్తమైనపన్నుగా,

ఆ. గనులనుండి మణుల, వనుల నేనుంగులు/పొలములందు సస్యములును, నీని,
రఘుకులేశ్వరునకు, రక్షానుగుణమైన/వేతనంబు నొసగె, భూతధాత్రి. 53

ఈని=కలిగించి, రక్ష=కాచుట, అనుగుణ=తగిన, వేతనము=జీతము,

క. గుణబలషట్కములు, ధను/ర్గుణకిణకర్కశభుజుండు, కుశసూనుడు స
ద్వినియోగ పఱచు కొనియెను/జనానుమతసాధనీయసద్వస్తువులన్. 54

గుణషట్కము=సంధి విగ్రహము యానము ఆసనము ద్వైధీభావము సమాశ్రయము అను ఆరుగుణములు, బలషట్కము=రథ గజ అశ్వ పదాతి మూల నౌకా బలములు, ధనుర్+గుణ+కిణ=విల్లు+త్రాటిచే+కాచెడికాయ, కర్కశ=కఱకైన, అనుమత=సమ్మతి, సాధనీయ=సాధించదగ్గ ఉపకరణములైన, సద్వస్తువు=మంచివస్తువు,

తే. కూటయుద్ధప్రకారాతికుశలుడయ్యు/సత్యపురుషకారంబునే సంశ్రయించి,
తనకు అభిసారికగ చేసికొనియె, అతిథి/వీరగామిని యగు, సమిద్విజయరమను. 55

కూట+యుద్ధ+ప్రకారము=(అధర్మ)దొమ్మి+యుద్ధ+విధము, సత్య+పురుషకారము=ధర్మమైన+పురుష ప్రయత్నము, సంశ్రయించి=ఆశ్రయించి, అభిసారిక=కోరి ప్రియునివద్దకు చేరు స్త్రీ, వీర+కామిని=వీరులను +ప్రేమించు, సమిత్+విజయ+రమ=యుద్ధ+విజయ+లక్ష్మి,

తే. భండనముతోడ పని లేదు ప్రాయికముగ/అడగియుంద్రు దాయలు వాని కడిమి వినియె,
కవియునే, అన్యకరులతో, గంధగజము/భూరిగంధోల్బణముననె, పారదోలు. **56**

భండనము=యుద్ధము, ప్రాయికముగ=సాధారణముగా, అడగి+ఉంద్రు=లోబడి+ఉండెదరు, కడిమి=శౌర్యము, కవియు=ఎదుర్కొను, కరి=ఏనుగు, గంధగజము=మదవాసన వెదజల్లు గొప్పమదపుఏనుగు, భూరి=అధిక, గంధ=వాసన, ఉల్బణము=మిక్కుటము, పారతోలు=పరిగెత్తించు,

క. పెరుగుట తఱగుట కల వా/హరిణాంకున, కతనితండ్రి కంబుధికిని, వా
రిరువురి వలె, దా బెరుగును/తఱుగడు వారి వలె, కుశుని తనయుం డెపుడున్. **57**

హరిణాంకుడు=చంద్రుడు, అంబునిధి=సముద్రము,

ఆ. ఆలుబిడ్డ సాకజాలక అమ్మహో/దారు, జూడజనిన సూరిజనము,
ఆఢ్యులై, వదాన్యు, లైరి, అపాంపతి/గాములగు వలాహకముల, కరణి. **58**

సాక=పోషింప, అ+మహా+ఉదారు=ఆ+గొప్ప+దాత, సూరి=పండిత, ఆఢ్యులై=సంపన్నులై, వదాన్యులు= దానముచేయువారు, అపాంపతి=సముద్రము, వలాహకము=మేఘము, కరణి=వలే.

తే. స్తుత్యములనె సమాచరించుచు, జనాభి/నందనములకు లజ్జావినమ్రు డాయె,
విస్తరించెను స్తుతిపాఠవిముఖుడయ్యు/ఆ రఘూత్తము యశము దిగంతములకు. **59**

స్తుత్యములనె=పొగడదగ్గ వాటినే, సమాచరించు=చక్కగాచేయు, అభినందనము=పొగడ్త, లజ్జ=సిగ్గు, స్తుతిపాఠము=స్తోత్రము, దిగంతము=దశదిశలు,

క. తనదర్శనంబున, ప్రబో/ధనమున దురితంబు దమము దలగించి, ధరా
జనుల నిజాధీనులుగా/నొనరించె, కుశప్రసూతు, డుదితార్కు గతిన్. **60**

రాజు పక్షమున: దర్శనము=బుద్ధి, ప్రబోధనము=మేలుకొలుపు, దురితము=కష్టము, తమము=శోకము, తలగించి=తొలగించి, నిజ+అధీనుల=తన+వశముపొందినవారు,

సూర్యుని పక్షమున:దర్శనము=బోధనచే, ప్రబోధనము=యదార్థ జ్ఞానము, దురితము=పాపము, తమము=తమోగుణము, తలగించి=తొలగించి, ఉదిత=ఉదయిస్తున్న, అర్కుడు=సూర్యుడు, (సూర్యదర్శనము వలె రాజ దర్శనము పాపములతొలగించునని మనుధర్మశాస్త్రము)

క. చొరవు విరిదమ్మి నిందుని/మరీచు లుత్పలమునందు, మార్తాండునివిన్,
వరగుణు డాతని సుగుణము/లరాతులకు, గూడ మానసాంతర్గతముల్. **61**

చొరవు=ప్రవేశింపవు, విరి+తమ్మి=విరసిన+కమలముల, ఇందుని=చంద్రుని, మరీచి=కిరణము, ఉత్పలము నందు=కలువ అందు, మార్తండునివిన్=సూర్యుని కిరణములు, వరగుణుడు=శ్రేష్ఠ గుణములుకల అతిథి, అరాతులకు=శత్రువుల, మనసా+అంతర్+గతముల్=మనస్సు+అందు+తెలియబడినది,

క. ప్రియమందిరి లోకులు త/జ్జయయాత్రకు, అది పరులకు సంతాపకరం
బయినను, ధర్మ్యమె! యనుచున్/హయమేదార్థము జిగీషు పైన కతమునన్. **62**

ధర్మ్యమె=ధర్మమె, హయమేద+అర్థము=అశ్వమేథ యాగము+కొఱకు, జిగీషువు=శత్రువులజయించు స్వభావి, కతమునన్=కనుక,

సీ. లోకరక్షణజనానీకప్రశాసన/పటుత పంచమలోకపాలు డనుచు,
ఉత్కృష్టనిత్యసర్వోపయోగక్రియా/పుణ్యశీలత షష్ఠభూత మనుచు,
సకలసామ్రాజ్యప్రజాసమారాధన/ప్రౌఢి సప్తమ చక్రవర్తి యనుచు,
సర్వాతిశయమహాసారశిఖోన్నతి/కలిమి అష్టమకులగ్రావ మనుచు,
భరణగుణమున నవమదిక్కరటి యనుచు/నిధులపాలిటి దశమశేవధియు ననుచు,
జనపరంపర జయపెట్ట గనియె వాసి/పేశలమహోర్వగుణరత్నరాశి, కౌశి. **63**

అనీకము=సమూహము, ప్రశాసన=మంచి పరిపాలన, పటుత=సమర్థత, పంచమలోకపాలుడు=ఇంద్ర యమ వరుణ కుబేరు లను నలుగురు ముఖ్య లోకపాలకులుతో సమానమైన ఐదవ లోకపాలుడు, ఉత్కృష్ట+నిత్య+సర్వ+ఉపయోగ+క్రియా+పుణ్య+శీలత=మేలై+ఎల్లప్పుడూ+అన్ని+అనుకూలము+చేయు+పుణ్య+గుణముచే, షష్ఠభూతము=పృధివి జలము తేజస్సు వాయువు ఆకాశము అను పంచభూతములతోసమానమైన ఆరవ భూతము, సమారాధన=సంతోషపెట్టు, ప్రౌఢి=సమర్థత, సప్తమ చక్రవర్తి=హరిశ్చంద్రుడు నలుడు పురుకుత్సుడు పురూరవుడు సగరుడు కార్తవీర్యార్జునుడు అను షట్చక్రవర్తులతో సమమైన ఏడవవాడు, సర్వ+అతిశయ+మహా+సార+శిఖ+ఉన్నతి+కలిమి=అన్నిటికంటె+ఆధిక్యతగల+గొప్ప+బల+గరిమ + ఔన్నత్యము+కలుగుటచే, అష్టమకులగ్రావము=మహేంద్ర మలయ సహ్య హిమాచల రైవత వింధ్య ఆరావళి అను ఏడు కులపర్వతములతోసమానమైన ఎనిమిదవ కులపర్వతమై, భరణ=మోయు, నవమ దిక్కు+ అరటి=భూభారముమోచు ఐరావత పుండరీక వామన కుముద అంజన పుష్పవంత సార్వభౌమ సుప్రీతము అను ఎనిమిదిదిగ్గజములకు సమానమైన తొమ్మిదవ+ఏనుగువంటివాడు, దశమ శేవధి=మహాపద్మము

పద్మము శంఖము మకరము ముకుందము కుందము నీలము ఖర్వొ(వరము) అను నవనిధుల సమానమైన పదవనిధి, వాసి=ఖ్యాతి, పేశల+మహ+అర్హ+గుణ+రత్నరాశి=దక్షత+గొప్ప+యోగ్యతలు+మంచిగుణము లనెడు+సముద్రము,

తే. శాసనసమర్పితంబైన, కౌశి ముదల/సరవి దూరాపవర్జితచ్ఛత్రులైన,
ధరణిపతులకు, శిరసుపూదండ యయ్యె/అమరవరులకు పౌరందరాజ్ఞ వోలె. **64**

శాసనసమర్పితంబైన=అధికారికముగా ఇవ్వబడిన, ముదల=ఆజ్ఞాపత్రము, సరవి=ఒప్పైన, దూర+అపవర్జిత+చ్ఛత్రులైన=దూరముగా+పాఱవేసిన+రాజ లాంఛన చ్ఛత్రములు కలవారైన, శిరసుపూదండ=శిరోధార్యము, అమర=దేవ, పౌరందర+ఆజ్ఞ=ఇంద్రుని+ఆనతి,

క. వినతుడయి సత్కరించెను/ఘనదక్షిణ లొసగి అతిథి, క్రతుయాజకులన్,
"ధనదాఖ్య" కుబేరునకును/తనకును, సాధారణకృతం బగు భంగిన్. **65**

వినతుడయి=వినయముతో, యాజకులు=పురోహితులు, ధనదాఖ్య=ధనద అనుపేరు(కుబేరుడు:ధనమును రక్షించువాడు, అతిథి:ధనము ఇచ్చువాడు), సాధారణ=సమాన, కృతము= సంపాదింపబడినది,

సీ. వానలు నెలమూడు వర్షించె మఘవుడు/వఱపు ధాత్రికి స్వప్నవార్త గాగ,
సలిలసంచారము సాంయాత్రికుల కెల్ల/అనుప్లవము చేసె వనధిరాజు,
అఖిలజాడ్యంబులు అదుపులోనికి దెచ్చి/యముడు లోకామోద మావటించె,
తత్పూర్వనృపమహత్తాజ్ఞాత తనరించె/యక్షాధినేత కోశాభివృద్ధి,
ప్రక్రమణమున బవనుడు, బావకుడును/ఎపుడు న్యూనాతిరిక్తరాహిత్యు లైరి,
వరుస భజియించి రిటు, లోకపాలు రెలమి/అతిథి కాకుత్ స్థు దండొపనతుల భంగి. **66**

మఘవుడు=వరుణుడు, వఱపు=వానలేమి, స్వప్న+వార్త=కలలో+మాట, సలిల+సంచారము=నీటి+ఒడుదుడుకులు, సాంయాత్రికుడు=సముద్రమీద వ్యాపారము చేయువాడు, అనుప్లవము=తోడు, వనధిరాజు=సముద్రుడు, జాడ్యము=జడత, ఆవటించె=పొందుపఱచె, మహత్తు+ఆజ్ఞాత=సమూహముచే+ఆజ్ఞాపింప బడినవాడై, తనరించె=తృప్తిపఱచె, యక్షాధినేత=కుబేరుడు, ప్రక్రమణమునమ్=మంచిగమనమున, పవనుడు =వాయువు, పావకుడు=అగ్ని, న్యూన+అతిరిక్త+రాహిత్యులైరి=తక్కువ+ఎక్కువ+లేనివారైరి, వరుస=పరంపరగా, భజియించిరి=సేవించిరి, లోకపాలురు=ఇంద్ర యమ వరుణ కుబేరు లోకపాలురు, ఎలమి=సంతోషము, దండ+ఉపనతుల+భంగి=శాసనమునకు+లొంగినవారు+అన్నట్లు,

# అష్టాదశ సర్గము వంశానుక్రమణము

క. వృషతుల్యు డతిథి కనియెను/నిషధేశ్వరదుహిత యైన నిజసతివలనన్.
నిషధాచలనిభసారుని/నిషిద్ధగుణరహితు, బుత్రు, నిషధసమాఖ్యున్. 1

వృష+తుల్యుడు=ఇంద్రునితో+సమానుడు, దుహిత=కూతురు, నిషధాచలము=ఒక కులపర్వతము (హిమ గంధమాదన నిషద వింధ్య మాల్యవంత పారియాత్ర హిమ కూటము అను ఏడు కులపర్వతములు. మరొక మాట: హిమ మలయ సహ్య హిమ రైవత వింధ్య ఆరావళి అని కూడా), నిభ=సమాన, సారము=బలము, నిషిద్ధ=కూడని, రహితు=లేనివాడు, సమాఖ్య=పేరు,

మ. జనలోకావనకర్మకర్మఠునిగా జన్మించినట్లున్న, యా
గొనబుంబ్రాయపుదేజుకూన, గొడుకుంగుఱ్ఱన్, విలోకించు ద
జ్జనకుం, డర్థి సకాలవృష్టికలనాసంపన్నమై, పండబా
రిన, పైరుం బ్రజవోలె, నిండుప్రమదశ్రీ పారవశ్యంబునన్. 2

జనలోక=ప్రజల, అవన=కాపాడు, కర్మ=విద్యుక్తధర్మము, కర్మఠుడు=కార్యశూరుడు, కొనబుం=లేత, ప్రాయపు =వయసు, తేజు=ప్రతాప, కూన=శిశువు, కుఱ్ఱన్=చిన్నవాని, విలోకించు=చూచు, అర్థి=కోరిన, వృష్టి=వాన, కలన=చేత, సంపన్న=సంమృద్ధి, పండ+పారిన=పంట కొచ్చిన, ప్రజ=జనులు, ప్రమద+శ్రీ=సంతోష+భాగ్యము,

తే. తనియ శబ్దాదిసుఖముల, ననుభవించి/రాజశబ్దము సుతుని పరంబు జేసి,
పోయె నిశ్చింత, గౌముద్వతేయు డంత/పుణ్యకర్మార్జితామర్త్యభువనమునకు. 3

తనియ=తృప్తిగా, శబ్దాది=శబ్దము స్పర్శము రూపము రసము గంధము-ఇంద్రియానుభము, శబ్దము=బిరుదు, పరము=ఆధీనము, పుణ్యకర్మ=చేసిన పుణ్యకార్యముల, ఆర్జిత=సంపాదించిన, ఆమర్త్య=దేవ, భువనము= లోకము,

క. కుశుని మనుమడు సుధీనుత/కుశాగ్రశేముషి, విపక్షకుంజరవజ్రాం
కుశుడు, నృపనీతివిద్యా/కుశలుడు పాలించె భువి, నకుంఠితమహిమన్. 4

సుధీ=విద్వాంసులు, నుత=పొగడబడిన, కుశాగ్రశేముషి=చుఱుకైన బుద్ధికలవాడు, విపక్ష=శత్రు, కుంజర= ఏనుగు, అంకుశము=(ఏనుగును)అదుపులోపెట్టు సాధనము, కుశలుడు=నేర్పరి, అకుంఠిత=మొక్కపోని, మహిమ=విధము,

తే. వాని పిమ్మట వంశసంపద, వహించె/ననలతేజుడు, నలుడు, తదాత్మభవుడు,

వాలి రిపుమండలము బట్టి కాలరాచె/బలియు డాతడు గజము నడ్వలము బోలె. 5

వంశసంపద=వంశరాజ్యము, అనల=అగ్ని, వాలి=నేలకూల్చి, రిపు+మండలము=శత్రు+సమూహము, బలియుడు=సమర్థుడు, గజము=ఏనుగు, నడ్వలము=గడ్డికసవు అధికముగా కలనేల,

క. నభుడను, కుమారు బడసెను/నభశ్చరోద్గీతకీర్తి, నలనృపతి, నభో
నిభనీలశరీరు, నభో/నభస్యముల మాడ్కి జనమనః ప్రియకారున్. 6

నభశ్చర+ఉద్గీత=ఆకాశసంచార గంధర్వాదులచేత+గానముచేయ బడిన, నభో=ఆకాశము, నిభ=పోలు, నభో+నభస్యముల+మాడ్కి=(వర్షము కురియు) శ్రావణ+భాద్రపద మాసములు+వలె,

తే. కూరిమి కుమారు నుత్తరకోసలమున/కుత్తరాధిపు, జేసి ధర్మోత్తరుండు,
చనియె నలుడు, మహామతి పునరదేహ/బంధ వినిబంధమతి, తపోఽభ్యసనమునకు. 7

కూరిమి=ప్రియ, ఉత్తర+అధిపు=తనతరువాత+రాజు, ఉత్తరుండు=ఉత్తముడు, పునః+అదేహబంధ+వినిబంధ+మతి=తిరిగి+దేహబంధము కాకుండుట యందు+నిబద్ధమైన+మనసు కలిగి. అభ్యసనము=అభ్యసించు,

**వ.** నభుని కుమారుని సురద్విపములలో పుండరీకము వలె, భూమండలమున గల రాజన్యులలో సంస్తవన విశేషపాత్రుడయిన పుండరీకుని, పితృపరోక్షమున రమావధూటి పుండరీకాక్షుని బలె, గృహీత పుండరీకయై సమాశ్రయించె. 8

ద్విపము=ఏనుగు, పుండరీకము=ఒక దిగ్గజము, సంస్తవన=స్తుతింపదగ్గ, పాత్రుడు=యుక్తుడు, పితృ పరోక్షమున=తండ్రి నభుని తరువాత, రమావధూటి=లక్ష్మిదేవి, పుండరీకాక్షుడు=విష్ణువు, గృహీత=చేపట్టిన, పుండరీకయై=శ్వేతపద్మముకలదై, సమాశ్రయించె=(పుండరీకుని) ఆశ్రయించెను,

తే. ఆ మహాధన్వి కుదయించె క్షేమధన్వి/జనగణక్షేమకరణవిశారదుండు,
సుతుని క్ష్మాతలమున బ్రతిష్ఠితుని జేసి/క్షాంతుడై, చొచ్చె దాపసాశ్రమము, తండ్రి. 9

ధన్వి=విలుకాడు, క్షేమధన్వి=(శుభములు కలిగించుటలో+నేర్పరి)క్షేమధన్వి అని పేరు కలవాడు, జనగణ=ప్రజా సముదాయము, క్షేమ=శుభము, కరణ=చేయుట యందు, విశారదుడు=నేర్పరి, క్ష్మాతలము=భూమి, క్షాంతుడై=శాంతమనస్సు కలవాడై,

క. వాని సుతుడు రణముల సే/నానిచయపురస్సరుండు, నాఖండలస
మ్మానితుడు, దేవపదపూ/ర్వానీకసమాహ్వయుడు, సుధాంశుడు కాంతిన్. 10

నిచయ=సమూహము, పురస్సరుండు=ముందునడచువాడు, ఆఖండలుడు=ఇంద్రుడు, దేవపదపూర్వానీక+సమాహ్వయుడు=దేవానీకుడను+పేరుకలవాడు, సుధాంశుడు=చంద్రుడు,

వ. శుశ్రూషాపరాయణుడు, తత్పుత్రునివలన క్షేమధన్వ, పుత్రవంతుడును, తనయెడ వత్సలత్వనిధి యగుపితృపాదునివలన, దేవానీకుడు పితృమంతుడు నైరి. ప్రాయపుప్రొద్దు పడమరమొగంబు పట్టిన తోడన క్షేమధన్వ వర్ణాశ్రమసంక్షేమనిర్వహణకరణము నాత్మసమునకు, నాత్మోద్భవునకు నుపదేశించి యప్పగించి, మహాధ్వరప్రవర్తకుడు గావున, తనుత్యాగానంతరమున యజమానలోకము నధిష్ఠించెను. దేవానీకుని పరోక్షమున 11

శుశ్రూష=సేవ, పరాయణము=తత్పరత, పుత్రవంతుడు=మంచి పుత్రుడుకలవాడు, వత్సలత=ప్రేమ, పితృపాదుడు=గౌరవనీయమైన తండ్రి, పితృవంతుడు=మంచి తండ్రికలవాడు, ప్రాయము=వయసు, ప్రొద్దు పడమరమొగంబుపట్టిన=సాయంసంధ్యవైపు తిరిగిన- ఆఖరి దినములలో, తోడన=వెంటనే, వర్ణ= నాలుగు కులములు, ఆశ్రమ=నాలుగు ఆశ్రమములు, సంక్షేమ=బాగారక్షణ, నిర్వహణము=కొనసాగించు, కరణము=పనివిధానము, ఆత్మసముడు=తనతో సమానుడు, ఉద్భవుడు=కొడుకు, ఉపదేశించి=నేర్పి, అధ్వరము=యజ్ఞము, ప్రవర్తకుడు=జరిపినవాడు, తను=దేహము, యజమాన=యజ్ఞములు చేయువారుచేరు-స్వర్గము, అధిష్టించెను=ఉనికిపట్టుగా చేసికొనెను,

తే. ఆ నరేంద్రుని సుతుడు మహీనుడయ్యె/భూనుతు డహీనసత్వు డహీనగుండు,
హీనసంసర్గవిముఖుడు, కాన యువకు/డైనను, అతండు వ్యసనవిహీనబుద్ధి. 12

మహీనుడు=రాజు, అహీన=తక్కువకాని-ఎక్కువ, సత్వుడు=బలము కలవాడు, హీన=చెడు, సంసర్గము= సహవాసము, విముఖుడు=ఇష్టములేని వాడు, వ్యసన+విహీన=చెడు అలవాట్లు+లేని,

తే. వలతి యతడు వశంవదత్వంబువలన/హితులకున్ బలె, రిపులకు నిష్టుడయ్యె,
మధురముగ నొక్క మారన్న మంచిమాట/చే, వశముగావె, బెదరిన జింక లైన. 13

వలతి=అనుకూలుడు, వశంవదుడు=ప్రియభాషి,

చ. పురుషవిశేషవిత్తముడు పుణ్యచరిత్రు డహీనగుం, డన
శ్వరముగ నంశుమత్కులయశస్కరుడై, పరలోకయాత్రకుం
దరలిన, దాల్చె దత్పదము దత్తనుజాతుడు, పారియాత్రు, డ
త్యురుభుజు, డిద్ధతేజుడు సముచ్చశిరోజితపారియాత్రుడై. 14

పురుష+విశేష+విత్తముడు=మనుషులయొక్క+ప్రత్యేక లక్షణములను+కనిపెట్టగలవాడు, అహీన=గొప్ప, అనశ్వరము =నశింపని, అంశుమత్+కుల=సూర్య+వంశ, యశస్కరుడై=కీర్తికలిగించువాడై, తరలిన=వెళ్ళిన, తత్+పదము =వాని+అధికార స్థానము, తత్+తనూజాతుడు=వాని+కొడుకు, అతి+ఉరు+భుజుడు=అధిక+

శ్రేష్ఠ+భుజములు కలవాడు, ఇద్ధ=ఉగ్ర, సముచ్చ+శిరో+జిత=ఉన్నత+శిరస్సుతో+గెలిచిన, పారియాత్రము=ఒక కులపర్వతము,

ఉ. పట్టి జనించె నాతని కపారబలుండు, శిలుండు, నా శిలా
పట్ట విశాలవక్షుడు, నృపాలనదుష్కరకర్మదక్షుడున్,
పట్టిన కత్తి దింపని అపారపరాక్రముడయ్యు, నాత డె
ప్పట్టున విఙ్టవీగడు, త్రపానమితాంగు డగున్, ప్రశంసకున్. 15

పట్టి=కొడుకు, శిలాపట్టము=సన్నెకల్లు(రాతిఫలకము), నృపాలన+దుష్కర+కర్మ=రాచరికపు+చేయశక్యము కాని+పనులు చేయుటలో, దక్షుడు=సమర్ధుడు, అపార=సాటిలేని, త్రప=సిగ్గు, ఆనమిత=వంచబడిన, అంగము =శిరస్సు, ప్రశంస=పొగడ్త,

తే. ఆత్మసంపన్ను నాత్మజు, యౌవరాజ్య/పదవి నభిషిక్తు జేసి, నిర్భరసుఖాబ్ధి,
దేలె తండ్రి, సుఖోపరోధియు, బ్రయాస/హేతువును, గాదె! రాజన్యవృత్త మరయ. 16

ఆత్మ+సంపన్నుడు=బుద్ధి+సంపదకలవాడు, నిర్భర=మిక్కిలి, సుఖ+అబ్ధి=సుఖ+సముద్రమున, తేలె= ఆటలాడే, సుఖ+ఉపరోధి=సుఖములకు+ప్రతిబంధకము, ప్రయాస=శ్రమ, హేతువు=కారణము, రాజన్య+ వృత్తము=రాజుల+జీవనపద్ధతి, అరయ=విచారించగా,

క. పరిభోగకలన దనివిం/బొరయని తరుణీ విశేషభోగాత్యర్హున్,
హరియించె వట్టి చలమున/అరతిక్షమయయ్యు, జర ధరాధిపు వానిన్. 17

పరిభోగము=అనుభవము, కలన=స్వీకరించుట, తనివి=తృప్తి, పొరయని=పొందని, తరుణి=స్త్రీ, విశేష=సమృద్ధ, భోగ+అతి+అర్హున్=పొంద+అత్యంత+యోగ్యుని, హరియించె=అపహరించె, వట్టి=నిష్కారణ, చలము= మాత్సర్యము, అరతిక్షమయయ్యు=సంభోగించుటకు అర్హమైనది కాకున్ననూ, జర=ముసలితనము,

**వ.** పారియాత్రుని పరోక్షమున, శిలుండు, సింహాసనాసీనుండయ్యె. తదనంతరమున, దత్కుమారుడు, గంభీరనాభియయ్యును, అయథార్థముగ ఉన్నాభుడను, నుద్గతనామధేయుడై, సకలనృపమండల మునకు నాభియై, నలిననాభకల్పుడై పరిపాలించె. వాని పిమ్మట, తదీయౌరసుడు 18

పరోక్షమున=లేనితరువాత, గంభీరనాభి=లోతైన బొడ్డుకలవాడు, అయథార్థము=సార్థకముకాని, ఉన్నాభుడు= పైకికనబడు బొడ్డుకలవాడు, ఉద్గత=ప్రసిద్ధ, నాభి=మూలమగు చక్రవర్తి, నలిననాభుడు=విష్ణువు, కల్పుడు= సమానుడు, ఔరసుడు=పుత్రుడు,

క. వజ్రపదపూర్వనాభుడు/వజ్రార్భటివలన విమతవర్గంబునకున్,

వజ్రధరప్రతిమహిముడు/వజ్రాకరభూష యైన వసుమతి నేలెన్. 19

వజ్రపదపూర్వనాభుడు=వజ్రనాభుడు, వజ్ర+ఆర్భటి=పిడుగువంటి+సింహనాదము, విమత=శత్రు, వజ్రధర= ఇంద్ర, ప్రతి+మహిముడు=సమాన+ప్రతిభకలవాడు, వజ్ర+ఆకర+భూషయైన=వజ్రపు+గనులు+అలంకారము గాకల, వసుమతి=బంగారముకలది-భూమి

తే. వాడు నిజధర్మకర్మసంపాద్యమైన/సద్గతికి బోవ, దత్పుత్రు, శంఖణాఖ్యు,

వలచి సేవించె వసుమతి, జలధికాంచి/ఖనిసముత్పన్నమణు, లుపాయనము లొసగి. 20

సంపాద్యమైన=సంపాదించిన, సద్గతి=ఉత్తమలోకము, జలధికాంచి=సముద్రము మొలనూలుగ కలది- భూమి, ఖని=రత్నగని, సముత్పన్న=పుట్టిన, ఉపాయనము=కానుక,

మ. ప్రతిమాతీతుడు వాడు కాలవశతం బ్రాపింపగా, పిమ్మటన్,

పితృపైతామహరాజ్యభాగి, హరిదశ్వేందుప్రభాశాలి, త

త్సుతు, డశ్విప్రతిమానమూర్తి, వ్యుషితాశ్వుం, డేలె, వేలాతటో

షితసేనాజవనాశ్వుడై, యతడు కాంచెన్, నామసార్థక్యమున్. 21

ప్రతిమ+అతీతుడు=పోలిక+లేనివాడు, కాలవశతం+ప్రాపింపగా=మరణము+పొందగా, భాగి=అదృష్టవంతుడు, హరిదశ్వ=సూర్యుని, ఇందు=చంద్రుని, ప్రభా+శాలి=కాంతి+కలవాడు, అశ్విపతి=అశ్వనీదేవత, ప్రతిమాన+ మూర్తి=సమాన+రూపుడు, వేలా+తట=సముద్ర తీరమున, ఉషిత=ఉంచబడిన, జవన+ఆశ్వుండు=వేగముగల +గుఱ్ఱములు కలవాడు, వి+ఉషిత+అశ్వుండు=అధికముగా+ఉంచబడిన+గుఱ్ఱములు కలవాడు, సార్థకము= అర్థవంతము,

క. విశ్వసఖు డతడు పడసెన్/విశ్వేశవరప్రసాదు, వినయవినోదున్,

విశ్వంభరావనసహున్, విశ్వసహున్/విశ్వవిదితవీరు, గుమారున్. 22

విశ్వ=ప్రపంచము, సఖుడు=మిత్రుడు, విశ్వేశ=శివ, ప్రసాదము=అనుగ్రహము, వినోదున్=విరియించువాడు, విశ్వంభర+ఆవన+సహున్=భూమిని+కాపాడ+సమర్థుడు,

తే. తనయుడు హిరణ్యనాభుడు, జనితుడయ్యె/అతనికి, హిరణ్యనయనారి అంశ మందు,

సంతతహిరణ్యవితరణశాలి, వాడు/రిపువిపినవాటికి హిరణ్యరేతుడయ్యె. 23

హిరణ్య+నయన+అరి=హిరణ్య+అక్షుని+శత్రువు-విష్ణువు. సంతత=సమృద్ధ, హిరణ్యము=బంగారము, వితరణ శాలి=దానముచేయు స్వభావి, విపిన+వాటి=అరణ్య+స్థలము, హిరణ్యరేతుడు=అగ్ని.

**వ.** హిరణ్యనాభునకు ధర్మపత్నియందు జననయనచకోరానందనుడై కౌసల్యుడను,

జైవాతృకు డుదయించె. తనతండ్రి పరోక్షమున, చిరకాలము పాలించి, 24

జన+నయన+చకోర+అనందనుడై=ప్రజల+కండ్లుఅనే+చకోరములకు+ఆనందముకలిగించువాడై, జైవాతృకుడు =చంద్రునివంటిపుత్రుడు

సీ. ఆ బ్రహ్మసదనపర్యాప్తయశోరాశి/కౌసల్యుడు, నిజాధి కారమందు,
బ్రహ్మిష్ఠు, నాత్మసంభవుని, బ్రతిష్టించి/అవ్యయబ్రహ్మభూయంబు నొంద,
పృధివి బాలించె, బ్రహ్మిష్ఠుండు, నిర్గత/పీడముగా గులాపీడనిభుడు,
అవిరతానందజలావిలనయనులై/పౌరవర్గము జానపదము మెచ్చ,
స్థిరగురునిషేవణమున బాత్రీకృతాత్ము/బూషవంశప్రదీపకు, బుత్రు బడసి,
స్వర్శవినివృత్తహృదయుడై చనియె వాడు/త్రిదివమునకు, ద్రిపుష్కరతీర్థమాడి. 25

ఆ బ్రహ్మ సదన=బ్రహ్మనివాసము-సత్యలోకము వరకు, పర్యాప్త=వ్యాపించిన, యశో+రాశి=కీర్తి+పరిమాణము, ప్రతిష్టించి=నిలిపి, అవ్యయ=శాశ్వత, బ్రహ్మభూయంబు=బ్రహ్మత్వము, నిర్గత=నశించిన, పీడనము=బాధకము, కుల+ఆపీడ+నిభుడు=వంశమునకు+శిరోభూషణ+సమానుడు, అవిరత+ఆనంద+జల+ఆవిల+నయనులై= ఎడతెగని+ఆనంద+భాష్పములచే+కలకబారిన+కండ్లుకలవారై, స్థిర=నిలుకడగా, గురు=పెద్దల, నిషేవణమున =సేవచే, పాత్రీకృత+ఆత్ము=యోగ్యముగా చేయబడిన+స్వభావుడు, పూష=సూర్య, ప్రదీపకు=ప్రకాశింపచేయు, స్వర్శ=శ్వాస, వినివృత్త=ఆపిన, త్రిదివము=స్వర్గము, త్రిపుష్కర=మూడు గంగా పుష్కరములందు, తీర్థమాడి =స్నానమాడి,

శా. స్వాభావ్యప్రతిభాప్రభావనిధియై, బ్రహ్మిష్ఠు భంగిన్ మహా
భూభారోద్వహనంబు గైకొనియె దత్పుత్రుండు పుత్రాహ్వయుం,
డా భాగ్యాధికు నందనుం డపరపుష్యప్రాయుడై శోభిలెన్,
శోభావంచితపుష్యరాగుడు మహాశూరుండు పుష్యుండనన్. 26

స్వాభావ్య=సహజ, ప్రతిభ=స్పూర్తి, ప్రభావ=సామర్ధ్య, నిధి=గని, ఉద్వహనము=భరించుట, పుత్ర+ ఆహ్వయుండు=పుత్రుడు అని+పేరుకలవాడు, ఆ+భాగ్యాధికు=అటువంటి+ఎక్కువ వైభవము కలవానికి, అపర=ఇంకొక, పుష్య+ప్రాయుడై=పుష్యమీనక్షత్రము+వంటివాడు, శోభా+వంచిత+పుష్యరాగుడు= తనకాంతిచే+జయించిన+పుష్యరాగమణి కాంతి కలవాడు,

తే. జైమినికి శిష్యభూతుడై జననమరణ/దురితముల కగపడకుండ తొలగు తెరువు
గను వెలుగు గాంచె, అనవద్యఘనమనీషి/జన్మభీరువు పుష్యు, డాజన్మయోగి. 27

జైమిని=జైమినీ మహర్షి, శిష్య+భూతుడై=శిష్య+ప్రాయుడై, దురితము=పాపము, అగపడక+ఉండు=లోబడక+ఉండు, తెరువు=మార్గము, వెలుగు=పరంజ్యోతి, అనవద్య=నిందలేని, మనీషి=బ్రహ్మవిద్యావేత్త, జన్మ+భీరువు=పునర్జన్మమునకు+భయముకలవాడు, ఆజన్మ=పుట్టుకతో,

**వ.** అతని వెనుక, అతని సుతుడు, ధ్రువసంధినామధేయుడు, ధ్రువోపమేయుడు రాజ్యధూర్వహుడాయెను.
అనుద్ధతులైన విమతు లా సత్యసంధునితో గుదిర్చికొనిన యొడంబడికలు ధ్రువములై కలకాలము
చెల్లిన కతమున నత డన్వర్థ నాముడు. అన్యావగుణవిరహితుడే, కాని **28**

ధ్రువ+ఉపమేయుడు=ధ్రువునితో+పోల్చతగ్గవాడు, రాజ్య+ధూర్వాహుడు=రాచ+కార్యనిర్వాహకుడు, న+ఉద్ధతులైన=గర్వము(పోయి) లేని, విమతులు=శత్రువులు, ఒడంబడిక=సంధివచనము, అన్వర్థ=పొసగిన, అన్య+అవగుణ=ఇతర+చెడుగుణములు, రహితుడు=లేనివాడు,

**సీ.** అవిరతమృగయావిహారవిమోహి యై/అడవియె ఇంటిపట్టయిన అతడు,
తన యేకసుతుడు సుదర్శనుండు విముగ్ధ/దర్శాత్యయేందుసుదర్శనుండు,
ఊనషడ్వర్షుడై యుండ దైవనియుక్తి/కడిదిసింహము వాతబడి గతింప,
కులతంతు పైన రాకొమరు నమాత్యులు/గద్దెనెక్కించి రస్థలిత భక్తి,
అప్పు డప్రౌఢనృపమైన యక్కులంబు/వెలిగె బూపజాబిలితోడి, విన్ను వోలె,
వరకిశోరైకహరితోడి, వనమువోలె/కుట్మలకుశేశయముతోడి కొలకు వోలె. **29**

అవిరత=ఎడతెగని, మృగయా=వేట, విముగ్ధ=క్రొత్తగా ఉదయించుచున్న యవ్వనముకల, దర్శాత్యయ=అమావాస్య ముగింపునందలి, ఇందు=చంద్రుడు, దర్శనీయుడు=చూడతగ్గవాడు, ఊన+షట్+వర్షుడు=కొంచము తక్కువైన+ఆరుఏళ్ళ+వయసు కలవాడు, నియుక్తి=వశమున, కడిది=బలమైన, వాత=నోట, కులతంతువు=వంశవర్ధకుడు, అస్థలిత+భక్తి=విడువని+రాజభక్తి, అప్రౌఢ=పూర్తిగాఎదగని, వెలిగె= వ్యాపించె, పూప=మిక్కిలిబాల, విన్ను=ఆకాశము, వర+కిశోరైక+హరి=ఎంచదగ్గ+పిల్ల+సింహము, కుట్మల= మొగ్గ, కుశేశయము=పద్మము, కొలకు=కొలను,

**తే.** ముందుముందు పురోగతి నొంది తండ్రి/యంతవాడగు ననియెంచి రతిని జనులు,
మొదట కలభప్రమాణమై పిదప దెసల/అల్లుకొనదె! పురోవాత మగుచు మొగిలు! **30**

పురోగతి=అభివృద్ధి, ఎంచిరి=తలంచిరి, కలభ=ఏనుగుపిల్ల, ప్రమాణము=కొలత, దెసల=దిక్కుల, పురో+వాత=ముందుకు నడపు+గాలి, మొగిలు=మేఘము,

**ఉ.** మావటివాని నూతగొని మండితభద్రగజాధిరూఢుడై

వావిరి రాజమార్గమున వచ్చు సుదర్శనుభోగభాగ్యరే
ఖావిభవంబుతోడి దొర గావున, గాంచిరి పిన్నపాపడన్
భావన మాని, కేల్మొగిచి పౌరజనుల్ పితృగౌరవాంబునన్. **31**

మావటి=ఏనుగు నడుపువాడు, మండిత=అలంకరింపబడిన, భద్రగజము=ఉత్సవములకు+ఉపయోగించు మేలుజాతిఏనుగు. అధిరూఢుడై=ఎక్కినవాడై, వావిరి=క్రమముగా, రేఖ=రీతి, తోడి=కూడి, పితృ=తండ్రిఅందలి,

ఉ. పైతృకసింహపీఠమును భౌతికకాయముచేత నింప ముం
దాతడు చాలకుండియు, ననంతర మంతయు నావరించె జీ
మూతమునం దటిల్లతిక బోని, నిసర్గహిరణ్యపింజరో,
జోఽతిశయంబుచే, అధికమై అలరారిన దేహదీధితిన్. **32**

పైతృక=తండ్రిదైన, చాలకుండియు=శక్యుడు కాకున్ననూ, అనంతరము=పిమ్మట, జీమూతమునం=మేఘములో, తటిల్లతిక=మెఱపుతీగ, నిసర్గ=సహజమైన, హిరణ్య=బంగారు, పింజరో=కిరణముల, జోతిశయంబుచే=వెలుగువెల్లువచే, అలరారు=ప్రకాశించు, దీధితి=కాంతి, ఆవరించె=చుట్టుకొనె,

సీ. తళుకుసొన్నపుబీట దాకజాలక క్రింది/కొక్కింత గద్దియనుండి వ్రేలు,
సాలక్తకము లర్భకాధీశుడగు వాని/సురుచిరశ్రీపాదసరసిజములు,
శబలితం బొనరింత్రు సబహుమానంబుగా/మకుటమణిప్రభామండలమున,
తమస్వామిభక్తి బ్రదర్శించి సామంత/మండలేశులు నన్యదండధరులు,
అర్ణవతటంబులం దైన నవితథంబు/నిరుపహతము నుపాంతచామరసమీర
కంపితోభయకాకపక్షములతోడి/వాని వదనంబునుండి వెల్వడిన, ముదల. **33**

సొన్నపు=బంగారు, పీట=కాళ్ళు పెట్టుకొను పీట, తాక+జాలక=అంద+లేక, గద్దియ=సింహాసనము, వ్రేలు=వేలాడు, సాలక్తకములు=పారాణి పూచినవి, అర్భక=బాల, సు రుచిర=మంచి కాంతికల, సరసిజములు=పద్మములు, శబలితంబు+ఒనరింత్రు=చిత్రవర్ణములుకలదిగా+చేయుదురు, స బహుమానంబుగా=కానుకలతో, మకుట=కిరీట, ప్రభా=కాంతి, మండలమున=వలయముతో, సామంత=చుట్టుఉన్నరాజులు, దండధరులు=సైన్యాధికారులు, ఉపాంత=దగ్గిఅనున్న, చామర=రాజలాంఛన చామరపు, సమీర=గాలిచే, కంపిత=కదలు, ఉభయ=రెండు, కాకపక్షము=బాలశిఖలు, తోడి=కూడిన, ముదల=ఆజ్ఞ, అర్ణవ=సముద్ర, తటంబు=తీరము, ఐన=అయినప్పటికీ, అవితథంబు=సఫలమైనది, నిరుప హతము=నాశము లేనిది

శా. సుమనోజ్ఞం బగు ఇంద్రనీలము స్వతఃశోభా విశేషంబు వ

ల్ల మహానీలమటందు, రా కృతిని అల్పం బయ్యు, నారీతి బ్రా
యమునం గొండిక యయ్యు, నా రఘుసుతుం డాజానజంబ్జైన వీ
ర్యమహత్త్వంబున బాత్రు డయ్యెను, మహారాజప్రతీతాఖ్యకున్. **34**

సుమనోజ్ఞంబగు=మంచి మనోహరమైన, స్వతః+శోభా+విశేషంబు=స్వభావ+కాంతి+విశిష్టతచే, మహానీలము+అటందురు=మహానీలమని+అనిఅందురు, ఆకృతి=పరిమాణమున, ప్రాయము=వయస్సు, కొండిక=కొంచెము, ఆజానంబైన=పుట్టుకతో వచ్చిన, మహత్వము=ఔన్నత్యము, పాత్రుడు=యోగ్యుడు, ప్రతీత=ప్రసిద్ధ, అఖ్యకున్=పేరుకు,

క. తిలకము, పసిండిపట్టపు/తళతళ లెగజిమ్ము నుదుట దాల్చి, యొనర్చెన్,
తిలకవిహీనములుగ, రఘు/తిలకుడు, వదనములు వైరితిలకవతులకున్. **35**

తిలకము=రాజతిలకము, పసిండిపట్ట=రాజ్యాభిషేకమున నుదుట కట్టు జలతారు పట్టె, తిలకవిహీనములుగ =బొట్టులు లేనివారిగా, తిలకుడు=శ్రేష్ఠుడు, వైరి=శత్రు, తిలకవతులకు=(ముందుబొట్టులుకల) స్త్రీలకు,

తే. తొడుగు తొడిగిన గడు బడల్పడు శిరీష/నవసుమాధికమృదులావయవు, డతండు,
అనయము నితాంతగుర్వి యైనను ధరిత్రి/భరము భరియించె, ననుభావభరము బలిమి. **36**

తొడుగు=భూషణము, కడు=ఎక్కువ, బడల్పడు=అలయు, శిరీష=బహు సుకుమార దిరిసెన(పువ్వు), అధిక=కంటె, మృదుల=సుకుమార, అవయవుడు=అంగములుకలవాడు, అనయము=అత్యంతము, నితాంత +గుర్వి=మిక్కిలి+బరువుకల, అనుభావ=నిశ్చయపు, భరము=ఆసక్తి, బలిమి=బలముచే,

క. అక్షరభూమికపై న్య/స్తాక్షరమగు లిపిని నేర్చు టదితడవు గురుల్
శిక్షింప గఱచె నత డ/న్వీక్షకుడై సకలదండనీతిఫలంబుల్. **37**

అక్షరభూమిక=అక్షరములు దిద్దుపలక, న్యస్త=ఉంచిన, అది+తడవు=ఆ+కాలములోనే, కఱచె=గ్రహించె, అన్వీక్షకుడై=తర్కవిద్యచే మరలమరలఆలోచించువాడై, ఫలంబుల్=ఉదాహరణ రూపములైన ఫలితములు,

మ. అవిశాలంబు తదీయవక్ష, మసమగ్రావాసముం గాన, ప్రౌ
ఢవపుష్మత్వవిరాజమానుడగు కాలంబుం బ్రతీక్షించుచున్,
ధవళచ్ఛత్రము నీడదంభమున మందాక్షంబునం బోలె, రా
ఘవు నాశ్లేషము సేయు రాజ్యరమ యుత్కంఠాతిరేకంబునన్. **38**

అ విశాలంబు=విశాలమైనది కాదు, అసమగ్ర+ఆవాసము=సంపూర్ణము కాని+నివాస స్థలము, ప్రౌఢ+వపుష్మత్వ=నిండుగాపెరిగిన+శరీరము తాల్చి, విరాజమానుడు+అగు+కాలము+ప్రతీక్షించుచున్=మిక్కిలి

ప్రకాశించువాడు +అగు+సమయము కొఱకై+పేచి ఉండుచూ, ధవళ+చ్ఛత్రము+నీడ+దంభము=వాని తెల్లని+గొడుగు(తానై) +నీడఅను+మిషచే, మందాక్షము=సిగ్గు, ఆశ్లేషము=ఆలింగనము, రాజ్యరమ=రాజ్యలక్ష్మి, ఉత్కంఠ=తహతహ, అతిరేకంబునన్=ఆధిక్యతచే,

క. కాకున్న యుగసమానము/జ్యాకిణముల నలగకున్న, అడిదంపు బిడిన్
దాకి యెఱుంగక యున్నను/ప్రాకారంబయ్యె, వాని బాహువు ధరకున్. **39**

యుగ=బండికాడి, సమానము=తుల్యము, జ్యా=వింటినారి, కిణముల=గణుపుల, నలుగకున్న=శ్రమపడక పోయిననూ, అడిదము+పిడిన్=కత్తి+పిడిచే, ప్రాకారము=ప్రహారిగోడ, ధరకున్=భూమికి,

ఆ. కాన నయ్యె మెఱుగు కాలక్రమంబున/అతని యవయవములయందె కాదు,
బహుజనప్రియములు, ప్రారంభసూక్ష్మము/లైన, వంశ్యగుణము లందు, గూడ. **40**

మెఱుగు=ప్రకాశము, ప్రారంభ=మొదట, సూక్ష్మములైన=కొంచముగాఉన్ననూ,

**వ.** మరియు ఆ కుమారమహీపతి పూర్వజన్మాంతర దృష్టకూలములును, ద్రివర్గఫల ప్రాప్తిమూలములును, నగు త్రయీవార్తాదండనీతివిద్యలను, గురుజనాక్లేశకరుడై, విస్మృతవిషయములను జ్ఞాపకముచేసికొనిన విధమున గ్రహించె. తండ్రిగారి ప్రకృతులను గూడ సులభముగ స్వాయత్తుల గావించు కొనియె.
కార్ముకవిద్యాపరిశ్రమావసరమున బూర్వాకాయ మించుక విస్తరించిన చందమున నిలిచి **41**

పూర్వజన్మాంతర=పూర్వజన్మ వాసనవలన, దృష్ట=చూచినవెంటనే దర్శించ కలుగుట, కూలము=వాటిసమగ్ర అవగాహన, త్రివర్గ=ధర్మ అర్థ కామముల, ప్రాప్రి=లభ్యమునకు, మూలము=మొదటి కారణము, త్రయీ=ఋక్ సామ యజుర్వేదములు, వార్తా=వ్యవహారము, అక్లేశకరుడై=శ్రమ కలిగించనివాడై, విస్మృత=మరచిన, ప్రకృతులు=స్వామి అమాత్యుడు సుహృత్తు కోసము రాష్ట్రము దుర్గము బలము-ఆరు ప్రకృతులు, స్వాయత్తము =తనకు అధీనముగా, కార్ముక=విల్లు, పూర్వకాయము=ముందు దేహము,

క. మోకాలు ముడుచికొని చెవి/దాకన్ గొనయంబు లాగి ధను వెక్కిడుచో,
కూకటు లెగదువ్విన యా/కాకుత్ స్థకుమారు తీరు కనితీరవలెన్! **42**

కూకటులు=జుట్టువెంట్రుకలు,

సీ. వనితలు ఱెప్పవాల్పక నేత్రపుటముల/సొగసి యాస్వాదించు జుంటితేనె,
రాగబంధప్రవాళముల గుబాలించు/మదనద్రుమమునకు మొదటి పూత,
జనులకకృత్రిమసంపాదితంబైన/మహితసర్వాంగీణమండనంబు,
భవ్యసౌభాగ్యప్రభాచారులక్ష్మికి/నిరవద్యసంకేతనివసనంబు,

చతురసల్లాపమౌక్తికసాగరంబు/హారివిస్మరకేళీరసైకలహరి,
ప్రాధమికవిభ్రమపదంబు పరిమళించె/తలిరుబ్రాయము, రాజుసుదర్శనునకు. **43**

నేత్ర+పుటముల=కండ్లు అనే+దొప్పల, సొగసి=చొక్కి, జుంటితేనె=తేనెటీగలుకూర్చిన తేనె, రాగబంధ=అనురాగ ధార కురియు, ప్రవాళముల=చిగుళ్ళ, గుబాళించు=వాసన వెదజల్లు, మదన ద్రుమము=మన్మథుడను చెట్టు, అ కృత్రిమ=సహజ, సంపాదితంబైన=కలిగింపబడిన, మహిత=గౌరవింపదగ్గ, సర్వాంగీణ=అన్ని అవయవముల, మండనంబు=అలంకారము, భవ్య+సౌభాగ్య+ప్రభా+చారు+లక్ష్మికి=దివ్యమై+శుభకరమై+ప్రకాశించెడి+సుందర+ రాజ్యలక్ష్మికి, నిరవద్య+సంకేత+నివసనంబు=దోషములేక+కలియుటకు అంగీకారమైన+స్థలము, చతుర+సల్లాప+మౌక్తిక+సాగరంబు=సరసపు+మాటలుఅనెడు+ముత్యాలు చిలుకు+సముద్రము, హారి+ విస్మర+కేళీ+రసైక+లహరి=మనోజ్ఞమై+నెమ్మదిగా జరుగు+స్త్రీపురుషుల విహార క్రీడల+ఉత్సాహపు+ తరంగము, ప్రాధమిక+విభ్రమ పదంబు+పరిమళించె=మొట్టమొదటి+విలాసము కలిగించి+వికసించెను, తలిరు+ప్రాయము=తరుణ+వయసు,

మ. ప్రతిరూపంబును బట్టినచ్చిన మహీపాలాత్మజం దెచ్చి, స
మ్మతి గావించిరి చిన్ననాడె వరియింపంబడ్డ రాలచ్చికిన్
కృతసాపత్నికగా, సమగ్రవిభవశ్రీయుక్తిసంశుద్ధసం
తతికాంక్షన్ ధ్రువసంధిసూనున కమాత్యశ్రేణి పాణౌకృతిన్. **44**

ప్రతిరూపంబు=చిత్రపఠము, మహీపాలాత్మజం=రాకుమార్తెను, రాలచ్చి=రాజ్యలక్ష్మి, కృత+సాపత్నిగా= అంగీకరించిన+సవతిగా, సమగ్ర+విభవ+శ్రీ+యుక్తి+సంశుద్ధ+సంతతి+కాంక్షన్=పూర్ణ+మహత్వ+సంపద+ సాధక+నిర్మల+సంతాన+కోరికతో, పాణౌకృతి=వివాహము,

# ఏకోనవింశ సర్గము శృంగారాగ్ని వర్ణనము

ఉ. కాయజుగ్రేణిసేయు తన గాదిలినందను నగ్నివర్ణు, న
త్యాయతతేజు నాత్మపద మందు బ్రతిష్ఠితు జేసి శాంతుడై,
ప్రాయపు పశ్చిమంబున విపశ్చిదపశ్చిము డేగె రాఘువా
మ్నాయలలాము, డవ్విభుడు నైమిశపుణ్యవనాంతసీమకున్. 1

కాయజు=మన్మథుని, క్రేణిసేయు=పరిహాసము చేయు, గాదిలి=ప్రేమపాత్రపు, అత్యాయత=అధిక, తేజు=ప్రతాపు, ఆత్మ+పదము=తన+రాజ్యము, ప్రతిష్టితు=అభిషిక్తు, ప్రాయపు=వయసు, పశ్చిమంబున=చివర దశలో, విపశ్చిత+అపశ్చిముడు=పండిత+శ్రేష్ఠుడు, రాఘువ+ఆమ్నాయ+లలాముడు=రఘువుల+వంశాచారము పాటించు+శ్రేష్ఠుడు, వన+అంత+సీమ=అడవి+మధ్య+ప్రదేశము,

సీ. సకళత్రముగ పర్ణశాలలో నివసించి/రాజసౌధముల వోరామి గెంటి,
స్నానమొనర్చి నిచ్చలుతీర్థజలముల/క్రీడావిహారదీర్ఘికలు మఱచి,
కుశపల్లవోత్తరకుంభిని బవడించి/మహితతల్పము మీది మమత జెఱచి,
దోరంతరంబుల తులసిపేరులు తాల్చి/తారహారంబుల తగులు తెగడి,
కావికుబుసము గట్టి, శాకములు నమిలి/శ్లక్ష్ణకౌసేయసరసాన్నసక్తి మాని,
భగవదర్పణబుద్ధి దపం బొనర్పె/దాంతుడు, యతేంద్రియుండు, సుదర్శనుండు. 2

సకళత్రముగ=భార్యతోకూడి, వోరామి=ప్రియము, గెంటి=తొలగించి, నిచ్చలు=ప్రతిదినము, తీర్థజలముల=పుణ్యతీర్థముల, క్రీడా=విహార, దీర్ఘిక=సరస్సు, కుశ+పల్లవ+ఉత్తర+కుంభినిన్+పవడించి=దర్భలు+చిగురుల+మీద+నేలపై+పడుకొని, మహిత=గొప్ప, తల్పము=దూదిపఱుపు, చెఱచి=పోగొట్టి, దోరంతరంబుల=భుజముల మధ్య, పేరులు=మాలలు, తాల్చి=ధరించి, తార హారంబుల=ముత్యాల దండల, తగులు=ఆసక్తి, తెగడి=తిరస్కరించి, కావి+కుబుసము=కాషాయ+చొక్కా, శాకములు=కూరకాయలు, శ్లక్ష్ణ+కౌసేయ+సరస+అన్న+ఆసక్తి+మాని=మెత్తని+పట్టు వస్త్రములందు+రసముఊరు+భోజనములందు+అపేక్ష+మానుకొని, భగవత్+అర్పణ+బుద్ధి=భగవంతునికి+(తన్ను)సమర్పించు+మనసుతో, దాంతుడు=తపక్లేశము ఓర్చు కొనువాడు, యత ఇంద్రియుండు=ఇంద్రియముల జయించినవాడు,

తే. రాజ్యపరిపాలనమున రారాపులెఱుగ/డగ్నివర్ణుడు, జగజెట్టి యతని యబ్బ,
భుజవినిర్జితశత్రువు, భోగమునకె/భువి యొసంగె ప్రసాధనమునకు, గాదు. 3

రారాపు=రాపు+రాపు=మిక్కిలి సంఘర్షణ, జగ+జెట్టి=జగములో+శ్రేష్ఠుడు, అబ్బ=తండ్రి, భుజ=భుజశక్తితో, వినిర్జిత=ఓడించిన, భోగమునకే=అనుభవించుటకే, ప్రసాధనము=చక్కగా నెఱవేర్చుట,

చ. తలకొని నిర్వహించెను సుదర్శనసూనుడు భవ్యనీతిదో
హలత నిజప్రభుత్వము నిరన్యమనస్కత గొన్ని యేండ్లు, ఆ
వల దన బాధ్యతల్ సచివవర్గపరం బొనరించి కామియై,
చెలువలపిండు చేవలతి చేసె గడుం దన కోడెప్రాయమున్. 4

తలకొని=పూని, నిర్వహించెను=నెఱవేర్చె, భవ్య+నీతి+దోహలత=యోగ్యమైన+రాజనీతి+ఉత్సాహముతో, ప్రభుత్వము=పాలన, నిర్ అన్య మనస్కత=వేఱొకదానియందు మనసు పెట్టక, ఆవల=తరువాత, సచివ+వర్గ+పరంబు=మంత్రి+మండలి+వశము, చెలువల+పిండు=స్త్రీ+సమూహము, చేవలతి=ఆధీనము, కడు=అత్యంతము, కోడె=పడుచు, ప్రాయము=వయసు

చ. తరుణుల ఆటపాటల మృదంగరవంబుల మారుమ్రోగు, నా
పరమవిలాసిసౌధములు ప్రత్యహ మొక్కొక క్రొత్త వేడుకన్,
వఱలగ బుద్ధిమద్విగతవారమహమ్ముఁ దొలంగ జేసె, ను
త్తరమగు, బుద్ధిమత్తరతదన్యదినోత్సవ మాసమాంతమున్ 5

తరుణుల=స్త్రీల, రవంబుల=మ్రోతల, విలాసి=విలాసవంతుని, ప్రత్యహము=ప్రతిదినము, వఱలగ=ఒప్పుగ, బుద్ధిమత్+విగత+వార+మహమ్మున్+తొలంగన్+చేసె=మనసు నుండి+పోయిన+(పూర్వరాజుల)రోజుల+వేడుకలు+మరవ+చేసె, బుద్ధిమత్+తరతత+అన్య+దిన+ ఉత్సవము=ప్రతిభలో+పెరుగుచున్న+ప్రతి+దినపు+ఉత్సవము, ఆసమ+అంతమున్=కోరిక+తీర

ఆ. ఇంద్రియార్థశూన్య మేకక్షణం బేని/అతడు సైపలేక అంతిపురము
నందె, రేల్ బవల్ విహారనిమగ్నుడై/తలపడాయె, నుత్సుకులగు ప్రజల. 6

ఇంద్రియ+అర్థ+శూన్యము+ఏక+క్షణంబు+ఏని=ఇంద్రియములకు+ప్రయోజనము+లేకపోవుటకు+ఒక్క+గడియ+అయినా, సైప=తాళ, విహార+నిమగ్నుడై=క్రీడలో+మునిగినవాడై, తలపడు=చింతించడు, ఉత్సుకులగు=చూడకూతూహలపడు,,

వ. మంత్రులమీది గౌరవమున, వారి నిర్బంధమును గాదనలేక మొగము గంటుపెట్టుకొనుచు, ఎప్పుడైననూ ప్రకృతిజన చిరకాంక్షితమైన తన దర్శనము ననుగ్రహింప సమ్మతించునేని, అందు కతడు నిజమందిర గవాక్ష వివరమునుండి తన వామచరణమును వెలుపలికి జాచి యుంచును. అదియ

తమకు మహాప్రసాద మని, మిన్నంది, కోమలనఖరాగరూషితమై, నవదివాకరాతపస్పృష్టపంకజతులాధి
రోహణమైన, వాని శ్రీ పాదమును, అల్పసంతుష్టులగు రాజానుజీవులు, కృతప్రణాములై ఉపాసింతురు.
ప్రభువు యథాపూర్వకముగ, తార్తీయపురుషార్థమునవిద్రుతుడై, ప్రవర్తించును. **7**

నిర్బంధము=పట్టుదల, గంటుపెట్టు కొని=ముడుచు కొని, ప్రకృతి+జన=సామాన్య+ప్రజల, అనుగ్రహింప=దయ జూప, గవాక్ష=కిటికి, వివరము=రంధ్రము, వామ=ఎడమ, చరణము=కాలు, మిన్నంది=సంతోషముతో ఉప్పొంగి, కోమల+నఖ+రాగ+రూషితమై=మృదువైన+గోళ్ళ+ఎఱ్ఱదనము+వ్యాపించినదై, నవ+దివాకర+ అతప+స్పృష్ట+పంకజ+తుల+అధిరోహణము+ఐన=నూతన+సూర్యరశ్మి+వేడి+తాకిన+కమలముల+వలే+ సంతోషము పొందిన+వారై, రాజ+అనుజీవులు=రాజుపై+అధారపడినవారు, కృత ప్రణాములై=నమస్కరించిన వారై, ఉపాసింతురు=కొలుతురు, తార్తీయ+పురుషార్థమున=ధర్మ అర్థముల తరువాతి మూడవ+పురుషార్థ మైన కామమున, విద్రుతుడై=లీనమై,

సీ. వన్నెలాడితనంబు వాసించి తులకించు/వయసుగుబ్బల రూపవతుల గూడి,
క్రీడావిహారదీర్ఘికలందు నోలాడు/రాగరసాంబుపూరమున దేలు,
జలసేకపరిహృతాంజనవిలోచనముల/ఆధౌతరాగశోణాధరముల,
అర్పితప్రకృతిశోభాఢ్యంబులగు వారి/ఆననాబ్జములు ముద్దాడు దడవి,
ఆర్ద్రరుచిరతదీయావయవవిలాస/దుగ్ధపాథోధి, తరగల దొప్పదోగి,
కెరలు కోర్కులు బట్టి కౌగిట గదించు/అనుదినము అవ్విగాఢమీనాంకమూర్తి. **8**

వన్నెలు ఆడి+తనంబు=విలాసవతి+విలాసము, వాసించి=నిలుపుకొని, తులకించు=ప్రకటితమగు, గుబ్బల =స్థనముల, దీర్ఘిక=సరస్సు, అంబు+పూరము=జల+వృద్ధి, తేలు=సంతోషించు, జల+సేక=నీరు+తోడ, పరిహృత+అంజన=తొలగిన+కాటుక, విలోచనముల=కండ్ల, ఆధౌత=కడగబడిన, రాగ+శోణ+అధరముల = రాణించు+ఎఱ్ఱ+పెదవుల, అర్పిత+ప్రకృతి+శోభ+ఆఢ్యంబులగు=సమర్పించు+సహజ+సౌందర్య+సంపన్న మైన, ఆనన+అబ్జములు=ముఖ+పద్మములు, తడవి=తాకి, ఆర్ద్ర+రుచిర+తదీయ+అవయవ+విలాస+దుగ్ధ పాథోధి+తరగల+తొప్ప+తోగి=తడసిన+అందమైన+వారి+అంగముల+సౌందర్యమనెడు+పాల+సముద్ర +తరంగముల+మిక్కిలి+తేలిఆడి, కెరలు=సంభ్రమించు, కదించు=బిగించు, అ+విగాఢ=ఆ+ప్రౌఢ, మీనాంక+ మూర్తి=మన్మథ+రూపుడు,

ఉ. కమ్మనిఘ్రాణకాంతమధుగంధమునన్ దవుదవ్వు నుండి రా
రమ్మని పట్టిలాగు, అభిరామవినూతనపానగోష్ఠిగే

హమ్ముమ్ను, జేరు నాతడు ప్రియాసహితమ్ముగ, వాసితాసమే
తమ్ముగ, పుష్పితాంబుజిని దాపునకుం జను హస్తి, పోలికన్. 9

కమ్మని+ఘ్రాణ+కాంత+మధు+గంధము=తీయగా+ముక్కుకు+ఇంపైన+మద్యపు+వాసన, దవుదవ్వు=దూరదూరము, పట్టిలాగు=ఆకర్షించు, అభిరామ+వినూతన+పాన+గోష్ఠి+గేహమ్ము=అందమైన+క్రొత్తక్రొత్త+పానీయ+సల్లాప+మందిరము, వాసిత+సమేతమ్ముగ=ఆడఏనుగు+కూడి, పుష్పిత+అంబుజిని+దాపునకుం+జను=పూచిన+పద్మముల+వద్దకు+చేరు, హస్తి=మగఏనుగు,

సీ. వలపుకత్తెల వాడె, వరుసగా ద్రావించు/ద్రావింతు రతని నా తీవబోండ్లు,
కైపెక్కి యాత డొక్కతకు బయ్యెద జార్చు/మోమెత్తి ఒకతెకు మోవి నొక్కు,
ఒత్తుగా బాలింఢ్ల కొకతె సందిట బట్టు/కెరలి ఒక్కతెకు గిల్గింత బెట్టు,
తనివార నొకతెకు దళుకుబుగ్గలు గిల్లు/చెంపపై నొకతెకు చిటిక వేయు,
పడతి నొకదాని పాడించు, నడుమ దాని/పాట మాన్పించి, మరియొక బోటి బిలిచి
ఆడమను, దానె మద్దెల నందికొనును/తందనాలాడు, మరియును తప్పత్రాగి. 10

వలపుకత్తె=మోహము కలిగించు స్త్రీ, తీవబోండ్లు=స్త్రీలు, కైపు+ఎక్కి=మత్తు+ఎక్కి, మోవి=పెదవి, ఒత్తిగా=అదుముకొని, సందిట=చేతులమధ్య, కెరలి=ఉద్రేకించి, తనివి+ఆర=తృప్తి+తీరగా, పడతి=స్త్రీ=బోటి, తందనాలు+ఆడు=నీచ పదములు+పాడు,

తే. గాఢ రతిహేతు వగుట, నా కామినులకు/వలసి యుండు దదర్పిత వదనమదిర
వకుళ సమదోహదుడు గాన, వాడు, నాను/ఆదట దదర్ధపీత ముక్తాసవమును. 11

గాఢ=మిక్కుట, రతి+హేతువు=సంభోగ+ప్రేరణము, వలసి=చుట్టు తిరుగుచు, వకుళ=పొగడచెట్టు (స్త్రీల ముఖసవము-తాంబూలము-చే ప్రేరేపింపబడి పూయును), సమ=సమానముగా, దోహదుడు=ప్రేరింపబడువాడు, ఆను=త్రాగు, ఆదట=అపేక్షతో, తత్+అర్ధ+పీత+ముక్త+ఆసవమును=ఆమె+సగము+త్రాగి+విడచిన+తాంబూలమును,

తే. చేరి ఎల్లవేళలను గైసేయు వాని/అంక మంకవిహారార్హ మగు ద్వయమ్ము,
ఉల్ల ముల్లసిలన్, మ్రోగు నొక, విపంచి/వల్గువాదిని ఒకజాణ వలపులాడి. 12

కైసేయు=అలంకరించు, అంకము+అంక=ఒకతొడనుండి+మరొకతొడపైకి, విహార+అర్హము+అగు=వేడుకగా తిరుగ+వీలైనవి+అగు, ద్వయమ్ము=రెండు, ఉల్లము+ఉల్లసిలన్+మ్రోగు+ఒక విపంచి=మనసు+సంతోషపెట్ట+ధ్వనించు+వీణ ఒకటి, వల్గు+వాదిని+ఒక+జాణ+వలపులాడి=మధుర+భాషిణి+ఒక+ప్రౌఢ+కాముకి,

సీ. శైలూషితనమున సడిసన్న పెలయాండ్ర/పిలిపించి యాడించు పెక్కుగతుల,
నటనాంశములు, వాని నైపథ్య విధులును/నిపుణంబుగా దానె నిర్ణయించు,
తదనుగుణ్యముగ జంత్రముల నేర్చి స్వయంబు/పలికించు చలమాల్యవలయు డతడె,
రసభావముల ప్రదర్శనమున దడబడ్డ/బాగొప్ప దా నాడి పాడి చూపు,
చారునృత్యాంతమున వారి జేర బిలచి/గళితఘర్మాంబుకణభిన్నతిలకమైన
లలితవదనాబ్జముల పరీమళము గ్రోలు/ప్రణయవితరితముఖసమీరణు, డతడు. **13**

శైలూషితనమున=నర్తనమున, సడిసన్న=ప్రసిద్ధి చెందిన, పెక్కు+గతుల=అనేక+నృత్యరీతుల, నటన+అంశములు=ఆడవలసిన+విషయములు, నైపథ్య=వేషభూషలు, విధులు=పద్ధతలు, నిపుణంబుగా=కుశలముగా, తత్+అనుగుణ్యముగ+జంత్రముల+ఏర్చి=దానికి+తగ్గట్టుగా+వాద్యములు+ఏర్పాటుచేసి, చల+మాల్య+వలయుడు=ఊగుతున్న+మాలలు+కంఠమున కలవాడు, తడబడ్డ=(భయముచే)తొట్రుపడ, బాగు+ఒప్ప =సరైన+విధముగా, చారు=మనోహరమైన, గళిత+ఘర్మ+అంబు+కణ+భిన్న+తిలకమైన=జారిన+చెమట+నీటి+బొట్లచే+చెదరిన+బొట్టుకల, లలిత+వదన+అబ్జముల+పరీమళమున్+క్రోలు=కోమల+ముఖ+పద్మముల+సువాసన+ఆఘ్రాణించు, ప్రణయ+వితరిత+ముఖ+సమీరణుడు=ప్రేమతో+ఊదును+నోటి+గాలిచే,

చ. అలసత జూపు పాత్రముల కైన, రయంబున నేర్పు పాటవం
బలవడ, అంగసత్త్వవచనాశ్రితనృత్తకళారహస్యముల్,
కలపనగంపయై, అతడు ఘర్షణకున్ దిగు, మేటినట్టువొ
జ్జల నటనాప్రయోగములు సైతము కాదని, మిత్రసన్నిధిన్. **14**

అలసత=సోమరితనము, పాత్రముల=నర్తకుల, రయంబున=త్వరగా, పాటవము=నైపుణ్యము, అలవడ=అలవాటవగా, అంగ+సత్త్వ+వచన+ఆశ్రిత+నృత్త+కళా+రహస్యముల్=అంగవిక్షేపము(నృత్తము)+నైసర్గిక భావములు(నృత్యము)+వాక్యార్థాభినయము(నాట్యము)+ఆధారముగా+నృత్య+కళల+మెలకువలు, కలపనగంగ=కలహశీలుడు, ఘర్షణ=వివాదము, మేట+నట్టువ+ఒజ్జల=గొప్ప+నాట్య+ఆచార్యుల, ప్రయోగము=కూర్పు, సైతము=కూడా,

ఉ. "నీ పలుగాటులం బగిలె, నేరదు వాతెర, పేణు వూదగా,
వాపు వహించె, నీదు నెలవంకల డాతొడ, వీణ మోయగా
నోపదు, చూడు!" మంచు, పెలయుగ్మలు లాతనిమన్మథాగ్ని, కు

ద్దీపన మాచరింత్రు, గడిదేరిన వంకర వాలుచూపులన్. 15

పలు=ఎక్కువ, నేరదు=శక్యముకాదు, వాతెర=పెదవి, నెలవంకల=గిచ్చులచే, డా=ఎడమ, వెలయుగ్మలు= వేశ్యలు, ఉద్దీపనము=జ్వలనము, గడి దేరిన=ఆరి తేఱిన, వంకర=వక్ర, వాలుచూపు=ఓరచూపు,

సీ. నిత్యనూతనకామినీజనభుజగుడు/వాని ప్రచ్ఛన్నభోగానుభవము,
అవరోధవనితల యాగమనంబున/ముగియు బ్రాయికముగ సగములోన,
అంగుళీనవపల్లవాగ్రతర్జనముల/రూక్షసభ్రూభంగవీక్షణముల,
న్యాయనిష్ఠురముల నదలించినట్టి యా/తెఱవల నమ్మించి మొఱగి పోయి,
వేగుదల రాత్రిపరిభోగవిలసనమున/అతడు చనుదెంచి కృతఖండానార్తులైన
సతుల దగ బుజ్జగించు, నంజలి ఘటించి/ప్రేమమంథరు డగుట, నేడ్పించు మరల. 16

భుజగుడు=విటుడు, ప్రచ్ఛన్న=రహస్య, అవరోధ=అంతఃపుర, ప్రాయికము=సామాన్యము, అంగుళీ+నవ+ పల్లవ+అగ్ర+తర్జనముల=వ్రేలు అను+లేత+చిగురు+చివరచే+అదలించుటచే, రూక్షస+భ్రూభంగ+వీక్షణముల =కోపముతో+కనుబొమముడి నుండివచ్చిన+చూపుల, న్యాయ=ధర్మము, నిష్ఠురము=పరుషము, అదలించు =బెదిరించు, తెఱవల=స్త్రీల, మొఱగి=వంచించి, వేగుదల=ఉదయమున, పరిభోగ+విలసనమున= సంగమ+ ఆటల, కృతఖండ ఆర్తులైన=శోకము నాశము చేయబడినవారైన, ప్రేమ+మంథరుడు=కామముచే+ బుద్ధిహీనుడు,

తే. దూతికలతోడ నేకమై దొంగవోలె/వచ్చి రతివారనిశలందు వల్లభలకు,
వెనుక గూర్చుండి, వినువారి విప్రలంభ/నిష్ఠురోక్తులు, వంచనానిపుణు డతడు. 17

దూతిక=రాయబారముచేసెడి స్త్రీ, ఏకమై=కుమ్మక్కై, రతి+వార+నిశలు=సంభోగ+దినముల+రాత్రు లందు, వల్లభ=ప్రియురాలు, విప్రలంభ=వియోగము అనుమానించుచున్న, నిష్టుర+ఉక్తులు=పరుషపు+మాటలు,

చ. తడవుగ నిల్తు రొక్కతరి, తత్కులకాంతలు వాని వోకడల్
వొడగొనవచ్చి, వారి నెటు వొమ్మనజాలక, పానకంబులో
పుడకలు దాపురించె నని వొక్కుచు, రోజవరాండ్ర చెంతకున్
వెడలడు వాడు ముండ్లపయి నిల్చిన చొప్పున నిల్చు నచ్చటన్. 18

తడవుగ=ఆటంకముగ, ఒక్క+తరి=ఒక్క+చోట/సారి, తత్+కుల+కాంతలు=వాని+వంశపు+కాంతలు- రాణులు, వోకడల్=చేష్టలు, వొడగొన=చూడ, దాపురించె=ప్రాప్తించె, వొక్కుచు=ఉలుకుచు, రో+జవరాండ్ర=వెల+ఆండ్ర

తే. నిలిచి, నిజభోగినీ తను/విలసనములు గీయునతడు స్విన్నములగు ప్రే
ళులనుండి సారె కురలెడు/శలాకతో, రాణు లెద నసహ్యించికొనన్. 19

నిజ=తన, భోగినీ=వారకాంత, తను=శరీర, విలసనములు=తళుకులు, స్విన్నము=సాత్విక భావోద్రేకముచే పుట్టిన చెమటచే తడసిన, సారెకు=మాటిమాటికి, ఉరలెడు=జారిపడు, శలాక=కుంచె,

చ. పతి నొడిలోన బెట్టుకొని పంతముతో గడు విట్టివీగు, రో
అతివలమీది ఈసునకు, అంగభవార్తికి గ్రుంగినట్టి, త
త్సతు లొక గొప్ప యుత్సవము సాకున లోగొని పోయి, వానిచే
అతనువినోదలీలల గృతార్థతగందు రపాస్తరోషలై. 20

ఒడిలోనబెట్టుకొని=లొంగదీసుకొని, రో+అతివల=పెల+అంద్ర, ఈసు=అసూయ, అంగభవ+ఆర్తికి=మన్మథ+బాధకి. తత్+సతులు=వాని+భార్యలు, సాకున=మిష, అతను+వినోద+లీలల=మన్మథ+సురత+క్రీడల, అపాస్త+రోషలై=తొలగిన+కోపము కలవారై,

క. చివురుం బాన్పు లమర్చిన/పువుటీరము లందు, దూతి ముందఱ నడువన్,
అవరోధభయవ్యాకులు/డవుచున్, దాసీరతమున కాతం డేగున్. 21

పువు+ఈరము=పూల+పొద, అవరోధ=అంతఃపురస్త్రీల, వ్యాకులుడు=కలతపడినవాడు,

తే. కుంకుమపిశంగిత, మలక్తకాంకితంబు/లులితమాల్యము, ఛిన్నమేఖలము నగుచు,
పువ్వుపడకయె, మేల్కొన్న అవ్విలాసి/ఎల్లరతిబంధముల సొంపు, వెల్లడించు. 22

పిశంగితము=ఎఱ్ఱదనపు, అలక్తక+అంకితంబు=పారాణి+ముద్రలుకలది, లులిత+మాల్యము=విడిపోయిన+పూదండ, ఛిన్న=తెగిజారిపడిన, మేఖల=మొలనూలు, సొంపు=సమృద్ధి,

తే. స్వయముగ విలాసినికి బూయు జరణరాగ/మవహితుడు మాత్రమతడు కాడయ్యె నందు,
శిథిలవసనము, కాంచికాంచితము నైన/తన్నితంబముపై, చూపు తగులువడుట. 23

చరణ+రాగము+అవహితుడు=పాదములకు+పారాణి+సావధానముగా వ్రాయువాడు, శిథిల=విడివడిన, వసనము=వస్త్రము, కాంచి+కాంచితము=బంగారు+ఒంటిపేట మొలనూలు, నితంబము=కటి, తగులువడుట =చిక్కుకొన

ఉ. వాతెరప్రేళ్ళతో మఱుగుపర్తురు, దొంతరముద్దులాడుచో,
చేతులతో నివారణము సేతురు, నీవి సడల్పబోయినన్,
ప్రీతినిరోధ మిట్లు, పొనరించిన నాతుల చేతలే, సమి

ద్భూతములయ్యె, దద్విటుని భూరిమనోజవికారవహ్నికిన్. **24**

వాతెర=పెదవి, మఱుగుపర్తురు=దాచుదురు, దొంతర=వరుస, నివారణ=ఆపు, ఈవి=పోకముడి, నిరోధము =అడ్డగించుట, పొనరించిన=చేసిన, నాతి=స్త్రీ, సమిద్+భూతములయ్యె=సమిధల+వంటివి, తత్+విటుని= ఆ+జారుని, భూరి=అధిక, మనోజ=మన్మథ, వికార=చిత్తవృత్తి, వహ్ని=అగ్ని,

ఆ. రతివిభిన్నవేషరచన నద్దంబున/నరయు నొక లతాంగి పిఱుద నిలిచి,

స్మితమనోజ్ఞమైన ప్రతిబింబమున నామె/నతడు హ్రీనిమీలితాస్య, జేయు. **25**

విభిన్న=చెదిరిన, రచనన్=అలంకరణను, అరయు=చూచు, పిఱుద=వెనుక, స్మిత=చిరునవ్వు, హ్రీ=సిగ్గు, నిమీలిత=మూసుకొనిన, ఆస్య=ముఖము,

తే. గళము గోమలభుజవల్లికల బిగించి/పదతలంబులు తత్పదాబ్జమున మోపి,

ననుపుకత్తెలు నిద్రమేల్కొనిన వాని/పేడుదరు వీడుకోల్ ముద్దు, వేగుబోక. **26**

గళము=కంఠము, వల్లిక=లత, తలము=ప్రదేశము, నునుపు+కత్తె=నొగసైన+స్త్రీ, వేగుబోక=తెల్లవాఱ,

మ. సురసమ్రాడతిశాయివైభవమునన్ శోభాఢ్యమై, దర్పణ

స్ఫురితంబైన, స్వరాజవేషరచనంబుం జూచి తా నంతగా

పరితోషింపడు, కోడెకా డతడు సంప్రాపించు, పణ్యాంగనా

పరిభోగాకులమండనంబుగనియే, ప్రహ్లాదపర్యాప్తమున్. **27**

సుర+సమ్రాట్=ఇంద్రుడు, అతిశాయి=మీఱు, శోభ+ఆఢ్యుడు=దీప్తి+సంపన్నుడై, దర్పణ=ఆద్దములో, స్ఫురితంబు=ప్రకాశింప, రచన=అలంకరణ, పరితోషింపడు=ఆనందించడు, కోడెకాడు=విటుడు, సంప్రాప్తించు= పొందు, పణ్యాంగనా=వేశ్య, పరిభోగ+ఆకుల+మండనంబు=సంభోగమున+కలిగిన+అలంకారము, కనియే= చూచుకొనే, ప్రహ్లాద=ఆనంద, పర్యాప్తము=పూర్ణత్వము,

క. కలితనపు కఠినరతముల/నలసినొలసి కంఠసూత్ర మపదేశముగా,

నెలతలు వ్రాలుదు రురుకుచ/విలుప్తచందనము, వాని విపులోరమునన్. **28**

కలితనపు=నేర్పుకల, కఠిన=బాధకలిగించు, కంఠసూత్రము=కంఠ సూత్రమను ఆలింగనము, అపదేశము= నెపమున, ఉరు=పెద్ద, విలుప్త=రాలిన, విపుల+ఉరమున=విశాల+వక్షస్థలమున,

తే. స్నిగ్ధచంద్రాతపము బోని చిగురుబోండ్ల/స్పర్శనిర్వృతిపారవశ్యమునుగనుచు,

తొగకొలంకున కుపమయై తోచు రాత్రి/జాగరపరాయణుడు, దివాశయుడతండు. **29**

స్నిగ్ధ+చంద్ర+ఆతపము=చిక్కని+చంద్రునియొక్క+ప్రకాశము-వెన్నెల, చిగురుబోండ్ల=చిన్నారుల, స్పర్శ+నిర్వృతి+పారవశ్యమును+కనుచు=తాకు+సుఖ+పరవశము+అనుభవించుచూ, తొగ+కొలంకునకు+ఉపమయై+తోచు=కలువ+కొలను+పోలిక+అనిపించు, రాత్రిజాగరపరాయణుడు=రాత్రిమేలుకొనువాడు, దివాశయుడు=పగలు నిద్రించువాడు

చ. పొలపుగ నిద్దపుం గడిమిపూవులపుప్పొడి మై నలంది, కో
మలగిరిమల్లికాకుసుమమాలలు మూపున ప్రేలదాల్చి, రో
పొలతులు, దాను నుండు, జడిప్రొద్దుల భూపతి భోగలోలుడై,
జలదరవప్రహర్షశిఖిసంయుతకృత్రిమశైలసీమలన్. **30**

పొలపుగ=అందముగా, నిద్దపుం=దట్టమైన, మైన్+అలంది=శరీరమున+రాసుకొని, కోమల+గిరి+మల్లికా+కుసుమ+మాలలు=మృదువైన+అడవి+మల్లె+పూల+దండలు, రో+పొలతులు=వెల+ఆలులు, జడిప్రొద్దుల=ప్రతిరోజు, జలద+రవ+ప్రహర్ష+శిఖి+సంయుత+కృత్రిమ+శైల+సీమలన్=మేఘముల+ధ్వనిచే+సంతోష పడిన+నెమళ్ళు+కల+కృత్రిమముగానెలకొలపబడిన+కొండ+ప్రదేశముల,

తే. పొలయలుక బాన్పుపై బెడమొగము పెట్టు/పడతి బ్రతిమాల దొందరపడడు వాడు,
ఉఱుముమ్రోతకు బెనుదిగులొంది, యామె/వెనుదిరిగి సందిట జొరంగ వేచు, గాని **31**

పొలయలుక=ప్రణయకోపము, పడతి=స్త్రీ, పెను+దిగులు+ఒంది=ఎక్కువగా+గుండెఅదురుపాటు+పొంది, సందిట=బాహువుల, చొరంగ=దాగుటకు, వేచు=వేచియుండు,

తే. అర్థి విహరించు సవితానహర్మ్యసీమ/అగ్నివర్ణుడు, కార్తికీయామవతుల,
అంగనాగాఢసురతశ్రమాపహమున/అంబుదవిముక్తసాంద్రచంద్రాతపమున. **32**

అర్థి=కోరికతో, విహరించు=విహారము చేయును, స వితాన+హర్మ్య+సీమ=చాందినీవేసిన(మంచుపడకుండు టకైపందిరిలా)+మేడ+పైభాగమున, కార్తికీ=కార్తీకమాసపు(శరదృతువు), యామవతుల=రాత్రులందు, అంగనా+గాఢ+సురత+శ్రమ+అపహమున=వారాంగనల+కఠిన+రతి+శ్రమ+తీరుటకు, అంబుద+విముక్త+సాంద్ర+చంద్ర+అతపమున=మేఘములు+లేని+చిక్కని+చంద్ర+ప్రకాశమున-వెన్నెలలో,

చ. అలలసియాడినన్ మెరయు నండజపంక్తి విలాసకాంచిగా,
పులినము శ్రోణిబింబముగ, భూరిమనోహరరేఖ స్వప్రియా
విలసనసౌష్ఠవంబు దలపింపగ జూచు నతండు సారెకున్,
నిలయగవాక్షరంధ్రగతనేత్రములన్, సరయూతరంగిణిన్. **33**

అలలు+అసియాడినన్+మెరయు+అండజ+పంక్తి+విలాస+కాంచిగా=అలలపై+కదలగా+ప్రకాశించు+హంసల +వరస+స్త్రీల+వడ్డాణముగా, పులినము=ఇసుకతిన్నె, శ్రోణిబింబము=గుండ్రనిపిఱుదు, భూరి=ఎక్కువ, మనోహర+రేఖ=అందమైన+విధము, విలసన=ప్రకాశించు, సౌష్ఠవంబు=చక్కదనము, తలపింప=గుర్తుచేయ, సారెకు=మాటిమాటికి, నిలయ=ఇంటి, గవాక్ష=కిటికీ, రంధ్ర+గత=కన్నములో+ఉంచిన, తరంగిణి=నది,

చ. అల హిమవేళలందు అసితాగురుధూపసువాసితంబులై,
పెలపెలలాడు కాంచననవీనదుకూలములన్ సువర్ణమే
ఖల లగుపింపగట్టి కడకంట మరుల్గొన జేతు రాతనిన్,
వెలజవరాండ్రు పోకముడి వేయగ విప్ప విలోలు జేయుచున్. **34**

అల=అప్పటి, హిమవేళ=మంచు కురియు హేమంత కాలమున, అ సిత=నల్లని, అగరు+ధూప+ సువాసితంబు=పరిమళ ద్రవ్య+పొగల+మంచివాసనకలవారై, పెలపెలలాడు=పెళపెళమనుబట్టలరాపిడిధ్వని, కాంచన=బంగారు జరీకల, నవీన=క్రొత్త, దుకూలములన్=బట్టల, సువర్ణ=బంగారు, మేఖలలు=వడ్డాణములు, అగుపింపన్+కట్టి=కనబడునట్లు+కట్టుకొని, కడకంట=వాలుచూపుతో, మరుల్+కొన=మోహము+పొంద, పోకముడి=కోకముడి, విలోలు=ఆసక్తికలవాని,

తే. పడకమేడల గదులలోపలి నివాత/నిశ్చలితదీపకళికలు నేత్రములుగ,
సకలసురతాంతరార్పణక్షమలు శిశిర/శర్వరులు, వాని అభికత్వసాక్షిత గనె. **35**

నివాత=గాలిలేకపోవుటచే, నిశ్చలిత=కదలికలేక నిలకడగావెలుగు, కళిక=శిఖ, సకల+సురత+అంతర +ఆర్పణ+క్షమలు=అన్ని+రతుల+అందలి+శ్రమఊరటచేయ+సమర్థమైన, శిశిర=చలికాలపు, శర్వరులు= రాత్రులు, అభికత్వ=ఎదురుగానిలచు, సాక్షితన్+కనె=ప్రత్యక్ష ప్రమాణమై+చూచినవి,

తే. పైరగాలికి బూచి సొంపారుచున్న/నునుజిగురుతోడి మావిక్రొన్ననలు చూచి,
వాని కెడసేయబడ నోడి, చానపిండు/వీడి, యలుకలు తమయంత కూడుకొనిరి. **36**

సొంపారు=అందగించు, నును+చిగురు=క్రొత్త+చిగిళ్ళ, క్రొన్నన=క్రొత్తమొగ్గలు, ఎడన్+చేయన్+పడన్+ఓడి= (కోపముచేముందు)వేరు+చేసియు+ఇంకవేఱుగాఉండ+నేఱక, చాన+పిండు=స్త్రీ+సమూహము, కూడికొనిరి= కలిసిరి,

చ. తొలకెడు పేడ్క, నుయ్యెలల దూగు దదంకగతల్ సరోరుహా
క్షులు, కనుసన్న జేటికలు, జోరున డోలిక నూపినన్ భయ
చ్చలమున, సంభ్రమించి, తమ చారుభుజాలతలన్, బిగింత్రు, త

ద్గళము, దదంగసీమ బులకల్ ననవిల్తుడు నారువోయగన్. 37

తొలకెడు = అతిశయించు, తత్ + అంక + గతులు = ఊయల + పై + ఉన్న , సరోరుహాక్షులు = స్త్రీలు, కనుసన్న = కంటి సైగ, చేటికలు = చెలికత్తెలు, డోలిక = ఉయ్యాల, భయత్ + ఛలమున = భయమను + సాకుతో, చారు = అందమైన, గళము = కంఠము, తత్ + అంగ + సీమ = వావి + శరీర + ప్రదేశమున, అనవిల్తుడు = మన్మథుడు, నారుపోయగన్ = మొక్కమొలవగా

ఉ. కమ్మని చందనంబు, నొడికంబుగ జన్నుల బూసి, మీనుమీ

సమ్మును గ్రేణిసేయు తెలిచల్వమడుంగులు గట్టి ఆణిము

త్యమ్ముల, గూర్చినట్టి రుచిరాభరణంబులు దాల్చి, జేని, డెం

దమ్మును గ్రీష్మవేషరచనంబుల, రంజిలజేసి రంగనల్. 38

కమ్మని = సువాసనకల, ఒడికంబుగ = ఇంపుగ, మీను = చేప, క్రేణిచేయు = పరిహసించు, తెలి + చల్వ + మడుంగులు = తెల్లని + అందమైన + శుభ్రవస్త్రము, రుచిర = కాంతివంతమైన, గ్రీష్మ = వేసవి, రచన = అలంకరణ,

తే. చూతపల్లవపాటలసుమయుతముగ/మద్యమును గ్రోలు నృపతి, ఉగ్మలులు దాను,

దాన గాదె! పునర్నవత్వమును గాంచు/మధువిగమమందవీర్యుండు, మనసిజుండు. 39

చూత + పల్లవ + పాటల + సుమ + యుతముగ = మామిడి + చిగురుల + కలిగొట్టుచెట్టు + పువ్వులు + కలిసిన, ఉగ్మలులు = స్త్రీలు, దానన్ + కాదె = అటువంటిదానిచే + కదా, మధు + విగమ + మందవీర్యుండు = వసంతము + వెళ్ళినందున + శక్తిహీనుడైన, మనసిజుండు = మన్మథుడు, పునర్ + నవత్వమును + కాంచు = మరల + క్రొత్తగాప్రబలత + కనెను,

వ. అట్లు పుణ్యశ్లోకరాఘవవంశవృత్తవ్యతిరిక్తమైన తన రాసిక్యము వెఱ్ఱితలలువేయ, తనతార్తీయపురుషార్థ ప్రావీణ్యశిఖండి నలిరేగి వికటతాండవము సేయ, పూర్వలోకోత్తరపతిదేవతావతంసపాదార్పణధన్య కుట్టిమములైన, సాకేత రాజప్రాసాదప్రదేశములు, సానికూతుల శృంగార విహారములతో, నిత్యవిలాస ములతో, ఉత్తరోత్తరాధికీభూతమధుపాననిధువనోత్సవ విజృంభణ కోలాహలముతో, అత్యంతకశ్మల ములుగ, దరులొరసిపారునిరంతరేంద్రియసుఖానుభవపరీవాహములో, నొక పూచికపుల్లయై సొదర్శని, ఉషఃప్రదోషకాలవిభేదము నెఱుంగక అంగనాసుముఖుడు, అన్యక్రియావిముఖుడునై, నిజతత్తత్కుసుమస్రగ్ధారణలక్షణనివేదితమగు, ఋతుచక్రమును, ద్రిప్పుచుండె. 40

పుణ్యశ్లోక = పుణ్యము కలిగించు చరిత్రకల, వృత్త = నడవడికి, వ్యతిరిక్తమైన = విరుద్ధమైన, రాసిక్యము = శృంగారము, వెఱ్ఱితలలువేయ = పిచ్చివానినిచేయ, తార్తీయపురుషార్థ + ప్రావీణ్య + శిఖండి = కామమున +

నేర్పుకల+కోడి, నలిరేగి=విజృంభించి, వికట=వికృత, తాండవము=భీకరనృత్యము, పూర్వ+లోకోత్తర+ పతిదేవత+అవతంస +పాద+అర్పణ+ధన్య+కుట్టిమములైన=పూర్వపు+అతిగొప్ప+రాజుల+శ్రేష్ఠ+పాదములు +పెట్టుటచే+తరించిన+ మెట్లుకల, సాకేత+రాజ+ప్రాసాద+ప్రదేశములు=అయోధ్యా+రాజుల+భవంతుల+ గోడలు, ఉత్తర+ఉత్తర+ అధికీభూత+మధుపాన+నిధువన+ఉత్సవ+విజృంభణ+కోలాహలము=మఱి+మఱి+ ఎక్కువగుచున్న+మదిరపాన+మైథున+ఆనందమున+చెలరేగు+కలకలము, అత్యంత+కశ్మలములుగ= మిక్కిలి+నింద్యముగ, దరులు+ఒరసి+పారు+నిరంతర+ఇంద్రియ+సుఖ+అనుభవ+పరీవాహములో= ఒడ్డులు+రాచుకొని+ప్రవహించు+అదుపులేని+ఇంద్రియ+సుఖముల+అనుభవ+ప్రవాహములో, పూచిక పుల్లయై=తేలిపోయున, సౌదర్శని =అగ్నిపర్ణుడు, ఉషః+ప్రదోషకాల+విభేదము+నెఱుంగక=పగలు+రాత్రి+ భేదము+తెలియలేక, అంగనా+ సుముఖుడు=స్త్రీలందే+ప్రసన్నత కలవాడు, న అన్య+క్రియా+విముఖుడునై =మిగిలిన+కర్తవ్యములు+ బొత్తిగావిడచినవాడై, నిజ+తత్+తత్+కుసుమ+స్రక్+ధారణ+లక్షణ+నివేదిత మగు+ఋతుచక్రమును+ త్రిప్పుచుండె=తమతమ+ఋతువు+ఋతువుకు+పువ్వులు+తగ్గుట+కలుగుట అను+లక్షణములచే+ తెలుసుకోబడిన+కాలచక్రముగా+గడుపుచుండెను,

తే. వ్యసని అగుగాక, తన ప్రభావంబువలన/అతడు రిపులకు, దుర్భేద్యు డయ్యె, గాని,
విలతరతిరాగజనితరుగ్ణత గృశించె/అమృతభానుడు, దక్షశాపమున, బోలె. **41**

వ్యసని=చెడుఅలవాట్లు కలవాడు, అగుగాక=అయినప్పటికి, ప్రభావము=కోశదండాదులవలనకలిగిన శక్తి సామర్థ్యము, దుర్భేద్యుడు=జయింపలేనివాడు, వితత+రతి+రాగ+జనిత+రుగ్ణత+గృశించె=అధిక+సంగమ+ కాంక్షచే+పుట్టిన+రోగముతో+క్షీణించె, అమృతభానుడు=ఇంపైన ప్రకాశము కలవాడు-చంద్రుడు, దక్షశాపమున=చంద్రుడు తన ఇతర పుత్రికల ఉపేక్షించి రోహిణి అందే అనురక్తుడగుటచే దక్షప్రజాపతి క్షీణించమని ఇచ్చిన శాపమున

చ. కడిది యనర్థముల్ గనుల గాంచియు మద్యము గామకూటమున్,
విడువ దలంప డా ప్రభువు, వెజ్జులు పథ్యము లెన్ని చెప్పినన్,
పెడచెవి బెట్టె, అట్లయగు! పెన్విషయంబుల తీపికిన్ దగు
ల్వడిన, నిజేంద్రియంబుల మరల్పగ వచ్చునె! ఎంతవారికిన్. **42**

కడిది=సహింపలేని, అనర్థము=కీడు, కనుల+కాంచియు=ఎదురుగా+పొందియు, కామకూటము=వేశ్యా విలాసము, తలంపడు=సంకల్పించడు, వెజ్జులు=వైద్యులు, పథ్యములు=హితములు, పెడచెవిన్+పెట్టె= శ్రద్ధతోవినక+విడచె, పెను=గొప్ప, విషయముల=ఇంద్రియభోగముల, తీపికిన్=ఇచ్చకు, తగుల్వడిన= చిక్కుకున్న, నిజ+ఇంద్రియంబుల=స్వంత+త్వక్కు చక్షువు శ్రోత్రము జిహ్వ ఘ్రాణము -5జ్ఞాన-వాక్కు పాణి పాదము పాయువు ఉపస్థము-5కర్మ మరియు మనస్సుతో కలిపి11 ఇంద్రియములు, మరల్పగ+ వచ్చునే=నివర్తించ+శక్యమా, ఎంతవారికిన్=గొప్పవారికైననూ,

చ. పరిమితభూషణంబు, పరిపాండురితాస్యము, మూడుగాళ్ళ మం
థరగమనంబు, స్విన్నమగు నంగము, సన్నపుటెల్గు, నిద్దురం
బొరయని కన్నునై, అఱుదెవుల్ కొనితెచ్చినభూరిహాని, భూ
వరునకు, గామయానసమవస్థకు, సన్నిభమాయె జూడగన్. **43**

పరిమిత=అతితక్కువ, భూషణంబు=ఆభరణములు, పరి+పాండురిత+ఆస్యము=బాగా+పెల్ల బారిన+ ముఖము, మంథర=మందమైన, స్విన్నమగు=చెమటతోకూడిన, అంగము=శరీరము, ఎల్గు=కంఠస్వరము, పొరయని=పొందని, అఱున్+తెవుల్=క్షయ+వ్యాధి, కొనితెచ్చిన=తీసుకొనివచ్చిన, భూరి=అధిక, కామయాన +సమ+అస్థకు=(అచేతనుడైన)విరహకామకుని+వంటి+అవస్థకు, సన్నిభము=సమానము,

తే. చరమకళనున్న శశితోడి చదలు వోలె/తెమలు చిఱుదీపశిఖతోడి ప్రమిదవోలె,
రాజయక్ష్మార్తుడైన, యా రాజుతోడి/రఘుకులము, నాడు శ్రీదరిద్రాణమయ్యె. **44**

చరమ+కళ=చివరి+కాంతి, శశి=చంద్రుడు, చదలు=ఆకాశము, తెమలు=తడసిన, రాజయక్ష+మార్తుడైన= క్షయరోగమనే+శత్రువుకలవాడైన, శ్రీ+దరిద్రాణమయ్యె=శుభము+లేనిదైనది,

ఉ. "సత్యము! రాచవారిపుడు సత్క్రతుదీక్షితులైరి పుత్రసం
తత్యుపలబ్ధికై, బహుదినంబులనుండియు, నమ్ము" డంచు భూ
పత్యఘశంకతో, నడుగవచ్చినలోకులకెల్ల దద్రుజా
స్థిత్యతిరేకమున్, మఱుగుసేతురు మంత్రులు, మాటిమాటికిన్. **45**

సత్+క్రతు+దీక్షితులైరి=మంచి+యజ్ఞపు+నిష్ఠలోఉండిరి, పుత్ర+సంతతి+ఉపలబ్ధికై=పుత్ర+సంతానము+ పొందుటకై, భూపతి+అఘ+శంకతో=రాజు+మరణ+సందేహముతో, దత్+రుజా+స్థితి+అతిరేకమున్= వాని+రోగ+పరిస్థితి+విషమించుట, మఱుగుసేతురు=దాచుదురు,

క. తలకడవరానిదయ్యెను/బలుగాలి ప్రదీపమునకు, బలె భూపతికిన్,

చలపాది అమ్మహారుజ/బలవద్వైద్య ప్రయత్నపరిభావినియై. **46**

తలకడవ=అతిక్రమించ, ప్రదీపము=పెద్దదీపము, చలపాది=మాత్సర్యశీల/మహామరి, ఆ+మహా+రుజ= ఆ+గొప్ప+రోగము, బలవత్+వైద్య=గొప్ప+వైద్య, పరిభావినియై=నిరాకరించినదై,

వ. రోగశాంతికరకర్మాపదేశమున, అమాత్యులు తమ ప్రభువునకు గృహోపవనముననె
పశ్చిమక్రతుక్రియావిశారదుడగు పురోధచే, నిగూఢప్రకారమున అగ్ని నిప్పించిరి. అనేక
వనితాసఖుడయ్యును, అనపత్యుడై అస్తమించిన అగ్నివర్ణుని పత్నులలో అప్పుడొకర్తుక
అంతర్వత్నియై యుండుట గ్రుడ్డిలో మెల్ల యని, మనఃప్రమోదము నొంది **47**

రోగ+శాంతికర+కర్మ+అపదేశమున=రోగము+శాంతింపచేయు+కర్మకాండలను+నెపమున, గృహ+ఉప వనము=ఇంటి+తోటలో, పశ్చిమ+క్రతు+క్రియా+విశారదుడగు+పురోధచే=మరణకాలమున+ఉద్దేశించిన +కర్మకాండలలో+నేర్పరియైన+పురోహితునిచే, నిగూఢ=అతిరహస్య, అనపత్యుడై=కొడుకులులేనివాడై, అంతర్వత్ని=గర్భిణి, ప్రమోదము=సంతోషము,

తే. ప్రకృతిముఖ్యుల అనుమతి బడసి తనకు/సచివు లర్పింప, గురువృద్ధసమ్మతముగ,
నృపుని సహధర్మచారిణి, దృష్టగర్భ/చిహ్నధారిణి, రఘుకుల శ్రీ వహించె. **48**

ప్రకృతిముఖ్యుల=ముఖ్యపౌరుల, పడసి=సంపాదించి, సచివులు=మంత్రులు, దృష్ట+గర్భచిహ్న+ధారిణి= కనబడుచున్న+గర్భలక్షణములు+కలదానిని, శ్రీ=రాజ్యలక్ష్మి, వహించె=పొందె,

చ. పెనిమిటిపోకకున్ వగపుపెల్లున నేడ్చిన అన్నరేశ్వరాం
గనకు, నిజోష్ణబాష్పముల గాలిన గర్భము, మంగళాభిషే
చనసమయంబునం దడిసి చల్లబడెన్, గురుసంభృతోరుకాం
చనకలశీముఖోజ్ఝితతుషారతీర్థహృతాంబుధారలన్. **49**

వగపు+పెల్లున=దుఖః+ఆధిక్యత, నరేశ్వరాంగన=రాణి, నిజ+ఉష్ణ+బాష్పములన్+కాలిన+గర్భము=తన+ వేడి+కన్నీటిచే+వేడెక్కిన+ఉదరభాగము, మంగళ+అభిషేచన+సమయంబునం=శుభ+పట్టాభిషేక + సమయమున, గురు+సంభృత+ఉరు+కాంచన+కలశీ+ముఖ+ఉజ్ఝిత+తుషార+తీర్థ+హృత+అంబుధారలన్ =గురువులు+సిద్ధముచేసిన+పెద్ద+బంగారు+కుంభముల+మూతినుండి+విడువబడిన+చల్లటి+తీర్థపునీటి నుండి+గ్రహించిన+నీటి+ధారలచే, చల్లబడెన్=వేడిపోయిచల్లగా అయినది.

మ. అనురోధంబున మంత్రు, లాప్తులును, తోడై కొల్వ, సాకేతకాం
చనసింహాసనమెక్కి, రాఘవుల రాజ్యం బేలె, అంతర్నిగూ

ఢనభోబీజము ధాత్రియుం బలె, వరిష్ఠం బైన గర్భంబు దా

ల్చిన యారాజ్ఞి ప్రసూతి గోరు ప్రజకున్ శ్రీనిర్వికల్పంబుగన్. **50**

అనురోధంబున=అనుసరించి, కాంచన=బంగారు, అంతర్+నిగూఢ+నభో+బీజము+ధాత్రియుం+బలె= తనలో+దాగిఉన్న+శ్రావణమాసమున+నాటినవిత్తనముకల+భూమి+వలె, వరిష్ఠంబు=శ్రేష్ఠమైన, ప్రసూతిన్ +కోరు+ప్రజకున్+శ్రీ+నిర్వికల్పంబుగన్=మంచికుమారుని+కోరుచు+ప్రజలకై+రాజ్యసంపద+ అఖండముగా ఉండుటకై

సూచన: రఘువంశములో పూర్వము అశితుడు అనే రాజు మరణించిన తరువాత పుట్టిన సగరుడనే రాజు రాజ్యమేలెను. అతని తరువాత ఇరవైవ రాజు రాముడు.

..........స్వస్తి............

శ్రీ. ఆలమూరు వెంకటాచలము గారి ఇతర రచనలు.

శ్రీ భగవత్ గీత ---- పద్య కావ్యము. 1983 ప్రచురణ

త్వరలో e book గా లభ్యము చేయబడును

ప్రచురణ కానివి.

1 కఠోపనిషత్తు 2. కేనోపనిషత్తు. 3 ఈశావాస్యోపనిషత్తు. సరళ భాషలో వివరణ

త్వరలో e book గా లభ్యము చేయబడును



మా తండ్రిగారు: శ్రీ ఆలమూరు వెంకటాచలము గారు, తల్లిగారు: శ్రీ,మతి.జోగులమ్మ

| | | |
|---|---|---|
| తండ్రి: | శ్రీ. ఆలమూరు వెంకట రమణ మూర్తి | (1875 1969) |
| తల్లి': | శ్రీ,మతి. ఆలమూరు సీతా దేవి | (1885-1929) |
| గ్రంథకర్త | శ్రీ. ఆలమూరు వెంకటాచలము | (1907-1992) |
| భార్య: | శ్రీ,మతి.ఆలమూరు జోగులమ్మ | (1917-1982) |